# దివ్యజ్యోతి

## దేవాలయముల వీక్షణం - ప్రత్యక్షదర్శిని

రచన &
సేకరణ, సంకలన, సమర్పణ

**పోతిరెడ్డి సూర్యనారాయణ** *M.A., M.Com.*

**SEE INDIA - KNOW INDIA**

# Divya Jyothi - Dictionary of Temples
By P. Soorya Narayana

First Edition
1997

Price : Rs. 250-00

Composed on DTP by
**'Aksharamala'**
**Vijayawada-2.**

Cover Designed by ·
**'Ramana'**
**Vijayawada-2.**

Printed at
**'Kamakshi Offset Works'**
**Vijayawada-2.**

Binding :
**'Vinayak Binding Works'**
**Prop : D. Lakshmana Rao**
**Vijayawada -2**

Copies can be had from
**P. Soorya Narayana**
**Kusuma Nivas, Gogavari St.,**
**Arundel pet, Vijayawada-2 Ph: 432733**

**Sri Rama Book Depot**
**29-30-14, Tobacco Baron St.,**
**Surayarao pet, Vijayawada-2.**

## *With The Best Compliments From :*

Tel 24223
22717

1 **Pothireddi Lakshmi Narasimha Prasada Rao**, B Sc
**Pothireddi Durga MahaLakshmi,** B Com
LAKSHMI FINANCE CORPORATION,
Kusuma Nivas, **Palakol -534260**

2 **Pothireddi Surya Prakash Rao** 63488
**Pothireddi Ammaji**
Kusuma Nivas -I, Patcha Meda Veedhi
Krishna Lanka, **Vijayawada - 520013**

3 **Pothireddi Vijaya Prabhakara Rao,** L.E.E.,
**Pothireddi Bharatha Lakshmi**
Kusuma Nivas - II, Patcha Meda Veedhi
Krishna Lanka, **Vijayawada -520013**

4 **Bondada Venkata Ramana Rao**
**Bondada Syamala**
Sri Durga Apartments, Flat No 12, 2nd floor,
Tikkal Road - **Vijayawada -10**

5 **Dandupati Ravi Kumar** Shop 20075
**Dandupati Suseela** Res 24496
30-B, Ashok Nagar
**Eluru**

6 **Dr. Chittapu Pardha Saradhi Rao**, M D , D G O ,
**Chittapu Sarala** 00960 - 320828
Unv, Gynaecologist, Burugu Magu,
Rahdhebai Higun,
Male **Republic of Maldives**

---

**SEE INDIA - KNOW INDIA**

## *With The Best Compliments From :*

**Devisetti Narayana Rao**, D Com . B Com , Res , 473336
Income tax Practitioner & auditor
Congress Office Road **Vijayawada -2**

---

Phs Off 61094
**Devisetti Venkata Chandra Sekhar,** B Com , B L Res 470347
Tax Consultant
Congress Office Road, **Vijayawada -2**

---

Phs Off 61094
**Devisetti Venkata Durga Prasad,** B Com, B L , Res 472226
Tax Advocate
Congress Office Road, **Vijayawada-2**

---

Phs Offi 64855
**Devisetti Venkata Ravindranath**, B Tech Res 473336
Prop · M/s **Siva Sistams**
Congress Office Road, **Vijayawada -2**

---

Phs Hos . 431225
**Dr. Devisetti Venkata Siva Kumar,** M D , F A G E Res . 473336
472782

Physician
Door No 29-7-46/1
Kaleswara Rao Road, Suryaraopet
(Beside Raman Academy Residential College)
**Vijayawada -2**

---

Dr. **Attili Trimurthi Rao** , M S , Ph 435558
Trimurthi Nursing Hoe
Dornakal Road, Suryarao Pet,
**Vijayawada -2**

---

**SEE INDIA - KNOW INDIA**

# దివ్యజ్యోతి

## దివ్య పరిమళ శుభాకాంక్షలతో

**TO**

చిరంజీవి / శ్రీ

**From**

---

1 కుటుంబ సభ్యులతో సులువుగా, పిక్‌నిక్‌లా వెళ్ళి, ప్రకృతి రామణీయకమైన ప్రత్యేక స్థలములలో వెలసిన ఆలయములను అతి సులువుగా, అతి తక్కువ రోజుల్లో చూచు వుత్సాహము గల యువతీ యువకులకు - విజ్ఞాన ప్రదాయిని

2 సరదాగా  కాలక్షేపానికి మాత్రమే గాకుండా, దేశములోని ప్రముఖ దేవుళ్ళ వునికి, ప్రత్యేకతలతో సహా తెలుసుకొని, హాయిగా పఠించి పదిమందికి చెప్పడాన్కి పెద్దలకు-ఆనంద ప్రదాయిని

3 పవిత్ర భారతదేశ ఔన్నత్యాన్ని అర్ధము చేసుకొని, ఆధ్యాత్మిక సంపదను స్వామివార్ల, అమ్మవార్ల పేర్లతో సహా తెలుసుకొనడాన్కి ఆమూలాగ్రము చదువవలసినది చదివి తరించడానికి - మోక్ష ప్రదాయిని

సర్వే జనాస్సు ఖినోభవంతు

---

**See India - Know India**

---

# అంకితము



తాను ముందుగా దర్శించి వచ్చి, మాతో వచ్చి మరికొన్ని దర్శించి మా ఆరుగురు పసిబిడ్డలను కడుపు క్రింద దాచుకొని కాపాడుతూ, మమ్మల్ని యావద్దేశ దర్శనాన్కి (ఖర్చుకు ఖాతరు చేయక) మనస్ఫూర్తిగా ప్రోత్సహించి ఈ మధ్యనే 90వ యేట భువి నుండి దివికేగిన ధన్యజీవి, అమృత హృదయిని అయిన నా మాతృమూర్తి పాద పద్మాలకు-

**-పోతిరెడ్డి సూర్యనారాయణ**

# వినయపూర్వక నివేదన

ఎవరో మహానుభావుడన్నాడు "తలచేది జరగదు. జరిగేది తెలియదు" అని. ఆహా! ఎంతటి గొప్ప సత్యాన్ని ఎంత చిన్న మాటల్లో చెప్పాడు! ఆ మహానుభావునికి హృదయపూర్వక ధన్యవాదాలు. వారు చెప్పిన దానిని బట్టి ఏదో ఒక శక్తి మానవాతీతముగా నున్నదని అర్థమౌతుంది. ఈ మాటలు నాపట్ల సత్యమని నిరూపించాయి. కార్మిక, కర్షక కుటుంబములో నిరక్షరాస్యుల గర్భాన జనించిన నాకు ఏడవ తరగతి చదువుచుండగనే తండ్రి గతించడం జరిగినది. చదువుకుంటూనే జీతానికి షాపులో పార్టుటైమ్ కుర్రవాడుగా జేరినాను. క్లాసుకు ఫస్టు మార్కులు రావడముతో మున్సిపల్ హైస్కూల్‌లో స్కాలర్‌షిప్పులతో చదువుసాగింది. దేశానికి స్వాతంత్ర్యము రాకముందు రోజులలో విద్యార్థిని. ఎట్టి పరిస్థితులలోను గవర్నమెంటు నౌకరీ చేయకూడదని భీష్మించుకున్న వాళ్ళలో ఒకడిని. అటువంటి వాడిని కేంద్ర ప్రభుత్వ ఇన్‌కంటాక్సు ఆఫీసులో జేరాను. ఉద్యోగములో జేరిన తరువాత చుట్టు ప్రక్కలనున్న ముఖ్యమైన స్థలాలను కొత్తగా కాపురానికి వచ్చిన భార్యను తీసుకుని ఖాళీ సమయాలలో చూచి వస్తూండేవాడిని. మా అమ్మగారు, భార్య, నేను - ఇదీ మా చిన్న కుటుంబం. మా నాన్నగారికి నేనొక్కడినే, మా తాతగారికి మా నాన్నగారొక్కరే, మా ముత్తాత గారికి మా తాతగారొక్కరే. ఈ విధంగా మా వంశ వృక్షం ఒక్కొక్క మగబిడ్డతోనే కొన్ని తరాలు గడచిపోయింది. అందరూ నిరక్షరాస్యులే. అందరూ కార్మిక, కర్షకులే. నా దగ్గరి నుండి పరిస్థితి మారింది. టైపు రైటింగ్, షార్టు హ్యాండ్‌లు పాస్ అయినాను. ఎమ్.ఎ., ఎం.కాం., పాస్ అయినాను. బి.ఎల్. ఈవినింగ్ కాలేజీలో 3 సంవత్సరాలు చదివి మొదటి 2 సం॥ల పరీక్షలు వ్రాసినాను. ఈలోగా ట్రాన్సుర్ అయినందున "లా"డిగ్రీని అసంపూర్తిగా విడిచిపెట్టవలసి వచ్చినది. సంతానము ముగ్గురబ్బాయిలు, ముగ్గురమ్మాయిలు. అందరూ చల్లగా ఆరోగ్యముతో చక్కటి సంతతితో వర్ధిల్లుచున్నారు. గవర్నమెంట్ ఉద్యోగములో చేరిన తరువాత "ఇది బ్రిటీషు గవర్నమెంట్ కాదు" అని సరిపెట్టుకున్నాను. ఇన్‌కంటాక్సు ఆఫీసరు (గెజిటెడ్ హోదా) చేసి రిటైర్ అయినాను. ఉద్యోగములో నుండగా సెలవులు దొరికినప్పుడు, అవకాశం లభించినప్పుడు సతీ సమేతముగా దేశాటన అలవాటైపోయింది. మొదటి 20 సంవత్సరముల ఉద్యోగం అయిన తరువాత ఒక మహానుభావునితో మాటల సందర్భముగా నేను చూచిన ప్రముఖ స్థలాలతోబాటు, పుణ్యక్షేత్రాల ప్రస్తావన వచ్చినది. "ద్వాదశ జ్యోతిర్లింగములలో 7 చూచినారు. మిగిలిన 5 పూర్తి చేయండి. అష్టాదశ పీఠాలలో 8 చూచారు. మిగిలిన 10

చూసేయండి". ఇదీ వారి సలహా. ఇక మిగిలిన కాలాన్ని (రిటైర్ అయిన తరువాత కూడా) అసంపూర్తిగా మిగిలిన క్షేత్రాల దర్శనానికి వినియోగించాను. ఒక చిన్న విషయం! ప్రతీసారి యాత్రకు బయలుదేరేముందు ఏదో ఒక పెద్ద అవాంతరం వచ్చి పడేది. పిల్లలు గల పెద్ద కుటుంబం. వివాహాలు, పురుళ్ళు, ఆపరేషన్లు, అనారోగ్యాలు, వియ్యపురాళ్ళ, వియ్యంకుళ్ళ కోరికలు మొదలైన వెన్నో ఆటంకాలు. ఆఫీసులో కూడా అనుకోని ఆటంకాలు. ప్రతీ ప్రయాణానికి ఒక పెద్ద అడ్డుగోడ నిలిచేది. వాటన్నింటిని అగ్ని పరీక్షలుగా భావించి ఆగకుండా, భగవంతునిపై భారం వేసి ముందుకు సాగేవాడను. ఈ విధముగా సాహసించి అన్ని ప్రముఖ స్థలాలు సతీ సమేతముగా, కొన్ని మాతృమూర్తితో సహా దర్శించాను. క్షేత్రములలో నున్న పుణ్యాజలాలలో సతీ సమేతముగా స్నానమాచరించి, పూజలు చేసి, ప్రసాదము స్వీకరించి, ఒక రాత్రి నిద్రచేసేవాడిని. ఇది మా తల్లిగారి ఆజ్ఞ. రాను రాను మా తీర్థయాత్ర ఎంత తీవ్రస్థాయికి చేరినదంటే ఎక్స్‌ప్రెస్ రైళ్ళలో, బస్సులలో, టాక్సీలలోనే కాకుండా విమానములలో కూడా ప్రయాణం సాగించి సకాలమునకు ఆఫీసుకు చేరుకునేవాడిని. 36 సంవత్సరముల ఉద్యోగము చేసినాను. ఇంకా చూడవలసిన దివ్య స్థలాలు కోకొల్లలు. ఉద్యోగము ప్రతిబంధకమైపోయినది. ఆశ్చర్యము కలిగించులాగున ఉద్యోగములో వాలంటరీ రిటైర్‌మెంట్ తీసుకున్నాను. సంపాదనంతా సర్వ క్షేత్ర దర్శనార్థం వెచ్చించినాను.

దర్శించిన క్షేత్రాల వివరాలు చెప్పమని చాలమంది అడగడం ప్రారంభించారు. చిన్న చిన్న సమావేశాలలో వివరాలు చెప్పడం ప్రారంభించి పెద్ద పెద్ద సమావేశాలలో పూర్తి వివరణలతో ఉపన్యాస ధోరణిలో చెప్పడం అలవాటైపోయింది. నేను పురాణాలు చదువలేదు, నాకు పురాణాల లోతుపాతులు తెలియవు. సామాన్య మానవునిగా సంసార జీవితం గడుపుతున్న నాకు విగ్రహాలలో, ఆలయాలలో కనిపించిన ప్రత్యేకతలను (Specialities) చెబుతూండేవాడిని. రోటరీ క్లబ్బులలో, లయన్సు క్లబ్‌లలో, దివ్య క్షేత్రాలలో, ఆలయాలలో, సమావేశాలలో, కొన్ని సంఘాల ఆఫీసులలో ఒక్క ఊరిలో కాకుండా ఏఊరు వారు పిలచినా స్వంత ఖర్చులతో వెళ్ళి, ప్రతిఫలాపేక్ష లేకుండా అక్కడివారు కోరుకున్న వాటి వివరణలు చెబ్తూ వస్తున్నాను. ఒకసారి విన్నవారు మరల మరల రావించి ఇతర వివరణలు కూడా చెప్పించుకుంటున్నారు. తీర్థయాత్రలకు వెళ్ళువారు, వాటి గురించి తెలుసుకొనగోరువారు నన్ను అడగడం, ఉత్తరాలు వ్రాయడం, ఫోనులు చేయడం ప్రారంభించారు. వారందరికీ ఓర్పుగా వివరాలు అందించసాగాను. ఇదంతా మానవ సేవగా భావించి తృప్తిపడసాగాను. నేను చెప్పే ప్రత్యేకతలు, ఉనికి, వివరణలు పుస్తక రూపములో వెలువరించమని కోరసాగారు. నేను చెప్పేది ప్రాక్టికల్ సబ్జెక్టు. ఉదాహరణకు ద్వాదశ జ్యోతిర్లింగ దర్శనము పూర్తికావాలంటే 15 పుణ్యక్షేత్రాలలో వెలసిన 17 దివ్య లింగాలను దర్శిస్తే తప్ప పూర్తికాదు. (ద్వాదశ

జ్యోతిర్లింగములు 12 మాత్రమే). స్త్రీ రూప వినాయకుడు, బాల ఆంజనేయుడు, సీత లేని రాముడు, బోనులో బంధింపబడి ఉన్న అమ్మవారు, పైన నెయ్యి ఉంచితే వెన్నగా మార్చు శివలింగము మొదలైన ప్రత్యేకతలు గల దివ్యక్షేత్రాలు. ఈ విధముగా విగ్రహాలలో, దేవాలయములలో ఎన్నో ప్రత్యేకతలు కనిపిస్తున్నాయి. వాటిలో గమనించిన వాటిని తెలియచేయాలనే కోరిక కలిగింది. అటువంటి ప్రత్యేకతలు సుమారు 2,000 ఉన్నాయి. వీటితోబాటు దర్శనానికి వీలైన దివ్యక్షేత్రాల ఉనికిని తెలియజేయాలని తాపత్రయం కలిగింది. చాల మంది పెద్దలను ఆశ్రయించినాను. సహృదయంతో అందరూ అందించిన వివరాలను ఈ పుస్తకములో పొందుపరచినాను. నేను చెప్పినవన్నీ కరెక్టు అని అనలేను. నా పుస్తకము సంపూర్ణము కాదు. యావద్భారత దేశములో 32 లక్షలకు పైగా దేవాలయములున్నట్లు ఒక అంచనా ఇవన్నీ దర్శించుట సాధ్యమా? ఒక్క ఆంధ్రదేశములోనే 34 వేలకు పైగా ఆలయాలున్నట్లు మరొక అంచనా సతీ సమేతముగా దర్శించుటకు నా 45 సంవత్సరాల Active life చాలలేదు. లక్షలాది రూపాయలు వెచ్చించాను. జీవితములోని అమూల్యమైన కాలాన్ని (యుక్త వయస్సుని), శక్తిని వినియోగించినా అన్నీ దర్శించామనే తృప్తి కలిగే అవకాశము లేదు లోతుకు పోయిన కొలది, వెదుకుతున్న కొలది ఇంకా కన్పిస్తునే ఉన్నాయి. వివరాలు సేకరిస్తున్న కొలది అనుమానాలు పెరుగుతున్నాయి ఈ దేవాలయ సబ్జెక్టు అనంతం. ఈ విజ్ఞానము అమోఘము. విగ్రహాలను దేవాలయములను సందర్శించిన వారికి నాకు కనిపించిన ప్రత్యేకతలే గాకుండా వారి వారి మేధాశక్తికి తగినట్లుగా మరికొన్ని ప్రత్యేకతలు కన్పించవచ్చును. దేవాలయములను, పుణ్యక్షేత్రాలను విశదీకరించి, విపులీకరించి, సంసారము చేసుకునే సామాన్య మానవుడికి అత్యంత సన్నిహితముగా నిజ నిర్ధారణ చేసి దగ్గరకు తీసుకుని వచ్చేవారు ముందుకు రావాలి. విమర్శించేవారు తగ్గి వివరణలు అందించేవారు ముందుకు వస్తే నేటి ప్రజ ధన్యమౌతుంది.

ఎక్కడో ప్రారంభమైన నా జీవితం ఈ విధముగా విగ్రహాల, ఆలయాల-ప్రత్యేకతలతో బాటు ఇతర వివరములందించడం ద్వారా పరిసమాప్తి అయితే చంద్రునికో నూలుపోగులా "మానవ సేవయే మాధవ సేవ"గా తృప్తిపడతాను అందుకే ఈ తాపత్రయం. ఈ సమర్పణ. దీనికి తగిన సమాచారం అందించి తోడ్పడిన మహానుభావులందరికీ మరొక్కసారి కృతజ్ఞతాభి వందనములు. శాస్త్ర విజ్ఞానము, పాండిత్యము లేకుండా చేసిన నా సమర్పణలో దొర్లిన పొరపాట్లకు క్షమించ ప్రార్థన.

విజయవాడ — సూర్య నారాయణ

1- 1- 1997

# విషయసూచిక

## పార్ట్ - I

# పార్ట్ - II

## పార్ట్ - III



**మహాశక్తి పీఠములు - 51 (బంగ్లాదేశ్‌లో నున్నవి)**

1. ముక్కు భాగం : షికార్‌పూర్. 20కి మీ భారీసాల్. సునందానదీ తీరం. వుగ్రతార.
2. ఎడమప్రక్క వీపుభాగం · భవానీపూర్, 32కి మీ. బొగడా R.S. కరత్రాయ నదీతీరం అపర్ణాదేవి
3. కుడిబాహువు సీతకుండు R.S. చటగావ్ జిల్లా చంద్రశేఖర పర్వతముపై 'భవానీదేవి'
4. అరచేయి : ఈశ్వరీపూర్. ఖోల్నజిల్లా ఈశ్వరీదేవి



యావద్భారత దేశ దివ్య దేవాలయ సందర్శకులు
పోతిరెడ్డి సూర్యనారాయణ, కుసుమాంబ దంపతులు

# త్రిలింగములు

ఇవి మూడు. ఈ మూడును ఆంధ్ర దేశమున గలవు. ఈ మూడు లింగముల మధ్యగల ప్రాంతమును త్రిలింగ దేశమనియు, ఇచ్చట నివసించు ప్రజలు త్రిలింగులనియు ప్రసిద్ధినొందిరి. కాలక్రమేణా త్రిలింగులను తెలుగువారుగా, వారు మాట్లాడు భాష తెలుగు భాషగా ప్రసిద్ధినొందియున్నది. ఈ మూడు లింగములు 1) శ్రీశైలము. 2) కాళేశ్వరము 3) ద్రాక్షరామము నందు గలవు.

## శ్రీశైలము

త్రిలింగ దేశమైన ఆంధ్రదేశములోని త్రిలింగములలో నొకటి శ్రీశైలము. ప్రసిద్ధ శైవ పుణ్యక్షేత్రము. అతి పురాతనమైనది. వేదాలలో, పురాణాలలో, చరిత్రలో, వ్యావహారిక గాథలలో ప్రశస్తి కలిగినది. పంచ మహా శివక్షేత్రములలో నొకటి. "దక్షిణ కైలాస" మనియు, "దక్షిణ కాశి" అనియు వ్యవహరింతురు. భూలోక కైలాసముగాను, అపర కైలాసముగాను భావింతురు.

కర్నూలు జిల్లాలో, నందికొట్కూరు తాలూకాలో, నల్లమల కొండలలోని సమతల ప్రదేశమున గలదు. మాచెర్ల వరకు రైల్వేలైను గలదు. డోర్నాల నుండి ఘాట్ రోడ్డు **51 Km.** A.P S R.T C బస్సులతో బాటు శ్రీశైల దేవస్థానం బస్సులు కూడ దూరప్రాంతములలో వారికి ఏర్పాటు చేసినారు. నాలుగు ప్రవేశద్వారములు (గాలి గోపురములు), నాలుగు ఉప ప్రవేశ ద్వారములు గల పెద్ద దేవాలయము.

శ్రీశైలములో శిఖర దర్శనమే సమస్త పాపహరణము. "శ్రీశైల శిఖరం దృష్ట్వా పునర్జన్మ నవిద్యతే" అనే ఆర్యోక్తి కలదు. దగ్గరలో కొండ మీద నున్న రాతి నందీశ్వరుని విగ్రహము కింద నవ ధాన్యములు వేసి రుబ్బుతూ శ్రీశైల శిఖరాన్ని దర్శించి భక్తులు తరింతురు. ఉండడానికి చక్కని కాటేజీలు కలవు భోజనానికి, స్నానానికి ఇబ్బంది లేదు. ఎంతోమంది పుణ్యాత్ములు, భక్తులు ఎన్నో రకముల ధర్మసత్రములను నిర్మించి వసతికి, భోజనానికి చక్కని ఏర్పాట్లు గావించినారు.

శ్రీశైల మల్లికార్జున లింగము ద్వాదశ జ్యోతిర్లింగములలో నొకటి. అమ్మవారు శ్రీ భ్రమరాంబ. ప్రక్కగా పార్వతీదేవి ఆలయము కూడా కలదు. శ్రీ భ్రమరాంబ అష్టాదశ పీఠములలో నొకటి సతీదేవి మెడ భాగము పడిన ప్రదేశము. సహస్ర లింగములు, వృద్ధ మల్లికార్జున లింగము కలవు. ద్రౌపదితో సహా పాండవులందరు ఒక్కొక్క లింగమును

ప్రతిష్ఠించిన ప్రత్యేక లింగములున్నవి. శ్రీశైల మల్లికార్జున లింగము చాలా చిన్నది. ఇచ్చటకు కొద్ది దూరములో పాతాళగంగ అను పేరున కృష్ణానది కలదు. ఇచ్చట కృష్ణానది ఉత్తరవాహిని నదీ స్నానము అందుబాటులో లేకపోవుటచే ధూళి దర్శనము వుండెడిది. పూర్వ కాలము భక్తులు కాలి నడకననే చాల దూరము నడిచివచ్చి స్నానము చేయకనే స్వామివారిని దర్శించు ఆచారమున్నది

కృతయుగములో హిరణ్య కశిపుడు, త్రేతాయుగములో శ్రీరామచంద్రుడు, ద్వాపర యుగమున పంచ పాండవులు ప్రార్థించి నందువలన ఈ పుణ్యక్షేత్ర ప్రాచీనత అర్థమగుచున్నది.

సప్తమాతృకల మూర్తులు గలవు. 1) బ్రహ్మి 2) మహేశ్వరి 3) కౌమారి 4) వైష్ణవి 5) వారాహి 6) ఇంద్రాణి 7) చాముండి. దగ్గరలో హటకేశ్వరాలయము కలదు. పాలధార, పంచదార లను పేరుగల రెండు మంచినీటి ధారలు కొంచెము క్రింది భాగమున గలవు. ఇచ్చటనే శ్రీ ఆది శంకరాచార్యులు వారు తపమాచరించి అమ్మవారి అనుగ్రహము నొంది అమ్మవారిపై "కనకధారా స్తోత్రము" రచించిరి.

స్వామివారికి ఒకే సంవత్సరములో రెండు కళ్యాణ ఉత్సవములు జరుగును. శివరాత్రికి భ్రమరాంబతోనూ, సంక్రాంతికి పార్వతీదేవితోను. దేశములోని శైవక్షేత్రములలో రెండు కళ్యాణములు జరుగుట ఇచ్చటి ప్రత్యేకత. ఈ ఆలయమునకు వెళ్ళు త్రోవలో సాక్షి గణపతి దేవాలయము గలదు.

మహారాష్ట్ర చక్రవర్తి శివాజీ ఇక్కడ ప్రార్థనలు జరిపి అనేక ఆభరణములు కానుకగా ఇచ్చినట్లు ఆధారములున్నవి. ఆలయమునకు ఉన్న నాలుగు ప్రధాన ద్వారములలో ఒకటి శివాజీ నిర్మించిరని ఆ ద్వారమునకు శివాజీ ద్వారమని పేరుగలదు శ్రీకృష్ణ దేవరాయలు తన ఇరువురి దేవేరులతో ఈ క్షేత్రాన్ని దర్శించి ఆభరణములు, వాహనములు కానుకలుగా ఇచ్చిరి. మండపము కూడా కట్టించిరి. ఈ విధముగా ఎందరో భక్తులు ఎన్నో దానములు చేసినట్లు తార్కాణములున్నవి. అయినను భక్తులిచ్చు కానుకల పైననే ఆధారపడే స్వామివారిని ఆది భిక్షువందురు.

శ్రీశైల క్షేత్రమున మల్లికార్జున జ్యోతిర్లింగమును పూజించిన వారికి అశ్వమేధ యాగఫలము కలుగునని మహాభారత ఉవాచ ద్వాదశ జ్యోతిర్లింగముల ఉనికిని చూపు పటమును, అష్టాదశ పీఠములున్న ప్రదేశముల వివరములను దేవాలయము నందు వ్రాసి ఉంచిరి.

**మంగళ పాగా :** మహా శివరాత్రి నాటి అర్ధరాత్రి లింగోద్భవ సమయమున 360 మూరల పొడవు గల తెల్లని గుడ్డను ఆలయము పైన ఉన్న శిఖర కలశముల చుట్టూ దిగంబరుడైన పూజారి కట్టును. ఎవరికిని కనిపించడు. ఈ పవిత్ర వస్త్రాన్ని రోజు కొక మూర చొప్పున నేయుదురు

శ్రీశైలము పూజా మందిరముగాను, 160 Km. దూరములో నున్న అహోబిళము సభా మండపము గాను భావించెదరు.

అమ్మవారు కన్నడ రాజకుమారి. శివుడు కలలో కనబడి తుమ్మెద (భ్రమరము) వాలిన చోటనే వేచి ఉండమని ఆదేశించిరట. తుమ్మెద పోయి పోయి మల్లెపొదపై వ్రాలినది. పొద క్రింద తపస్సు చేస్తున్న స్వామివారిని దర్శించి వారి అనుగ్రహమును సంపాదించి వివాహము చేసికొనుట జరిగినది. భ్రమరము దారి చూపించినందు వలన అమ్మవారు భ్రమరాంబగా, మల్లెపొద క్రింద తపస్సు చేసిన స్వామిగాన మల్లికార్జున స్వామిగా పిలువబడుచున్నారు.

పూర్వ కాలములో ఈ క్షేత్రములో రకరకాల మూలికలు ఔషధములకు లభించెడివట

ఆలయమునకు ఉన్న నాలుగు రాజ గోపురములు నలుగురు రాజులు నిర్మించినారు. తూర్పు గోపురమును శ్రీకృష్ణ దేవరాయలు, దక్షిణ గోపురమును హరిహర రాయలు, ఉత్తర గోపురమును ఛత్రపతి శివాజీ, బ్రహ్మానంద రాయలు పశ్చిమ గోపురమును నిర్మించిరి. ఈ నాలుగు గోపురములకు త్రిపురాంతకము, సిద్ధవటము, ఉమా మహేశ్వరము, అలంపురమని పేర్లు.

ఆది శంకరాచార్యులు, ఆచార్య నాగార్జున సందర్శించిన పుణ్య క్షేత్రము. ఆలయ ప్రాంగణమున జువ్వి, మేడి, రావి చెట్టు పెనవేసుకుని ఒకే వృక్షముగా పెరిగిన దివ్య వృక్షము పురాతన కాలమునుండి కలదు.

అతి ప్రాచీనమైన ఈ క్షేత్రము గురించి ఎన్నియో పురాణ గాధలు గలవు. ఇంతటి దివ్య క్షేత్రము ఆంధ్రదేశమునందు ఉండుట ఆంధ్రుల అదృష్టము.

భ్రమరాంబా దేవిని మల్లిక అనియు స్వామివారిని అర్జునుడనియు, మల్లికార్జునుడనియు పిలుతురు. పూజారి లేకుండా స్వామివారిని పూజించు ఆచారము కలదు. ఇచ్చట ప్రధాన ఆలయానికి 8 మూలలా అష్టభైరవుల విగ్రహములున్నవి ఈ క్షేత్రములో పూర్వము యోగులు, సిద్ధులు బంగారము తయారుచేసేవారట. స్వామివారికి "లింగచక్రవర్తి" అని బిరుదు కలదు.

# ద్రాక్షారామము

త్రిలింగదేశమని పేరు రావడానికి హేతువైన క్షేత్ర త్రయములో రెండవది.

తూర్పు గోదావరి జిల్లాలో కాకినాడకు 32 కి మీ. దూరములోను, రాజమండ్రికి 60 కి.మీ.దూరములోను కలదు. దక్షప్రజాపతి యజ్ఞముగావించుటచే ద్రాక్షారామమని పేరుకలిగినది.

లింగరూపములో నున్న స్వామివారి పేరు భీమేశ్వరుడు. అమృత మధన సమయమున ఉద్భవించిన హాలాహలమును భీమ రూపముతో మ్రింగుటచే భీమేశ్వరుడని పేరు వచ్చినది. ఇది స్ఫటిక లింగము. చాలా ఎత్తైనది మూల పీఠము నుండి ఎనిమిది అడుగుల పొడవుండును దక్ష ప్రజాపతిచే ప్రతిష్ఠించబడినది ఈ పుణ్యక్షేత్రమున సతీదేవి దేహమును చాలించినది. అమ్మవారి పేరు మాణిక్యాంబ ఇచ్చట అమ్మవారి "కణితి" భాగము పడినది. అష్టాదశ పీఠములలో నొకటి భీమేశ్వర లింగము పంచారామములలో నొకటి. సప్తఋషులు 1. కాశ్యప 2. అత్రి 3. గౌతమ 4. భరద్వాజ 5. విశ్వామిత్ర 6. జమదగ్ని 7. వశిష్ఠుడు - వీరు ఇచ్చట ఈశ్వరుని పూజించిరని, సప్త గోదావరుల నీరు ఈ దేవాలయము ప్రక్కన అంతర్వాహినిగా ప్రవహించుచున్నదని పురాణ గాధ. ఈ క్షేత్రమును "దక్షిణ కాశి' యని పిలుతురు. అమ్మవారు వేశ్యల కులదేవత యని పూర్వకాలమున ప్రతీతి.

లింగము చాల ఎత్తైనది. దేవాలయము యొక్క రెండవ అంతస్తు నుండి అభిషేకములు, పూజలు జరుగును. శివుడు కిరాత వేషములో అర్జునునితో పోరు సల్పినపుడు శిరస్సున తగిలిన గాయముల వలన లింగము పై భాగమున రక్తధారలు ఏర్పడినవట. లింగము పెరుగుచుండుటచే నాపుటకు లింగముపై మేకు కొట్టినందువలన ఏర్పడిన చారలని కొందరు చెప్పుదురు.

ద్రాక్షారామ భీమేశ్వరుని అనుగ్రహము వలన వేములవాడ భీమకవి రండా పుత్రుడుగ పేరొందినను వాక్శుద్ధి గలవాడయ్యెను.

ఈ దేవాలయమును దేవతలు నిర్మించినారని, తెల్లవారుటచే ప్రహరీ గోడలోని ఒకమూల పూర్తికాకుండ నిలిచి పోయినదని చెప్పుదురు. ఈ అసంపూర్ణ భాగమును ఎన్నిసార్లు కట్టినను పడిపోవుచున్నదట. గుడి సూర్యరశ్మిచే నిర్మించబడినదని పురాణము. వ్యాసునికి గర్వభంగము గావించి కాశీ క్షేత్రము నుండి ఈ క్షేత్రమునకు శివ పార్వతులు వ్యాసుని శిష్యులతో సహా పంపించిరి.

ద్రాక్షారామము భోగానికి, మోక్షానికి, వైభవానికి, పావనానికి ప్రసిద్ధిగల పుణ్యక్షేత్రము.

# కాళేశ్వరము

త్రిలింగ దేశముగా పేరుగాంచిన ప్రాంతమున నున్న మూడవ లింగము

ఈ క్షేత్రమును కూడ "దక్షిణ కాశి" అని పిలుతురు. కరీంనగర్ జిల్లా వేములవాడ నుండి, కరీంనగర్ నుండి బస్సులు కలవు మహదేవ పురమునకు 20కి.మీ. దూరమున కలదు గోదావరి, ప్రణీతా నదుల సంగమ స్థానము

కాళేశ్వరుడు, ముక్తేశ్వరుడు అని పిలువబడు రెండు శివలింగములు ఒకే పానమట్టముపై నున్నవి ఇది యావద్భారత దేశములో ప్రత్యేకత మొదట కాళేశ్వరుని తరువాత ముక్తేశ్వరుని పూజించుట ఆచారము కాళేశ్వరుడు యమధర్మరాజ ప్రతిష్ఠ. శ్రీ

సదా పూర్ణ అమ్మవారు శ్రీకాళేశ్వరుని భార్యగాను, శ్రీ అన్నపూర్ణ అమ్మవారు శ్రీ ముక్తేశ్వరుని భార్యగాను వేంచేసి యున్న దివ్య క్షేత్రము.

పంచనదుల సంగమ స్థానమని గూడ గమనించదగును. వరద, వైన్యా, ప్రణీత, గోదావరి, సరస్వతీ నదుల సంగమము. ముక్తేశ్వర లింగమునకు పై భాగమున రెండు రంధ్రములు కలవు ఆ రెండు రంధ్రములలో ఎంత అభిషేక జలము పోసినను పానమట్టము నుండి బయటకు రాదు. లింగము అడుగు భాగము నుండి అభిషేక జలము దగ్గరలో నున్న గోదావరి నదిలో కలియును.

సిమెంట్‌తో చేయబడిన 2 1/2 గజముల పొడవు, 1/2 గజము వెడల్పు గల పెద్ద చేపకలదు. దీనిని మత్స్యావతార మందురు. దీనిని తాకిన అంతఃకరణ మాలిన్యము నశించి, సుజ్ఞానము ప్రకాశించి, మోక్షము ప్రాప్తించును స్వప్నదోషములు నశించును. ఉదర రోగములు నశించి సంతాన ప్రాప్తి కలుగును. ప్రక్కనే యమ కోణము అని పిలువబడే సిమెంట్‌తో చేయబడిన ముక్కోణపు ఆకారము కలదు. దీనిలో దూరి వచ్చిన భక్తులకు యమ యాతనలు ఉండవు. దేవాలయమునకు ఎదురుగా ఉన్నటువంటి రాతి ధ్వజ స్తంభముపై నందీశ్వర విగ్రహము కలదు. ఇది దక్షిణాయనమున దక్షిణ ముఖముగాను, ఉత్తరాయనమున ఉత్తర ముఖముగాను ఉన్నట్లు కనిపించును.

ఈ క్షేత్రమునకు పురాణగాధ కలదు. గంగానదీ తీరమున కాశీ క్షేత్రమున్నదని రాచకన్య అయినటువంటి గంగాదేవి విర్రవీగుట చూచి, బ్రాహ్మణ కన్య అయిన గౌతమి శివుని గూర్చి తపస్సు చేసెను. సంతుష్టాంతరంగుడైన శివుడు ప్రత్యక్షమై గౌతమి కోరికను తెలుసుకుని ఈ క్షేత్రమున రెండు శివలింగములుండునట్లు అనుగ్రహించెను. అంతేగాక మరణించినంత మాత్రమున కాశీలో మోక్షప్రాప్తి కలుగును కాళేశ్వర క్షేత్రమును దర్శించినంత మాత్రమున మోక్షప్రాప్తి అనుగ్రహించెను. కాశీ క్షేత్రమున త్రివేణీ సంగమమున్నను కాళేశ్వరమున పంచనదీ సంగమము కలిగించెను. అందు చేతనే ఈ క్షేత్రము కాశీకన్న వరిముల్లు వాసి ఎక్కువైనదట.

మహాకాళీ, మహాలక్ష్మీ, మహా సరస్వతుల దేవాలయములున్నవి. ఇక్కడ ఇంకను చాల దేవాలయములు కలవు. 1) దుర్గ 2) మహా గణపతి 3) భైరవుడు 4) వీరభద్రుడు 5) విజయ గణపతి 6) అన్నపూర్ణ 7) చింతామణి గణపతి 8) స్వర్ణాకర్షణ భైరవుడు 9) హనుమంతుడు 10) విష్ణుమూర్తి 11) సుబ్రహ్మణ్య స్వామి 12) జ్యేష్ఠాదేవి 13) నవ గ్రహములు 14) శ్రీరాముడు 15) సూర్య నారాయణ స్వామి 16) చంద్రుడు 17) శ్రీ వేంకటేశ్వర స్వామి 18) నరసింహ స్వామి 19) ఆది ముక్తేశ్వర 20) సంగమేశ్వర 21) చతుర్ముఖ లింగేశ్వరుడు ఇంకను ఇతర విగ్రహముల ప్రతిష్ఠ జరుగు అవకాశము కలదు. చిన్న చిన్న దేవాలయముల కట్టడములు సాగుచున్నవి. ఈ విధముగా కాళేశ్వర క్షేత్రము కాశీ క్షేత్రము కన్నా మిన్న అయి గోదావరి నదీ తీరమున ఆంధ్ర దేశమున, దర్శించి నంత మాత్రముననే మోక్షము నొసగుచు శైవులకే కాక గాణపత్య, శాక్తికేయ, వైష్ణవ మతాల వారికి కూడ ఆరాధ్యమై యున్నది

# పంచ ఆరామములు

ఇవి ఐదు  ఇవి అన్నియు ఆంధ్రదేశముననే ఉన్నవి.

దితీదేవి కుమారుడు వజ్రాంగుడు  వజ్రాంగ, వరాంగి దంపతులకు బ్రహ్మవరము వలన తారకుడుద్భవించెను. పెరిగి పెద్దవాడైన తారకుడు బ్రహ్మగురించి ఘోరతపస్సు చేసి శివవీర్య సంభూతునిచే తప్ప అన్యులచే తనకు మృత్యువు లేకుండునటుల వరము పొందెను. అంతటితోనాగక శివునిగూర్చి తపమొనరించి శివసాక్షాత్కారము పొందెను. స్వరక్షణమునకై పార్థివలింగమును ప్రసాదించమని ప్రార్థింప లింగమును ప్రసాదిస్తూ "కంఠమున ధరించమని'' ఆనతిచ్చెను. కంఠమున లింగము ఉన్నంతకాలము తారకుని శరీరమునకెట్టి హానియు కలుగదని హెచ్చరించెను.

వరగర్వమున దేవతలను, సాధుపుంగవులను, సామాన్య ప్రజానీకాన్ని బాధించుచుండ, దుష్ట తారకుని సంహారార్థము శివపార్వతులకు వివాహము జరిగినది. కుమారస్వామి జన్మించెను  దేవసేనాని అయిన కుమారస్వామి ఆగ్నేయాస్త్రమును ప్రయోగించి తారకాసురుని మెడలోని లింగమును ఐదు ఖండముల చేసెను. ఈ ఐదు ఖండములు తిరిగి అతుకుకొనకుండ, అవి పడినచోటనే వెంటనే ప్రతిష్ఠించబడునట్లు చేసి వానిపై దేవాలయములు నిర్మింపజేసెను  ఈ పార్థివలింగ భాగములు  ఐదు చోట్లపడి "ఓం"కార నాదము నొనరించుచుండగ ప్రతిష్ఠించబడెను. ఈ లింగ భాగములపై ఆగ్నేయాస్త్ర ఘాతముచే ఏర్పడిన గుర్తులు నేటికినీ చూడనగును.

కొన్ని లింగములు పడిన వెంటనే పెరుగుచుండుటచే చీలలు బిగించి పెరుగుదల నాపుట జరిగెను. ఈ ఐదు లింగములను పంచారామములని పిలుతురు. ఇంద్రునిచే ప్రతిష్ఠించబడిన లింగభాగమును అమరారామమనియు, దక్ష ప్రజాపతిచే ప్రతిష్ఠించబడిన లింగ భాగమును ద్రాక్షారామమనియు, కుమారస్వామిచే ప్రతిష్ఠించబడిన లింగభాగమును కుమారారామమనియు, శ్రీరామునిచే క్షీరకొలను ప్రక్కన ప్రతిష్ఠించబడిన లింగ భాగమును క్షీరారామ మనియు, చంద్రునిచే ప్రతిష్ఠించబడిన లింగభాగమును సోమారామ మనియు పిలువబడుచున్నవి. తూర్పు గోదావరి జిల్లా పిఠాపురములో వెలసిన కుక్కుటేశ్వర స్వామివారిని గూడా (కుక్కుటారామం) పంచారామములలో నొకటిగా భావిస్తున్నారు

ఈ క్షేత్రములలో మొదటిదైన ద్రాక్షారామం త్రిలింగదేశములోని లింగములలో చెప్పబడినది

# క్షీరారామము

స్వామివారు క్షీరా రామలింగేశ్వరుడు. ఈ ఆలయము పశ్చిమ గోదావరి జిల్లాలోని పాలకొల్లు గ్రామమున కలదు. ఈ గ్రామము నరసాపురమునకు 11 కి.మీ., భీమవరమునకు 21 కి.మీ. దూరమున కలదు. శ్రీరామచంద్ర మూర్తిచే ప్రతిష్ఠింపబడుటచే రామలింగేశ్వర స్వామి అనిపేరు వచ్చినది. దేవాలయమునకు ముందున్న గోపురము చాల ఎత్తైనదై కనుల పండువగా నుండును. దగ్గరలోనున్న రామగుండము అనే కొలనులోని నీరు తెల్లగా నుండుటచే ఈ పురమునకు పాలకొలను (క్షీరపురము) అని పేరు కలిగి కాలక్రమముగా పాలకొల్లుగా స్థిరపడినది. ఈ క్షేత్రమునకు "ఆంధ్ర కైలాస"మని పేరు.

పార్వతీ పరమేశ్వరులు, లక్ష్మీ జనార్ధనులు, సరస్వతీ బ్రహ్మలు ఉన్నందున ఈ ఆలయమునకు "త్రిమూర్త్యాలయమని" పేరు.

అమ్మవారు పార్వతీదేవి. ఆలయమున శివపార్వతులతోబాటు లక్ష్మీజనార్ధన స్వాములు కూడా వేంచేసి ఉన్నందున "హరిహర" క్షేత్రమని కూడా పిలుతురు. సుబ్రహ్మణ్య స్వామి, ఆంజనేయస్వామి, భైరవస్వామి ఆలయములు కలవు. ఋణ గణపతికి, శనీశ్వరునకు మందిరములున్నవి.

లింగము శిరస్సున చిన్నముడి ఉన్నట్లుగాను, కొమ్ము ఉన్నట్లుగాను కనిపించును. లింగము తెలుపు రంగులోనుండి చుట్టూ నొక్కులు కలిగి ఉండును. ఆలయము, గోపురము చాలా పెద్దవి. చైత్రశుద్ధ దశమినాడు కళ్యాణోత్సవము జరుగును. ఏకాదశి రోజున రథోత్సవము జరిగెడిదట.

ఇచ్చట లింగమును అర్చించిన వారికి దారిద్ర్య బాధ కలుగదని ప్రతీతి. అందుచేతనే కాబోలు పాలకొల్లులో చాలా మంది ధనవంతులున్నారు.

# అమరారామము

అమరావతి. గుంటూరు జిల్లా సత్తెనపల్లి తాలూకా. గుంటూరు నుండి 30 కి.మీ. దూరము. విజయవాడ నుండి కృష్ణానదిపై లాంచీమీద చేరవచ్చును.

కృష్ణానదీ తీరము శాతవాహనులు పరిపాలించు కాలమున అమరావతి రాజధాని. ధాన్య కటకము, ధరణికోట అనుపేర్లు ఉండెడివి.

అమరేశ్వర లింగము దేవేంద్రునిచే ప్రతిష్ఠించబడినందున ఆ పేరు వచ్చినది. లింగము పెరుగుచుండుటచే చీల కొట్టిరనియు, అంతట పెరుగుదల ఆగినదనియు చెప్పుదురు. చీల కొట్టునపుడు రక్తము ధారలుగా కారినట్లు లింగముపై కన్పించుచుండును

చాల పొడవైన లింగము పై అంతస్తునకు ఎక్కి అభిషేకము, పూజలు చేయవలయును దేవాలయ ప్రాంగణమునందు 108 శివలింగములు కలవు. అమ్మవారు రాజ్యలక్ష్మీ దేవి బాల చాముండీ లేక బాల చాముండికా అనుపేర్లు గలవు. శక్తి పీఠము. ఈ క్షేత్రమున ఏకాదశ రుద్రాభిషేకము ప్రత్యేకత

దగ్గరలో అమరావతి స్తూపము, మ్యూజియం కలవు ఇది బౌద్ధ క్షేత్రము

స్వామివారికి అమరేశ్వరుడు, క్రౌంచనాధుడు అని పేర్లు గలవు స్వామివారు పంచలింగరూపుడు : 1) ప్రణవేశ్వర, 2) అగస్త్యేశ్వర, 3) కోసలేశ్వర, 4) సోమేశ్వర,5)పార్థివేశ్వర.

# కుమారారామము

లింగము కుమారస్వామి లేక భీమేశ్వరుడు తూర్పు గోదావరి జిల్లా కాకినాడకు 13 కి.మీ పిఠాపురానికి 16 కి.మీ. దూరమునగల సామర్లకోట నందు గలదు.

చాళుక్య రాజులలో నొకడగు భీమునికిది రాజధానిగా నుండుటచే ఈ ప్రాంతమునకు భీమవరమని పేరు

శివుడు చాళుక్య భీమేశ్వరుడు. శివకుమారుడైన సుబ్రహ్మణ్య స్వామిచే ప్రతిష్ఠింపబడినందున స్వామికి కుమారస్వామి అనిపేరు కూడా వచ్చినది. "కుమారారామము" అని "స్కంధారామ"మని పేర్లు కలవు ద్రాక్షారామ భీమేశ్వరాలయానికి ఈ దేవాలయానికి పోలికలున్నవి. రెండును ఒకే పద్ధతిలో కట్టబడినవి ఆలయము పెద్దది లింగము చాల పెద్దది ఇచ్చట కూడా పై అంతస్తు నుండియే అభిషేకము, పూజలు సలుపవలయును. క్రింది అంతస్తు చీకటిగా ఉండును.

శ్రీనాధ కవిసార్వభౌముడు వర్ణించిన దేవాలయములలో ఇది ఒకటి అమ్మవారు శ్యామలాదేవి.

# సోమారామము

ఈ క్షేత్రము భీమవరం పట్టణములోని గునుపూడి గ్రామమున కలదు. పశ్చిమ గోదావరి జిల్లాలో నరసాపురమునకు 32 కి.మీ దూరమున కలదు.

ఇచ్చటి లింగము చంద్రునిచే ప్రతిష్ఠింపబడినందున సోమేశ్వర లింగమని పేరు. సోమేశ్వర లింగమున్న ప్రదేశముగాన ఈ క్షేత్రమునకు సోమారామమని పేరు వచ్చినది

చంద్రునిచే ప్రతిష్ఠించబడినందున లింగముపై షోడశ కళలు కనిపించును. అమావాస్య రోజున నలుపు రంగుగాను, పౌర్ణమి రోజున తెలుపు రంగుగాను కనిపించును

ఈ లింగమును ప్రార్థించినవారికి సర్వవ్యాధులు తొలగుననియు, పంచ మహాపాపములు హరించుననియు నమ్మిక

# పంచభూత లింగములు - 5

## ( శివుని అష్టమూర్తి లింగములతో సహా)

### 1. క్షితిలింగము(పృధ్వి లింగము)

పంచభూత లింగములలో నొకటి. పశురూప జీవకోటికి మోక్షము ప్రసాదించు వాడగుటచే శంకరుడు పశుపతి అయ్యెను. ఇది పృధ్విలింగము అనగా మట్టిలింగము దీనినే క్షితిలింగమని కూడ పిలుతురు

ఇది కంచిలో ఉన్నది తమిళనాడు రాష్ట్రము మద్రాసునుండి 70 కి మీ దూరము తిరుపతి నుండి నేరుగా బస్సుమీద వెళ్ళవచ్చును మోక్షపురములలో నొకటి

స్వామి ఏకాంబరేశ్వరుడు ఈ మట్టి లింగముపై జలాభిషేకము జరుగదు మల్లెపూలతోగాని, మల్లెపూల నూనెతోగాని అభిషేకము పార్వతీదేవిచే ప్రతిష్ఠించబడినది అమ్మవారు కామాక్షిదేవి. అష్టాదశ పీఠాలలో నొకటి ఇచ్చట సతీదేవి "కంకాళము" పడినది అమ్మవారు "అక్షిత్రయము"లో నొకరు.

అతి పురాతన మామిడిచెట్టు గలదు. చాల మహిమగలది సంతాన ప్రాప్తి నిచ్చును ఆకునకు, ఆకునకు ఆకారములో వ్యత్యాసము కలదు. పండునకు, పండునకు రుచియందు తేడా కలదు ఈ చెట్టుక్రింద అమ్మవారు జటావల్కల ధారిణియై తపస్సు చేసినది

దేవాలయ గోపురము దేశములో చాలా పెద్దది, ఎత్తైనది. శివకంచి, విష్ణుకంచి అని రెండు వేర్వేరు సాంప్రదాయములలో వేర్వేరు ఆలయములు కలవు. వామనావతారమునకు (మహావిష్ణువునకు) ఇచ్చట ప్రత్యేక ఆలయము చూడనగును. కాగడాతో స్వామివారిని చూపింతురు

ఏకాంబరేశ్వరుని గోపురము అతి పెద్దది, ఎత్తైనది ఆలయ విధ్వంస ప్రయత్నము హైదరాలీ సమయమున జరిగినది మందుగుండ్లతో పడగొట్టుటకు ప్రయత్నించిరి చిహ్నములు గానవచ్చును

### 2. ఆకాశలింగము

చిదంబర క్షేత్రము ఈ క్షేత్రము తమిళనాడులో మద్రాసునకు 243కి మీ దూరములో కలదు కావేరి నదీ తీరము సముద్రము నుండి (బంగాళాఖాతము) నుండి 5 కి.మీ. దూరమున కలదు 40 కి మీ కడలూరు

స్వామివారు ఆకాశలింగము గాన శూన్యము, శబ్దగుణకము, స్వరబ్రహ్మ స్వరూపము అందుచే ఆకాశలింగము ప్రత్యేకముగా కనిపించక నటరాజ స్వామి వారికే ఆరాధన జరుగుచున్నది

ఇది చాలా పెద్ద దేవాలయము. నాలుగు గోపురములు, ఐదు ప్రాకారములు గలవు. రెండు గోపురములపై నటరాజ స్వామివారి నాట్య భంగిమలు కలవు

అమ్మవారి పేరు శివకామ సుందరి. నటరాజ స్వామివారి ఆలయం ప్రక్కన శేషతల్పశాయి యగు విష్ణుభగవానుని సుందర మూర్తి కలదు. వీరి పేరు గోవిందరాజ స్వామి. అమ్మవారి పేరు పుండరీక వళ్ళీతాయారు

శంకరుని మందిరమున బంగారు రేకుతో మలిచిన పెద్ద దక్షిణావర్త శంఖమొకటి కలదు. మందిరమున తెరయొకటి వ్రేలాడుచుండును. తెరతీయగనే రత్నఖచిత స్వర్ణహారములు చాలా కనబడును.

ఆకాశలింగ దర్శనము రహస్యముగా భావించబడుచున్నది. ఆకాశము వలె శూన్యము కనిపించును. లింగ దర్శనముండదు అందువలననే "చిదంబర రహస్య" మనెడి పేరు వచ్చినది.

## 3. జలలింగము

ఈ లింగము జంబుకేశ్వర క్షేత్రమున కలదు. ఈ క్షేత్రము తమిళనాడులో నున్నది. తిరుచినాపల్లికి 10 కి.మీ. దూరములో, శ్రీరంగ క్షేత్రానికి సమీపమున కలదు. స్వామివారి పేరు జంబుకేశ్వరుడు లింగము క్రింది భాగాన సర్వవేళలా నీరు ఊరుతూంటుంది. జలప్రవాహమున్నదని ప్రతీతి.

అమ్మవారు అఖిలాండేశ్వరి. బ్రహ్మహత్యా పాతక నివారణకోసము శివుడు జంబూక వృక్షము క్రింద తపస్సు చేసినందున ఈ క్షేత్రము జంబుకేశ్వర మైనది.

మిట్ట మధ్యాహ్నము పూజారి ఇక్కడ చీరకట్టుకుని, కండ్లకు కాటుక పెట్టుకుని స్త్రీ వేషధారియై పూజలు చేయుట ప్రత్యేకత.

ఇచ్చట పంచభూత లింగముల ఉనికిని తెలుపు పటము కలదు. 5 ప్రాకారములు కలిగిన దేవాలయము. సాలెపురుగు, ఏనుగు భక్తులుగా కథ కల్గిన చోటు (పాము లేదు)

## 4. తేజోలింగము

ఈ తేజోలింగము (అగ్నిలింగము) తిరువన్నామలై క్షేత్రమున కలదు. తమిళనాడులోని అరుణాచల పట్టణమున ఉన్నది. మద్రాసు నుండి 68 కి.మీ. విల్లుపురం కాట్‌పాడి రైల్వేలైనులో ఉన్నది రాయవెల్లూరు నుండి బస్సు కలదు.

ఇది చాలా పెద్ద దేవాలయము. అరుణాచల శిఖరాగ్రము నుండి అగ్నిశిఖ ఒకటి ప్రాదుర్భవించి తేజోలింగ రూపమున వెలసినది స్వామివారి పేరు అరుణాచలేశ్వరుడు అమ్మవారు అరుణాచలేశ్వరి లేక అభిదకుజాంబాళ్ లేక ఉన్నామలై అమ్మె

ఇచ్చట రమణ మహర్షి ఆశ్రమము కలదు తూర్పుననున్న గోపురము 217' ఎత్తు చాలా పెద్దది. ఆలయము 5 ప్రాకారములు, 9 గోపురములు కలది కార్తీక పౌర్ణమినాడు కార్తీక దీపోత్సవం జరుగుతుంది. కొండమీద ఒక పెద్ద గిన్నెలో దీపాన్ని వెలిగిస్తారు ఉత్సవం పది రోజులు జరుగుతుంది

ఈ క్షేత్రము పృధ్వికి హృదయముగా భావించబడుచున్నది కొండచుట్టూ 12 కి మీ తిరిగివచ్చి "గిరి ప్రదక్షిణ" ఉత్సవం జరుపుకుంటారు

## 5. శ్రీకాళహస్తీశ్వర వాయులింగము

శ్రీకాళహస్తీశ్వర క్షేత్రము. ఇచ్చట వెలసిన లింగము వాయులింగము గ్రామము పేరు శ్రీకాళహస్తి. ఆంధ్రప్రదేశ్‌లోని చిత్తూరు జిల్లాలో తిరుపతికి 40కి మీ. దూరమున కలదు. సువర్ణముఖీ నదీ తీరము. "దక్షిణ కాశి" యని పేరు.

స్వామి శ్రీకాళహస్తీశ్వరుడు. స్వయంభూలింగము లింగమునకెదురుగా ఉన్న దీపము లింగము నుండి వచ్చు గాలికి రెపరెపలాడు చుండును

అమ్మవారు జ్ఞానప్రసూనాంబ అంబాత్రయములో నొకరు. శివలింగము వర్తులముగా గాక చతురస్రముగా నుండును సాలెపురుగు, పాము, ఏనుగులకు మోక్షమిచ్చిన పుణ్యస్థలము. భక్తుడైన కన్నప్పను కరుణించిన స్వామి

దేవాలయము చాల పెద్దది. పై కప్పు భాగములో రంగులతో చిత్రించిన చిత్రములు కలవు. "మణి కుండేశ్వరాఖ్య" మను మందిరము కలదు ఇచ్చట చనిపోయే వారికి కాశీ క్షేత్రములో వలె శివుడు ఓంకార మంత్రమును, తారక మంత్రము నుపదేశము చేసి, మోక్షము నిచ్చునని నమ్మిక.

దేవాలయమునకు ఎదురుగా కొద్ది దూరములో పాతాళ విఘ్నేశ్వరాలయము కలదు. దేవాలయమునకు ఆనుకొనియున్న కొండపై భక్త కన్నప్పకు చిన్నగుడి కలదు.

శ్రీకాళహస్తీశ్వరాలయ రాజగోపుర సింహద్వారము దక్షిణాభిముఖము స్వామివారు ఉత్తరాభిముఖముగ నుండుట గమనించదగునది. శ్రీ ఆది శంకరాచార్యుల వారిచే ఈ క్షేత్రమున శ్రీ చక్రము స్థాపించబడియున్నది. ఈ క్షేత్రమునకు గల ఇతర పేర్లు 1. దక్షిణ కైలాసము, 2 సత్యమహాభాస్కర క్షేత్రము, 3 సద్యోముక్తిక్షేత్రము, 4. శివానందైక నిలయము

# శివుని అష్టమూర్తులు

## పంచభూత లింగములు 5+3

### 1. పశుపతినాథ్ (యజమానలింగము) (పురుషలింగము)

ఈ లింగము నేపాల్ రాజధానియైన ఖాట్మండులో భాగమతి నది ఒడ్డున వెలసినది పశురూప జీవకోటికి మోక్షము ప్రసాదించు వాడగుటచే శంకరుడు "పశుపతి" ఆయెను అర్జునుడు శివుని మెప్పించి పాశుపతాస్త్రమును పొందిన చోటు మృగస్థలి, కైలాస్ కొండల మధ్య ప్రవహించు భాగమతీ నదీ తీరమున స్వామివారి మందిరము చైనా, జపాన్ దేశ సాంప్రదాయానుసారముగా కట్టబడినది

స్వామివారు చతుర్ముఖుడు నాలుగు ద్వారములగుండా నాలుగు దిక్కుల నుండి దర్శనము పంచముఖుడుగా ప్రస్తుతించెదరు. మహిషరూప ధారియైన శివభగవానుని శిరోభాగము (అర్ధ భాగము) ఈ క్షేత్రమున వెలసినదనియు, తోక భాగము (మిగిలిన అర్ధభాగము) ఉత్తర ప్రదేశ్‌లోని కేదార క్షేత్రమున వెలసినదని పురాణగాధ పాండవులు తమ అంతిమయాత్రగా ఇక్కడ స్వామివారిని ప్రార్ధించి, తరువాత కేదార క్షేత్రమునకు వెళ్ళి, అచ్చట పూజలు చేసి స్వర్గారోహణము చేసిరట ఇచ్చట ఇనుమును బంగారము చేయు పరశువేది గలదని స్థలపురాణమున చెప్పబడినది. స్వామివారు అతి నల్లని లింగాకారుడు. ఎదురుగా నున్న నంది ఇత్తడిది ధాన్యపుగింజలు నందికి ఆహారముగా సమర్పింతురు.

అమ్మవారు పశుపతీ దేవి లేక గుహ్యేశ్వరీ దేవి (పార్వతి అంశ). సతీదేవి శరీర భాగము (మోకాళ్ళు) పడిన పవిత్ర ప్రదేశం. శక్తి పీఠములలో నొకటి. పర్వతాన్ని విష్ణురూపమని, దీనిపై వెలసిన లింగమును శివస్వరూపమనియూ చెబుతారు ఇచ్చట దేవిక, గండకి, చక్రిక అను మూడు నదుల సంగమమున ఏర్పడిన త్రివేణీ సంగమము కలదు.

### 2. సూర్యలింగము

ఈ క్షేత్రము కోణార్క నామధేయముతో వెలసినది ఒరిస్సా రాష్ట్రములోని పూరీ జగన్నాధ క్షేత్రమునకు 32 కి.మీ దూరములోను, భువనేశ్వర్‌కు 44 కి మీ దూరములోను కలదు. బంగాళాఖాత తీరము. ఈ క్షేత్రమునకు పాద్మ క్షేత్రమని పేరు చంద్ర భాగానది సాగర సంగమ స్థానము నది ఎండిపోయినది ఈ క్షేత్రమున సూర్య భగవానుడు, రామేశ్వరుడు ప్రతిష్ఠింపబడిరట శివునికి, సూర్యునికి భేదము లేదను సత్యమును చాటి చెప్పుక్షేత్రము ఫిరోజ్ షా తుగ్లక్ మత మౌఢ్యమునకు, సముద్ర తీర, నదీతీర ప్రకృతి

ప్రళయాలకు నాశనమైన ఆలయము సప్తాశ్వరూఢమైన సూర్య మందిరము చాలా పెద్దది అద్భుత శిల్పకళతో కామశాస్త్ర రీత్యా చెక్కబడిన జంటలతో ప్రసిద్ధి గాంచినది. శిధిలాలయమున గర్భగుడియందు స్వామివారికి శ్రీ విగ్రహం లేదు

## 3. చంద్ర లింగము

1. ఈ క్షేత్రము తూర్పు బెంగాల్ (బంగ్లాదేశ్) నందు గలదు. చెటగాంగ్ నగరమునకు 60 కి.మీ. దూరములో నున్న పర్వతముపై సీతాకుండ్ అని పిలువబడే ప్రదేశమున వెలసియున్న శివలింగము. స్వామివారు చంద్రనాధుడు 13వ జ్యోతిర్లింగముగా భావించబడుచున్నది.

2 గుజరాత్ రాష్ట్రములో ప్రభాస తీర్ధమున వెలసిన సోమనాధ లింగమును కూడా చంద్ర లింగముగా భావింతురు.

## ద్వాదశ జ్యోతిర్లింగములు (12)

ఈ దివ్యక్షేత్రములు, వెలసిన లింగములు ద్వాదశము (12) అని ఈ క్రింది శ్లోకము మూలకమున తెలియుచున్నది.

శ్లో॥ సౌరాష్ట్రే సోమనాధంచ, శ్రీశైలే మల్లికార్జునమ్
ఉజ్జయిన్యాం మహాకాళ, మోంకార మమలేశ్వరమ్
ప్రజ్జ్వల్యాం వైద్యనాధంచ, డాకిన్యాం భీమశంకరం
సేతుబంధేచ రామేశం, నాగేశం దారుగావనే
వారణాస్యాంతు విశ్వేశం, త్రయంబకం గౌతమీతటే
హిమాలయేతు కేదారం, ఘృష్ణేశంచ శివాలయే.

సోమనాధ ఆలయ మండపములో ద్వాదశ జ్యోతిర్లింగములు వెలసినచోట్లను 14గా చూపించబడి ఉన్నది. వైద్యనాధ లింగములు రెండుచోట్లను, నాగేశ్వర లింగములను రెండుచోట్లను చూపించి, "అదికానీ/యిదికానీ" అని వ్రాసియున్నారు వైద్యనాధ లింగములలోని రెండింటిలో, నాగేశ్వర లింగములలోని రెండింటిలో ఎచ్చటిది కరెక్టు జ్యోతిర్లింగమో వివరించబడలేదు. వైద్యనాధ్ రెండు క్షేత్రములు, నాగేశ్వరుని రెండు క్షేత్రములు దర్శించి అచ్చట వారినడుగగా వారిదే కరెక్టు జ్యోతిర్లింగ క్షేత్రమని క్లెయిమ్ చేయుచున్నారు నిజ నిర్ధారణ లేకపోవుటచే 14 పుణ్యక్షేత్రముల దర్శనము తప్పనిసరి శ్లోకపాదములో "ఓంకార మమలేశ్వరమ్" అని కలదు ఈ క్షేత్రము నర్మదానదికి ఇరుప్రక్కలా రెండు లింగరూపములలో వెలిసియున్నది నదికి ఒక ప్రక్కన ఓంకారేశ్వరుడు, మరొక ప్రక్కన అమలేశ్వరుడు రెండు ప్రత్యేక లింగములుగా వెలసియున్నవి. నదికటూ యిటూ రెండు విడివిడిగా నున్న

పుణ్యక్షేత్రములలో రెండు లింగములు వెలసియున్నవి శ్లోకములో ఈ క్షేత్రము ఒకే లింగముగా నున్నప్పటికీ నదికటూ యిటూ చాల దూరములోనున్న ఈ రెండు ప్రత్యేక నామములతో వెలసిన రెండు పుణ్యక్షేత్రములు దర్శనీయము. ఇవికాక సోమనాధ క్షేత్రమున ఆలయమున నున్న శివలింగముతోబాటు రెండు ఫర్లాంగుల దూరమున భూమిలోనికి దిగి వెళ్ళిన చిన్న దేవాలయములో వెలసిఉన్న మరొక సోమనాధ లింగమును కూడా దర్శించవలసియున్నది. ఏలనన, పలుమార్లు దండయాత్రకు గురైన కాలములో నాటి భక్తులు గర్భగుడి నుండి లింగమును తీసికొనివచ్చి భూమికడుగు భాగముననున్న ఆలయమున ప్రతిష్ఠించిరని చెప్పుదురు మొదటి గుడి చాలసార్లు పునర్నిర్మాణము గావించబడినది. అందు లింగ ప్రతిష్ఠ జరిగినది ఈ క్షేత్రమున గూడా నిజనిర్ధారణ చేయు నవకాశమే లేనందున రెండు లింగములూ దర్శనీయము అదే విధముగా రామేశ్వర క్షేత్రమున వెలసిన రామలింగేశ్వరుడు, హనుమంతుడు తెచ్చిన విశ్వనాధ లింగము (రెండునూ) దర్శనీయం.

శ్రీ శివభక్త విజయములో దేవీ పురాణమందలి చైత్రమాస మహాత్మ్యము ననుసరించి "చంద్రనాధ లింగము" త్రయోదశ జ్యోతిర్లింగముగా ఎన్నబడి ఉన్నది. ఈ లింగము బంగ్లాదేశ్‌లోని ఒక పర్వతముపై చిట్టగాంగ్‌కు 60కి మీ. దూరములో నున్నది. త్రయోదశ జ్యోతిర్లింగమైన చంద్రనాధ లింగము గాకుండా ద్వాదశ జ్యోతిర్లింగ దర్శనము సంపూర్ణము కావలెయునన్న, 15 పుణ్యక్షేత్రములలో వెలసిన 17 దివ్యలింగ దర్శనము అనివార్యము.

ద్వాదశ జ్యోతిర్లింగములను స్మరించినంతమాత్రాన సర్వపాప నివారణమై, సర్వఫలాలు సిద్ధించును. గత 7 జన్మల పాపములు గూడా నశించును. వీటి దర్శనము ముక్తిదాయకము.

ఇందలి శ్రీశైలమున వెలసిన మల్లికార్జున క్షేత్రము త్రిలింగ దేశమున వెలసిన త్రిలింగములనందు చూడనగును.

## సోమనాధ లింగము

జ్యోతిర్లింగములలో నొకటి "మహా మేరుప్రసాద్" అని కూడా పిలిచెదరు. ప్రభాస క్షేత్రము తీరమున వీరవళ్ళి పట్టణమునకు 7 కి.మీ. దూరములో నున్నది.

మహ్మద్ గజనీ, ఘోరీల దండయాత్రలకు 17 సార్లు గురి అయిన దేవాలయము. ఈ ఆలయమును మొట్టమొదట బంగారముతోను తరువాత వెండితోను ఆ తరువాత కర్రతోను కట్టబడినదట ఇప్పుడు రాతి కట్టడము కనిపించుచున్నది ఈ దేవాలయమునకు కొద్ది దూరములో మరొక లింగము భూమికి దిగువ భాగములో నున్నది. మహ్మదీయుల దాడికి భయపడి అసలు లింగమును ఇక్కడ దాచినారని ప్రతీతి. ఈ లింగమును తాకవచ్చును.

సోమనాథ దేవాలయములో నున్న లింగము పెద్దది. నల్లనిరంగు, తాకుటకు వీలులేని దూరముగా, ఎత్తున ఉంచబడినది. మధ్యను ఒక చెక్కతో ఆటంకమేర్పరచి దగ్గరకు వెళ్ళుట నిషేధించడమైనది.

ఈ ఆలయమునకు దగ్గరలో పరశురామ ఆశ్రమము కలదు. ఇచ్చటకు సుమారు 3 కి.మీ. దూరములో కపిల, హిరణ్యా, సరస్వతి నదుల త్రివేణీ సంగమము కలదు. మొదటి రెండు నదులు మాత్రమే మనకు కన్పించును. మూడవది అంతర్వాహిని. తీరమున శ్రీకృష్ణ భగవానుడు నిర్యాణము పొందిన "దేహోస్వర్గ" యను పవిత్ర క్షేత్రమున్నది. శ్రీకృష్ణుని కాలిప్రేలిని కిరాతకుడొకడు బాణముతో కొట్టగా స్వామివారు నిర్యాణము పొందిన చోటు. ఇచ్చట ప్రభుత్వమువారు ఒక బోర్డును వ్రాసి ఉంచినారు. ఎదురుగా ఉన్న గుహలోనికి బలరాముడు వెళ్ళి అదృశ్యుడై దేహము చాలించినాడట. శ్రీకృష్ణాలయము, బలరామాలయము కలవు.

ఈ ఆలయాన్ని ఏడుసార్లు కట్టినట్లు చరిత్ర ఉన్నది. ఇప్పుడున్న ఆలయం మహారాణి అహల్యాబాయి కట్టించినది. 11-5-1951వ తేదీన అప్పటి రాష్ట్రపతి డా॥ రాజేంద్రప్రసాద్ ఇప్పుడున్న ఆలయాన్కి ప్రారంభోత్సవం చేసిరి.

మొట్టమొదట్లో స్వామివారి లింగమును బ్రహ్మదేవుడు ప్రతిష్ఠించెను. అమ్మవారు గౌరీదేవి.

ఈ క్షేత్ర దర్శనమున, ఇచ్చటి సముద్ర స్నానమున క్షయ, కుష్ఠ్యాది భయంకర వ్యాధులు నిర్మూలనమగును.

## మహా కాళేశ్వర లింగము

ఈ స్వామివారు పెద్ద లింగరూపమున ఉజ్జయిని (అవంతిక) అను పట్టణమున వెలసిఉన్నారు. మహ్మద్ గజని, ఘోరీల దండయాత్రలకు గురి అయిన లింగములలో ఇది ఒకటి. షిప్రానదీ తీరము. ఈ నది విష్ణు భగవానుని పాదముల నుండి ప్రాదుర్భవించిన నదిగా భావింతురు. దేవాలయము ఊరిలోనే కలదు. కొంచెము క్రింది భాగమున ఉన్నందున మెట్లపై దిగి వెళ్ళవలెను.

ఎర్రని రాతితో చేయబడి పెద్ద పానమట్టము గల పెద్ద లింగము. లింగమునకు ఎదురుగా కళ్ళు, ముక్కు గుర్తులు ఉన్నవి. ఇత్తడితో తయారైన సర్పాలంకరణ కన్పించును. అతి తేజోమయముగా, అతి భీకరముగా లింగము కన్పించుచూ ముట్టుకొను వారికి భీతిని కలిగించి ముట్టుకున్న తరువాత శరీరమునకు గగుర్పాటు కలిగించును

అమ్మవార్లు మహాకాళి, హరసిద్ధి దేవి (విక్రమాదిత్యుని ఆరాధ్య దేవత). సతీదేవి యొక్క "మోచేయి" భాగము పడినచోటు. అష్టాదశ పీఠములలో నొకటి. ఉజ్జయిని లేక అవంతిక సప్త మోక్ష పురములలో నొకటి. దేవి పీఠమున శ్రీచక్రము స్థాపించబడియున్నది. ఇది పృధ్వీ దేవతకు నాభి స్థానముగా చెప్పబడుచున్నది. భారతదేశ జ్యోతిష శాస్త్రకర్తలు తమ జ్యోతిష శాస్త్రమున దేశాంతర శూన్యరేఖ ఉజ్జయిని నుండి ప్రారంభమగునట్లు తలంతురు.

స్వామి దర్శనము అకాల మృత్యువు నుండి రక్షించును. 12 సంవత్సరముల కొకసారి ఈ క్షేత్రమున "కుంభమేళ" ఉత్సవము జరుగును. 6 సంవత్సరముల కొకసారి 'అర్థకుంభమేళ" జరుగును. ఇచ్చట అమ్మవారిని ఆరాధించియే కాళిదాసు మహాకవిగా మారెను. బలరామ కృష్ణులు సుధామాదులతో గూడి ఇచ్చట నున్న సాందీపుని ఆశ్రమమునందే విద్యల నభ్యసించిరి. ఈ క్షేత్రమునకు "మహాశ్మశాన" మని పేరు. ఇచ్చట 84 శివలింగములు కలవు. ఈ క్షేత్రమున మరణించినవారు తిరిగి జన్మనొందరని నమ్మిక.

## ఓంకారేశ్వరుడు అమలేశ్వరుడు

ఈ క్షేత్రము మధ్యప్రదేశ్‌నందు కలదు. "ఓం"'కారక్షేత్రమని పిలువబడుచున్నది ఇచ్చట స్వామివారిని ఓంకారేశ్వరుడని పిలుతురు. నర్మదానది తీరము. కావేరి, నర్మదా నదుల సంగమస్థానము. మాంధాత ద్వీపమని పేరు. "బిర్‌హా లా" కొండపై ఓంకారేశ్వర మందిరమున్నది. నర్మదానదికి ఇరువైపుల రెండు దేవాలయములు కలవు. ఓంకార క్షేత్రమున ఉన్న ఆలయములోని స్వామివారిని ఓంకారేశ్వరుడనియు, నదికి అవల ప్రక్కన ఉన్న క్షేత్రమున, విష్ణుపురి గ్రామమున ఉన్న స్వామివారిని అమలేశ్వరుడనియు, మణితేశ్వరుడనియు పిలుతురు ఓంకార క్షేత్రమున ఉన్న లింగము చాల పెద్దది. నల్లని రంగు కలది. అమలేశ్వర లింగము చిన్నది. నదికిరువైపుల నున్న రెండు క్షేత్రములలో ఉన్న రెండు లింగములను ఒకే స్వామివారిగా భావింతురు. ఇది ఇచ్చటి ప్రత్యేకత. ఈ క్షేత్రమును "దేవలోక" మని పిలుతురు. అమ్మవారు ఓంకారేశ్వరి. అమలేశ్వర లింగము వద్దగల అమ్మవారు అన్నపూర్ణాంబ.

పూర్వకాలము ఈ నర్మదా నదిని పడవపై నుండి దాటి రెండు ఆలయములను దర్శించెడివారట ఇప్పుడు చాల ఎత్తున మోటారు వాహనములు పోవు వంతెన కట్టబడి ఉన్నది. ఇచ్చట పెద్దలకు పిండ ప్రదానములు జరుపుదురు.

ఓంకార క్షేత్రము ఎత్తైన ప్రదేశము కాదు. ప్రదక్షిణము చేయుదురు దీని మూలమున కైలాస పర్వత ప్రదక్షిణ భాగ్యము లభించునట.

ఈ క్షేత్రము ఓంకార్ రోడ్ రైల్వేస్టేషన్ నుండి 12 కి.మీ. దూరము. రత్లాం-ఖాండవా రైల్వేలైను (Western Railway) లో కలదు. ఇండోర్ నుండి 80 కిమీ, ఖాండవా నుండి

78 కి.మీ మాండు నుండి 125 కి మీ. ఉజ్జయిని నుండి 120 కి.మీ దూరమున కలదు. ఇచ్చట శ్రీవేంకటేశ్వర స్వామి వారి ఆలయము కలదు.

మహ్మాద్ గజనీ, ఘోరీల దండయాత్రలకు గురైన ఆలయములలో ఇది ఒకటి. ఈ యాత్రా దర్శనమున మానస సరోవర యాత్రా ఫలము లభించును.

## వైద్యనాథ లింగము

1. వైద్యనాథ లింగములు రెండుచోట్ల కలవు. ఒకటి బీహార్‌లోని దేవగఢ్ అని పిలువబడే "వైద్యనాథ ధామ్". సంతాల్ పరగణాల జిల్లా. కలకత్తా నుండి పాట్నా వెళ్ళు రైలు రూటులో "జెషీడి" స్టేషను నందు దిగి, 5 కి.మీ. జీపులో రోడ్డు ప్రయాణము.

చాల పెద్ద దేవాలయము. లింగము చిన్నది. ప్రతీరోజు సాయంకాలము 60 మందికి పైగా భక్తులు రుద్రాక్షమాల జపములు చేస్తూ కూర్చుండెదరు. దేవాలయము ఊరిలోనే ఉన్నది. స్వామివారిని వైద్యనాథుడని, రావణేశ్వరుడని పిలుతురు.

సతీదేవి "హృదయ కోశము" ఇచ్చట పడెను. ఇది శక్తి పీఠము. అమ్మవారు శ్రీ జయదుర్గా త్రిపుర సుందరీదేవి.

ఈ క్షేత్రమును "భూకైలాస"మని పిలుతురు. రావణుడు శివుని మెప్పుపొంది ఆత్మలింగమును తన లంకకు తీసుకుని పోవుచుండగా, విఘ్నేశ్వరుని సహాయముతో దేవతలు శివుని ఆత్మలింగమును భూ ప్రతిష్ఠితము గావించిన చోటు. లింగమును రావణుడు పెకలించిన గుర్తుగా లింగముపై రావణుని బొటనవ్రేలి ముద్ర కలదు. ఈక్షేత్ర దర్శనము వలన కాఠిన్యత తగ్గి కరుణ, దయ కలుగుతాయి. ఈ క్షేత్రమునకు దగ్గరలో వాల్మీక మహర్షి ఆశ్రమము కలదు.

ఈ క్షేత్రమున 21 మందిరములున్నవి. 1. గౌరి, 2, కార్తికేయ 3. గణపతి 4. బ్రహ్మ 5. సంధ్యాదేవి 6. కాలభైరవ 7. హనుమాన్ 8. మానసాదేవి 9. సరస్వతి 10. సూర్య 11. భగళాదేవి 12. శ్రీరామ 13. ఆనందభైరవ 14 గంగ 15. మాణిక్ చౌక చబూతర 16. హరగౌరి 17. కాళిక 18. అన్నపూర్ణ 19. చంద్ర 20 లక్ష్మీనారాయణ 21. నీలకంఠ మహదేవ్. ఇంకా సావిత్రి (తార) పార్వతి, నాగళాదేవి, అన్నపూర్ణ మూర్తులు గలవు.

**2. పరలే వైద్యనాథుడు :** ఈ క్షేత్రము మహారాష్ట్రమున నున్న "పరలే" అను గ్రామమున కలదు. సికిందరాబాద్ నుండి పరలే వైద్యనాథ్‌నకు బ్రాడ్‌గేజ్ కలదు. పరలే వైద్యనాథ్ ఆఖరి స్టేషను.

ఇది చాల పెద్ద దేవాలయము. ఈ దేవాలయము కూడా పరలే గ్రామ మధ్యమునే కలదు. యాత్రీకులుండుటకు సత్రములు, గదుల సౌకర్యము కలదు. రావణుడు కైలాసము

నుండి శివుని ఆత్మలింగమును భూలోకమునకు తెచ్చియున్న పవిత్ర స్థలము అమ్మవారు త్రిపుర సుందరి ఈ క్షేత్ర దర్శనము వలన మానవునిలో మంచితనము వృద్ధి చెందును.

## భీమశంకర లింగము

ఈ లింగము మహారాష్ట్రంలో భీమశంకరంఅనుచోట కలదు. బొంబాయి నుండి పూనేకు వెళ్ళు బస్సురూటులో గలదు పూనేలోని శివాజి బస్టాండ్ నుండి డైరెక్టు బస్సు కలదు 122 కి మీ దూరము

భీమానది పుట్టిన చోటు శివలింగము నుండి నీరు కొంచెం కొంచెముగా స్రవించుచుండును సహ్యాద్రి పర్వతశ్రేణి ఢాకినీ శిఖరమున భీమశంకర లింగము కలదు దేవాలయము చాల పురాతనమైనది చాల క్రిందుగా మెట్లమీదుగా దిగి దర్శించవలయును చుట్టూ అరణ్య ప్రాంతము ఢాకినీ వనమని పేరు ఇచ్చట తినుటకు ఏమియు దొరకదు యాత్రీకులు బ్రెడ్, బిస్కట్లు వగైరా తీసుకుని వెళ్ళవలసియున్నది వసతికి ఇప్పుడిప్పుడే సత్రములు కట్టబడుచున్నవి

ఈ క్షేత్ర దర్శనమున శాకినీ, ఢాకినీ దుష్ట శక్తుల నుండి రక్షణ కలుగును ఈ క్షేత్రము ఇంకనూ రెండు మూడు ప్రదేశములలో (ఇతర రాష్ట్రములలో) నున్నట్లుగా క్లైయిమ్ చేయుచున్నారు వీటి వివరములు తరువాత నీయబడినవి

స్వామివారు భీమశంకరుడు అమ్మవారు కమలజ బ్రహ్మదేవుడు అమ్మవారిని కమలములచే పూజించినందున అమ్మవారిని కమలజగా పిలుతురు

## రామేశ్వర లింగము

ఈ క్షేత్రము బంగాళాఖాత సముద్ర తీరమున తమిళనాడులో కలదు ఇది ఒక చిన్న ద్వీపము పాంబన్ అనుచోట నుండి రైలుమార్గమున ఈ దీవిని చేరనగును సముద్రమున కట్టబడిన ఈ రైలు బ్రిడ్జి ఓడలు వచ్చు సమయమున మధ్యలో విచ్చి, పైకిలేచి ఓడలు వెళ్ళిన తరువాత తిరిగి కలసి రైలు పోవుటకు అనుగుణముగా కట్టబడినది ఇప్పుడు ఈ రైలు బ్రిడ్జి ప్రక్కనే రోడ్డు బ్రిడ్జికూడ కట్టబడినది

శ్రీరామచంద్రుడు రావణబ్రహ్మ, వధానంతరము సీతాదేవితో తిరిగివస్తూ బ్రహ్మ హత్యాపాప నివారణార్థము లింగ ప్రతిష్ఠ చేసిన స్థలము. ద్వాదశ జ్యోతిర్లింగములలో నొకటి. ఈ లింగమునకు రామలింగేశ్వరుడనియు, రామనాథుడనియు పేర్లు గలవు శుభ ముహూర్త సమయమునకు ఆంజనేయునిచే కైలాసము నుండి శివుని ఆత్మలింగము రాక ఆలస్యమైనందున, సీతా సహాయమున శ్రీరాముడు శుభముహూర్త సమయమున యిసుకతో సైకత లింగమును ప్రతిష్ఠించెను హనుమంతుడు తీసుకుని వచ్చిన ఆత్మలింగము తరువాత ప్రతిష్ఠించబడినది ఈ లింగమునకు విశ్వేశ్వర లింగమని పేరు హనుమంతుడు ఎంత ప్రయత్నించినను కదలక ఉండిపోయిన సైకత లింగమునకు రామలింగేశ్వరుడని పేరు హనుమంతుని తృప్తిపరచుటకు తొలిపూజ

హనుమంతుడు తీసుకుని వచ్చిన విశ్వేశ్వర లింగమునకు జరుగునటుల శ్రీరాముడు అనుగ్రహించెను ఇచ్చట గల నంది పెద్దది 12' పొడవు, 9 ' ఎత్తు

అమ్మవారు పర్వతవర్ధినీ దేవి అన్నపూర్ణ దేవాలయము కూడ కలదు

ఇది చాల పెద్ద దేవాలయము ఇచ్చటికి రాళ్ళను శ్రీలంక నుండి తెప్పించి దేవాలయ నిర్మాణము కావించిరట. నిర్మాణమునకు 350 సం॥లు పట్టినదట ఈ దేవాలయ వరండాలు అతి పెద్దవై భారతదేశములోనే గాక ఆసియా ఖండమున కూడ ఇంతపెద్ద వరండాలు లేవని ప్రసిద్ధిపొంది యున్నవి వీటి నిడివి 4,000 అడుగులు

ఇచ్చట స్నానము ప్రత్యేకత సముద్రములోను, సరస్సులలోను, నూతులలోను స్నానము చేయవలసి ఉన్నది యావద్భారత దేశములోని నదులన్నియు ఇచ్చటనున్న నూతుల అడుగుభాగము నుండి ప్రవహించుచున్నట్లు భావన నూతులలోని నీరు తోడుకొని స్నానము చేయుదురు ఈ విధముగా స్నానము చేసిన యావద్భారత దేశ పుణ్యతీర్థములలో స్నానము చేసిన పుణ్యము పొందగలరు దేవాలయ ప్రాంగణమున 22 నూతులును, దేవాలయమునకు బయట గంధమాదన పర్వతమునకు పోవు త్రోవనందు 21 నూతులు కలవు

✓ కాశిలోని పవిత్ర గంగాజలమును తీసుకుని వచ్చి ప్రతిదినము రామేశ్వర లింగమునకు అభిషేకము చేయుదురు. భక్తులు కాశి నుండి తెచ్చిన గంగాజలమును రామేశ్వర సముద్రమున కలిపిన మోక్షప్రాప్తి యని నమ్మిక ఉత్తరమున కాశి వెళ్ళుటకు నిశ్చయించి భక్తులు వెళ్ళకపోయినా ఫరవాలేదు కాని దక్షిణమున రామేశ్వరమునకు వెళ్ళ సంకల్పించి వెళ్ళకపోయిన మహాపాతకము

రామేశ్వరములోని ఇసుకను 3 భాగములు చేసి, 2 భాగములు దాన, దక్షిణలతో సహా రామేశ్వర క్షేత్రముననే సమర్పించి, మిగిలిన మూడవ భాగమును ఉత్తర దేశముననున్న ప్రయాగ క్షేత్రములోని త్రివేణీ సంగమములో కలిపిన పుణ్యప్రాప్తి యని నమ్మిక కలదు

ఈ క్షేత్రము "చార్ ధామ్"లలో నొకటి దేశమునకు దక్షిణ భాగమున ఉన్న దివ్యక్షేత్రము కాశీ రామేశ్వరములు శివునకు సూర్యచంద్రులుగా, రెండు కండ్లుగా భావించబడుచున్నవి కంచి క్షేత్రము శివునకు మూడవ కన్నుగా (అగ్ని గోళముగా) భావించబడుచున్నది

రామేశ్వర ద్వీపములో అక్కడ పండుచున్న కొబ్బరి, తాటి, చింతచెట్లు మాత్రమే ఉండును వ్యవసాయము చేయరాదు నూనె వగైరా పదార్థములను భూమినుండి బయటకు తీయు ప్రయత్నములు చేయరాదు ఇది నిబంధన

✓ 365 రోజులు పవిత్ర గంగాజలముతో మహా వైభవముగా స్వామివారికి అభిషేకము, హారతి జరుగును. ప్రతి శుక్రవారము అమ్మవారిని సర్వ ఆభరణములతో అలంకరించి, బంగారు పల్లకిలో నుంచి ప్రాకారము నందు ఊరేగించెదరు.

శ్రీ కోదండ రామస్వామి, నటరాజ, సేతు మాధవులకు ఆలయములు కలవు సుమారు 4 కి మీ. దూరములో నున్న గంధమాదన పర్వతాగ్రమున శ్రీరామ పాదముద్రలు గలవు ఇవి దర్శనీయములు ఈ క్షేత్రమున స్నానము సర్వ పాపహారము

## నాగేశ్వర లింగము

నాగేశ్వర లింగములు కూడ రెండుచోట్ల కలవు. 1. గుజరాత్‌లోని (సౌరాష్ట్ర దేశము) ద్వారక క్షేత్రమునకు 12 కి.మీ. దూరమున కలదు.

లింగమునకు "నాగేశ్వర" లింగమని పేరు. అమ్మవారు నాగేశ్వరి. ఇచ్చట పురాతన దేవాలయమేమి కనిపించదు. గుడి డాబా మాదిరిగా ఉన్నది. లింగము కొంచెము క్రింది భాగములో నుండుటచే మెట్లపై నుండి క్రిందికి దిగవలయును. బహుశఃపురాతన దేవాలయము ధ్వంసము అయితే మరల గుడి కట్టినారేమే ననిపించును.

దేవాలయము చుట్టును అరణ్య ప్రాంతము. దీనిని దారుకా వనమని పిలుతురు. దగ్గరలో ఊరు లేదు. బస్సు ప్రయాణము. ఈక్షేత్ర దర్శనమున ప్రయాణాలలో సంభవించు ప్రమాదాలను, కారాగార వాస శిక్షయు తప్పించుకొనవచ్చును.

2. ఈ లింగమునకు "హోండా నాగనాధ్" అనిపేరు. అమ్మవారు నాగేశ్వరి. ఈ దేవాలయము మహారాష్ట్రలో హోండా నాగనాధ్ అని పిలువబడే గ్రామమున కలదు. సికిందరాబాద్ నుండి మన్మాడు వెళ్ళు మీటరు గేజ్ రైల్వే లైనులో పర్బని స్టేషన్‌కు సుమారు 50 కి.మీ. దూరమున కలదు. ఇది చాల పురాతన దేవాలయము. ఇచ్చట నంది విగ్రహము ఆలయమునకు వెనుకగా ఉన్నది. లింగము భరించలేనంత తేజోవంతముగా నుండి నీళ్ళలో మునిగి ఉండెడిది. దర్శనమునకు అవకాశము తక్కువ. పాండవాగ్రజుడైన ధర్మరాజు గండకీ నదిలోని ఇసుక ముద్దను లింగముపై పెట్టి, వుగ్రరూపమును తగ్గించి, నీటినుండి బయటకు తీసి, శిలాపీఠముపై పునఃప్రతిష్ఠించెను. ఈ విధముగా శివలింగము రెండవసారి ప్రతిష్ఠించబడి మొదటి చోటు నుండి మార్చబడినది. కాని నంది విగ్రహము మాత్రము కదల్చబడక యధాస్థానముననే నున్నది. ఇచ్చట నీలకంఠ, భండారేశ్వర్, పాండవులకు ఆలయములు గలవు.

పైరెండు క్షేత్రములేగాక ఇంకను రెండు చోట్ల నాగేశ్వర జ్యోతిర్లింగములున్నట్లు క్లెయిమ్ చేయబడుచున్నది. వాటి వివరము తరువాత నీయబడినది.

# విశ్వేశ్వరుడు

"వారణాశ్యంతు విశ్వేశం". కాశీ క్షేత్రము. దీనినే "వారణాసి" అనియు "బెనారస్" అనియు పిలుతురు. ఉత్తరప్రదేశ్‌లో గలదు. ఉత్తర రైల్వేలో మొగల్ సరాయ్ నుండి సహరాన్‌పూర్ లైనులోనున్నది.

పావన గంగానదీ తీరము. వరుణ, అసి నదుల మధ్యభాగము మహ్మదీయు॥లు ముఖ్యముగా మూర్తి విధ్వంసకుడైన ఔరంగజేబు దండయాత్రకు గురి అయిన ఆలయము. ఒరిజినల్ దేవాలయము పూర్తిగా ధ్వంసంచేయబడినది. ఇప్పుడున్నదేవాలయమున నున్నది చిన్నలింగము. దేవాలయ గర్భగుడి విమానము సువర్ణముతో ప్రకాశవంతముగా చేయబడి ఉన్నది.

శివుని త్రిశూలముపై కాశీ నగరమున్నది. మహావిష్ణువు యొక్క "కర్ణ కుండలములు" పడిన చోటు గాన "మణి కర్ణిక" అని పేరు వచ్చినది. ఆర్యజాతికి చెందిన "కాషీ" జాతీయులు 3,000 ల సంవత్సరముల క్రితం నివసించిన చోటు. అందుచేత "కాశి" యని పిలువబడుచున్నది. కృతయుగ, త్రేతాయుగ, ద్వాపర యుగములలోని హరిశ్చంద్రాది మహారాజుల, రామాయణ, భారత, భాగవత ప్రాశస్త్యము గల పట్టణము. మోక్షపురములలో నొకటి. అమ్మవారు విశాలాక్షి. అక్షి త్రయములో నొకటి. అష్టాదశ పీఠములలో నొకటి. మాతా అన్నపూర్ణేశ్వరి దేవాలయము కూడా దగ్గరలో ఉన్నది.

స్వామివారు విశ్వేశ్వరుడు. ఈ లింగము విపరీతమైన ఆకర్షణ గలది. ఇచ్చటకు వచ్చు యాత్రికులు మరణించు వరకు మరలి పోబుద్ధి కాదు కాశీలో చనిపోతే మోక్షం. "కాశ్యంతు మరణాన్ముక్తిః". చనిపోయే వారికి శివుడు ఓంకార మంత్రమును, తారక మంత్రమును ఉపదేశించును. శవదహనములు ఎక్కువ. ఇచ్చటి గంగాజలమును రామేశ్వర క్షేత్రమున నున్న రామలింగేశ్వర లింగమునకు అభిషేక జలముగా నుపయోగింతురు.

కాశీ నగరమున కాలభైరవుడు శునక వాహనుడై గస్తీ తిరుగుచుండునని ప్రతీతి. ఈ నగరము బ్రహ్మ సృష్టి కాకపోవుటచే బ్రహ్మ ప్రళయమున నశించదు. గంగానది తీరమున కాశీ క్షేత్రమున ఉన్న 64 స్నానఘట్టములు చాల పవిత్రమైనవిగా ప్రసిద్ధినొంది యున్నవి. వీటిలో ముఖ్యమైనవి. 1. అసీ ఘాట్ 2. దశాశ్వమేధ ఘాట్ 3. వర్ణ సంగమ్ 4 పంచగంగా 5. మణి కర్ణిక 6. హరిశ్చంద్ర ఘాట్‌లు. ఈ క్షేత్రమున స్వామివారు పూజారి లేకుండా పూజింపబడుదురు ఇచ్చట శాఖ, ఫల వర్జిత ప్రమాణము ఆరోగ్యకరము. ఈ దివ్య క్షేత్రమున 59 శివ లింగములు, 12 సూర్య నారాయణ మూర్తులు, 56 వినాయకులు, 8 భైరవులు, 9 దుర్గా మాతలు, 13 నరసింహులు, 16 కేశవాలయములు గలవు. వీరిలో బిందు మాధవుడు, డుండి విఘ్నేశ్వరుడు, దండి పాణేశ్వరుడు ప్రముఖమైనవి

## త్రయంబకేశ్వరుడు

ఈ క్షేత్రము మహారాష్ట్రమున త్రయంబకమనుచోట బ్రహ్మగిరి కొండ దిగువన కుషావర్త తీర్ధమను సరస్సు ప్రక్కన కలదు. బ్రహ్మగిరి కొండ గోదావరి పుట్టిన చోటు. చిన్న సరస్సువంటి గొయ్యిలో కొండ పైభాగము నుండి కారు నీటి చుక్కలతో గోదావరి పుట్టినది. సుమారు 1,000 మెట్లు కలవు, డోలీల సౌకర్యము కలదు.

త్రయంబకేశ్వరుడు నిరాకారుడని చెప్పుదురు, అమ్మవారు త్రయంబకేశ్వరి 7 కి మీ, దూరములో అంజనా పర్వతమున్నది. హనుమంతుడు పుట్టినచోటు. దగ్గరలోని నాసిక్‌లో ప్రతి 12 సంవత్సరములకు కుంభమేళ జరుగును. 30 కి మీ. నాసిక్ . పితృ దేవతలకు కుషావర్త తీర్థము నందు పిండ ప్రధానములు చేయుదురు. మృత వ్యక్తుల అస్తికలను నిమజ్జనం కావించెదరు

శివుడు బ్రహ్మ హత్యా దోషము నుండి విముక్తుడైన ప్రదేశము. కుషావర్తమని పిలువబడే సరస్సునుండి గోదావరి నది ప్రయాణము సాగించుచున్నది. ఇందు స్నానము చేసి త్రయంబకేశ్వరుని సేవించి భక్తులు ధన్యులగుచున్నారు. నాసిక్ వద్ద గోదావరి నిండుగా ప్రవహించుచున్నది.

ఈ క్షేత్రములోని స్నానము, స్వామివారి దర్శనము బ్రహ్మ హత్యా దోషనివారణము ఈ క్షేత్ర దర్శనమున సంఘములో పలుకుబడి హెచ్చునట్లుగను, ఉన్నత పదవి లభించు అవకాశములు మెరుగుగనున్నట్లు భావింతురు

## కేదారేశ్వరుడు

కేదార్‌నాథ్ క్షేత్రము ఉత్తర ప్రదేశ్ నందు కలదు. ఋషికేశ్ నుండి 250 కి.మీ. బస్సు ప్రయాణము. గౌరీ కుండ్ నుండి 5 కి.మీ. దూరము. గౌరీ కుండ్‌లోని వేడినీటి ఊటలలో స్నానము చేసి బయలు దేరవలయును. సోన ప్రయాగ నుండి గౌరీ కుండ్ వరకు బస్సు మార్గము ఏర్పడినది. గౌరీకుండ్ నుండి కేదార్‌నాథ్ క్షేత్రమునకు కాలినడకన గాని, గుర్రముల మీద కాని, కండీలలో కాని, డోలీలో కాని చేరవచ్చును.

పావన మందాకినీ తీరము, సుమేరు పర్వతములనబడే హిమాలయములలో 11,500 ల అడుగుల ఎత్తున కలదు మే నుండి అక్టోబర్ వరకు అనగా ఆరు మాసములు మాత్రమే దేవాలయము భక్తుల దర్శనార్థం తెరచి ఉండును. మిగిలిన ఆరు మాసములు మంచుతో కప్పబడి అతి శీతలముగా ఉండుటచే ఆలయం మూతబడి ఉండును ఆలయమును మూసే ముందు జ్యోతిని వెలిగించెదరు. ఆరు మాసముల తరువాత ఈ దేవాలయము తెరుచునప్పటికి ఈ జ్యోతి ప్రజ్వరిల్లుచునే ఉండును. ఇది చాల విశేషము.

లింగము పెద్ద బండరాయి ఆకారములో ఉండును. మహిషము నిద్రపోవుచున్నట్లు కన్పించును. లింగమునకు అలంకారముగా బంగారు వన్నెకల గుడ్డను కప్పి, వెండితో పాము వగైరా అలంకరణలు చేసి ఆకర్షణీయముగా కన్పించునటుల చేయుదురు మహిష రూపధారియగు శివభగవానుని గుర్తించి పాండవులు తోకను పట్టుకొనిరనియు, మహిషము తప్పించుకొన పోవ ముందు అర్ధభాగము నేపాల్‌లోని పశుపతి నాధ్ క్షేత్రమందును, పృచ్ఛభాగము (తోకభాగము) కేదార క్షేత్రమందును పడినదని పురాణగాధ అమ్మవారు కేదార గౌరి.

దేవాలయమునందు పాండవుల విగ్రహములతో బాటు ద్రౌపది, కుంతి విగ్రహములున్నవి, ధర్మరాజు, కుక్క తప్ప మిగతావారందరు అంతిమ శ్వాస విడచిన ప్రదేశము. దేవాలయము వెనుక భాగమున ధర్మరాజు, కుక్క స్వర్గమునకు వెళ్ళినట్లుగా అడుగుజాడలున్నవి

కేదార క్షేత్రమందలి నీరును త్రాగి స్వామివారిని సేవించిన మోక్షప్రాప్తి కలుగును ఆది శంకరాచార్యుల వారు సిద్ధి పొందిన స్థలము. మందాకినీ నదీ తీరమున వారి సమాధి కలదు.

కేదార్ క్షేత్రమున పెద్దలకు పిండ ప్రదానములు, పితృ తర్పణములు మొదలైన శాస్త్రీయ విధులను నిర్వర్తించి, కృతకృత్యులగు చున్నారు. ఆలయము మూసి ఉన్న ఆరు మాసముల కాలములో 55 కి.మీ. దూరములో ఉన్న ఊఖీ మఠమునందు స్వామివారిని పూజింతురు.

## ఘుష్ణేశ్వర లింగము

ఈ లింగము మహారాష్ట్రలోని వేరుల్ గ్రామములో నున్నది. ఎల్లోరా గుహలకు 2కి.మీ. దూరములో ఈ గ్రామము కలదు ఔరంగాబాద్ నుండి 30 కి.మీ దూరములో ఎల్లోరా గుహలు కలవు.

విష్ణుమూర్తిచే ప్రతిష్ఠించబడిన లింగము ఈ దేవాలయము చాల పెద్దది. ఎరుపు రంగు కల రాళ్ళతో కట్టబడినది. ఈ లింగమును పూజించిన వారికి పుత్రశోకము కలుగదు

సదర్శునుడను వానికి సుదేహయను భార్య కలదు. పుత్ర సంతానము లేకపోవుటచే సుదేహ తన తోబుట్టువైన ఘుష్మను భర్తను ఒప్పించి వివాహము చేసెను ఘుష్మ చాల శివ భక్తురాలు. ప్రతిదినము 101 పార్థివ లింగములను పూజించి, ఆ లింగములను సరస్సు నందు కలిపెడిది. శివానుగ్రహమున ఈమెకు కుమారుడు జన్మించెను. బాలుడు దినదిన ప్రవర్థమానుడగుట గాంచి పెదతల్లి అయిన సుదేహ అసూయతో బాలుని చంపి శరీరమును ఖండములు చేసి, సరస్సునందు పారవైచినది ఘుష్మ తన దినచర్యలో భాగముగా

ఉదయముననే మట్టితో 101 పార్థివ లింగములను తయారుచేసి, పూజించి సరస్సునందు కలుపు సమయమున పరమేశ్వరుడు అనుగ్రహించి, చనిపోయిన కుమారుని బ్రతికించి, ఘుష్మముందు ప్రత్యక్షమై వరము కోరుకొనమనెను చనిపోయిన తన పుత్రుడు బ్రతికి వచ్చినందునను, తన అక్కగారు ప్రేమతో తనకు దగ్గరుండి వివాహము జరిపించుట చేతను, ఆమె యందలి అనురాగము చేతను ఆమెను క్షమించమని కోరుకొనెను. శివుడు ప్రసన్నుడై ఈ క్షేత్రమున తాను ఘుష్ణేశ్వర లింగముగా వెలతుననియు, తనను పూజించిన వారికి పుత్రశోకము కలుగదనియు అభయమిచ్చెను. అమ్మవారు ఘష్ణేశ్వరి

దశావతారములు విష్ణు మూర్తి ధర్మసంస్థాపనార్థము ఎత్తినట్లే, శివుడు ద్వాదశ లింగరూపుడై దుష్టశిక్షణ, భక్త రక్షణ చేసినట్లు కనిపించుచున్నది.

## ద్వాదశ జ్యోతిర్లింగములుగా క్లెయిమ్ చేయబడుతున్న ఇతర లింగములు

√ 1. గోకర్ణేశ్వర: గోకర్ణ క్షేత్రం కర్నాటక

200 కి మీ ఉడిపి స్వామివారు · మహాగోకర్ణేశ్వరుడు

అమ్మవారు . తామ్రగౌరి.

రావణుని ఆత్మలింగము విఘ్నేశ్వరుని మూలకముగా భూస్థాపితమైన పవిత్ర ప్రదేశము ఆది శంకరాచార్యుల వారు కొంత కాలముండి పూజించిన దివ్య క్షేత్రము. అరేబియా సముద్రతీరం

2. జోగేశ్వర: ఉత్తర ప్రదేశ్ ఖటేర్ మల్‌కు 44 కి.మీ.దూరములోను, అల్‌మోరాకు 90కి.మీ దూరములో జోగేశ్వర అనుచోట వెలసిన నాగేశ్వర లింగము. స్వామివారు · నాగేశ్వర మహాదేవ. అమ్మవారు పుష్టీదేవి. ఈ క్షేత్ర మహాత్యము స్కంధ పురాణములో ప్రస్తావించబడినది. ఉత్తర ప్రదేశ్ ప్రభుత్వము దీనిని జ్యోతిర్లింగముగా ప్రకటించుచున్నది

3. జ్యోతిబా : మహారాష్ట్రలోని కొల్హాపూర్ నకు 20కి.మీ.దూరములో వెలసిన దివ్యక్షేత్రము "జ్యోతిర్లింగ జీ"అని బోర్డు కూడా పెట్టి ఈ ఆలయమును పిలుస్తున్నారు. బ్రహ్మ , విష్ణు, మహేశ్వరులు ఒకే గర్భగుడిలొ లింగరూపమున వెలసిన దివ్య క్షేత్రము.

4. వాసుకీ నాథ్ లేక నాగనాథ్ · బీహారు రాష్ట్రములోని వైద్యనాథ ధామ్‌నకు 75కి మీ దూరములో ఉన్నటువంటి "ధుంకా" క్షేత్రమున వెలసిన లింగము దారుక అను పదము కాలక్రమేళా ధుంకా అయినదని చెప్పెదరు. దీనిని నాగేశ్వర లింగమని కూడా పిలుతురు జ్యోతిర్లింగముగ క్లెయిమ్‌చేయబడుతున్న మూడవ నాగేశ్వరలింగమిది.

**5.** భీమేశ్వరుడు  ఆంధ్రప్రదేశ్‌లోని తూర్పు గోదావరి జిల్లాలో ద్రాక్షారామ క్షేత్రమున వెలసిన భీమశంకర లింగము ఇది పంచారామములలో నొకటిగా పరిగ ణింపబడుచున్నను జ్యోతిర్లింగముగా క్లెయిమ్ చేయబడుచున్నది చాలా ఎత్తైన, పొడవైన లింగము. రెండవ అంతస్తు నుండి దర్శనము

**6** భీమశంకర లింగము  అస్సాంలోని గౌహతి లో బ్రహ్మపుర పర్వతముపై వెలసిన దివ్య క్షేత్రము రాజుగారి ప్రార్థన నంగీకరించి దట్టమైన ఢాకినీ వనములో విచ్చల విడిగా విహరిస్తున్న దారుకుడనే రాక్షసుని శివుడు సంహరించి లింగరూపమున వెలసిన దివ్యక్షేత్రము. ఈ క్షేత్రము శివపురాణములో ప్రస్తావించబడినది..

**7** భీమశంకర లింగం : ఉత్తర ప్రదేశ్‌లోని నైనితాల్ జిల్లాలో ఉజ్జనక్ అను గ్రామములో వెలసిన భీమశంకర మహదేవుని మందిరము ఈ ప్రాంతానికి పూర్వం శివ పురాణములో ప్రస్తావించబడిన ఢాకినీ వనముని పేరు ఈ క్షేత్రము నైనితాల్‌కు 20 కి.మీ. దూరములో గలదు. ఈ లింగము చాలా లావైన ఎత్తైనది రెండంతస్తుల నుండి దర్శనము. కురు పాండవులకు ద్రోణాచార్యుడు విలువిద్యను నేర్పిన ప్రదేశము. 108 శివలింగములు గల పుణ్య క్షేత్రము.

**8** అమరనాథ్ : జమ్ము & కాశ్మీర్ నగర్ నుండి పహలీ గామ్‌కు, చందన్ వాడీకి, శేషనాగ్‌కి, పంచతరణికి వెళ్ళి లిడ్డర్ లోయలో నున్న అమర్ గంగా నదీ తీరాన వెలసిన గుహాలయములో నున్న మంచులింగము దర్శించాలి. అమ్మవారు అమరనాథేశ్వరి.

**9.** పశుపతి నాథ్ : నేపాల్ దేశములోని ఖాట్మండు నగరమున వెలసిన పశుపతి నాథ్ శివలింగము. భాగామతి నదీ తీరమున ఉన్నది మహిష రూపధారుడైన శివుని ముఖభాగము పడిన ప్రదేశము. అమ్మవారు గుహ్యేశ్వరి దేవి

**10.** వైద్యనాథ్ : మహారాష్ట్రలోని నాండెడ్‌కు 20 కి.మీ. దూరములో గంగాఖేడ్ అను పుణ్యక్షేత్రమున వెలసిన వైద్యనాథ్ లింగము. దీనిని కూడ జ్యోతిర్లింగముగా క్లెయిమ్ చేయుట జరుగుచున్నది.

**11.** వైద్యనాథ్ : పంజాబ్ రాష్ట్రములో కీరగ్రామములో వెలసియున్నది.

**12.** చంద్రనాథ్ . బంగ్లాదేశ్ : బంగ్లాదేశ్ (ఈస్ట్‌బెంగాల్) లో చిట్టగాంగ్‌కు 60° లు కి.మీ. దూరములో నున్న పర్వతముపై వెలసియున్నది. ఈ ప్రాంతమును సీతాకుండ్ ప్రదేశమని కూడా పిలుస్తారు ఈ లింగమును దేవీ పురాణమందలి చైత్రమాస మహాత్మ్యము ననుసరించి త్రయోదశ జ్యోతిర్లింగముగా పరిగణింపవలసియున్నది

**13.** కైలాస నాథ్ : మహారాష్ట్రములోని ఎల్లోరా గుహలలో 16 వ నెం గుహలో ఏకరాతిలో చెక్కబడినటువంటి కైలాస్‌నాథ్ లింగము ఈ క్షేత్రము జ్యోతిర్లింగ క్షేత్రముగా పరిగణింపబడుచున్నది

**14. వైద్యనాథ్ :** హిమాచల ప్రదేశ్‌లో నగరోటా నుండి 33 కి.మీ. దూరములో వెలసియున్నది. కాంగ్రా జిల్లాలోని పాలంపూర్‌కు 16 కి.మీ. దూరములోను, ధర్మశాలకు 40 కి మీ దూరములోను, పఠాన్ కోటకు 115 కి.మీ. దూరములోను ఉన్నది. హిమాచల ప్రదేశ్ ప్రభుత్వము ఈ లింగమును జ్యోతిర్లింగముగా ప్రకటించుచున్నది.

**15.** బాల బ్రహ్మేశ్వర లింగం ఆంధ్రప్రదేశ్‌లోని మహబూబ్‌నగర్ జిల్లాలో వెలసిన అలంపురం దివ్య క్షేత్రం. జోగుళాంబ ఆలయంలో వేంచేసి యున్న బాల బ్రహ్మేశ్వర లింగము కూడా జ్యోతిర్లింగముగా భావించబడుచున్నది అమ్మవారు జోగుళాంబ. అష్టాదశ మహాశక్తి పీఠములలో నొకటి.

# శక్తిత్రయం (3)

# నిరాకార ఆదిశక్తి

కోటిసూర్య కాంతితో, వేలాది పద్మాల వికసిత
సౌందర్యముతో, సూర్య, చంద్రులను కండ్లుగా,
పచ్చటి పంటనేలను అంచుగా కలిగి,
నక్షత్రాలతో శోభిల్లిన దుస్తులు ధరించి,
అస్తమిస్తున్న సూర్యుని అరుణ వర్ణముతో
కూడిన పసుపు పచ్చని వన్నెతో, కళ్ళు మిరుమిట్లు
గొలిపే తేజోమూర్తి.
హంసవలె, మంచు వలె తెల్లగా,
ఎర్రటి ఉగ్ర రూపిణియైన నాలుకతో,
బిడ్డలకు పాలిస్తూ లాలిస్తున్న తల్లిగా,
అతిలోక సుందర రూపంతో త్రిపుర సుందరిగా,
పుర్రెల మాలతో మృత్యుభయంకర రూప కాళిగా,
సింహాసన మలంకరించి ఆశీనురాలై ఉన్న వైష్ణవిగా,
అతి పవిత్ర నిష్కళిత బ్రహ్మచారిణియైన కన్యగా,
దుష్ట సంహరణార్థము, లోక కళ్యాణార్థము ఏదో ఒక ప్రత్యేక రూపములో
ఆవిర్భవించు నిరాకార ఆదిశక్తి

## 1. మహాలక్ష్మి

కొల్హాపూర్ (మహారాష్ట్ర) నందు కలదు షోలాపూర్ నుండి బస్సు మరియు ట్రైన్ కలవు పూనా నుండి గోవాకు వెళ్ళు మార్గము నందు ఉన్నది 125 కి.మీ రత్నగిరి 18 కి మీ పన్హాల

ఇక్కడ ఉన్న మహాలక్ష్మి అమ్మవారిని భవాని అందురు కరవీరవాసిని, అమలాదేవి అని కూడా పేర్లు గలవు. మహా సరస్వతి, మహాకాళి విగ్రహములు కలవు అతి ఖరీదైన ఆభరణములు కల పసుపుపచ్చ రంగు గల దేవత ముఖము నలుపు రంగు వెనుకనున్న ఆసనము వెండితో చేయబడినది. అష్టాదశ పీఠములలో నొకటి. రాతి శ్రీచక్రము ప్రత్యేక గదిలో ప్రతిష్ఠించబడి పూజలందు కొనుచున్నది అమ్మవారికి బంగారు పాదుకలు ఉన్నవి.

20 కి.మీ. దూరములో స్వామివారి దేవాలయము కలదు స్వామివారిని జ్యోతిబా అని పిలుతురు. బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు లింగరూపమున వెలసిరి.

## 2. మహాకాళి

మధ్య ప్రదేశ్‌లోని ఉజ్జయిని నగరమున కలదు. ఇండోర్ నుండి 55 కి.మీ దూరము. ఈ క్షేత్రమును "అవంతిక" యని పిలిచెదరు షిప్రానదీ తీరము

అష్టాదశ పీఠములలో నొకటి. అమ్మవారి "మోచేయి" పడినచోటు సప్త మోక్ష పురములలో నొకటి. దేవాలయము గ్రామ మధ్యలో నున్నది కొంచెము క్రిందుగా కట్టబడి ఉన్నది మెట్లమీదుగా దిగి వెళ్ళవలయును.

స్వామివారు మహాకాళేశ్వరుడు. లింగమునకు కండ్లు కలవు. ఇత్తడితో అలంకరింపబడిన సర్పము కలదు. మహాకాళేశ్వర లింగమును తాకుటకు భయము కలుగును. ద్వాదశ జ్యోతిర్లింగములలో నొకటి.

ఈ క్షేత్రము పృథ్వి దేవతకు నాభి స్థానముగా చెప్పబడుచున్నది. జ్యోతిష, గణిత శాస్త్రజ్ఞులు దేశాంతర శూన్యరేఖ ఇక్కడి నుండి ప్రారంభమగుచున్నట్లు తలంచెదరు.

దేవీ పీఠమున శ్రీ చక్రము స్థాపించబడి యున్నది. 12 సంవత్సరముల కొకసారి కుంభమేళ జరుగును. 6 సంవత్సరముల కొకసారి అర్ధ కుంభమేళ జరుగును. ఇచ్చట అమ్మవారిని ఆరాధించియే కాళిదాసు మహాకవి అయ్యెను.

## 3. మహాసరస్వతి

ఆంధ్రప్రదేశ్ నందు గల అదిలాబాద్ జిల్లాలో బాసర క్షేత్రమున కలదు సికిందరాబాద్ స్టేషను నుండి బాసరకు మీటర్ గేజ్ రైలు మార్గము కలదు 273 కి మీ నిజామాబాద్ నుండి బస్సు కలదు

అమ్మవారి పేరు జ్ఞాన సరస్వతి గోదావరి నదీ తీరము మంజీరా నది గోదావరిలో కలిసే సంగమ స్థానానికి దగ్గర వ్యాసమహర్షి, శుక దేవుడు ఇచ్చట చాలా కాలమున్నారట అందుచే ఈ ప్రాంతమునకు వ్యాసపురి అని పేరు అది రానురాను వాసర్ అనియు క్రమముగా బాసర అనియు నామాంతరమొందినది.

బాసర దగ్గర ఉన్న కొండమీద రాళ్ళను చదువుల బండలందురు. ఆ బండలపై చెవి ఆనించిన వేద ఘోష వినిపించును

దేవాలయ పైభాగమున మహాకాళి విగ్రహము క్రింది భాగాన మహాలక్ష్మి విగ్రహములున్నవి. ప్రక్కన ఉన్న కొలను నానుకొని వాల్మీకి మహర్షి దేవాలయమున్నది

సరస్వతీ దేవి ఆలయములు గల ఇతర క్షేత్రములు.

1. శృంగేరి . శారదా పీఠము. సువర్ణ శారదాదేవి. కర్నాటక
2 సూరత్ : గుజరాత్, తెల్లటి పాలరాతి విగ్రహము
3 బికనీర్ · రాజస్తాన్, ఇచ్చట గల కోటలో ఎరుపు రంగు కలిగి పసుపు పచ్చ ఛాయతో వెలసిన అమ్మవారు గలదు.
4 పుష్కర్ : రాజస్తాన్ 11 కి.మీ అజ్మీర్. బ్రహ్మ సరోవర తీరము. ఇచ్చట అమ్మవారు గాయత్రీ నామమున వెలసి యున్నారు
5 కూత్తనూర్ : తమిళనాడు, తంజావూరు జిల్లా. నన్నిలం తాలూకా. అరసిలార్ నదీ గట్టుపై నున్న ఆలయం. మైలాడు దుర్రై-తిరువారూర్ బస్సు మార్గములో.
6 పూందోట్టం . తమిళనాడు. సరస్వతీ అమ్మవారి చక్కటి విగ్రహం కలదు
7. పిలాని : రాజస్తాన్ OASIS IN THE DESERT గా పేరగాంచిన శారదాదేవి ఆలయం. అతి సుందర సున్నిత పాలరాతి కట్టడము.

# అక్షిత్రయం (3)

## 1. మీనాక్షి

అక్షిత్రయములో నొకరు. తమిళనాడులోని మధురై నగరములో నున్నది చేపల వంటి కళ్ళు కల అమ్మవారు కాబట్టి "మీనాక్షి" అని పేరు వచ్చినది. అంతేగాక చేపవలె నిద్రించుచూ కూడ కనులు మూయక తన భక్తులను సర్వవేళల కాపాడునన్న నమ్మకము గల భక్తులకు "మీనాక్షి" అయినది. భుజము మీద రామచిలుక గల వయ్యారమూర్తి, రాచకన్య. స్వామివారు సుందరేశ్వరుడు.

నాలుగు వైపుల నాలుగు గోపురములు కలిగి, అమ్మవారికి ఎదురుగా ఐదవ గోపురమున్న పెద్ద దేవాలయము. ప్రతి సోమవారము అమ్మవారిని వజ్రకిరీటముతో అలంకరింతురు. ప్రతినెల మొదటి రోజున బంగారు రథోత్సవము జరుగుచుండును. దేవాలయము చాల సుందరముగా నిర్మించబడియున్నది. అష్టలక్ష్మి మండపము కలదు. "ముక్కరుని పిళ్ళయార్" అని పిలువబడే వినాయకుని విగ్రహము కలదు. దేవాలయము వైఘూనదికి దగ్గరలో నున్నది. ఇచ్చట కదంబవనం ఉండెడిదట. తొలుదొల్త సుందరేశ్వర లింగం ఉద్భవించినదట. పాండ్యరాజైన మలయ ధ్వజుడు గుడి కట్టించెను.

## 2. కామాక్షి

తమిళనాడులోని కంచి క్షేత్రములో వేంచేసియున్నారు. మద్రాసుకు 70 కి.మీ. దూరము. తిరుపతి నుండి సరాసరి బస్సులు కలవు.

అమ్మవారి కంకాళము పడినచోటు. అష్టాదశ పీఠములలో నొకటి మోక్షపురములలోనొకటి. శ్రీ మహావిష్ణువు సమక్షంలో పరమశివుని ప్రార్థించి ప్రసన్నుని చేసుకున్న స్థలము. సంతాన ప్రధాయినిగా పేరుగాంచినది. ఆది శంకరాచార్యులవారు ఈ దేవాలయమున శ్రీ చక్రము ప్రతిష్ఠించినారు. ఈ దేవాలయము మూడు గోపురములతో విశాలమైనది.

అమ్మవారు మొట్టమొదట బంగారు విగ్రహ రూపమున ఉండి బంగారు కామాక్షి అని పేరు పొందినారు. మహ్మదీయుల దండయాత్రలో బంగారు విగ్రహము తీసుకుని పోబడినది.

ఈ దేవాలయ ప్రాంగణములో పెద్ద పురాతన మామిడిచెట్టు కలదు ఈ మామిడి చెట్టు క్రింద అమ్మవారు తపస్సుచేసి స్వామివారిని ప్రసన్నుని చేసుకున్నట్లు కధ కలదు. మామిడి చెట్టుకు ప్రతి ఆకు వేరుగను, ప్రతి పండు భిన్న రుచులతో నుండుట ప్రత్యేకత.

స్వామివారు ఏకాంబరేశ్వరుడు పంచభూత లింగములలోని పృధ్వి లింగము ఈ క్షేత్రమునగల వరద రాజ స్వామివారి గర్భగుడి వెనుక భాగములో బంగారు, వెండి బల్లులు, సూర్యచంద్ర బింబములు గలవు 108 శివాలయములు, 78 శ్రీ వైష్ణవ దేవాలయములు పురాణ ప్రసిద్ధిచెందిన మూడు 'విష్ణాలయములు, దుర్గాలయములు, గణపతి గుడులు గలవు. శ్రీ కామాక్షి అమ్మవారి దేవస్థానము ఆదికాల పరమేశ్వరీ దేవి స్థానముగా పరిగణింతురు

## 3.విశాలాక్షి

ఈ క్షేత్రము ఉత్తరప్రదేశ్‌లోని కాశీ నందు గలదు. గంగా తీరము మోక్ష పురములలో నొకటి. రామాయణ, భారత ప్రాముఖ్యత గల పురాతన నగరము అమ్మవారు విశాలాక్షి

స్వామివారు విశ్వేశ్వరుడు. ద్వాదశ జ్యోతిర్లింగములలో నొకరు మాతా అన్నపూర్ణేశ్వరి దేవాలయము విశాలాక్షి దేవాలయము దగ్గరలో కలదు. కాశీ నగరము శివుని త్రిశూలముపై నిలచి ఉన్నట్లు ప్రతీతి కాలభైరవుడు శునక వాహనుడై గస్తీ తిరుగుచుండునని వాడుక. ఈ నగరము బ్రహ్మ సృష్టి కాకపోవుటచే ప్రళయ సమయమందు నశింపదు. భక్తులు ఈ క్షేత్రమును దర్శించి, పవిత్ర గంగా స్నానమొనరించి, స్వామివారిని, అమ్మవారిని దర్శించి శాఖ, ఫల వర్జనము కావించెదరు. ఇచ్చట చనిపోవు జీవులకు శివుడు ఓంకార మంత్రము, తారక మంత్రమును ఉపదేశించును ఇచ్చట సతీదేవి వామహస్తం పడినచోటు,శక్తి పీఠము

# అంబా త్రయం (3)

## 1. మూకాంబిక

ఈ అమ్మవారు కర్నాటక రాష్ట్రములోని సహ్యాద్రి పర్వత శ్రేణిలో పశ్చిమ కనుమలలో కొల్లూరు గ్రామమున వేంచేసి యున్నారు. ఈ క్షేత్రమునకు షిమోగ నుండి బస్సులు కలవు. కుందాపూర్ 40 కి.మీ మంగుళూరు 147 కి.మీ. దూరమున కలవు.

సౌపర్ణిక నదీ తీరము అమ్మవారు దుర్గ, మహాలక్ష్మి అవతారము ఆది శంకరాచార్యులవారి ప్రతిష్ఠ. అమ్మవారు శంకరాచార్యుల వారిముందు ప్రత్యక్షమైనట్లు కథ. అమ్మవారు శంఖ, చక్రధారిణి, చతుర్భుజి.

మూకాసురుడను రాక్షసుని చంపినచోటు. ఇచ్చట శ్రీ చక్రము స్థాపించబడి ఉన్నది. పంచముఖ గణపతికి, విష్ణుమూర్తికి శివలింగము వలె పానమట్టము లుండుట ప్రత్యేకత.

శ్రీ కృష్ణ దేవరాయలిచ్చిన అతిపెద్ద పచ్చల పతకము కలదు మాజీ మద్రాసు ముఖ్యమంత్రి అయిన ఎమ్ జి రామచంద్రన్ ఇచ్చిన వెండితొడుగు గల బంగారు ఖడ్గము కలదు అమ్మవారు అంబాత్రయములో ఒకరు

## 2. జ్ఞాన ప్రసూనాంబ

ఆంధ్రప్రదేశ్‌లోని చిత్తూరు జిల్లాలో శ్రీకాళహస్తి క్షేత్రమున గల అమ్మవారు. తిరుపతి నుండి 32 కి.మీ. దూరము. సువర్ణముఖీ నదీ తీరము "దక్షిణ కాశి" యని పేరు చాల పెద్ద దేవాలయము. దేవాలయ పైకప్పు భాగము రంగులతో కళాత్మకముగా చిత్రించబడినది.

స్వామివారు శ్రీకాళ హస్తీశ్వరుడు. సాలెపురుగునకు, పామునకు, ఏనుగునకు ముక్తి నొసంగిన మహాక్షేత్రము భక్త కన్నప్ప భక్తిని పరీక్షించి ముక్తినొసంగిన దివ్య క్షేత్రము శ్రీ ఆదిశంకరాచార్యులవారు ఈ క్షేత్రమున కూడ శ్రీ చక్రమును స్థాపించియున్నారు. సతీదేవి "కుడిభుజం" పడిన చోటుగా చెప్పబడుచున్నది. శక్తి పీఠము.

## 3. భ్రమరాంబ

ఆంధ్రప్రదేశ్‌లో నున్న శ్రీశైల క్షేత్రమున వేంచేసి యున్న అమ్మవారు. డోర్నాల నుండి 51 కి.మీ ఘాట్ రోడ్డు మీద ప్రయాణము

అమ్మవారి "మెడ" భాగము పడినచోటు. అష్టాదశ పీఠములలో నొకటి. అష్టాదశ పీఠముల స్థలములను తెలుపు బోర్డు దేవాలయం ముందు ఉంచిరి. కృతయుగమున హిరణ్యకశిపుడు, త్రేతాయుగమున శ్రీరామచంద్రుడు, ద్వాపర యుగమున పాండవులు ప్రార్థించినందువలన ఈ దేవాలయ ప్రాచీనత అర్థమగుచున్నది. పాండవులు ప్రతిష్ఠించిన శివలింగములు కలవు. భ్రమరాంబ ఆలయమునకు ఎడమ భాగమున పార్వతీదేవి ఆలయమున్నది.

స్వామివారు మల్లికార్జున స్వామి, ద్వాదశ జ్యోతిర్లింగములలో నొకరు శివరాత్రికి భ్రమరాంబ దేవితోను, సంక్రాంతికి పార్వతీ దేవితోను కళ్యాణోత్సవములు జరుగును. సంవత్సరమునకు రెండు కళ్యాణములు జరుగు శైవ క్షేత్రమిది ఇది ప్రత్యేకత.

ఛత్రపతి శివాజీ ప్రార్థించిన దేవాలయము. శ్రీ కృష్ణ దేవరాయలు, ఛత్రపతి శివాజీ అమ్మవారికి చాల ఆభరణములను ఇచ్చియున్నారు.

అరుణాసురుడనే రాక్షసుని అమ్మవారు భ్రమర రూపము ధరించి సంహరించినందున "భ్రమరాంబ" అని పేరు వచ్చినది.

ఈమె కన్నడ రాజకుమారి. శివుడు కలలో కనబడి భ్రమరము వాలినచోట వేచి ఉండమని ఆదేశించడం, భ్రమరం మల్లెపొదపై వాలడం జరిగినది శివుడు మల్లెపొదలో నుండుటచే మల్లికార్జున స్వామిగా పిలువబడుచున్నారు అమ్మవారికి మాధవి యని, సర్వమంగళా దేవియని పేర్లు గలవు

# శ్రీ అష్టాదశ మహాశక్తి పీఠములు

**1. లంకాయాం శాంకరి దేవి :** దీని ప్రకారముగా లంకలో శాంకరీదేవి ఉన్నట్లుగా అర్థమగుచున్నది. నేడు శ్రీలంకగా పిలువబడుచున్న లంకలో శాంకరి వెలసియుండాలి. లేదా మనదేశములోని నదీ మధ్యమలో వెలసిన లంకగా పిలువబడే చిన్న భూభాగములో శంకరుని భార్య పార్వతి అంశతో వెలసిన అమ్మవారు అయి వుండాలి.

శ్రీలంకలో శాంకరిదేవి ఆలయం కనిపించుట లేదు. శ్రీలంకను రామాయణకాలపు రావణాసురుని లంకగా భావించిన, మహాలక్ష్మి అంశ అయిన సీతాదేవిని రావణాసురుడు చెరపట్టి తీసుకుని వచ్చిన వెంటనే పార్వతీదేవి రావణునిపై అలిగి లంకను విడిచిపోయినట్లు పురాణగాథ ఉన్నది. ఇక ఈనాటి శ్రీలంకనే ఒక్కసారి శోధిస్తే ఎక్కడా శాంకరి దేవి ఆలయం కనిపించుట లేదు ఎందుచేతననగా ఈ లంకను మొదట్లో అరబ్బులు తరువాత పోర్చుగీసువారు, డచ్చివారు, ఇంగ్లీషువారు స్వాధీనము చేసుకునియుండిరి. ఫలితముగా పురాతన హిందూ దేవాలయములు నాశనము గావించబడి చర్చీలు కట్టబడినవి. తరువాత బౌద్ధమతం అశోకుని కుమార్తె అయిన సంఘమిత్ర ద్వారాను మహేంద్ర రాకుమారుని ద్వారాను ఇంకా ఇతర బౌద్ధ సన్యాసుల ద్వారాను వెల్లివిరిసినది. అందుచేతను గుహలు, విహారములు ఏర్పడినవి. వీటికి తోడు ప్రకృతి భీభత్సముల మూలకముగా కూడా అతి పురాతన దేవాలయములన్నియు శ్రీలంకలో నేలపాలైనవి. రావణాలయము పోర్చుగీసువారివల్ల ధ్వంసము కావించబడినది దక్షిణ భారత సాంప్రదాయములకు ఆలవాలమైన జఫ్నా ప్రాంతములో నాగపోషరి అమ్మవారు, తిరుకోటేశ్వర స్వామివారి ఆలయములు కనిపించుచున్నవి ట్రింకోమలి ప్రాంతములో శాంకరి దేవి ఆలయం ఉండవచ్చునని ఊహాగానం కానీ ఇచ్చట ఇప్పుడు శాంకరిదేవి ఆలయము లేదు. విష్ణుమూర్తి ఆలయం, ఇతర హిందూ ఆలయములు మాత్రమే ఉన్నవి ఇవికూడా పురాతన కట్టడములు కావు.

మన దేశములోని నదీ గర్భమున నున్న లంకలలో ఎచ్చటా శాంకరీదేవి నామధేయము కనిపించదు. అచ్చటచ్చట నున్న శివాలయములలోని పార్వతీ అమ్మవారిని అష్టాదశ మహాశక్తి పీఠములలో నొకదానిగా గుర్తించుటకు తగినట్లుగా ఆధారములు లేవు.అందుచేతను శాంకరి దేవి అమ్మవారి దర్శనము దుర్లభము.

**2. కామాక్షీకాంచికా పురే:** ఈ అమ్మవారు తమిళనాడులోని కంచిలో గలదు. చెంగల్పట్టు జిల్లా.70 కి.మీ. మద్రాసు సప్త మోక్ష పురములలో నొకటి. సతీదేవి కంకాళము పడినచోటుగా

భావించబడుచున్నది శ్రీ ఆదిశంకరాచార్యుల వారు శ్రీ చక్రం స్థాపించిన ఆలయం స్వామివారు ఏకాంబరేశ్వరుడు. అమ్మవారు కామాక్షీదేవి అమ్మవారు బంగారు విగ్రహముతో నుండెననియు, బంగారు కామాక్షిగా పిలువబడుచుండెననియు, దండయాత్ర చేసి మహ్మదీయులు ఆ విగ్రహమును దొంగిలించినట్లుచరిత్ర. శ్రీ మహావిష్ణువు సన్నిధిలో అమ్మవారు పరమ శివుని ప్రార్థించి ప్రసన్నుని చేసుకున్న స్థలము. ఇచ్చట వెలసిన రావిచెట్టును, మామిడి చెట్టును పూజింతురు. ప్రతి ఆకు ఆకారము వేరుగా, ప్రతీ పండు వేరే రుచిగా నుండుట ఇచ్చట గల మామిడిచెట్టు ప్రత్యేకత.

మూడు గోపురములు గల దేవాలయము. స్వామివారు పంచ మహాభూత లింగములలోని క్షితి లింగము. అమ్మవారు అష్టాదశ మహాపీఠములలో నొకరు . ఫిబ్రవరి - మార్చ్‌లో రథోత్సవము.

**3. ప్రద్యుమ్నే శృంఖలా దేవి :** నేటి పశ్చిమబెంగాల్ రాష్ట్రములోని హుగ్లీ జిల్లాలో పాండువా ప్రాంతము కలదు. 80 కి.మీ. కలకత్తా. పూర్వకాలం ఈ ప్రాంతమును వంగ దేశమనియు, గౌడ దేశమనియు పిలిచెడివారు. ఈ ప్రాంతమంతయు మహ్మదీయుల పాలన క్రిందకు వచ్చినది. ఫలితముగా హిందూ దేవాలయములన్నియు నేలమట్టము కావించబడినవి. బెంగాల్ నవాబు సిరాజుద్దౌలా పరిపాలనలో మసీదులు, సమాధులు నిర్మించబడినవి. ఈ ప్రాంతమున "అదీన" అనే పెద్ద మసీదు మాత్రము కనిపించుచున్నది. కాబట్టి ప్రద్యుమ్న దేశముగా భావించబడుచున్న ఈ ప్రాంతమున శృంఖలాదేవి ఆలయము కనిపించుటలేదు కానీ కలకత్తాకు 135 కి.మీ. దూరములోనున్న గంగాదేవి వెలసిన గంగాసాగర్ క్షేత్రము అష్టాదశ పీఠములలో నొకటిగా భావించబడుచున్నది. ఈ క్షేత్రమునకు అదినాధ క్షేత్రమని పేరు. పవిత్ర గంగానది బంగాళాఖాతమున కలియు చోటు. మకర సంక్రాంతికి ఉత్సవము. గంగామాత, కపిల మహర్షి, భగీరధుని విగ్రహములతో దేవాలయము గలదు.

**4. చాముండా క్రౌంచపట్టణే :** చాముండేశ్వరి దేవి కర్నాటక రాష్ట్రములోని మైసూర్‌కు 13 కి మీ. దూరములో చాముండీ కొండపై వెలసిన అమ్మవారు మహిషాసురుని మర్ధించిన దేవత. మహిషుని చంపిన ప్రాంతము-మహిషూర్ - నేటి మైసూర్ ప్రాంతమైనది ఆలయమున కెదురుగా సర్పాలంకృతుడైన మహిషాసురుని విగ్రహం కలదు. దేవీ నవరాత్రి ఉత్సవములు చాల వైభవముగా జరుగును మైసూర్ మహారాజుల ఆరాధ్య దేవత

**5. ఆలంపూరే జోగుళాంబ :** ఆలంపురం ఆంధ్రప్రదేశ్,మహబూబ్ నగర్ జిల్లా 40కి మీ కర్నూలు, కృష్ణా, తుంగభద్రా నదుల సంగమ స్థానం అమ్మవారు జోగుళాంబ. అష్టాదశ మహాశక్తి పీఠములలో నొకటి స్వామివారు బాలబ్రహ్మేశ్వరుడు.ఎన్ని బిందెలతో అబిషేకము

చేసినా స్వామివారి లింగము క్రిందనుండి ఒక్కచుక్క కూడా బయటికి రాదు. గుడి గోడలో రససిద్ధి వినాయకుని విగ్రహమున్నది. గుడి కట్టించిన రససిద్ధుడు కొన్ని పసరుల, మూలికలతో ఇసుకను కలిపి వినాయక విగ్రహాన్ని తయారుచేయించెను. తాకినచో గరుకుగా నుండును. సప్త మాతృకల విగ్రహములు గూడ కలవు. నవ బ్రహ్మలకు ఇచ్చట విగ్రహములు వెలసియున్నవి. ఈ క్షేత్రమున సంగమేశ్వరస్వామి, బాల బ్రహ్మేశ్వర స్వామి వెలసియున్నారు. తుంగానదిని విష్ణు అంశగాను, భద్రానదిని శైవాంశగాను తలచి వీటి సంగమ స్థానము పవిత్ర క్షేత్రముగా భావించబడుచున్నది. గ్రామదేవతలు ఎల్లమ్మ (శిరస్సు), భూదేవి (మొండెం) వెలసియున్నారు.

ఆలయ ప్రాంగణ కొంత భాగము మహ్మదీయుల స్వాధీనమునందున్నది.

**6. శ్రీశైలే భ్రమరాంబికా :** అంబా త్రయములోని శ్రీశైల క్షేత్రమున వెలసిన భ్రమరాంబదేవి వివరములు చూడుడు.

**7. కొల్హాపురే మహాలక్ష్మీ :** శక్తి త్రయములోని కొల్హాపూర్ క్షేత్రమున వెలసిన మహాలక్ష్మి వివరములు చూడుడు.

**8. ర్మాయూరే ఏక వీర్యక :** ఏక వీర్యకా దేవి లేక రేణుకా మాత. మహారాష్ట్రములోని మాహోర్ గ్రామమున ఈ పుణ్యక్షేత్రము గలదు. నాండెడ్ నుండి 128 కి.మీ. నాందేడ్ జిల్లా అమ్మవారి విగ్రహము చాల పెద్ద తలమాత్రమే మెడగాని, భుజములుగాని లేని శిరోభాగము. గంగసింధూరముతో నిండి ఎర్రగా కనిపించు భీకర స్వరూపము. క్షుద్ర శక్తులకు ఆరాధ్య దేవత నోరు, ముక్కు వంకరగా ఉన్నవి. క్షుద్ర విద్యలు కావలసినవారు అమ్మవారిని బలులిచ్చి ఆరాధించెదరు ఇచ్చట నున్న మూడు కొండ శిఖరములపై ఒక కొండ శిఖరమున అమ్మవారు వేంచేసి యున్నారు. రెండవ శిఖరమున దత్తాత్రేయ స్వామివారు, మూడవ శిఖరమున అనసూయ, అత్రి మహర్షి ఆలయములున్నవి.

ఈ క్షేత్రమును శ్రీ క్షేత్రమని పిలుస్తారు. దత్తాత్రేయుని తల్లిగా అమ్మవారిని, దత్తాత్రేయుని జన్మక్షేత్రముగా ఈ దివ్యక్షేత్రాన్ని భావిస్తారు. అమ్మవారిని జమదగ్ని మహర్షి భార్యగా, పరశురాముని తల్లిగా, రేణుకా మాతగా పూజిస్తారు. సతీదేవి "కుడిస్తనం" పడినచోటుగా భావిస్తారు.

**9. ఉజ్జయిన్యాం మహాకాళి :** శక్తి త్రయములోని ఉజ్జయిని క్షేత్రములో వెలసిన మహాకాళి వివరములు చూడుడు

**10. పీఠాయాం పురుహూతికా :** పిఠాపురం. ఆంధ్రప్రదేశ్, తూర్పుగోదావరి జిల్లా ఇచ్చట శక్తి పీఠమున్నట్లుగా శ్లోకమున వున్నది అమ్మవారు పురుహూతికా దేవి. ఈమె అసలు

విగ్రహం కనిపించుట లేదు. భీకర రూపములో నున్న ఈమె విగ్రహం ఏనాడో భూస్థాపితమైనట్లుగా స్థానికులు చెప్పుచున్నారు. ఇచ్చట గల మూడు ఆలయములలో అమ్మవారు వెలసివున్నట్లు ఆలయ పూజారులు చెప్పుచున్నారు. కుక్కుటేశ్వర స్వామివారి ఆలయములోని గర్భగుడిలోని గోడలో అమ్మవారు రాజ్యలక్ష్మీదేవి 2. దూరముగా నున్న సుబ్రహ్మణ్యేశ్వర స్వామి ఆలయములలో నున్న చిన్న గుడిలో 3. పాతబస్‌స్టాండ్‌నకు ఎదురుగా నున్న సందులో నిర్మించబడిన సిమెంట్ విగ్రహం, ప్రక్కనే నాపరాయిపై చెక్కబడిన చిన్న విగ్రహం.

ఈ క్షేత్రమునకు "పాదగయ" క్షేత్రమని పేరు. గయాసురుడనే రాక్షసుడు గయక్షేత్రములో (బీహార్) తల, ఇక్కడ పాదములు పెట్టుకుని నిద్రించేవాడట. ఇచ్చట గల కుక్కుటేశ్వర స్వామివారి ఆలయము ముందు చక్కటి కోనేరు కలదు.

**11.ఓడ్యాణే గిరిజా దేవి :** గిరిజా దేవి. ఒరిస్సాలోని జాజ్‌పూర్ రోడ్ R.S. నుండి 20 కి.మీ. బస్సుద్వారా, కటక్ నుండి సరాసరి బస్సు కలదు. మద్రాసు - హౌరా రైల్వే లైనులో. ఈ గ్రామమును వైతరణి అని పిలుతురు. వైతరణి నదీ తీరం. అమ్మవారిని "భిరిజా దేవి" అని కూడా పిలుస్తారు. మహాలక్ష్మి, మహా సరస్వతి, మహా పార్వతి అంశలు గలవు.

పితృదేవతలకు పిండ ప్రదానాలు చేస్తారు. భక్తులు తలనీలాలు కూడా సమర్పిస్తారు. అఖండలేశ్వర్, లింగేశ్వర్, త్రిలోచనేశ్వర్, జగన్నాథ్, కాళికామాత ఆలయములు గలవు. దగ్గరలోని దీవిలో విష్ణుమూర్తియొక్క వరాహావతార మున్నది. స్వామివారి పేరు శ్వేత వరాహమూర్తి. సతీదేవి యొక్క "నాభి స్థానం" పడినచోటుగా తలుస్తారు.

**12. మాణిక్యాం దక్షవాటికే :** అమ్మవారు మాణిక్యాంబ. ఈ క్షేత్రము ఆంధ్రప్రదేశ్‌లోని తూర్పుగోదావరి జిల్లాలో ఉన్న ద్రాక్షారామము. 32 కి.మీ. కాకినాడ, 60 కి.మీ. రాజమండ్రి. సతిదేవి "కణతి" పడినచోటు స్వామివారు భీమేశ్వరుడు. చాల ఎత్తైన లింగము. పంచారామములలో నొకటి. సప్తగోదావరుల నీరు ఈ దేవాలయం ప్రక్కనుండి ప్రవహిస్తున్నందున ఇచ్చట స్నానం పుణ్యప్రదము. అమ్మవారిని పూర్వకాలము వేశ్యల కులదేవతగా కొలిచెడివారు

**13.హరిక్షేత్రే కామరూపి :** అమ్మవారు కామాఖ్యదేవి. ఈ క్షేత్రము అస్సాం రాష్ట్రములోని గౌహతి నగరమునకు 8 కి.మీ. దూరమున నీలాంచల కొండపై నున్నది. బ్రహ్మపుత్రా నదీ తీరం. సతీదేవి యొక్క "యోని" భాగము పడినచోటు. కామదేవ, రతీదేవుల దేవాలయములు నిర్మించబడినవి. శివుడు మూడవ కన్ను తెరచి మన్మధుని మసిచేసిన చోటు.

అమ్మవారికి బహిష్టు కలదు. బహిష్టు ఉన్న నాలుగు రోజులూ దేవాలయం మూసివేయబడి ఉంటుంది. ఈ సమయమును "అంబుబాషి" రోజులుగా పిలుస్తారు. అమ్మవారిని బాసుమతి దేవి అనికూడా పిలుస్తారు. ఈ సమయములో అమ్మవారి పూజకు ఎర్రపూలు, ఎర్ర పసుపు, ఎర్రని వస్త్రము వాడతారు. ఈ ఉత్సవం తరువాత పంటలకు నాట్లు వేస్తారు. పంటలు బాగా పండుతాయని నమ్మిక. ఐదవనాడు ఆలయం తెరిచే సమయానికి అమ్మవారి మూర్తి క్రిందనుండి ఎర్రటినీరు బయటకు వస్తూ ఉంటుంది. ఈ విచిత్రమును చూచుటకు దేశ విదేశముల నుండి భక్తులు బారులు తీరి గంటల కొలది వేచియుంటారు. ప్రాగ్జ్యోతిష పురమున లేక కామరూప దేశమున వెలసిన అమ్మవారు. దేవాలయ గర్భగుడి చాల క్రిందుగా ఉన్నందున మెట్లపై నుండి దిగవలయును. ఇచ్చట అమ్మవారికి మేకలను, పావురములను బలిగా ఇత్తురు. అమ్మవారిని కాళికామాతగా, మంత్ర తంత్ర శక్తి దేవతగా కొలుతురు. అమ్మవారు, పిండి రూపములో (రాతిముద్రల రూపములో) మహాలక్ష్మి, మహా సరస్వతి, మహా పార్వతి అంశగా వెలసియున్నది,

నీలాంచల పర్వతం పైన ఇంకా ఏడుగురు అమ్మవార్లు వెలసియున్నారు.

1. కాళి 2. తార 3. భువనేశ్వరి 4. భైరవి 5. చిన్న మస్త 6. భగళ 7. ధూమావతి

ఐదుగురు శివస్వాములు కూడా వెలసియున్నారు.

1. కామేశ్వర 2. సిద్ధేశ్వర 3. కోటిలింగ 4. అఘోర 5. అమృతకేశ్వర

అమ్మవారికి అంబుబాషి రోజుల్లో చుట్టు ప్రక్కలనున్న అన్ని ఆలయములు నవగ్రహాలయముతో సహా మూసివేయబడి ఉంటవి. అమ్మవారి "యోని భాగం" రాతిపై ముద్రవేయబడి పూజలందుకొనుచున్నది. ఇది ఎప్పుడూ తడిగావుండి క్రిందనుండి నీరు ఊరుతూ ఉంటుంది.

**14. ప్రయాగే మాధవేశ్వరి :** అమ్మవారు మాధవేశ్వరీ దేవి. ఉత్తర ప్రదేశ్‌లోని అల్హాబాద్ నగరమున గల ప్రయాగ క్షేత్రము. అమ్మవారిని మాయాదేవి అనికూడా పిలుస్తారు. విగ్రహము లేని శ్రీ చక్రస్వరూపిణి. ఈ క్షేత్రము త్రివేణీ క్షేత్రముగా పిలువబడుచున్నది. గంగ, యమున, సరస్వతీ నదుల సంగమ స్థానము. సతీదేవి హస్తాంగుళి పడినచోటు. అమ్మవారికి "అలోపిదేవి" అని పేరు కూడ కలదు. 12 సంవత్సరముల కొకసారి కుంభమేళ జరుగును.

**15.జ్వాలాయాం వైష్ణవీ దేవి :** అమ్మవారు వైష్ణవి దేవి. జమ్మూ & కాశ్మీర్ రాష్ట్రమున కాట్రాకు 14 కి మీ. దూరమున వెలసిన పుణ్యక్షేత్రము జమ్ము నుండి కాట్రా 46 కి.మీ కాట్రా

నుండి బాణగంగ 2 కి.మీ. బాణ గంగ నుండి వైష్ణవి దేవి 12 కి.మీ. కాలినడకనగాని, చిన్న గుర్రములు మీదగాని బాణగంగ నుండి రాత్రింబవళ్ళు వెళ్ళవచ్చును. సుమారు 3 గంటలు పట్టును. 5,800' ఎత్తున గల క్షేత్రము. అమ్మవారిని "త్రికూట భగవతి" అని కూడా పిలుస్తారు. ఇచట మహాకాళి, మహా సరస్వతి, మహాలక్ష్మి పిండి రూపమున వెలసియున్నారు. ఇది గుహాలయము. దీనిని దర్శించుటకు కాట్రాలో పర్మిట్లు ఉచితముగా నిత్తురు.

అమ్మవారు వెలసిన పర్వతమును త్రికూటపర్వతమని పిలుతురు. ఈ గుహాలయాన్ని "భవన్" అని పిలుతురు. అమ్మవారు అడగినదే తడవుగా కోర్కెలు తీర్చు భగవతిగా చాల ప్రసిద్ధి. సాక్షిభైరవ స్వామి మందిరము కలదు. బాణ గంగలో స్నానము చేయుదురు. కాలిబాట పొడవున విశ్రాంతి మందిరములు, ఆహార పానీయ షాపులు, ఇతర సౌకర్యములు గలవు.

విగ్రహముల ప్రక్కనే గుహలో పెద్ద నీటి ఊట కలదు. నీరు చాల స్వచ్ఛమైనది., నల్లనిది. దేవస్థానము వారు భక్తుల సౌకర్యార్థము చాలా ఏర్పాట్లు చేసియున్నారు. త్రోవ పొడవున కాంతివంతమైన విద్యుత్ దీపాలుండుటచే భక్తులు రాత్రిపూటకూడ ఎక్కువగా ప్రయాణము చేయుచున్నారు.

**16.గయాయాం మాంగళ్య గౌరికా :** అమ్మవారు మంగళ గౌరి లేక సర్వమంగళా దేవి. బీహారు రాష్ట్రములోని గయ. 73 కి.మీ. పాట్నా, ఔరంగాబాద్ నుండి బస్సు పైనను, ధనబాద్ నుండి రైలు పైనను జేరవచ్చును.

ఫల్గుణీ నదీ తీరము. ఈ నది ఎండిపోయి అంతర్యామిని అయినది. ఫల్గుణి, మధుర, శ్వేదా నదుల సంగమ స్థానము. శాశ్వత కైవల్య ప్రాప్తి కొరకు పితృదేవతలకు పిండప్రదానములు చేయుదురు. గయ క్షేత్రము శ్రాద్ధ కర్మలకు ప్రసిద్ధి. పాత గయ, కొత్త గయ అను రెండు గయలు 1 కి.మీ. దూరములో గలవు. విష్ణుమూర్తి "గజ" అను రాక్షసుని తన కుడి పాదముతో హతమార్చెను. విష్ణుమూర్తి "పాదాలయము" కలదు. భాగేశ్వరి దేవికి, గదాధర్ భగవాన్‌కి, శ్రీకృష్ణునికి, సూర్య నారాయణ మూర్తికి ఆలయములు గలవు. కాశీ క్షేత్రములో వలె గయా క్షేత్రమున కూడ శాక, ఫల వర్జనము విశేషము.

**17.వారణాస్యాం విశాలాక్షి :** అమ్మవారు విశాలాక్షి. ఉత్తర ప్రదేశ్‌లో గంగా తీరమున వెలసిన దివ్య క్షేత్రము. సప్త మోక్షపురములలో నొకటి. రామాయణ, భారత, భాగవత ప్రాశస్త్యము గలిగిన అతి పురాతన క్షేత్రము. విశాలాక్షి అమ్మవారి ఆలయమునకు దగ్గరలోనే మాతా అన్నపూర్ణేశ్వరి ఆలయము కలదు వ్యాస మహర్షిని పరీక్షించుటకు ఒక్క కబళం

కూడా దొరకని చోటు మహా విష్ణువు కర్ణకుండలములు పడినచోటు కాశీ నగరమును కాలభైరవుడు శునక వాహనుడై గస్తీ తిరుగుతూ కాపాడునని ప్రసిద్ధి. శివుని త్రిశూలముపై నున్న నగరము. ప్రళయ కాలమున కూడా ధ్వంసము కానిది కాశీ క్షేత్రమున మరణించిన ముక్తి కలుగును. గయా క్షేత్రములో వలె భక్తులు ఇచ్చట గూడా శాక, ఫల వర్జన దీక్ష బూనెదరు. అక్షేత్రయమున యితర వివరములు చూడుడు

**18. కాష్మీరేతు సరస్వతి :** ప్రస్తుతము కాశీర్మములో సరస్వతి ఆలయము కనిపించుట లేదు. జమ్ము & కాశ్మీర్ రాష్ట్రము ప్రముఖముగా మహ్మదీయుల నివాసము. అందుచేత హిందూ ఆలయములు తక్కువ.

శ్రీ ఆది శంకరాచార్యుల వారు ఈ రాష్ట్రాన్ని సందర్శించినప్పుడు అచ్చట వెలసియున్న అమ్మవారికి పూజలు జరుగుట లేదని, అచ్చట నున్న అమ్మవారిని (సువర్ణ శారదా దేవిని) తరలించి కర్నాటక రాష్ట్రములోని శృంగేరి పీఠములో ప్రతిష్ఠించిరి శారదా పీఠాన్ని కూడా స్థాపించిరి ఆలయం చాల పెద్దది. చాల ప్రశాంత వాతావరణము అమ్మవారు అతి సుందర విగ్రహం. ఇచ్చట సత్రములు, ఉచిత భోజన సౌకర్యములు కలవు

ఇచ్చటకు సుమారు 10 కి.మీ దూరములో ఋష్యశృంగ, శాంతాదేవి ఆలయము గలదు. శ్రీనగర్ (జమ్ము & కాశ్మీర్ రాష్ట్రం) లోని దాల్ సరస్సునకెదురుగా నున్న కొండపై వెలసిన శ్రీ శంకరాచార్య ఆలయమును సరస్వతి ఆలయముగా కొంతమంది భావించుచున్నారు శక్తి పీఠముగా కొలుచుచున్నారు. కాని యిచ్చట అమ్మవారు కనిపించదు.

# ఇవి గాక ఇంకా క్లైయిమ్ చేయబడుచున్న పీఠములు

**1. జ్వాలాముఖి :** హిమాచలప్రదేశ్ 53 కి.మీ. ధర్మశాల 82 కి.మీ. పఠాన్‌కోట్. కాంగ్డా జిల్లా 20 కి.మీ. కాంగ్డా. అమ్మవారి పేరు : జ్వాలా ముఖి. ఈమెనే వైష్ణవ దేవి యని విద్యేశ్వరీ దేవి యని కూడా పిలుతురు. ఆలయం "కాళీధర్" పర్వతంపై కలదు. ఇచ్చట అమ్మవారు విగ్రహ రూపమున గాక మంటల రూపమున దర్శనమిచ్చుచున్నది. కొండలో నుండి మంటలు వచ్చుచోట ఇత్తడి, రాగి, వెండితో గోవు, సింహము, పులి మొదలైన ఆకారములు గల ఫ్రేములు తగిలించి నోటిలో నుండి మంటలు వచ్చులాగున తగిలింతురు దేవాలయ గదులలో నుండి వచ్చు గ్యాస్‌కు అగ్గిపుల్ల గీచి మంటలు మండింతురు. ఆర్పివేసిన గ్యాస్ వాసన వచ్చును ఆలయ సమీపాన వేడినీటి ఊటలు గూడ కలవు దేవాలయము గదులు గదులుగా ఉండును గోడల నుండి వచ్చు మంటలను "జ్వాలాజీ" అని పిలుతురు పాలు,

హల్వ, దూద్‌పేడా వగైరా ప్రసాదము అమ్మవారికి అక్బర్ చక్రవర్తి రజత ఛత్రము జేయించెను

**2. వజ్రేశ్వరి** . హిమాచలప్రదేశ్ కాంగ్డా పట్టణం. కాంగ్డా జిల్లా. 20 కి.మీ జ్వాలాముఖి సతీదేవి "శిరస్సు" పడిన ప్రదేశము

**3. గుహ్యేశ్వరి లేక మహామాయి :** ఖాట్మండు : నేపాల్ దేశ రాజధాని. సతీదేవి "మోకాళ్ళు" పడిన చోటు. స్వామివారు పశుపతి నాథ్ భాగమతి నదీతీరం. ఇచ్చట జంతుబలులు ఆచారముగా కలవు. జంతువుల ప్రేగులు వగైరా రథానికి తగిలించి ఊరేగించు కొండబాతి ఆచారము ఇంకను కొనసాగుచున్నది.

**4. రుక్మిణీ దేవి :** ద్వారక గుజరాత్. ద్వారకా ధీష్ ఆలయము నుండి రెండు కి.మీ, దూరమున ఈ ఆలయము గలదు

**5. గిరిజా పీఠం - గిరిజా దేవి :** అహోబిలం . ఆంధ్రప్రదేశ్ కర్నూలు జిల్లా 30 కి.మీ. ఆళ్ళగడ్డ ఇది నారసింహ క్షేత్రము ఎగువ అహోబిలం లోపల శ్రీ చక్రమున్నది. భూ గర్భములో దేవీ ఆలయమున్నదని, అందుచేతనే పై భాగమున శ్రీ చక్రమున్నదట. గిరిజాదేవి పీఠముగా ప్రసిద్ధి దీనికి తోడుగా ఇక్కడున్న నృసింహ స్వామివారికి "ఫాల లోచనము" న్నదట ఆలయం ప్రక్కనే శివాలయం ఉన్నది శివుని నృసింహ స్వామివారు అనుగ్రహించారట. శ్రీరాముడు సీతాన్వేషణ సమయాన నృసింహుని దర్శించారట. వివాహానికి ముందు శ్రీ వేంకటేశ్వర స్వామి నృసింహుని దర్శించి ఆశీర్వాదము పొందినారట.

నల్లమల కొండలలోనున్న అహోబిలం ఆదిశేషుని నడుముపై నున్నట్లు భావిస్తారు. తలపై శ్రీ వేంకటేశ్వరుడు, తోకపై శ్రీశైల మలికార్జునుడు గలరు

**6. మహామాయి :** కురుక్షేత్రం, ఉత్తర ప్రదేశ్.

**7. గౌరీదేవి :** కనౌజ్, ఉత్తర ప్రదేశ్

**8. భవాని :** తుల్జాపూర్, మహారాష్ట్ర

**9. సుభద్ర,విమలాదేవి :** పూరీ, ఒరిస్సా

**10. గంగాదేవి :** గంగాసాగర్, పశ్చిమ బెంగాల్

# ప్రధాన శక్తి విగ్రహాలు వెలసిన క్షేత్రాలు- 12

| | | |
|---|---|---|
| 1. కంచి | కామాక్షిదేవి | తమిళనాడు |
| 2 శ్రీశైలం | భ్రమరాంబ | ఆంధ్రప్రదేశ్ |
| 3 కన్యాకుమారి | కన్యక | తమిళనాడు |
| 4 జునాగఢ్ (గిర్నార్) | అంబాజి | గుజరాత్ |
| 5 కొల్హాపూర్ | మహాలక్ష్మి | మహారాష్ట్ర |
| 6 ఉజ్జయిని | మహాకాళి | మధ్యప్రదేశ్ |
| 7 ప్రయాగ | లలితాదేవి | ఉత్తరప్రదేశ్ |
| 8. వింధ్యాచలం | వింధ్యవాసిని | ఉత్తరప్రదేశ్ |
| 9. కాశీ | విశాలాక్షి | ఉత్తరప్రదేశ్ |
| 10. గయ | మంగళగౌరి | బీహార్ |
| 11. తారాపీఠ్ | తారాకేశ్వరి | పశ్చిమ బెంగాల్ |
| 12. ఖాట్మండు | గుహ్యేశ్వరి | నేపాల్ |

## సతీదేవి శరీర భాగాలు పడిన చోట్ల వెలసిన మహా శక్తి పీఠములు - 51

మహాశక్తి పీఠాలుగా భావింపబడే సతీదేవి శరీర భాగాలు పడిన పవిత్ర స్థలములు వర్ణనీయము. పురాణాలు తెలుసున్న వారు,శక్తి పీఠాలలో ఉంటున్నవారు ఈ మహా శక్తి పీఠాలు 51 అని, మరికొందరు 52 అని, ఇంకాకొందరు 53 అనికూడా అంటున్నారు. అష్టాదశ శక్తి పీఠాలకు, సతీదేవి శరీర భాగాలు పడిన మహాశక్తి పీఠాలకు , ఉపశక్తి పీఠాలకు తేడా తెలియుటలేదు. ఏశక్తి ఆలయం ఏ పీఠానికి చెందినదో చెప్పే మహానుభావులు కనిపించుటలేదు. ✓వ్యాసమహర్షి జనమేజయునికి చెప్పిన సంస్కృత శ్లోకములు తప్ప ఇతరత్రా ఆధారములు లేవు. సంస్కృతములో చెప్పబడిన ఆనాటి పవిత్ర స్థలముల పేర్లు ఈనాడు ఎవరూ గుర్తించలేక పోవుచున్నారు ఫలితముగా ఏ ఆలయము వద్దనున్న వారు ఆ ఆలయమే శక్తి పీఠమని చెప్పుట తటస్థించుచున్నది.

అమ్మవారి శరీరములోని ఏ భాగము ఆ శక్తి పీఠములో పడినదో చెప్పుటకు కూడా తడబడుచున్నారు. కారణం పడిన శరీర భాగం యొక్క ప్రత్యేక వివరణ ఆలయంలో లభించక పోవడమే ఎవరికి తోచిన శరీర భాగం వారే చెప్పుచున్నారు

ఒక్కొక్క క్షేత్రం రకరకాల పీఠములలో మరల మరల వస్తున్నది నిజానిజాలు తెలుసుకొనుట దుర్లభముగా నున్నది ఈ పరిస్థితి దాటజాలము సాధ్యమైనంత వరకు శక్తి పీఠముల గురించి తెలిసికొని వివరములీయుట జరిగినది

ముఖ్యముగా గ్రహించవలసిన దేమనగా శక్తి పీఠాలలో ఉన్న తీర్థాలలో స్నానమాచరించి అమ్మవారి దర్శనం చేసికొని పూజించినను లేక వ్యాసుడు చెప్పినట్లుగా అమ్మవార్ల పేర్లు ఉచ్చరించినను శివలోక ప్రాప్తి కలుగును.

## ఆంధ్రప్రదేశ్

**1.** ఎడమ చెక్కిలి పడిన చోటు: తూర్పుగోదావరి జిల్లాలోని ద్రాక్షారామ క్షేత్రం 32 కి మీ. కాకినాడ సప్తగోదావరీ తీరముగా భావించబడుచున్నది. అమ్మవారు మాణిక్యాంబ క్షేత్రం పంచ ఆరామములలో ఒకటి

**2.** అమ్మవారి "మెడ"పడిన చోటు : కర్నూల్ జిల్లాలోని శ్రీశైల క్షేత్రం. 51 కి మీ డోర్నాల అమ్మవారు భ్రమరాంబ చైత్రమాసములోని పూర్ణిమ నాడు కుంభం పోస్తారు. క్షేత్రం ద్వాదశ జ్యోతిర్లింగములలో నొకటి.

## తమిళనాడు

**1** పై దంత పంక్తి పడిన చోటు : కన్యాకుమారి జిల్లాలోని శుచీంద్రం 13 కి.మీ. కన్యాకుమారి అరేబియా సముద్రతీరం అమ్మవారు నారాయణి.

**2.** కుడి భుజము పడిన చోటు. మద్రాసు నగరమున వెలసిన కపాలేశ్వరి

**3** వీపుభాగం పడిన చోటు : కన్యాకుమారి జిల్లాలోని కన్యాకుమారి అగ్రం. 13 కి మీ శుచీంద్రం 19 కి.మీ నాగర్ కోయిల్. అమ్మవారు భద్రకాళి.

**4..** అస్థిపంజరము పడిన చోటు : చెంగల్ పట్ జిల్లాలోని కాంచీపురము 56 కి.మీ. మద్రాసు. శ్రీచక్రం స్థాపించబడిన పుణ్యక్షేత్రం. అమ్మవారు కామాక్షీ దేవి. క్షేత్రం సప్తమోక్షపురములో నొకటి.

## ఉత్తర ప్రదేశ్

**1.** తలవెంట్రుకలు పడిన చోటు బృందావనములో మధుర- బృందావన్ రోడ్డుమీద బృందావనానికి 2 కి మీ దూరములో.అమ్మవారు ఉమాదేవి చాముండి అనికూడా పిలుస్తారు.

**2.** వామహస్తం పడిన చోటు వారణాసి జిల్లాలోని కాశీ నగరం మణి కర్ణికా ఘాట్ సమీపములోని మందిరం అమ్మవారు విశాలాక్షి క్షేత్రం ద్వాదశ జ్యోతిర్లింగములలో నొకటి.

**3.** హస్తాంగుళి పడిన చోటు అల్హాబాద్ జిల్లాలోని త్రివేణి సంగమమున వెలసిన

ప్రయాగక్షేత్రం గంగా, యమునా, సరస్వతీ నదుల సంగమ స్థానం అక్షయ వట వృక్షం క్రింద వెలసిన లలితా దేవి

4 రెండు కర్ణాలు / ఎడమ పాదం పడిన చోటు అల్హాబాద్ జిల్లాలోని వింధ్యాచలం 80 కి మీ అల్హాబాద్ అమ్మవారు వింధ్యవాసిని

## పశ్చిమ బెంగాల్

1 కిరీటం పడిన చోటు కిరీట్, బడనగర్, మూర్షిదాబాద్ జిల్లా 20 కి,మీ మూర్షిదాబాద్, 8 కి మీ. ఖగర్ ఘాట్ రోడ్ R,S 5 కి.మీ. లాల్ భాగ్ పోర్టు R S. ,99 కి మీ. బరహారవ R S అమ్మవారు విమలాదేవి

2 అధరం పడిన చోటు అట్టహాస్, లాభపూర్ R S దగ్గర అహ్మద్ పూర్ - కటవా లైనులో 12 కి మీ అహ్మద్ పూర్ భీర్‌భం జిల్లా పుల్లారా దేవి.

3 కంఠ హారం పడిన చోటు : నంది పూర్, బీర్ భం జిల్లా సియోరికి 15 కి మీ. శాంతియో R S కు దగ్గరలోని వటవృక్షం క్రింద అమ్మవారు నందినీ దేవి

4 కాలి ఎముక పడిన చోటు నలహాటి 3 కి మీ నలహాటి R S బీర్‌భం జిల్లా 15 కి.మీ రాంపూర్ హాట్ ,అమ్మవారు నలాటేశ్వరి

5. మనస్సు పడిన చోటు బీర్‌భం జిల్లాలోని బక్రేశ్వర్ 58 కి మీ శాంతినికేతన్ అమ్మవారు మహిష మర్దిని. 12 కి మీ దుబ్రాజ్ పూర్ R S

6 ఎడమచేయి పడిన చోటు బీర్‌భం జిల్లాలోని కేతుబ్రహ్మ గ్రామం శాంతినికేతన్ కుదగ్గరలో అహ్మద్‌పూర్ నుండి వెళ్ళవచ్చును అమ్మవారు చండీదేవి.

7 ఎడమ పాదం పడినచోటు. జలపాయి గురి జిల్లా, బోదా మండలం లోని శ్యాలవాడి గ్రామం జలపాయి గురికి దగ్గరలో తీస్తానదీ తీరం అమ్మవారు భ్రమరాంబ

8 ఎడమ కాలి చీలమండ పడిన చోటు తమలుక్ గ్రామం మిద్నపూర్ జిల్లా. 80 కి.మీ ఖర్గపూర్ 15 కి మీ మాయాపూర్ పంచకుర R S నుండి బస్సు. అమ్మవారు కాపాలిని.

9. కుడికాలి వ్రేళ్ళు పడిన చోటు . క్షీర గ్రామం బర్ధవాన్ జిల్లా 32 కి మీ బర్ధవాన్ R.S. 107 కి.మీ హౌరా ,అమ్మవారు భూత ధాత్రి

10. పాదాల వ్రేళ్ళు పడిన చోటు : కలకత్తా లోని ఆలీపూర్ అనే ప్రదేశంలో ఉన్న కాళీఘాట్ 2 కి మీ టాలీ గంజ్ అమ్మవారు ఆది కాళికాదేవి.

## మహారాష్ట్ర

1 మూడు కండ్లు పడిన చోటు కొల్హాపూర్ జిల్లాలోని కొల్హాపూర్ 18 కి మీ పన్ హాలా, 12 కి మీ రత్నగిరి, 395 కి.మీ ముంబాయి, అమ్మవారు మహాలక్ష్మి, లేక మహిషమర్దిని అనిపిలువబడే భవాని

2. గడ్డం భాగము పడిన చోటు · నాసిక్ జిల్లాలోని నాసిక్ దగ్గర నున్న పంచవటి 8 కి మీ నాసిక్ రోడ్ , 32 కి మీ త్రయంబకం గోదావరి తీరం అమ్మవారు భద్రకాళి లేక భ్రామరి

3 కుడి హస్తం పడిన చోటు మాహోర్, నాండెడ్ జిల్లా 120 కి మీ నాండెడ్ అమ్మవారు రేణుకా మాత (ఏకవీరాదేవి)

## హిమాచల ప్రదేశ్

1. నాలుక పడిన చోటు· కాంగ్డా జిల్లాలోని జ్వాలాముఖి క్షేత్రం 30 కి మీ కాంగ్డా, 82 కి మీ పరాన్ కోట, 53 కి మీ ధర్మశాల బియాస్ నదీ తీరం అమ్మవారు జ్వాలాజీ.

## నేపాల్

1. కుడి చెక్కిలి పడిన చోటు · ధవళగిరి జిల్లాలోని ముక్తినాథ్ క్షేత్రానికి దగ్గరలో నున్న గాలేశ్వర్. 20 కి మీ జామ్ సం, 75 కి మీ. పోకరా, 225 కి మీ. ఖాట్మండు గండకీ నదీ తీరం. అమ్మవారు గాలేశ్వరి

2. ఎడమభుజము పడిన చోటు · జనకపూర్ ధామ్ . 42 కి మీ. సీతా మర్హి (R.S.) ,32 కి.మీ. జనకపురి రోడ్ R S అమ్మవారు ఉమాదేవి. మహాదేవి అనికూడా పిలుస్తారు.

3. మోకాళ్ళు పడిన చోటు ఖాట్మండు నగరములోని పశుపతి నాథ్ ఆలయంలో బాగామతి నదీ తీరం. అమ్మవారు గుహ్యేశ్వరి లేక మహామాయి

## మధ్య ప్రదేశ్

1. పైపెదవి పడిన చోటు . ఉజ్జయిని జిల్లాలోని ఉజ్జయినీ నగరం 55కి,మీ. ఇండోర్, షిప్రా నదీ తీరం అమ్మవారు మహాకాళి.

2. మోచేయి పడిన చోటు : రుద్ర సాగర్ వద్ద ఉజ్జయిని దగ్గర. ఉజ్జయిని జిల్లా 55కి మీ ఇండోర్ అమ్మవారు హరసిద్ధిమాత.

3. దక్షిణ పిరుదులు పడిన చోటు: షాదోల్ జిల్లాలోని అమర్ కంటక్ 50 కి.మీ. షాదోల్, 50 కి.మీ. బిలాస్ పూర్ నర్మద, సోన్ నదుల జన్మస్థలం. అమ్మవారు భద్రసేన.

## అస్సాం

1.వీపుభాగం పడిన చోటు: కామరూప్ జిల్లాలోని భువన్ కొండ. 60కి మీ. గౌహతి, 20 కి మీ. సిల్చార్ త్రివేణీ నదీతీరం. అమ్మవారు వెలసిన కొండ పూర్వ నామధేయం శ్రీ పర్వతం. అమ్మవారు శ్రీసుందరి

2.యోనిభాగం పడిన చోటు కామరూప్ జిల్లాలోని గౌహతి నగరం నీలాచల పర్వతముపై 8 కి మీ గౌహతి. బ్రహ్మపుత్రా నదీ తీరం అమ్మవారు కామాఖ్య దేవి

## హర్యానా

**1.ఎడమకాలి చీలమండ పడిన చోటు :** కురు క్షేత్రం ఢిల్లీ- అంబాల సిటీ లైనులో అమ్మవారు భద్రకాళి

**2.కుడికాలి చీలమండ పడిన చోటు :** కురుక్షేత్ర జిల్లాలోని ద్వైపాయన సరోవరము వద్ద వెలసిన శక్తి పీఠం 7కి మీ పిప్లీ, 5 కి మీ తానేశ్వర్. అమ్మవారిని సావిత్రి, భద్రకాళి అని కూడా పిలుస్తారు.

## బీహార్

**1.హృదయ కోశము/ శిరోభాగము పడిన చోటు** సంతాల్ పరగణా జిల్లా వైద్యనాధ్ ధామ్, 5 కి.మీ. జెషిడి ( అసన్ సోల్ నుండి పాట్నా రూట్‌లో ) అమ్మవారు జయదుర్గా త్రిపుర సుందరి.

## రాజస్తాన్

**1.మణి బంధాలు పడిన చోటు:** పుష్కర్ జిల్లాలోని పుష్కర్ గ్రామములో వెలసిన పీ..
11కి.మీ అజ్మీర్. బ్రహ్మ సరోవరం ప్రక్కన అమ్మవారు గాయత్రీ దేవి

**2.కాలివ్రేళ్ళు (కొన్ని) పడిన చోటు :** జగత్ లేక విరాట్. జైపూర్ జిల్లా 58 కి మీ జైపూర్ అజ్ఞాత వాసానికి ముందు పాండవులు ప్రార్థించిన అమ్మవారు అమ్మవారు అంబికా మాత

## ఒరిస్సా

**1.నాభి భాగం పడినచోటు :** పూరీ. పూరీ జగన్నాధము. శ్రీ పురుషోత్తమ క్షేత్రము. బంగాళా ఖాత తీరము. అమ్మవారు విమలాదేవి.

## గుజరాత్

**1.కడుపు భాగం పడిన చోటు:** జునాగఢ్ ప్రక్కనున్న గిర్నార్ కొండలపై నున్న మహాకాళీ శిఖరముపై వెలసిన అమ్మవారు జునాగఢ్ జిల్లా అమ్మవారు కాళికాదేవి

## పంజాబ్

**1.ఎడమ హస్తం పడినచోటు ·** జలంధర్ జిల్లాలోని జలంధర్ గ్రామం అమ్మవారు త్రిపుర సుందరి లేక విశ్వముఖి

## జమ్ము & కాశ్మీర్

**1 కంఠము పడిన చోటు:** అమర్ నాధ్ గుహ లిడ్డర్ లోయ లిడ్డర్ నదీతీరం. సౌత్ కాశ్మీర్ ప్రాంతం. అమర్ నాధ్ గుహ లోని మంచులింగ రూపములో వెలసిన పార్వతీదేవి. అమ్మవారి ని అమరనాధేశ్వరి అని పిలుస్తారు

## త్రిపుర రాష్ట్రము (N.E. States)

1.కుడికాలు పడిన చోటు . త్రిపుర పట్టణం ఉదయపూర్‌కు దగ్గర. 45 కి.మీ అగర్తల త్రిపుర పర్వతముపై అమ్మవారు త్రిపుర సుందరీ దేవి

## టిబెట్

1.కుడి అరచేయి / కుడిపాదము పడన చోటు మానస సరోవరం ప్రక్కన కైలాసగిరిపై 321 కి మీ భారత భూభాగం. అమ్మవారు పార్వతీదేవి. (మహాసుందరి)

## మేఘాలయ

1.ఎడమ తొడ పడినచోటు · బావుర్‌బాగ్ గ్రామం. జయంతి పర్వతముపై. 55 కి.మీ షిల్లాంగ్. అమ్మవారు జయంతి .

## పై పీఠములు గాకుండా యింకా ....

1.శ్రీలంకలో అమ్మవారి కాలి గజ్జెలు పడినట్లుగా తెలియుచున్నది. అమ్మవారు ఇంద్రాక్షి.
2. పాకిస్తాన్‌లోని హింగలాజ్‌లో అమ్మవారి "మాడు" పడిన స్థానముగా భావించబడుచున్నది. లాస్‌బేల జిల్లా. హింగ్రోస్ నదీ తీరం.150 కి.మీ. కరాచి. 3. అమ్మవారి "అధోదంత పంక్తి" పడి, వారాహి పేరుతో పంచసాగర్ క్షేత్రమున వెలసినట్లున్నది.

## అమ్మవారి శరీర భాగాలు పడినట్లుగా చెప్పబడుచున్న వివిధ శక్తి పీఠములు.

| | | |
|---|---|---|
| 1. తల వెంట్రుకలు పడినచోటు | : | పశ్చిమ బెంగాల్‌లోని కలకత్తా, అమ్మవారు కాళీఘాట్‌లో వెలసిన కాళికా దేవి. |
| 2. శిరోభాగం పడినచోటు | : | శాకంబరి. ఉత్తరప్రదేశ్.40 కి.మీ. షహరాన్ పూర్. అమ్మవారు శాకంబరీ దేవి. |
| 3. శిరోభాగం పడినచోటు | : | మాని మజ, (హర్యానా) చండీగడ్ దగ్గర, మానసా దేవి. |
| 4. వక్షోజం పడిన చోటు | : | గయ. బీహార్. అమ్మవారు మంగళ గౌరి. |
| 5. శరీరభాగం పడిన చోటు | : | తుళుముల. జమ్ము & కాశ్మీర్. 40 కి.మీ. శ్రీనగర్. అమ్మవారు ఖీర్ భవాని. |
| 6. శరీరభాగం పడిన చోటు | : | ఫుల్లార. పశ్చిమ బెంగాల్. 40 కి మీ శాంతినికేతన్ ఫుల్లార మాత. |
| 7. తుంటి భాగం పడిన చోటు | : | ప్రాంటిక్. పశ్చిమ బెంగాల్, భోల్పూర్ కి, శాంతినికేతన్ కి దగ్గరలో, అమ్మవారు కంకాళి మాత |

**8.** శరీరభాగం పడిన చోటు బందోడ్ గోవా, 4 కి.మీ పోండా, అమ్మవారు మహాలక్ష్మి.

**9.** శరీరభాగం పడినచోటు వైష్ణవిదేవి జమ్ము & కాశ్మీర్ 14 కి మీ కాట్రా అమ్మవారు వైష్ణవీ దేవి

10 శిరస్సు - "ముండ" పడిన చోటు కాంగ్డా హిమాచలప్రదేశ్ కాంగ్డా జిల్లా అమ్మవారు వజ్రేశ్వరి

**11.** కంఠము పడిన చోటు గాలేశ్వర్ నేపాల్. ముక్తినాథ క్షేత్రానికి పోవు త్రోవలో అమ్మవారు గాలేశ్వరి మాత.

**12.** కుడితొడ భాగము పడినచోటు : పాట్నా మహరాజ్ గంజ్, బీహార్, 9 కి మీ పాట్నా R S అమ్మవారు పెద్ద పటాన్ దేవి

**13.** కిరీటం పడిన చోటు కిరీటికోన, దహసార గ్రామం. పశ్చిమ బెంగాల్ మూర్షిదాబాద్ కు దగ్గర అమ్మవారు కిరీటేశ్వరి

**14** దక్షిణ హస్తం పడినచోటు : శృంగేరి. కర్నాటక. షిమోగా నుండి బస్సు, చికమగులూర్ జిల్లా అమ్మవారు సువర్ణ శారదా దేవి.

**15.** నాభిభాగం పడినచోటు . జాజ్‌పూర్. ఒరిస్సా కటక్ నుండి బస్సు. కటక్ జిల్లా. అమ్మవారు బిరిజా దేవి.

**16.** కుడి భుజము పడిన చోటు : శ్రీకాళహస్తి. ఆంధ్రప్రదేశ్. చిత్తూరు జిల్లా అమ్మవారు జ్ఞాన ప్రసూనాంబ

**17** దక్షిణ వక్షోజము పడిన చోటు అరసూర్ రాజస్తాన్. 32 కి మీ మౌంట్ ఆబూ అమ్మవారు అంబికా మాత

**18** దక్షిణ పిరుదు పడిన చోటు : బీహార్, దెహిరి ఆన్‌సోనే R S హౌరా - గయ లైనులో అమ్మవారు దెహిరి మాత

**19.** కంకణం పడిన చోటు : పశ్చిమ బెంగాల్ చండీతల సియాల్ దహ R S నుండి 57 కి.మీ. అమ్మవారు మంగళచండి

**20** చేతివ్రేళ్ళు పడిన చోటు పశ్చిమ బెంగాల్. 'మో' గ్రామం. 12 కి మీ కటవా, 38 కి.మీ నవద్వీప ధామ్ అమ్మవారు అంగుళీయక చండి

**21** కుడిపాదం పడిన చోటు . త్రిపుర రాష్ట్రము రాధా కిశోర్‌పూర్, అమ్మవారు త్రిపుర సుందరి

## అమ్మవారి ఉపశక్తి పీఠములు - 108

1 విశాలాక్షి కాశీ వారణాసి జిల్లా ఉత్తరప్రదేశ్ 2 లింగధారిణి - నైమి శారణ్యం సితాపూర్ జిల్లా 25 కి మీ, బలమావూ R S ఉత్తరప్రదేశ్ 3 లలితాదేవి - ప్రయాగక్షేత్రం అల్హాబాద్ త్రివేణీ సంగమం ఉత్తరప్రదేశ్ 4 కామాక్షిదేవి - గందమాధన పర్వతం రామనాధ పురం జిల్లా 4 కి మీ రామేశ్వరం తమిళనాడు 5 కుముదాదేవి - మానస. సరోవరం కైలాస పర్వతమునానుకుని టిబెట్ 6 విశ్వకామ - అంబర్ (ఆమోర్). 7. గోమతి - గోమంత పర్వతం గౌహతి బ్రహ్మపుత్రా నదీ తీరం నీలాంచల పర్వతముపై వెలసిన కామాఖ్య దేవి అస్సాం. 8. కామచారిణి - మందరా పర్వతం. 9 మధోత్కట - చైత్రరధ వనం 10. జయంతి - హస్తినాపురం, ఢిల్లీ 11 గౌరి - కన్యాకుబ్జం కనౌజ్, ఫరూకాబాద్ జిల్లా. ఉత్తరప్రదేశ్ 12. రంభ - మలయాచలం. 13. కీర్తిమతి - ఏకామ్రక క్షేత్రం కంచి, తమిళనాడు 14 విశ్వేశ్వరి విశ్వం - కాశీ, ఉత్తరప్రదేశ్ 15 పురుహూతా - పుష్కర్‌లో. పిఠాపురం. ఆంధ్రప్రదేశ్. 16 మార్గదాయిని - కేదారం చమోలి జిల్లా ఉత్తరప్రదేశ్ 17. నంద - హిమాచలపర్వతము. నందా దేవి శిఖరం 18 భద్ర కర్ణిక - గోకర్ణం కర్నాటక. ఉత్తర కన్నడజిల్లా 19. భవాని - స్థాణేశ్వరం కన్యాకుమారి అగ్రం. 13 కి.మీ. శుచీంద్రం. తమిళనాడు 20 బిళ్వ పత్రిక బిళ్వకం 21 మాధవి - శ్రీశైలం కర్నూలు జిల్లా, ఆంధ్రప్రదేశ్. 22. భద్ర - భద్రేశ్వర్. 23 జయ - వరాహశైలిపై, 24. కమలాంబిక - కమలాలయ. తిరువారూర్, తంజావూరు జిల్లా. తమిళనాడు, 25. రుద్రాణి - రుద్రకూటి 26. కాళి - కళంజర్ పర్వతం, కలకత్తా, పశ్చిమ బెంగాల్, 27. కపిల సాలగ్రామ మహాలింగంలో 28 ముకుటేశ్వరి మార్కోట, 29. మహాదేవి సాలగ్రామములో - ముక్తినాధ్ / గండకి, నేపాల్, 30. జలప్రియ . శివలింగములో 31 కుమారీ : మాయాపురి (హరిద్వారం) హరిద్వార్ జిల్లా. గంగాతీరం. ఉత్తరప్రదేశ్, 32. లలితా / అంబిక - సంతానక్షేత్రం 33. ఉత్పలాక్షి - సహస్రాక్షలో / హిరణ్యాక్షలో, 34. మహోత్పల - కమలాక్షలో, 35. మంగళ - గంగాతీరాన, గయ, బీహార్, గయజిల్లా, 36. విమల - పురుషోత్తమ క్షేత్రం, పూరీ, బంగాళాఖాత తీరం, ఒరిస్సా 37 అమోఘాక్షి - వ్యాసనది / విపాశనదీ తీరాన 38. పాటలా - పుండవర్ధనంలో 39 నారాయణి - సుపార్శ్వములో 40 భద్రసుందరి / రుద్రసుందరి - వికూట్‌లో / త్రికూట్‌లో 41 విపులేశ్వరి - విపులలో 42. కళ్యాణి - మలయాచలముపై 43. ఏకవీర - సహ్యాద్రి, కొల్లూరు, సహ్యాద్రి పర్వత మొదట్లో దక్షిణ కన్నడ జిల్లా, కర్నాటక 44 సుగంధా / చంద్రికా మాధవ వనములో / హరిశ్చంద్రలో 45. త్రి సంధ్యా - కుబ్జామ్రక్‌లో, ఋషీకేశ్, ఉత్తరప్రదేశ్, 46. రతిప్రియ - గంగా ద్వారములో, హరిద్వారం, ఉత్తరప్రదేశ్ 47 సునంద / సుఖనంద - శివ గుండములో 48. నందిని - దేవికాతీరాన, 49 రుక్మిణీ - ద్వారక,

జామ్ నగర్ జిల్లా, గుజరాత్ 50. రాధా - బృందావనములో, బర్సానా, మధుర జిల్లా 51. దేవకి / చాముండి - మధురలో, మధుర జిల్లా, ఉత్తరప్రదేశ్ 52. పరమేశ్వరి - పాతాళ్‌లో, 53. సీత - చిత్రకూటం, సీతాపూర్ గ్రామం, 8 కి.మీ. కరవీ R S బందా జిల్లా పయోష్ణీ నదీతీరం ఉత్తరప్రదేశ్, 54. వింధ్యవాసిని - వింధ్యాచలం R S, 6 కి మీ మిర్జాపూర్ R S మీర్జాపూర్ జిల్లా. ఉత్తరప్రదేశ్, 55. ఏకవీర - సహ్యాచలముపై మాహోర్. నాందెడ్ జిల్లా 120 కి.మీ నాందెడ్, మహారాష్ట్ర, 56. చంద్రికా : హరిశ్చంద్రపై 57 రమణ - రామతీర్థములో 58 మృగవతీ - యమునా నదీ తీరం. 59. మహాలక్ష్మి - కరవీరం. కొల్హాపూర్, కొల్హాపూర్ జిల్లా. మహారాష్ట్ర 60. ఉమాదేవి - వినాయకక్షేత్రం, పూనే, మహారాష్ట్ర 61 ఆరోగ్య - వైద్యనాథ్‌లో, వైద్యనాథ్ ధామ్, 5 కి.మీ జెషీడి R.S దేవగఢ్ జిల్లా. బీహార్ 62 మహేశ్వరి - మహాకాళములో వెస్ట్‌నిమార్ 10 కి మీ.ఈ కసర్‌వాడ్, వెస్ట్‌నిమార్ జిల్లా, మధ్యప్రదేశ్, 63. అభయ - ఉష్ణ తీర్థములో, 64. అమృత - వింధ్య - కందారములో, 65 మాండవీ - మాండవ్యలో, 66. స్వాహా · మహేశ్వర పురం (మహిష్మతి) 67. ప్రచండ - చెగలాండలో 68. చండిక - అమర్ కంటక్. షాదోల్ జిల్లా, 50 కి.మీ షాదోల్. 50 కి.మీ. బిలాస్‌పూర్, నర్మద, సోన్ నదుల జన్మస్థావరం. మధ్యప్రదేశ్, 69. వరాగోహ - సోమేశ్వరములో 70 పుష్కరావతీ - ప్రభాసలో, ప్రభాస తీర్థం. సోమనాథ్. 7 కి.మీ. వీరావల్. జూనాగఢ్ జిల్లా, గుజరాత్, 71. దేవమాత - సరస్వతీ - సముద్ర సంగమములో 72. మహాభాగ - మహాలయంలో 73. పింగళేశ్వరి - పయోష్ణీ నదీ తీరాన 74. సింహిక - కృతసాచ్‌లో, 75. యశస్కరి - కార్తికేయ క్షేత్రములో 76. లోలా / లీలా - ఉత్పలా వర్తములో 77. సుభద్ర - సోణ - గంగా సంగమములో 78. లక్ష్మీమాత - సిద్ధపూర్‌లో 30 కి.మీ. అహ్మదాబాద్, అహ్మదాబాద్ జిల్లా. గుజరాత్, 79. అంగనా / అనంగ - భరతాశ్రమములో, 80. విశ్వముఖి - జలంధర్‌లో జలంధర్ జిల్లా, పంజాబ్ 81. తారా - కిష్కింధాపర్వతముపై, హంపి 10కి.మీ. హోస్పేట. బళ్ళారి జిల్లా, కర్నాటక 82. పుష్టి - దేవదారు వనములో 83 మేధా - కాశ్మీర్ మండలములో వైష్ణవ దేవి. 14 కి.మీ. కాట్రా, ఉధంపూర్ జిల్లా, జమ్మూ &కాశ్మీర్ 84. భీమాదేవి - హిమాద్రిలో 85. పుష్టి / తుష్టి- విశ్వేశ్వర్‌లో, 86. సుద్ధి - కపాలమోచనలో 87. మాతా - కాయావరోహణలో, 88. ధ్వని / ధరా - శంఖోద్వార్‌లో, 89. ధృతి - పిండారకలో, 90. కాలా / కలా - చంద్రభాగ నదీ తీరాన, భీమానది పుట్టినచోటు, భీమేశ్వరం, మహారాష్ట్ర భీమానదికి చంద్రభాగ అని పేరు. 91. శివకారిణి / శివధారిణి - అచ్ఛోధలో 92. అమృతా - వేణా తీరాన 93. ఊర్వశి - బదరి వనములో బద్రీనాథ్, చమోలి జిల్లా, ఉత్తరప్రదేశ్, 94. ఓషధి - ఉత్తరకురులో, 95. కుశోదక - కుశాదీపములో 96. మన్మథా - హేమకూట పర్వతముపై 97 సత్యావాదిని - ముకుట్‌లో (కిరీటములో) . రాజ్యాధికారములో 98. వందనీయ - అశ్వత్థ (పీపాల్) లో అశ్వత్థ వృక్షములో 99. నిధి - కుబేర గృహ (అలకాపురిలో) ధనవంతుల ఇండ్లలో, 100. గాయత్రి

- వేదాలలో 101 పార్వతి (6 శివసాన్నిధ్యములం6) 102. ఇంద్రాణి - దేవలోకములో, 103. సరస్వతి - బ్రహ్మముఖములో, 104. ప్రభ - సూర్యమండలములో, 105. వైష్ణవి - మాతృకలలో, 106. అరుంధతి (పతివ్రతలలో), 107. తిలోత్తమ - రమణులలో, 108. శక్తి - దేహదారులలో

శ్లోకములో నుదహరించిన కొన్ని స్థలములను నిర్ధారించకపోయినను ఇతర ముఖ్యమైన దర్శించవలసిన ఉపశక్తి పీఠములు చాల గలవు. వీటిలో కొన్ని శ్లోకములోని స్థలములై యుండవచ్చును.

1 మహామాయి : కురుక్షేత్రం U.P 2. లలితాదేవి · హాతియా 12 కి.మీ. నైమిశారణ్యం U.P 3. శారదాంబ : శృంగేరి, చిక్ మగుళూర్ జిల్లా 97 కి.మీ చిక మగుళూర్, కర్నాటక 4, గౌరీదేవి . కనౌజ్ U P 5. భవాని . తుల్జాపూర్ 40 కి.మీ. షోలాపూర్, మహారాష్ట్ర 6 సుభద్ర : పూరీ, ఒరిస్సా 7. గంగాదేవి . గంగాసాగర్ 135 కి.మీ కలకత్తా W.B 8. చర్చికాదేవి : బాంకీ గ్రామం. కుర్దా రోడ్ నుండి బస్సు. మహానదీ తీరం. ఒరిస్సా 9. నారాయణి . కళ్ళికోట 70 కి.మీ కుర్దా రోడ్ 18 కి మీ బాలుగా. ఒరిస్సా 10. ఖేరీమాత . దతియా. 25 కి.మీ. ఝాన్సీ U.P 11. సప్తశృంగి : సప్తశృంగి 38 కి.మీ. నాసిక్. నాసిక్ జిల్లా మహారాష్ట్ర 12 కైలామాత : కైలామాత 30 కి.మీ. కశౌలి. ఆగ్రా జిల్లా. U.P. 13. శివశక్తి : బుడగామ్ 30 కి.మీ. ఢిల్లీ హర్యానా, 14. జీణమాత : శేకర్ (శిఖర్) శేకర్ జిల్లా. 25 కి.మీ. శేకర్ R.S. రాజస్తాన్ 15. శాకంబరి నవల్‌గఢ్ R.S 135 కి.మీ. జైపూర్, ఝున్ ఝునూన్ జిల్లా, రాజస్తాన్ 16. మంగళాదేవి : మంగుళూరు కర్నాటక 17 కనకదుర్గ - విజయవాడ A.P. 18. సదాపూర్ణ : కాళేశ్వరం A.P 19. చాముండి : శిరసి. 86 కి.మీ. హుబ్లి, ధార్వాడ్ జిల్లా, కర్నాటక 20. మీనాక్షి మధురై, తమిళనాడు 21. నైనాదేవి : నంగల్ 64 కి.మీ. అల్‌మోరా .పంజాబ్ 22. చింతపూర్ణి . వూనా, వూనా జిల్లా . హోషియార్ పూర్ నుండి బస్సు 23. వజ్రేశ్వరి . నగర్ కోట ధామ్ H P 24. చాముండా దేవి - నందికేశ్వర ధామ్, H.P 25. చండీదేవి : 10 కి.మీ. చండీగఢ్ 26. దుర్గ/కాళి : పాటియాల, 64కి.మీ చండీగఢ్. పంజాబు 27. కాళికాదేవి : కల్కా H P. 28. భద్రకాళి : కురుక్షేత్రం 29. హిడింబ : మనాలి H.P. 30. నరసింగి : చంబాలోయ U P. 31. జ్ఞాన సరస్వతి : బాసర A.P. 32. రాజరాజేశ్వరి : చోట్టానికర . కేరళ, 33. తారాదేవి . తారాఫీర్ W B. 34. చండిల్లాదేవి : మహోబా M.P. 35. సీతాదేవి : అయోధ్య U.P 36, రుక్మిణి మాత : మధుర U P 37. మాయాదేవి : హరిద్వారం U.P. 38. మంగళాంబిక : కుంభకోణం, తమిళనాడు, 39. కర్ణిమాత · దేష్నోక్ 26 కి.మీ. బికనీర్. రాజస్తాన్ 40. ఆధార్ దేవి . మౌంట్ ఆబూ రాజస్తాన్ 41. అఖిలాండేశ్వరి : జంబుకేశ్వరం 10 కి మీ ట్రిచ్చి, తమిళనాడు 42. సచియా దేవి · సచియా 60 కి.మీ. జోధపూర్ . రాజస్తాన్

43 చాముండి బేరాఘాట్ 17 కి మీ జబ్బల్‌పూర్ M P 44 భువనేశ్వరి చంద్రనాగోర్ 37 కి మీ కలకత్త, W B 45 హంసేశ్వరి బండేల్ 43 కి మీ W B 46 దేవీ జగదాంబ ఖజరహో M P 47 దుర్గియానా అమృతసర్ పంజాబ్ 48 కేసరీదేవి అల్మోరా 68 కి మీ నైనితాల్ U P 49 నారాయణి చిలక సముద్రం 11 కి మీ , చిలక సముద్రం ఒరిస్సా 50 భద్రకాళి వరంగల్ A P 51 వాక్కాలి అమ్మన్ తిరుచినాపల్లి.తమిళనాడు 52 మారియమ్మ సమయపురం T N 10 కి మీ ట్రిచ్చి 53 చాతుర్ శృంగి పూనే మహారాష్ట్ర 54 హర్షద్‌మాత . పోర్‌బందర్. అరేబియా సముద్ర తీరం గుజరాత్, 55 సంతోషి మాత . ఉజ్జయిని హర్షద్ మాతా మందిరం వెనుక. M P 56 వజ్రేశ్వరి వజ్రేశ్వరి .80 కి మీ ముంబాయి మహారాష్ట్ర 57 ముంబాదేవి ముంబాయి 58 బాల చాముండిక అమరావతి. గుంటూరు జిల్లా A P 59 భగవతి, చెంగనూర్, కేరళ 60 శాంత దుర్గ కవెళం 33 కి మీ పానాజీ, గోవా, 61 తారాదేవి గౌహతి 7 కి మీ గౌహతి అస్సాం 62 భైరవి తేజ్‌పూర్ 190 కి మీ. గౌహతి అస్సాం 63 జానకీదేవి జయా నగర్ 66 కి మీ దర్భాంగ.నేపాల్ బోర్డర్, బీహార్ 64. రాజరాజేశ్వరి వేములవాడ . కరీంనగర్ జిల్లా AP 65 కామాక్షితాయి జొన్నవాడ ,నెల్లూరుజిల్లా . పెన్నానదీ తీరం A.P 66 త్రిపుర సుందరి త్రిపురాంతకం 46 కి.మీ. వినుకొండ గుంటూరుజిల్లా A P 67 శాకంబరీ దేవి వనశాంకరీ దేవి శాకంబరి 50 కి మీ బదామి కర్నాటక 68 కామాక్షి దేవి . మాంగాడు.20 కి మీ మద్రాసు.T N 69 మహామాయి హీరాపూర్.20 కి మీ భువనేశ్వర్ భార్గవీ నదీ తీరం ఒరిస్సా 70 లలితాదేవి నైమిశారణ్యం U P 71 తామ్రగౌరి గోకర్ణం. కర్నాటక 72. లంకేశ్వరి దీఘా 200 కి.మీ కలకత్తా. ఒరిస్సా బోర్డర్ , W B 73 కపాలకుండల 45 కి.మీ దీఘా, 230 కి మీ కలకత్తా W B 74. అంబికామాత జగత్, 58 కి.మీ ఉదయ్‌పూర్. రాజస్తాన్ 75 మహిష మర్దిని మహాబలిపురం 60కి మీ మద్రాసు T N 76 భగవతి భగవతి 26 కి మీ పానాజీ,గోవా 77. దంతేశ్వరి దంతెవాడ 85 కి మీ. జగదల్‌పూర్ M P 78 భగవతి అరువికర 16 కి మీ. త్రివేంద్రం కేరళ 79 షీలాదేవి అంబర్.11 కి.మీ జైపూర్, రాజస్తాన్ 80. అంబామాత రాణక్‌పూర్.96 కి.మీ ఉదయపూర్, రాజస్తాన్ 81 సుగంధ కుంతలాంబిక తిరుచినాపల్లి T N 82 పర్వత వర్ధినీ దేవి రామేశ్వరం రామనాధ పురం జిల్లా.బంగాళాఖాత తీరం T.N 83 బృహన్నాయకి తంజావూరు 84 తారాదేవి చండీపూర్ 13 కి మీ రాంపూర్ హాట్ R S. బీర్‌భం జిల్లా W B 85 పెద్దింట్లమ్మ కొల్లేటి కోట - AP కృష్ణాజిల్లా

# శివుని అష్టోత్తర శత దివ్య ఆలయములు (108)

వీటి కాధారముగా పురాణములలో చెప్పబడిన వ్యాస మహర్షి విరచితంబైన సంస్కృత శ్లోకం మాత్రము గలదు దాని నాధారముగా చేసికొని నేడు దర్శించుటకు సాధ్యమయినంత వరకు వివరములు ఇవ్వబడినవి

1 కైవల్య పర్వతములోనున్న శ్రీకంఠుడు లేక గరళకంఠుడు "వెండికొండ" అని పిలువబడు కైలాస పర్వతముపై కొలువుదీరి యున్న స్వామి.మంచు కొండలలో ఉమా సమేత యోగమూర్తి

2 హిమాచలములలో నున్న కేదారేశ్వరుడు ఈ క్షేత్రము ఉత్తరప్రదేశ్‌లోని రుద్రప్రయాగకు 20కి మీ. దూరములోను, గుప్త కాశీకి 48కి మీ దూరములోను, 11,800'ల ఎత్తున నున్నది

3 కాశీలో విశ్వనాధ ఉత్తర ప్రదేశ్‌లో ఉన్న వారణాసి క్షేత్రములోని విశ్వనాథుడు.

4 శ్రీశైలం మీద మల్లికార్జునుడు కర్నూలు జిల్లాలోని నల్లమల అడవులలో డోర్నాలకు 51 కి మీ దూరములో వెలసిన శ్రీశైల క్షేత్రములోని మల్లికార్జున స్వామి

5 ప్రయాగలో నీలకంఠేశ్వరుడు ఉత్తర ప్రదేశ్‌లోని అల్హాబాద్ సమీపమున నున్న త్రివేణీ సంగమమైన ప్రయాగ క్షేత్రములో వెలసిన స్వామి వారు

6 గయలో మహారుద్రుడు బీహార్ రాష్ట్రములోని గయా క్షేత్రములో ఫల్గుణీ నదీ తీరాన వెలసిన స్వామివారు.

7. కాలింజర్‌లోని నీలకంఠేశ్వరుడు.

8. ద్రాక్షారామములోని భీమేశ్వరుడు. ఈ క్షేత్రము ఆంధ్ర ప్రదేశ్‌లోని తూర్పు గోదావరి జిల్లాలో కాకినాడకు 32 కి.మీ. దూరములో వెలసియున్నది

9. మాయూర పురములో అంబికేశ్వర్. ఈ క్షేత్రం తమిళనాడులోని సీర్‌కాళికి దగ్గరలో ఉన్నది

10. బ్రహ్మావర్తములో దేవలింగము

11. ప్రభాస క్షేత్రములో శశిభూషణుడు. ఈ క్షేత్రము గుజరాత్‌లోని అరేబియా సముద్ర తీరమున గలదు

12. శ్వేత హస్తిపురములో వృషభధ్వజుడు

13 గోకర్ణములో గోకర్ణనాధుడు ఈ క్షేత్రము కర్నాటకలో అరేబియా సముద్ర తీరమున మహాగోకర్ణేశ్వరుడు వెలసినది

14 సోమనాధ్‌లో సోమేశ్వరుడు ప్రభాస తీర్థము గుజరాత్

15. శ్రీ రూపాఖ్య పర్వతము మీద త్యాగేశ్వర్
16. వేదపురములో వేదేశ్వర్.
17. భీమారామ పురములో భీమేశ్వరుడు  ఈ క్షేత్రము ఆంధ్రప్రదేశ్‌లోని కరీంనగర్ జిల్లా వేములవాడలో కలదు
18. మంతనపురములో కాళికేశ్వరుడు  ఈ క్షేత్రము ఆంధ్రప్రదేశ్‌లోని కరీంనగర్ జిల్లాలో మంతిన గ్రామమున వెలసియున్నది
19. మానసరోవరములో మాధవేశ్వరుడు  ఇది ఉత్తరప్రదేశ్‌లోని ప్రయాగ క్షేత్రమున కలదు.
20. శ్రీ వాంచకపురములో  చంపకేశ్వరుడు.
21. పంచవటిలో పటేశ్వరుడు  ఈ క్షేత్రం మహారాష్ట్రలోని నాసిక్ వద్ద ఉన్నది
22. గజారణ్యములోవైద్యనాదుడు  ఈ క్షేత్రము హిమాచల ప్రదేశ్‌లోని కాంగ్డాలోనున్నది
23. తీర్ధాద్రిలో తీర్థకేశ్వర్.
24. కుంభకోణంలో కుంభేశ్వర్.  ఈ క్షేత్రము తమిళనాడులోని తంజావూరు జిల్లాలో గల కుంభకోణము.
25. లేపాక్షి పురిలోని పాపనాశనేశ్వర్  ఈ క్షేత్రము ఆంధ్రప్రదేశ్‌లోని అనంతపురం జిల్లాలో గల హిందూ పురమునకు 20 కి మీ  దూరమున నున్నది.
26. కణ్వపురిలో కణ్వేశ్వర్
27 మధ్య పర్వతముపై మధ్యార్జునేశ్వరుడు
28. హరిహర క్షేత్రములో శ్రీశంకర నారాయణేశ్వరుడు  ఈ క్షేత్రము తమిళనాడులోని తిరునల్వేలికి 54 కి మీ  దూరములో నున్నది
29. విరంజిపురములో మార్గేశ్వరుడు.
30. పంచనదీ సంగమములో గిరీశ్వరుడు.  ఈ క్షేత్రము ఆంధ్రప్రదేశ్‌లోని కరీంనగర్ జిల్లాలోని కాళేశ్వర క్షేత్రము. ఇచ్చట వరద, వైన్య, ప్రణీత, సరస్వతి, గోదావరి నదుల సంగమస్థానము.
31. పంపాపురములో విరూపాక్ష నాధుడు  ఈ క్షేత్రము కర్నాటకలోని హాస్పేట్‌కు 10 కి మీ. దూరమున గల హంపి క్షేత్రము
32. సోమాద్రిలో మల్లికార్జునేశ్వరుడు  ఈ క్షేత్రము మహారాష్ట్రలోని ఇలార్కేకు 6 కి మీ దూరములో నున్న గాట్‌ఖండ్ క్షేత్రము  కొల్హాపూర్ - పూనే రోడ్డులో
33. త్రిమండ కూటమిలోని అగస్త్యేశ్వరుడు  ఈ క్షేత్రం ఉత్తర ప్రదేశ్‌లోని సత్నాకు 70 కి మీ  దూరమున నున్న చిత్రకూటమున నున్నది.

34 సుబ్రహ్మణ్యక్షేత్రములో అహిపేశ్వరుడు ఈ క్షేత్రము కర్నాటకలోని మంగుళూరుకు 100 కి.మీ దూరములో కుమార నదీ తీరమున కలదు.

35 మహాబలి పర్వతముపై నున్న మహాబలేశ్వరుడు ఈ క్షేత్రము మహారాష్ట్రమున నున్నది పూనే నుండి, కొల్హాపూర్ నుండి, సతారా నుండి బస్సుపై వెళ్ళవచ్చును వర్షాకాలమున వీలుకాదు ఇది 5 నదుల జన్మస్థానము

36 దక్షిణావర్త పర్వతముపై వెలసిన అర్కేశ్వరుడు

37. వేదారణ్య పురములో వేదారణ్యేశ్వరుడు ఈ క్షేత్రము తమిళనాడులోని మన్నార్ గుడికి 50 కి మీ. దూరమున నున్న వేదారణ్యంలో నున్నది

38 సోమపురిలో సోమేశ్వరుడు

39 అవంతిలో రామలింగేశ్వరుడు ఈ క్షేత్రము మధ్యప్రదేష్‌లోని షిప్రా నదీ తీరమున ఉజ్జయినిలో కలదు

40 కాశ్మీరములో విజయేశ్వరుడు. ఈ క్షేత్రము కాశ్మీరములోని మంచులింగము - అమర్‌నాధ్

41 మహానంది పురములో మహానంది పేరేశ్వరుడు ఈ క్షేత్రము ఆంధ్రప్రదేశ్‌లోని కర్నూలు జిల్లాలో నంద్యాలకు 16 కి మీ దూరములో నున్నది.

42. కోటి తీర్థంలో కోటీశ్వర నాధుడు ఈ క్షేత్రము ఆంధ్రప్రదేశ్‌లోని తూ గో జిల్లాలో గోదావరి తీరమున వెలసిన కోటిపల్లి

43. వృద్ధాచలముపై అచలేశ్వర నాధుడు. ఈ క్షేత్రము రాజస్థాన్‌లోని ఆబూ పర్వతముపై కలదు

44. కకుద్ గిరిపై నున్న గంగాధరేశ్వరుడు ఈ క్షేత్రము కర్నాటకలోని మాగడినందు గలదు. 46 కి.మీ. మంగుళూరు.

45. చామరాజు నగరములో చామరాజేశ్వరుడు ఈ క్షేత్రము కర్నటకలోని మైసూర్‌నకు దగ్గరలో కలదు.

46 నందగిరిపై నందేశ్వరుడు. ఈ క్షేత్రము కర్నాటకలోని బెంగుళూరునకు సమీపమున గలదు.

47 బధిరాచలములోని చండీశ్వరుడు ఈ క్షేత్రము కర్నాటకలోని చాముండి పర్వతముపై గలదు

48 శ్రీనగరములో నంజుండేశ్వరుడు ఈ క్షేత్రము కర్నాటకలో మైసూర్‌నకు 20 కి మీ దూరమున నున్న నంజన్‌గూడ్ నందు కలదు

49 శతశృంగముపై నున్న సర్వాధిపేశ్వరుడు

50 ఘనానంద పర్వతముపై వెలసిన సోమనాధుడు

51 నల్లూరు పురములో వెలసిన విమేశ్వరుడు

52 నీడానాథ్ పురములోని నీడానాథేశ్వరుడు.

53 ఏకాంత స్థానములోని రామలింగేశ్వరుడు ఈ క్షేత్రము తమిళనాడులోని రామనాథపురం జిల్లాలోనున్న ఏకాంతరామేశ్వరము

54. శ్రీనాగపురములోని కుండలీశ్వరుడు. ఈ క్షేత్రము మహారాష్ట్రలోని నాగపూర్‌లో కలదు

55. శ్రీ కన్యా క్షేత్రములో త్రిభండీశ్వరుడు. ఈ క్షేత్రము తమిళనాడులోని కన్యాకుమారి అగ్రమున కలదు.

56 శ్రీ ఉత్తుంగ క్షేత్రములోని శ్రీ రాఘవేశ్వరుడు

57. మత్స్య తీర్థంలోని తీర్థేశ్వరుడు.

58 త్రికూటాచలముపై తాండవేశ్వరుడు. ఈ క్షేత్రము ఆంధ్రప్రదేశ్‌లోని నర్సరావు పేటకు 10 కి.మీ దూరములో నున్న కోటప్పకొండ. త్రికూటేశ్వర క్షేత్రము. కోటేశ్వర స్వామి వారి ఆలయములో జనాకర్షణ చక్రము స్థాపించబడినది.

59. ప్రపన్నాఖ్య పురములో మార్గ సహాయేశ్వరుడు.

60. గండకీలో శివనాభుడు. ఈ క్షేత్రము నేపాల్‌లోని ముక్తినాథ్, గండకీ, దేవిక, చక్రానదుల సంగమ స్థానము. 75 కి.మీ పోఖర, ధవళగిరి జిల్లా 20 కి మీ. జాసం.

61. శ్రీపతి పురములో శ్రీపతీశ్వరుడు.

62. ధర్మపురిలో నున్న ధర్మలింగం. ఈ క్షేత్రము ఆంధ్రప్రదేశ్‌లోని కరీంనగర్ జిల్లాలో నున్నది.

63. కన్యా కుబ్జములో కళాధరుడు ఈ క్షేత్రము ఉత్తరప్రదేశ్‌న నున్నది.

64 వాణీగ్రామ పురములోని విరంజీశ్వరుడు

65. నేపాల్‌లోని నకులేశ్వరుడు.ఖాట్మండులో వెలసిన పశుపతి నాధుడు.

66. జగన్నాధపురములోని మార్కండేశ్వరుడు. ఈ క్షేత్రము ఒరిస్సాలో నున్న పూరీ జగన్నాధము.

67 నర్మదా తీరాన ఓం కారేశ్వరుడు ఈ క్షేత్రము మధ్యప్రదేశ్‌లోని ఓంకారేశ్వర క్షేత్రం

68. ధర్మస్థలములో మంజునాధుడు. ఈ క్షేత్రము కర్నాటకలోని మంగుళూరుకు 75 కి.మీ దక్షిణ కెనరా జిల్లాలో, బేలతన్‌గడి తాలూకాలో గలదు

69 త్రిరూపపురములో వ్యాసేశ్వరుడు ఈ క్షేత్రము ఉత్తర ప్రదేశ్‌లోని కాశీకి దగ్గరలో నున్నది

70 స్వర్ణవతీ పురములోని కలిగేశ్వరుడు ఈ క్షేత్రము మహారాష్ట్రలోని కొల్హాపూర్‌నకు 15 కి మీ దూరములో పన్హాల తాలూకాలోని కాలే గ్రామమున గలదు

71 నిర్మలా చలముపై పన్నగేశ్వరుడు

72 పుండరీక పురములో జైమినేశ్వర్. ఈ క్షేత్రము మహారాష్ట్రలోని పుండరీక పురము చంద్రబాగ నదీ తీరం

73. అయోధ్యలో మధుకేశ్వరుడు. ఈ క్షేత్రము ఉత్తరప్రదేశ్‌లోని అయోధ్యలో కలదు

74 సిద్దవటములో సిద్దేశ్వర్ ఈ క్షేత్రము మహారాష్ట్రలోని షోలాపూర్ నందు కలదు

75 శ్రీ కూర్మాచలముపై త్రిపురాంతకుడు

76 మణికుండల తీర్థములో మణిముక్తా నదీశ్వరుడు.

77 వటాటవిలో కృత్తివాస నాధుడు

78. త్రివేణిలో సంగమేశ్వరుడు ఈ క్షేత్రము తమిళనాడులోని భవానిలో గలదు. ఇచ్చట మూడు నదుల సంగమ స్థానమున వెలసిన స్వామివారు.

79. అస్తమితా పురములో మల్లేశ్వరుడు

80. ఇంద్రకీలములో అర్జునేశ్వరుడు. ఈ క్షేత్రము ఆంధ్రప్రదేశ్‌లోని కృష్ణాజిల్లాలో నున్న విజయవాడ (విజయేశ్వర్).

81 శేషాద్రిపై కపిలేశ్వర్ ఈ క్షేత్రము ఆంధ్రప్రదేశ్‌లోని చిత్తూరు జిల్లాలో గల తిరుమల

82. పుష్పగిరి పర్వతముపై పుష్పగిరీశ్వరుడు ఈ క్షేత్రము ఆంధ్రప్రదేశ్‌లోని కడప జిల్లా కడపకు 15 కి.మీ దూరములో నున్నది.

83 చిత్రకూటంలో భువనేశ్వరుడు. ఈ క్షేత్రము ఉత్తర ప్రదేశ్‌లో సత్నాకు 70 కి.మీ దూరములో నున్నది.

84. ఉజ్జయన పురములో మహాకాళేశ్వరుడు ఈ క్షేత్రము మధ్యప్రదేశ్‌లోని ఇండోర్‌నకు 55 కి మీ. దూరములో నున్న ఉజ్జయిని పట్టణము.

85 జ్వాలాముఖీ పర్వతముపై శూలటంకేశ్వరుడు. ఈ క్షేత్రము హిమాచల్ ప్రదేశ్‌లోని కాంగ్డా జిల్లాలోని జ్వాలాముఖి క్షేత్రము

86. మంగళగిరి శిఖరముపై నున్న సంగమేశ్వరుడు

87. తంజాపురములోనున్న బృహదీశ్వరుడు. ఈ క్షేత్రము తమిళనాడులోని తంజావూరు నందు గలదు

88 వహ్ని పుష్కరక్షేత్రములోని రామేశ్వరుడు ఈ క్షేత్రము తమిళనాడులోని రామనాధపురం జిల్లాలోని రామేశ్వరము

89 లంకా ద్వీపములో మత్స్యేశ్వరుడు

90 గందమాధన పర్వతముపైనున్న కూర్మేశ్వరుడు ఈ క్షేత్రము తమిళనాడులోని రామనాధపురం జిల్లాలోని రామేశ్వరమునకు 4 కి మీ దూరమున గలదు

91. వింధ్యాచలముపై వరాహేశ్వరుడు. ఈ క్షేత్రము ఉత్తర ప్రదేశ్‌లోని మీర్జాపూర్‌నకు 6 కి.మీ. దూరమున నున్నది. వింధ్యాచలం,

92. అహోబలములోని నృసింహేశ్వరుడు. ఈ క్షేత్రము ఆంధ్రప్రదేశ్‌లోని కర్నూల్ జిల్లాలో గల అహోబిలం. ఆళ్ళగడ్డ నుండి, నంద్యాల నుండి బస్సుపై వెళ్ళవచ్చును

93. కురుక్షేత్రములోని వామనేశ్వరుడు. ఈ క్షేత్రము హర్యానాలో గలదు.

94. కపిల తీర్థములో పరశురామేశ్వరుడు, ఈ క్షేత్రము ఒరిస్సాలోని భువనేశ్వరములో కలదు.

95. సేతుబంధం పైగల రామేశ్వరుడు. ఈ క్షేత్రము తమిళనాడులోని రామనాధపురములో గలదు.

96. సాకేతపురములో నున్న బలరామేశ్వరుడు.

97. వారణావత పురములో (దక్షిణ కాశీ) నున్న బౌద్దేశ్వరుడు. ఈ క్షేత్రము ఆంధ్రప్రదేశ్‌లో గుంటూరు జిల్లాలో, కృష్ణానదీ తీరానగల అమరావతి.

98. తత్వ క్షేత్రములో కలంకీశ్వరుడు.

99. మహేంద్ర పర్వతముపై నున్న కృష్ణేశ్వరుడు

100. కైలాస పర్వతముపైనున్న పరమ శివుడు. టిబెట్‌లోని మానస సరోవరము

101. సూర్యబింబములోని సదాశివుడు.

102. వైకుంఠములోని నారాయణేశుడు.

103. పాతాళములోని హటకేశ్వరుడు.

104. బ్రహ్మలోకములో బ్రహ్మేశ్వరుడు.

105. ఇంద్రప్రస్థములో లోకనాధుడు.

106. అమరకంటక్‌లో గల అమరనాథ్ ఈ క్షేత్రము మధ్యప్రదేశ్‌లోని నర్మదా, సోని నదుల పుట్టుక స్థానమున గలదు.

107. లవపురిలో పశుపతినాథ్. ఈ క్షేత్రము నేపాల్‌లోని ఖాట్మండు నగరమున గలదు.

108. రుద్రప్రయాగలో ఏకాదశ రుద్రేశ్వరుడు. ఈ క్షేత్రము మధ్యప్రదేశ్‌లోని బదరీనాథ్‌కు పోవు త్రోవలో గలదు.

శ్లోకములో నుదహరించిన కొన్ని స్థలములను నిర్ధారించకపోయినను ఇతర ముఖ్యమైన దర్శించవలసిన దివ్య క్షేత్రములు చాల గలవు వీటిలో కొన్ని శ్లోకములోని స్థలములై ఉండవచ్చును

1 ఛాయా వనములోని ఛాయాలింగేశ్వరుడు (వనేశ్వరుడు), 2. హిరణ్య గర్భ క్షేత్రములో మహదేవేశ్వరుడు 3 ఆమ్రాతక క్షేత్రములో సూక్ష్మేశ్వరుడు, 4 మధురైలోని సుందరేశ్వరుడు,

5 పక్షి తీర్థములోని చొక్క లింగేశ్వరుడు, 6. పశ్చిమ బెంగాల్‌లోని తారకేశ్వరుడు, 7. ఒరిస్సాలోని భువనేశ్వర్‌లోని లింగ రాజేశ్వరుడు, 8. ఖజరహోలోని ఖండార్య మహదేవుడు, 9. ఉదయపూర్‌లోని ఏకలింగ్‌జీ, 10. జబ్బల్‌పూర్‌లోని గౌరీశంకరుడు, 11. కాశీలోని విశ్వేశ్వరుడు, 12. వడనగర్‌లోని హటకేశ్వరుడు, 13. అరుణాచలములోని తిరువన్నామలైస్వామి, 14. గోకర్ణక్షేత్రంలోని మహాగోకర్ణేశ్వరుడు, 15. మెర్కారాలోని ఓంకారేశ్వరుడు, 16. రాయవెల్లూర్‌లోని జలకంఠేశ్వరుడు 17. తిరుఒక్కరాయిలోని చంద్రమౌళీశ్వరుడు, 18. కాంచీపురములోని కైలాసనాధుడు, 19. ఉజ్జయినిలోని నీలకంఠ మహదేవ్, 20. గుప్తేశ్వరములోని గుప్తేశ్వరుడు, 21. రజవారిలోని మార్కండేయుడు 22. శ్రీముఖలింగంలోని ముఖలింగేశ్వరుడు, 23. తిరువలంచుజిలోని నీలకంఠేశ్వరుడు 24. ఔరంగాబాద్‌లోని అవలోకితేశ్వరుడు 25. తిరువత్తియూర్‌లోని ఆదిపురీశ్వరుడు, 26. సీనోర్‌లోని భూతపాపేశ్వరుడు 27. బోధన్‌లోని గౌతమేశ్వరుడు 28. నాగర్‌కోయిల్‌లోని నాగరాజేశ్వర్ 29. కాంతీశ్వరంలోని ఏకాంత లింగేశ్వర స్వామి, 30. అగస్త్యేశ్వర్‌లోని పాప వినాశనేశ్వర్ 31. దరశురామ్‌లోని ఐరావతేశ్వరుడు, 32. పట్టేశ్వరంలోని ధేనుపురీశ్వర్ 33. కుంభకోణములోని ఆది కుంభేశ్వర్, 34. వేదారణ్యములోని వేదనాయక, 35. తిరువారూర్‌లోని అచలేశ్వర్, 36. సిక్కాల్‌లోని నవనీతేశ్వర్, 37. తిరుక్కడయూర్‌లోని అమృత ఘటేశ్వర్, 38. తిరుమల్లిరుకు వేలూర్‌లోని వైద్యనాధ్, 39. తిరువేంగాడులోని శ్వేతారణ్యేశ్వర్, 40. తిరుప్పతిరి పులియార్‌లోని పాతాళేశ్వర్, 41. విల్లి వాక్కములోని కిరాత మార్జలేశ్వర్, 42. మద్రాసులోని కపాలేశ్వర్, 43 నేపాల్‌లోని గాలేశ్వర్ వగైరా.......

## దేశములోని పవిత్ర శైవ స్థలాలు - 274

### (తమిళములోని పెరియ పురాణము ఆధారముగా)

1) చిదంబరం · నటరాజ. 2) తిరుపేట్టకలం : పాశుపతేశ్వర్, 3 కి.మీ. చిదంబరం. 3) శివపురి : 5 కి.మీ. చిదంబరం. 4) తిరుక్కాళి పాలై : 12 కి.మీ. చిదంబరం, శివపురి సమీపాన. 5) అచ్చపురం : 5 కి.మీ. కోలరూన్. 6) కోయిలడిపాలయం (తిరు మహేంద్రిపాలయం): అచ్చాపురం నుండి 6 కి.మీ 7) తిరుముళ్ళవాయల్ : షియాలీ ఆర్.యస్. నుండి 13 కి.మీ. 8) అన్నప్పన్ పేటై (కాలిక్కామూర్) : తిరుముళ్ళవాయల్ నుండి 5 కి మీ 9) శాయావనమ్ · షియాలీ ఆర్ యస్ నుండి 14 కి మీ. కాశీక్షేత్రంతో సమానమైన 6 శైవ క్షేత్రములలో నొకటి. 1. శాయావనమ్ 2. వేదారణ్యం 3. తిరువాడి 4. మాయవరం 5. తిరువిడ మరుదూర్ 6. శ్రీవంగీయం. 10) పల్లనణిచ్చారం. శాయావనంకి దగ్గరలో 11) తిరువేంగాడ్ · షియాలీ ఆర్ యస్ నుండి 13 కి.మీ 12) తిరుక్కాటపల్లి . తిరువేంగాడ్ నుండి 2 కి మీ 13) తిరుక్కురు కావూర్ (తిరుక్కడవూర్) షియాలీ ఆర్.యన్. నుండి 6 కి మీ.

14) షియాలీ . బ్రహ్మపురీశ్వర్ 20 కి.మీ.చిదంబరం 15) తిరుత్తల ముడయార్ కోయిల్ · షియాలీకి సమీపాన. 16) వైదీశ్వరన్ కోయిల్ ఆర్.యస్ : వైద్యేశ్వర్ 17) తిరుక్కన్నర్ కోయిల్. 5 కి.మీ. వైదీశ్వరన్ కోయిల్ 18) కీలూరు : 5 కి.మీ. అనతాండవ పురం ఆర్ యస్ 19) తిరునిండియూర్. అనతాండవ పురం ఆర్.యస్. నుండి 3 కి.మీ. 20) తిరుప్పుంగూర్ .3 కి.మీ. వైదీశ్వరన్ కోయిల్ ఆర్.యస్ భక్తనందనార్ (హరిజన భక్తుడు) ప్రార్థించిన స్థలము 21) నీడూర్ : అనతాండవ పురం ఆర్.యస్. నుండి 2 కి.మీ. 22) పొన్నూర్ : అనతాండవ పురం ఆర్.యస్. నుండి 6 కి.మీ 23) వేళ్వక్కుండి : 5 కి.మీ. కుర్తాళం ఆర్.యస్. 24) తిరుమణం చేరి (పశ్చిమం): 3 కి.మీ వేళ్వక్కుండి. 25) తిరుమణంచేరి (తూర్పు): పై ఆలయమునకు సమీపమున 26) కురు క్కై : పొన్నూరు నుండి 6 కి.మీ. 27) తలైంజార్ . 5 కి మీ. తిరుప్పుంగూర్ 28) కురుక్కుక్కా : 2 కి.మీ.తలైంజార్ 29) వలప్పుత్తూర్ . తిరుప్పుంగనూర్ నుండి 3 కి.మీ. 30) ఇలుప్పేపట్టు : వలప్పుత్తూర్ నుండి 2 కి.మీ. 31) ఓమంపులియూర్ : ఇలుప్పేపట్టునుండి 3 కి.మీ. 32) కణత్తు ముల్లూరు : ఓమంపులియూర్ నుండి 5 కి.మీ 33) తిరుత్తురైయూర్ : చిదంబరమునుండి 15 కి.మీ. 34) కడంబూర్ (పశ్చిమం) : ఓమంపులియూర్ నుండి 6 కి.మీ. 35) పందనల్లూరు : తిరవడమరుదూర్ ఆర్.యస్ నుండి 13 కి.మీ. 36) కంజనూర్ : తిరవడమరుదూర్ ఆర్.యస్ నుండి 9 కి.మీ 37) తిరుక్కాడి కావల్ : తిరువడ మరుదూర్ ఆర్.యస్. నుండి 3 కి.మీ 38) తిరుమంగళకుడి : ఆడుతూరై ఆర్.యస్ నుండి 5 కి.మీ. 39) తిరుప్పనంతాల్ : ఆడుతురై ఆర్.యస్. నుండి 12 కి.మీ. 40) తిరువాణ్పాడి: తిరుప్పనంతార్ నుండి 3 కి.మీ. 41) తిరుచ్చేంగలూరు . తిరువాణ్పాడికి దగ్గరలో 42) తిరుంతు తేవంగుడి : తిరువడ మరుదూర్ ఆర్.యస్. నుండి 6 కి,మీ. 43) తిరు విశలూర్ : తిరుంతు తేనంగుడి నుండి 2 కి.మీ 44) కొట్టైయూర్ : కుంభకోణం నుండి 5 కి.మీ. 45) ఇన్నంబూర్ : కొటైయూర్ నుండి 3 కి.మీ 46) తిరుప్పురంగియం : ఇన్నంబూర్ నుండి 3 కి.మీ 47) విజయ మంగై : తిరుప్పురంబియంకు దగ్గరలో 48) తిరువేగావూర్ : విజయమంగై నుండి 2 కి.మీ. 49) కురంగాడుతురై (ఉత్తరం) : అవ్వంపేట ఆర్.యస్. నుండి 6 కి.మీ. 50) తిరుప్పళ్ళణం : కురుంగాడుతురై నుండి 5 కి.మీ. 51) తిరువాడి (తిరువైయూర్) : పంచనదీశ్వర్, ధర్మ సంవర్ధినీ దేవి. 12 కి,మీ. తంజావూరు 52) తిల్లై స్థానం : తిరువాడి నుండి 2 కి మీ. 53) పేరుంబులి యూర్ : తిరువాడి నుండి 3 కి.మీ. 54) తిరుమళ్ళప్పాడి : పేరుంబులియూర్ నుండి 3 కి.మీ. 55) పళ్ళవూర్ : తిరువాడి నుండి 15 కి.మీ. 56) తిరుక్కనూర్. బూదలూర్ ఆర్.యస్ నుండి 12 కి.మీ 57) అంబిల్ : బూదలూర్ ఆర్.యస్. నుండి 20 కి.మీ. 58) తిరుమందురై తిరుచినాపల్లి ఆర్.యస్. నుండి 21 కి మీ. 59) తిరుప్పారురై

తిరువేగంబూర్ ఆర్ యస్ నుండి 6 కి మీ 60) తిరువానైక్కా (జంబుకేశ్వరం) . జంబుకేశ్వరుడు 10 కి మీ తిరుచినాపల్లి ఆర్ యస్ 61) తిరుప్పైంజలి .20 కి.మీ. తిరుచినాపల్లి ఆర్.యస్ 62) తిరువాశి · తిరువాణైక్కా నుండి 5 కి మీ. 63) తిరువింగనాధమలై : కుళిత్తలై ఆర్.యస్ నుండి 8 కి మీ 64) రత్నగిరి కుళిత్తలై ఆర్.యస్. నుండి 12 కి మీ. 65) కదంబర్ కోయిల్ కుళిత్తలై ఆర్.యస్ నుండి 3 కి.మీ 66) తిరుప్పారైతురై : పూర్ణత్రయిల్. ఎలుమనూర్ ఆర్ యస్ నుండి 3 కి మీ 67) ఉయ్యకోండాన్ : తిరుచినాపల్లి ఆర్.యస్. నుండి 8 కి.మీ. 68) ఉరైయూర్ తిరుచినాపల్లి ఆర్ యస్. నుండి 3 కి.మీ. 69) తిరుచినాపల్లి మాతృభూతేశ్వర్ 70) తిరుపేరుంబూర్ ఆర్.యస్. 71) తిరునాట్టుంగులం : తిరువేరుంబూర్ ఆర్.యస్ నుండి 13 కి.మీ. 72) తిరువకాట్టపల్లి (పడమర) : బూదలూర్ ఆర్.యస్. నుండి 8 కి.మీ 73) తిరువలంపోల్లి · 15 కి.మీ. తంజావూరు 74) తిరుప్పుంతురుత్తి తంజావూర్ నుండి 13 కి మీ. 75) కండియూర్ : తంజావూరు నుండి 9 కి.మీ. 76) శోంతుతురై కండియూర్ నుండి 6 కి మీ 77) తిరువేదిక్కుడి : కండియూర్ నుండి 3 కి.మీ 78) తెట్టై ఆర్ యస్ 79) పశుతి కోయిల్ ఆర్ యస్ 80) చక్రపల్లి : 2 కి.మీ అయ్యంపేట ఆర్ యస్. 81) తిరుక్కులావూర్ : పాపనాశనం ఆర్.యస్ నుండి 6 కి.మీ. 82) తిరుప్పాలైతురై . పాపనాశనం ఆర్.యస్ నుండి 3 కి.మీ 83) నల్లూరు : కళ్యాణ సుందరేశ 3 కి.మీ. సుందరేశ పెరుమాళ్ కోయిల్ ఆర్.యస్. 84) ఆవూర్ : 13 కి.మీ. పాపనాశనం ఆర్.యస్. 85) శక్తిముట్టం : పట్టేశ్వరం దగ్గర 3 కి.మీ దరాసురం ఆర్.యస్ 86) పట్టేశ్వరం : శక్తిముట్టంనకు దగ్గర 87) పల్లయారై · పట్టేశ్వరం దగ్గర 88) తిరువలంచులి : సుందర పెరుమాళ్ ఆర్.యస్ నుండి 2 కి.మీ 89) కుంభకోణం ఆర్.యస్ : కుంభేశ్వర్ 90) నాగేశ్వర్ మందిర్ (కుంభకోణం) నాగేశ్వర్ 91) కుంభకోణం : కాశీవిశ్వనాధ్ 92) తిరునాగేశ్వరం ఆర్.యస్. నాగేశ్వర్ 93) తిరువిడ మరుదూర్ ఆర్.యస్. 94) ఆడుతురై ఆర్.యస్. 95) తేనల్కుడి : ఆడుతురై ఆర్.యస్ నుండి 3 కి.మీ 96) వైగై (వైగైన్మడల్ కోయిల్) : ఆడుతురై ఆర్.యస్ నుండి 6 కి.మీ. 97) కోనేరి రాజపురం (తిరునల్లం) : నటరాజ, ఆడుతురై ఆర్.యస్ .నుండి 8 కి.మీ. 98) తిరుక్కోలంబమ్ : 3 కి.మీ. నరసింగ పేట ఆర్.యస్. 99) తిరువాడుతురై 4 కి.మీ నరసింగపేట ఆర్.యస్ 100) కుర్తాళం (తిరుత్తురుత్తి) ఆర్ యస్. కుర్తాళేశ్వర్ 101) తేరలుండూర్ 5 కి మీ కుర్తాళం 102) మాయవరం (మాయిలాడు దురై) ఆర్.యస్ 103) విలనగర్ : మాయవరం నుండి 6 కి.మీ 104) పారాశలూర్ (తిరుప్పారియల్లూర్). విలనగర్ నుండి 3 కి మీ 105) శేంపానార్-కోయిల్ మాయవరం నుండి 12 కి మీ 106) పూంజై (తిరునాని పల్లి) శేంపానార్-కోయిల్ నుండి 3 కి మీ 107) పేరుంపల్లం (పడమర) · పూంజైనుండి 18 కి మీ 108) తలైచ్చెంకాడు 2 కి మీ పేరుంపల్లం

109) ఆ క్కూరు · మాయవరం నుండి 18 కి.మీ 110) తిరుక్కడయూర్ · మాయవరం నుండి 20 కి.మీ. 111) మయనం . 2 కి.మీ తిరుక్కడ యూర్ 112) తిరువేట్టైకుడి పోరైయం ఆర్ యస్ నుండి 6 కి.మీ 113) కోయిల్పట్టు (తిరుతేలిబోర్). పోరైయం ఆర్ యస్.నుండి 2 కి మీ 114) ధర్మపురం · 2 కి.మీ కరైకల్ ఆర్ యస్ . 115) తిరునల్లార్ ఆర్.యస్ : శనీశ్వర్ 116) కోట్టారం (తిరుక్కోట్టారు) . 3 కి మీ అంబత్తూర్ ఆర్.యస్. 117) అంబార్ . 3 కి.మీ పుంతోత్తం ఆర్.యస్. 118) అంబార్మాకలం · కోట్టారంకి దగ్గరలో 119) తిరుమేయచూర్ . 2 కి మీ. పేరలం ఆర్.యస్. 120) ఎలన్ కోయిల్ . తిరుమేయచూర్ ఆలయం ప్రక్కన 121) తిలతైప్పాడి (కోయిర్పట్టు) 2 కి.మీ. పుంతోత్తం ఆర్ యస్. 122) తిరుప్పరంపురం : 5 కి మీ పుంతోత్తం ఆర్.యస్ 123) శిరుక్కుడి 124) తిరువిలిమల్లై : 8 కి.మీ పేరలం ఆర్.యస్. 125) అన్నూరు (తిరల్లైవణ్ణియూర్) : 3 కి.మీ తిరువిలిమల్లై 126) కరువిలి : అన్నూరు నుండి 3 కి.మీ 127) తిరుప్పందుర్రై : 18 కి.మీ కుంభకోణం ఆర్.యస్ 128) నార్రైయూర్ · 3 కి.మీ. తిరుప్పందుర్రై 129) అలగర పుత్తూర్ : నార్రైయూర్ నుండి 3 కి.మీ. 130) శివపురి : కుంభకోణం ఆర్ యస్ నుండి 5 కి.మీ 131) శాంట్టై (తిరుక్కలయ నల్లూరు) . కుంభకోణం ఆర్.యస్ నుండి 3 కి.మీ 132) మరుదండ నల్లూరు (తిరుక్కరుక్కుడి) · శాంగోట్టై నుండి 2 కి.మీ. 133) శ్రీవాంజియం : 12 కి మీ. నన్నిలం ఆర్.యస్ 134) నన్నిలం ఆర్. యస్ 135) తిరుక్కడేశ్వరం . 3కి.మీ నన్నిలం ఆర్.యస్. 136) తిరుప్పానైయూర్ , నన్నిలం ఆర్.యస్ నుండి 2 కి.మీ 137) విర్కుడి : వేట్టూర్ ఆర్.యస్ నుండి 6 కి మీ. 138) తిరుప్పగలూర్ : 6 కి.మీ. నన్నిలం ఆర్.యస్ 139) వర్తమణి చూరం : తిరుప్పగలూరు ప్రక్కన 140) రామణతిరచ్చురం : 2 కి.మీ. తిరునప్పగలూరు 141) పయత్తంగుడి : విర్కుడి 5 కి.మీ. 142) తిరుచ్చేంగాట్టంగుడి : నన్నిలం 12 కి.మీ. 143) తిరుమరుగల్ : 3 కి.మీ. తిరుచ్చేంగాట్టంగుడి. 144) సెయ్యాతమంగే; తిరుమరుగల్ నుండి 2 కి.మీ. 145) నాగపట్నం 146) సిక్కల్ ఆర్.యస్ 147) కిల్వేలూరు ఆర్.యస్. 148) తేవూర్ : 6 కి.మీ. కిల్వేలూరు. 149) అరిక్కారయంపల్లి వేట్టార్ ఆర్.యస్ 3 కి.మీ. 150) తిరువారూర్ ఆర్.యస్. 151) ఆరనేరి : తిరువారూర్ మందిరం ప్రక్కన 152) తులానాయనార్ కోయిల్ : తిరువారూర్ మందిరం ప్రక్కన 153) విలామర్ :తిరువారూర్ 3 కి.మీ 154) కారయపురం (కరవీరం) . 8 కి.మీ కులుత్తలై ఆర్.యస్. 155) కట్టూర్ అయ్యంపేట (పేరువేలూరు) : 3 కి.మీ కారయపురం. 156) తలై ఆలంకాడు తిరువారూర్ నుండి 3 కి.మీ. 157) కుడైవాసల్ : కోరడాంచేరి ఆర్.యస్ 13 కి.మీ. 158) ఉడైయార్-కోయిల్ (తిరుచ్చెందూర్రై) : 6 కి మీ కుడైవాసల్ 159) నాలూరమయానం 160) ఆండార్ కోయిల్ : పెయ్యాతమంగై

6 కి.మీ. 161) ఆలంకుడి (ఎరుంపులై)· 6 కి.మీ నీడమంగలం ఆర్.యస్ 162) హర్దిద్వార మంగలం : 13 కి మీ. శాలీయ మంగలం ఆర్.యస్ 163) అవలిన నాల్లూరు 164) పరిత్తి అప్పర్ కోయిల్ : 14 కి.మీ తంజావూరు ఆర్.యస్ 165) కోయిల్ వెణ్ణి (తిరువెణ్ణి) 166) పూవావీర్ : 5 కి.మీ. నీడమంగలం ఆర్.యస్ 167) పామణి (పాటలీచురం) : 3 కి మీ. మన్నార్ గుడి ఆర్ యస్ 168) తిరుక్కలార్ : తిరుత్తురై పుండి ఆర్ యస్. నుండి 12 కి.మీ. 169) శిత్తాంబూర్ : 6 కి.మీ పొన్నేరి ఆర్.యస్. 170) కోయిలూర్ భుతుపేట ఆర్.యస్. నుండి 3 కి.మీ. 171) హిండింబా వనం . తిరుత్తురై పుండి ఆర్.యస్. నుండి 15 కి.మీ. 172) కర్పకనార్-కోయిల్ 2 కి.మీ. హిడింబా వనం 173) తండలైచేరి : తిరుత్తురై పుండి ఆర్.యస్. నుండి 3 కి.మీ. 174) కుట్టురు : మన్నార్ గుడి ఆర్.యస్ నుండి 15 కి మీ. 175) తిరువండుత్తురై (తిరువేందురై) . మన్నార్ గుడి ఆర్.యస్ నుండి 9 కి.మీ 176) తిరుక్కలంబూర్ (తిరుక్కోలంబూర్) నీడ మంగళం ఆర్.యస్ నుండి 9 కి.మీ. 177) ఓగ్రై (పేరేయిర్) తిరునట్టి యట్టుంగుడి ఆర్.యస్. నుండి 5 కి.మీ 178) కోల్లిక్కాడు పొన్నేరి ఆర్.యస్. నుండి 8 కి.మీ. 179) తిరుత్తేంగూర్ తిరునెల్లిక్కా ఆర్ యస్. నుండి 3 కి.మీ. 180) తిరునెల్లిక్కా ఆర్.యస్. 181) తిరునట్టి యట్టంగుడి ఆర్.యస్ 182) తిరుక్కరైవాసల్ (తిరుక్కారాయిల్) : తిరునట్టియట్టం గుడి ఆర్.యస్. నుండి 5 కి.మీ. 183) కన్రపూర్ : తిరునట్టి యట్టం గుడి ఆర్.యస్. నుండి 9 కి.మీ. 184) వలివలం : కన్రప్పూరు నుండి 3 కి.మీ 185) కూచినం : తిరునెల్లుక్కా ఆర్.యస్ నుండి5 3 కి.మీ. 186) తిరుక్కువలై (తిరుక్కోవిలి) . కైచినం నుండి 8 కి.మీ. 187) తిరువాయిమూర్ : తిరుక్కువలై నుండి 5 కి.మీ. 188) వేదారణ్యం. (తిరుమరైక్కాడు) ఆర్.యస్ 189) అగస్త్యం పల్లి 5కి.మీ. వేదారణ్యం. 190) కులగర్-కోయిల్ (కోడి) : అగస్త్యం పల్లి నుండి 12 కి.మీ 191) తిరుక్కోణమలై (ట్రింకోమలి) సిలోన్‌లో 192) మరోత్తం . సిలోన్‌లో 193) మధురై ఆర్.యస్. సుందరేశ్వర్. వైగై నదీ తీరం. 194) తిరువప్పనూర్ : మధురైలో 195) తిరుప్పర కున్రం ఆర్ యస్. 8 కి మీ. మధురై. 196) తిరువేడగం : 5 కి.మీ. సోలవందాన ఆర్.యస్. 197) పిరాన్మలై (తిరుక్కొండు కున్రం) : అమ్మాయ నాయకరూర్ఆర్.యస్.నుండి 25 కి.మీ. 198) తిరుప్పుత్తూర్ : పిరాన్మలై నుండి 25 కి.మీ. 199) తిరుప్పు వనవాయల్ : 35 కి.మీ. అరంతాంగే ఆర్.యస్ 200) రామేశ్వరం ఆర్.యస్. రామలింగేశకవరుడు 201) తిరువడనై : తిరుప్పువనవాయల్‌కు 20 కి.మీ. 202) కలయార్ కోయిల్ 34 కి.మీ. తిరువడనౌ. 203) తిరుప్పువనం 204) తిరుచ్చులియల్ : తిరుప్పువనం నుండి 25 కి మీ. 205) కుర్తాళం · కుర్తాళేశ్వర్ టెంకాశి నుండి 5 కి.మీ.206) తిరునెల్వేలితిన్నేనేవి. ఆర్.యస్ నీలియప్పార్ 207) తిరువాంజైక్కులం . ఇరంజన కుడ ఆర్ యస్ నుండి 6 కి.మీ.

208) అదినాశీ (తిరుప్పుక్కులి) తిరుప్పూర్ ఆర్ యస్ నుండి 18 కి మీ. 209) తిరుమురుగం పూండి : తిరుప్పూర్ ఆర్ యస్. నుండి 13 కి మీ. 210) భవానీ ఈరోడ్ ఆర్.యస్ నుండి 8 కి మీ 211) తిరుచ్చెంగోడ్ శంకరీదుర్గా ఆర్ యస్ నుండి 8 కి మీ. 212) వింజా మాంకుండై. కరూర్ ఆర్ యస్ నుండి 20 కి మీ 213) కోడుముడి ఆర్ యస్. 214) కరూర్ ఆర్ యస్ పశుపతేశ్వర్ 215) అరత్తురై చిదంబరం నుండి 38 కి మీ 216) పెన్నాకడం . అరత్తురై నుండి 6 కి మీ 217) కుడలై -ఆత్తూర్ చిదంబరం ఆర్.యస్ నుండి 25 కి మీ 218) రాజేంద్ర పట్టణం (ఎరుక్కాట్టం పులియూర్) చిదంబరం ఆర్.యస్ నుండి 40 కి.మీ. 219) తీర్థనగరి (తిరుత్తివై నగర్) . ఆలంపాక్కమ్ ఆర్.యస్ నుండి 3 కి.మీ 220) త్యాగవల్లి (తిరుచోర పురం) · ఆలంపాక్కమ్ ఆర్.యస్ నుండి 3 కి.మీ 221) తిరువడగై · పవ్రమటి ఆర్ యస్ 3కి మీ 222) తిరునామ నల్లూర్ (తిరునావలూర్) . పవ్రమటి ఆర్ యస్ నుండి 20 కి.మీ. 223) వృద్ధాచలం (తిరుముటు కున్రం) కడలూర్ ఆర్ యస్. నుండి 40 కి.మీ. 224) నెయవెణ్ణై(నేలవెణ్ణై మాంబలపట్టు ఆర్ యస్ నుండి 30 కి.మీ. 225) తిరుక్కోయిలూర్ ఆర్ యస్ 226) అరైకండి నల్లూర్ (అరైయని నల్లూర్) : తిరుక్కోయిలూర్ సమీపాన 227) ఇడైయారు . మాంబల పట్టు ఆర్.యస్ నుండి 14కి.మీ 228) తిరువేణ్ణై నల్లూరు : మాంబల పట్టు ఆర్.యస్. నుండి 9 కి.మీ. 229) తిరుత్తాలూర్ (తిరుత్తురైయూర్) విరింజిపాక్కం ఆర్ యస్ నుండి 3 కి.మీ 230) ఆండారకోయిల్ (వాడుకూర్) : చిన్నబాబు సముద్రం ఆర్.యస్ నుండి 3 కి మీ 231) తిరుమణికులి . కడలూర్ ఆర్.యస్ నుండి 8 కి మీ. 232) తిరుప్పాపులియూర్ ఆర్ యస్ 233) కిరామం (తిరుమురాడిచ్చురం) . తిరువెణ్ణై నల్లూర్ నకు 3 కి మీ. 234) పణయపురం (పానం కట్టూర్). ముండియాప్పకం ఆర్.యస్.నుండి 3 కి మీ 235) తిరువమత్తూర్ విల్లుపురం ఆర్.యస్ నుండి 6 కి మీ. 236) తిరువన్నామలై ఆర్ యస్ అరుణాచలేశ్వరుడు 237) కంజీవరం (కాంచీపురం) ఆర్.యస్. ఏకామ్రేశ్వరుడు 238) మవ్రాలి కంచిలోనే యున్నది. 239) ఓణకంరకాంటలీ . కంచిలోనే కలదు, 240) అణేగటం గపడం : కంచిలోనే కలదు. 241) తిరుక్కలీశ్వరం-కోయిల్. కంచిలోనేగలదు 242) కురంగ నిముట్టం · కంచినుండి 9 కి మీ. 243) మగరల్ . కంచి నుండి 15 కి.మీ 244) తిరువోత్తుర్ . కంచినుండి 30 కి.మీ. 245) తిరుప్పనంకాడు (పనంకాట్టూరు) కంచినుండి 14 కి మీ. 246) తిరువలం ఆర్.యస్ 247) తిరుమాల్ పేరు 5 కి మీ. పాలూర్ ఆర్.యస్. 248) తక్కోలం ఆర్.యస్ 249) ఇలం పయం కొట్టూర్ . తక్కోలం ఆర్.యస్ నుండి 3 కి.మీ. 250) కువంతిరువిర్కోలం 8 కి మీ. కడంబత్తూర్ ఆర్ యస్ 251) తిరువేలం గాడు ఆర్ యస్ నటరాజ 252) తిరుప్పసూర్ . 8 కి.మీ తిరువెల్లూరు ఆర్.యస్. 253) తిరువలం పుత్తూరు (తిరువేంపాక్కం) తిరువెల్లూరు

ఆర్ యస్ నుండి 12 కి మీ 254) తిరుక్కలం 20 కి మీ పొన్నేరి ఆర్ యస్ 255) కాళహస్తి ఆర్ యస్ శ్రీకాళహస్తీశ్వరుడు 256) తిరువో-త్తియూర్. మద్రాసు లోకల్ ఆర్.యస్ 257) పాడి వల్లివాకం ఆర్.యస్ నుండి 3 కి.మీ 258) తిరుముల్లై వాయల్ (ఉత్తరం) 8 కి.మీ. ఆవడి ఆర్ యస్ 259) తిరువేర్కాడు . 6 కి మీ ఆవడి ఆర్ యస్ 260) (మైలాపూర్) మయిలాపూర్ మద్రాసు 261) తిరువన్మాయూర్ మైలాపూర్ నుండి 6 కి.మీ. 262) అలక్కోయిల్ : సింగపెరుమాళ్ -కోయిల్ ఆర్.యస్ నుండి 3 కి.మీ 263) తిరువిడైచురం : 8 కి.మీ. చెంగల్పట్టు ఆర్ యస్ 264) తిరుక్కవి కున్రం( పక్షితీర్ధం) చెంగల్పట్టు ఆర్.యస్. నుండి 14 కి మీ. 265) అచరపాక్కం R.S. 266) తిరువక్కరై . పాండిచేరి R S నకు 20కి.మీ 267) ఓ(లి)యాలిందిపట్టు · 132 కి.మీ పాండిచేరి ఆర్ యస్ 268) ఇరుంబైమలం : పాండిచెరి R S. నుండి 8కి మీ. 269) గోకర్ణం : మహాబలేశ్వర్, కర్నాటక 270) శ్రీశైలం · మల్లికార్జున స్వామి A.P 271) ఇంద్రనీల పర్వతం : హిమాలయ పర్వతములు, U.P 272) గౌరీకుండం · హిమాలయములు U P. 273)కేదారం కేదారేశ్వరుడు, హిమాలయములు యు.పి 274) కైలాసనర్వతం మానస సరోవర తీరం టిబెట్.

## మహ్మదీయుల రాజులకు కన్నెర్ర కలుగజేసిన శ్రీ సోమనాధుని (ప్రభాస తీర్ధం - గుజరాత్) వైభవం

1. అభిషేకమునకు ప్రతీరోజు గంగాజలమును కొని తెచ్చుట.
2 పూజకు, అలంకరణకు కాశ్మీరము నుండి పూలు తెప్పించుట.
3. 10,000 గ్రామాలు ఆలయ నిర్వహణకు గాను దత్తత ఇయ్యబడుట.
4 మహ్మద్ గజనీ కాలములో ఉత్తర దేశములో అతి పవిత్రమైన, అతి పెద్దదైన దేవాలయం కావడం.
5 పర్వదినాలలోనే గాక గ్రహణం రోజులలో కూడా లక్షలాది భక్తులు వచ్చి స్నానాలు చేసి, స్వామివారిని పూజించుట.
6. అశేష భక్తులు అతివిలువైన కానుకలు స్వామివారికి సమర్పించుట.
7. 1,000 మంది బ్రాహ్మణులను ప్రతిదినము పూజకు నియోగించుట.
8. 300 మంగళ్ళకు పని ఉండుట
9. ఆలయమునకు 350 మంది సంగీత విద్వాంసులుండుట.
10 350 మంది నాట్యకత్తెలుండుట
11. కష్ట నష్టాల కాలములో స్వామివారు ఆదుకుంటారని విశేష ప్రచార ముండుట
12 పిలిచిన పలికేదైవమని ప్రఖ్యాతి వుండుట. మొదలైనవి.

ఈ వైభవమునకు కన్నెర్ర కలిగి మహ్మాద్ గజనీ, ఘోరి మహ్మాద్లు 17 సార్లు ఆలయముపై దండెత్తి ఆభరణాదులను కొల్లగొట్టుటయే గాక ఆలయమును, విగ్రహములను ధ్వంసము చేసిరి

## శివునికి గల ప్రఖ్యాత పేర్లు (18)

| | | | | |
|---|---|---|---|---|
| 1. శివ | 2. పశుపతి | 3. మృత్యుంజయ | 4 త్రినేత్ర | 5 కృత్తివాస |
| 6. పంచవక్త్ర | 7 నీలకంఠ | 8 ఖండపరశు | 9. ప్రమదాధిప | 10 గంగాధర |
| 11. మహేశ్వర | 12. రుద్ర | 13. విష్ణు | 14. పితామహ | 15 సంసారవైద్య |
| 16 సర్వజ్ఞ | 17. పరమాత్మ | 18 కపాలి | | |

## శివుని నవ రసములు

| | | | | |
|---|---|---|---|---|
| 1 శృంగారము | 2 వీర | 3 బీభత్స | 4. అద్భుత | 5 భయానక |
| 6 రౌద్ర | 7 కరుణ | 8 హాస్య | 9 శాంత | |

## నర్మదా నదీ తీరాన వెలసిన సుప్రసిద్ధ శివాలయములు (9)

| | | | | |
|---|---|---|---|---|
| 1. శూలఫాణేశ్వర | 2. కుంభేశ్వర | 3 హనుమంతేశ్వర | 4. శుకేశ్వర | 5 మాండవ్యేశ్వర |
| 6 కుబేరేశ్వర | 7. వ్యాసేశ్వర | 8 ఆదిత్యేశ్వర | 9 హతేశ్వర | |

## కాశీలోని విశ్వేశ్వర స్వామివారికి నాలుగు దిక్కులా వెలసిన శివాలయములు

| | | |
|---|---|---|
| తూర్పున | . | మణి కర్ణికేశ్వర్ |
| పశ్చిమాన | . | గోకర్ణేశ్వర్ |
| ఉత్తరాన | | భార భూతేశ్వర్ |
| దక్షిణాన | | బ్రహ్మేశ్వర్ |

## కేదారేశ్వర దివ్య క్షేత్రానికి నాలుగు మూలలా వెలసిన దివ్య మూర్తులు

| | |
|---|---|
| తూర్పున | గంగ |
| పడమర | వైద్యనాథ |
| దక్షణాన | లోలార్క |
| ఉత్తరాన | శూల ఢంకేశ్వర |

# దశావతారములు

సాధారణముగా దశావతారవిగ్రహములన్నియు దేవాలయమునకు బయటగాని, లోపలగాని మొత్తమన్నియు చాల చోట్ల వైష్ణవాలయములలో కనిపించుచున్నవి విడివిడిగా వెలసి ఉన్న మూర్తుల ఆలయములు అరుదు అవతారము లన్నియు ఉన్నచోట మొత్తం పది విగ్రహములు కనిపించుచున్నవి కానీ, ఇంకా ఎత్తవలసిన పదియవ అవతారమగు కల్కి భగవానునికి ప్రత్యేకాలయము ఎచ్చటను కనిపించుటలేదు

## మత్స్యావతారము

1 కాళేశ్వరము. ఆంధ్రప్రదేశ్ - కరీంనగర్ జిల్లా. కాళేశ్వరుడు, ముక్తేశ్వరుని ఆలయములో సిమెంట్‌తో మత్స్యము చేయబడి యమకోణము ప్రక్కన వెలసియున్నది దీనిని తాకినవారికి అంతఃకరణ మాలిన్యము నశించును స్వప్న దోషములు తొలగి పోవును. కోరిన వారికి సంతాన ప్రాప్తి కలుగును

2 హరి ద్వారము - ఉత్తరప్రదేశ్ - ఇచ్చట నుండు బ్రహ్మకుండ్ అను తీర్థము ప్రక్కన ఆలయము వెలసియున్నది శ్రీవారి పాదములను నిక్షేపము చేస్తూ ఈ తీర్ధ జలాలలో చేపలు తండోపతండముగా నున్నవి. వీటిని యాత్రికులు మహా విష్ణువు యొక్క మత్స్యావతారములుగా భావించి పూజనీయ భావంతో దర్శిస్తుంటారు ప్రక్కన అమ్ముతున్న ఆహార పొట్లాలను కొని వీటికి వేస్తూ ఉంటారు

3. జమ్మూ & కాశ్మీర్ రాష్ట్రములోని అనంతనాగ్ ఇచ్చట నున్న సరస్సులోని చేపలను గూడా మత్స్యావతారములుగా భావిస్తారు

4. కాంచీపురం తమిళనాడు
ఇచ్చట నున్న శ్రీవారి పుష్కరిణిలో నున్న మత్స్యములను కూడా అవతారములుగా భావించి వీటికి ఆహారము వేయుచుందురు

5 నాగలాపురం ఆంధ్రప్రదేశ్ - చిత్తూర్ జిల్లా
వేదనారాయణ స్వామి వారి ఆలయంలో మత్స్యావతార మూర్తి కలదు విగ్రహానికి పాదములు లేవు లోహముతో ప్రత్యేక పాదములు చేసి నిలబెట్టినారు

6 తిరుత్తలం కేరళ - 5 కి మీ ట్రివేండ్రం
మత్స్య తీర్థం ఒడ్డున మత్స్యావతార విగ్రహం కలదు

బ్రహ్మ తన సృష్టి కార్యమును వేదముల నాధారముగా చేయుచుండ సోమకాసురుడు వేదములను దొంగిలించి సృష్టి కంతరాయము కలిగించెను. శ్రీ మహావిష్ణువు మత్స్యావతార మెత్తి సోమకాసురుని ద్రుంచి వేదములను బ్రహ్మ దేవున కందించెను

# కూర్మావతారము

1. శ్రీకూర్మం ఆంధ్రప్రదేశ్ - 14 కి మీ శ్రీకాకుళం, శ్రీకాకుళం జిల్లా
   స్వామివారు కూర్మనాధుడు తాబేలు రూపధారి ఆలయం పశ్చిమాభిముఖం
2. గౌహతి . అస్సాం - బ్రహ్మపుత్రానది కావలి భాగమున వెలసిన ఆలయం
   శ్రీ మహావిష్ణువు తాబేలు రూపమున వెలసియున్న ఆలయం' విష్ణుమూర్తి పాదములు కూడ పూజింపబడుచున్నవి. శేషశయన మూర్తిగా విష్ణుమూర్తి విగ్రహం వెలసియున్నది ఇచ్చట పెద్దలకు పిండప్రదానము, తదాది కర్మకాండలను జరుపుదురు బ్రహ్మపుత్రా నదీ తీరం

ఈ అవతారమున దుష్టసంహారము కనిపించదు క్రుంగిపోతున్న మంధరగిరిని పైకి లేపి సముద్ర మధనమున లభించిన అమృతమును జగన్మోహిని ఆకారమున అందించి అసురులకన్న సురలను బలవంతులుగా చేయుటే ధ్యేయముగ నున్నది.

# వరాహావతారం

1 సింహాచలం ఆంధ్రప్రదేశ్ - విశాఖపట్నం జిల్లా - 16 కి మీ విశాఖపట్నం
స్వామివారు వరాహమూర్తి. సంవత్సర మంతయు గంధముతో నింపబడి సంవత్సరమున కొక్కరోజు మాత్రమే నిజరూప దర్శనమిచ్చు స్వామివారు

2 చిత్తోర్ ఘడ్ . రాజస్తాన్
ఇచ్చట నున్న కోటలో కుంభశ్యాముని ఆలయములో మహావిష్ణువు వరాహరూపం కనిపించుచున్నది విజయస్తంభమునకు దగ్గరలో

3. ఖజురహో : మధ్యప్రదేశ్
   శ్రీరామచంద్ర చతుర్భుజ ఆలయములో వరాహావతార రూపియైన శ్రీ మహావిష్ణువు వెలసియున్నారు. 25 మీటర్ల ఎత్తైన వరాహస్వామి భూమాతను రక్షిస్తున్నట్లుగా మలచబడినది
4. తిరుమల - ఆంధ్రప్రదేశ్ - చిత్తూరు జిల్లా.
   తిరుమల కొండపై శ్రీవారి ఆలయమునకు పడమరగా కోనేరు ప్రక్కగా శ్రీ వరాహస్వామి వారు వేంచేసియున్నారు

5 తిరువిధవెంత్తె   తమిళనాడు -  మహాబలిపురానికి వెళ్ళే రోడ్డులో - 41 కి మీ
మద్రాసు  ఈ పట్టణమున శ్రీ లక్ష్మి ఆది వరాహమూర్తి వారు వేంచేసి యున్నారు
(నిత్య కళ్యాణ పెరుమాళ్)

6 జాజ్‌పూర్ -  ఒరిస్సా -  20 కి మీ  జాజ్‌పూర్ రోడ్ R S
వైతరణి నదీ మధ్యలోని లంకలో విష్ణుమూర్తి యొక్క శ్వేత వరాహమూర్తి వెలసియున్నది
నదీ తీరమున బిరిజా దేవి ఆలయమున్నది

7 త్రివేంద్రం · కేరళ -
ఈ పట్టణమున శ్రీ వరాహస్వామి వారి ఆలయమున్నది

8 ఉదయగిరి   మధ్యప్రదేశ్ - 17 కి మీ  సాంచి
ఇచ్చట నున్న గుహ నెం 5లో వరాహమూర్తి విగ్రహమున్నది

9 శ్వేత సోరన్ .  ఒరిస్సా -  14 కి.మీ  కాన్‌గంజ్ R S
ఇచ్చట నున్న వరాహ గంగా తీరమున శ్వేత వరాహమూర్తి వేంచేసియున్నారు

10. మధోలి .  మధ్యప్రదేశ్ - 72 కి మీ  జబ్బల్ పూర్
ఇచ్చట కూడా శ్వేత వరాహమూర్తి ఆలయము కలదు

11. పన్నియూర్ ·  కేరళ - పుట్టిపురం R S. దగ్గర

12. శ్రీముష్ణం . తమిళనాడు -
ఇచ్చట మహా విష్ణువు వరాహరూపుడు

13 మధుర   ఉత్తర ప్రదేశ్
మధుర బృందావన ప్రాంతములో వరాహస్వామి ఆలయము కలదు

14 బారాముల .  జమ్మూ & కాశ్మీర్ - శ్రీనగర్‌కు దగ్గరలో
ఇచ్చట వరాహ స్వామి మూల విగ్రహము కలదు  ఈ స్థలమునకు "వరాహ మూల"
అని పేరు.  కాల క్రమేణ "బారాముల" గా మారినది

15. సోరేం .  ఉత్తరప్రదేశ్ - 14 కి.మీ.  కాసరంగ R S, ఈటాజిల్లా
వరాహమూర్తి, లక్ష్మీదేవి వెలసియున్నారు

16 దేవల్   ఉత్తర ప్రదేశ్ -  16 కి మీ  బీస్‌పూర్ R S
వరాహమూర్తి ఆలయం

17 మహాబలిపురం   తమిళనాడు , బంగాళాఖాత తీరం, వరాహస్వామి

18 నాగలాపురం   ఆంధ్రప్రదేశ్ - చిత్తూరు జిల్లా వేద నారాయణ స్వామి వారి ఆలయ
మూడవ ప్రాకారములో శ్రీ లక్ష్మి వరాహస్వామి, భూ వరాహ స్వామి మూర్తులున్నవి

# నారసింహ అవతారము

1 అంతర్వేది ఆంధ్రప్రదేశ్ - గోదావరి సాగర సంగమ స్థానం శ్రీ సుదర్శన లక్ష్మీ నారసింహ స్వామి (యజ్ఞవేది నారసింహుడు)

2 ఉదయగిరి ఆంధ్రప్రదేశ్ - నెల్లూరు జిల్లా - 7 కి మీ నెల్లూరు పెన్నానదీ తీరము నదికావలి వైపున కామాక్షి అమ్మవారి ఆలయము స్వామివారు ఉగ్రనరసింహ మూర్తి.

3. భీముని పట్నం ఆంధ్ర ప్రదేశ్ - విశాఖ జిల్లా నారసింహ కొండపై జ్వాలా నరసింహమూర్తి-భీమసేన ప్రతిష్ఠ

4 యాదగిరి గుట్ట . ఆంధ్రప్రదేశ్ - నల్గొండ జిల్లా - శ్రీ లక్ష్మీ నారసింహ క్షేత్రము- కొండగుహలో వెలసిన స్వామివారు. అమ్మవారు ఆండాళ్ళమ్మ స్వామి వారు పంచనారసింహ స్వామిగా ప్రసిద్ధి 1. జ్వాలా నారసింహ 2 యోగానంద 3 గండభేరుండ 4. ఉగ్ర లక్ష్మీ నారసింహ 5. ప్రహ్లాద వరద నారసింహ మండలం రోజులు స్వామివారికి ప్రదక్షిణం చేస్తే సర్వబాధలు తొలగి ప్రశాంతత చేకూరుతుందని నమ్మిక. నిజ దీక్షా పరులకు 16 రోజులకు స్వామివారు స్వప్నములో సాక్షాత్కరించి సమస్యలకు పరిష్కార మార్గము చూపింతురుట

5. అహోబిలం . ఆంధ్రప్రదేశ్ - కర్నూలు జిల్లా - ఆళ్ళగడ్డ నుండి, నంద్యాల నుండి బస్సు

కొండ దిగువ నున్న స్వామివారిని ప్రహ్లాద వరద నారసింహ స్వామియని పిలుతురు. కొండపైన ఒక క్షేత్రము కొండ క్రింద మరొక క్షేత్రము గలవు ఈ రెండింటిని కలిపి "పంచక్రోశి క్షేత్రం" అని పిలుతురు కొండపైనున్న స్వామివారు ప్రహ్లాద వరద నారసింహ స్వామి. స్వామివారి విగ్రహమునకు 10 చేతులు కలవు కొండను "తార్క్ష్యాద్రి" అని పిలుతురు. భవనాశిని తీర్థం ప్రక్కన ఆదిశేషుని అవతారమని చెప్పే ఈ పర్వత పంక్తుల శీర్ష భాగమున శ్రీనివాసుడు, తోక భాగమున శ్రీశైల మల్లికార్జునుడు. మధ్యభాగమైన అహోబిల క్షేత్రమున నారసింహస్వామి వెలసియున్నారు కొండ పైనను, క్రిందను మొత్తము నవ విధ నారసింహ మూర్తులున్నవి

1 కరండ నృసింహ
2 యోగానంద నృసింహ
3. ఉగ్ర నారసింహ
4 వరాహ నారసింహ
5 ప్రహ్లాద వరద
6 చత్రపట
7 మాలోల
8 జ్వాలా
9 పవన నారసింహ స్వామి

6. ఆగిరిపల్లి : ఆంధ్రప్రదేశ్ - కృష్ణా జిల్లా - శోభనగిరిపై.
శ్రీ శోభనాచల వ్యాఘ్ర లక్ష్మీ నారసింహ స్వామి. అమ్మవారు రాజ్యలక్ష్మి.

7. వేదాద్రి : ఆంధ్రప్రదేశ్- కృష్ణాజిల్లా - 15 కి.మీ. జగ్గయ్యపేట, 54 కి మీ విజయవాడ - కృష్ణానదీ తీరం
స్వామివారు యోగానంద లక్ష్మీ నారసింహ స్వామి. ఈ క్షేత్రమున పంచనారసింహులు వెలసియున్నారు.

1. జ్వాలా 2. సాలగ్రామ 3. యోగానంద
4. వీర 5. చెంచు లక్ష్మీ నారసింహమూర్తి.

ఈ పంచ నారసింహులను పూజించిన పోయిన పంచ ప్రాణములు తిరిగి వచ్చునట.

8 కాళేశ్వరం . ఆంధ్రప్రదేశ్ - కరీంనగర్ జిల్లా గోదావరి నదీ తీరం.
కాళేశ్వర, ముక్తేశ్వర ఆలయములో శ్రీనారసింహ స్వామివారికి ప్రత్యేక ఆలయము కలదు

9. కొరివి : ఆంధ్రప్రదేశ్ - కొరివి గ్రామం - వరంగల్ జిల్లా వరంగల్ నుండి మహబూబా బాద్ మీదుగా కొరివి గ్రామం చేరాలి. ఇచ్చట వీరభద్రస్వామి, భద్రకాళి ఆలయములతో బాటు నారసింహ స్వామి వారి ఆలయము కలదు

10. కదిరి . ఆంధ్రప్రదేశ్ - అనంతపురం జిల్లా
జ్వాలా నరసింహ స్వామి. పెద్ద ఆలయము.

11. మంగళగిరి . ఆంధ్రప్రదేశ్ - గుంటూరు జిల్లా (సాలగ్రామ నారసింహస్వామి) పానకాల నారసింహ స్వామి కొండపై నున్న స్వామివారిని పన్నా నారసింహ స్వామి యని పిలుతురు అమ్మవారు రాజ్యలక్ష్మి కొండ క్రిందనున్న స్వామివారు శ్రీ లక్ష్మీ నారసింహస్వామి స్వామి వారికి ఈ క్షేత్రమున 2 ఆలయములున్నవి

12. సింగరాయ కొండ ఆంధ్రప్రదేశ్- ప్రకాశం జిల్లా. శ్రీ వరాహ నారసింహ క్షేత్రము

13. వరంగల్ ఆంధ్రప్రదేశ్ - వరంగల్ జిల్లా.
భద్రకాళి వెలసిన కొండపై శ్రీ నారసింహ స్వామి వారి ఆలయమున్నది

14. ఎలగందుల ఆంధ్రప్రదేశ్ - కరీంనగర్ జిల్లా 10 కి మీ. కరీంనగర్ - నారసింహ క్షేత్రము.

15. మెట్టుపల్లి ఆంధ్రప్రదేశ్ - కరీంనగర్ జిల్లా, హుజూర్ నగర్ తాలూకా.
శ్రీ లక్ష్మీ నారసింహ స్వామి గుహలో వెలసియున్నారు.

16 మెదక్ ఆంధ్రప్రదేశ్ - మెదక్ జిల్లా -
శ్రీ నృసింహస్వామి వారి ఆలయము కలదు.

17 సికిందరాబాద్ · ఆంధ్రప్రదేశ్
నాలా బజారులో శ్రీ నారసింహాలయము కలదు.

18 బోధన్ ఆంధ్రప్రదేశ్ - నిజామాబాద్ జిల్లా, నారసింహ క్షేత్రము

19 తలిగొండ : ఆంధ్రప్రదేశ్ - కడపజిల్లా.
సాలగ్రామ నారసింహ క్షేత్రం

20 నంద్యాల ఆంధ్రప్రదేశ్ - కర్నూల్ జిల్లా.
నారసింహాలయము కలదు

21. భద్రాచలం ఆంధ్రప్రదేశ్ - ఖమ్మం జిల్లా
నారసింహ స్వామి వారు వెలసియున్నారు

22 నరసింహగిరి ఆంధ్రప్రదేశ్ - నిజామాబాద్ జిల్లా
నిజామాబాద్ - ఆర్మూర్ రోడ్డుపై గల కొండపైన వెలసిన నారసింహ క్షేత్రము.

23 కోరుకొండ ఆంధ్రప్రదేశ్ - తూ గో జిల్లా 20 కి మీ రాజమండ్రి
గ్రామానికి 5 కి మీ. దూరమున కొండ కలదు కొండపై (పారిజాత నారసింహుడు)
సాత్విక నారసింహ స్వామి, కొండక్రింద లక్ష్మీ నారసింహ స్వామి వెలసియున్నారు

24 పెద్ది రెడ్డి గూడెం . ఆంధ్రప్రదేశ్ - నల్గొండ జిల్లా 5 కి.మీ యాదగిరి గుట్ట
ఇక్కడ నున్న నారసింహాలయమునకు శ్రీపాత క్షేత్రమని పేరు

25 అల్లూరు · ఆంధ్రప్రదేశ్ - గుంటూరు జిల్లా - బాపట్ల తాలూకా.
లక్ష్మీ నారసింహ స్వామివారు

26. తీపర్రు . ఆంధ్రప్రదేశ్ - ప.గో.జిల్లా. కొవ్వూరు దగ్గర. శ్రీ లక్ష్మీ నారసింహ క్షేత్రము.

27 పెంచల కోన ఆంధ్రప్రదేశ్ - నెల్లూరు జిల్లా
30 కి.మీ రాపూరు 75 కి మీ. నెల్లూరు.కండలేరు నదీ తీరం పెంచలయ్య అని పిలువబడే నారసింహ స్వామి చెంచులక్ష్మి, ఆదిలక్ష్మి అమ్మవార్లు శనివారము మాత్రమే పూజ ఈ క్షేత్రమును 'పెనుశిల క్షేత్రమని'' పిలుతురు. సోమశిల ప్రాజెక్టునకు దగ్గరలో కలదు

28. ధర్మపురి ఆంధ్రప్రదేశ్ - కరీంనగర్ జిల్లా జగిత్యాల తాలూకా 48 కి మీ జగిత్యాల

గోదావరి నదీ తీరం ఆలయమునకెదురుగా నున్న కోనేరును "ధర్మకుండం'' అని పిలుస్తారు ఉగ్రనరసింహమూర్తి, స్వామివారు ఉగ్రరూపుడైనందున ముఖమెల్లప్పుడు చందనముతో పూయబడి ఉంటుంది

ధర్మాంగద చరిత్రలోని సత్యవతి పాము ఆకారములో నున్న భర్తతో అన్ని

తీర్థములలోను స్నానమాచరించి, చివరకు ఇచ్చట వెలసిన స్వామివారి కెదురుగా నున్న ధర్మకుండములో స్నానము చేసిన తరువాత సర్పాకార భర్తకు శాపవిమోచనము కలిగి మానవ రూపము కలిగెను.

"భూషణ వికాస శ్రీధర్మపుర నివాస, దుష్టసంహార నరసింహ, దురిత దూర" అని పాద్యాంతముతో వ్రాయబడిన నారసింహ శతకము ఈ స్వామివారి నుద్దేశించియే ఈ ధర్మపురి గ్రామముననే వ్రాయబడినది.

29. ఖమ్మం : ఆంధ్రప్రదేశ్ - ఖమ్మం జిల్లా
స్తంభాద్రి నారసింహస్వామి. కొండగుహలో వీపు భాగము కొండకు ఆనుకుని వెలసిన స్వామివారు.

30. సికిందరాబాద్ : ఆంధ్రప్రదేశ్ - నాచారం
రామాయం పేటకు పోవు త్రోవలో శ్రీ లక్ష్మీ నారసింహ క్షేత్రము

31. నల్లపాడు : ఆంధ్రప్రదేశ్ - గుంటూరు జిల్లా.
నరసింహాలయము కలదు.

32. గుంటూరు · ఆంధ్రప్రదేశ్ - గుంటూరు జిల్లా.
శ్రీ రామనామ క్షేత్రములో నరసింహాలయం కలదు.

33. పిడుగురాళ్ళ : ఆంధ్రప్రదేశ్ - గుంటూరు జిల్లా.
నరసింహాలయం కలదు.

34. ఉండవల్లి : ఆంధ్రప్రదేశ్ - గుంటూరు జిల్లా
ఉండవల్లి గుహలోని అనంతశయన స్వామి వారి ఆలయ మండపానికి ఎదురుగా నృసింహ స్వామివారు వెలసియున్నారు.

35. వాడపల్లి : ఆంధ్రప్రదేశ్ - నల్గొండ జిల్లా.
ఈ ప్రదేశమును వజీరాబాద్ అని కూడా పిలుస్తారు. దేవరకొండ నుండి మిర్యాల గూడెం మీదుగా చేరాలి. సుప్రసిద్ధ నారసింహ క్షేత్రం. విగ్రహానికి ఎదురుగా ఉన్న దీపాలలో ముక్కుకి ఎదురుగా ఉన్న దీపం కదులుతూ ఉంటుంది. మిగతా దీపాలు కదలవు. విగ్రహం ఊపిరి పీల్చుచుండటం, విడవడం ప్రత్యేకత.

36. సింహాచలం : ఆంధ్రప్రదేశ్ - విశాఖ జిల్లా 16 కి మీ వైజాగ్
లక్ష్మీ నృసింహ దేవాలయం సింహాద్రి అప్పన్న అని పేరు స్వామి వారికి శ్రీ కృష్ణ దేవరాయలు పచ్చల పతకమును బహూకరించిరి.

37. తిరుమల : ఆంధ్రప్రదేశ్ - చిత్తూరు జిల్లా.
తొలుత ఈ క్షేత్రం నారసింహ క్షేత్రముగా భావించబడెడిది శ్రీ వేంకటేశ్వరుని ఆలయమున పాకశాలలో ఉగ్రరూపమున నున్న శ్రీనారసింహుడు వెలసి యుండెనట

స్వామివారు ఉగ్రరూపుడై యున్నందున ప్రజలు భీతావహులగుదురని శాంత రూపము నొంది శ్రీనివాసుడుగా వెలసెనని కథ.

38. జొన్నవాడ : నెల్లూరు జిల్లా.
పెన్నానది తీరం. ఈవల తీరాన కామాక్షి తాయి ఆవల తీరాన నరసింహస్వామి.

39 పెన్న అహోబిలం ఆంధ్రప్రదేశ్ - అనంతపురం జిల్లా. 12 కి మీ. ఉరవకొండ. ఇచ్చట పినాకిని నది ఉత్తర వాహిని. స్వామి వారి పాదం మాత్రమే పూజలందుకొను చున్నది

40. నగర్ గ్రామం . హిమాచల ప్రదేశ్ - కులూలోయ.
నరసింహాలయము కలదు.

41. భర్తగాల్ హిమాచల ప్రదేశ్ - చంబా లోయ, పర్గణ భలాయ్ జిల్లా

42. ప్రాచి పిప్లా . గుజరాత్ - 25 కి మీ సోమనాథ్.
(ప్రభాస పట్టణం) సుభద్రార్జునులకు వివాహము జరిగిన చోటు. నారసింహ స్వామివారి దేవాలయం, సూర్యమందిరం, శారదా పీఠం, చంద్రమౌళేష్ శ్రీ వేంకటేశ్వర స్వామి వార్ల ఆలయములు కలవు

43. బ్రహ్మోర్ . హిమాచల ప్రదేశ్ - చంబా లోయ
నరసింహాలయము గలదు.

44. హంపి . కర్నాటక - విజయనగర సామ్రాజ్య రాజధాని.
యోగానంద నారసింహ క్షేత్రము.

45. బీదర్ : కర్నాటక - శ్రీజల నారసింహ క్షేత్రము.
ఇచ్చట స్వామివారు నీటిలో వేంచేసియున్నారు.

46. కాంచీ పురము తమిళనాడు - చినకంచి గుట్టపై శ్రీ వరదరాజస్వామి వారి ఆలయం. గుట్టక్రింద శ్రీ నృసింహస్వామివారు వెలసియున్నారు.

47 షిర్డి : మహారాష్ట్ర - శ్రీ సాయిబాబా వారి క్షేత్రములో శ్రీ నరసింహ స్వామి వారు వెలసియున్నారు

48. జోధపూర్ రాజస్తాన్ - సచియా దేవి ఆలయములో శ్రీ నారసింహ స్వామి వారు వెలసియున్నారు

49. శ్రీరంగం తమిళనాడు - కావేరి నదీ తీరం
శ్రీరంగనాథుని ఆలయములో శ్రీ నృసింహ స్వామి వారికి ఆలయమున్నది.

50 చోళింగ పురం . తమిళనాడు - 28 కి మీ తిరుత్తణి
ఈ క్షేత్రమును శివలింగ పురం అని కూడా పిలుస్తారు. హిరణ్య కశిపుడు,

ప్రహ్లాదుని కథ. స్తంభము నుండి బయటకు వచ్చు భయంకర దృశ్యం. చూచువారు భయపడతారని ప్రక్కనుండి చూడడానికి గోడ అడ్డముగా కట్టబడినది. స్వామివారు శ్రీ యోగానంద నృసింహ స్వామి. అమ్మవారు అమృత వళ్ళి తాయారు. ఈ క్షేత్రమును "షోలింగర్", "ఘటికాచలం" అని కూడా పిలుస్తారు.

51 జాజ్‌పూర్ . ఒరిస్సా - వైతరణి నదీ తీరం.
బిరిజాదేవి ఆలయం దగ్గరలో నున్న చిన్న లంకలో శ్రీ వరాహ నృసింహాలయమున్నది ఇచ్చటనే "నాభిగయ" కూడ ఉన్నది

52 భంత్ర : హిమాచల ప్రదేశ్ - సాగర్ తాలూకా
నరసింగాలయము గలదు

53 భాక్రా : హిమాచల ప్రదేశ్ - బిలాస్‌పూర్ జిల్లా
నరసింగాలయము గలదు.

54. సన్హావి : హిమాచల ప్రదేశ్ - బిలాస్‌పూర్ జిల్లా
నరసింగాలయం.

55. ఘుమర్‌విన్ : హిమాచల ప్రదేశ్ - ఘుమర్ విన్ జిల్లా.

56. జిజ్జార్ : హిమాచల ప్రదేశ్ - బిలాస్‌పూర్ జిల్లా
నరసింగాలయము.

57. ఝుంజాటా : హిమాచలప్రదేశ్ - బిలాస్‌పూర్ జిల్లా
నరసింగాలయము.

58. త్రివేంద్రం · కేరళ
అనంత పద్మనాభ స్వామి వారి ఆలయములో

59. జోషీమఠ్: ఉత్తర ప్రదేశ్ ఋషీకేష్ నుండి బద్రీనాధ్‌కు వెళ్ళు త్రోవలో నారసింహాలయము కలదు.

60. నారసింహక్షేత్ర్ : ఒరిస్సా : 35 కి.మీ. నౌపాడా
నారసింహాలయం

దశావతారములలోని నారసింహ అవతారమునకు ఎక్కువ ఆలయములు కనిపించుచున్నవి. ఈ ఆలయములు ఇతర రాష్ట్రముల కన్నా ఆంధ్రప్రదేశ్‌లోనే అతి ఎక్కువగా కనిపించుచున్నవి. దుష్టగ్రహ పీడను తొలగించు స్వామివారిగా, మానసిక వ్యాధులు నయము చేయు స్వామివారిగా ప్రసిద్ధినొందియున్నారు

# వామనావతారం

"ఇంతింతై వటుడింతయై మరియు దానింతై నభోవీధిపై
నంతై తోయద మండలాగ్రమున కల్లంతై ప్రభారాశిపై
నంతై చంద్రుని కంతయై ధ్రువునిపై నంతై మహర్వాటిపై
నంతై సత్యపదోన్నతుండగుచు బ్రహ్మాండాంత సంవర్ధియై "

వామనావతారము బలిచక్రవర్తిని దండించుటకు కాదు బలిచక్రవర్తి యొక్క ధర్మప్రవర్తనకు సంతసించి నిత్యానంద నిలయమైన పాతాళమును ప్రసాదించి, సర్వదా రక్షణార్థము సుదర్శనమునేర్పాటు చేసెను. ఈ అవతారము దుష్ట శిక్షణకు గాక, కేవలం స్వర్గాన్ని దేవేంద్రునికిప్పించుటే ధ్యేయంగా కనిపిస్తున్నది

1 కాంచి పురము . తమిళనాడు - ఒక పాదము పైకెత్తబడి యున్న నల్లటి పెద్ద విగ్రహము గల ఆలయమున్నది. స్వామివారి వామనావతార రూపమును పొడుగాటి కర్ర చివరన కాగడా వెలిగించి చూపింతురు

2. మధుర . ఉత్తరప్రదేశ్ - శ్రీకృష్ణ జన్మస్థానము.
వామనావతార విగ్రహముతో బాటు బలిచక్రవర్తి, శుక్రాచార్యుల వార్ల విగ్రహములు కూడ కలవు.

3. ఖజురహో . మధ్యప్రదేశ్ - శ్రీమహావిష్ణువు యొక్క మరుగుజ్జు అవతారము కలదు.

4. ఖాట్మండు . నేపాల్ - వామనావతార మందిర్, బాలాజి మందిర్, త్రిశూల మందిర్, త్రిపురేశ్వర మందిర్ కలవు.

5 మహాబలి పురం ' తమిళనాడు
ఇచ్చట వామనావతారం కలదు.

6 బాదామి . కర్నాటక
ఇచ్చటనున్న గుహలో వామనావతారము కలదు.

7. కనూజ్ : ఉత్తరప్రదేశ్ - కన్యాకుబ్జ నగరమున వామనావతారమునకు మందిరము కలదు.

8 అలంపురం : ఆంధ్రప్రదేశ్ - మహబూబ్‌నగర్ జిల్లా.
జోగుళాంబ ఆలయములో బలిచక్రవర్తికి దానమిస్తున్నట్లుగా విగ్రహం కలదు. ఒక కాలు పైకి, ఒక కాలు క్రిందికి గలదు.

9 మీర్జాపూర్ : ఉత్తర ప్రదేశ్ - గంగానదీ తీరం.
వామనావతారమునకు మందిరము కలదు

10 తిరుక్కోయిల్ తమిళనాడు - దక్షిణ ఆర్కాట్ జిల్లా
"ఉళగలంత పెరుమాళ్ " (వామనావతారం) త్రివిక్రమ స్వామి అమ్మవారు పూంగోపాల్ తాయార్

# శ్రీరామావతారం

ఆసేతు హిమాచల పర్యంతం ఈ అవతారమునకు ఆలయములున్నవి రామాలయము లేని పల్లెగాని పట్టణముగాని ఉండదు సాధారణముగా శ్రీరామచంద్ర మూర్తి ఆలయం సీతా, లక్ష్మణ, ఆంజనేయ సమేతముగా కన్పిస్తున్నది ఆంధ్రప్రదేశ్‌లో ముఖ్యమైన శ్రీరామాలయములు

1. భద్రాచలం . ఖమ్మం జిల్లా - గోదావరి నదీ తీరం .

భద్రుడనే కొండపై స్వామివారు వెలసి పోకల దమ్మక్క అనే భక్తురాలిచే పూజలందుకుని రామదాసుచే ఆలయనిర్మాణము గావించుకుని పుట్టిన రోజునే కళ్యాణ మహోత్సవము జరుగు పుణ్యక్షేత్రం. ఇచ్చట శ్రీరాముడు చతుర్భుజుడుగా వెలసియున్నాడు మానవ మూర్తి అయిన శ్రీరాముడు చతుర్భుజుడుగా వెలయుటచే ఈ క్షేత్రము మిక్కిలి ప్రాధాన్యతనొందినది.

2 ఒంటిమిట్ట : కడప జిల్లా - ఇచ్చట శ్రీరాముడు కోదండ రాముడుగా వెలసిన దివ్య క్షేత్రం. మహాకవి బమ్మెర పోతన శ్రీమహాభాగవతాన్ని తెనిగించి ధన్యత్వము నొందిన చోటు

ఉత్తర ప్రదేశ్‌లోని అయోధ్య నగరములో శ్రీరాముడు జన్మించెను. దశరధ మహారాజునకు, శ్రీరామ చంద్రునకు సరయూనదీ తీరమున అనేక ప్రముఖ దేవాలయములు వెలసియున్నవి. సీతాదేవి జన్మ స్థానమగు నేపాల్ రాజ్యములో కూడా సీతా సమేతుడైన శ్రీరామునకు అతి ప్రసిద్ధ దేవాలయములు కలవు. ఇవిగాక శ్రీరామ వనవాస కాలమున నివసించిన పంచవటిలోను, సేతు బంధనము గావించి రావణ వధానంతరము తిరిగి వచ్చి పాప పరిహారార్థము శివలింగము ప్రతిష్టించిన రామేశ్వర క్షేత్రమందును ప్రముఖ రామాలయములు వెలసియున్నవి ఇవి గాకలక్ష్మణస్వామివారికి, భరతునకు, శత్రుఘ్నునకు, ఆంజనేయునికి ప్రత్యేకముగా నున్న ఆలయములు వేరేచోట విశదీకరింపబడినవి.

సీతాదేవి తన అవతార సమాప్తిని మిశ్రిక్ తీర్థములోను, శ్రీరామచంద్రమూర్తి తన అవతార సమాప్తిని సరయూ నదిలోను చేసియున్నారు. రామాయణ గాధకు సంబంధించిన విగ్రహములు, ఆలయములు కోకొల్లలు. అవన్నియు విశదీకరించుట సాధ్యము కాదు. అయినను ప్రత్యేకతలు గల ఆలయములను వేరుచోట విశదీకరించుట జరిగినది. రామకథకు సంబంధించి ఎన్నియో గాధలు ప్రచారములో నుండి ప్రతీ రామాలయమునకు ఈ గాధలు కొంతవరకు అన్వయించబడి యున్నవి రావణునకు, విభీషణునకు, శూర్పణఖకు ఇంకా ఇతర రాక్షస, వానర ప్రముఖులకు బహు కొద్ది చోట్ల విగ్రహములు వెలసి పూజలనందుకొనుచున్నవి.

జన్మించిన దాది స్వర్గారోహణం చేయువరకు శ్రీరాముడు మానవ మాత్రుడుగా చెలామణి కావడమే గాక మహావీరుడుగా, నీతి నియమములు పాటించు న్యాయమూర్తిగా అందరి మనస్సులలో ప్రత్యేక భక్తి భావమును నెలకొల్పియున్నాడు అంతియే గాని

ఎచ్చటను తాను భగవంతుడనని గాని, మానవుల కసాధ్యమైన మహిమలు చేసిగాని, చూపించిగాని ఎరుగడు. ఇది ఈ అవతార గొప్పతనము.

రామావతారములో కనిపించు రహస్యం: కౌసల్య యిచ్చిన పాయస భాగం మూలాన సుమిత్రకు పుట్టిన లక్ష్మణుడు కౌసల్య గర్భాన జనించిన శ్రీరామునికి చేరువయ్యాడు. కైక యిచ్చిన పాయసభాగం వలన సుమిత్రకు పుట్టిన శత్రుఘ్నుడు కైకకు పుట్టిన భరతునికి చేరువయ్యాడు.

# శ్రీ కృష్ణావతారం

శ్రీ కృష్ణుడు కూడా శ్రీరామునివలె పరిపూర్ణుడు. అనగా రామావతారమున శ్రీరామునకు జననము, విద్య, వివాహము, వియోగము, రాక్షస సంహారము మొదలగు సంఘటనలతోనిండి మరణముతో (స్వర్గారోహణము) సహా ఉన్నట్లుగనే శ్రీకృష్ణావతారములో గూడా పుట్టుక, బాల్యము, యౌవ్వనము, వివాహము, దైత్య సంహారము, మరణము మొదలైనవి గలవు. త్రేతాయుగ వీరుడైన శ్రీరామచంద్రుడు ఏకపత్నీవ్రతుడుగా పితృవాక్పరిపాలకుడుగా, ఆదర్శ పురుషుడుగా ప్రజలను జనరంజకముగా పాలించి, రామరాజ్యమును నాటికి నేటికి వాంఛించునట్లు చేసిన మహావీరుడు. ద్వాపరయుగములో అవతారమెత్తిన శ్రీకృష్ణుడు ప్రేమ తత్వమును దాని ఆచరణోపయోగములను బోధిస్తూ రాబోయే యుగములలోని కుతంత్రములను విశదీకరిస్తూ వాటికి తగిన ఉపాయముల నన్వేషింప వలసిన ఆవశ్యకతను తెలియజేస్తూ మహా మహిమాన్వితుడుగా, రాజనీతిజ్ఞుడుగా దర్శనమిచ్చెను. త్రేతాయుగ పురుషుడు ఆదర్శమూర్తి అయితే ద్వాపరయుగ మూర్తి అనుసరణీయుడుగా వ్యక్తమగు చున్నది.

శ్రీకృష్ణుడు తన పసిప్రాయము నుండి, బాల్యములోను యౌవ్వనము వచ్చువరకు ఎన్నో మహాద్భుత కార్యములు చేసి తాను భగవంతుడునని చెప్పుకొనెను. ఈ అవతార గొప్పతనము భాగవతమునకు పరిమితమైనది. మహాభారతమున కనిపించు పూర్ణకృష్ణుడు మాయగాడుగా, మోసగాడుగా, జిత్తులమారిగా, ఎత్తులకు పై ఎత్తులు వేయు రాజనీతిజ్ఞుడుగా,తెలివైనవాడుగా ప్రజల గుండెలలో నిలచిపోయినాడు. అతని తత్వమును ఎరింగిన బహుకొద్దిమందికి తప్ప తాను భగవంతుడుగా గోచరించలేదు. బాల్య కృష్ణుడుగా ఎన్నో అద్భుతములను చేసినను, పూర్ణ కృష్ణుడుగా ఎన్నో మాయలు చూపించినను కృష్ణావతారమును అర్థము చేసుకొనుట చాల కష్టముగ మిగిలినది దీనినే కృష్ణమాయ అందురు.

యావద్భారత దేశమంతయు శ్రీకృష్ణనామము జపింపబడుచూ బాలకృష్ణుడుగా, పార్థ సారధిగా, వేణుగోపాల స్వామిగా, రాధా మాధవుడుగా, లక్ష్మీ నారాయణుడుగా అనేక చోట్ల వెలసి పూజలందుకొనుచున్నాడు అందు ముఖ్యముగా శ్రీ కృష్ణ గాధలకు సంబంధించిన

మధుర బృందావనములు, పంచద్వారకలు ప్రముఖమైనవి  ఇవన్నియు ఉత్తర దేశమున కలవు.  దక్షిణ దేశమున ఉడిపి, గురువాయూర్, అరాన్ముల, మైలాపూర్ మద్రాసు మొదలగు చోట్ల శ్రీకృష్ణాలయములు విరాజిల్లుచున్నవి  పండరీ పురమున విఠలుడుగా స్వామివారు దర్శనమిచ్చుచున్నారు.  శ్రీ కృష్ణ గాధకు సంబంధించిన రాధా దేవికి, అష్ట భార్యలకు, పంచపాండవులకు, జరాసంధునకు, బలరామ సుభద్రలకు ఆలయము లచ్చటచ్చట వెలసియున్నవి.  వీటి వివరములు వేరుచోట తెలియజేయడమైనది.

# బుద్ధావతారము

బౌద్ధ మతమునకు ఆధ్యుడు బుద్ధత్వము సిద్ధించిన గౌతముడు.  ఈయనకు సిద్ధార్ధుడని మరియొక పేరు కలదు.  బుద్ధత్వము సిద్ధించిన తరువాత బుద్ధుడుగా పిలువబడినాడు.  ఈయన స్థాపించిన మతమునకు బౌద్ధమతమని పేరు. హిందూమతము ప్రాచీనమైనప్పటికి బుద్ధుని యొక్క ఔన్నత్యమును గ్రహించి మహావిష్ణువు యొక్క అవతారములలో బుద్ధుని కూడా అవతార పురుషునిగా  ఎంచినది.  హిందూ దేశమున బుద్ధుని యొక్క ఆలయములు బహుకొద్దిగా ఉన్నవి.  ఎక్కువగా బౌద్ధ విహారములు కొండ గుహలలో కనిపించుచున్నవి. చాల చోట్ల ఆరామములు కూడా కనిపించుచున్నవి.  బుద్ధుని బోధలు, జాతక కధలు, జీవిత చరిత్ర మొదలైనవన్నియు అనేక చోట్ల చెక్కబడియున్నవి. బుద్ధుడు లుంబినీ వనములో పుట్టి గయకు దగ్గరలోని బుద్ధగయలో బుద్ధత్వమును పొంది అనేక చోట్ల ఉపదేశములిచ్చి కుషీనగర్‌లో (కాశియా) నిర్యాణము చెందెను. భారత దేశమున ఎక్కువగా గుహాలయములతో బాటు ఆరామములు మాత్రమే దర్శనీయముగ నున్నవి.

1. లుంబిని :  బుద్ధ భగవానుని జన్మస్థలం (నేపాల్)

కపిలవస్తు రాజధాని. బుద్ధుడు కపిలవస్తు రాకుమారుడు  శాక్య వంశజాడు.  శాక్య సింహుడుగా  పసితనమున పిలువబడుచుండెడివాడు.  లుంబిని నేటి నేపాల్ రాజ్యమున నున్నది.  బోండా - గోరఖ్‌పూర్ లూప్ లైనులో కాకర్వాహ్ వరకు వెళ్ళి అక్కడ నుండి "నౌకర్" (హిందూ దేశపు బోర్డర్) వెళ్ళి లుంబినికి బస్సుపై వెళ్ళవలెను.  లుంబిని శాక్యవంశరాజులు పరిపాలించిన కపిలవస్తు రాజ్యానికి రాజధాని నగరానికి దగ్గరలో నున్నది. సప్త ప్రాకారాలతో విరాజిల్లేదట.  ఇప్పుడంతా శిధిలమై బుద్ధుని జన్మమునకు ఆధారముగా చిన్న ఆలయం నిర్మించబడినది.  ఇచ్చట నున్న స్తంభాకార స్తూపమున బుద్ధుని సూక్తులు  చెక్కబడి ఉన్నవి.

2. బుద్ధ గయ :  బీహార్

ఇచ్చట నున్న రావిచెట్టు క్రింద తపమాచరించి జ్ఞానబోధను పొందెను  వృక్షమునకు బోధివృక్షమని నామధేయము.  నిరంజనా నదీ తీరము.  బుద్ధత్వము పొందిన ఈ పవిత్ర ప్రాంతమున ఇతర దేశస్తులు నిర్మించిన బౌద్ధ దేవాలయములున్నవి.

3. సారనాధ్ .  ఉత్తర ప్రదేశ్ - 10 కి మీ. వారణాసి.

జ్ఞాన వికసితుడైన బుద్ధ భగవానుడు మొట్టమొదటిసారిగా బోధ గావించిన పవిత్ర స్థలం. ఇచ్చట స్తూపం నిర్మించబడియున్నది.

4. రాజగిరి · బీహార్ - 40 కి మీ. నలంద

ఇచ్చట గల కొండపై జపాన్ వారు కట్టించిన బౌద్ధాలయం కలదు ఇచ్చటకు చేరుటకు రోప్ వే గలదు యాత్రీకులు కుర్చీలలో కూర్చుని రోప్‌వే ద్వారా వెళ్ళి బుద్ధుని దర్శించి, నమస్కరించి తిరిగి వత్తురు

5. శ్రావస్తి : ఉత్తర ప్రదేశ్

లక్నో - వారణాసి మార్గములోని బహారిచ్‌కి 3 కి మీ. దూరములో ఉన్నది బుద్ధభగవానుడు సహస్ర పత్ర పద్మములో ఆశీనుడై విశ్వరూపం చూపిన పుణ్యస్థలము. గోరఖ్‌పూర్ నుండి బస్సుపై వెళ్ళవచ్చును

6. కాశియా : ఉత్తరప్రదేశ్ - 55 కి మీ. గోరఖ్‌పూర్

బుద్ధుడు తన 80 వ ఏట సాలవృక్ష వనములో (క్రి పూ 487 మే నెలలో) నిర్యాణము చెందిన చోటు దీనినే "కుషీనగర్" అని కూడా పిలుస్తారు ఇచ్చట అశోకుడు నిర్మించిన పెద్ద స్తూపం కలదు.

7 సిక్కిం : సిక్కిం రాజధాని గ్యాంగ్‌టక్‌నకు 27 కి.మీ. దూరములో ప్రసిద్ధ రామ్‌టెక్ మానిస్ట్రి కలదు. సిక్కింలో, నేపాల్‌లో బౌద్ధ దేవాలయములు, ఆరామములు చాలా గలవు.

8. హైదరాబాద్ . ఆంధ్రప్రదేశ్ రాజధాని

హుస్సేన్ సాగర్‌లోని జిబ్రాల్టర్ రాక్‌పై అతి పెద్ద విగ్రహము ప్రతిష్ఠించబడి యున్నది.

మహారాష్ట్రలోని అజంతా ఎల్లోరా గుహలు, మధ్య ప్రదేశ్‌లోని సాంచీ స్తూపములు, ఆంధ్రప్రదేశ్‌లోని అమరావతి, కరీంనగర్‌లలోని స్తూపములు, బీహార్‌లోని వైశాలి నగరములోని స్తూపములు, ముంబాయి చుట్టు ప్రక్కల నున్న అనేక గుహలలో వెలసిన ఆరామములు చాలా ప్రసిద్ధి నొందియున్నవి.

9. ఎలిఫెంటా, కార్లా, కన్హేరి, భజ, బేడ్సా, పాండవ గుహలు (8.కి.మీ. నాసిక్), పిరాల్ కోట గుహలు (78 కి.మీ. ఔరంగాబాద్) మొదలైన వాటలో బౌద్ధారామములు గలవు.

బౌద్ధామతము హిందూ దేశములో నేడు తక్కువ మోతాదులోనున్నను యితర దేశములలో ప్రాధాన్యత పొంది వున్నది. అశోకచక్రవర్తి మొదలగు వారు బౌద్ధమత విస్తరణకు చాల కృషి చేసిరి బౌద్ధము భారతావనిలో మొలకెత్తినను, హిందూ మత మహావృక్షము క్రింద నిలువ జాలక విదేశాలలో విరాజిల్లుచున్నది.

# కలికావతారము

నీతి, ధర్మం, సత్యం కనిపించక హింసాకాండ పెరిగిపోయి ప్రజలంతా చాలా అన్యాయముగా, విడ్డూరముగా కలియుగాంతమున ప్రవర్తిస్తారు. ధర్మ సంస్థాపనార్థం, దుష్ట శిక్షణార్థం విష్ణుమూర్తి కల్క్యావతారుడై విష్ణుయశుడనే బ్రాహ్మణునికి ఉద్భవించి గుర్రమెక్కి, ఖడ్గం ధరించి అధర్మాన్ని, పాపాత్ములను రూపుమాసి ధర్మస్థాపన చేస్తాడు

దశావతారములను పరిశీలిస్తే భగవంతుడు అన్ని జీవరాశుల్లోను ఉన్నాడనిపిస్తుంది. ద్వారపాలకులైన జయ, విజయుల జన్మల మూలకముగా తెలియునదేమనగా అధర్మ పాలన, దుష్టత్వము పనికిరాదు. ధర్మహాని జరుగునపుడు భగవంతుడు అవతారమెత్తి అణగద్రొక్కును. మత్స్యావతారానికి ముందు విష్ణుమూర్తి ఎత్తిన హయగ్రీవావతారము, క్షీరసాగర మధనానంతరము అమృతాన్ని పంచియిచ్చిన మోహిని అవతారము, భస్మాసురుని బారినుండి శంకరుని రక్షించుటకు ఎత్తిన జగన్మోహిని అవతారము, హరిహర పుత్రుడుదయించుటకు శివుని భార్యగా రూపందాల్చిన స్త్రీరూపము అవతారములలో కనిపించవు.

# దివ్య దేశములని పిలువబడు విష్ణుమూర్తి యొక్క దివ్య తిరుపతులు (దేవతలచే ప్రతిష్ఠించబడినవి) - 108

1. శ్రీవైకుంఠము : శ్రీవైకుంఠధామం. శ్రీమన్నారాయణుడు, లక్ష్మీదేవి 2) శ్రీ క్షీరసాగరము : పాలకడలి, సప్తసాగరములలో నొకటి, క్షీరాబ్దినాథుడు,క్షీరాబ్ధి నాయకి. 3)శ్రీరంగము . (T.N ) 13 కి.మీ. తిరుచినాపల్లి. కావేరీతీరం 7) ప్రాకారాల_ఆలయం దక్షిణాభి ముఖం. శ్రీరంగనాథుడు, శ్రీరంగలక్ష్మి 4) కోయిలూరు : (T.N ) వొరైయూర్ అని కూడా పేరు 3 కి.మీ. ట్రిచ్చి, 35 కి మీ తిరువన్నామలై,కుడమురుట్టి నదీతీరం. మణవాళ స్వామి, వాసలక్ష్మీదేవి 5) తిరువెల్లారై : (T.N ) 20 కి.మీ. శ్రీరంగం 12 కి.మీ. కదంబనూర్. శ్రీ పుండరీకాక్షుడు, చంపకవళ్ళి. 6) అంబిల్ : (T.N ) 9 కి.మీ. లాల్‌గుడి R.S ట్రిచ్చి దగ్గర. సుందరరాజ పెరుమాళ్, సుందరవళ్ళి తాయారు. 7) తిరుప్పేరనగర్: (T N.) శ్రీరామ్‌నగర్ అని కూడా పిలుస్తారు. 3 కి.మీ. ప్రేమపురం 15 కి.మీ బోదలూర్ R.S తంజావూరు జిల్లా, కావేరి నదీ తీరం పూపప్రియ రంగనాథుడు, రంగనాయకి 8) కదంబనూర్ : (T N ) 5 కి.మీ శ్రీరంగం 4 కి.మీ. కొల్లాడం. కదంబ వృక్షాలు గల క్షేత్రం శ్రీపురుషోత్తముడు, పూర్వాదేవి 9) తంజై మామణి క్కోయిల్ · (T.N ) శరణ్య నగర్ అని కూడా పిలుస్తారు. 4 కి.మీ. తంజావూరు, తంజావూరు జిల్లా మూడు ఆలయములు గలవు. 1. శ్రీ నీలమేఘుడు, శంఖమల వళ్ళి (అరుణకమల నాయకి) 2. శ్రీ నృసింహ భగవాన్ తంజై నాయకి. 3. శ్రీ మణిక్కుంట పెరుమాళ్, అంబుజ వళ్ళి 10) కండియూర్ ·(T N)

ఖండనగర్ అని కూడా పిలుస్తారు. 6 కి.మీ. తంజావూరు తంజావూరు జిల్లా, హరశాప మోచన పెరుమాళ్, కమల వళ్ళి. 11) కూడలూరు :(T.N.) సంగమ పురం అని కూడా పిలుస్తారు. 13 కి.మీ. తిరువాయూర్. 1 కి.మీ అయ్యం పేట R.S. తంజావూరు జిల్లా. కావేరి నదీ తీరం జగద్రక్షక భగవాన్, పద్మాసన వళ్ళి. 12) కపిస్థలం : (T.N.) 6 కి.మీ కూడలూరు, 3 కి.మీ. పంపాసరం. కావేరి నదీ తీరం. శ్రీ గజేంద్ర వరదస్వామి, రామామణి. 13) తిరుపుల్లభూదం కుడి : (T.N.) 3 కి.మీ. తిరుమండిక్కుడి. శ్రీవల్ వళ్ళిరామ, పోత్తామరైయాల్ నాంచారి. 14) తిరు ఆదనూరు : (T.N ) గోపురమని కూడా పిలుస్తారు. 2 కి.మీ. తిరుపుల్ల భూదం కుడి, కావేరి నదీతీరం. శ్రీ ఆంగలక్క మాయన్, రంగనాయకి తాయార్. 15) కుంభకోణము : (T.N.) తంజావూర్ జిల్లా. 5 కి.మీ. తిరునాగేశం. సారంగపాణి, కోమల వళ్ళి 16) విన్నాగరం (T.N.) తులసివనం అని పేరు. ఆకాశనగర్ అని కూడా పిలుస్తారు. 7 కి.మీ కుంభకోణం తంజావూరు జిల్లా, శ్రీ ఉప్పిలి యప్పణ్, భూమి లక్ష్మి, లవణ రహిత ప్రసాదం. 17) నారైయూర్: (T.N ) సుగంధగిరి అని కూడా పిలుస్తారు. 10 కి.మీ. కుంభకోణం మణిముక్తానదీ తీరం . శ్రీ నంబియూర్, నంబిక్కై నాచియార్ 18)తిరుచ్చెరై : (T.N.) సారక్షేత్రమని పేరు. 5 కి.మీ. నారై యూర్, కావేరి నదీ తీరం 18 కి.మీ. కుర్తాళం. శ్రీ సారనాథ స్వామి, సారలక్ష్మి. 19) నందిపుర విణ్ణాగరం : (T.N.) 5 కి.మీ. కుంభకోణం, తంజావూరు జిల్లా. శ్రీ విణ్ణాగర్, చంపక వళ్ళి. 20) వెల్లయం గుడి (T.N.) భార్గవపురం అని పేరు. 8 కి.మీ. తిరువిడ మరుదూర్ R.S. శ్రీ కోలబిల్లి రామ, మరకత వళ్ళి తాయార్, 21) తేరలందూర్ : (T.N ) రథ పాత స్థలం అని పేరు, 5 కి.మీ. కుర్తాళం 15 కి.మీ. మాయవరం R.S. శ్రీ ఆమరుధి అప్పన్, శంఖ మల వళ్ళితాయార్, 22) తిరు విందలూర్ : (T.N.) ఇంద్రపురమని పేరు 5 కి.మీ. మాయవరం R.S. కావేరి నదీ తీరం. శ్రీ మరువిణియ మైందున్ భగవాన్, చంద్ర శాపవిమోచన వళ్ళి 23) శిరిప్పులియూర్ :(T.N.) వ్యాఘ్రపురి అని పేరు. 2 కి.మీ. కొల్లు మాంగుడి R.S పేరలం R.S. దగ్గర, శ్రీ అరుల్ మాకడల్ భగవాన్, సముద్ర కన్య. 24) తిరుక్కణ్ణ పురం : (T.N.) శ్రీ కృష్ణపురం, కణ్వపురం అని పేరు . 6 కి.మీ. నన్నిలం. శ్రీ శౌరి రాజ భగవాన్, కణ్ణప్పుర నాయకి. 25) తిరుక్కణ్ణ మంగై : (T.N.) కృష్ణ మంగళపురం అని పేరు. 6 కి.మీ. తిరువారూర్. తంజావూరు జిల్లా. శ్రీ భక్త వత్సల పెరుమాళ్, అభిషేక వళ్ళి తాయార్. 26) తిరుక్కణం గుడి : (T.N.) కృష్ణకుటి అని పేరు 13 కి.మీ. తిరువారూర్. శ్రీ శ్యామల మేని పెరుమాళ్, అరవింద వళ్ళి. 27) నాగపట్టణము :(T.N.) తంజావూరు జిల్లా. శ్రీ సౌందర్య రాజపెరుమాళ్, సౌందర్య వళ్ళి. 28) శ్రీరామ విణ్ణాగరం : (T.N ) త్రివిక్రమపూర్ అని పేరు. షియాలి R S. ప్రక్కన శ్రీ త్రివిక్రమ మూర్తి, అమృత వళ్ళి. 29). తిరునగరి : (T.N ) పరిరంభపూర్ అని పేరు. 10 కి.మీ. షియాలి. శ్రీ సుందర బాహుభగవాన్, అమృత వళ్ళి. 30.

మణిమాడ కోయిల్ : (T.N ) నాగపురి అని పేరు. 6 కి.మీ. వైదీశ్వరన్ కోయిల్ R S., 12 కి.మీ. షియాలి ఆర్.యస్. శ్రీనర నారాయణ భగవాన్, పుండరీక వళ్ళి తాయార్. 31 తిరువైకుంఠ విణ్ణాగరం : (T.N.) వైకుంఠ పురం అని పేరు. తిరునాగూర్. శ్రీ వైకుంఠనాధ పుండరీకాక్ష, వైకుంఠ వళ్ళి 32 అరిమేయ విణ్ణాగరం : (T N.) నభ పురం అని పేరు. తిరునాగూర్. శ్రీకూడ మాడ క్కూత్త పెరుమాళ్, అరుణ కమల వళ్ళి 33. వణ్ణు పురుషోత్తమం : (T.N ) పురుషోత్తం అని పేరు తిరునాగూర్ శ్రీ పురుషోత్తమ పెరుమాళ్, పురుషోత్తమ నాయకి. 34. శంపో స్నేయ కోయిల్ : (T N ) స్వర్ణమందిర్ అని పేరు. తిరునాగూర్, శ్రీ స్వర్ణ రంగనాధ్, అల్లి మామలర్ అమ్మవారు. 35. తేత్రియంబలం : (T.N.) తిరునాగూర్. శ్రీ శంఖమ్మాళ్ భగవాన్, శంఖమల వళ్ళి. 36. తిరుమణి క్కూటం : (T.N.) మణికూటం అని పేరు. తిరునాగూర్ ప్రక్కన. శ్రీమణికూట నాయక్, తిరుమగల్ తాయార్. 37. కావలంబాడి : (T.N.) తాలవనం అని పేరు. 5 కి.మీ. తిరుమణి క్కూటం. శ్రీ గోపాలకృష్ణ రుక్మిణి, సత్యభామ. 38. కీలైచ్చాలై : (T.N.) దేవనగర్ అని పేరు. తిరునాగూర్ ప్రక్కన. శ్రీ దేవనాయక్, సముద్ర కన్యక, 39. తిరువేళం కుళం · (T.N.) శ్వేతహ్రదం అని పేరు. తిరు దేవనార్ దగ్గర. శ్రీ కృష్ణ నారాయణ, పూవార్తి రుమకల్ దేవి. 40. పార్ధన పల్లి : (T.N.) 3 కి.మీ. తిరునాగూర్. పార్ధ స్థలమని పేరు. శ్రీ కమల నయనస్వామి, తామరై నాయకి. 41. తలై చంగాడు : (T.N.) శంఖపురం అని పేరు. 5 కి.మీ. పార్ధన పల్లి. శ్రీ వాన్మదీయ పెరుమాళ్, తల్లై చంగనాచియార్. 42. తిరుచ్చిత్ర కూటం : (T.N ) చిదంబరం. నార్త్ ఆర్కాట్ జిల్లా. శ్రీ గోవింద రాజ భగవాన్, పుండరీక వళ్ళి తాయార్ 43.- మధురై : (T.N.) దక్షిణ మధురై. శ్రీ సుందర రాజ పెరుమాళ్, వకుళవళ్ళి. 44. తిరుమోహూర్ : (T.N.) 12 కి.మీ. మధురై. శ్రీ కాల మేఘ భగవాన్, మోకూర వళ్ళి. 45. తిరుమాలిరం చోలై (T.N.) వృషభాద్రి అని పేరు. 20 కి.మీ. మధుర్రై. శిలంబ నదీ తీరం శ్రీ అలగర మాల లంకార్ స్వామి, సుందర వళ్ళి. 46. తిరుమ్మెయం : (T.N.) సత్యగిరి అని పేరు. తిరుమాయం. తిరుచ్చినాపల్లి - మానే మధురై మార్గములో. శ్రీ సత్యగిరి నాధ్, ఉయ్యా వందాళ్ దేవి. 47. గోష్టీపురం : (T.N.) 25 కి.మీ. తిరుమాయం , 45 కి.మీ. మానే మధురై, శ్రీ సౌమ్య నారాయణ, తిరు మామగళ్ దేవి 48. దర్భశయనం : (T N.) 8 కి.మీ. రామనాధ పురం. శ్రీ కళ్యాణ జగన్నాధ్, కళ్యాణ వళ్ళి. 49. తిరుత్తం కాలూర్ . (T.N.) సీతోద్యాన పురం అని పేరు. 4 కి.మీ. శివకాశి. కామరాజు జిల్లా. శ్రీ తణకాలప్పన్, అనంత నాయకి. 50. శ్రీ విళ్ళిపుత్తూర్ : (T.N.) 108 దివ్యదేశములు ప్రహరి గోడపై చిత్రించబడినవి. కామరాజ జిల్లా. శ్రీ వటపత్రశాయి, ఆండాళ్ళమ్మ 51. శ్రీ వర మంగై · (T.N.) 35 కి.మీ తిరునల్వేలి. సెల్లై

కట్టబొమ్మన్ జిల్లా. శ్రీ వాన మామలై పెరుమాళ్, వరమంగైతాయార్. 52 తిరుక్కురుం కుడి (T.N ) పంచనంబుల క్షేత్రం. కురంగ నగర్ అని పేరు 13 కి మీ. వాన మామలై శ్రీ తిరుళ్పాకడల్ నంబి, కురుక్కుడి వళ్ళి. తిరుమంగై ఆళ్వారు పరమపదించిన స్థలం. 53 తిరుక్కురు కూర్ · (T.N ) 2 కి మీ. ఆళ్వారు తిరునగరి R S., చిదంబరం జిల్లా తామ్రపర్ణి నదీ తీరం శ్రీ ఆధినాధ భగవాన్ ఆధినాధ నాయకి 54 తులై విల్లి మంగళం . (T N ) ధ్వన్వి మంగళం అని పేరు. 2 కి మీ ఆళ్వారు తిరునగరి, తామ్రపర్ణి నదీతీరం. 1. శ్రీ దేవనాధ భగవాన్, కరుండరం కన్ని. 2. శ్రీ అరవిందలోచన స్వామి, కుముదాక్ష వళ్ళి, 55. శ్రీ వైకుంఠం (T N.) చిదంబరం జిల్లా. ఆళ్వారు తిరునగరి R S, తరువాత 30 కి.మీ. తిరునల్వేలి. తామ్ర పర్ణి నదీ తీరం. శ్రీ వైకుంఠనాథ్, వైకుంఠ వళ్ళి, 56. వరగుణ మంగై . (T.N.) శ్రీ వైకుంఠం దగ్గర. శ్రీ విజయాసన్ స్వామివారు, వరగుణ లక్ష్మీతాయార్, 57. తిరుప్పులిం కుడి . (T N ) చించాకుటి అని పేరు. వరగుణ మంగై దగ్గర శ్రీ కార్యాంచన వేందన్ స్వామి, మలరమంగై నాచియార్ 58. తిరుక్కుళందై : (T.N ) పెరూంకుళం అని పేరు. 12 కి.మీ. శ్రీ వైకుంఠం శ్రీ మాయక్కూతన్ పెరుమాళ్, కుళందై వళ్ళి. 59. తిరుప్పేరై : (T.N.) శ్రీ నామ పురం అని పేరు. ఆళ్వారు తిరు నగరి దగ్గర. మకర నేడు లైక్కాదన పెరుమాళ్, పులిక్కుండి వళ్ళి. 60.తిరుక్కోలూర్ : (T.N.), మహానిధి పూర్ అని పేరు. 3 కి.మీ. తిరుప్పేరై. వైత్తమ నిధి స్వామి, కొల్లూరు వళ్ళి, 61. తిరువనంతపురం : (కేరళ), అనంతశయనం అని పేరు అనంత పద్మనాభ స్వామి, హరి లక్ష్మీదేవి. 62. తిరు వాట్టూరు : (కేరళ) పరశురామ క్షేత్రమని పేరు. 50 కి.మీ. తిరువనంత పురం. ఆదికేశవ పెరుమాళ్, మరకతవల్లి .63. తిరు వణ్పరి సారం (T N ) రమ్యస్థలమని పేరు. 4 కి.మీ. నగర కోయిల్ అరేబియా సముద్ర తీరం. శ్రీ వేంకటా చలపతి. కమల వళ్ళి, 64. చంగనూరు: (కేరళ), సౌరభ పురమని పేరు. 50 కి.మీ. కొట్టారకర. చిత్రానదీ తీరం. శ్రీ బాలకృష్ణ సేం కమలవళ్ళి, 65. కుట్టనాడు : (కేరళ), శార్దూల నగర్ అని పేరు. 5 కి.మీ. చంగనూరు, శ్రీ మాయా ప్పిరాన్ స్వామివారు, పోర్కోటి అమ్మవారు. 66. తిరు వన్వండూర్ : (T.N.) 5 కి.మీ. తిరుప్పులియూర్, శ్రీ పాంప నెయ్యప్పన్, కమల వళ్ళి. 67. వల్లవాల్ : (T N.) 7 కి.మీ. తిరువణ్వండూర్. మణిమాల నదీ తీరం. శ్రీ కోలప్పిరాన్ స్వామి, శల్వ తిరుక్కోలందు తాయార్. 68. కడిత్తానం : (T.N.) 12 కి.మీ. వల్లవాల్. శ్రీ అద్భుత నారాయణ, కల్పవల్లి 69. వారన్విలై ఆరన్ములై : (కేరళ) సమృద్ధి స్థలం అని పేరు. 12 కి.మీ. తిరుచంగనూర్, పంపా నదీ తీరం. శ్రీ తిరుక్కురలప్పన్, పద్మా సనాచ్చియార్. 70. తిరుక్కాట్కరై · (కేరళ). మరుత్తటమని పేరు. 10 కి.మీ ఎర్నాకుళం. శ్రీ కాట్కారైయప్పన్, పెరుం సెల్వనాయకి 71. తిరు మాలిక్కలం . (కేరళ). శ్రీ మూలధాం అని పేరు. శ్రీ

తిరుమాలిక్కులత్తాన్ స్వామి, మధుర వేణి 72 విత్తు వక్కోడు . (కేరళ). విద్వత్తూర్ అని పేరు. 3 కి.మీ. పట్టాంబి R.S. శ్రీ ఉయ్యవంద పెరుమాళ్, విట్టువక్కోడు వల్లి. 73. తిరునావాయ్ : (కేరళ). నవ పురం అని పేరు. యడక్కోళం ఆర్. యస్. శ్రీ నారాయణ, మరల మంగై తాయారు. 74. తిరువయిందిర పురం · (T N ) 5 కి.మీ కడలూర్ ఆర్ యస్. అహీంద్ర పురం అని పేరు. గరుడ నదీ తీరం శ్రీ దేవనాయక, వైకుంఠ నాయకి. 75. తిరుక్కోవలూర్ : (T.N.) దేహలీపురం అని పేరు. 2 కి.మీ. తిరుక్కోవలూర్. R.S శ్రీ త్రి విక్రమస్వామి, పూం కవల నాచియార్ 76. మద్రాసు : (T N ) వృందారణ్య క్షేత్రం. తిరువళ్ళిక్కేని (ట్రిప్లికేన్). 1. శ్రీ పార్ధ సారధి, వెంకట కృష్ణ రుక్మిణి. 2. శ్రీ మన్నాత్ భగవాన్ (రంగనాధ), వేదవల్లి. 3. శ్రీ తెల్లియ నృసింహ స్వామి (అజగయ సింగాళ్) 4. శ్రీ చక్రవర్తి తిరుమకన్ స్వామి (శ్రీరామ) జానకి. 5 శ్రీ దేవ పెరుమాళ్, శ్రీదేవి, 77. తిరునిండనవూర్ : (T N ) తిన్ననూర్ అని పేరు. 2 కి మీ. తిన్ననూర్ R.S వృత్తక్షీర నదీ తీరం. 30 కి.మీ. మద్రాస్. శ్రీ భక్త వత్సల పెరుమాళ్, జగజ్జనని. 78. తిరువల్లూర్ : (T N.) వీక్షారణ్యం అని పేరు. 3 కి.మీ. త్రి వెల్లూర్ R.S శ్రీ వీరారాఘువ స్వామి, (భేషజం భిషక్) కనక వళ్ళి 40 కి.మీ. మద్రాస్. 79. తిరుక్కడిక్కై :(షోలింగర్) (T N.) ఘటికా చలం అని పేరు. 13 కి.మీ. షోలింగర్ R.S. 27 కి.మీ. ఆర్కోణం, (షోలింగర్) శ్రీ యోగ నరసింహ స్వామి, అమృత వళ్ళి. 80. తిరు నీర్మలై : (T.N.) తోతాది, 5 కి.మీ. పల్లవరం R.S. 23 కి.మీ. ఎగ్మూర్, (తోతాద్రి) R.S. 1. శ్రీ నీలమేఘ వర్ణస్వామి, మంగ తాయారు. 2. శ్రీ రంగనాధస్వామి, రంగనాయకి, 3. శ్రీశాంత నృసింహ స్వామి, 4. శ్రీ ఉళగలంద స్వామి, 5. శ్రీ చక్రవర్తి తిరుమకన్ స్వామి (శ్రీరామచంద్ర), 81. తిరువిడవెందై . (T.N ) వరాహ క్షేత్రం 3 కి.మీ. కోవలత్తై, 40 కి.మీ. ఎగ్మూర్ మహాబలిపురం రోడ్డుపై శ్రీ నిత్య కళ్యాణ స్వామి, (ఆదివరాహ స్వామి) అఖిల వళ్ళి, 82. తిరుక్కడలవై ·మహాబలిపురం (T.N.) 15 కి.మీ. తిరుక్కుల కుంద్రం (పక్షితీర్ధం) 45 కి.మీ. మద్రాస్. గరుడ నదీ తీరం. శ్రీ స్థల శయన పెరుమాళ్, నీలమంగై నాచ్చియార్ 83. కాంచీపురం : (T.N ) హస్తిగిరి అని పేరు. 70 కి.మీ. మద్రాస్. వేదావతి నదీ తీరం. శ్రీ వరద రాజస్వామి, పేరుందేవి తాయార్. 84. తిరువేక్కా . (T N.) యధోత్కారి అని పేరు. కాంచీపురం. శ్రీ యధోత్కారి పెరుమాళ్, కోమల వళ్ళి 85 అష్టభుజం . (T N.) (చినకంచి). కాంచీపురం వరదరాజ స్వామివారి ఆలయం 2 కి.మీ. శ్రీ ఆదికేశవ చక్రధర స్వామి(అష్టభుజ పెరుమాళ్), (పుష్పక వళ్ళి తాయార్) అలమేలు మంగ 86 తిరుత్తంక · (T.N.) దీప ప్రకాశ్ అని పేరు. కాంచీపురం. శ్రీ దీప ప్రకాశ్ స్వామి, మరకత వళ్ళి 87 వేలుక్కాయ్ · (T.N.) కామాసికి అని పేరు. కాంచీపురం శ్రీ (అజగయ సింగాళ్) ముకుంద నరసింహ, కామాసికీ

వళ్ళి, 88. ఉరగం . (T.N ) కాంచీపురం త్రివిక్రమ పెరుమాళ్, అమృత వళ్ళి కామాక్షి ఆలయం దగ్గర 89. నీరగం : (T.N ) నీరాకార్ అని పేరు. కాంచీపురం. ఉళగలంద పెరుమాళ్ ఆలయములో, శ్రీ జగదీశ పెరుమాళ్, నీల మంగై వళ్ళి 90 కారగం · (T.N.) కాంచీపురం., ఉళగలంద పెరుమాళ్ ఆలయములో శ్రీ కరుణాకర స్వామి, పద్మామణి, 91. కార్వణం : (T N.) కాంచీపురం. ఉళగలంద పెరుమాళ్ ఆలయములో, శ్రీ కళ్వార్ స్వామి, కమల వళ్ళి. 92. కళ్వనూర్ · (T.N.) కాంచిపురం. కామాక్షి ఆలయ ప్రాకారములో శ్రీ ఆదివరాహ స్వామి, అంజిలై వళ్ళి 93. తిరుప్పడగం · (T.N ) కాంచీపురం, ఏకాంబరేశ్వర ఆలయానికి దగ్గర. శ్రీ పాండవ దూత పెరుమాళ్, రుక్మిణి, సత్యభామ. 94. నీలత్తింగాళ్ తుండం : (T.N.) చంద్రచూడ అని పేరు కాంచీపురం. ఏకాంబరేశ్వర ఆలయ ప్రాకారంలో శ్రీ నీలత్తింగాళ్ తుండత్తాన్ స్వామి, నేరోరు వరిల్లా వళ్ళి. 95. శ్రీ ప్రవళవర్ణం . (T.N.) ప్రవాళ వర్ణం అని పేరు. కాంచీపురం. కామాక్షి ఆలయం దగ్గర, 1. శ్రీ ప్రవళ వర్ణ పెరుమాళ్, ప్రవళ వళ్ళి 2. శ్రీపంచై వర్ణపెరుమాళ్, మరకత వళ్ళి (పంచై వర్ణయూర్‌లో), 96 పరమేశ్వర విణ్ణాగరం : (T.N.) కాంచీపురం : పెద కంచిలో, శ్రీ వైకుంఠ పెరుమాళ్, వైకుంఠ వళ్ళి 97 తిరుప్పుత్‌కుజి : (T.N.) గృధ్ర క్షేత్రం, కాంచీపురం. 12 కి.మీ. పెదకంచి, శ్రీ విజయ రాఘవ స్వామి, మరకత వళ్ళి, 98. తిరుపతి : (ఆంధ్రప్రదేశ్) తిరువేంకటం, వేంకటాద్రి అనిపేరు. తిరుమల కొండపై 10కి.మీ. రేణిగుంట ఆర్.ఎస్. శ్రీనివాసుడు, అలమేలు మంగ. 99) అహోబిలం : (A.P) 25 కి.మీ. ఆళ్ళగడ్డ, భావనాశిని నదీతీరం, శ్రీనృసింహస్వామి, చెంచులక్ష్మి. 100) ద్వారక : (గుజరాత్) సప్త మోక్షపురములలో నొకటి. జామ్‌నగర్ జిల్లా. శ్రీ కళ్యాణ నారాయణ, కళ్యాణ వళ్ళి. 101) అయోధ్య : (U.P.) సప్త మోక్షపురములలో నొకటి. సరయూ నదీతీరం. శ్రీరామ, సీతాదేవి. 102) నైమిశారణ్యం : (U.P) సీతాపూర్ జిల్లా, 25 కి.మీ. బలమావు R.S గోమతి నదీతీరం. శ్రీ దేవరాజ భగవాన్, హరిలక్ష్మి. 103) మధుర : (U.P.) సప్త మోక్షపురములలో నొకటి. యమునా నదీతీరం. గోవర్ధనస్వామి, సత్యభామ. 104) గోకులం : (U.P) శ్రీకృష్ణుడు విహరించిన స్థలం. శ్రీనవమోహన కృష్ణ, రుక్మిణి, సత్యభామ. 105) దేవప్రయాగ : (U.P) బద్రీనాధ్‌కు పోవు త్రోవలో, అలకనంద, భగీరధీ నదుల సంగమ స్థానం. నీలమేఘ పురుషోత్తముడు, పుండరీక వళ్ళి. 106) జోషిమఠం : (U.P) బద్రీనాధ్‌కు పోవు త్రోవలో, పరమపురుష స్వామి, పరిమళ వళ్ళి. 107) బదరి : (U.P) బదరికాశ్రమం. బదరీ నారాయణ, అరవింద వళ్ళి. 108) సాలగ్రామం : (నేపాల్). ముక్తినారాయణ 160 కి.మీ. గోరఖ్‌పూర్. గండకి నదీతీరం. ముక్తి నారాయణ, శ్రీదేవి.

# ఇతర దివ్య దేశాలుగా పరిగణించబడినవి

1) గోకులం (U.P) మధుర జిల్లా. శ్రీకృష్ణ, రుక్మిణి, సత్యభామ 2) బృందావనం · (U P.) మధుర జిల్లా. శ్రీకృష్ణ, రుక్మిణి, సత్యభామ. 3) ముంబాయి . (మహారాష్ట్ర) విష్ణుమూర్తి, లక్ష్మీదేవి, 4) హైదరాబాద్ (A P) శ్రీవిష్ణుమూర్తి లక్ష్మీదేవి. 5) సేలం . (T.N ), శ్రీ విష్ణుమూర్తి, లక్ష్మీదేవి. 6) వర్కళ · (కేరళ). తిరువనంతపురం జిల్లా. శ్రీ జనార్ధన స్వామి, లక్ష్మీదేవి, 7) సేంగనల్లూర్ . (T.N.) తిరువిడ మరుదూర్ దగ్గర శ్రీరామనాధ, సీతాదేవి. 8) తిరుమండక్కుడి : (T.N.). కపిస్థలం దగ్గర 6 కి.మీ కూడలూరు. శ్రీ వరదరాజస్వామి, పేరుందేవి 9) తిరు నారాయణపురం . (T N) తిరుచినాపల్లి జిల్లా. శ్రీరంగం దగ్గర. శ్రీరంగనాధ,రంగనాయకి.

దివ్య దేశముల నిర్మాణములో, ప్రతిష్ఠాపనలో, ఆరాధనలో, ఉత్సవములలో ఒకే విధానం పాటించడం ఒక విశేషం. అన్ని చోట్లా స్వామివార్ల, అర్చా విగ్రహములు గలవు

# విష్ణుమూర్తి దివ్య స్థానములు - దివ్య స్థానములలోని నామధేయములు - 108

1. శ్రీవైకుంఠములో వాసుదేవుడు. 2) ఆమోదములో సంకర్షణుడు. 3) ప్రమోదములో ప్రద్యుమ్నుడు. 4) సమ్మోదములో అనిరుద్ధుడు. 5) సత్యలోకములో విష్ణుమూర్తి. 6) సూర్యమండలములో పద్మాక్షుడు. 7) క్షీరసాగరములో శేషశాయి. 8) శ్వేత ద్వీపములో తారకుడు. 9) బదరికాశ్రమములో నారాయణుడు. 10) నైమిశారణ్యములో అవినాశి హరి. 11) హరక్షేత్రములో సాలగ్రామం. 12) అయోధ్యలో రాఘవేంద్రుడు. 13) మధురలో శ్రీబాలకృష్ణుడు. 14) మాయాపురిలో మధుసూదనుడు. 15) కాశీలో భోగశయనుడు. 16) అవంతికలో అవనీపతి. 17) ద్వారకలో యాదవేంద్రుడు. 18) వ్రజభూమిలో గోపీజన వల్లభుడు. 19) బృందావనములో నందనందనుడు. 20) కాళీయ హ్రదములో గోవిందుడు. 21) గోవర్ధనములో భవనాశకుడు. 22) గోమంత పర్వతముపై శౌరి. 23) హరిద్వారములో జగత్పతి. 24) ప్రయాగలో వేణి మాధవుడు. 25) గయలో గదాధరుడు. 26) గంగాసాగర్ సంగమములో విష్ణుమూర్తి. 27) చిత్రకూటములో రాఘవుడు. 28) నందిగ్రామములో రాక్షసాంతకుడు. 29) ప్రభాస తీర్థములో విశ్వరూపుడు. 30) శ్రీకూర్మములో అచల కూర్ముడు 31) నీలాచలంపై పురుషోత్తముడు 32) సింహాచలముపై పన్ నృసింహుడు 33) తులసి వనములో గధాపాణి. 34) ఘృత శైలముపై పాపహరుడు. 35) శ్వేతాచలముపై సింహ

స్వరూపుడు. 36) ధర్మపురిలో యోగానందుడు. 37) కాకుళములో ఆంధ్రనాయకుడు 38) అహుబిలములో హిరణ్య కశిపు వధకారి. 39) పాండురంగలో విఠల్ 40 ) వేంకటాచలముపై శ్రీనివాసుడు 41) యాదవాచలముపై నారాయణుడు 42) ఘటికాచలముపై నృసింహుడు. 43) కాంచీపురములో వరదరాజులు. 44) శివకంచిలో యధోత్తకారి 45) కంచిలో పాండవ దూత, త్రివిక్రముడు, అష్టభుజ నృసింహుడు, మేఘాకారుడు, శుభాకారుడు, శుభప్రదుడు, కాలమేఘుడు, శేషాకారుడు, గరుడారూఢుడు, కోటి సూర్య సమప్రభ, దివ్యప్రకాశకుడు, దేవాధిపుడు, ప్రవాళవర్ణుడు, దీపాభుడు, శోభనుడు, దివ్యుడు 57) శ్రీగృధ్ర సరోవర తీరాన విజయరాఘవుడు. 58) వీక్షారణ్యములో వీరరాఘవుడు. 59) తోతాద్రిలో తుంగశాయి. 60) గజస్థలములో గజార్తి నాశక్ 61) బలిపురములో మహాబలి. 62) భక్తి సారములో జగత్పత్తి 63) శ్రీముష్ణములో మహావరాహుడు 64) మహేంద్రములో పద్మలోచనుడు 65) శ్రీరంగములో రంగనాధుడు 66) శ్రీధామములో జానకీ వల్లభుడు. 67) సారక్షేత్రములో సారనాధుడు. 68) ఖండనములో హరచాప భంజనుడు. 69) శ్రీనివాస స్థలములో పూర్ణుడు. 70) స్వర్ణమందిరములో సువర్ణుడు. 71) వ్యాఘ్రపురిలో మహావిష్ణువు. 72) భక్తి స్థానములో భక్తిదాత 73) శ్వేత హ్రదములో శాంతమూర్తి. 74) అగ్నిపురిలో సురప్రియ. 75) భార్గవ స్థలములో భర్గుడు 76) వైకుంఠములో మాధవుడు. 77) పురుషోత్తమలో భక్తసఖుడు 78) చక్రతీర్ధములో సుదర్శనుడు 79) కుంభకోణములో చక్రపాణి 80) భూతపురిలో శంఖధరుడు 81) కపిస్థలములో గజార్తి హరుడు 82) చిత్రకూటములో గోవిందుడు. 83) ఉత్తమములో అనుత్తముడు 84) శ్వేతాచలంపై పద్మలోచనుడు 85) పార్ధస్థలములో పరబ్రహ్మ. 86) కృష్ణ కోటిలో మధుసూదనుడు 87) నందపురిలో మహానందుడు 88) వృద్ధపురిలో వృషాశ్రయుడు. 89) సంగమ గ్రామములో అసంగుడు 90) శరణ్యములో శ్రీశరణుడు. 91) దక్షిణ ద్వారకలో జగత్పతి గోపాలుడు 92) సింహక్షేత్రములో మహాసింహుడు 93) మణి మండపములో మల్లారి. 94) నిబిడ్‌లో నిబిడాకారి 95) ధనుష్కోటిలో జగదీశ్వరుడు. 96) మాహోర్‌లో కాలమేఘుడు 97) మధురైలో సుందరుడు 98) వృషభాచలంపై పరమస్వామి 99) శ్రీవరగుణంలో నాధుడు 100) కురుకలో రమాప్రియుడు 101) గోష్టి పురములో గోష్టిపతి 102) దర్భశయనములో దర్భశాయి 103) ధన్వి మంగళలో శౌరి 104) భ్రమర స్థలములో బలాఢ్యుడు 105) కురంగలో పూర్ణుడు 106) వటస్థలములో శ్రీకృష్ణుడు 107) క్షుద్ర నదిలో అచ్యుతుడు 108) అనంతపురములో పద్మనాభుడు

పైక్షేత్రములలోని స్వామివార్ల పేర్లు ఉచ్చరించినంత మాత్రమున సమస్త వేదములను అధ్యయనం చేసినంత పుణ్యఫలము, యజ్ఞ యాగాదులు చేసినంత ఫలితము, సమస్త పుణ్య తీర్ధములలో స్నానము చేసిన లాభమును పొందగలరు సంసార బంధము నుండి విముక్తులై పరమపద ప్రాప్తి నొందగలరు పరమానంద దాయిని అయిన ముక్తినొందగలరు

# విష్ణుమూర్తి శ్రీ విగ్రహములు గల దివ్య క్షేత్రములు (8)

## స్వయం వ్యక్త క్షేత్రములు

1. శ్రీరంగం · తమిళనాడు, శ్రీరంగనాథుడు, రంగనాయకి.
2. వేంకటాచలం ఆంధ్రప్రదేశ్, శ్రీనివాసుడు, పద్మావతి
3. హరిక్షేత్రములోని సాలగ్రామము నేపాల్, ముక్తినాథ్, శ్రీమూర్తి, శ్రీదేవి.
4. నైమిశారణ్యం · ఉత్తరప్రదేశ్, సితాపూర్ జిల్లా, దేవరాజు స్వామి, పుండరీకవల్లి.
5. తోతాద్రి : తమిళనాడు. 30 కి.మీ. తిరునల్వేలి. తోతాద్రినాథ్, మంగతాయారు.
6. పుష్కర్ రాజస్తాన్, (విష్ణుమూర్తి) పరమపురుష స్వామి, పుండరీకవల్లి, 11 కి.మీ అజ్మీర్.
7. బద్రికాశ్రమం : ఉత్తరప్రదేశ్ బదరి నారాయణుడు, అరవింద వల్లి.
8 శ్రీముష్ణం : తమిళనాడు. 60 కి.మీ. చిదంబరం. భూ వరాహస్వామి, అంబుజ వల్లి.

భక్తులు విష్ణుమూర్తికి పలు నామధేయాలాపాదించి చతుర్భుజ స్వామివార్ల చేతులకు ఒకే రీతిలో గాక భిన్నరీతులలో ఎవరికి తోచిన విధముగా వారు శంఖ, చక్ర, గద, పద్మాల అలంకరణ వర్ణించినట్లు క్రింది విధముగా కన్పించుచున్నది. అందరూ ఒకే పద్ధతి పాటించినట్లు కనబడదు.

| స్వామివారి పేరు | పురాణము | పైకున్న కుడిచేత | పైకున్న ఎడమచేత | క్రిందకున్న కుడిచేత | క్రిందకున్న ఎడమచేత |
|---|---|---|---|---|---|
| 1 | 2 | 3 | 4 | 5 | 6 |
| 1 కేశవుడు | విష్ణుపురాణం | శంఖం | చక్రం | పద్మం | గద |
| 2. మధుసూదనుడు | భాగవతం | " | పద్మం | చక్రం | " |
| 3. దామోదరుడు | " | " | గద | పద్మం | చక్రం |
| 4. సంకర్షణుడు | " | " | పద్మం | గద | " |
| 5. ప్రద్యుమ్నుడు | " | " | చక్రం | పద్మం | గద |
| 6. ఉపేంద్ర | " | " | గద | " | చక్రం |
| 7. శ్రీహరి | భారతము | " | చక్రం | గద | పద్మం |
| 8. మాధవుడు | " | చక్రం | శంఖం | " | " |

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| 9 | వామనుడు | భాగవతము | ॥ | గద | శంఖం | ॥ |
| 10. | శ్రీధరుడు | ॥ | ॥ | పద్మం | గద | శంఖం |
| 11. | హృషికేశుడు | హరివంశము | ॥ | గద | పద్మం | ॥ |
| 12 | వాసుదేవుడు | భారతము | ॥ | శంఖం | ॥ | గద |
| 13 | గోవిందుడు | భాగవతము | గద | పద్మం | చక్రం | శంఖం |
| 14. | త్రివిక్రముడు | ॥ | ॥ | చక్రం | పద్మం | ॥ |
| 15. | అనిరుద్ధుడు | ॥ | ॥ | శంఖం | చక్రం | పద్మం |
| 16. | అధోక్షజుడు | ॥ | ॥ | ॥ | పద్మం | చక్రం |
| 17. | శ్రీకృష్ణుడు | భారతము | ॥ | పద్మం | శంఖం | ॥ |
| 18. | నారాయణుడు | భాగవతము | పద్మం | గద | ॥ | ॥ |
| 19 | విష్ణువు | శివపురాణము | ॥ | శంఖం | గద | ॥ |
| 20. | పద్మనాభుడు | భాగవతము | ॥ | ॥ | చక్రం | గద |
| 21. | పురుషోత్తముడు | భారతము | ॥ | ॥ | ॥ | ॥ |
| 22. | నృసింహుడు | శివపురాణము | ॥ | గద | ॥ | శంఖం |
| 23. | అచ్యుతుడు | భారతము | ॥ | చక్రం | గద | ॥ |
| 24. | జనార్ధనుడు | ఉత్తర హరివంశము | ॥ | ॥ | ॥ | ॥ |



**పతివ్రతలు - (5)**

1. అహల్య 2. ద్రౌపది 3. సీత

4. తార (బృహస్పతి భార్య) 5. మండోదరి

# విశిష్టతలు గల (Specialities) విగ్రహములు, ఆలయములు

తీర్థయాత్రలు మొదలుపెట్టిన తరువాత యావద్భారత దేశమున ఎన్నో వందలాది, వేలాది దివ్య దేవాలయ సందర్శన భాగ్యము కలిగినది. ప్రకృతి రామణీయకతను తెలియచెప్పుచోట కొన్ని దేవాలయములు వెలసివున్నప్పటికి విగ్రహములు యొక్కయు, ఆలయముల యొక్కయు ప్రత్యేకతలు సంతరించుకొన్నవి. మరికొన్ని దేవాలయములు కన్పిస్తున్నవి. ఆలయ కట్టడములోగానీ, విగ్రహ ప్రతిష్ఠాపనలో గానీ, పాటించు ఆచార వ్యవహారములలో గానీ, జరిపించు ఉత్సవాలు, యాత్రలలో గానీ ప్రత్యేకతలున్నచో భక్తులకు దర్శనము కుతూహలముగా నుండును. భగవదనుగ్రహంతో బాటు, ఆలయ దర్శన భాగ్యంతో బాటు, ప్రత్యేకతలను గమనించుటలో కలుగు ఆనందము వర్ణనాతీతము. పలుచోట్ల పలు విధములుగా కనిపించు ప్రత్యేకతలు పరమానందమునకు కారణమగుచున్నవి. పండిత పామర రంజకమైన ప్రత్యేకతలను భక్తుల దృష్టికీ, పర్యాటకుల దృష్టికీ, ఔత్సాహికుల దృష్టికీ తీసుకుని వచ్చుటే ధ్యేయముగా పెట్టుకుని వాటి వివరము ఈయబడినవి. ఒక్కొక్క ప్రసిద్ధ దేవాలయమున ఎన్నో ప్రత్యేకతలు కనిపించుచున్నవి. వాటన్నింటినీ విడమర్చి తెలియజేయు ఉద్దేశ్యముతో ఒకే క్షేత్రమును విడివిడిగా ప్రత్యేకతలనుసరించి వివరించ డమైనది. అవకాశమున్నవారు దర్శించి ఆనందించడాన్కి, లేనివారు తెలుసుకొని(చదువుకొని) ఆనందించడాన్కి వీలుగా. గత నలభై అయిదు సంవత్సరాలుగా గమనిస్తూ వస్తున్న ప్రత్యేకతలు కాలవ్యవధిలో మార్పు చెందవచ్చు. రోజులమార్పులతోబాటుఆలయములలో గూడా ఆచరణలలో మార్పులు గలగవచ్చును సహృదయులైన పాఠకులు గమనింతురు గాక.

ఏ రాష్ట్రమున కారాష్ట్రములో ప్రత్యేకతలు గల ఆలయములతో బాటు, ప్రత్యేకతలు కనిపించని ఇతర ప్రముఖాలయములు కూడా వివరించబడినవి. ప్రతీ ఆలయమునకొక ప్రత్యేకత వుండుననుట నిర్వివాదాంశము. ప్రత్యేకతలు చెప్పనలవి కాని వెన్నో ఆలయములుకూడ కలవు. స్థల పురాణాల ననుసరించి, ఆలయముల వద్దనున్న పూజారులు, ధర్మకర్తలు, ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్లననుసరించి ప్రత్యేకతలు వెల్లడగుచున్నవి. అవ్విధమైన ఆలయములను తెలియజెప్పి మిగతా వాటి ఉనికినీ, స్వామి వార్ల, అమ్మవార్ల వివరములు రాష్ట్రాల వారీగా అందించడమైనది.

# ఆంధ్రప్రదేశ్

## (విశిష్టతలు)

**నీళ్ళలో మునిగిఉన్న వినాయకుడు గల ఏకైకాలయము**

నీళ్ళ వినాయకుడు — కాని పాకం, చిత్తూరు జిల్లా

**వినాయకుని విగ్రహం నిలువబడి ద్వార పాలకునిగ ఉన్న ఆలయం**

వేదనారాయణ స్వామి — నాగలాపురం, చిత్తూర్ జిల్లా

**ఆంధ్ర దేశములో ఒకే ఒక చోట నున్న సరస్వతీ ఆలయం**

జ్ఞాన సరస్వతీ దేవి — బాసర, అదిలాబాద్ జిల్లా

మంజీరానది గోదావరిలో కలిసే సంగమ స్థాన సమీపమున నున్నది దేవాలయం దగ్గరలో ఉన్న బండలపై చెవి మోపితే వేదఘోష వినిపిస్తుంది. కొండరాళ్ళ గుట్టను చదువుల బండ అందురు బాసర ఆలయమునకు పై అంతస్తున కాళీమాత క్రింది అంతస్తున మహాలక్ష్మి వెలసియున్నారు .ఆలయము వెలుపల వ్యాసమహర్షి ఆలయమున్నది.

**"భూషణ వికాస శ్రీధర్మ పురనివాస, దుష్ట సంహార నరసింహ దురిత దూర" అను పాదాంతంతో నృసింహ శతకము వ్రాయుటకు ప్రోత్సహించిన స్వామివారు**

నరసింహ స్వామి (ఉగ్రమూర్తి) — ధర్మపురి, కరీంనగర్ జిల్లా, జగిత్యాల తాలూకా

ఇక్కడ స్వామివారిని శ్రీ లక్ష్మీ నారసింహ స్వామియని పిలుతురు. ఉగ్రరూపమైనందున ఎల్లప్పుడు ముఖానికి చందనం పూసి ఉంటుంది. పాత నరసింహ స్వామివారికి, కొత్త నరసింహ స్వామివారికి రెండు వేర్వేరు ఆలయములున్నవి.

---

### ఒకే పానమట్టముపై రెండు శివలింగములు

కాళేశ్వరుడు
సదాపూర్ణ అమ్మవారు
ముక్తేశ్వరుడు
పార్వతీ దేవి
గోదావరి నదీ తీరం

కాళేశ్వరం
కరీంనగర్ జిల్లా
15 కి.మీ. మహదేవపురం

### తూర్పుగోదావరి జిల్లాలో ఒకే పానమట్టం పై శివలింగము, అమ్మవారు

కొప్పేశ్వర స్వామి
ఉమాదేవి

పలివెల
తూర్పుగోదావరి జిల్లా
2 కి.మీ. కొత్త పేట
రావులపాలెం నుండి బస్సు

దేశం మొత్తములో ప్రత్యేకత. ఉమాసమేత కొప్పేశ్వరస్వామి వారి ఆలయమని పిలుతురు.

### కృష్ణాజిల్లాలో ఒకే పీఠముపై శివలింగము,పార్వతి అమ్మవారు గల ఆలయం

జలధీశ్వర స్వామి
జలధీశ్వరి

ఘంటసాల
కృష్ణాజిల్లా
8 కి.మీ. చల్లపల్లి

లింగానికి అభిషేక జలము లేదు. (జలాభిషేకము లేదు). లింగము వీభూతి పూతతో తెలుపుగా నున్నది. ప్రక్కనే సుబ్రహ్మణ్యేశ్వరుడు గలడు. దగ్గరలో వేణుగోపాల స్వామి వారి ఆలయం.

### కోడిపుంజు ఆకారములో నున్న శివలింగము గల ఆలయము

కుక్కుటేశ్వర స్వామి
రాజ్యలక్ష్మి (రాజరాజేశ్వరి దేవి)

పిఠాపురము
తూర్పుగోదావరి జిల్లా
కాకినాడకు, సామర్లకోటకు
దగ్గరలో

## లింగము పెరుగుతూ ఉంటే మంత్రశక్తితో శీలను బిగించిన ఆలయం

అమరలింగేశ్వరుడు — అమరావతి
(అమరేశ్వరుడు) — గుంటూరు జిల్లా
పంచ ఆరామములలో నొకటి — 40 కి.మీ. గుంటూరు
అమరేశ్వరి — కృష్ణానదీ తీరము

లింగము శిరోభాగమున శీలను బిగించిన గుర్తుగా రక్తపు మరకలు కనిపించును. లింగము చాలా ఎత్తైనది. పై అంతస్తు నుండి శిఖర దర్శనము.

## 1. మతి స్థిమితము లేనివారిని ఆదుకునే అమ్మవారు 2. మూగవారిని పలికించి, కుంటివారిని నడిపించు అమ్మవారు

కామాక్షి తాయి — జొన్నవాడ
మల్లికార్జున స్వామి — నెల్లూరు జిల్లా
పెన్నానదీ తీరము — బుచ్చిరెడ్డిపాలెం తాలూకా
40 కి.మీ. నెల్లూరు.

పెన్నా నదికి ఈవలి ఒడ్డున అమ్మవారు, ఆవలి ఒడ్డున ఉగ్రనరసింహస్వామి వారి ఆలయం గలదు. అమ్మవారు సాలికులజ. తిక్కన ఇచ్చట యజ్ఞం చేసి సోమయాజిగా మారి మహాభారత రచనకు ఉపక్రమించారట.

ప్రతి అమావాస్యకు, పౌర్ణమికి భక్తుల సంఖ్య అధికము. అమ్మవారి పూజతోబాటు, నదికావలనున్న స్వామివారి దర్శనము కూడ చేస్తారు.

## అమ్మవారి వెనుక భాగం అనగా వీపు, వెన్నుపూస, పిరుదులునకు పూజ జరుగు ఆలయం

త్రిపురసుందరీ దేవి — త్రిపురాంతకం
ప్రకాశం జిల్లా
46 కి.మీ. వినుకొండ.

1. అమ్మవారి అసలు విగ్రహం వెనుకభాగం కనిపించకుండా ముఖభాగము ఎదురుగానున్న వేరొక విగ్రహాన్ని ఉంచి, పూజ జరుపుతారు. పూజారి చేతిలో నున్న దీపకాంతితో

అసలు విగ్రహానికి, ముందు ఉంచిన విగ్రహానికి మధ్య సందులో చూచిన అమ్మవారి మూలవిరాట్ కనిపిస్తుంది అమ్మవారి విగ్రహానికి వస్త్రధారణ కనిపించదు

2. శ్రీ శంకరాచార్యుల వారిచే ఈ దేవాలయములో శ్రీచక్రము స్థాపించబడి, పూజలందుకొనుచున్నది. రాతిపై చెక్కబడిన శ్రీ చక్రము. మూలవిరాట్‌కు సుమారు 3 గజముల ముందు భాగమున, ఎత్తు ప్రదేశమున ప్రతిష్ఠించబడి ఉన్నది.
3. అమ్మవారి విగ్రహం వర్షాకాలములో నీటిలో పూర్తిగా మునిగిపోయి ఉంటుంది గర్భగుడి చాల క్రిందుగా ఉంటుంది. మెట్లపైనుండి దిగివెళ్ళవలయును.
4. ఆలయము సరస్సు ఒడ్డున నిర్మించబడి యున్నది. సరస్సు నీరు నిండిన, గర్భగుడిలోనికి నీరు ప్రవేశించును. అప్పుడు పైభాగమున స్థాపించబడిన రాతి శ్రీ చక్రమునకు పూజ.
5. సరస్సునకు ముందు భాగమున 9 కదంబ వృక్షములు కలవు. వీనిని అక్కడివారు 'కనిగిరి' చెట్లు అని పిలుతురు. ఈ వృక్షజాతి యింకెక్కడా కనిపించదు. ఇతరత్రా మొలకెత్తించుటకు ప్రయత్నము చేసినను ఫలించలేదు. దేశం మొత్తం మీద నాటికి, నేటికి ఈ 9 చెట్లు మాత్రమే గలవు. ఈచెట్లకు కాయకాయదు. తీగ రూపములో పూవు మాత్రమే పూయును. ఈ చెట్లను దృష్టిలో నుంచుకునే శ్రీ శంకరాచార్యులవారు 'కదంబవనవాసిని' అని పిలచినారు.
6. అమ్మవారి దేవాలయమునకు ఎదురుగ సరస్సునకు ఈవల ప్రక్కనగల గుట్టపై (చిన్నకొండ) త్రిపుర సుందరేశ్వరుని ఆలయము గలదు.

### ముగ్గురు భార్యలు ప్రక్కనే గల స్వామివారు

| | |
|---|---|
| శ్రీ సూర్యనారాయణ స్వామి | అరసవల్లి |
| 1. ఉష | శ్రీకాకుళం జిల్లా |
| 2. పద్మిని | 2 కి.మీ. శ్రీకాకుళం |
| 3. ఛాయ | |

పింగళ, దండ అనే ద్వారపాలకులు గల ఆలయం. సప్తాశ్వాలు రథాన్ని లాగుతూ ఉండగా అనూరుడు రథాన్ని నడుపుతూండగా స్వామివారు రథారూఢుడైనట్లు ఉన్న విగ్రహం.

సాధారణముగా స్వామివార్లందరకు (శ్రీకృష్ణుడు మినహా) ఇరువురు భార్యలుండుట కద్దు. ఈస్వామి వార్కి ముగ్గురు భార్యలుండుట ప్రత్యేకత

**అతి సౌందర్యవతి అయిన కన్న కూతురినే మోహించి, అత్యాచారము చేయదలిచిన కన్నతండ్రిని ఏవగించి, విరాగిణియై యోగినిగా మారిన రాకుమారి. ఆమె భక్తికి మెచ్చి శివుడు తనలో ఐక్యం చేసుకుని లింగరూపమున వెలసిన క్షేత్రము**

ఉమా మహేశ్వరుడు
రాజు : చంద్రగుప్తుడు
రాకుమార్తె . చంద్రావతి

గుప్త మహేశ్వరము
మహబూబ్‌నగర్ జిల్లా
వరహాబాద్ నుండి శ్రీశైలం నుండి బస్సు

చంద్రగుప్త పట్టణము ఆలయమునకు ప్రక్కన రాజుగారి కోట గలదు. కృష్ణానదికి శ్రీశైల క్షేత్రము ఈవలి ఒడ్డున, చంద్రగుప్త పట్టణము ఆవలి ఒడ్డున గలవు. 20 సంవత్సరములు యుద్ధానికి పోయి తిరిగి వచ్చిన రాజుగారు భార్య ప్రక్కనే ఉన్న చక్కని చుక్కను చూచి మోహపరవశుడాయెను. రాజుగారు యుద్ధమునకు పోవు సమయమున భార్య గర్భవతి. ప్రక్కనున్న చక్కని చుక్క కన్న కుమార్తె అని మొదట్లో తెలియదు. తరువాత తెలిసినను మనస్సు మార్చుకొనలేదు.

ఆ రాజు పూర్వజన్మమున పరమ భక్తుడు. రంభ వశం కాకుండ దేవేంద్రుని యుక్తి వలన రంభ శాపానికి గురైనవాడు ఆశించిన స్త్రీ లభించక అపకీర్తి పాలయ్యేదవని రంభాశాపము. రాణి ఎంత వారించినను రాజు మనస్సుమారలేదు.

కృష్ణానది కీవలవైపు శ్రీశైలము, ఆవల గుప్త మహేశ్వరము.

**కోట కట్టడానికి ఒక బ్రాహ్మణుని బలి యిచ్చి, పాప పరిహారార్థము నిర్మించిన దేవాలయము**

చెన్న కేశవుడు
గద్వాల సంస్థానము
గద్వాల కోట
బ్రాహ్మణుని పేరు · కేశవాచార్యులు

గద్వాల
మహబూబ్ నగర్ జిల్లా

ప్రతిష్ఠించబడిన స్వామివారు చెన్నకేశవుడు. బలి యిచ్చి విగ్రహ ప్రతిష్ఠ జరిగిన తరువాతనే కోట కట్టుట సాధ్యమైనదట. అంతకు ముందు కట్టినకోట కూలిపోతూ వుండెడిదట. బలి అనంతరము కోట కట్టుట సాధ్యమైనది.

---

**ఆంధ్రప్రదేశ్‌లో 30' ల ఎత్తుగల రాతి ధ్వజస్తంభం గల ఆలయం**

చెన్నకేశవ స్వామి ప్రభగిరి పట్నం
నెల్లూరు జిల్లా
16 కి.మీ పొదలకూరు

వయ్యారం, వీరత్వం కలబోసిన భంగిమలో శౌర్యం, శాంతం మూర్తీభవించిన మోముగల స్వామివారు కర్నాటక బేళూరులో వెలసిన చెన్న కేశవ స్వామి మందిరములో వలె.

**"శేషాచలం" అని పిలువబడు ఎత్తైన గుట్టపై వెలసిన దేవాలయం**

శ్రీ వేంకటేశ్వరుడు ద్వారకా తిరుమల
పశ్చిమగోదావరి జిల్లా
17 కి.మీ. భీమడోలు
50 కి.మీ. ఏలూరు

ఈ క్షేత్రమును "చిన్న తిరుపతి" అని పిలుస్తారు ఈ ఆలయ గర్భగుడిలో రెండు శ్రీవేంకటేశ్వర మూర్తులు గలవు.

**దేవాలయ నిర్మాణం జరుగుతూ ఉండగా, పుట్టలో దొరికిన జ్వాలా నరసింహస్వామి విగ్రహాన్ని బయటకు తీయగా, స్వామివారి ఆగ్రహ జ్వాలలకు గ్రామం తగలబడిపోగా, శాంత కేశవ స్వామి వారిని ప్రతిష్ఠించిన ఆలయం**

భావన్నారాయణ స్వామి బాపట్ల
శాంత కేశవ స్వామి గుంటూరు జిల్లా.

**నంద్యాలలో వెలసిన మూడు నందులు**

1.ప్రథమ నంది నంద్యాల
2.బ్రహ్మనంది కర్నూల్ జిల్లా
3.నాగనంది 16 కి.మీ. మహానంది.

---

**వేయి లింగాలు చెక్కిన శివలింగం ఉన్న ఆలయం**

కోటిలింగాల స్వామి — కొలనుపాక
సోమేశ్వరుడు — నల్గొండ జిల్లా
వీర నారాయణుడు — 6 కి మీ. ఆలేరు

ఈ శివలింగాన్ని పూజిస్తే మరుజన్మ ఉండదట  లింగము సుందర మూర్తి.

**ప్రియురాలి చనుభాగమును శివలింగముగా భావించి పూజించిన భక్తుని తృప్తి పరచుటకు చనురూపమున వెలసిన శివుడు, క్షేత్రము**

సాలంకృత రామలింగేశ్వర స్వామి — ఆచంట
(ఆచంటేశ్వరుడు) — ప గో.జిల్లా
6 కి.మీ. కోడేరు

**పల్నాటి వీరుల ఆయుధములను ప్రదర్శిస్తూ వీరుల పండుగ జరుపు వీర ప్రదేశము**

వీరుల గుడి — కారంపూడి
30 కి.మీ. మాచర్ల
గుంటూరు జిల్లా

కార్తీక బహుళ చతుర్దశి నుండి 5 రోజుల పాటు ప్రదర్శన. వీరులందరూ యిచ్చట జేరి వూరేగింపుగా వచ్చి తమ తమ శక్తికొలది వీరత్వాన్ని రకరకాలుగా ప్రదర్శిస్తూ వుంటారు. ప్రక్కన వాయిద్యాలుంటవి.

**ప్రతిరోజూ పూజ అనంతరం నందిని (ఎద్దును) వాహనంగా నివేదన చేసే శివాలయం**

భీమేశ్వర స్వామి — వేములవాడ
రాజరాజేశ్వరి — కరీంనగర్ జిల్లా

ఈ పద్ధతి దేశములో ఇంకెక్కడా కనిపించదు. ఇది ప్రత్యేకత.

---

కావలసిన విద్య 1) ఏ విద్యద్వారా శీలమేర్పడునో 2) మనశ్శాంతి పెంపొందించబడునో, 3) బుద్ధి వికసించునో, 4) స్వశక్తిపై నిలబడగలమో

**బోనాలు ఉత్సవాలు జరుపు సమయములో పాల్గొనే స్త్రీలు, కొజ్జాలు ముందు జరగబోవు భవిష్యత్ సంఘటనలను తెలియజేస్తారని నమ్మే ఆలయం**

శ్రీబద్ది పోచమ్మ — వేములవాడ
గ్రామ దేవత — కరీంనగర్ జిల్లా

వుత్సవాలు అతి వైభవముగా జరుగుతాయి చుట్టు ప్రక్కల పల్లెల నుండి వేలాది భక్తులు వస్తారు. ముఖ్యముగా స్త్రీలు అమ్మవారు పూనినట్లు ప్రవర్తించుట ప్రత్యేకత

**"పెన్న దాటితే గదా, పెరుమాళ్ళ సేవ" అనే నానుడి గల పెరుమాళ్ళ దేవాలయం**

శ్రీ తల్పగిరి రంగనాధ స్వామి — నెల్లూరు
రంగనాయకి — నెల్లూరు జిల్లా
పెన్నానదీ తీరం

స్వామివారు ప్రక్కకు తిరిగి ఉన్న శయనమూర్తి పూర్వకాలం పెన్నానదికి ఆనకట్టలు లేని రోజుల్లో తరచు వరదలు వస్తూ ఉండేవి. రెప్పపాటు కాలంలో వచ్చే వరదలలో నదిని దాటుతున్న యాత్రికులు కొట్టుకొని పోయి చనిపోతూ ఉండేవారు. అందుచేత పైనానుడి ఉండేది. ఇప్పటికి పెన్నానదిని "దొంగపెన్నా" అని పిలుస్తారు. ఆకస్మికముగా నీరు వస్తుందని.

**నవ నారసింహ క్షేత్రములలో ప్రసిద్ధి పొందిన శ్రీ చత్రవటే నారసింహుడు వెలసిన క్షేత్రము**

శ్రీ చత్రవటే నారసింహ — పెనుశిల
కండలేరు నదీతీరం — నెల్లూరు జిల్లా
కణ్వ మహర్షి తపస్సు చేసిన ప్రదేశం — రాపూర్ మండలం
75 కి.మీ నెల్లూరు
30 కి.మీ. రాపూర్

పెనుశిల గ్రామాన్నే పెంచలకోన అని కూడా పిలుస్తారు.

---

నమ్మిక మొదటి ప్రపంచ యుద్ధములో కొందరు సైనికులు బైబిలును జేబులో వుంచుకొని వెళ్ళేవారట బైబిలు జేబులో వుంటే తుపాకి గుళ్ళు తగలవని నమ్మిక

**"వాణి నా రాణి" అని చెప్పుకొని సరస్వతీ దేవి కరుణకు పాత్రుడైన పిల్లలమర్రి పినవీరభద్ర కవి జన్మస్థానమున వెలసిన ఆలయం**

ఎరుకేశ్వర స్వామి
నామేశ్వరుడు
విశాలమైన మర్రిచెట్టు కలదు

పిల్లల మర్రి
నల్గొండ జిల్లా
సూర్యాపేట మండలం
5 కి మీ. సూర్యాపేట

**పిందెలు ఎర్రగా ఉండి, నొక్కితే ఎర్రని ద్రవాన్ని స్రవించి, పండ్లు తెల్లగా ఉండే చింత చెట్టు ఉన్నచోట వెలసిన ఆలయం.**

1.శ్రీ వేంకటేశ్వరుడు
2 ఛాయా సోమేశ్వరుడు
3 పచ్చల సోమేశ్వరుడు

పానుగల్లు
5 కి.మీ. నల్గొండ R S.
నల్గొండ జిల్లా

సాధారణముగా చింతచెట్టు పిందెలు తెల్లగాను, పండిన పండ్లు ఎర్రగాను ఉంటాయి. కానీ ఇక్కడ అట్లాకాదు. ప్రత్యేకతతో కూడిన వృక్షము

**ఆలయపూజారులు వేశ్యాలోలురై పూలదండలు తొలుత వేశ్యలకు వేసి, తరువాత స్వామివార్లకు అలంకరించిన దేవాలయములు**

1,ఉమాసమేత కొప్పేశ్వర స్వామి
ఉమాదేవి
స్వామి వారి లింగమునకు తల
వెంట్రుకలతో కొప్పు కలదు.

1, పలివెల
తూర్పు గోదావరి జిల్లా
3 కి.మీ. కొత్తపేట

2.ఆంధ్ర మహావిష్ణువు
రాజ్యలక్ష్మీ దేవి
విగ్రహానికి వెనుక వ్రేలాడుతూ
ఉన్న తలవెంట్రుకలు కలవు.

2. శ్రీకాకుళం
(కృష్ణాజిల్లా)
15 కి.మీ చల్లపల్లి
7 కి.మీ. కొడాలి.

పూలహారలలో తలవెంట్రుక కనిపించినందున రాజుగారలు ప్రశ్నిస్తే స్వామివారి శిరోజముల వెంట్రుక అని అబద్ధమాడిన పూజారులు భక్తితో ప్రార్థించినందున, స్వామివారు కరుణించి, పూజారులను రక్షించుటకుగాను స్వామివార్లు శిరోజములను ధరించిరి. నేటికిని విగ్రహములకు శిరోజములు గలవు.

---

**శ్రీనివాసుడు పద్మావతిని కళ్యాణమాడిన చోటు**

శ్రీ కళ్యాణ వేంకటేశ్వరుడు

నారాయణవనం
శ్రీనివాస మంగాపురం
చిత్తూరు జిల్లా
15 కి మీ తిరుపతి

**సంవత్సరానికి ఒకసారి స్వామివారి నిజరూప దర్శనము గల ఆలయము**

సింహాద్రి అప్పన్న
(నృసింహ స్వామి)

సింహాచలం
16 కి మీ. విశాఖపట్నం
విశాఖపట్నం జిల్లా

స్వామివారిని వరాహ లక్ష్మీ నారసింహస్వామిగా పిలుతురు సంవత్సరమంతా మంచి గంధం పూతతో విగ్రహం పసుపు పచ్చని లింగాకారముగా కనిపించును. అసలు విగ్రహం కనిపించదు. లింగాకారముగా నున్న స్వామివారి ముందు భాగాన నామాలు దిద్ది ఉంటవి. చైత్రశుద్ధ ఏకాదశి నాడు కళ్యాణోత్సవము. వైశాఖ శుద్ధ తదియనాడు గంధము వలచే ఉత్సవము, నిజరూప దర్శనము. ప్రహ్లాదుని కోరిక మేరకు స్వామివారు ఇచ్చట వెలసిరట. నిజరూప దర్శనమునకు వేలాది భక్తులు వస్తారు.

**"పొంగళ్ళు" ప్రసాదముగా పెట్టి పూజింపబడే దేవత**

చెంగాలమ్మ
కాలింగి నదీ తీరం

సూళ్ళూరు పేట
నెల్లూరు జిల్లా
ఆంధ్రా - తమిళనాడు బోర్డర్
జాతీయ రహదారిపై

పసిపిల్లల పాలిట కన్నతల్లిగా, కల్పవల్లిగా అమ్మవారిని ఆరాధిస్తారు పొంగళ్ళు పెట్టి పూజిస్తారు శుక్రవారము, ఆదివారము పూజలెక్కువ. జాతీయ రహదారిపై నున్నందున వాహనముల నాపి నమస్కరింతురు. వివాహానంతరము నూతన వధూవరులను తీసుకుని వచ్చి పూజలు చేయిస్తారు.

## మార్కండేయ, కోటిలింగేశ్వర స్వామి వార్లకు ఆలయములున్న క్షేత్రము

1. మార్కండేశ్వరుడు — రాజమండ్రి
2. కోటి లింగేశ్వరుడు — తూర్పుగోదావరి జిల్లా
గోదావరి నదీ తీరము

12 సం॥కు ఒకసారి గోదావరి నదికి పుష్కరములు వచ్చును స్నానము బహు పుణ్య ప్రదము.

## రండా పుత్రుడు స్వామివారి నారాధించి వాక్‌శుద్ధి గలవాడయ్యెను

భీమేశ్వర స్వామి — ద్రాక్షారామం
(పంచ ఆరామములలో నొకటి) — తూర్పుగోదావరి జిల్లా
మాణిక్యాంబ — 32 కి.మీ. కాకినాడ
అష్టాదశ పీఠములలో నొకటి

స్వామి వారి నారాధించి వేములవాడ "భీమకవి" వాక్ శుద్ధి గలవాడయ్యెను. భర్త మరణానంతరము తనను పోషించు వారలు లేరని తల్లి భీమేశ్వర స్వామిని ప్రార్థించినందున కల్గిన కుమారుడు. స్వామివారి పేరు పెట్టుకొనెను. భర్త మరణించిన చాల కాలము తరువాత కుమారుడు పుట్టుటచే కులము నుండి వెలివేయబడిరి. శుభకార్యములకు పిలువక అవమానించగా, ఆగ్రహావేశుడైన బాలుడు "అన్నమంతా సున్నము, అప్పాలన్నీ కప్పలుగా మారాలి" అన్న వెంటనే భోజనమునకు కూర్చున్నవారి ముంగిలి గల ఆకులందట్లే జరిగెను.

## పంచ నారసింహ క్షేత్రము

శ్రీ లక్ష్మి నారసింహస్వామి
కొండగుహలో వెలసిన
స్వామివారు

యాదగిరి గుట్ట
7 కి.మీ. వంగపల్లి R.S.
నల్గొండ జిల్లా
భువనగిరి స్టేషను నుండి దిగి
వెళ్ళవచ్చును

స్వామివారు పంచ నారసింహుడుగా పేరు.

1. జ్వాలా నారసింహ
2. యోగానంద
3. గండభేరుండ
4. ఉగ్ర లక్ష్మీనారసింహ
5. ప్రహ్లాద వరద నారసింహ.

ఇచ్చట నున్న ఇతర దేవుళ్ళు : శ్రీలక్ష్మి, శ్రీ ఆండాళ్, శ్రీ హనుమాన్, ప్రహ్లాదుడు.

**"కీర పండరి" అని పిలువబడు దేవాలయము**

పాండురంగడు — చిలకలపూడి
రుక్మిణీ దేవి — కృష్ణా జిల్లా
బందరు దగ్గర

ఇక్కడ నున్న పాండురంగ స్వామివారిని అందరూ ఆలింగనము చేసుకొనవచ్చును. మహారాష్ట్రలోని పండరీ పురములోని పాండురంగని వలె విగ్రహం.

**వశిష్ట గోదావరి సముద్రములో కలియు చోట వెలసిన దేవాలయము**

శ్రీ లక్ష్మి నారసింహ స్వామి — అంతర్వేది
రాజ్యలక్ష్మి — 9 కి.మీ నరసాపురం
పశ్చిమగోదావరి జిల్లా

సాగర సంగమము గోదావరిపై లాంచి ప్రయాణము. అన్నా చెల్లెలు గట్టు. ఇచ్చట గోదావరి నీరు, సముద్రపు నీరు వేరు వేరు రంగులలో చూడవచ్చును (Brown & Blue). భీష్మ ఏకాదశి నుండి పూర్ణిమ వరకు ఉత్సవములు స్వామివారు పశ్చిమాభిముఖులు గోదావరిలో స్నానము చేసిన నీరులోనికి లాగుచుండును, కాళ్ళ క్రింద యిసుక దిగిపోతూ వుండును. సముద్రములో స్నానము చేసిన బయటకు త్రోసివేయబడును. ఈ రెండు అనుభవాలు భక్తుల నాకర్షించును.

**కాలజ్ఞాన రచయిత శ్రీ పోతులూరి వీరబ్రహ్మేంద్ర స్వామివారి**
**జీవ సమాధి ఉన్న క్షేత్రము**

శ్రీ పోతులూరి వీరబ్రహ్మేంద్రస్వామి — కంది మల్లయపల్లె
(కాలజ్ఞాన కర్త) — కడప జిల్లా

భగవంతుని యందును, భక్తుల యందును నమ్మకము లేని హిందువులకు, మహమ్మదీయులకు వారు పెట్టు పరీక్షలయందు నెగ్గి భవిష్యత్తును బోధించిన మహాజ్ఞాని.

బద్వేలు మీదుగా పోరు మామిళ్ళ గ్రామానికి వెళ్ళి అచ్చటకు దగ్గరలో వున్న మఠాన్ని దర్శించాలి.

కాలజ్ఞానమునందు రచించబడిన వన్నియు జరుగుచున్నట్లు అనుభవ పూర్వకముగా నమ్ముచున్నారు

---

యోగ్యులు ప్రాపంచిక తత్వ విషయములలో నిద్రపోతారు
భోగులు యిందుకు విరుద్ధముగా ప్రవర్తిస్తారు

## "సూర్య పూజ" జరిగే వైష్ణవాలయం

వేద నారాయణ స్వామి
వేద నారాయణి

నాగలాపురం
30 కి మీ నారాయణవనం
తిరుపతి నుండి నారాయణవనం
35 కి మీ. చిత్తూరు జిల్లా

సూర్య కిరణాలు స్వామివారి పాదాలపై మార్చి నెలలో పడతాయి. అప్పుడు సూర్య పూజ అని పిలువబడు పెద్ద ఉత్సవం జరుగుతుంది

## పిల్లల కోసం పూజింపబడు అతి పురాతన చెట్టు

పిల్లలమర్రి
(అతి పురాతన మర్రిచెట్టు)

పిల్లలమర్రి
మహబూబ్ నగర్ జిల్లా

సంతానార్థులు ఈ చెట్టుకు పూజ చేస్తే పిల్లలు పుడతారని నమ్మిక । అందుకే ఈ చెట్టు పేరు పిల్లల మర్రి. స్త్రీలకు, పిల్లలకు ఆకర్షణకు ఈచెట్టు ప్రక్కన లేళ్ళ పార్కు నిర్మించిరి.

## చంద్రుని యొక్క షోడశ కళలు లింగము మీద దర్శించవచ్చును

సోమేశ్వరుడు
చంద్ర ప్రతిష్ట
పంచారామములలో నొకటి

గునిపూడి
భీమవరం
పశ్చిమగోదావరి జిల్లా

అమావాస్యనాడు లింగము నల్లగను, పూర్ణిమకు తెల్లగను - దినదినము నల్లని రంగు తెల్లగను, తెల్లని రంగు నల్లగను అమావాస్య పూర్ణిమల మధ్య రంగులు మారు స్ఫటిక లింగము. పూజలకు ముందు అలంకరణ జరుగుటచే నిజలింగదర్శనము భక్తులకు అవకాశములేదు.

## నిత్యము శవధూపముతో పూజింపబడు స్వామివారు

కేదారేశ్వర స్వామి
గోదావరి నదీ తీరము

సిద్ధాంతం
పశ్చిమగోదావరి జిల్లా
12 కి.మీ. పెనుగొండ
15 కి.మీ. రావులపాలెం

ఆలయం ప్రక్కన స్మశానము కలదు. ఇటువంటి ప్రత్యేకాచారము యింకెచ్చటా కనిపించదు

---

ఇప్పుడు చాలమంచిరోజులు అవతారము లేని రోజులు బుద్ధావతారముఅయిపోయినది కలికావతారము యింకా రాలేదు అంటే అధర్మము అతిగా ప్రబలలేదు 'ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే'

## "పాదగయ" అని పిలువబడే క్షేత్రము

కుక్కుటేశ్వర స్వామి — పిఠాపురం
రాజరాజేశ్వరీ దేవి — తూర్పుగోదావరి జిల్లా
(రాజ్యలక్ష్మి) — కాకినాడకు - సామర్లకోటకు మధ్యలో

ఆలయ ప్రాంగణములో విష్ణుపాదమున్నది అందుచేత "పాదగయ" అని పిలుతురు గయాసురుడనే రాక్షసుడు బీహారు రాష్ట్రములోని గయలో శిరస్సు, ఇచ్చట పాదములు పెట్టుకొని నిద్రించేవాడట అందుచేత కూడా "పాదగయ" అని పేరు వచ్చినది

## ఎన్నిసార్లు పెట్టినా కుంకుమ బొట్టు అంటని అమ్మవారు

ఆదిలక్ష్మి — పెంచలకోన
కండలేరు నదీతీరము — నెల్లూరు జిల్లా
రాపూరు తాలుకా
30 కి.మీ రాపూరు
75 కి.మీ నెల్లూరు

పెంచలయ్య అనే నృసింహ స్వామికి ప్రతిరోజూ పూజలేదు శనివారము నాడు మాత్రమే పూజ. చెంచీతను పెండ్లాడినందుకు లచ్చికి కోపము వచ్చి, బొట్టు చెరుపుకుని మూలకూర్చుంది. కుంకుమ అతుకదు స్వామివారికి ప్రతిరోజు పూజ లేకుండా, వారానికి ఒక్కరోజు మాత్రమే పూజ అని శపించినది

## నల్లని రాతితో ఊయల మండపం ఉన్న దేవాలయం

కొమరేశ్వరుడు — సామర్లకోట
పంచ ఆరామములలో నొకటి — తూర్పుగోదావరి జిల్లా
13 కి మీ కాకినాడ

ఈ ఆలయము సామర్లకోట రైల్వేస్టేషన్‌కు ఎదురుగా ఉన్నది. ఇచ్చటనున్న మండపాన్ని ఊయల మండపం అని పిలుస్తారు. ఇచ్చట నున్న రాతితో నిర్మించబడిన ఊయలను చిన్న పిల్లలు సైతము కదిపి ఊపవచ్చును

---

పాలు, పంచదార ఎదురుగా వుంటే చక్కగా సేవించక, పాలు ఎట్లా ఏర్పడుతాయి ? పంచదార ఎట్లా తయారు చేయబడుతుంది ? అని పరిశోధన మొదలుపెట్టిన ఆకలి తీరదు

**తక్షకుడు పరీక్షిత్తు మహారాజును కాటువేసి చంపిన స్థలము, వెలసిన ఆలయము**

భావనారాయణ స్వామి

సర్పవరం
తూర్పుగోదావరి జిల్లా
5 కి మీ కాకినాడ

సర్పం కాటేసిన ప్రదేశం కనుక సర్పవరం అని పేరు వచ్చినది. కవి సార్వభౌముడు శ్రీనాధుడు వర్ణించిన దేవాలయము. చాల పెద్ద గోపురము, సుందర విగ్రహము గల ఆలయం

**చంద్రవంక నదీతీరాన ఉన్న ప్రసిద్ధ దేవాలయం**

చెన్న కేశవ స్వామి

మాచర్ల
25 కి.మీ. గురజాల

శ్రీనాధుడు పల్నాటి వీర చరిత్రను ఈ ఆలయములోనే ప్రారంభించెను. ఇచ్చట వరకు రైలుపై వచ్చి ఇక్కడి నుండి శ్రీ శైలానికి బస్సుపైన వెళ్ళవచ్చును.

**ఆది శంకరాచార్యుల వారు కడప జిల్లాలో స్థాపించిన పీఠము, వెలసిన ఆలయములు**

పుష్పగిర పీఠం (పుష్పగిరి కొండపై)
పినాకినీ నదీ తీరం

పుష్పగిరి
కడప జిల్లా, 15 కి.మీ.కడప

ఇచ్చటనున్న దేవుళ్ళు : పుష్పాచలేశ్వరుడు, ఉమా మహేశ్వరుడు, త్రికూటేశ్వరుడు, సంతాన మల్లేశ్వరుడు, సాక్షి మల్లికార్జునుడు, శ్రీ యోగాంజనేయ మూర్తి, కాశీ విశ్వనాధుడు, వైద్యనాధ స్వామి, భీమేశ్వరుడు, రాఘవేశ్వరుడు, చంద్రమౌళీశ్వరుడు, (శ్రీ శంకరాచార్యుల వారు కైలాసము నుండి తెచ్చిన లింగము), చెన్న కేశవ స్వామి, ప్రయాగ మాధవుడు. అమ్మవారు : శ్రీ కామాక్షీదేవి, అమ్మవారు ముందు శ్రీ చక్రం శిలమీద చెక్కబడి ఉన్నది. ఇచ్చట రుద్రపాదం. విష్ణు పాదాలు ఉన్నవి. ఈ రెండింటికి దూరం 1 1/2 కి.మీ. పంచనదుల సంగమ స్థానం 1 పాపాఘ్ని, 2. కుముద్వతి, 3. వల్కల, 4. మాండలి, 5 పినాకిని.

---

**బమ్మెర పోతనామాత్యుడు భాగవతాన్ని తెనిగించి అంకితమిచ్చిన దేవాలయం**

శ్రీ కోదండ రామస్వామి ఒంటిమిట్ట
( సీతాలక్ష్మణ ఆంజనేయ సమేత) కడప జిల్లా

ఇచ్చట పోతనా మాత్యుని ఇల్లు గలదు చెరువు గట్టుమీద కూర్చుని భాగవతాన్ని తెనిగించిన చోటు. చెరువునకు గల మెట్లను రామ మెట్లు, లక్ష్మణ మెట్లు అని పిలుస్తారు. ఈ నాటికీ చెరువు గట్టు వాతావరణము చాలా ప్రశాంతముగా నున్నది ఆలయము, చెరువు గట్టు, పోతనామాత్యుని యిల్లు పవిత్రతను వెదజల్లుచున్నాయి.

**ఒక స్వామివారి జాతక చక్రం చూచి ఒక పండితుడు స్వామివారి ఆయుర్దాయం 70 సంవత్సరములనియు, రెండవ పండితుడు 300 సంవత్సరములనియు, మూడవ పండితుడు 700 సంవత్సరములనియు చెప్పినారు**

శ్రీ రాఘవేంద్ర స్వామి మంత్రాలయం
(జీవ సమాధి) ఆదోని నుండి ఎమ్మిగనూరు
ద్వైత వేదాంత పీఠాధిపతి మీదుగా బస్సు
తుంగభద్రా నదీ తీరం ఆంధ్రా, కర్నాటక బోర్డర్

స్వామివారు భక్త ప్రహ్లాద, పంచముఖ ఆంజనేయ స్వామివార్ల అవతారముగా భావిస్తారు.

ముగ్గురు జ్యోతిష పండితులు చెప్పిన ఫలితాలకు స్వామివారు ఇచ్చిన వివరణ :

1. జీవన ఆయుర్దాయము 70 సంవత్సరములు.
2. స్వామివారి రచనలకు, బోధనలకు ఆయుర్దాయం 300 సంవత్సరములు.
3. స్వామివారు జీవ సమాధిలో ఉండి భక్తుల అభీష్టము నెరవేర్చు కాలం 700 సంవత్సరములు.

---

## పావురం ఆకారములో నున్న శివలింగం

కపోతేశ్వరుడు

కడలి గ్రామం
తూర్పుగోదావరి జిల్లా,6 కి మీ రాజోలు

ఒక బోయవాడు ఆహారం దొరకక ఆకలిచే అలమటించి పోతూ ఉండడాన్ని గమనించి ఒక పావురం బోయవానిపై జాలిగొని ప్రక్కనున్న శ్మశానములో నుండి నిప్పు ఉన్న పుల్లలు తెచ్చి క్రింద నిప్పురాజేసి, చెట్టు పై నుండి గూటితో సహా ఆ మంటలో పడి బోయవానికి ఆహారమయ్యెను ఇంకనూ బోయవాని ఆకలి తీరనందున దాని భర్తకూడా ఆ మంటలో పడి బోయవాని ఆకలిని తీర్చెను కపోతముల అతిధి సేవకు చలించిన బోయవాడు కూడా ప్రాణములు విడచెను. శివుడు ప్రత్యక్షమై వారికి మోక్షమిచ్చి పావురం ఆకారములో వెలసెను. దేవాలయమునకు ప్రక్కన ఇప్పటికినీ శ్మశాన మున్నది. జీవకారుణ్య క్షేత్రముగా భావింతురు

## శ్రీరాముడు జటాయువు వలన సీత జాడ తెలుసుకున్న దేవాలయము

శ్రీరాముడు
గుంటి ఆంజనేయస్వామి

వినుకొండ
గుంటూరు జిల్లా
45 కి.మీ. నర్సరావు పేట

శ్రీరాముడు జటాయువు వలన సీత జాడ "విన్న కొండ" కాబట్టి -వినుకొండ అయినది.

## "సాంబ శివాలయం" అని పిలువబడే దేవాలయం

మల్లికార్జున స్వామి
భ్రమరాంబ లేక కాత్యాయని

పెదకాకాని
గుంటూరు జిల్లా
5 కి.మీ. గుంటూరు

శివరాత్రికి స్వామివారికి బ్రహ్మోత్సవములు, దసరాకి అమ్మవారికి శ్రీ దేవీ నవరాత్రోత్సవములు జరుగును. ప్రతీ శుక్రవారము అమ్మవారికి పల్లకీ సేవ జరుగుతుంది "ప్రభల" ఊరేగింపు ఈ దేవాలయానికి ప్రత్యేకత, ఈ ఆలయములో వివాహాది శుభకార్యములెన్నో జరుగుతుంటవి ఆలయములలో నున్న నవగ్రహాలకు శని త్రయోదశినాడుప్రత్యేక పూజలు, తైలాభిషేకాలు జరుగుతవి.

---

**మండపం పై కప్పుభాగములో నవగ్రహములు చెక్కి ఉన్న క్షేత్రము**

వెయ్యి స్తంభాల మండపం

హనుమ కొండ
వరంగల్ జిల్లా
3 కి.మీ వరంగల్

మండపానికి ఎదురుగా నున్న గుడిలో సూర్య, విష్ణు, మహేశ్వరులకు గర్భాలయము లున్నవి ఇప్పుడు సూర్య, విష్ణు విగ్రహములు లేవు శిధిల శివలింగము మాత్రమున్నది. మహ్మదీయులతో జరిగిన యుద్ధములలో విగ్రహములు పగుల గొట్టబడినవట. ఆలయము అపురూప శిల్పాలకు ఆలవాలము.

**"ప్రశాంత నిలయం" లో పూజలందు కొనుచున్న విగ్రహం**

శ్రీ షిర్డి సాయిబాబా
(శ్రీ సత్యసాయి బాబా వారు పూజించు విగ్రహం)

పుట్టపర్తి
అనంతపురం జిల్లా
30 కి.మీ ధర్మవరం

శ్రీ సత్యసాయి బాబా వారి జన్మదినం నవంబర్ 23 చాలా పెద్ద వేడుకలు జరుగుతాయి. విద్య, సూపర్ స్పెషాలిటి వైద్యశాల మొదలగు ప్రజోపయోగ భవనములు గల ప్రాంతము. ప్రతిరోజు ప్రశాంత నిలయములో శ్రీ షిర్డిసాయి బాబాకు ప్రార్ధనలు జరుగుతవి.

**శ్రీ శోభనాచల వ్యాఘ్ర లక్ష్మీ నారసింహ క్షేత్రము**

నారసింహ స్వామి

ఆగిరిపల్లి
కృష్ణాజిల్లా

గ్రామానికి చివర, చిన్న ఎత్తైన గుట్టపై గల దేవాలయము. నూజివీడుకు వెళ్ళే బస్సు మార్గములో గలదు. ఇచ్చట పూజలు చేసి, ప్రసాదమునారగించిన కోరికలు సిద్ధించునని నమ్మిక

**తాండ్ర పాపారాయుని పౌరుషానికి ప్రతీక అయిన బొబ్బిలి కోటలో ఉన్న దేవాలయం**

శ్రీ వేణుగోపాల స్వామి

బొబ్బిలి
శ్రీ కాకుళం జిల్లా

స్వామివారు బొబ్బిలి రాజుల ఇలవేల్పు, తాండ్ర పాపయ్య బాకు తళతళ మెరసిన చోటు బొబ్బిలికి వీర బొబ్బిలి యని పేరు వచ్చినది

**అదిలాబాద్ జిల్లాలో నున్న ఒక ఆలయములోని శివలింగము నుండి నీరు నిరంతరము ఊరుతూ ఉంటుంది.**

బుగ్గా రామేశ్వరుడు
రామేశ్వరి

బుగ్గా రామేశ్వరము
అదిలాబాద్ జిల్లా
5 కి మీ. బెల్లం పల్లి

లింగము నుండి నీరు నిరంతరము ఊరుతూ ఉంటుంది. ఇచ్చట నీటి బుగ్గ కలదు. అందుచేతనే స్వామివారి కాపేరు వచ్చినది.

**"కొల్లేరు"లో వేంచేసి యున్న అమ్మవారు**

పెద్దింట్లమ్మ
(శక్తి పీఠము)
జలదుర్గాదేవి
గోకర్ణేశ్వరుడు

కొల్లేరు
కృష్ణాజిల్లా
కైకలూరు నుండి గాని, ఆకివీడు నుండి గాని వెళ్ళవచ్చును.
ఆళ్ళపాడు గ్రామం నుండి 4 కి.మీ. బస్సు.తరువాత రేవుదాటి3 కి.మీ. నడక

అమ్మవారి విగ్రహం పెద్దది. కుడిచేత్తో కత్తి పట్టుకుని, కాలిపై కాలు వేసుకుని కూర్చుని ఉన్న విగ్రహం. మెడలో పుర్రెల మాల. విపరీతమైన బలులతో పూజలు, ఉత్సవములు, ముఖ్యముగా కోళ్ళను, మేకపోతులను బలియిస్తారు. మార్చి నెలలో ఉత్సవము.

---

**కిరీట ధారియైన అమ్మవారి శిరస్సు మాత్రమే పూజలందుకొంటున్న ఆలయం**

హేమలాదేవి
(ఎల్లమ్మ)

ఉండవెల్లి
8 కి.మీ. అలంపురం
మహబూబ్ నగర్ జిల్లా

**ఆంధ్ర ప్రదేశ్‌లో శ్యామలాదేవి గ్రామదేవతగా గల పట్టణము**

శ్యామలాదేవి

కాకినాడ
తూర్పుగోదావరి జిల్లా
13 కి.మీ. సామర్లకోట

**తిరునాళ్ళ సమయములో పులిని వదలి తుపాకితో కాల్చిచంపే ఆచారమున్న దేవాలయం**

నృసింహ స్వామి

కదిరి
అనంతపురం జిల్లా

ఈ క్షేత్రములో తిరునాళ్ళ సమయములో పులిని వదలి రంగనాయుడు వంశంవారు తుపాకితో కాల్చు ఆచారముండెడిది. ఈ ఘనతను యాత్రికులందరు చూచి మెచ్చుకొనెడివారట.

**ఆంధ్ర ప్రదేశ్‌లో సంభోగ భంగిమలను కామకళా శాస్త్ర రీత్యా చెక్కబడిన ఆలయం**

భావన్నారాయణ స్వామి
(విష్ణు దేవాలయం)

సర్పవరం
తూర్పుగోదావరి జిల్లా
5 కి.మీ. కాకినాడ

కాకినాడ నుండి సామర్లకోటకు వెళ్ళు రోడ్డు మార్గము నుండి కొంచెం లోపలికి వెళ్ళవలయును. శృంగార ప్రియుడైన కవిసార్వభౌముడు శ్రీనాధుడు వర్ణించిన ఆలయం.

---

## శ్రీరాముడు మారీచుని సంహరించి ఆ స్థలములో ప్రతిష్ఠించిన ఈశ్వర లింగం

| | |
|---|---|
| కురంగేశ్వరుడు | కోరంగి |
| కురంగి మాత | తూర్పుగోదావరి జిల్లా |
| కురంగ క్షేత్రం | 16 కి.మీ. కాకినాడ |

కురంగి అనగా లేడి. లేడి రూపములో ఉన్న మారీచుడు శ్రీరామునిచే సంహరించబడెను మారీచుని సంహార గాధ కురంగి క్షేత్ర మాహాత్మ్యం అనే గ్రంధములో నున్నది మా రీచుని ప్రార్ధన మేరకు శ్రీరాముడు లింగ ప్రతిష్ఠ చేసి అసురునికి మోక్షమిచ్చెను.

## "వేదగిరి" లేక "రామపాద క్షేత్రం" అని పిలువబడే క్షేత్రం

| | |
|---|---|
| జనార్ధన స్వామి | ధవళేశ్వరం |
| సంతాన గోపాల స్వామి | తూర్పుగోదావరి జిల్లా |
| అగస్త్యేశ్వరుడు | 5 కి.మీ. రాజమండ్రి |

అగస్త్య మహర్షిచే ప్రతిష్ఠించబడిన లింగము అగస్త్యేశ్వరుడు. నారద గుహ కలదు.

## దక్షవధానంతరం వీరభద్రుడు శాంతి నొందిన ప్రదేశము, వెలసిన ఆలయము

| | |
|---|---|
| వీరభద్రుడు | పట్టి సీమ |
| భద్రకాళి | గోదావరి నది మధ్యన |
| | పోలవరానికి దగ్గరలో |

అగస్త్య మహర్షి ఉగ్రుడైన వీరభద్రుని ఆలింగనముతో అనునయించి శాంతింపజేసిన పుణ్య స్థలము. స్వామివారు లింగాకృతుడైన వీరభద్రేశ్వరుడు. క్షేత్ర పాలకుడు భావన్నారాయణ స్వామి. ఇది శాక్తికేయము, శైవము, వైష్ణవ సమ్మేళనము కలిగిన ఆలయము.

గోదావరినది ఎంత వుధృతముగా వచ్చినను నదీ గర్భమున వున్న ఆలయము చెక్కు చెదరదు.

## వైష్ణవ భక్తుడు శ్రీరామానుజా చార్యుల వారు "ఎంబెరు మన్నారు" గా ప్రసిద్ధి నొంది వెలసిన ఆలయం

| | |
|---|---|
| విష్ణుమూర్తి | నర్సాపురం |
| లక్ష్మీదేవి | పశ్చిమగోదావరి జిల్లా |
| ఎంబెరు మన్నారు (భక్తుడు) | |

గర్భగుడి నిండా ఎర్రరంగు గల గ్రానైటు రాయి గల పెద్దదైన పురాతన దేవాలయము.

---

మనం చేసే మంచికార్యాలు, చెడుపనులు నీడలవలె నిరంతరం మనలను వెంబడిస్తాయి.

**మూసీనది పుట్టిన చోట వెలసిన ఆలయం**

అనంత స్వామి | అనంతగిరి కొండల్లో
అనంతలక్ష్మి | రంగారెడ్డి జిల్లా
వికారాబాద్ మండలం
6 కి మీ వికారాబాద్

**జనమేజయుడు సర్పయాగం జరిపిన ప్రదేశము, వెలసిన అమ్మవారు**

వనదుర్గా భవాని | ఏడు పాయలు
మెధక్ జిల్లా
సంగారెడ్డి దగ్గర

మంజీరానది, పసుపులేరు, ఇంకా ఐదు చిన్న ఉపనదులు కలిసే ప్రదేశము కనుక ఏడు పాయలు అని పేరు వచ్చినది. సర్పాల భస్మంపై ఏడు పాయలు ప్రవహించి నందున సర్పాలు పుణ్యలోకానికి పోయినవట. ఈ ప్రాంతములో ఎక్కడ త్రవ్వినా భస్మం వస్తుంది

**ఎనిమిది చేతులతో వివిధాస్త్ర శస్త్రములతో కనిపించే వీరభద్రుడు గల ఆలయం**

వీరభద్రుడు | కొరివి గ్రామం
భద్రకాళి | వరంగల్ జిల్లా
మహబూబా బాద్‌కు దగ్గర

మానసిక రోగులకు, మంత్ర సిద్ధులకు ప్రార్ధనా మందిరము మహిమ గల క్షేత్రముగా ప్రసిద్ధి.

**శిరస్సున ఎదురుగా జటతో గూడిన ముడిగల లింగము**

క్షీరారామలింగేశ్వరుడు | పాలకొల్లు
పార్వతీ దేవి | 21 కి.మీ. భీమవరం
పశ్చిమ గోదావరి జిల్లా

పంచారామములలో నొకటి లింగము తెల్లగా నొక్కులతో కూడి యుండును. అభిషేక సమయాన జటముడి దర్శనీయము.

---

**క్షణములో ముక్తిని ప్రసాదించిన స్వామివారు, వెలసిన ఆలయము**

క్షణ ముక్తేశ్వరుడు
గోదావరి నదీతీరం

ముక్తేశ్వరం
తూర్పుగోదావరి జిల్లా
12 కి మీ అమలా పురం

మనస్ఫూర్తిగా ప్రార్థించిన ఒక్క క్షణములో ముక్తిని ప్రసాదించు స్వామివారు, "జటాధారిణి యైన శ్రీమణి" అను స్త్రీ భక్తురాలికి శ్రీరామ దర్శనముతో బాటు క్షణములో ముక్తిని ప్రసాదించిన స్వామివారు.

**ఆంధ్ర ప్రదేశ్‌లో "హయగ్రీవ" మూర్తి ఉన్న ఆలయము**

వేద నారాయణ స్వామి

నాగలాపురము
చిత్తూరు జిల్లా

ఆలయములోని 3వ ప్రాకారములో "హయగ్రీవ" మూర్తి గలదు.

**నాగరాజ రూపమున వెలసి భక్తుల కోర్కెలు తీర్చు శ్రీ వేంకటేశ్వర స్వామి**

శ్రీ వేంకటేశ్వర స్వామి
పద్మావతీ దేవి

తెనాలి
వైకుంఠపురం
గుంటూరు జిల్లా

చాలాపెద్ద ఆలయ ప్రాంగణము. వివాహాది శుభకార్యములు ఆలయములోని కల్యాణ మండపమందు జరుగును. ఆలయమునకు వెనుక భాగమున పెద్ద పుట్టవుండి పూజలందుకొను చున్నది.

**ఆంధ్ర దేశమున బ్రహ్మకు ఆలయము**

చతుర్ముఖ బ్రహ్మ
(అరుదైన ఆలయము)

చేబ్రోలు
గుంటూరు జిల్లా
15 కి.మీ. గుంటూరు

ఊరులోగల సరస్సు మధ్యలోని ఆలయము. ఆంజనేయ, సహస్ర లింగేశ్వర, వేణుగోపాల స్వామి ఆలయములు గలవు.

**అమావాస్య ఘడియల్లో పూజించిన మంచి పలితాలనిచ్చే అమ్మవారు**

మహిషాసుర మర్ధిని

నగరి
చిత్తూరు జిల్లా
24 కి.మీ. తిరుపతి

అమావాస్య, పర్వదినాల్లో భక్తులు అధికముగా వస్తారు.

**ఆలయం ముందు కోనేరులోని నీరు ఉదయం ఎరుపు, మధ్యాహ్నం ఆకుపచ్చ, సాయంకాలం పసుపుపచ్చ వర్ణముగా కనిపిస్తుంది**

దొడ్డేశ్వర స్వామి
ఎత్తైన లింగము

హేమావతి
మడకశిర మండలం
అనంతపురం జిల్లా
హిందూపురం నుండి
మడకశిర బస్సురూటులో

సూర్యకాంతితో, కోనేరులోని నీరు రంగు రంగులుగా కన్పిస్తూ భక్తులకానందము చేకూర్చు చున్నది.

**16 రోజులు దీక్షతో ప్రార్థించి, పుష్కరిణిలో స్నానమాచరించి పూజించిన స్వప్నములో సాక్షాత్కరించు స్వామివారు**

శ్రీ లక్ష్మి నృసింహస్వామి
లక్ష్మీదేవి

యాదగిరి గుట్ట
నల్గొండ జిల్లా
7 కి.మీ. రాయగిరి

**విగ్రహమునకు బొడ్డు వరకు పైభాగము మాత్రమే దర్శనము లభించు దేవాలయము**

శ్రీ వేంకటేశ్వర స్వామి

ద్వారకా తిరుమల
పశ్చిమ గోదావరి జిల్లా
17 కి.మీ. భీమడోలు
50కి.మీ. ఏలూరు

స్వామివారి పాదములు పుట్టలో నున్నవట.

---

అసురులు శివుని, బ్రహ్మను ప్రార్థించి, వరాలు పొంది విర్రవీగి, గర్వాంధులై
ధర్మహాని చేస్తారు విష్ణుమూర్తి వారిని వధిస్తాడు

**రేణుక లేక కుంకుళ్ళమ్మ గ్రామదేవతగా గల పట్టణము**

రేణుక
లేక
కుంకుళ్ళమ్మ
(గ్రామదేవత) ద్వారకా తిరుమల

**"సుదర్శన క్షేత్రము" అని పిలువబడే దేవాలయము**

శ్రీ వేంకటేశ్వరుడు
(రెండు విగ్రహములు) ద్వారకా తిరుమల

**దక్షిణాభిముఖముగా నున్న చిన తిరుపతి(ద్వారకా తిరుమల)**
**దర్శనము వలన కలుగు ప్రత్యేకలాభము**

శ్రీ వేంకటేశ్వరుడు ద్వారకా తిరుమల

గోపురము, సింహ ద్వారము, స్వామివారు దక్షిణాభిముఖం అందుచేత భక్తులు ధ్యానం చేసేటప్పుడు ఉత్తరాభిముఖులౌతారు అనగా ధ్యాన సమయములో భక్తులు అయస్కాంత శక్తి ప్రభావానికి లోనై రక్త ప్రసరణ సక్రమముగా జరిగి నొప్పులు, బాధలు నివారణమౌతాయి. ఇది (అయస్కాంత) ప్రకృతి చికిత్స.

**సంవత్సరమునకు రెండు వివాహములు జరుగు కేశవస్వామి**

శ్రీ వేంకటేశ్వరుడు ద్వారకా తిరుమల

ఈ క్షేత్రమున రెండు మూర్తులున్నవి. ఆశ్వయుజ శుద్ధ దశమి నుండి 9 రోజులు ఒక విగ్రహమునకు, వైశాఖ శుద్ధ నవమి నుండి రెండవ విగ్రహమునకు కల్యాణోత్సవములు జరుగును.

---

**సంచల నాత్మకమగు "స్తంభము పాట" మ్రొక్కుబడి గల దేవాలయము**

శ్రీ వేంకటేశ్వరుడు ద్వారకా తిరుమల
(చిన్న తిరుపతి)

స్వామివారి పూజల వలన బిడ్డ పుట్టినను, అనారోగ్య వంతులు స్వామివారి అనుగ్రహమున ఆరోగ్యవంతులైననూ అట్టి వారిని తగు అలంకారములతో ఆలయములోని ధ్వజ స్తంభమునకు కట్టివైచి, విడిపించుటకు గాను వేలము పాట పెట్టెదరు. ఆ పాటలో నెగ్గిన వ్యక్తి పైకం చెల్లించి (దేవ స్థానమునకు) వ్యక్తిని విడిపించి తీసుకుని పోయెదరు ఈ తంతు బలితో సమానము ఇప్పుడు వేలంపాట తగ్గిపోయినది కానీ దేవస్థానమునకు రుసుము చెల్లించి వ్యక్తిని ధ్వజ స్తంభమునకు కట్టు ఆచారము గలదు

**అభిషేకాదులు లేని స్వామివారు**

శ్రీ వేంకటేశ్వరుడు ద్వారకా తిరుమల

పాదములు పుట్టలో నుండుటచే అభిషేకము లేదు. నీరు పడినచో పుట్టనుండి పురుగులు వస్తాయి.

**విగ్రహానికి పాదములు కనిపించని స్వామివారు**

శ్రీ వేంకటేశ్వరుడు ద్వారకా తిరుమల

ఈ ఆలయమున రెండు శ్రీ వేంకటేశ్వర మూర్తులున్నవి. ఒక స్వామి వారి పాదములు పాతాళమున బలి చక్రవర్తి శిరస్సుపై గలవనియు, మరొక స్వామివారి పాదములు పుట్టలోనుండి పాతాళమునకు పోయినవందురు.

**దేవాలయము,గోపుర సింహద్వారము, స్వామివారు**
**దక్షిణాభిముఖముగా నున్న క్షేత్రము**

శ్రీ వేంకటేశ్వరుడు ద్వారకా తిరుమల

ఎంతటి అమాయకులైనా, పామరుడైనా మూల విరాట్‌ను దక్షిణ దిశగా ప్రతిష్ఠించరు. కాన స్వామివారు స్వయంభూమూర్తి.

---

సూర్యభగవానుని నుండి మనము నేర్చుకొనవలసిన గుణాలు 1) అహంకార శూన్యత 2) ఆత్మార్పణ 3) అఖండ కర్తవ్య పరాయణత 4) ఆలస్యమనేది ఎరుగకుండుట

## పెద్ద విగ్రహాలకు ఆలయములున్న క్షేత్రము

ఆంజనేయ స్వామి
గరుత్మంతుడు

పొన్నూరు
గుంటూరు జిల్లా
నిడుబ్రోలు R S

ఈ క్షేత్రమును భావన్నారాయణ క్షేత్రమని పిలుతురు స్వర్ణపురి అనికూడా అంటారు చాలా పెద్ద దేవాలయములు కట్టబడి ఉన్నవి మిగిలిన చోట్ల పెద్ద విగ్రహాలేగాని దేవాలయములు కట్టబడలేదు. ఆలయానికి దగ్గరలో మహర్షులు గోష్టులు జరిపేవారట గోష్టులలో భావన్నారాయణ స్వామి సాక్షిగా వ్యవహరించేవారట అందుచేత స్వామివారిని సాక్షి నారాయణ స్వామి అని పిలుతురు.

## వేశ్యల కుల దేవతగా ప్రసిద్ధి పొందివున్న అమ్మవారు

మాణిక్యాంబ
అష్టాదశ పీఠములలో నొకటి
భీమేశ్వరుడు

ద్రాక్షారామము
తూర్పుగోదావరి జిల్లా
32 కి మీ కాకినాడ

దక్ష వాటిక యందు వెలసిన ఇచ్చటి మాణిక్యాంబ వేశ్యల కులదేవతగా పేరు పొంది వున్నది. ఈ క్షేత్రము పంచారామములలో నొకటి.

ఇచ్చట నున్న నదికి సప్త గోదావరి యని పేరు.

## కళ్యాణోత్సవములు లేని శివాలయము (పార్వతీ దేవి లేదు)

త్రికూటేశ్వరుడు

కోటప్ప కొండ
గుంటూరు జిల్లా
10 కి మీ నరసరావు పేట

దక్ష యజ్ఞ ప్రాంగణమున పార్వతి మరణాంతరము వియోగ బాధలో నుండగా వెలసిన స్వామివారు

## కన్యగా ఉండి మగపిల్ల వానిని కని మరల కన్యగా మారి శివ సాయుజ్యమును పొందిన గొల్లభామ

గొల్లభామ | కోటప్ప కొండ
పాప వినాశన స్వామి | గుంటూరు జిల్లా
శివ లింగం | 10 కి మీ  నరసరావు పేట

గొల్లభామ అను భక్తురాలు పాప వినాశన స్వామివారిని పూజింప సాగెను. ఆమె కన్య అయిననూ, మాయా గర్భము కలిగించినను, శ్రమ ఎక్కువైననూ ప్రతీరోజు పూజమానలేదు చివరకు ఆమె ప్రార్ధనపై స్వామివారు కొండ క్రిందికి దిగుటకు అంగీకరించిరి ఆమె మరల కన్యాత్వమును పొందెను. ముందు గొల్లభామను పూజించి, తరువాత స్వామివారిని పూజింతురు కొండపేరు త్రికూటా చలము. మూడు శిఖరములు గల కొండ. కొండపై నున్న స్వామి త్రికూటేశ్వరుడు. కొండ క్రింద 1. నీల కంఠేశ్వర, 2. ప్రసన్న కోటేశ్వర ఆలయములున్నవి.

## యోగి వేమనకు జ్ఞానోదయము కలిగిన చోటు

యోగి వేమన | గుత్తికొండ బిలము
గుంటూరు జిల్లా
8 కి.మీ. పిడుగురాళ్ళ

1. వేమన శిష్యుడైన అభిరాముడు ఒక యోగీశ్వరుని పూజిస్తూ ఉండేవాడు. జ్ఞానోపదేశము జరుగు రోజున అభిరామునికి వేరే పని ఉండుటచే వెళ్ళుటకు వీలు కలుగలేదు. వేమన వెళ్ళి మహర్షి నుండి జ్ఞానోపదేశము పొందెను.
2 తన కంటి జ్వాలలచే భస్మమగు వరమును పొంది ముచికుందుడు ఈ గుహలో నిద్రించుచుండ శ్రీ కృష్ణుడు కాలనేమి అనే రాక్షసుని ఆగుహలోనికి తీసుకుని పోయి అంతర్హితుడైయ్యేను. ముచికుందుడు కండ్లు తెరువగా కాలనేమి భస్మీ భూతుడయ్యేను.

## ఆంధ్ర ప్రదేశ్‌లో ఒక స్తంభాన్ని తాకితే రెండవ స్తంభము కదులు స్తంభములు

మసీదులోని స్తంభాలు | ఎలగందుల
కరీంనగర్ జిల్లా
10 కి.మీ. కరీంనగర్

ఇక్కడ ఉన్న కోటలో మసీదు గలదు

## నీళ్ళలో వేస్తే తేలే ఇటుకలతో నిర్మించబడిన దేవాలయము

రుద్రేశ్వరుడు — పాలం పేట
రుద్రేశ్వరి — వరంగల్ జిల్లా
60 కి.మీ హన్మకొండ
ములుగు తాలూకా

ఈ ఆలయమునకు రామప్ప దేవాలయమని పేరు రామప్ప చెరువునకు దగ్గరలోనున్న దేవాలయము. మహిషాసుర మర్దిని, బొజ్జ గణపతి, భైరవ మూర్తుల విగ్రహములు గలవు

## "రామప్ప" దేవాలయములో నున్న స్వామివారు, అమ్మవారు

రుద్రేశ్వరుడు — పాలంపేట
మహిషాసుర మర్దిని

## అత్యద్భుత సౌందర్యముతో తొణికిస లాడుతూన్న 12 మదనికలు (నాట్యకత్తెలు) ముఖద్వారం శిఖరాల మీదగల ఆలయం

రామలింగేశ్వరుడు — పాలంపేట
(రామప్ప గుడి)

## మనము ఎటువైపు నుంచి చూచినా అటువైపే మనల్ని చూస్తున్న నల్లరాతి నంది విగ్రహం

రుద్రేశ్వరుడు — పాలంపేట
భద్రకాళి

బొజ్జ గణపతి, భైరవమూర్తి విగ్రహములు కూడ కలవు

## పోశమ్మ గ్రామదేవతగా గల పట్టణము

పోశమ్మ — వరంగల్
(గ్రామ దేవత) — వరంగల్ జిల్లా

---

భర్త ఆదాయ వ్యయములతో భార్య ప్రభావితమైనట్లే భర్తతో
పుణ్యస్థల దర్శనమున భార్య పునీతురాలవుతుంది

## "భద్రకాళి" ఉన్న దేవాలయము

భద్రకాళి | వరంగల్లు

వరంగల్‌కు హనుమకొండకు మధ్య భద్రి అనే చెరువు కలదు. ఆ చెరువు గట్టుపై నున్న కొండపై అమ్మవారి ఆలయము గలదు. అమ్మవారు 8 చేతులతో, 9' ల ఎత్తుగల విగ్రహాము ఖడ్గము, త్రిశూలము, ఢమరుకము, మానవుని శిరస్సు మొదలైన అష్టభూషణములు గల కాళికామూర్తి.

## నీటిలో మునిగి ఉన్న లింగముపై సూర్య కిరణముల ద్వారా స్తంభాకారముగా ఏర్పడిన లింగాకారముగా నున్న ఛాయ

ఛాయా సోమేశ్వరుడు | ప్రానుగల్లు
నల్గొండ జిల్లా
5 కి.మీ. నల్గొండ

లింగం ఎప్పుడూ నడుములోతు నీటిలో మునిగి ఉంటుంది. ఛాయ మాత్రమే దర్శనము. గుమ్మం వద్ద నిల్చున్న భక్తుల నీడ కూడ 3 లేక 5 ఆకారములలో గోడపై పడుతుంది. ఈ ఛాయ సూర్యోదయము నుండి సూర్యాస్తమయం వరకు ఒకే విధముగా ఉంటుంది. ఛాయా రహస్యము ఎవ్వరికీ తెలియుట లేదు.

## తేళ్ళు ఉన్న మండపము

వీర భద్రుడు | రాయచోటి
కడప జిల్లా
రాయచోటి తాలూకా

మండపము నిండా తేళ్ళు మసలుతూ ఉన్నా ఉత్సవాలు, పూజలు సమయములో భక్తుల నెవ్వరినీ కుట్టవు.

## ఆంజనేయుడు పుట్టునట్లుగా అంజనీదేవి వరము పొందిన చోటు

అంజనా దేవి | అంజనా చలము
(ఆంజనేయుని తల్లి) | తిరుమల
చిత్తూరు జిల్లా

తిరుమల క్షేత్రమునకు వెళ్ళు త్రోవలోని ఏడు కొండలలో నొకటి. ఈ పర్వతముపై అంజనాదేవి పరమేశ్వరానుగ్రహానికి పాత్రురాలైనది.

---

**"అలఘుమన్నార్" (కృష్ణస్వామి) కెదురుగా ఉన్నగరుత్మంతుని విగ్రహం కన్నుల నుండి నీటి బొట్లు పడుతూ ఉంటాయి**

అలఘుమన్నార్ — మన్నారు పోలూరు

సౌందర్య వల్లి — నెల్లూరు జిల్లా

3 కి.మీ సూళ్ళూరు పేట

ఈ ప్రదేశములో జాంబవంతునికి, శ్రీ కృష్ణునికి యుద్ధము జరిగినదట శమంతక మణి కథ జరిగిన చోటు, సత్యభామ, జాంబవతి విగ్రహములు గలవు

**లింగముపై పెద్దదైన పచ్చ పొదగబడిన లింగము**

పచ్చల రామేశ్వరుడు — పానుగల్లు

నల్గొండ జిల్లా

5 కి.మీ నల్గొండ

లింగముపై పొదగబడిన పచ్చ ఇప్పుడు లేదు. కానీ మచ్చ కనిపిస్తూంటుంది దాని స్థానే స్వామివారికి (లింగానికి) పచ్చల పతకం ధరింప జేసి ఉంటుంది.

**ఆంధ్ర దేశమున గుండ్రని ఆకారములో కట్టబడిన ఒకే ఒక ఆలయం**

కపోతేశ్వరుడు — చేజెర్ల

గుంటూరు జిల్లా

30 కి.మీ. నర్సరావు పేట

శిబి చక్రవర్తి ధాతృత్వమును పావురము, డేగ రూపములలో దేవతలు వచ్చి పరీక్షించిన ప్రదేశము.

**లింగానికి దక్షిణ భాగాన ఉన్న రంధ్రములో నీరు పోసిన శవం కుళ్ళిన దుర్వాసన వస్తుంది. వామ భాగమున ఉన్న రంధ్రములో నీరు పోసిన మామూలుగా ఉంటుంది**

కపోతేశ్వర స్వామి — చేజెర్ల

లింగం మొండెం ఆకారం

ఓంకార నదీ తీరం

లింగము శిబి చక్రవర్తి యొక్క మొండెము. కర్రకు గుడ్డకట్టి లింగములోని దక్షిణ భాగాన ఉన్న రంధ్రములో ముంచి వాసన చూపిస్తారు.

---

## శ్రీ చక్రం గల ఏకైక వైష్ణవాలయం

నృసింహ స్వామి (ఫాలలోచనుడు) (ఎగువ అహోబిలం)

అహోబిలం
30 కి మీ. ఆళ్ళగడ్డ
కర్నూలు జిల్లా
50 కి.మీ. నంద్యాల

భూగర్భములో దేవీ ఆలయం ఉన్నదని, అందుచేతనే పైన శ్రీచక్రం ఉన్నదని విశ్వాసం "గిరిజా" పీఠం అని భావిస్తారు

## పంచ క్రోసి క్షేత్రము

ఎగువ అహోబిలము (కొండపైన) — అహోబిలము

1. కరండ నృసింహ
2. యోగానంద
3 ఉగ్రనరసింహ
4 వరాహ నారసింహ

కొండ క్రింద (దిగువ అహోబిలం)

1 ప్రహ్లాద వరద నారసింహ
2 ఛత్రవట
3. మాలోల నారసింహ
4 జ్వాలా నారసింహ
5 పవన నారసింహ

నవవిధ నారసింహ మూర్తులు (పైన తెల్పినవి)

5 క్రోసుల దూరములోనున్నవి అందుచేత ఈ క్షేత్రము పంచక్రోసి క్షేత్రమైనది వీటి దర్శనము ధన్యము

## 10 చేతులు గల నారసింహుని విగ్రహం గల ఆలయం

ప్రహ్లాద వరద నారసింహుడు

ఎగువ అహోబిలం
కర్నూల్ జిల్లా
ఆళ్ళగడ్డ నుండి బస్సు

## నదిలో నీరు ఎర్రగా నున్న క్షేత్రము

నృసింహ స్వామి ఎగువ అహోబిలము
పాపనాశిని నది
(భవనాశని)

హిరణ్య కశిపుని చంపి రక్తపు చేతులను ఈ నదిలో కడుగుటచే నీరు ఎర్రబడినదట

## నత్త గుల్లల పెంకులతో నిండి వున్న శివలింగము

నత్తారామేశ్వరుడు నత్తా రామేశ్వరము
పశ్చిమ గోదావరి జిల్లా
6 కి మీ అత్తిలి

నిత్య పూజలు జరుగుతూ ఉంటాయి ముఖ్య శివలింగము నీళ్ళలో మునిగి ఉంటుంది వేసవిలో నీరు తగ్గితే తప్ప కనిపించదు

## ఊపిరి పీలుస్తున్న దేవుడు

నృసింహ స్వామి వాడపల్లి
నల్గొండ జిల్లా
మిర్యాల గూడెం మీదుగా
వెళ్ళాలి

కృష్ణానది, మూసీనదీ సంగమ స్థానంలో ఉన్న దేవాలయము. దేవుని కెదురుగా ఉంచిన దీపములలో స్వామి వారి ముక్కుకు ఎదురుగా ఉన్నదీపం రెపరెపలాడుతుంది ఇక్కడ నున్న అగస్త్యేశ్వర స్వామి ఆలయములోని లింగమునుండి నీరు ఊరుతూంటుంది

## ఒకే పాన మట్టముపై 11 శివలింగములున్నఆలయము

ఏకాదశ రుద్రులు మంథెన
కరీంనగర్ జిల్లా

గోదావరి నది మధ్యలో ఎత్తైన దిబ్బపైన గల దేవాలయము. ఎదురుగా ఒకే నందీశ్వరుని విగ్రహంలో 11నందులున్నవి.

**యజ్ఞోపవీతము గల స్త్రీ మూర్తి**

కళింగ దేవి మంథెన
(నల్లని రాతి విగ్రహము) కరీంనగర్ జిల్లా
కాళేశ్వరం to పెదపల్లి to
మంతెన బస్సు

ఈ ఊరు నిండా దేవాలయములే. ఇచ్చట ఇటుకలు నీటిపై తేలుతాయట

**సాలగ్రామ శిలల హారమును ధరించి పద్మాసనమున కూర్చుని ఉన్న స్వామివారు**

శ్రీరామచంద్రమూర్తి భద్రాచలం
సీతాదేవి ఖమ్మం జిల్లా
లక్ష్మణస్వామి 40 km భద్రాచలం రోడ్ R S

అభిషేక జలాలు స్వామి వారి మెడలోని సాలగ్రామ శిలల మీదుగా ప్రవహింపజేసి, ఆ జలాన్ని భక్తులు లోనికి తీసుకున్నట్లయిన ముక్తి ప్రదాయకము.

**పద్మాసనములో కూర్చుని ఉన్న శ్రీరామచంద్ర మూర్తి**

శ్రీరామచంద్రుడు భద్రాచలము
సీతాదేవి
లక్ష్మణస్వామి

స్వామివారు పద్మాసనం వేసుకునికూర్చుని ఉండగా అమ్మవారు స్వామివారి ఎడమ తొడపై కూర్చుని ఉంటారు. ఈ విధమైన మూర్తి అరుదు

**పుట్టినరోజునే కళ్యాణము జరిపించుకొను స్వామివారు**

శ్రీరామచంద్రమూర్తి భద్రాచలం
సీతాదేవి
గోదావరి నదీ తీరము

భద్రుడనే మహర్షి తపస్సు చేసినందు వల్ల స్వామివారు వేంచేసియున్న కొండ "భద్రాద్రి" అయ్యెను. శ్రీరామ నవమినాడు అనగా చైత్ర శుద్ధ నవమి నాడు స్వామివారు పుట్టిరి. ఆ రోజుననే స్వామివారి కళ్యాణము ప్రత్యేకత

---

రామదాసు అను భక్తుడు కలికితురాయి, పచ్చల పతకం, చింతాకు పతకం, బంగారు మొలత్రాడు మరియు ఇతర ఆభరణములు చేయించెను. ఆభరణములకైన ఖర్చు గుడి కట్టించుటకైన ఖర్చు హైదరాబాదు నవాబు ద్రవ్యము గాన రామదాసు బంధింపబడెను. " రామమాడ' అని పిలువబడే బంగారు నాణెములను నవాబునకు చెల్లించి రామోజీ, లక్ష్మోజీ అని పిలువబడే ఇద్దరన్నదమ్ములు రామదాసును బందిఖానా నుండి విడిపించిరి.

స్వామి చతుర్భుజుడు పద్మాసనములో ఉంటాడు శంఖ, చక్రధారిగా ,ధనుస్సు, బాణాలు ధరించిన మూర్తి 5 km దూరములో పర్ణశాల గలదు. సీతా రాములు వనవాసకాలము యిచ్చటనే గడిపినట్లు,శూర్పణఖ ముక్కు చెవులు యిచ్చటనే కోసినట్లు, ,రావణుడు సీతను ఇచ్చటినుండే అపహరించినట్లు చెప్తారు.

## ఒకే విగ్రహానికి ఒక ప్రక్కన స్త్రీమూర్తి , మరొక ప్రక్కన పురుషమూర్తి

జగన్మోహిని
చెన్నకేశవ స్వామి

ర్యాలి
తూర్పు గోదావరి జిల్లా
10 km రావులపాలెం
24 km రాజమండ్రి

విగ్రహం ఎత్తు 5' పేరు కేశవ జగన్మోహిని. విగ్రహం పాదాల క్రింద నీరు కనిపిస్తూఉంటుంది. మూలభాగములో ( క్రింద) కొద్దిగా విరిగి ఉంటుంది ఆలయమున్న వీధికెదురుగా సుమారు ఒక ఫర్లాంగు దూరమున కమండలేశ్వరుని ఆలయం కలదు. అమ్మవారు ఉమాదేవి. ఒక వైపు స్త్రీమూర్తి రెండవవైపు పురుషమూర్తి గల బొమ్మను ( పూజా విగ్రహం గాకుండా) అద్దములో ఒక ప్రక్కన చూడవచ్చును. ఈ కళాత్మకమైన విగ్రహము హైదరాబాదు నందలి సాలార్‌జంగ్ మ్యూజియంలో గలదు. దీని పేరు "రిబెక్కా'' శిల్పం

విగ్రహం క్రింద నీరు వూరుచున్నట్లు కన్పిస్తుంది.

## కదలి వచ్చేటట్లు ఉన్న నంది

బసవయ్య
పొడవు 15'
వెడల్పు 8'
ఎత్తు 8'

యాగంటి
కర్నూల్ జిల్లా
15 కి మీ.బనగానపల్లె

ముఖము ఆగ్నేయ మూలకు తిరిగి ఉంటుంది.

---

**కలియుగాంతాన రంకె వేసి లేచి వచ్చే నంది**

బసవయ్య యాగంటి

శ్రీ పోతులూరి వీరబ్రహ్మేంద్ర స్వామి వారి కాలజ్ఞానము ప్రకారము ఈనంది కలియుగాంతాన లేచి వస్తుంది దీన్ని దర్శించినవారికి, కలియుగాంతము వరకు ఆగక యీలోపుగనే లేచివస్తుందేమోననే భావన కలుగుతుంది

**గొడుగాకార తలకట్టుఉన్న బాబాగారి క్షేత్రము, ఇక్కడ పూజింపబడే స్వామివారు**

పుట్టపర్తి సాయిబాబా ఆశ్రమములో 1.పుట్టపర్తి
శ్రీ షిరిడీ సాయిబాబా అనంతపురం జిల్లా
2. వైట్ ఫీల్డ్ (కర్నాటక)
16 km బెంగుళూరు

వీరు పెదబాబాగారుగా పేరుగాంచిరి. కర్నూలులో చిన బాబాగారు వెలసి వున్నారు.

**"సహస్ర ఘటాభి షేకం " జరిపించుకొను అమ్మవారు**

కనక మహాలక్ష్మి విశాఖపట్నం
(బహిరంగ మండపం) బురుజు పేట

మార్గశిర మాసం నెలరోజులూ మహోత్సవములు ఆఖరు రోజున సహస్ర ఘటాభిషేకం అమ్మవారికి జరుగుతుంది. అన్నదానముతో ముగుస్తుంది.

**ఆలయ నిర్మాణమే లేని అమ్మవారు**

కనక మహాలక్ష్మి విశాఖ పట్నము

రోడ్డుకు మధ్య భాగములో వెలసిన అమ్మవారు. విగ్రహమునకు చుట్టూ ప్రాకారము నిర్మించి పూజలు సల్పుచున్నారు ప్రక్కన మండపము కలదు

---

అసురులు శివుని, బ్రహ్మను ప్రార్థించి, వరాలు పొంది విర్రవీగి, గర్వాంధులై ధర్మహాని చేస్తారు విష్ణుమూర్తి వారిని వధిస్తాడు

**శుక్రవారము గాక గురువారము నాడు ముఖ్య పూజలు గల అమ్మవారు**

కనక మహాలక్ష్మి విశాఖపట్నం

**స్త్రీలకు అయిదవ తనమును ఇనుమడింపజేయు అమ్మవారు**

కనక మహాలక్ష్మి విశాఖపట్నం

స్త్రీలకు అయిదవతనమును ఇనుమడింపజేసే అమ్మవారుగా చాలా ప్రసిద్ధి. పుట్టిన పసికందులను అమ్మవారి ఒడిలో ఉంచుతారు. ఇది ప్రత్యేకత.

**ఆంధ్ర ప్రదేశ్ లో ఒకే ఒక చోట నున్న సంపూర్ణ సూర్య దేవాలయము**

శ్రీ సూర్యనారాయణ అరసవిల్లి

ఉష

పద్మిని 2 km శ్రీకాకుళం

ఛాయ శ్రీ కాకుళం జిల్లా

రధ సప్తమి రోజున సూర్య కిరణాలుస్వామివారి పాదాలపై పడతాయి. స్వామివారి ద్వారపాలకులు పింగళ, దండ. రోగ గ్రస్తులు నియమ నిష్టలతో సూర్య నమస్కారములు చేస్తే రోగ విముక్తులౌదురు.

హృద్రోగులు స్వామి వారి పుష్కరిణి లో 41 రోజులు స్నానమాచరించి, పూజిస్తే ఆరోగ్య వంతులగుదురు.

**భూప్రదక్షిణ ఫలితం లభించడానికి దర్శించవలసిన ఆలయం, విగ్రహాలు**

నవనందులు మహానంది

(కర్నూలు జిల్లా, 16 km నంద్యాల)

9 మైళ్ళ (14 కి.మీ) విస్తీర్ణములో నవ నందులు వెలసి ఉన్నవి. మహాశివరాత్రి పర్వదినాన ఈ నవనందుల దర్శనము ఒకే రోజున చేసిన మంచిది.

1. ప్రధమ నంది. 2.నాగనంది 3. సోమనంది. 4. సూర్యనంది. 5. శివనంది.
6. విష్ణునంది. 7. వినాయక నంది. 8. గరుడనంది. 9. మహానంది.

సూర్యోదయము నుండి సూర్యాస్తమయము లోపు దర్శనముచేసి,పూజింప వలయును. భూప్రదక్షిణ ఫలితము దక్కును.

**లింగము మీద గోవు పాద ముద్ర ఉంటుంది**

మహా నందీశ్వరుడు మహానంది
కామేశ్వరీ దేవి

లింగము ఎత్తుగా గాక కొంచెము తప్పటగా ఉంటుంది. పుట్టలో స్వామి వారికి ఆవుపాలు ఇస్తుండగా కోపించిన యజమాని ఆవును కొట్టగా పుట్టలోని స్వామివారిని ఆవు త్రొక్కి నందున లింగము కొంచెము అణగి ఆవు గిట్ట గుర్తు లింగముపై మిగిలినది. ఇచ్చట నీరు చాల స్వచ్ఛముగా నుండును. అడుగు భాగమున నున్న ప్రతీ వస్తువు కనిపించును. ఇచ్చట మూడు గుండాలున్నవి. బ్రహ్మ, విష్ణు, రుద్రగుండాలు. లింగము క్రిందనుండి నీరు ఊరుతూ ఉంటుంది. మహా శివరాత్రినాడు లింగోద్భవ సమయాన అభిషేకము. కళ్యాణోత్సవము,రథోత్సవము జరుగును. కోదండ రామాలయమున్నది

**కామేశ్వరీ దేవి అమ్మవారున్న ప్రసిద్ధ దేవాలయము**

కామేశ్వరీ దేవి మహానంది
మహానందీశ్వరుడు

**ఆంధ్ర దేశమున కోదండ రామ విగ్రహం కలిగిన ప్రసిద్ధ శైవ క్షేత్రము**

మహానందీశ్వరుడు మహానంది
కోదండరాముడు

**ఆంధ్ర దేశమున కర్నూలు జిల్లాలో పూజారి లేకుండా అర్చించబడు స్వామివారు గల ఏకైక దేవాలయం**

మహానందీశ్వరుడు మహానంది

దక్షిణాదిన ఇటువంటి ఆచారము ఎక్కడా కనిపించదు. 14 కి.మీ. దూరములో మొత్తం 9 నందులు వెలసి యున్నవి.

**చాచిన తన నాలుకపై త్రిపురాసురుని వధించిన దేవత**

త్రిపురసుందరి
త్రిపురసుందరీశ్వరుడు

త్రిపురాంతకం
ప్రకాశం జిల్లా
46 కి.మీ. వినుకొండ

త్రిపురాసురుని రక్తం క్రిందపడితే చాలామంది రాక్షసులు పుట్టుకొస్తారు కనుక అమ్మవారు తన నాలుకను చాచి త్రిపురాసురుని రక్తం భూమిపై పడకుండా వధించినది. అమ్మవారి ఆలయం చెరువు గట్టున ఉన్నది. వర్షాకాలములో నీరు ఎక్కువైనచో అమ్మవారి విగ్రహం నీళ్ళలో మునిగి ఉంటుంది. అప్పుడు పై భాగమున వున్న శ్రీ చక్రమునకు పూజ జరుగును. ప్రక్కనే ఉన్న చిన్న కొండపై త్రిపురాంతకేశ్వరస్వామివారి ఆలయము గలదు.

**భక్త ప్రహ్లాదునికి యోగాభ్యాసం నేర్పిన స్వామివారు**

యోగానంద నృసింహస్వామి
లక్ష్మీదేవి
కృష్ణానదీ తీరము

వేదాద్రి
15 కి.మీ.జగ్గయ్య పేట
54 కి.మీ. విజయవాడ
కృష్ణాజిల్లా.

హిరణ్యకశిపుని చంపిన తరువాత స్వామివారు ప్రహ్లాదునికి యోగాభ్యాసము నేర్పినారు. ఇక్కడికి దగ్గరిలోని గుట్టపై జ్వాలా నృసింహస్వామి ఆలయము కలదు. 24కి.మీ. దూరములో గరుడాచలం అని పిలువబడు గుట్టపై ఉగ్రనరసింహస్వామి ఆలయము కలదు. ఈ క్షేత్రమును గూడ పంచనారసింహక్షేత్రముగా భావింతురు. స్వామివారిని పూజించినవారికి పంచప్రాణములు పోయిననూ తిరిగి వచ్చునని నమ్మిక.

**అనంత పద్మనాభ స్వామి వారి దేవాలయం కేరళ రాజధాని తిరువనంత పురములో నున్నది. ఆంధ్ర ప్రదేశ్ లోనున్న అనంత శయన స్వామివారి ఆలయము**

అనంత శయన స్వామి

ఉండవల్లి
గుంటూరు జిల్లా
4 కి.మీ విజయవాడ

ఉండవల్లి కొండలో, 3వ అంతస్తులో ప్రక్కకు తిరిగి శయన భంగిమలో నున్న పెద్దదైన విగ్రహము నిత్య పూజాదులు, పూజారులతోసహా కనిపించవు. స్వామివారి బొడ్డు నుండి కమలం, దానిలో బ్రహ్మ విగ్రహం శేషశాయికి దేవతలు ప్రణామాలర్పించే విగ్రహములు కలవు.

---

తన వెంట వచ్చునవి పాప, పుణ్యములు మాత్రమే ధనము, బంధువులు, స్నేహితులు కాదు

## 100 కు మించిన పూజారులు పంతుల ప్రకారం పూజలు చేయు ఆచారము గల దేవాలయం

శ్రీ భీమేశ్వర స్వామి — వేములవాడ
రాజరాజేశ్వరీ దేవి — కరీంనగర్ జిల్లా
33 కి మీ. కరీంనగర్

తిరుపతిలో మాదిరిగా యాత్రీకులు ఉండటానికి అన్ని సదుపాయములున్నవి.

## ఈ దేవాలయాన పూజలు జరిపించితే యమలోకానికి వెళ్ళరట

రాజరాజేశ్వరీ దేవి — వేములవాడ
భీమేశ్వర స్వామి

చాలా పెద్ద దేవాలయము. ఉండటానికి విశ్రాంతి గదులు కలవు.

## గిత్తదూడలను మ్రొక్కుబడులుగా భక్తులు సమర్పించు స్వామివారు

రాజరాజేశ్వరుడు — వేములవాడ
లేక
భీమేశ్వరుడు
రాజరాజేశ్వరి

కోర్కెలు నెరవేరిన భక్తులు గిత్తలను సమర్పిస్తారు. సంవత్సరానికి ఆలయమునకు వేలకొలది గిత్తలు కానుకలుగా లభిస్తాయి.

## "సహస్ర సువర్ణాభిషేకం" అనబడే ప్రత్యేక అర్చన జరుగు ఆలయము

భీమేశ్వరుడు — వేములవాడ
లేక
రాజరాజేశ్వరుడు
రాజరాజేశ్వరి

స్వామి వారిని 1,000 సువర్ణాలతో అభిషేకిస్తారు. ఇది ప్రత్యేకత ఇక్కడ అనంత పద్మనాభ స్వామి, సీతా రామచంద్ర స్వామి, బాలరాజేశ్వర. విరలేశ్వర, సోమేశ్వర.ఉమామహేశ్వర, బాలాత్రిపుర సుందరి మొదలగు విగ్రహములు కలవు.

---

**నారదుడు స్త్రీ రూపం పొంది మరల పురుషునిగా మారిన స్థలం**

శ్రీభావనారాయణ స్వామి (విష్ణుమూర్తి)
సర్పవరం
తూర్పుగోదావరి జిల్లా
5 కి.మీ కాకినాడ

నారదుడు ఆలయములోని నారదగుండంలో మునిగి స్త్రీ రూపాన్ని, ముక్తి గుండంలో మునిగి మరల నారద రూపాన్ని పొంది స్వామివారిని పూజించిన దేవాలయం.

**భక్తులు మండలం రోజులు భక్తితో ప్రదక్షిణములు చేసిన తరువాతస్వామివారు కలలో ఇంజెక్షన్లు ఇచ్చినట్లు, ఆపరేషన్ చేసినట్లు కనిపించిన రోగాలు తగ్గిపోతాయని నమ్మకం గల ఆలయం**

శ్రీ లక్ష్మి నారసింహ స్వామి
యాదగిరి గుట్ట
నల్గొండ జిల్లా
4 కి.మీ రాయగిరి R.S.

**ఆంధ్రప్రదేశ్‌లో గోపురం పైనను, గర్భగుడి బయటను "శరభ సాళ్వ" విగ్రహములున్న ఆలయం**

జలధీశ్వరుడు
లేక
జరాప హరేశ్వరుడు
పార్వతీ దేవి
ఏలూరు
పశ్చిమ గోదావరి జిల్లా
దొంగల మండపం దగ్గర

హిరణ్య కశిపుని సంహరించిన ఉగ్ర నారసింహ మూర్తిని శాంతింపజేసిన శివశక్తి శరభ సాళ్వము. ఇది రెండు తలలుగల పక్షి

**స్వామివారు తూర్పు ముఖము, అమ్మవారు దక్షిణ ముఖము గల ప. గో. జిల్లాలోని ఈశ్వరాలయం**

జలధీశ్వరుడు
పార్వతీదేవి
ఏలూరు

స్వామివారిని జరాపహరేశ్వర స్వామివారుగా కూడా పిలుస్తారు. అమ్మవారు పుత్ర సంతాన ప్రదాయినిగా ప్రసిద్ధి

---

**నిత్య కళ్యాణముగల శివ స్వామి**

వీరేశ్వర స్వామి — మురమళ్ళ అగ్రహారం
(వీర భద్రుడు)
భద్రకాళి — కోనసీమ
గోదావరి నదీతీరము — అమలాపురం తాలూకా
కొమరగిరి దగ్గర

ఇచ్చట స్వామివారికి తిధి, వార, నక్షత్రాల సమస్య లేక నిత్య కళ్యాణము ప్రత్యేకత

**రాతి నంది విగ్రహం కాలికి ఇనుప కడియం ఉన్న ఆలయం**

జలధీశ్వరుడు — ఏలూరు
లేక
జరాప హరేశ్వరుడు
పార్వతీదేవి

స్వామివారి ఎదురుగా నున్న రాతినందికి ఇనుప కడియం తొడుగబడి యున్నది.

**లింగానికి ఎదురుగా 5 నందులు గల ఆలయం**

సోమేశ్వరుడు — భీమవరం (గునుపూడి)
పంచారామములలో నొకటి — ప. గో. జిల్లా

ఆలయమున కెదురుగా ఉన్న సరస్సులో, ఆలయ మండపములో, ధ్వజ స్తంభము దగ్గర, గర్భగుడికి ఎదురుగా మొత్తం ఐదు నందులు వెలసిన క్షేత్రం.

**క్రింది అంతస్తులో స్వామివారు లింగాకార రూపుడుగా వేంచేసి, పై అంతస్తులో (స్వామి వారి పై భాగాన) అన్నపూర్ణమ్మవారు వేంచేసియున్న ఆలయం**

సోమేశ్వరుడు — భీమవరం
అన్నపూర్ణ — (గునుపూడి)
పంచారామములలో నొకటి

**అమావాస్య నాడు నల్లగా, పౌర్ణమినాడు తెల్లగానుండు స్పటిక లింగము**

సోమేశ్వరుడు — భీమవరం (గునుపూడి)

పంచ ఆరామములలో నొకటి చంద్రునిచే ప్రతిష్ఠించబడిన లింగము గాన అమావాస్య, పౌర్ణమిల ప్రభావము స్పటిక లింగమైన సోమేశ్వరునిలో కనబడుచుండును

---

**పంచ మహా పాతకములు హరించు పుణ్య క్షేత్రము**

సోమేశ్వరుడు (చంద్ర ప్రతిష్ఠ) — భీమవరం

పంచ ఆరామములలో నొకటి. పంచ మహా పాతకములు 1. బంగారము దొంగిలించుట 2. సురా పానము 3 బ్రహ్మ హత్య 4. గురుపత్నీ గమనము 5 మహా పాతక సహవాసము.

**"త్రికూటేశ్వర" క్షేత్రము గల "త్రికూటా చలము"**

త్రికూటేశ్వరుడు
ఓగేరు నదీ తీరం
(మూడు శిఖరములు గల కొండపై)

కోటప్ప కొండ
గుంటూరు జిల్లా
10 కి.మీ. నరసరావు పేట

కొండపై మూడు శిఖరములు గలవు. కొండపైన స్వామివారు త్రికూటేశ్వరుడు. కొండ క్రింద నీలకంఠేశ్వర స్వామివారి ఆలయములో జనాకర్షణ యంత్రము స్థాపించబడి యున్నది. ప్రభలతో వుత్సవము ప్రత్యేకత.

**అమ్మవారి విగ్రహం ముందు శ్రీ చక్రం శిలమీద చెక్కబడి ఉన్న దేవాలయం**

శ్రీ కామాక్షీ దేవి

పుష్పగిరి
కడప జిల్లా
15 కి.మీ కడప

విగ్రహం ముందు శ్రీ చక్రము ఉన్నది. శ్రీ ఆదిశంకరాచార్య ప్రతిష్ఠ

**"దక్షిణ కాశి" అని పేరుగాంచిన పంచనదుల సంగమ స్థానమున వెలసిన పుణ్య క్షేత్రము**

కాశీ విశ్వేశ్వర స్వామి
చెన్న కేశవ స్వామి

పుష్పగిరి

పినాకిని, కుముద్వతి, పాపఘ్ని, వల్కాళ, మాండలి నదుల సంగమ స్థానము.

---

ఎవరి అదృష్టము వారిది సాగరమథనమున విష్ణుమూర్తికి శ్రీమహాలక్ష్మి, శివునికి కాలకూట విషము దొరికినవి

**రుద్రపాదం, విష్ణుపాదం ఉన్న క్షేత్రము**

శ్రీ కామాక్షీ దేవి పుష్పగిరి
పినాకినీ నదీ తీరము

ఈ రెండు పాదములకు 11/2 కి.మీ దూరము కలదు ఇది మహత్తర పుణ్యక్షేత్రము. ఇచ్చట అనేక దేవాలయములున్నవి.

**"త్రికూటాలయము" గా పేరు పొందిన క్షేత్రము**

1. కామేశ్వరుడు పిల్లల మర్రి
2. కాచేశ్వరుడు నల్గొండ జిల్లా
3 నామేశ్వరుడు సూర్యాపేట తాలూకా
10 కి.మీ. ఆమనగంటి

**మార్గశిర మాసం నెల రోజులు నిత్య కళ్యాణం, పచ్చతోరణంగా భాసిల్లే అమ్మవారి సన్నిధి**

కనక మహాలక్ష్మి విశాఖ పట్నం
బురుజు పేట

చివరి గురువారం పిండి వంటలతో భక్తులందరికీ అన్న సంతర్పణ.

**"బృందావనము" అని పిలవబడే జీవ సమాధి గల క్షేత్రము**

శ్రీ రాఘవేంద్ర స్వామి మంత్రాలయము
(జీవ సమాధి) R S 15 కి.మీ.
ఆదోని నుండి ఎమ్మిగనూరుమీదుగా
బస్సుపై వెళ్ళ వలెను.
కర్నాటక బోర్డర్

స్వామివారు ద్వైత వేదాంత ప్రచారకులు. ప్రహ్లాదుని అవతారము దగ్గరలో పంచముఖ ఆంజనేయ స్వామివారి దేవాలయము. ఇచ్చట గ్రామదేవత మంచాలమ్మ

---

ఇల్లరికపుటల్లుళ్ళు (అత్తవారింట తిష్ట) శివుడు కైలాసమునందు,
విష్ణుమూర్తి పాలసముద్రము నందు

## "కప్ప స్తంభము" గల దేవాలయము

వరాహ నరసింహ స్వామి

సింహాచలము
విశాఖపట్నం జిల్లా
16 కి మీ. విశాఖ పట్నం

దీర్ఘ వ్యాధి పీడితులు, సంతానార్థులు, పశువ్యాధి నివారణ కోరువారు ఈ స్తంభానికి నమస్కరించి కౌగలించుకొనిన కోర్కెలు తీరునట నమస్కరించుటకు కౌగలించుకొనుటకు దేవస్థానమునకు కప్పము కట్టవలెను. అందుచేత ఈ స్తంభమునకు "కప్ప స్తంభమ"ని పేరు వచ్చినది. ఈ స్తంభము దేవాలయము లోపల భాగమున మొదటనే గలదు. ఈ స్తంభమునకు ప్రత్యేక అలంకరణ చేయుదురు ఇది రాతి స్తంభము (నల్లని రాయి) చైత్రశుద్ధ ఏకాదశి నాడు ఉత్సవము జరుగును.

## తూర్పు భాగములో శ్రీజ్వాలా నరసింహ స్వామివారి విగ్రహం, శ్రీ శాంత కేశవస్వామి విగ్రహాలు గల ఆలయం

శ్రీ భావన్నారాయణ స్వామి
రాజ్యలక్ష్మి దేవి

బాపట్ల
గుంటూరు జిల్లా

## దేవాలయము కట్టిన రాళ్ళను దగ్గరలో నున్న చెరువులో వేస్తే పైకి తేలుతవి

రామప్ప గుడి
రామప్ప చెరువు

పాలం పేట
65 కి మీ. హన్మకొండ
70 కి మీ. వరంగల్లు
వరంగల్ జిల్లా

---

చితి ప్రాణము పోయిన తరువాత దహించును
చింత ప్రాణమున్నంతవరకు దహించును

## సోమేశ్వర లింగమున కోటిలింగాలు తొలవబడి యున్న క్షేత్రము

సోమేశ్వరుడు — కోటిపల్లి
గోదావరి నదీ తీరము — తూర్పు గోదావరి జిల్లా
10 కి మీ ద్రాక్షారామం
36 కి.మీ కాకినాడ

సోమేశ్వర లింగమున కోటి లింగములు తొలువబడి యున్నవి. ఇచ్చట చేసే తపో, దాన, యజ్ఞ యాగాదులు కోటిరెట్లు ఫలమధికముగా యిస్తాయట. అందుచేతనే 'కోటిఫలి' అని పేరు వచ్చినది. ప్రక్కనే ఇంద్ర ప్రతిష్ఠిత కోటేశ్వర ఆలయమున్నది లింగము నీటిలో మునిగి ఉంటుంది. ఛాయా సోమేశ్వరుడని పేరు.

## ఉత్తరాయన కాలములో, దక్షిణాయన కాలములోని కొన్ని పర్వదినములలో సూర్యకిరణములు రాతి రథము యొక్క రెండు రంధ్రముల ద్వారా స్వామివారి పాదాలుతాకుతాయి

శ్రీ చింతల వేంకటేశ్వరుడు — తాడిపత్రి
(వేంకట రమణ మూర్తి) — అనంతపురం జిల్లా
50 కి.మీ. అనంతపురం

సూర్య కిరణములు స్వామివారి పాదములను తాకు రోజుల్లో దర్శనము చాలా పవిత్రమైనదని భక్తులు తలుస్తారు. ఆలయ ప్రధాన ద్వారము వద్ద గరుత్మంతుని విగ్రహమున్నది.

## కృష్ణానది ఉత్తర వాహినిగా ప్రవహించు చోట వెలసిన ఆలయం

ముక్తేశ్వర స్వామి — ముక్తేశ్వర పురం
భవాని — లేక ముక్త్యాల

## జీవితాంతము అఖండ బ్రహ్మచర్యము పాటించు నియమము గల పూజారి గల ఆలయము

శ్రీ లక్ష్మీ నృసింహ స్వామి — అల్లూరు
గుంటూరు జిల్లా
బాపట్ల తాలూకా

ప్రసిద్ధి గాంచిన "బారుగుండాల సేవ'' ఉత్సవము జరుగును. పానకము ప్రసాదము.

---

**కుక్కలు తినగా మిగిలిన ప్రసాదమును భక్తులు తిను ఆలయము**

1. జై జై నారాయణ — మామిడాడ
2. శివ లింగం — తూర్పు గోదావరి జిల్లా

బిక్కవోలు నుండి ఆటో
కాకినాడ నుండి సిటీ బస్సు

ఈ ఆలయము శ్మశానములో నున్నది మిరాయి ప్రసాదం. గంటలు మ్రోగించగానే కుక్కలు వచ్చి ప్రసాదాన్ని తిని వెళతాయి. మిగిలినది భక్తుల కొరకు. కుక్కల నారాయణ జీవ సమాధి తుల్యభాఘ నదీ సమీపాన.

**కృష్ణాజిల్లాలో ఉన్న ఏకైక సుబ్రహ్మణ్య స్వామివారి దేవాలయము**

శ్రీ సుబ్రహ్మణ్యేశ్వరుడు — మోపిదేవి
పుట్టలు గల ఆలయం — కృష్ణాజిల్లా

5 కి.మీ. చల్లపల్లి

ఇచ్చట స్వామివారు లింగ రూపమున నుందురు. ఈ లింగము పాతాళము వరకు ఉన్నదని ప్రతీతి. ప్రక్కనే సకలేశ్వర స్వామి వారి ఆలయమున్నది

**పానమట్టముపై లింగము గుండ్రముగా గాక పలకలుగా ఉన్న స్వామివారు**

సుబ్రహ్మణ్య స్వామి — మోపిదేవి

లింగము చతురస్రపు చెక్కముక్క నిలబెట్టినట్లు ఉంటుంది.

**పానమట్టము క్రిందిభాగమున ఎదురుగా కుడిభాగమున రంధ్రము కలిగి, దాని ద్వారా అప్పుడప్పుడు సజీవ సర్పము బయటకు వచ్చు లింగరూపుడైన సుబ్రహ్మణ్య స్వామి**

సుబ్రహ్మణ్య స్వామి — మోపిదేవి

---

**ఖడ్గమును ఆయుధముగా ధరించిన ఆంజనేయ స్వామి**

ఖడ్గాంజనేయ స్వామి మొవ్వ
కృష్ణాజిల్లా
8 కి.మీ చల్లపల్లి

వేణుగోపాల స్వామివారి ఆలయములో ఆగ్నేయదిశగా వేరే గదిలో ఉన్న విగ్రహము. కుడిచేత ఖడ్గమును ఎడమ చేత సంజీవి పర్వతమును గల నిలువబడి ఉన్న విగ్రహము.

**108 సాలగ్రామ శిలలు హారముగా గల ఆంజనేయ స్వామి**

ఖడ్గాంజనేయ స్వామి మొవ్వ
వేణుగోపాల స్వామి

వేణుగోపాల స్వామివారి ఆలయ ప్రాంగణమున వెలసిన స్వామివారు

**క్షేత్రయ్య పదాలు అంకితము పొందిన స్వామివారు, వెలసిన ఆలయము**

వేణు గోపాల స్వామి మొవ్వ

క్షేత్రయ్య అనే మహా భక్తుడు వేణు గోపాల స్వామివారి మీద పదాలు కూర్చెను. నాట్య శాస్త్రాను సారము భక్తి భావము స్ఫురించే పదాలు. క్షేత్రయ్య జన్మ స్థలము మొవ్వ గ్రామము

**108 సాలగ్రామ శిలలు హారముగా గల వేణుగోపాల స్వామి**

వేణుగోపాల స్వామి మొవ్వ
సత్యభామ
రుక్మిణి

క్షేత్రయ్య పదములు వ్రాసిన దివ్య క్షేత్రము. ప్రక్కన భీమేశ్వర బాలా త్రిపుర సుందరి ఆలయము గలదు.

## లింగముపై గుప్పెడంత బొడిపి కలిగి, లింగము చుట్టూ కుచ్చుతో కూడిన వాలము చుట్టబడిన గుర్తు గల లింగము

గంగా, పార్వతీ సమేత
రామలింగేశ్వర స్వామి
(సీతాదేవిచే ప్రతిష్ఠించబడిన ఇసుక లింగము)
కృష్ణానదీ తీరము

చిలుమూరు
గుంటూరు జిల్లా
2 కి.మీ. అనంతవరము

1. ముహూర్తసమయమునకు ఆంజనేయుడు లింగమును తీసుకుని రాలేక పోయినందున సీత ప్రతిష్ఠించిన లింగము ఆంజనేయుడు వచ్చిన తరువాత సీతా ప్రతిష్ఠిత రామలింగేశ్వర స్వామి లింగాన్ని తోకతో చుట్టి పెకలించబోవ లింగము కదలదాయెను తార్కాణముగ కుచ్చుతో కూడిన తోక గుర్తు లింగముపై కలదు తాను తీసుకుని వచ్చిన లింగాన్ని ఆంజనేయుడు కృష్ణానది ఆవలి వైపుకు విసరి వేసెను
2. ఈ క్షేత్రము "ఉభయ రామేశ్వరము" లలో నొకటి.
3. లింగము చిన్నదిగా సీతాదేవి చేతులతో ప్రతిష్ఠించబడినా, పెరుగుతూ ఉన్నందున సీతాదేవి తన గుప్పెటతో నదిలో ఉన్న ఇసుకను తీసుకుని లింగాగ్రమున ఉంచినందున గుప్పెటంత బొడిపి కలిగి, లింగము కనిపిస్తూ ఉంటుంది అంతటితో పెరుగుదల ఆగినది.
4. లంకనుండి అయోధ్యకు వెళ్ళుచూ ప్రతిష్ఠించ బడిన లింగము స్వామివారి పేరు రామలింగేశ్వరుడు.
5. దేవాలయం లోపల **4** దిక్కులా మారేడు చెట్లు కలవు. చాలా పెద్ద శమీ వృక్షము కూడ కలదు.
6. స్వామి పశ్చిమాభిముఖుడు

---

స్వామివార్లకున్న యిరువురు భార్యలు ఒకరు జ్ఞానమార్గానికి, మరొకరు భక్తిమార్గానికి సంకేతాలు

**రామేశ్వర క్షేత్రములో వలె సీతా సహాయముతో శ్రీరాముడు ప్రతిష్ఠించిన లింగము రామలింగేశ్వర లింగము చిలుమూరులో (గుంటూరు జిల్లాలో) నుండగా, ఆంజనేయుడు కాశీనుండి తీసుకుని వచ్చిన లింగము విసరివేయగా ప్రతిష్ఠించబడిన స్థలము**

| | |
|---|---|
| రామలింగేశ్వరుడు | ఐలూరు |
| కృష్ణానదీ తీరము | కృష్ణాజిల్లా |
| ఉభయ రామేశ్వర క్షేత్రము | 4 కి.మీ. కృష్ణాపురం |
| | 12 కి.మీ. కొడాలి |

"ఉభయ రామేశ్వర" లింగములలో రెండవది. మొదటిది చిలుమూరులో నున్నది కృష్ణానది కావలి తీరము. ఈ ఆలయము పశ్చిమాభిముఖము. ఆలయం ప్రక్కన రఘునాయక దేవాలయము కలదు.

**నిమ్మకాయలు మాత్రమే ప్రసాదముగా గల అమ్మవారు**

| | |
|---|---|
| మహంకాళి | చిలువూరు |
| వీరభద్రుడు | 3 కి.మీ. చిలువూరు |
| పోతురాజు | విజయవాడ నుండి తెనాలికి |
| | వెళ్ళు త్రోవలో. |
| | గుంటూరు జిల్లా |

అమ్మవారికి నిమ్మకాయలు మాత్రం ప్రసాదం. ఎదురుగా ధ్వజ స్తంభం వద్ద నిమ్మకాయల ప్రోగు ఉంటుంది. అమ్మవారి మెడలో పొడవైన నిమ్మకాయల హారం ఉంటుంది. కొత్త వాహనాలకు పూజలు చేసి, నిమ్మకాయలు కట్టుట ప్రత్యేకత. అమ్మవారికి శుక్రవారం, ఆదివారం పూజలెక్కువగా జరుగుతాయి.

**స్వామివారి తలపై ఒకప్పుడు వెంట్రుకలు మొలిచేవి.**

**అందుచేత "కుంకుళ్ళ మాన్యం" ఉన్నది**

| | |
|---|---|
| ఆంధ్ర మహావిష్ణువు | శ్రీకాకుళం |
| కృష్ణానదీ తీరము | దివి సీమ |
| | కృష్ణాజిల్లా |
| | 15 కి.మీ. చల్లపల్లి |
| | 7 కి.మీ. కొడాలి |

కలలో కనిపించి శ్రీ కృష్ణ దేవరాయలచే "ఆముక్త మాల్యద" అను గ్రంధమును రచియింప ఆదేశించిన స్వామివారు.

**చాల పెద్ద గోపురము కల్గి ఉన్న వైష్ణవాలయానికి ప్రక్కగా వేరే గోపురము కల్గిన పెద్ద శివాలయము**

| | |
|---|---|
| ఏక రాత్రి మల్లిఖార్జున స్వామి | శ్రీ కాకుళం |
| బాలా త్రిపుర సుందరి | కృష్ణాజిల్లా |

**ప్రభలో (స్వామి వారి విగ్రహానికి వెనుక ఉన్న శిలలో) దశావతారములు చెక్కబడి ఉన్న స్వామివారు**

| | |
|---|---|
| ఆంధ్ర మహావిష్ణువు | శ్రీ కాకుళం |
| రాజ్యలక్ష్మి | కృష్ణాజిల్లా |

ఆలయ గోపురము చాలా పెద్దది. ఆంధ్ర దేశమున గల పెద్ద గోపురములలో నొకటి

**మెడలో 108 సాలగ్రామ శిలలు హారముగా గల్గి నిల్చొనివున్న వైష్ణవ స్వామి**

| | |
|---|---|
| ఆంధ్ర మహావిష్ణువు | శ్రీకాకుళం |
| శ్రీ కాకుళేశ్వరుడు | కృష్ణాజిల్లా |
| రాజ్యలక్ష్మి అమ్మవారు | |

6' ఎత్తుగల నిలువెత్తు విగ్రహం. అమ్మవారి విగ్రహం ఎత్తు 4'.

**అన్నవరములో "శ్రీ సత్యనారాయణ స్వామి వారి వ్రతం" జరుగునట్లు "శ్రీ లక్ష్మీ నారాయణ స్వామి వారి వ్రతం" జరుగు ఆలయము**

| | |
|---|---|
| శ్రీ సింహాచల నృసింహ స్వామి | సింహాచలము |
| (అప్పన్న) | |
| సింహవల్ళీ తాయారు | 16 కి.మీ. విశాఖ పట్నం |
| ఆండాళ్ళు | |

**కళ్యాణ మహోత్సవ సమయములో భాగముగా పందిరిరాట నాటు ఆచారము గల ఆలయము**

| | |
|---|---|
| శ్రీ సింహాచల నృసింహ స్వామి | సింహాచలము |
| సింహవల్ళీ తాయారు | |
| ఆండాళ్ళు | |

ఈ ఆచారము ఈ నాటికి సాగుతున్న ఆలయము

---

పంచాక్షరి "నమశివాయ" శివుని పంచ కృత్యులు

1) సృష్టి 2) స్థితి (Preservation) 3) లయ 4) తిరోభావ (కాపాడు, రక్షించు) 5) అనుగ్రహ (Blessing)

**తల క్రింద కొలపాత్ర నుంచుకుని ఉన్న శయనమూర్తి**

శ్రీ గోవింద రాజస్వామివారు — తిరుపతి, చిత్తూరు జిల్లా

శ్రీ వేంకటేశ్వరుని అన్నగారుగా ప్రసిద్ధి.

**తిరుమలలోని శ్రీ వేంకటేశ్వరుని విగ్రహం దేనిపై నిలువబడి యున్నది?**

శ్రీ వేంకటేశ్వర స్వామి — తిరుమల, చిత్తూరు జిల్లా

స్వామివారి విగ్రహము తామర పద్మము మీద నిలువబడి యున్నది పాదములకు, పద్మమునకు రేకు తాపడము చేయబడి పైభాగమున బంగారు పూత పూయబడి యున్నది.

**"అనంతగిరి" అని పిలువబడే క్షేత్రము**

శ్రీ వేంకటేశ్వర స్వామి (చిన్న తిరుపతి) — ద్వారకా తిరుమల, పశ్చిమ గోదావరి జిల్లా, 50 కి.మీ. ఏలూరు

ఈ దేవాలయము చిన్న కొండ గుట్టపై కలదు గుట్టను శేషాచలమని పిలుతురు

**ఎడమ చేత చక్రము, కుడిచేత శంఖము ధరించిన స్వామివారు వెలసిన వైష్ణవాలయము**

ఆంధ్ర మహావిష్ణువు — శ్రీకాకుళం

దీనికి కారణము, స్వామివారు శాంతి కాముకుడట. అందుచేతకుడిచేత చక్రముండదు. చక్రమును ప్రయోగించు హస్తము కుడిచేయి.

**సూర్యకిరణములు అరసవిల్లిలోని సూర్యనారాయణ స్వామివారి పాదములపై పడును. ఇదే విధముగా నుదుటి మీద, గర్భమందు, పాదాల మీద ఒకేరోజున ఉదయం, మధ్యాహ్నం, సాయంకాలం సూర్య కిరణములు పడే స్వామివారు**

వేద నారాయణ స్వామి, వేద నారాయణి — నాగలాపురం, చిత్తూరు జిల్లా, 45 కి మీ తిరుపతి

సంవత్సరమునకు ఒకసారి మార్చి నెలలో సూర్యకిరణములు స్వామివారిపై పడురోజున "సూర్య పూజ" జరుగుతుంది.

---

నటరాజ విగ్రహాల కండ్లు మూసుకుని వుంటాయి లేకున్న కండ్లనుండి మంటలు వచ్చి ప్రపంచమును దగ్ధం చేస్తాయి నటరాజస్వామి వారు ఎల్లప్పుడూ ఎడమకాలుఎత్తి నాట్యము

**భక్తులు ఎటువైపున నిల్చొని ఉన్నా, వటపత్రశాయి అయిన శ్రీ కృష్ణుడు తమ వైపే చూస్తున్నట్లున్న అద్దాల మండపం గల ఆలయం**

తల్పగిరి శ్రీరంగనాథ స్వామి — నెల్లూరు
పెన్నా నదీ తీరము — నెల్లూరు జిల్లా

**"కదంబ వనవాసిని" అని స్తోత్రం చేయబడు అమ్మవారు**

త్రిపుర సుందరి — త్రిపురాంతకం
కదంబ వృక్షాలు తొమ్మిది ఉన్నవి — 46 కి.మీ. వినుకొండ

త్రిపురాసుర సంహారములో రాక్షసుని రక్తం భూమిపై పడినచో వేలాది రాక్షసులు పుడతారు అందుచేత అమ్మవారు నాలుక చాపి రక్త బిందువులు భూమి మీద పడకుండా రాక్షసుని చంపెను. విగ్రహం నాలుక చాపి అతి ఉగ్రరూపములో నున్నది. ఉగ్రరూపమున దర్శన మీయ జాలక, భక్తులు ఝడుసుకుంటారని అమ్మవారు వెనుతిరిగిరి. పూజలు అమ్మవారి వెనుక భాగమునకే

**ఆంధ్ర ప్రదేశ్‌లో పడమరగా ప్రవహించే నదీ తీరాన వెలసిన ఆలయం**

చెన్న కేశవ స్వామి — మాచర్ల
చంద్ర వంక నదీ తీరం — గుంటూరు జిల్లా
175 కి.మీ. హైదరాబాద్

చంద్ర వంక నది మాచర్ల వద్ద పడమరగా ప్రవహిస్తున్నది. ఉత్తర భారత దేశములో ఈ నదిని బాహుదా నది అని పిలుస్తారు.

**అభిషేకములో పసుపు వాడు స్వామివారు**

శ్రీ వేంకటేశ్వరుడు — తిరుమల
చిత్తూరు జిల్లా

స్వామివారికి ప్రతీ శుక్రవారము నాడు చేయు అభిషేకములో పసుపు కూడా వాడతారు.

---

మొట్టమొదట పూజించవలసినది శక్తి తరువాత యితర విగ్రహాలు విష్ణు, మహేశ్వరులు వగైరా, తరువాత యంత్రాలు (చక్రాలు) తరువాత వృక్షాలు వగైరా

**తార్ష్యాద్రి పర్వతపంక్తిపై వేంచేసియున్న స్వామివార్లు**

శీర్షభాగమందు, మధ్యభాగమందు, తోకభాగమందు మూడు ఆలయములు కలవు ఈ దేవాలయములున్న పర్వతపంక్తిని శేషతల్పము, ఆదిశేషావతారము అని పిలుతురు

1 శీర్షభాగమందు శ్రీనివాసుడు
తిరుమల, చిత్తూరు జిల్లా

2 తోక భాగమందు మల్లికార్జునుడు, శ్రీశైలం, కర్నూలు

3. మధ్య భాగమందు నారసింహ స్వామి
అహోబిలము, కర్నూల్ జిల్లా

**ప్రతిదినము విగ్రహానికి పునుగు పూయబడు ఆచారము గల ఆలయము**

శ్రీవేంకటేశ్వరుడు తిరుమల
చిత్తూరు జిల్లా

ప్రతిరోజు పునుగు పూయుటవలన విగ్రహము యొక్క అసలు రంగు కనిపించక, నల్లగా నిగనిగలాడుతూ మెరుపు వస్తుంది.

**ఈ క్షేత్రములో నున్న స్వామివారు మొదట్లో విష్ణుమూర్తి కాదనే వాదన ఉన్న ఆలయం**

శ్రీ వేంకటేశ్వరుడు తిరుమల

స్వామివారికి ఉన్న శంఖ, చక్రములను తొండమాను అను భక్తుని కొసంగినందున.

**శివకేశవ రూపాలు గల స్వామివారు**

శ్రీ వేంకటేశ్వరుడు తిరుమల

"శివుడవో", "మాధవుడవో" అని త్యాగరాజ స్వామివారికి సందేహము కలిగించిన విగ్రహము "తెరతీయరా" అనే కీర్తనతో త్యాగరాజస్వామి ప్రార్థించెను. త్యాగరాజునకు కనిపించిన శివకేశవ స్వామి శ్రీ వేంకటేశ్వరుడు.

## సాలగ్రామ శిలల హారము ధరించి నిలుచుని ఉన్న వైష్ణవ స్వామివార్లు (విష్ణుఅంశ)

1 శ్రీ వేంకటేశ్వరుడు — 1) తిరుమల, చిత్తూరు జిల్లా

2 ఆంధ్రమహావిష్ణువు — 2) శ్రీకాకుళము, కృష్ణాజిల్లా, దివిసీమ

108 సాలగ్రామ శిలల హారమును ధరించుటచే విగ్రహములకు ఆకర్షణశక్తి కలిగినదని చెబుతారు.

## స్వామివారి గర్భగుడిని 'ఆనంద నిలయ' మంటారు

శ్రీవేంకటేశ్వరుడు — తిరుమల

గర్భగుడి పైభాగాన్ని "ఆనంద నిలయ" మంటారు. దీనికి బంగారు పూత గలదు. దీని విమానంపై వెలసిన శ్రీవేంకటేశ్వర స్వామివారిని "విమాన వేంకటేశ్వరస్వామి"గా పిలుతురు.

## అభిషేకములో తేనెను ఉపయోగించని స్వామివారు

శ్రీవేంకటేశ్వరస్వామి — తిరుమల, చిత్తూరు జిల్లా

పాలు, పెరుగు, నెయ్యి, నీరు వగైరా అభిషేకములు జరుగుతాయి. కాని తేనెను వాడరు విగ్రహానికి పునుగు వగైరా అద్దుతూ ఉంటారు. స్వామివారి విగ్రహానికి పునుగుతో పూత పూయుచుండుట చేత విగ్రహం నల్లగా నిగనిగలాడుతూ ఉంటుంది.

---

## ఆంధ్రప్రదేశ్‌లో ప్రత్యేక కథ కల్గిన సూర్యనారాయణ మూర్తి విగ్రహం ప్రతిష్ఠించబడిన క్షేత్రము

శ్రీ సూర్యనారాయణ మూర్తి | తిరుచానూర్
శ్రీనివాస ప్రతిష్ఠ | అలిమేలు మంగాపురం
5 కి మీ. తిరుపతి

లక్ష్మీదేవి పద్మావతిగా (అలిమేలు మంగగా)అవతరించడానికి గాను తిరుచానూరులో పెద్ద కోనేరు త్రవ్వి ఇంద్రలోకమునుండి పద్మములను తీసుకుని వచ్చి కోనేరులో పెంచారు. ఆ పద్మాలనుండి లక్ష్మీదేవి అవతరించినది పద్మాలు ఎల్లప్పుడు (రాత్రింబవళ్ళు) వికసించి ఉండడానికి గాను శ్రీ సూర్యనారాయణమూర్తిని కోనేరు ప్రక్కన ప్రతిష్టించిరి అందుచేతనే సూర్యదేవాలయానికి ప్రాముఖ్యత కనిపించదు. లోక కళ్యాణార్ధము గాక (ప్రజాక్షేమానికి గాక,) పద్మాల వికసితకు ప్రతిష్ఠించబడిన స్వామివారు. ఇప్పుడిప్పుడు ఈ ఆలయాన పూజారి వుండటం, భక్తులు పూజలు జరిపించడం ప్రారంభమయింది.

## భర్తమీద అలిగి, కోపగించుకుని దూరముగా వెళ్ళిపోయిన అమ్మవారు

అలమేలు మంగ | తిరుచానూరు
చిత్తూరుజిల్లా
5 కి.మీ. తిరుపతి

సవతిపోరుతో సతమతమయి, భర్తపై ఆగ్రహించి కొండ క్రిందకు దిగి దూరముగా వెళ్ళిపోయిన అమ్మవారు. ఈమెను పద్మావతి అని కూడా పిలుస్తారు. మొదటి భార్య అయిన లక్ష్మీదేవి స్వామివారిపై కోపగించుకుని మహారాష్ట్రములోని కొల్హాపూర్ వెళ్ళిపోయినది. స్వామివారికి యిద్దరు భార్యలున్ననూ, ఏ ఒక్క భార్య తిరుమల కొండపై లేదు. రాత్రులందు స్వామివారు కొండదిగి తిరుచానూరు వస్తారని గాధ.

## గౌతముని మోసగించి అహల్యను అపవిత్రము చేసిన దేవేంద్రుడు పాప పరిహారార్థము ప్రతిష్ఠించిన శివలింగము

అమరేశ్వరుడు | అమరావతి
రాజ్యలక్ష్మీదేవి | గుంటూరు జిల్లా
40 కి.మీ. గుంటూరు

పంచ ఆరామములలో నొకటి. చాల ఎత్తైన లింగము.

---

కృతయుగములో **తీర్థాలన్నీ** పవిత్రమైనవి త్రేతాయుగములో పుష్కరతీర్థము పవిత్రమైనది
ద్వాపరయుగములో కురుక్షేత్రముననున్న సరోవరం పవిత్రమైనది కలియుగములో గంగానది పవిత్రమైనది

## శ్రీకృష్ణదేవరాయలు తులాభారము తూగిన దేవాలయము

అమరలింగేశ్వర స్వామి అమరావతి
రాజ్యలక్ష్మి
కృష్ణానదీ తీరము
లింగము ఎత్తు 30'

ఈ క్షేత్రము పంచ ఆరామములలో నొకటి. స్వామివారు ఇంద్ర ప్రతిష్ఠ. రెండు అంతస్థులాలయం.

## బమ్మెర పోతనామాత్యుని స్వగ్రామములో నున్న దేవాలయం

శ్రీ కోదండ రామస్వామి ఒంటిమిట్ట
సీతాదేవి కడపజిల్లా
లక్ష్మణ స్వామి
ఆంజనేయుడు

భక్తపోతన భాగవతాన్ని తెనిగించిన గ్రామం.

## నది మామూలుగా ప్రవహించే వీలుకాక వంకరదిశగా ప్రవహించు చోట వెలసిన ఆలయము

అమరలింగేశ్వరుడు అమరావతి
బాలా త్రిపుర సుందరి
పంచారామములలో నొకటి

కృష్ణానది పడమరనుండి తూర్పునకు ప్రవహిస్తుంది. ఇక్కడ వంకర తిరిగి ఉత్తరము నుండి దక్షిణ దిక్కునకు ప్రవహిస్తుంది. నదులు గతులు తప్పుచోట పవిత్ర స్థలములుగా భావింతురు.

## బలిచక్రవర్తి ప్రతిష్ఠించిన స్పటిక లింగము గల దేవాలయం

శివస్వామి ముక్తేశ్వర పురం
(ముక్తేశ్వరుడు) లేక ముక్త్యాల

కృష్ణానది ఉత్తర తీరాన నదీ గర్భములోని బంగారు దేవాలయం. కృతయుగానికి ముందే నిర్మించబడినదట

---

శ్రీకాళహస్తీశ్వరుడు (వాయులింగము) కృతయుగములో బంగారు లింగము త్రేతాయుగములో వెండిలింగము ద్వాపరయుగములో కంచు లింగము కలియుగములో గ్రానైటు రాతిలింగము

**మూలాంకురమ్మ గ్రామదేవతగా గల పట్టణము**

మూలాంకురమ్మ (గ్రామదేవత) — అమీనాబాద్, గుంటూరు జిల్లా, సత్తెనపల్లి తాలూకా

**దక్షుడు యజ్ఞము చేసిన చోటుగా ప్రసిద్ధి చెందిన క్షేత్రము,వెలసిన ఆలయము**

భీమేశ్వరస్వామి, మాణిక్యాంబ — ద్రాక్షారామం, తూర్పుగోదావరి జిల్లా, 32 కి మీ. కాకినాడ

పంచ ఆరామములలో నొకటి. త్రిపురాసురుని మెడలోని శివలింగాన్ని కుమారస్వామి 5 ఖండాలుగా ఖండించగా 5 చోట్ల శివలింగ భాగాలు పడినవి. ఈ క్షేత్రమున ఒక భాగము పడినది. దక్ష ప్రతిష్ఠ.

**తనకు, తన శిష్యులకు కాశీలో భిక్ష పుట్టలేదని వ్యాసుడు శపించబోవగా స్వామివారు వ్యాసుని కాశీ విడచి పొమ్మనెను. (ఆజ్ఞాపించిన స్వామివారు కాశీలోని విశ్వేశ్వరుడు). వ్యాసుడు స్వామివారి ఆజ్ఞ ప్రకారం తీర్థయాత్రలు చేసుకుంటూ ఆఖరున శిష్యులతో సహా స్థిరపడి పోయిన పుణ్యక్షేత్రము**

భీమేశ్వరస్వామి, మాణిక్యాంబ — ద్రాక్షారామం

**లింగము యొక్క మొదట్లో ఉదయం, సాయంకాలము సూర్యకిరణములు పడు స్వామివారు**

భీమేశ్వరుడు, మాణిక్యాంబ — ద్రాక్షారామము

స్వామివారు పంచారామములలో నొకరు.

అమ్మవారు అష్టాదశ పీఠములలో నొకరు.

**ఈ దేవాలయములో వివాహము చేసుకున్నట్లయిన, వివాహ బంధము శాశ్వతముగ నిలుస్తుందన్న నమ్మకము గల ఆలయము**

1) శ్రీలక్ష్మి జనార్థన స్వామి — పెనుగొండ
లక్ష్మిదేవి — పశ్చిమగోదావరి జిల్లా
పరమేశ్వరుడు — 15 కి మీ పాలకొల్లు

2) శ్రీ వాసవీ కన్యకా పరమేశ్వరి

3) నగరేశ్వరస్వామి

**ముందురోజు పెట్టిన గంధం మరునాటికి తడిఆరక ఉన్నటువంటి స్వామివారు**

నగరేశ్వర స్వామి — పెనుగొండ
మహిషాసుర మర్దిని

**లింగానికి ఎదురుగా నున్న చిన్న నందికి వెనుక భాగాన మరి రెండు పెద్ద నందులు ప్రక్క ప్రక్కనగల ఆలయము**

నగరేశ్వరస్వామి — పెనుగొండ
వాసవీ కన్యకా పరమేశ్వరి
(మొత్తము 3 నందులు కలవు)

**విజయదశమికి 102 కన్యకలచేత విశేషముగా కుంకుమ పూజలందుకొంటున్న అమ్మవారు**

శ్రీ వాసవీ కన్యకాపరమేశ్వరి అమ్మవారు — పెనుగొండ
పెనుగొండ అమ్మవారి జన్మక్షేత్రం.

## మధుకేశ్వర, సోమేశ్వర, భీమేశ్వర లింగాలుగల దేవాలయము

మధుకేశ్వరస్వామి | శ్రీముఖ లింగం
సోమేశ్వర స్వామి | శ్రీకాకుళం జిల్లా
భీమేశ్వరస్వామి | 56 కి మీ శ్రీకాకుళం
వంశధార నదీతీరము

ఈ లింగాల క్రిందిభాగములలో నిరంతరము నీరు ఊరుతూ ఉంటుంది. ఇక్కడ నున్న శబరుల కొరకై విప్ప చెట్టునుండి శివుడు సాక్షాత్కరించెనట. కోటిలింగాల క్షేత్రమని కూడ పిలుతురు.

## అరీశ్వరి, పునీశ్వరి దేవతలు వెలసిన పుణ్య క్షేత్రము

వీరభద్రుడు | పట్టిసీమ
భద్రకాళి | తూర్పుగోదావరి జిల్లా
అరీశ్వరి | 5 కి.మీ పోలవరం
పునీశ్వరి | రాజమండ్రి నుండి

బస్సుమీద గాని లాంచి మీదగాని ప్రయాణం

ఈ అమ్మవార్లిద్దరు దీర్ఘ సుమంగళీత్వాన్ని, సత్ సంతానాన్ని కలుగజేస్తారు. ఈ క్షేత్రము గోదావరి నదీ మధ్యమున ఎత్తైన మట్టిదిబ్బపై కలదు. ఈ క్షేత్రాన్ని వీరభద్ర క్షేత్రమని పిలుస్తారు.

## ముఖదర్శనం గల శివాలయం

మహేశ్వరుడు | శ్రీముఖ లింగం
(ముఖలింగేశ్వరుడు) | శ్రీకాకుళం జిల్లా
| 48 కి మీ. శ్రీకాకుళం

మూడు శిరస్సులతో కూడిన మహేశ్వరుని విగ్రహం గల శివలింగం ముఖ దర్శనం లింగమున గలదు. మోక్షదాయకం.

---

**ముంబాయి దగ్గర ఎలిపెంటా గుహలలో 3 ముఖములు గల్గిన శివుని విగ్రహం మాదిరి 3 ముఖములు గల శివలింగం గల ఆలయం**

శ్రీముఖ లింగేశ్వరుడు శ్రీముఖ లింగం

వంశధార నదీ తీరము

స్వామివారి మూడుముఖాలకు

1. శ్రీ ముఖ లింగేశ్వర స్వామి (మధుకేశ్వర స్వామి) 2 భీమేశ్వర స్వామి 3. సోమేశ్వర స్వామి అని పేర్లు

**ఏకపాది కాలభైరవుడు, త్రిపాది భృంగేశ్వరుడు గల ఆలయము**

శ్రీముఖ లింగేశ్వరుడు

శ్రీముఖ లింగము
48కి మీ శ్రీకాకుళం
శ్రీకాకుళం జిల్లా

**శబరి కులదైవముగా (గిరిజనుల దేవునిగా) ఆరాధించబడు స్వామివారు**

మధుకేశ్వరుడు శ్రీముఖలింగం

వంశధార నదీతీరం గిరిజన ప్రాంతం

ముఖ లింగేశ్వరుడు, సోమేశ్వరుడు, భీమేశ్వరుడు వెలసిన క్షేత్రము.

**2 ఏళ్ళకొకసారి వచ్చు గిరిజనుల ఇలవేల్పుల ఉత్సవం**

సమ్మక్క
(శాంభవి అవతారం)
సారలమ్మ

మేడారం
తాడ్వాయ్ మండలం
వరంగల్లు జిల్లా
110కి.మీ వరంగల్

బెల్లం ప్రసాదం, త్రాసులో వ్యక్తిని కూర్చుండబెట్టి బెల్లంతో తూచి ఆలయానికి ముడుపుగా సమర్పిస్తారు మాఘశుద్ధ పౌర్ణమికి (జనవరి నుండి - ఫిబ్రవరి) ఉత్సవం. ప్రోలేశ్వర, లక్ష్మీశ్వర ఆలయం గలదు.

**ప్రతిరోజూ పూజలేకుండా, కేవలం శనివారంనాడు మాత్రమే పూజ ఉన్నస్వామివారు**

నృసింహస్వామి — పెంచలకోన, 30కి.మీ. రాపూరు, రాపూరు తాలూకా, నెల్లూరు జిల్లా

చెంచీతను పెండ్లాడినందుకు కోపమొచ్చి లక్ష్మీదేవి శపించినందున

**ఉత్సవములు జరుగని శివస్వామి**

కోటీశ్వరుడు, గోదావరి నదీ తీరం — కోటిపల్లి, తూర్పు గోదావరి జిల్లా, 12కి.మీ. ద్రాక్షారామం

స్వామివారు యోగ లింగము పాతాళము నుండి యున్నది. ఇంద్రుడు అహల్యతో పొందిన సంగమ దోషాన్ని తొలగించు కొనుటకు లింగమును ప్రతిష్ఠించి, కోటి తీర్థములలోని జలములను తెచ్చి అభిషేకము జరిపించెను. ఇచ్చట సోమేశ్వరుడు, జనార్ధనస్వామి ఆలయములు గలవు ఇచ్చట అర్చనలు, అభిషేకాలేగాని వుత్సవాలు జరగవు.

**గోదావరి నది సాగర సంగమ స్థానమున వెలసిన ఆలయము**

సోమేశ్వరుడు — కోటిపల్లి

**పద్మాసనం వేసుకుని కూర్చుని ఉన్న శ్రీరాముడు**

శ్రీరాముడు (చతుర్భుజుడు), గోదావరి తీరం — భద్రాచలము, ఖమ్మం జిల్లా

సీతా, లక్ష్మణ, సమేతుడు

**ద్వార పాలకులు గుర్రాలమీద కూర్చుని ఉన్న ఆలయము**

శ్రీరామ చంద్రమూర్తి (చతుర్భుజుడు), సీతాదేవి, లక్ష్మణస్వామి — భద్రాచలము, ఖమ్మం జిల్లా

---

మానవునికివ్వబడిన జ్ఞానేంద్రియములు, కర్మేంద్రియములు భగవంతుని పంచోపచారములకే వినియోగించాలి పంచోపచారములు 1) గంధ, 2) పుష్ప, 3) ధూప, 4) దీప 5) నైవేద్యాలు

**మహానారాయణ యంత్రంపై ప్రతిష్ఠించబడిన హరి, హర, హిరణ్యాత్మకమైన విగ్రహం గల ఆలయం**

శ్రీవీరవెంకట సత్యనారాయణ స్వామి అన్నవరం
(సత్యదేవ) తూ.గో. జిల్లా

శృంగేరి పీఠము నుండి శ్రీ చక్రం కూడా తీసుకుని రాబడి, ప్రతిష్ఠించబడి పూజలనందుకొనుచున్నది.

**స్వామివారి విగ్రహముతో బాటు యంత్రానికి కూడా త్రికాల పూజ జరుగు ఆలయము**

శ్రీ వీరవేంకట సత్యనారాయణ స్వామి అన్నవరం
అనంతలక్ష్మి సత్యవతి అమ్మవారు

ఇచ్చుట ప్రతిష్ఠించిన యంత్రము భారతదేశంలోని ఏ ఇతర ఆలయములలో లేనిది.

**అధర్వణ వేదపు దేవర్షి శాఖకు చెందిన మహిమాన్వితమైన యంత్రం స్థాపించబడిన దేవాలయము**

శ్రీ వీరవేంకట సత్యనారాయణ స్వామి అన్నవరం
పంపానదీ తీరం
ఇచ్చుటనున్న యంత్రానికి, స్వామివారికి త్రికాలార్చనలు జరుగును

**"రత్నాచల"మనే కొండపై వేంచేసియున్న స్వామివారు**

శ్రీవీరవేంకట సత్యనారాయణ స్వామి అన్నవరం
అనంతలక్ష్మి
పంపానదీ తీరము

## సూర్య గడియారం (SUN DIAL) ఉన్న దేవాలయం

శ్రీవీర వేంకట సత్యనారాయణ స్వామి అన్నవరం
అనంతలక్ష్మి సత్యవతి

ఎండ సహాయముతో టైము తెలుసుకునే యంత్రము ఇచ్చట నిర్మించబడినది దేవాలయం నాలుగు చక్రాలున్న రథంలాగ నిర్మించబడినది. పంపానదీ తీరమున, అనంతగిరి (రత్నాచల) కొండపై, నాలుగు మూలల్లో ఆదిత్యుడు, అంబిక, గణనాధుడు, మహేశ్వరుల విగ్రహములున్నవి. భీష్మ ఏకాదశి, వైశాఖ ఏకాదశి రోజుల్లో కళ్యాణోత్సవములు, తెప్పోత్సవములు జరుగును. రామ, వనదుర్గ, కనకదుర్గాలయములు కలవు. స్వామివారి విగ్రహం అడుగుభాగములో శ్రీ చక్రం నెలకొల్పడం వల్ల జనాకర్షణ, ధనాకర్షణ కలిగినది.

## విష్ణు పంచాయత నాలనబడే 5 మూర్తులకు త్రికాలపూజ ఒకేసారి జరుగు ఆలయము

శ్రీ వీరవేంకట సత్యనారాయణ స్వామి అన్నవరము
1.మహేశ్వరుడు.
2 గణపతి
3.అంబిక
4 సూర్య భగవానుడు
5.సత్యమూర్తి

ఈ 5 విగ్రహములకు త్రికాల పూజలు ఒకేసారి జరుగుతూ ఉండటం విశేషము. ఇంకెక్కడా ఈ పద్ధతి కనిపించదు.

## విగ్రహానికి రెండు వైపులా పూజించు ప్రత్యేకత గల ఆలయము

చెన్నకేశవ స్వామి ర్యాలి
(ముందుభాగము) ఆత్రేయ మండలం
జగన్మోహిని తూర్పుగోదావరి జిల్లా
(వెనుక భాగము) రావులపాలెం నుండి బస్సు

విగ్రహమునకు 2 వైపుల నుండి పూజలు జరుగుచున్నవి. విగ్రహము సాలగ్రామ శిల.

---

దేవతా విగ్రహము లేని దేవాలయము పూజార్హతను ఎట్లా గోల్పోతుందో
ఆత్మలేని శరీరము అచేతన మౌతుంది

**సోమ సూత్రము (పాన మట్టమునుండి నీళ్ళు పోవు దారి) లేని పానమట్టముగల శివ లింగము**

కమండలేశ్వర స్వామి ర్యాలి
ఉమాదేవి

చెన్నకేశవ, జగన్మోహిని విగ్రహముగల ఆలయమునకు ఎదురుగా సుమారు ఫర్లాంగు దూరములో నున్న ఆలయము. అభిషేక జలము ఎంతపోసినా కనిపించని ప్రత్యేకత గలది

**కృష్ణా నదిలోనికి చొచ్చుకుని ఉండి, ఎంతటి వరదలు వచ్చినా చెక్కుచెదరని ఈశ్వరాలయము**

మోర్తోటేశ్వరుడు మోర్తోట
కృష్ణానదీ తీరము గుంటూరు జిల్లా
13కి.మీ. రేపల్లె.

సున్నం, ఇసుక కట్టుబడిగల పురాతన దేవాలయం. నదికి ఎంతటి ఉధృతమైన వరదలు వచ్చినా, దేవాలయం నదిలోనికి చొచ్చుకొని ఉన్నా, చెక్కుచెదరని ఆలయం. దేవాలయం చెంత నదీగట్టుపై పెద్ద మఱ్ఱిచెట్టు గలదు ఆ మఱ్ఱి చెట్టుక్రింద మునులు తపస్సు చేసేవారట.

**కుక్కకాటుకు గురైనవారు ప్రార్థించు స్వామివారు**

హనుమంతుడు పాతలింగంపల్లి
శేరి లింగంపల్లి మండలం
రంగారెడ్డి జిల్లా

రోగులు ప్రక్కన ఉన్న నూతిలో స్నానముచేసి, ప్రసాదాన్ని సేవిస్తే బాధ తగ్గుతుంది. నూతిలోని నీటిని మంత్రజలముగా భావిస్తారు. పూర్తిగా ఉపశమనం కల్గుతుంది.

**వెండితొండ, బంగారుబల్లి కలిగి, రెండవ'కంచి'గా పేరొందిన ఆలయము**

వరదరాజ స్వామి వరదరాజపూర్
మెదక్ జిల్లా
జగదేవపూర్ మండలం

వెండి తొండను ముట్టుకొనిన అపశకున దోషాలు, బంగారు బల్లిని ముట్టుకొన్న బల్లిపడే దోషాలు తొలగుతాయి.

---

కాశీనగరం శివుని యొక్క త్రిశూలముపై నున్నట్లే,
అయోధ్య విష్ణుమూర్తి యొక్క సుదర్శన చక్రముపై నున్నది

**శ్రీ మహాలక్ష్మి, మహాపార్వతి, మహాసరస్వతి అంశలేగాక బాలా త్రిపురసుందరి, రాజరాజేశ్వరి అంశలు కలిగి అష్టభుజాలతో మహిషాసుర మర్ధినిగా, మహిషాసురుని చంపిన భంగిమలో పరిపూర్ణ కళాకౌశలముతో స్వయంవ్యక్త మయిన కరుణామయిగల ఆలయం**

కనకదుర్గాదేవి — విజయవాడ

మల్లిఖార్జున స్వామి — కృష్ణాజిల్లా

కృష్ణానదీ తీరము

శక్తి పీఠములలో నొకటి.

**కనక వర్షం కురిపించిన అమ్మవారు**

కనకదుర్గ — విజయవాడ

విష్ణు కుండిన రాజైన మాధవవర్మ గొప్ప న్యాయపతి. ఆమహారాజ కుమారుడు వాహ్యాళికై రథముపై పోవ అతని రథము క్రింద ఒక పిల్లవాడు పడి మరణించెను. అతని తల్లి చింతచిగురు అమ్ముకొని బ్రతికే బీద స్త్రీ. ఆ స్త్రీ న్యాయభిక్షకై రాజభవన ప్రాంగణమున గల ధర్మగంటను మ్రోగించెను. న్యాయవిచారణ చేసి మహారాజు తన కుమారునికి మరణదండన విధించెను రాకుమారుడు ఉరితీయబడెను. ఆ మహారాజు న్యాయబుద్ధికి సంతసించి అమ్మవారు కనకవర్షం కురిపించెను రథము క్రింద చనిపోయిన కుమారుని, ఉరితీయబడిన రాకుమారుని బ్రతికించి అమ్మవారు "కనకదుర్గగా" వెలసినది.

2. శుంభ, నిశుంభులనే రాక్షసులను అమ్మవారు దునుమాడినందున దేవతలు సంతసించి కనకవర్షం కురిపించిరి. అమ్మవారు కనకదుర్గ అయినది

అమ్మవారికి గల ఎనిమిది చేతులలో : 1. అరి 2. శంఖ 3. కేత 4 పాశం 5. శూలం 6. అంకుశం 7. మౌర్వి 8. శాపక మనే దివ్యాయుధములున్నవి. మహిషాసురుని సంహరించే భంగిమలో దర్శనం. దసరా రోజులలో రోజుకో అలంకరణ.

సహస్రనామాలు, అష్టోత్తర నామార్చనలు, ఖడ్గ నామార్చనలు, లక్ష కుంకుమార్చనలు ప్రతిరోజూ జరుగును.

**ఆంధ్ర ప్రదేశ్‌లో అలంకారమునకు ప్రత్యేకత సంతరించుకున్న శివాలయం**

అర్ధనారీశ్వరుడు — విజయవాడ
కృష్ణా జిల్లా
మొగల్‌రాజపురం

విష్ణు కుండినుల కాలం నాటి పురాతన ఆలయమున అర్ధనారీశ్వర స్వామివారి అలంకరణకు ఆలయ ధర్మకర్తలు (నాగేశ్వరరావు, సుజాత దంపతులు) ప్రత్యేకశ్రద్ధ తీసుకొనుట ముదావహము.

---

హిందువులకు పూజనీయమైనవి 1) తులసి 2) శంఖం 3) సాలగ్రామం 4) గోవు 5) గంగ

**పాశుపతాస్త్రాన్ని అర్జునుడు శివునినుండి పొంది, విజయ చిహ్నముగా ప్రతిష్ఠించిన లింగము**

విజయేశ్వర స్వామి — విజయవాడ
కృష్ణాజిల్లా

ఈస్వామివారి పేరుమీదనే బెజవాడను విజయవాడగా మార్చిరని చెప్పుదురు.

**పరమశివుడు మానవునికి సువర్ణాభి షేకము చేసిన పవిత్ర స్థలము**

మల్లేశ్వరస్వామి — విజయవాడ
కనకదుర్గ — కృష్ణాజిల్లా

మాధవవర్మ అని పిలువబడే మహారాజు యొక్క ధర్మ పాలనకు, తీర్పునకు ఆనందించి, స్వామివారు కనకాభిషేకముగా సువర్ణములు కురిపించిరి.

**ఆంధ్రప్రదేశ్‌లో నున్న "జలధీశ్వరాలయములు"**

జలధీశ్వరుడు
జలధీశ్వరి
(పార్వతీ పరమేశ్వరులు)

1. ఘంటసాల
(కృష్ణాజిల్లా)
2. ఏలూరు
దొంగల మండపందగ్గర
పశ్చిమ గోదావరి జిల్లా

ఘంటసాల లోని ఆలయములో స్వామివారు, అమ్మవారు ఒకే పానమట్టముపై వెలసిరి. ఏలూరులోని స్వామివారిని "జరాపహరేశ్వరుడు" అనికూడా పిలుస్తారు. ఇచ్చట నున్న రాతినంది ఎడమకాలికి ఇనప కడియం ఉన్నది.

**కృష్ణానది సాగర సంగమం చేసే చోటనున్న దేవాలయం**

శ్రీ వేణుగోపాల స్వామి — హంసల దీవి
దివి తాలూకా
కృష్ణాజిల్లా
20కి.మీ. అవనిగడ్డ

అతి ప్రాచీన దివ్య క్షేత్రము. మాఘపౌర్ణమికి కళ్యాణ సప్తాహం జరుగుతుంది.

---

తుంబురుని వీణ పేరు కళావతి, నారదుని వీణ పేరు మహతి, సరస్వతీ దేవి వీణపేరు కచ్ఛపి

**వీరశైవానికి ప్రతీకగా ఆలయమునకు 8మూలల్లో అష్ట భైరవుల విగ్రహములున్న ఆలయము**

మల్లిఖార్జున స్వామి — శ్రీ శైలం
భ్రమరాంబ — కర్నూలు జిల్లా
51కి.మీ. డోర్నాల
నందికొట్కూరు తాలూకా

**త్రాసులోని ఒక సిబ్బిలో ఈశ్వరుడు, వేరొక సిబ్బిలో మిగతా దేవుళ్ళనందరినీ ఉంచి తూచినట్లు శిల్పముగల ఆలయం**

మల్లిఖార్జున స్వామి — శ్రీ శైలం
భ్రమరాంబ

**ద్విపాదులతోను, చతుష్పాదులతోను చంపబడకుండా వరము పొందిన అరుణాసురుడనే రాక్షసుని షట్పాది అయిచంపిన అమ్మవారు**

భ్రమరాంబ — శ్రీశైలం
(భ్రమరం - తుమ్మెద - ఆరుకాళ్ళు)

**ఛత్రపతి శివాజీ అమ్మవారి విగ్రహం చూచి తన్మయుడై ప్రాణత్యాగానికి (ఆత్మార్పణానికి) సిద్ధపడిన దేవాలయం**

భ్రమరాంబ — శ్రీ శైలము
కర్నూలు జిల్లా

1674లో ఛత్రపతి శివాజీ శ్రీశైల ఆలయమునకు ఒక ప్రక్క గాలిగోపురము కట్టించి, అమ్మవారికి అనేక ఆభరణములను కానుకగా నిచ్చెను. అంతేగాకుండా మహ్మదీయుల బారినుండి అనగా బహమనీ సుల్తానులనుండి ఈదేవాలయం ధ్వంసం కాకుండా కొంత సైన్యాన్ని చాలకాలం ఉంచెను. ఈనాటికీ మహారాష్ట్రులు చాలమంది ప్రతిసంవత్సరం అమ్మవారి దర్శనానికి వస్తూ ఉంటారు.

---

**"ఆది భిక్షువు" వాడు అని పిలువబడే దైవము, వెలసిన ఆలయము**

మల్లిఖార్జున స్వామి శ్రీ శైలం
భ్రమరాంబ
పార్వతీ దేవి

దేవాలయపు గోడలు బంగారు రేకులతో కప్పబడి యుండేవట విజయనగర ప్రభువులిచ్చిన మాన్యము లేమాయెనో, శివాజీ యిచ్చిన ద్రవ్య మేమాయెనో, అక్కన, మాదనలిచ్చిన 69గ్రామాలు ఎటుపోయెనో తెలియదుగానీ స్వామివారు యాత్రికులిచ్చు ద్రవ్యము పైనే ఆధారపడి యున్నారు

**కృష్ణానది బ్రహ్మగిరి, విష్ణుగిరి, రుద్రగిరుల గుండా ప్రవహిస్తున్నచోట వెలసిన ఆలయము**

మల్లిఖార్జున స్వామి శ్రీ శైలము
భ్రమరాంబ

ఇచ్చుట కృష్ణానదిని పాతాళగంగ యని పిలుతురు. నది చాల పల్లపు ప్రాంతమున ప్రవహించుచున్నది ఆలయము నుండి వెళ్ళువారు మెట్లపైనుండి చాలా క్రిందికి దిగవలయును.

**సంవత్సరానికి రెండు కళ్యాణములు జరిపించుకొను శివస్వామి**

మల్లి ఖార్జున స్వామి శ్రీ శైలము
భ్రమరాంబ
పార్వతీ దేవి

శివరాత్రికి భ్రమరాంబా దేవితో, సంక్రాంతికి పార్వతీదేవితో స్వామివారికి కళ్యాణము.

**అరుణాసురుడనే రాక్షసుని చంపిన అమ్మవారు**

భ్రమరాంబ శ్రీ శైలము
మల్లిఖార్జున స్వామి

భ్రమర (తుమ్మెద) రూపం ధరించి, రాక్షసుని చంపినది సతీదేవి "మెడ" భాగము పడినచోటు. అష్టాదశ పీఠములలో నొకటి

---

**"త్రిపాల" వృక్షం లేక "దత్తాత్రేయ" వృక్షం గల ఆలయము**

వృద్ధ మల్లిఖార్జున స్వామివారి ఆలయము ప్రక్కన గల — శ్రీ శైలము

వృక్షము మేడి, జువ్వి

రావి చెట్లు ఒకదానినొకటి పెనవేసుకుని ఉన్న ప్రత్యేకత

**వేణు గణేశుడు ఉన్న ఆలయం**

మల్లిఖార్జున స్వామి — శ్రీ శైలము

భ్రమరాంబ

**మహారాష్ట్ర వీరుడు ఛత్రపతి శివాజీ కానుక లర్పించి, ఒక గోపురాన్ని కట్టించిన ఆంధ్రప్రదేశ్‌లోని దేవాలయము**

భ్రమరాంబ — శ్రీ శైలము

మల్లిఖార్జున స్వామి

**"పాతాళ విఘ్నేశ్వరాలయం" గల క్షేత్రము**

పాతాళ విఘ్నేశ్వరుడు — శ్రీ కాళహస్తి
చిత్తూరు జిల్లా
40కి.మీ. తిరుపతి

శ్రీ కాళహస్తీశ్వర ఆలయానికి కొద్ది దూరములో గలదు. క్రింది భాగమున ఉన్నందున మెట్లుదిగి వెళ్ళవలసిన ఆలయము.

**63 నయనార్ల మూర్తులున్న దేవాలయం**

శ్రీ కాళ హస్తీశ్వరుడు — శ్రీ కాళహస్తి

జ్ఞాన ప్రసూనాంబ

**పడమర దిక్కుగా ముఖము ఉన్న విష్ణుమూర్తి యొక్క అవతారముగల ఆంధ్రప్రదేశ్‌లోని ఆలయం**

| | |
|---|---|
| శ్రీ కూర్మనాధుడు | శ్రీ కూర్మం |
| (కూర్మావతారం) | శ్రీ కాకుళం జిల్లా |
| | 14కి.మీ శ్రీకాకుళం |

**శ్రీ శంకరాచార్యులవారు, శ్రీ రామానుజా చార్యుల వారు, శీ మధ్వాచార్యుల వారు దర్శించిన పవిత్ర క్షేత్రము**

| | |
|---|---|
| శ్రీ కూర్మనాధుడు | శ్రీ కూర్మం |
| (విష్ణుమూర్తి కూర్మావతారము) | |

**వంశధార నది సాగర సంగమము చేయుచోట వెలసిన ఆలయము**

| | |
|---|---|
| విష్ణుమూర్తి | శ్రీకూర్మం |
| **(తాబేలు రూపములో)** | |

వంశధార, లాంగిలి నదుల మధ్యగల భూభాగం, రెండు కి.మీ దూరంలో వంశధార నది సముద్రములో కలియును.

**శని దోష పరిహారార్థం ప్రార్థింపబడు వైష్ణవ స్వామి**

| | |
|---|---|
| శ్రీ కూర్మనాధుడు | శ్రీ కూర్మం |
| **(విష్ణుమూర్తి)** | |

**ఆంధ్రప్రదేశ్‌లో ధర్మరాజుచే ప్రతిష్ఠించబడిన స్వామివారు**

| | |
|---|---|
| శ్రీ లక్ష్మీ నారసింహ స్వామి | మంగళగిరి |
| (కొండ క్రింద స్వామివారు) | గుంటూరు జిల్లా |
| | 13కి.మీ. విజయవాడ |

ఆంధ్ర దేశమున అతి ఎత్తైన గోపురము గల దేవాలయము.

---

108 లో -" 1 ' సంఖ్య అద్వితీయ పరబ్రహ్మకు '0' సున్నా - మాయకు, '8' సంఖ్య - అష్టప్రకృతులకు సూచకము

**నాలుగు యుగములలో నాలుగు రకాల ప్రసాదాలు సేవించు స్వామివారు**

పానకాల నృసింహ స్వామి — మంగళగిరి
హస్తిశృంగి పర్వతంపై

కృతయుగమున తేనె, త్రేతాయుగమున నెయ్యి, ద్వాపర యుగమున పాలు, కలియుగమున పానకం ప్రసాదం.

**కొండ గుహలో స్వామివారి ముఖము మాత్రమే తొలువబడి, ఏ ఇతర మూర్తులు (ఉత్సవ విగ్రహములతో సహా) గర్భగుడిలో లేని ఆలయము**

శ్రీ పానకాల నారసింహస్వామి — మంగళగిరి
(కొండలో స్వామివారు)

**దిక్కుల వైపు ముఖముగాకుండా నైఋతిమూలకు ముఖము ఉన్న దేవుడు**

పానకాల నృసింహ స్వామి — మంగళగిరి

దేవాలయ ముఖద్వారము తూర్పువైపునకున్నది. కానీ స్వామివారి ముఖము నైఋతి మూలకు ఉన్నవి.

**యావత్ఆంధ్రప్రదేశ్‌లో ఎత్తైన గోపురము గల ఆలయము**

పానకాల నృసింహస్వామి — మంగళగిరి

ఆలయమునకు గల గోపురము దక్షిణ భారత దేశములోగల ఎత్తైన గోపురములలో నొకటిగా భావించబడుచున్నది. ఈ గోపురము కొండ దిగువన ఉన్న ఆలయ ముఖద్వారము.

**ఎంత ఎత్తువారు స్వామివారిని దర్శిస్తే అంతెత్తులోనే స్వామివారి కండ్లు కనిపించు స్వామివారు**

శ్రీ లక్ష్మీనారసింహస్వామి — మంగళగిరి
(కొండక్రిందస్వామి)

**108 సాలగ్రామ శిలలు హారముగా గల నృసింహస్వామి ఆలయము**

శ్రీరాజ్యలక్ష్మి నరసింహస్వామి — మంగళగిరి

ఆంధ్రప్రదేశ్‌లో అతి ఎత్తైన గోపురముగల ఆలయము.

---

**ఇచ్చే ప్రసాదములో సగము మాత్రమే అరగించు స్వామి**

పానకాల స్వామి మంగళగిరి
(పన్నా నారసింహస్వామి)

బెల్లమును కరిగించి పానకమును తయారుచేసి స్వామివారికి నివేదింతురు. స్వామివారు కొండ మధ్యభాగములో గలరు. కొండక్రింద రామాలయం.

**ఆలయ ప్రధాన గోపురం వాలుతూండగా కోనేరుత్రవ్వి వాలుట నాపిన క్షేత్రము, వెలసిన స్వామివారు**

శ్రీ లక్ష్మీనారసింహస్వామి మంగళగిరి

ప్రధానగోపురం వాలుట చీకటికోనేరు త్రవ్విన మూలమున ఆగినది. మిగిలిన రెండు గోపురములు నిలచినవి. పశ్చిమ గోపురం నిలువని కారణంగా అసంపూర్తిగా నిర్మాణం ఆపవలసి వచ్చినది. కోనేరు త్రవ్వుటకు ప్రక్కగా ఖాళీ స్థలము లేదు. ఇది భౌగోళిక విశేషము.

**ఆంధ్ర ప్రదేశ్‌లో "కన్యాకుమారి" విగ్రహం ఉన్న ఆలయం**

జోగుళాంబ అలంపురం
తుంగభద్రా నదీ తీరము మహబూబ్ నగర్ జిల్లా
40కి.మీ. కర్నూలు బస్సు

జోగుళాంబ ఆలయములో జోగుళాంబ విగ్రహము ప్రక్కన.

**విష్ణుమూర్తి శివశక్తిని కూడగట్టుకుని హిరణ్య కశిపుని చంపినట్లున్న విగ్రహం గల ఆలయం**

షోడశబాహు నరసింహస్వామి అలంపురం
(నరసింహ + శివస్వామి)

## షోడశ బాహు నరసింహ మూర్తిగల ఆలయం, మూర్తి యొక్క ప్రత్యేకత

షోడశబాహు నృసింహస్వామి అలంపురం
(నరసింహ + శివ)

స్వామివారి ముఖం నరసింహం కానీ శివుని వలె మూడవ కన్ను గలది. కుడి ప్రక్కన సుదర్శన చక్రం ఎడమవైపున త్రిశూలం. కుడివైపున మకర కుండలం, ఎడమవైపున నాగాభరణం. చిన్ముద్ర కుడివైపున, బిల్వదళం ఎడమన, స్వామివారిని హరిహరుడు అని పిలుస్తారు. ఒక ప్రక్కన గణపతి, సూర్యనారాయణ, రెండవ ప్రక్కన దుర్గ, మహిషాసుర మర్థిని గలరు. స్వామివారి విగ్రహం హిరణ్య కశిపుని చంపునట్లుగా ఉంటుంది. ఇటువంటి ప్రత్యేకతలు గల విగ్రహం ఇంకెక్కడా కనిపించదు.

## అమ్మవారిని నేరుగా చూడక ప్రక్కగా తొంగి చూడవలసిన ఆలయం

జోగుళాంబ అలంపురం
అష్టాదశ పీఠాలలో నొకటి

నాలుక బయటకు చాపి అమ్మవారు భయంకరంగా ఉంటుంది. చిన్న గూడులో ప్రతిష్ఠించ బడివున్నది.

## వీరభద్రుడు వీణాగానం చేస్తూండగా, వినాయకుడు నాట్యం చేస్తూండగా ఆనందించి, శాంతించిన సప్తమాతృకలు గల ఆలయం

జోగుళాంబ అలంపురం
సప్త మాతృకలు

అంధకాసురుని సంహారము తరువాత వీరావేశములోనున్న సప్తమాతృకలను శాంతింపజేసిన వీరభద్రుడు, వినాయకుడు విగ్రహములు గల ఆలయం.

## నవ బ్రహ్మలున్న దేవాలయము

బాల బ్రహ్మేశ్వరుడు (శివలింగం) అలంపురము
జోగుళాంబ
అష్టాదశ పీఠములలో నొకటి
తుంగభద్రా నదీతీరము

నవబ్రహ్మలు : 1. తారక బ్రహ్మ. 2. స్వర్గబ్రహ్మ 3 పద్మబ్రహ్మ 4 బాలబ్రహ్మ 5. గరుడ బ్రహ్మ 6. కుమార బ్రహ్మ 7. అర్క బ్రహ్మ 8. వీరబ్రహ్మ 9. విశ్వబ్రహ్మ

**ఎన్ని బిందెల నీటితో అభిషేకము చేసినా ఒక్క చుక్క నీరుకూడా బయటకు రాదు**

బాల బ్రహ్మేశ్వరుడు అలంపురము
(శివ లింగము)
తుంగభద్రానదీ తీరము

**పసరులు, మూలికలు ఇసుకతో కలిపి, చేయబడిన వినాయక విగ్రహము గల ఆలయము**

రససిద్ధి వినాయకుడు అలంపురం

జోగుళాంబ గుడిలో వెలసిన స్వామి. విగ్రహము తాకుటకు గరుకుగా ఉంటుంది.

**జమదగ్ని మహర్షి భార్య రేణుకామాతను ఎల్లమ్మ, భూదేవిగా పూజించు ఆలయము**

ఎల్లమ్మ అలంపురము
భూదేవి

ఈ విగ్రహములు జోగుళాంబ ఆలయములో వెలసివున్నవి.

**కాశీ క్షేత్రములో వలె ఆంధ్ర దేశమున గూడ చనిపోయే ముందు శయనింపజేసిన మందిరము, ఆత్మ శివ సాయుజ్యము చేరునన్న నమ్మకముగల క్షేత్రము**

శ్రీ కాళ హస్తీశ్వరుడు శ్రీ కాళ హస్తి
చిత్తూరు జిల్లా
40కి.మీ. తిరుపతి.

ఈ క్షేత్రమును "దక్షిణ కాశి' అని పిలుతురు. ఇచ్చట "మణి కుండేశ్వరాఖ్య'' మను మరియొక మందిరము కలదు. మరణ మాసన్న మగువారిని తెచ్చి ఈ మందిరమున శయనింపజేతురు. కాశీ క్షేత్రములో వలె ఇచ్చట కూడా అంత్య కాలమున పరమశివుడు ఓం కార మంత్రమును, తారక మంత్రమును ఉపదేశించి జీవులకు ముక్తినొసంగునని నమ్మకము.

**గుండ్రముగా గాక చతురస్రముగా నున్న లింగము**

శ్రీ కాళ హస్తీశ్వరుడు శ్రీ కాళహస్తి
వాయు లింగము

**లింగానికి ఎదురుగా ఉన్న దీపం రెపరెపలాడుతూ ఉంటుంది**

శ్రీకాళ హస్తీశ్వరుడు — శ్రీ కాళహస్తి
వాయులింగము

దేవాలయము చాలా పెద్దది. అయిననూ గాలి చొరబడకుండా, వెలుతురు లేకుండా గర్భాలయము చీకటిగా ఉంటుంది. గాలివచ్చే అవకాశము లేనేలేదు. కానీ లింగమునుండి వచ్చు గాలికి ఎదురుగా ఉన్న దీపం రెపరెపలాడుతూంటుంది. స్వామివారు వాయులింగ మనడానికి నిదర్శనము.

**రాహు, కేతు క్షేత్రముగా పిలువబడు క్షేత్రము, వెలసిన ఆలయము**

శ్రీ కాళహస్తీశ్వరుడు — శ్రీకాళహస్తి
జ్ఞాన ప్రసూనాంబ
(దక్షిణ కైలాసం)

**కాళ్ళకు సంకెళ్ళువేయబడి ఉన్న అమ్మవారు**

దుర్గా భవాని — శ్రీకాళ హస్తి
సువర్ణ ముఖీ నదీ తీరం

ఉగ్ర రూపిణి ఐన అమ్మవారు రాత్రులు విహరిస్తూ జీవహింస చేస్తున్నందున స్వామివారు బంధించి కదలకుండ చేసిరి.

**తిరుపతి శ్రీ వేంకటేశ్వరుని చెల్లెలు వెలసిన ఆలయము**

జ్ఞాన ప్రసూనాంబ — శ్రీ కాళహస్తి
(శ్రీకాళ హస్తీశ్వరుని ఆలయములో)

**లింగాన్ని తాకకుండా (పూజారి చేయితాకకుండా) అభిషేకము జరుగు ఆలయం**

శ్రీ కాళ హస్తీశ్వరుడు — శ్రీ కాళహస్తి

మూలవిరాట్‌ను తాకకుండా అభిషేకము జరుగుతుంది. గంధం, పువ్వులు జంధ్యం వగైరా పూజలు ఉత్సవమూర్తికే. హారతి కర్పూరం, పచ్చ కర్పూరం, పాలు అభిషేకము మూలవిరాట్‌కు చేయి తాకకుండా జరుగుతుంది.

---

**"సత్యమహా భాస్కర" క్షేత్రము**

శ్రీకాళహస్తీశ్వరుడు శ్రీ కాళహస్తి
జ్ఞాన ప్రసూనాంబ

ఈ క్షేత్రాన్ని 1 దక్షిణ కైలాసము 2 సద్యోముక్తి క్షేత్రము 3. శివానందైక నిలయము అని కూడా పిలుస్తారు

**దేవాలయ ముఖము దక్షిణానికి, దేవుని ముఖము ఉత్తరం వైపు, అమ్మవారి ముఖం తూర్పువైపు ఉన్న ఆలయం**

శ్రీ కాళహస్తీశ్వరుడు శ్రీ కాళహస్తి
జ్ఞాన ప్రసూనాంబ

స్వామివారిని "దక్షిణామూర్తి" అనికూడా పిలుతురు.

**స్వర్ణముఖి నది ఉత్తర వాహినిగా ప్రవహించుచోట వెలసిన ఆలయం**

శ్రీ కాళహస్తీశ్వరుడు శ్రీ కాళహస్తి
జ్ఞాన ప్రసూనాంబ

ఈ క్షేత్రమున శ్రీ ఆదిశంకరాచార్యుల వారు శ్రీ భువనేశ్వరీ చక్రమును స్థాపించిరి.

**ఆలయ ముఖద్వారాలున్న నాలుగు చోట్లా నాలుగు నందీశ్వరులు గల ఆలయం**

కాళేశ్వరుడు కాళేశ్వరం
ముక్తేశ్వరుడు కరీంనగర్ జిల్లా
గోదావరి నదీతీరం 15కి మీ మహదేవపురం
మహదేవపురం తాలూకా

**లింగము పైనున్న 2 నాసికా రంధ్రములలో అభిషేక జలం ఎంత పోసినా బయటకు రాదు**

కాళేశ్వరుడు కాళేశ్వరం
ముక్తేశ్వరుడు

---

కలియుగ లక్షణములు 1) దీనబుద్ధి గలవాడు దరిద్రుడగ మారును 2) లోభి ధనికుడగును 3) పాపి చిరాయుష్కుడగును 4) పుణ్యాత్ముడు అల్పాయుష్కుడగును 5) జ్యేష్ఠకులస్తుడు సేవకుడగును 6) హీనకులస్థుడు రాజగును

**ఆంధ్రప్రదేశ్‌లో 5 నదుల సంగమ స్థానమున వెలసిన క్షేత్రము**

కాళేశ్వరుడు కాళేశ్వరము
ముక్తేశ్వరుడు

ప్రణీత, వరద, వైన్య, గోదావరి, సరస్వతి నదుల సంగమం.

**రెండు నాసికా రంధ్రములతో వెలసిన శివలింగము**
**(భారత దేశములో ఎక్కడా లేనిరీతిలో)**

కాళేశ్వరుడు కాళేశ్వరము
గోదావరీ నదీ తీరం

ఈ రెండు రంధ్రములలో ఎంత అభిషేక జలము పోసినా బయటకు రాదు. దగ్గరలోనున్న గోదావరి నదిలో కలియును.

**రాతి స్తంభముపై నున్న రాతి నందీశ్వరుడు దక్షిణాయనమున దక్షిణాభి ముఖుడుగాను, ఉత్తరాయనమున ఉత్తరాభి ముఖుడుగాను ఉండు ఆలయం**

కాళేశ్వరుడు కాళేశ్వరము
ముక్తేశ్వరుడు

**సంవత్సరానికి ఒకసారి సూర్యపూజ జరుగు ఆలయం**

వేదారణ్యా స్వామి నాగలాపురం
65కి.మీ. తిరుపతి
చిత్తూరు జిల్లా

ప్రతి సంవత్సరం మార్చి నెలలో సూర్యపూజ జరుగుతుంది. సూర్యకిరణాలు స్వామివారి పాదములపై, నడుముపై, ముఖముపై ఉత్సవం రోజున పడతాయి.

---

పుత్రుని 5 సంవత్సరముల వయస్సు వచ్చువరకు భగవంతునిగాను, తరువాత 10 సంవత్సరములు సేవకుని గాను, తరువాత స్నేహితునిగాను చూడవలెను

**ఏడు శిరస్సులుగల పాము పడగ క్రింద గుండ్రని పాము మూడు చుట్టలు పానమట్టముగా గల శివలింగము**

వీరభద్రుడు | లేపాక్షి
వెలసిన ఆలయం | అనంతపురం జిల్లా
20కి మీ హిందూపురం

అసంపూర్తి దేవాలయం, ఆదిశేషుని పడగక్రింద వెలసిన నల్లని శివలింగము పాము చుట్టలు బీటలు వేసివున్నవి.

**విజయవాడలో కాకుండా ఆంధ్రప్రదేశ్‌లో వేరొకచోటనున్న కనకదుర్గ విగ్రహం**

వీరభద్రుడు | లేపాక్షి

ఈ ఆలయములోని మండపములోని స్తంభములో ఏటవాలుగా అమ్మవారి విగ్రహం, (కనకదుర్గ) రాతితో చెక్కబడి యున్నది అమ్మవారి దర్శనార్థం ఎదురుగా నిలువుటద్దము కలదు.

తూర్పుగోదావరి జిల్లాలోని అన్నవరములో వేంచేసియున్న శ్రీ వీర వేంకట సత్యనారాయణ స్వామివారి ఆలయములోకూడ కనకదుర్గ విగ్రహం కలదు

**ఆంధ్ర ప్రదేశ్‌లో వాస్తు శాస్త్రాను సారముగా నిర్మించబడని శివాలయం**

శ్రీ వీరభద్రుడు | లేపాక్షి

ఈ ఆలయాన్ని పాపనాశేశ్వర స్వామివారి ఆలయం అనికూడా పిలుస్తారు 7 చిన్న గుడులు కలిపి కట్టవలసినందున, తాబేలు ఆకారమైన గుట్టమీద కట్టవలసి వచ్చినందున, అసంపూర్తిగా మిగిలి పోయినందున. ముఖద్వారం ఉత్తరదిక్కు. లోపలికి వెళ్ళిన తరువాత కుడిప్రక్కకు వెడితే ధ్వజస్తంభం, దాని తరువాత బలిపీఠం ఉన్నాయి. తరువాత ఎడమ ప్రక్కగానున్న మెట్లపై నుండి వెడితే గాని ఆలయ ప్రవేశం వీలుగాదు

### ఆలయం కట్టిస్తూండగా కళ్ళు పోగొట్టుకొన్న అమాత్యుడు, కట్టించిన ఆలయం, ప్రతిష్ఠించబడిన స్వామివారు

శ్రీ వీరభద్ర స్వామి లేపాక్షి

విజయనగర సామ్రాజ్యాన్ని శ్రీ అచ్యుత దేవ రాయలు పాలిస్తున్న రోజులలో కోశాధికారిగా నున్న విరూపన్న రాజ ద్రవ్యముచే ఆలయ నిర్మాణము గావించుచుండెను ద్రవ్యాపహరణ కారణాన రాజాజ్ఞ ప్రకారం విరూపన్న కండ్లు తీసివేస్తారని విరూపన్నే తన కండ్లను తీసివేసి ఆలయ గోడకేసి కొట్టినట్లు గాథ. అక్కడనున్న గోడపైగల రక్తపుధారలు (ఎర్రని) ఈ గాథకు ఆధారముగా మిగిలినవి. ఈ విధముగా కండ్లు లేనివారు కట్టించిన ఆలయం "లేపాక్షి" గా నిలిచి పోయినది.

### కట్టించినవారి చిత్రాలతో బాటు, వారి కుటుంబ చిత్రాలు కూడా మండపం కప్పుపై చిత్రించబడి ఉన్న ఆలయం

శ్రీ వీరభద్ర స్వామి లేపాక్షి

విరూపన్న, వీరణ్ణ, వారి కుటుంబీకుల చిత్రాలు కలవు.

### ఒక స్తంభముపై పద్మినీ జాతి స్త్రీ, మరొక వైపు వాస్తుపురుషుడైన పాంచాలుని విగ్రహాలు గల ఆలయం

శ్రీ వీరభద్ర స్వామి లేపాక్షి

### చాలా పెద్దదైన ఒకేఒక పాదం ఊయల మండపం వద్దగల ఆలయం

శ్రీ వీరభద్ర స్వామి లేపాక్షి

ఈ పాదాన్ని ఆంజనేయ స్వామి వారిపాదముగాను, సీతాదేవి పాదముగాను భావిస్తారు. పాదపు బొటన వ్రేలు వద్ద నీరు ఊరుతూంటుంది.

---

స్త్రీకి పురుషుని కంటే ఆహారము రెండు పాళ్ళు, బుద్ధి నాలుగు పాళ్ళు, ధైర్యము ఆరుపాళ్ళు, కామము 8 పాళ్ళు అధికము

**కొడుకు గొప్పతనాన్ని తల్లి పొగడి నందున చిట్లిపోయిన విగ్రహము గల ఆలయము**

వీరభద్రుడు లేపాక్షి
పాప నాశేశ్వరుడు
రఘునాధుడు
(శ్రీరాముడు)

ఆలయం బయట నాగలింగము గలదు. 7 శిరస్సులు గల పాము చుట్టలో ప్రతిష్ఠించబడిన నల్లని శివలింగము. సరిదిద్దడానికి వీలుకాని విధముగా పాముచుట్ట పగిలి పోయినది. శిల్పి గొప్పతనాన్ని తల్లి పొగడినందున.

**పరమశివుని చతుర్దశ మూర్తులున్న మండపము గల ఆలయము**

వీరభద్రుడు లేపాక్షి

లింగోద్భవ మూర్తి, దక్షిణామూర్తి, కళ్యాణసుందర మూర్తి వగైరా మూర్తులుగలవు.

**నాట్య మండపం పై కప్పపై మనుచోళుని కథను చిత్రించిఉన్న ఆలయం**

వీరభద్ర స్వామి లేపాక్షి

మనుచోళుడు చోళవంశపు రాజు. న్యాయపాలనకు ప్రసిద్ధి చెందిన వాడు. రాజకుమారుని రథం క్రింద ఒక ఆవుదూడ చనిపోతుంది. ఆవు వచ్చి న్యాయం అర్థించగా, న్యాయవిచారణ చేసి దూడ ఏవిధముగా చనిపోయినదో అదేవిధముగా మరణశిక్ష రాజకుమారునికి అమలు పరచవలసినదిగా ఆదేశిస్తారు. రాజు యొక్క ధర్మనిరతికి మెచ్చి పార్వతీపరమేశ్వరులు ప్రత్యక్షమై ఆవుదూడను, రాకుమారుని బ్రతికిస్తారు.

**నూనె, నువ్వులతో అభిషేకము చేయబడు ఈశ్వరాలయము**

మందేశ్వరస్వామి (శివలింగము) — మందపల్లి, తూర్పుగోదావరి జిల్లా, 5 కి.మీ. రావులపాలెం కొత్తపేటకు వెళ్ళు త్రోవలో

సూర్యకుమారుడైన శనీశ్వరునిచే ప్రతిష్ఠించబడిన శివలింగము. అశ్వధుడు, పిప్పలుడు అను క్రూర రాక్షసులను ప్రజాక్షేమమునకై శనీశ్వరుడు చంపి, పాప పరిహారార్థము శివలింగ ప్రతిష్ఠ చేసి పూజించెను. శని త్రయోదశి నాడు నూనె, నువ్వులతో అభిషేకము. ఇచ్చట నున్న ఇతర దేవతలు, పార్వతి, బ్రహ్మేశ్వరుడు, నాగేశ్వరుడు, వేణుగోపాలస్వామి. శనీశ్వరాలయముగా చలామణి అగుచున్నది.

**"కూర్మిశైలం" అని పిలువబడే ఎత్తైన గుట్టపై వెలసిన ముఖ్యమైన దేవతలు**

వీరభద్రుడు — లేపాక్షి
పాపనాశేశ్వర స్వామి
రఘునాధజీ
(శ్రీరాముడు)

ఈ ఆలయం "కూర్మిశైలం" అనే ఎత్తైన గుట్టపై నిర్మించబడినది. ఇచ్చట కళ్యాణ మండపము వగైరా అసంపూర్ణ నిర్మితములు. రోడ్డుకావలిప్రక్కన నంది, గర్భగుడిబయట నాగలింగము, అసంపూర్ణ కళ్యాణ మండపము గమనిస్తే విపరీత పరిణామాల మూలాన నిర్మాణము ఆగినట్లు గోచరిస్తుంది.

**పై కప్పునుండి వ్రేలాడే పెద్ద రాతి స్తంభము (అంతరిక్ష స్తంభము) గల ఆలయము**

వీరభద్రస్వామి — లేపాక్షి
కనకదుర్గ

స్తంభం క్రింది నుండి వార్తా పత్రికనుగాని, సన్నని వస్త్రముగాని తీసుకుని రావచ్చును. ఈ స్తంభము చతురస్రాకారముగా ఉన్న చాల బరువైన ఒకేరాతితో చేయబడినది. స్తంభము నిండా శిల్ప కళయే ఇంతటి బరువుగల రాతి స్థంభము నేల ఆధారము లేకుండా నిలుచుట ఆశ్చర్యకరము.

---

వట్టి చేతులతో పోరాదు 1) అగ్ని, 2) నూతనగృహము 3) పుణ్యక్షేత్రము 4) గర్భిణి స్త్రీ 5) బాలురు 6) వృద్ధులు 7) రాజుల వద్దకు వెళ్ళునపుడు

## మంత్రి విరూపన్న కట్టిస్తూ ఉండగా కళ్ళు పోగొట్టుకొన్న దేవాలయము

వీరభద్రుడు లేపాక్షి

పూర్ణశిలపై

1. లేని అక్షి - లేపాక్షి కట్టించిన విరూపన్న మంత్రి కళ్ళు లేకుండా పోయినందున
2. శ్రీరాముడు జటాయువును "లే" "పక్షీ" అని సంబోధించుటచే లేపాక్షి అయినది.
3. కళ్ళకు లేపనము రాసుకుంటే ఎంత హాయిగా ఉంటుందో ఇక్కడ ఉన్న శిల్పాలను చూస్తూఉంటే అంత హాయిగా ఉంటుందని "లేపాక్షి" అని పేరు వచ్చినది.

## అతి పెద్ద నందిగల క్షేత్రము

వీరభద్రుడు లేపాక్షి

లేపాక్షి బసవయ్య

ఎర్రని రాతినంది

17' ల ఎత్తు, 20' ల పొడవు.

అడవి బాపిరాజు గారు "లేపాక్షి బసవయ్య లేచిరావయ్యా" అని పిలిచి యున్నారు. విజయనగర రాజులు అచ్యుత రాయలు వద్ద కోశాధికారులుగా ఉన్న విరూపన్న, వీరన్నలు చెక్కించిన నంది. అతిసుందరమైనది, పెద్దది.

## నాట్యాచార్యుడైన "భృంగి" 3 కాళ్ళతో, తలపై కొప్పుతో, జడతో నర్తిస్తున్న ఆలయం

వీరభద్రస్వామి లేపాక్షి

యావద్భారత దేశ శిల్పకళలో నాట్యాచార్యునికి గల ప్రత్యేకత. శివునిపై ఎక్కువ భక్తి భావము చూపెడుతున్నాడన్న ఈర్ష్యతో భృంగిమహర్షిని పార్వతీ అమ్మవారు "చిక్కి, శల్యుడు గావలసింద"ని శపించగా, శివుడు విషయము తెలుసుకుని మహర్షి నిలువ బడుటకు ఆధారముగా మూడువకాలు నొసంగెను.

---

వ్యర్థములు 1) తల్లిలేని పిల్లలు 2) భార్యలేని యవ్వనము 3) శాంతము లేని తపస్సు 4) పులుసు లేని భోజనము

**ఒక చెట్టు ఆకులమీద ఆంజనేయ విగ్రహం కనిపిస్తుంది**

రామగిరి అడవులు

రామగిరి
కరీంనగర్ జిల్లా

రామగిరి అడవులు ఔషధమూలికలకు ప్రసిద్ధి. ఇక్కడ దొరికినన్ని మూలికలు దక్షిణ భారతదేశములో ఇంకెక్కడా దొరకవు. ఆంజనేయ స్వామి వారి విగ్రహం ఉన్న ఆకులను అడవిలో నుండి కోయవాళ్ళు తీసుకుని వచ్చి చూపిస్తూ ఉంటారు.

**ఘంటము పట్టని కవి, కాషాయం కట్టని యోగి జీవసమాధి గల క్షేత్రము**

వేమనయోగి

కటారు పల్లె
కదిరి తాలూకా
అనంతపురం జిల్లా

**మొగలిపువ్వు రేకు, హంసగుర్తు గల లింగము**

లింగోద్భవ స్వామి

చెందవోలు,
గుంటూరు జిల్లా
భట్టిప్రోలు నుండి
తెనాలి మీదుగా బస్సు

లింగోద్భవ సమయమున శివుడు లింగరూపమును దాల్చగా విష్ణుమూర్తిని, బ్రహ్మదేవుని లింగము యొక్క తుది, మొదలు తెలిసికొనవలసినదని శివుని ఆజ్ఞ. ఆవు, మొగలిపువ్వు బ్రహ్మకు సహాయము చేసి పూజార్హతను పోగొట్టుకొన్నవి.

# ఆంధ్రప్రదేశ్

## (ఇతర ప్రముఖాలయములు)

| | |
|---|---|
| 1. సంగమేశ్వర స్వామి<br>సంగమేశ్వరి | సంగం జాగర్లమూడి<br>గుంటూరు జిల్లా<br>తెనాలికి దగ్గరలో |
| 2. చౌటేశ్వర స్వామి<br>"అష్టదిగ్బంధన" చేయ<br>బడిన ఆలయం | మోపర్రు<br>గుంటూరు జిల్లా |
| 3. మహంకాళి | మోరంపూడి<br>గుంటూరు జిల్లా |
| 4. అగస్తేశ్వర్<br>(అగస్త్యర మహర్షి ప్రతిష్ఠ)<br>చాలా పురాతన దేవాలయము | భువనగిరి<br>నల్గొండజిల్లా |
| 5. బుగ్గా రామలింగేశ్వరుడు<br>చింతల వేంకటేశ్వరుడు<br>పినాకిని నదీ తీరం | తాడిపత్రి<br>52 కి.మీ అనంతపురం<br>73 కి.మీ గుంటకల్,<br>అనంతపురం జిల్లా |
| 6. శ్రీ వేంకటేశ్వరుడు<br>పద్మావతి<br>లక్ష్మీదేవి<br>ఎదురుగా గరుత్మంతుని,<br>నాగేశ్వర విగ్రహములు గలవు.<br>పెద్ద కళ్యాణ మండపము కలదు | తెనాలి<br>గ్రామం చివర<br>గుంటూరు జిల్లా |

---

పుణ్యప్రదము 1) గంగా నదిలో ఒకసారి స్నానము 2) సరస్వతీ నదిలో మూడు రోజుల స్నానము 3) యమునా నదిలో వారం రోజుల స్నానము 4) నర్మదానదిలోని నీటిని చూచినంతనే

| | | |
|---|---|---|
| 7. | రఘునాయకుడు<br>సీత<br>లక్ష్మణుడు<br>ఆంజనేయుడు | ఏలూరు<br>కృష్ణా జిల్లా<br>కృష్ణా నదీ తీరం |
| 8. | భీమేశ్వరుడు<br>బాలా త్రిపుర సుందరి<br>వేణుగోపాల స్వామి<br>ఆలయం ప్రక్కన | మొవ్వ<br>కృష్ణా జిల్లా<br>8 కి.మీ. చల్లపల్లి |
| 9. | వేణుగోపాల స్వామి<br>రుక్మిణి<br>సత్యభామ | ఘంటసాల<br>కృష్ణా జిల్లా<br>5 కి.మీ. చల్లపల్లి<br>జలధీశ్వరాలయం ప్రక్కన |
| 10. | జనార్దన స్వామి<br>గోదావరి నదీ తీరం<br>2 అగస్త్యేశ్వర స్వామి 3. అంకాళమ్మ | ధవళేశ్వరం<br>3 కి.మీ. రాజమండ్రి<br>తూర్పుగోదావరి జిల్లా |
| 11. | సాత్విక నారసింహ స్వామి<br>(కొండపైన స్వామివారు)<br>లక్ష్మి నారసింహ స్వామి<br>(కొండ క్రింద)<br>కొండ గ్రామానికి 5 కి.మీ | కోరుకొండ<br>తూర్పు గోదావరి జిల్లా<br>20 కి.మీ. రాజమండ్రి |
| 12. | వరద గోపాల స్వామి<br>గోదావరి నదీ తీరం | కొవ్వూరు<br>పశ్చిమ గోదావరి జిల్లా |

| | | |
|---|---|---|
| **13.** | పైడితల్లి | విజయనగరం |
| **14.** | బాల చాముండిక<br>శక్తి పీఠం | అమరావతి<br>గుంటూరు జిల్లా |
| **15.** | శ్రీ వాసవీ కన్యకా పరమేశ్వరి<br>నగరేశ్వర స్వామి | పెనుగొండ<br>పశ్చిమ గోదావరి జిల్లా |
| **16.** | అలమేలుమంగ<br>బాలాజీ | తిరుచానూర్<br>5 కి.మీ తిరుపతి |
| **17.** | మహంకాళి | సికిందరాబాద్<br>జనరల్ బజార్ వెనుక |
| **18.** | ఎల్లమ్మ<br>భోనాల పండుగ ప్రత్యేకత | నిజామాబాద్<br>జండా గల్లీలో |
| **19.** | వేణుగోపాల స్వామి<br>రాజ్యలక్ష్మి | సింగిస్ కాన్ పేట<br>ఎడ్లపాడు మండలం<br>గుంటూరు జిల్లా |
| **20.** | హటకేశ్వరుడు | సింగుపురం<br>శ్రీకాకుళం జిల్లా |
| **21.** | రామలింగేశ్వరుడు | పడపర్తి<br>అనపర్తి మండలం<br>తూ. గో జిల్లా |

| | | |
|---|---|---|
| 22. | సిద్ధి వినాయకుడు | పులగుర్త<br>తూ. గో. జిల్లా |
| 23. | శ్రీ వేంకటేశ్వర స్వామి | తిరుమలై గుట్ట<br>కార్యాలయ మండలం<br>వరంగల్ జిల్లా |
| 24. | వల్లూరమ్మ<br>(ఉల్కా ముఖి) | వల్లూరు<br>8 కి.మీ. ఒంగోలు<br>ప్రకాశం జిల్లా |
| 25. | ప్రసన్నాంజనేయ స్వామి | మెదక్<br>చమన్ వీధి<br>మెదక్‌జిల్లా |
| 26. | పంచముఖ ఆంజనేయ స్వామి<br>1. కపి ముఖం<br>2. నారసింహ ముఖం<br>3. వీర గరుడ<br>4. సూకరం<br>5. హయగ్రీవం | 1. గేసు కొండ<br>వరంగల్ జిల్లా<br>2. సంత నూతలపాడు<br>సంత నూతలపాడు మండలం<br>ప్రకాశం జిల్లా |
| 27. | శ్రీ వేంకటేశ్వర స్వామి | అన్నపురెడ్డి పల్లి,<br>29 కి.మీ. సత్తుపల్లి<br>ఖమ్మం జిల్లా |
| 28. | శ్రీరాముడు<br>సీతాదేవి | వాడ్రేవుల పల్లి<br>సి. గన్నవరం మండలం<br>తూ. గో. జిల్లా |

| | | |
|---|---|---|
| 29. | శ్రీ వేంకటేశ్వరుడు | మెదక్<br>మెదక్‌జిల్లా |
| 30. | తిరుపతమ్మ<br>గోపయ్య | పెనుగంచిప్రోలు<br>నందిగామ దగ్గర<br>కృష్ణా జిల్లా |
| 31. | పాళమ్మ | ఈదరాడ<br>తూ గో. జిల్లా |
| 32 | సంకట విమోచన హనుమాన్ | హైదరాబాద్<br>(కవాడీ గూడ) |
| 33. | మల్లికార్జున స్వామి<br>భ్రమరాంబ | తోట్లవల్లూరు<br>కృష్ణాజిల్లా |
| 34. | విశ్వేశ్వర కనకదుర్గ | రెడ్డి గణపవరం<br>బుట్టాయ గూడెం మండలం<br>ప. గో. జిల్లా |
| 35. | జనార్ధన స్వామి | భీమవరం<br>ప. గో. జిల్లా |
| 36 | పళ్ళాలమ్మ | వానపల్లి<br>కొత్తపేట తాలూకా<br>తూ. గో. జిల్లా |

---

హిరణ్యకశిపుని చంపిన నరసింహావతారము రెండు వ్రక్కలాయెను నరరూపము నరుడుగాను, సింహరూపవ నారాయణుడుగాను పుట్టిరి నరనారాయణులే తరువాత జన్మమున అర్జున శ్రీకృష్ణులు

| | | |
|---|---|---|
| 37 | రామలింగేశ్వరుడు | లొల్ల<br>రాయవరం మండలం<br>తూ. గో. జిల్లా |
| 38. | కోదండ రామస్వామి | గొల్లల మామిడాడ<br>తూ. గో జిల్లా |
| 39. | తర్లమ్మ | తామరాడ<br>తూ. గో. జిల్లా |
| 40. | నర్మద లింగేశ్వర స్వామి | రాజోలు<br>తూ. గో జిల్లా |
| 41. | నీల కంఠేశ్వర స్వామి | నారాయణ పురం<br>బలిజిపేట మండలం<br>విజయనగరం జిల్లా |
| 42. | వీర బ్రహ్మేంద స్వామి | తెనాలి<br>(గాంధీ చౌక్)<br>గుంటూరు జిల్లా |
| 43. | వల్లపు రాయ<br>(శివస్వామి) | పెద కొదమ గుండ్ల<br>కారంపూడి మండలం<br>పల్నాడు |
| 44. | వీరేశ్వర వీరభద్ర స్వామి | నగరం<br>తూర్పు గోదావరి జిల్లా |
| 45. | శ్రీ వేంకటేశ్వరుడు | బెండుమూర్లంక<br>అల్లవరం మండలం<br>తూ. గో జిల్లా |

| | |
|---|---|
| 46. నంది జ్యోతిష్ పురుడు (విష్ణుమూర్తి) | నంది వెలుగు<br>5 కి.మీ. తెనాలి<br>గుంటూరు జిల్లా |
| 47. దుర్గ | భీమడోలు<br>ప. గో. జిల్లా |
| 48. వేణుగోపాల స్వామి | వారిజాల<br>నార్కట్‌పల్లి మండలం<br>నల్గొండ జిల్లా |
| 49. శ్రీ రామలింగేశ్వర స్వామి | నార్కట్ పల్లి<br>నల్గొండ జిల్లా |
| 50. చెన్న కేశవ స్వామి | పుష్పగిరి<br>మైదుకూరు దగ్గరలో<br>కడప జిల్లా |
| 51. శ్రీ రామలింగేశ్వర స్వామి | ధర్మపురి<br>కరీంనగర్ జిల్లా |
| 52. శ్రీ రామ చంద్రుడు<br>సీతాదేవి | సిద్ధాపురం<br>ఆకివీడు మండలం<br>ప. గో. జిల్లా |
| 53. శ్రీ వీర హనుమాన్ | పాత లింగం పల్లి<br>సేరి లింగం పల్లి మండలం<br>రంగారెడ్డి జిల్లా |

---

"పతిహీనులైన స్త్రీలు అతి ధనవంతులైనను అనలంకృతలు,
మాంగళ్యరహితులగునట్లు" దీర్ఘతముని శాపము

| | | |
|---|---|---|
| 54. | శ్రీ బాలనాగ త్రిపుర సుందరీదేవి | నెగ్గిపూడి<br>ప. గో. జిల్లా |
| 55. | తలుపులమ్మ | తలుపులమ్మ లోవ<br>20 కి.మీ. తుని<br>తూ. గో. జిల్లా |
| 56. | పాలేటి గంగమ్మ | నరసరావుపేట<br>గుంటూరు జిల్లా |
| 57. | ఛాయాదేవి | సాలిహుండాం<br>శ్రీకాకుళం జిల్లా |
| 58. | శ్రీరాముడు<br>సీతాదేవి | రాఘవ పురం<br>కోరుకొండ మండలం<br>రాజమండ్రి దగ్గర<br>తూ. గో. జిల్లా |
| 59. | మారెమ్మ | మేడిచర్ల పాలెం<br>రాజోలు తాలూకా<br>తూ. గో. జిల్లా |
| 60. | చక్రధర స్వామి | బెజ్జి పుట్టుగ<br>13 కి.మీ. సోంపేట<br>శ్రీకాకుళం జిల్లా |
| 61. | రాజరాజేశ్వర స్వామి | బిక్కవోలు<br>తూ. గో. జిల్లా |

---

మొగలిపువ్వునకు పూజయందర్హత లేకపోయిననూ, అందముగ నుండునట్లును, అలంకరణకై శిరస్సు నందు ధరించునట్లుగను శివుడనుగ్రహించెను

| | | |
|---|---|---|
| 62. | భీమలింగేశ్వర లేక<br>రామలింగేశ్వర | సత్యవోలు<br>కర్నూలు జిల్లా |
| 63 | చంద్రశేఖర | బిక్కవోలు<br>తూ. గో. జిల్లా |
| 64 | శివస్వామి | గంగాపూర్<br>వరంగల్ జిల్లా |
| 65 | మండాలమ్మ | వరంగల్<br>వరంగల్ జిల్లా |
| 66 | పంచలింగేశ్వర | పంచలింగాల<br>కర్నూలు దగ్గర |
| 67. | సోమేశ్వర | చేబ్రోలు<br>గుంటూరు జిల్లా |
| 68 | లక్ష్మమ్మ | లింగాలపాడు<br>6 కి మీ. నందిగామ<br>కృష్ణా జిల్లా |
| 69. | కుమార స్వామి | చేబ్రోలు<br>గుంటూరు జిల్లా |
| 70. | బాల కోటేశ్వరుడు | గోవాడ<br>గుంటూరు జిల్లా |

---

బ్రహ్మకు మొదట 5 శిరములుండెడివి, అందొకటి గార్ధభముఖము శివుడు ఖండించిందా శిరస్సునే

| | | |
|---|---|---|
| 71. | మల్లికార్జున స్వామి | సత్రశాల<br>గుంటూరు జిల్లా |
| 72. | శ్రీ కోదండరామ, సీతాదేవి,<br>ఆంజనేయ, రాజరాజేశ్వర,<br>రాజరాజేశ్వరి, విష్ణుమూర్తి<br>కృష్ణానదీ తీరం | సీతానగరం<br>గుంటూరు జిల్లా<br>2 కి.మీ. విజయవాడ |
| 73. | శ్రీ వేంకటేశ్వర స్వామి<br>శ్రీ చంద్రమౌళేశ్వరస్వామి | విజయవాడ<br>బందరుకాల్వ ఒడ్డున<br>కృష్ణా జిల్లా |
| 74. | శ్రీ వేంకటేశ్వర స్వామి<br>నౌ బత్ పహాడ్ పై | హైదరాబాద్ |
| 75. | అమర లింగేశ్వర స్వామి<br>కృష్ణానదీ తీరం<br>(గర్భగుడి గుహలోనున్నది) | దైదా గ్రామం<br>గురజాల మండలం<br>గుంటూరు జిల్లా |
| 76. | శ్రీ ఉమా అగస్త్యేశ్వర స్వామి | తాపేశ్వరం<br>ఆలమూరు తాలూకా<br>తూ. గో. జిల్లా |
| 77. | శ్రీ విశ్వేశ్వర స్వామి, అన్నపూర్ణ<br>శ్రీ కేశవ స్వామి, శ్రీదేవి | అయినవిల్లి<br>అమలాపురం దగ్గర<br>తూ. గో. జిల్లా |
| 78. | మదన గోపాల స్వామి<br>ఉమా సహిత మార్కండేయ స్వామి | రాజమండ్రి<br>తూ. గో. జిల్లా |

---

| | | |
|---|---|---|
| 62 | భీమలింగేశ్వర లేక<br>రామలింగేశ్వర | సత్యవోలు<br>కర్నూలు జిల్లా |
| 63 | చంద్రశేఖర | బిక్కవోలు<br>తూ. గో. జిల్లా |
| 64. | శివస్వామి | గంగాపూర్<br>వరంగల్ జిల్లా |
| 65 | మండాలమ్మ | వరంగల్<br>వరంగల్ జిల్లా |
| 66. | పంచలింగేశ్వర | పంచలింగాల<br>కర్నూలు దగ్గర |
| 67 | సోమేశ్వర | చేబ్రోలు<br>గుంటూరు జిల్లా |
| 68 | లక్ష్మమ్మ | లింగాలపాడు<br>6 కి.మీ నందిగామ<br>కృష్ణా జిల్లా |
| 69 | కుమార స్వామి | చేబ్రోలు<br>గుంటూరు జిల్లా |
| 70. | బాల కోటేశ్వరుడు | గోవాడ<br>గుంటూరు జిల్లా |

| | | |
|---|---|---|
| 71. | మల్లికార్జున స్వామి | సత్రశాల<br>గుంటూరు జిల్లా |
| 72. | శ్రీ కోదండరామ, సీతాదేవి,<br>ఆంజనేయ, రాజరాజేశ్వర,<br>రాజరాజేశ్వరి, విష్ణుమూర్తి<br>కృష్ణానదీ తీరం | సీతానగరం<br>గుంటూరు జిల్లా<br>2 కి.మీ. విజయవాడ |
| 73. | శ్రీ వేంకటేశ్వర స్వామి<br>శ్రీ చంద్రమౌళేశ్వరస్వామి | విజయవాడ<br>బందరుకాల్వ ఒడ్డున<br>కృష్ణా జిల్లా |
| 74. | శ్రీ వేంకటేశ్వర స్వామి<br>నౌ బత్ పహాడ్ పై | హైదరాబాద్ |
| 75. | అమర లింగేశ్వర స్వామి<br>కృష్ణానదీ తీరం<br>(గర్భగుడి గుహలోనున్నది) | దైదా గ్రామం<br>గురజాల మండలం<br>గుంటూరు జిల్లా |
| 76 | శ్రీ ఉమా అగస్త్యేశ్వర స్వామి | తాపేశ్వరం<br>ఆలమూరు తాలూకా<br>తూ. గో. జిల్లా |
| 77. | శ్రీ విశ్వేశ్వర స్వామి, అన్నపూర్ణ<br>శ్రీ కేశవ స్వామి, శ్రీదేవి | అయినవిల్లి<br>అమలాపురం దగ్గర<br>తూ. గో జిల్లా |
| 78. | మదన గోపాల స్వామి<br>ఉమా సహిత మార్కండేయ స్వామి | రాజమండ్రి<br>తూ. గో. జిల్లా |

| | | |
|---|---|---|
| 79. | శ్రీ భ్రమరాంబా మల్లికార్జున స్వామి<br>(పాత శివాలయం)<br>కన్యకా పరమేశ్వరి, నగరేశ్వర,<br>కోదండరామ, వేంకటేశ్వర,<br>శ్రీకృష్ణ (కొత్తగుళ్ళు) | విజయవాడ<br>కృష్ణా జిల్లా |
| 80. | చతుర్భుజ తాయారు | సింహాచలం<br>16 కి.మీ. విశాఖపట్నం |
| 81. | హేమావతి | హేమావతి<br>35 కి.మీ. మడక సిర<br>అనంతపురం జిల్లా |
| 82. | సాగర్ మాత<br>కృష్ణానదీ తీరం | నాగార్జున సాగర్ |
| 83. | ఏనుగు మల్లమ్మ | హార్సిలి హిల్స్<br>27 కి.మీ. మదనపల్లె<br>చిత్తూరు జిల్లా |
| 84. | విరూపాక్ష స్వామి | కొండపల్లి<br>32 కి.మీ విజయవాడ |
| 85. | కళ్యాణ వేంకటేశ్వరుడు<br>పద్మావతీ కళ్యాణం జరిగిన చోటు | నారాయణ వనం<br>36 కి.మీ. తిరుపతి<br>చిత్తూరు జిల్లా |
| 86. | శ్రీ వీర నారాయణ<br>శ్రీ సోమేశ్వర | కొలను పాక<br>80 కి.మీ హైదరాబాద్<br>హైదరాబాద్ - వరంగల్ మధ్య |

| | | |
|---|---|---|
| 87 | శ్రీ భద్రేశ్వర స్వామి | తాండూరు<br>105 కి.మీ. హైదరాబాద్ |
| 88. | ఆదిలక్ష్మి | మాచర్ల |
| 89 | త్రిపుర సుందరి<br>సుందరేశ్వరుడు | కన్యా తీర్థము<br>2 కి.మీ. పెద్ద దండ్లూరు<br>జమ్మలమడుగు తాలూకా<br>కడప జిల్లా |
| 90. | శ్రీ కోదండ రాముడు<br>సీతాదేవి | గుంటూరు |
| 91. | బాలకృష్ణుడు | సింగిశాని పేట<br>9 కి.మీ. నర్సరావు పేట<br>గుంటూరు జిల్లా |
| 92 | ఓంకారేశ్వరుడు | ఓంకారేశ్వరము<br>16 కి.మీ. మహానంది<br>కర్నూలు జిల్లా |
| 93. | శ్రీ సాయిబాబా | కర్నూలు |
| 94. | సకలేశ్వర స్వామి | మోపిదేవి<br>8 కి.మీ. చల్లపల్లి, కృష్ణా జిల్లా |
| 95. | శ్రీ దుర్గా నాగేశ్వర స్వామి | పెదకళ్ళేపల్లి<br>కృష్ణా జిల్లా<br>దివి తాలూకా,<br>24 కి.మీ. మచిలీపట్నం |

| | | |
|---|---|---|
| 96. | కోటీశ్వరుడు | శ్రీకాకుళం<br>శ్రీకాకుళం జిల్లా |
| 97 | ఎండల మల్లికార్జునుడు | రావి వలస<br>శ్రీకాకుళం జిల్లా<br>15 కి.మీ. టెక్కలి |
| 98. | .కుంతీదేవి<br>మాధవ స్వామి | భీముని పట్నం<br>విజయనగరం జిల్లా |
| 99. | పద్మనాభ స్వామి | పద్మనాభం<br>భీముని పట్నం మండలం<br>విజయనగరం జిల్లా |
| 100. | సుందరేశ్వరుడు<br>కర్పూరీశ్వరుడు<br>వంశధార నది సముద్రములో కలియుచోటు | విప్పుల<br>శ్రీకాకుళం జిల్లా |
| 101. | ధారా గంగమ్మ | పుణ్యగిరి<br>విజయనగరం జిల్లా<br>3 కి.మీ. శృంగవరపు కోట |
| 102. | పిల్లల కోడి | లింగాల మిట్ట<br>3 కి.మీ. అనకాపల్లి<br>విశాఖపట్నం జిల్లా |
| 103. | కుంతీ మాధవ | పిఠాపురం<br>తూర్పు గోదావరి జిల్లా |

| | | |
|---|---|---|
| 104. | వేణుగోపాల స్వామి | దువ్వ<br>5 కి.మీ తణుకు<br>ప. గో. జిల్లా |
| 105 | శ్రీ కేశవ స్వామి, శ్రీదేవి, భూదేవి<br>ఎల్లారమ్మ, కాకతమ్మ | మండపాక<br>3 కి.మీ. తణుకు<br>ప. గో. జిల్లా |
| 106 | శ్రీ భీమేశ్వర స్వామి | గుడివాడ<br>కృష్ణా జిల్లా |
| 107. | లింగోద్భవ స్వామి<br>బండ్లమ్మ | చందవోలు<br>గుంటూరు జిల్లా<br>భట్టిప్రోలు దగ్గర |
| 108. | శ్రీ కోదండ రామ<br>సీతాదేవి<br>(ఉప్పుటేరు సముద్రములో<br>కలియు చోటు) | మోటుపల్లి<br>గుంటూరు జిల్లా<br>11 కి.మీ. బాపట్ల |
| 109. | భావన్నారాయణ స్వామి | పొన్నూరు<br>గుంటూరు జిల్లా |
| 110. | శ్రీరంగస్వామి | ఎత్తిపోతల<br>గుంటూరుజిల్లా<br>10 కి.మీ. నాగార్జునసాగర్ |
| 111. | నృసింహస్వామి<br>ఆంజనేయస్వామి | సింగరాయకొండ<br>ప్రకాశంజిల్లా |

---

ఆలయదుస్థితికి కారణములు 1) ప్రకృతి విలయతాండవము 2) మతోన్మాదం 3) రాజకీయ కక్షలు 4) కాలము (అస్థిర నిర్మాణము)

| | | |
|---|---|---|
| 112. | పోలేరమ్మ | అద్దంకి<br>ప్రకాశం జిల్లా |
| 113. | గుంటి ఆంజనేయస్వామి | వినుకొండ<br>45 కి.మీ. నర్సరావుపేట<br>గుంటూరు జిల్లా |
| 114. | ధర్మేశ్వరుడు | ధర్మవరం<br>ప్రకాశం జిల్లా<br>20 కి.మీ. అద్దంకి |
| 115. | నిర్మలేశ్వరుడు | పాదిలి<br>ప్రకాశంజిల్లా |
| 116. | గుండ్ల బ్రహ్మేశ్వర స్వామి | గుండ్ల బ్రహ్మేశ్వరం<br>ప్రకాశంజిల్లా |
| 117. | ఈశ్వరుడు | మల్లప్పశెల<br>25 కి.మీ. కనిగిరి |
| 118. | బ్రహ్మేశ్వర స్వామి | కందుకూరు<br>ప్రకాశం జిల్లా |
| 119. | గంగాదేవి | అలవలపాడు<br>కందుకూరు తాలూకా<br>ప్రకాశం జిల్లా |
| 120. | భైరవుడు | భైరవకొండ<br>40 కి.మీ. ఉదయగిరి<br>నెల్లూరుజిల్లా |
| 121. | శ్రీ వేంకటేశ్వరుడు | గుత్తి<br>అనంతపురం జిల్లా |

| | | |
|---|---|---|
| 122. | సంగమేశ్వరస్వామి | నెల్లూరు |
| 123. | గోవిందరాజస్వామి | తిరుపతి<br>చిత్తూరుజిల్లా |
| 124. | శ్రీరామచంద్రమూర్తి<br>సీతాదేవి | చిత్తూరు<br>చిత్తూరు జిల్లా |
| 125. | దొడ్డేశ్వరస్వామి | హేమావతి<br>మడకశిర మండలం<br>అనంతపురం జిల్లా |
| 126. | శ్రీరాముడు<br>సీతాదేవి | పెనుగొండ<br>అనంతపురం జిల్లా |
| 127. | చౌడేశ్వరీ దేవి<br>పెన్నానదీ తీరం | కోడూరు<br>కడపజిల్లా<br>25 కి.మీ. గండిపేట |
| 128. | రంగనాధుడు<br>మాధవ రాయుడు<br>పెన్నానదీతీరం | గండికోట<br>కడపజిల్లా<br>కొండాపురం దగ్గర |
| 129. | శ్రీ వేంకటేశ్వరుడు | కడప |
| 130. | వీరభద్రుడు | రాయచోటి<br>కడపజిల్లా |

---

కాశీ, గయాక్షేత్రాలలో అత్యంత ప్రీతిపాత్రమైన శాక, ఫల వర్జితము వాంచితము ఆరోగ్యరీత్యా

| | | |
|---|---|---|
| 131. | చెన్నకేశవ స్వామి | నిత్యపూజకోన<br>సిద్ధవటానికి సమీపాన<br>కడపజిల్లా |
| 132. | శ్రీరామచంద్రుడు<br>సీతాదేవి | కర్నూలు<br>కర్నూలుజిల్లా |
| 133. | సంగమేశ్వరుడు<br>కృష్ణ, తుంగభద్ర, భవనాశిని<br>నదుల సంగమ స్థానం | సంగమేశ్వరం<br>30 కి.మీ. కర్నూలు<br>కర్నూలు జిల్లా |
| 134. | ధర్మలింగేశ్వరుడు | పంచధార్ల<br>24 కి.మీ అనకాపల్లి<br>10 కి.మీ. యలమంచిలి<br>విశాఖజిల్లా |
| 135. | రణమండల ఆంజనేయస్వామి | ఆదోని<br>ఎమ్మిగనూర్ సమీపాన<br>కర్నూలుజిల్లా |
| 136. | కౌలుట్లయ్య | కౌలుట్లకొండ<br>కర్నూలుజిల్లా<br>ఆదోని సమీపాన |
| 137 | వేణుగోపాలస్వామి | వల్లూరు<br>మహబూబ్‌నగర్ జిల్లా |
| 138. | ఆంజనేయస్వామి | బీచుపల్లి<br>మహబూబ్‌నగర్ జిల్లా |

త్రిమాతలు 1) సత్యస్వరూపిణి అయిన సరస్వతి తెలుపు 2) రజోరూపిణి అయిన లక్ష్మి ఎరుపు 3) తమోగుణాత్మకమైన పార్వతి నలుపు

| | | |
|---|---|---|
| 139. | రామలింగేశ్వరస్వామి | చాగదాన<br>మహబూబ్‌నగర్ జిల్లా |
| 140. | శ్రీ వేంకటేశ్వరస్వామి | మన్నెంకొండ<br>మహబూబ్‌నగర్ జిల్లా |
| 141. | ఉమా మహేశ్వరుడు | ఉమామహేశ్వరం<br>మహబూబ్‌నగర్ జిల్లా |
| 142. | శ్రీ వేంకటేశ్వర స్వామి | గుండె బల్లూరు<br>ముక్త్యాల తాలూకా<br>మహబూబ్‌నగర్ జిల్లా |
| 143. | గోపాలస్వామి | దేవరకొండ<br>నల్గొండజిల్లా |
| 144. | అనంతస్వామి<br>మూసీనది జన్మస్థానము | అనంతగిరి<br>6 కి.మీ. వికారాబాద్<br>నల్గొండజిల్లా |
| 145. | అగస్త్యేశ్వరుడు | వాడపల్లి<br>నల్గొండజిల్లా |
| 146. | వీరభద్ర స్వామి | రాచకొండ<br>నల్గొండజిల్లా |
| 147 | శ్రీరామ చంద్రుడు<br>సీతాదేవి | ఫణిగిరి<br>సూర్యాపేట తాలూకా<br>నల్గొండ జిల్లా |

| | | |
|---|---|---|
| 148. | వీరేశ్వర స్వామి<br>భద్రకాళి<br>గోదావరీ తీరము | మురమళ్ళ<br>అమలాపురం<br>కొమరగిరి దగ్గర<br>తూ.గో.జిల్లా |
| 149. | అగస్త్యేశ్వరుడు | యాగంటి<br>15 కి.మీ. బనగాన పల్లె<br>కర్నూలు జిల్లా |
| 150. | రంగనాధ స్వామి | కాశీబుగ్గ<br>వరంగల్ జిల్లా |
| 151. | ప్రోలేశ్వరుడు<br>ఎరకేశ్వర స్వామి<br>కొమరేశ్వరుడు | పిల్లల మర్రి<br>సూర్యాపేట తాలూకా<br>10 కి.మీ. ఆమనగంటి<br>నల్గొండ జిల్లా |
| 152. | ఆంజనేయ స్వామి | భువనగిరి<br>నల్గొండ జిల్లా |
| 153. | ఆండాళ్ళమ్మ<br>ఆంజనేయ స్వామి | యాదగిరి గుట్ట<br>6 కి.మీ. వంగపల్లి, ఆర్.ఎస్<br>నల్గొండ జిల్లా |
| 154. | శ్రీరామచంద్రమూర్తి<br>సీతాదేవి | సంగారెడ్డి<br>మెదక్ జిల్లా |
| 155. | వనదుర్గా భవాని<br>మంజీరానది ఆరు ఉపనదులు<br>కలియు స్థానం | నాగసాని పల్లె<br>మెదక్ జిల్లా |

ఆంధ్రప్రదేశ్ లోని అన్ని జిల్లాలలో మొత్తం 34, 801 దేవాలయములున్నట్లు ఒక సెన్సెస్

| | | |
|---|---|---|
| 156. | నాగేశ్వర స్వామి | లింగంపేట<br>నిజామాబాద్ జిల్లా |
| 157. | కంఠేశ్వరుడు<br>వేంకటేశ్వరుడు<br>ఆంజనేయుడు | నిజామాబాద్<br>నిజామాబాద్ జిల్లా |
| 158. | గాంధార దేవత<br>పోచమ్మ | గాంధార ఖిల్లా<br>5 కి.మీ. రామకృష్ణాపురం<br>ఆదిలాబాద్‌జిల్లా |
| 159. | మల్లన్న | ఓదెల<br>20 కి.మీ. పెదపల్లి<br>కరీంనగర్ జిల్లా |
| 160. | పద్మాక్షి | హనుమకొండ<br>వరంగల్ జిల్లా |
| 161. | పంచముఖ శివస్వామి | ఓరుగల్లు<br>వరంగల్ జిల్లా |
| 162. | ఏకవీరా దేవి | మొగిలి చెర్ల<br>6 కి.మీ. వరంగల్ |
| 163. | మైలార దేవుడు | ఐన ఓలు<br>15 కి.మీ. వరంగల్ |
| 164. | రుద్రేశ్వరుడు | పాలంపేట, వరంగల్ జిల్లా |

| | | |
|---|---|---|
| 165. | వీరభద్ర స్వామి<br>గోదావరి నదీ మధ్యలో | మోతే మిట్ట<br>ఖమ్మం జిల్లా |
| 166. | శ్రీరంగనాయక స్వామి | ఆలూరు కోన<br>8 కి.మీ. తాడిపత్రి<br>అనంతపురం జిల్లా |
| 167. | కన్నప్ప<br>(తిన్నడు) | శ్రీకాళహస్తి<br>చిత్తూరు జిల్లా |
| 168. | సిద్ధి వినాయకుడు | ఐన పల్లి<br>13 కి.మీ. ద్రాక్షారామ<br>తూ.గో. జిల్లా |
| 169. | శ్రీ వేంకటేశ్వర స్వామి | దుర్గి<br>18 కి.మీ. మాచర్ల<br>పల్నాడు తాలూకా<br>ప్రకాశం జిల్లా |
| 170. | చతుర్ముఖ బ్రహ్మ లింగేశ్వర | చేబ్రోలు<br>గుంటూరు జిల్లా |
| 171. | చిట్టాలమ్మ | పత్తేపురం<br>చిన నింద్రకొలను<br>ప.గో. జిల్లా |
| 172. | వేణుగోపాలస్వామి<br>రామలింగేశ్వర స్వామి | తంగెడ<br>దాచేపల్లి తాలూకా<br>గుంటూరు జిల్లా |

| | | |
|---|---|---|
| 173 | కేశవస్వామి | దుగ్గిరాల<br>గుంటూరు జిల్లా |
| 174. | అనంత భోగేశ్వర | కొల్లూరు<br>గుంటూరు జిల్లా |
| 175. | స్వయం భూతేశ్వర | వరివేరు<br>గుంటూరు జిల్లా |
| 176. | శ్రీకోదండ రామస్వామి<br>సీతాదేవి | బుచ్చిరెడ్డి పాలెం<br>నెల్లూరు జిల్లా |
| 177 | పద్మనాభ స్వామి | భీముని పట్నం<br>విజయనగరం జిల్లా |
| 178. | కన్యకా పరమేశ్వరి | అనకాపల్లి<br>విశాఖ జిల్లా |
| 179. | సీతారామ స్వామి | సీతారామపురం<br>రాజాం దగ్గర<br>విశాఖ జిల్లా |
| 180. | మణికంఠేశ్వర | శ్రీకాళహస్తి<br>చిత్తూరుజిల్లా |
| 181. | ఆదిత్యేశ్వర | తొండమనాడ్<br>8 కి.మీ. శ్రీకాళహస్తి |

| | | |
|---|---|---|
| 182 | పరశురామేశ్వర | గుడిమల్లం<br>శ్రీకాళహస్తి తాలూకా |
| 183. | గోవిందరాజులు స్వామి<br>గోదావరి నదీతీరం | భద్రాచలం<br>ఖమ్మం జిల్లా |
| 184. | శ్రీరంగనాయక స్వామి<br>కృష్ణానదీతీరం | నాగార్జునసాగర్ |
| 185 | అయ్యప్ప స్వామి | గొల్లపూడి<br>3 కి.మీ. విజయవాడ. |
| 186. | కోటిలింగేశ్వర స్వామి | రాజమండ్రి<br>తూ.గో. జిల్లా |
| 187. | లక్ష్మీనారాయణ<br>భవాని, రాజ్యలక్ష్మి | అవనిగడ్డ<br>కృష్ణాజిల్లా |
| 188. | 1. మాధవ స్వామి<br>2 రఘునాధ స్వామి | గండికోట<br>కడపజిల్లా |
| 189. | శ్రీరామ (జింక) | గిడికాల్<br>వరంగల్ జిల్లా<br>13. కి.మీ. వరంగల్ |
| 190. | సోమనాధ | పాలకుర్తి<br>వరంగల్ జిల్లా<br>35 కి.మీ. జలగామ్ |

---

శివకేశవులను ఆరు మాసములు దేవతలు అర్చించెదరు ఆరుమాసములు మాత్రమే మానవుల కర్చించుటకు అవకాశము (హిమాలయములలో వెలసిన కేదారేశ్వరుడు, బదరీనారాయణుడు)

| | | |
|---|---|---|
| 191 | అగస్త్యేశ్వరుడు | మామిళ్ళపల్లి |
| 192 | అగస్త్యేశ్వరుడు | చెరుకూరు |
| 193 | అగస్త్యేశ్వరుడు | మూల్పూరు |
| 194. | అగస్త్యేశ్వరుడు | ఈమని |
| 195 | సోమేశ్వర | కుండల<br>ఆదిలాబాద్ జిల్లా |
| 196. | కోటిలింగేశ్వరుడు | కీసరగుట్ట<br>రంగారెడ్డి జిల్లా |
| 197. | కోటిలింగేశ్వరుడు | సిద్ధిపేట<br>రంగారెడ్డి జిల్లా |
| 198. | రాజేశ్వర స్వామి | భిక్కనూరు<br>రంగారెడ్డి జిల్లా |
| 199. | హనుమంతుడు | గుండ్ల గూడెం<br>వరంగల్ జిల్లా<br>2 కి.మీ. ఆలేరు |
| 200. | విజయ దుర్గ | వెదురు పాక<br>రాయవరం మండలం<br>తూ.గో. జిల్లా |

పూర్ణకృష్ణుని భగవంతునిగా తలచరు - కారణములు 1) ప్రతి దినము అర్జునుడు శివపూజ చేయనిదే ఆహారము ముట్టడు 2) శ్రీకృష్ణుడు గోవర్ధనోద్ధరణ సమయమున దగ్గరుండి "శక్తి" పూజ జరిపించెను

| | | |
|---|---|---|
| 201. | మహిషాసుర మర్ధిని | బందరు<br>కృష్ణాజిల్లా |
| 202. | పార్ధ సారధి, శ్రీరామభట్ల | కర్నూలు<br>కర్నూలు జిల్లా |
| 203. | ఓంకార సిద్దేశ్వర్ | ఓంకారం<br>నంద్యాల తాలూకా |
| 204. | బుగ్గా రామేశ్వరుడు | కల్వబుగ్గ<br>కర్నూలు తాలూకా |
| 205. | ఉమా మహేశ్వర స్వామి | యాగంటి<br>15 కి.మీ. బనగానపల్లి<br>బనగానపల్లి తాలూకా<br>కర్నూలు జిల్లా |
| 206 | త్రిపురాంతకేశ్వర | కుమరాద్రి గ్రామం<br>కర్నూలు జిల్లా |
| 207. | శ్రీ వేంకటేశ్వరుడు | సిరిసిల్ల<br>ఆదిలాబాద్ జిల్లా |
| 208. | 1 శ్రీ శోభనాచల స్వామి<br>2. శ్రీ వేంకటాచల స్వామి<br>3 శ్రీ వేణుగోపాల స్వామి | ఆకిరిపల్లి<br>నూజివీడు తాలూకా<br>కృష్ణాజిల్లా |
| 209 | సుందరేశ్వర | పిప్పల గ్రామం<br>శ్రీకాకుళం జిల్లా<br>శ్రీ కూర్మానికి దగ్గర |

| | | |
|---|---|---|
| **210.** | కర్పూరేశ్వర<br>వంశధార నది సముద్ర<br>సంగమ స్థానం | శ్రీ కూర్మం దగ్గర<br>శ్రీకాకుళం జిల్లా |
| **211.** | కూటేశ్వర స్వామి<br>లాంగుళ్య నదీ తీరం | శ్రీ కూర్మం దగ్గర<br>శ్రీకాకుళం జిల్లా |
| **212.** | 1. వర్ధేగేశ్వర స్వామి<br>2. భీమేశ్వర స్వామి<br>3. కేదారేశ్వర స్వామి | వేములవాడ<br>32 కి.మీ.కరీంనగర్<br>కరీంనగర్ జిల్లా |
| **213.** | 1. రామలింగ్వేర<br>2. నూతన నర్సింహస్వామి<br>3. గోమరేశ్వర | ధర్మపురి<br>కరీంనగర్ జిల్లా<br>48 కి.మీ. జగిత్యాల<br>జగిత్యాల తాలూకా |
| **214.** | శ్రీ పాండురంగ<br>గోదావరి నదీ తీగం | పోలవరం<br>ప.గో. జిల్లా |
| **215.** | శ్రీ భక్తాంజనేయ స్వామి | గోటాల<br>ప.గో. జిల్లా<br>కొవ్వూరు దగ్గర |
| **216.** | శ్రీ మదన గోపాలస్వామి | తాళ్ళపూడి<br>ప.గో. జిల్లా |
| **217.** | శ్రీ అనంత భోగేశ్వర స్వామి | కుమారదేవం<br>ప.గో. జిల్లా |

---

మోక్షసాధనములు 4 ''గ'' కారాలు

1) గాయత్రి మంత్ర పఠనం 2) గంగా స్నానం 3) గీతాధ్యయనం 4) గోవిందనామస్తుతి

| | | |
|---|---|---|
| 218. | శ్రీ సోమేశ్వర స్వామి | ఆరికి రేవుల<br>ప.గో. జిల్లా |
| 219. | శ్రీ అనంత భోగేశ్వర స్వామి | వాడపల్లి<br>ప.గో. జిల్లా |
| 220. | శ్రీ విజయ లింగేశ్వర స్వామి | విఘ్నేశ్వరం<br>ప.గో. జిల్లా |
| 221. | 1. శ్రీ లక్ష్మీనరసింహ స్వామి<br>2. శ్రీరాజరాజ నరేంద్ర స్వామి | తీపర్రు, ప.గో. జిల్లా |
| 222. | శ్రీ కపిల మల్లేశ్వర స్వామి | మల్లేశ్వరం<br>ప.గో. జిల్లా |
| 223. | 1. శ్రీ సత్యనారాయణ స్వామి<br>2. శ్రీ వేంకటేశ్వర స్వామి | సిద్ధాంతం, ప.గో. జిల్లా |
| 224. | 1. మాణిక్య దేవ్ 2. సోమేశ్వర<br>3. వీరనారాయణ 4. కోటిలింగాల స్వామి<br>5. కుందమ్మ 6. చండికమ్మ<br>7. వీరభద్రస్వామి 8. కాశీ విశ్వేశ్వరుడు<br>9. శివమహదేవ్ | కొలనుపాక<br>నల్గొండ జిల్లా<br>6 కి.మీ. ఆలేరు<br>80 కి.మీ. హైదరాబాద్ |
| 225. | కోదండరాముడు<br>సీతాదేవి | మహానంది<br>16 కి.మీ. నంద్యాల |
| 226. | కోటిలింగాలు | వరంగల్<br>5కి.మీ. దూరములో |

---

| | | |
|---|---|---|
| 227 | భక్తవత్సల స్వామి<br>అమృత వల్లి | షోలింగం<br>బాలాజిపేట తాలూకా<br>విశాఖపట్నం జిల్లా |
| 228. | శ్రీ కోదండరామ<br>సీతాదేవి<br>పెన్నా నదీ తీరం | బుచ్చిరెడ్డి పాలెం<br>16 కి.మీ. నెల్లూరు<br>నెల్లూరు జిల్లా |
| 229. | కాశీ విశ్వేశ్వర<br>విశాలాక్షి | వెంకటగిరి<br>25 కి.మీ. శ్రీకాళహస్తి<br>నెల్లూరు జిల్లా |
| 230. | బ్రహ్మయ్య లింగేశ్వర స్వామి | చిక్కవరం<br>గన్నవరం మండలం<br>కృష్ణాజిల్లా |
| 231. | ఉమా సమేత రామలింగేశ్వర స్వామి | ఆచంట<br>ఆచంట మండలం<br>6 కి.మీ. కోడేరు<br>ప.గో. జిల్లా |
| 232. | శ్రీ లక్ష్మి పేరంటాళ్ళు | లింగాలపాడు<br>నందిగామ మండలం<br>కృష్ణాజిల్లా |
| 233. | శ్రీ ఆంజనేయస్వామి | మాచవరం<br>విజయవాడ |
| 234. | త్రిపుర సుందరీదేవి<br>గోకర్ణేశ్వరుడు | లింగారెడ్డిపాలెం<br>కోడూరు మండలం |

| | | |
|---|---|---|
| 235. | కోదండ రామస్వామి<br>సుబ్రహ్మణ్య స్వామి | చిత్తూరు<br>చిత్తూరు జిల్లా |
| 236. | మార్కండేయుడు | రాజమండ్రి<br>తూ.గో. జిల్లా |
| 237. | ఆంజనేయ<br>గోదావరి తీరం, గౌతమ మహర్షి ప్రతిష్ఠ | గుత్తేన దీవి<br>ముమ్మిడివరం తాలూకా<br>తూ.గో. జిల్లా |
| 238. | గణపతి<br>(గోదావరి నదీ తీరం) | యానాం |
| 239. | నూకాంబిక | అనకాపల్లి<br>విశాఖ జిల్లా |
| 240. | వీరేశ్వర స్వామి | మురమళ్ళ<br>తూ.గో. జిల్లా |
| 241. | విఘ్నేశ్వరుడు | అయినవిల్లి<br>తూ.గో. జిల్లా |
| 242. | బాల బాలాజీ | అప్పనపల్లి<br>తూ.గో.జిల్లా |
| 243. | లక్కన్న | అవనిగడ్డ<br>కృష్ణాజిల్లా |

---

మానవజీవితం గతం గురించి ఆలోచించడముతోను,వర్తమానంలో ఫిర్యాదులు చేయడంలోను,
భవిష్యత్తును తలచుకొనుటలోను గడుస్తుంది

| | | |
|---|---|---|
| **244.** | చెన్నకేశవ స్వామి<br>వేంకటేశ్వర స్వామి | ఏలూరు (శనివారపుపేట)<br>ప గో.జిల్లా<br>రామచంద్రరావు పేట |
| **245.** | వేంకటేశ్వర స్వామి | జమలాపురం<br>కృష్ణాజిల్లా |
| **246.** | అష్టభుజ లక్ష్మీనారాయణ స్వామి | పాలకొల్లు<br>ప.గో. జిల్లా |
| **247.** | ఎల్లారమ్మ | యర్ల<br>4 కి.మీ. తణుకు,<br>ప.గో. జిల్లా |
| **248.** | తలుపులమ్మ | లోవకొత్తూర్<br>5 కి.మీ. తుని,<br>తూ.గో. జిల్లా |
| **249.** | నాగేంద్ర స్వామి | చోడవరం<br>10 కి.మీ. విజయవాడ<br>కృష్ణాజిల్లా |
| **250.** | త్రిపుర సుందరి | ఋషికొండ<br>10 కి.మీ. విశాఖపట్నం<br>విశాఖజిల్లా. |

---

భీష్మునికి పాండవులయందు అతి అనురాగమున్ననూ మహాభారతయుద్ధమున గర్భశత్రువులతో యుద్ధము చేసినట్లు చేసెను దుర్యోధనుని జయము కోరి యుద్ధము చేసెను అందుకు అనుమానము లేదు

# తమిళనాడు

## (విశిష్టతలు)

### ప్రాకుతూ ఉన్న బాలగణేశుడు ఉన్న ఆలయం

బాల గణేశుడు　　　　　　　　　　　　　　　　వెల్లూరు

రాయవెల్లూరు అని పిలుస్తారు

60 కి.మీ. చిత్తూరు.

వెల్లూరు కోటలోని జలకంఠేశ్వరాలయములో వెలసిన స్వామి. స్వామివారు ప్రాకుతూ ఉన్న బాలుడుగ కనిపిస్తారు. మొలగుడ్డతో, కిరీట ధారియై ఒక చేత్తో ఉండ్రాళ్ళు పట్టుకొని, బొజ్జ నేలను తాకుతూ ఉన్న విగ్రహము.

### "మనకుల వినాయకుడ"ని పిలువబడే ఆలయం

మనకుల వినాయకుడు　　　　　　　　　　　　　పుదుచ్చేరి

(ప్రత్యేక ఆలయం)　　　　　　　　　　　　　　68 కి.మీ. చిదంబరం

విగ్రహం చిన్నది. కానీ చాలా అందముగా ఆకర్షణీయముగా నున్నది. స్వామివారికి ప్రత్యేక పూజలు జరుగుట విశేషము.

### దేశములో అతి పెద్ద వినాయకుడు

వినాయకుడు　　　　　　　　　　　　　　　　చిదంబరము

నటరాజస్వామి వారి ఆలయ రెండవ ప్రాకారములో నున్నది. మూడు మాణికల బియ్యం తిను గణేశుడని పేరు.

---

భాగవత బోధ　బ్రాహ్మణులు బ్రహ్మశిరమునుండియు, క్షత్రియులు బాహువుల నుండియు, వైశ్యులు మొలనుండియు, శూద్రులు పాదములనుండియు జన్మించిరి

**శివుడు 108 Classical Dance (శాస్త్రీయ నృత్య) భంగిమలలో కనిపించే గోపురము గల దేవాలయం**

నటరాజ చిదంబరం

68 కి.మీ. పాండిచేరి

49 మీటర్ల ఎత్తైన దేవాలయ గోపురముపై 108 భంగిమలలో నటరాజ విగ్రహములు గలవు. ఈ భంగిమలన్నియు భరత శాస్త్రములో చెప్పబడినవి. ఇందు "తాండవ శివుడు' చాల ప్రాముఖ్యత గలది.

**చిదంబరం గోపురముపై గల 108 భరత శాస్త్ర నాట్య భంగిమలు గల దేవాలయం**

బృహదీశ్వరుడు తంజావూరు

తంజావూరు జిల్లా.

ఈ ఆలయం మొత్తం 13 అంతస్తులు గలది. వీటిలో 108 భరతనాట్య భంగిమలు గలవు.

**రచనలు పవిత్రమైనవి, కానివి (మంచివి, చెడ్డవి) నిర్ణయించే Golden lotus pool (బంగారు కలువ పూల కోనేరు) గల దేవాలయం**

మీనాక్షి మధురై

మధురై జిల్లా

ఆలయానికి వామ పక్షాన ఉన్న కోనేరు. రచనలు ఈ చెరువులో వేసి నిర్ణయించేవారు. తేలితే మంచివి.

**మార్చి - ఏప్రిల్‌లో వివాహోత్సవము (రథోత్సవము), జనవరి - ఫిబ్రవరి లో తెప్పోత్సవము గల దేవాలయం**

మీనాక్షి మధురై

సుందరేశ్వరుడు

మరియమ్మ తెప్పాకుళం అనే పేరుగల చెరువులో తెప్పోత్సవం జరుగుతుంది. చాల ప్రసిద్ధి.

---

పూర్వీకులు దక్షిణ దేశమున తాళపత్రములపై వ్రాశారు (ఘంటముతో)- ఉత్తర దేశమున భూర్జవా లేక భోజపత్రాలపై గైరిక అను పసరుతో రంగులు కలిపి పక్షి ఈకలతోను,సున్నితమైన కుంచెనలతోను వ్రాశారు

**తమిళనాడులో అతి గొప్ప ఉత్సవము జరుపుకొని (పది రోజుల పాటు) లక్షలాది భక్తుల నాకర్షించు ఆలయం**

మీనాక్షి సుందరేశ్వరార్ — మధురై

వీరి వివాహము "చిత్రాయి" ఉత్సవముగా పది రోజులు మధురైలో అతి వైభవముగా జరుగును.

**రావణుని తమ్ముడు విభీషణుడు శ్రీరాముని శరణుజొచ్చిన చోటు, వెలసిన ఆలయం**

కోదండ రాముడు — ధనుష్కోటి
సీత, లక్ష్మణ, హనుమ — రామేశ్వర దీవి దక్షిణ కొన

ఆలయము పేరు శ్రీ కోదండ రామాలయం.

**"South Benares" అని పిలువబడు క్షేత్రము**

అవినాషి లింగేశ్వర — అవినాషి
అవినాషి లింగేశ్వరి — 40 కి.మీ. కోయంబత్తూరు.

**ఔషధ మొక్కలతో (Medical Herbs) తయారు కాబడిన విగ్రహము**

దండాయుధ పాణి (సుబ్రహ్మణ్య స్వామి) — పళని
105 కి.మీ. కోయంబత్తూరు
30 కి.మీ. కొడైకెనాల్

ఆరు ప్రసిద్ధ సుబ్రహ్మణ్య క్షేత్రములలో నొకటి. అలంకరణలు తీసివేసి విగ్రహానికి అభిషేకములు చేయుదురు. అభిషేక జలమును ఔషధముగ వాడుదురు. దక్షిణాదిన గల పెద్ద పుణ్య క్షేత్రములలో నొకటి. 9 రకముల ఖనిజధాతువులతో (పాషాణాలతో) తయారు కాబడిన విగ్రహం. అభిషేకం చేసిన వాటిలో ఔషధ గుణాలు కన్పడ్తాయట.

**"దండాయుధ పాణి" అని పిలువబడే స్వామివారు**

దండాయుధ పాణి (సుబ్రహ్మణ్య స్వామి) — పళని, 122 కి.మీ. మధురై

ఆరు ప్రసిద్ధ సుబ్రహ్మణ్య క్షేత్రములలో నొకటి. కొండపై నున్న ఆలయమునకు వెళ్ళుటకు, దిగుటకు Winch ఏర్పాటు కలదు. ఓపిక ఉన్నవారు ఎక్కుటకు మెట్లుగూడ కలవు. కొండ క్రింద షణ్ముఖ నది కలదు. స్వామివారికి కావడి ఉత్సవములు ప్రత్యేకత. తేనె, పంచదార, పాలు, అరటి పండ్ల గుజ్జులతో అభిషేకములు జరుగును. స్వామివారికి ఉత్సవములు మహా వైభవముగా జరుపుదురు.

**బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు ముగ్గురూ ఒకేచోట వెలసి ఉన్న దేవాలయము**

బ్రహ్మ, విష్ణు, మహేశ్వరుడు — కొడుమూడి, 40 కి.మీ. ఈరోడ్, 105 కి.మీ. కోయంబత్తూర్, పెరియార్ జిల్లా

శివుని ముచుకుందేశ్వరుడని, విష్ణుమూర్తినివీరనారాయణ పెరుమాళ్ అని పిలుచుట ప్రత్యేకత.

**పార్వతి నెమలి రూపములో ప్రార్థించి ఈశ్వర సాక్షాత్కారము పొందిన ఆలయం**

కపాలేశ్వరుడు — మైలాపూర్, మద్రాసు

"మైలి" అంటే అరవభాషలో నెమలి అని అర్థము. అందుచేతనే కపాలేశ్వరుని దేవాలయం ఉన్నచోటుకు మైలాపూర్ అని పేరు వచ్చినది.

**దక్షిణాన గల త్రివేణీ సంగమ స్థానమున వెలసిన క్షేత్రం**

సంగమేశ్వరుడు, వేదనాయకి, భవానీ క్షేత్రము — భవాని, 15 కి.మీ. ఈరోడ్, కోయంబత్తూరు జిల్లా

కావేరి, భవాని, సరస్వతి (అంతర్వాహిని) నదుల సంగమ స్థానము. ఈ క్షేత్రమునకు "త్రివేణి ఆఫ్ సౌత్ ఇండియా" అని పేరు.

---

శివలింగములో మూడు భాగములున్నవి అడుగుభాగం - బ్రహ్మపీఠము,
మధ్యభాగం - విష్ణుపీఠము, శిరోభాగము - శివపీఠము

**అయిదు గోపురములున్న దేవాలయం**

మీనాక్షి మధురై
సుందరేశ్వరుడు

ఆలయమునకు నాలుగువైపులా నాలుగు, అమ్మవారి విగ్రహానికెదురుగా 5వ గోపురం.

**అష్టలక్ష్మీ విగ్రహాలు మాదిరిగా అష్టశక్తి విగ్రహాలున్న మండపం**

మీనాక్షి మధురై
సుందరేశ్వరుడు

తూర్పు గోపుర ద్వారం గుండా లోనికి ప్రవేశించిన మండపం వస్తుంది. ఈ మండపంలోని స్తంభాలపై అష్టశక్తి విగ్రహాలున్నవి.

**మూడు భంగిమలలో విగ్రహాలున్న దేవాలయం**
**(పండుకుని, కూర్చుని, నిల్చుని ఉన్న విగ్రహాలు)**

కూడల్ అజహర్ మధురై
(విష్ణుమూర్తి) పట్టణములోనే పడమర దిక్కున

ఒకదాని వెనుక మూడు భంగిమలలో మూడు విగ్రహములు కలవు.

**సుబ్రహ్మణ్య స్వామివారి విగ్రహాలన్నీ తూర్పు ముఖములే. ఒక్కటి మాత్రం పశ్చిమాభి ముఖం**

కలుగునాదర్ కలుగుమలై
(కుమార స్వామి) 20 కి.మీ. శంకర నారాయణ్ కోయిల్
(సుబ్రహ్మణ్యస్వామి) 123 కి.మీ. మధురై

గర్భగుడిలో జంబుకేశ్వరుడు, అఖిలాండేశ్వరి వెలసివున్నారు.

---

తాను సంపాదించిన ధనము వుత్తమము తండ్రి సంపాదించినది మధ్యమము తమ్ముని ధనము అధమము స్త్రీ ధనము అధమాధమము

**గిరిపతి, గిరిజాపతి, కైలాస గిరిపతి, శంకరుడు భిక్షమెత్తుకుని భుజించు పాత్ర కపాలము. కపాలేశ్వరుని ఆలయములు గల పుణ్యక్షేత్రములు**

1. కపాలేశ్వరుడు — 1. మద్రాసు
మైలాపూర్

2. కపాలేశ్వరుడు
(శ్రీరామ దేవాలయం దగ్గరలో) — 2. నాసిక్
(మహారాష్ట్ర)

**బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు ఒకే లింగరూపమున వెలసిన దేవాలయము**

స్థాణేశ్వరుడు
(బ్రహ్మచారి) — సుచీంద్రము
నాగర్‌కోయిల్‌కి
కన్యాకుమారికి మధ్యన

అనసూయా దేవి త్రిమూర్తులను పసిపాపలు చేసిన ప్రదేశము. ఆమె కోరిక ప్రకారముగా ముగ్గురంశలతో లింగము ఆవిర్భవించినదట.

**రాతి విఘ్నేశ్వర విగ్రహములలో ఒకటి రాతిమోత, ఇంకొకటి కంచుమోత వినిపిస్తున్నాయి**

బృహదీశ్వరుడు
బృహదీశ్వరాలయం — తంజావూరు

ఆగ్నేయమూలన ఉన్న విఘ్నేశ్వరుని విగ్రహములు.

**సంవత్సరములో 3 సార్లు గోపుర గవాక్షము గుండా సూర్యకిరణములు లింగము మీద ప్రసరిస్తాయి**

నాగేశ్వరుడు
(స్వామివారి లింగము చిన్నది) — కుంభకోణం
తంజావూరు జిల్లా.

---

కోపము ఒక్కక్షణము పుత్తముని యందు, కొద్దిసేపు మధ్యముని యందు, ఒక రోజు అధముని యందు, జీవితాంతము పాపి యందుండును

## దేశం మొత్తం మీద అతి పెద్ద దేవాలయం

శ్రీరంగనాధ స్వామి
శ్రీరంగనాయకి
(శ్రీరంగ నాచియార్)
కావేరీతీరం

శ్రీరంగం
13 కి.మీ. తిరుచినాపల్లి

విష్ణ్వాలయం భూలోక వైకుంఠం. శ్రీమహావిష్ణువు అనంత శయనుడైన మూర్తి. కావేరీ నదీ తీరం. ప్రతీరోజు ఉదయం ఏనుగు కావేరి నదినుండి అభిషేకమునకు నీటిని తీసుకుని వస్తుంది

ఆలయం సప్త ప్రాకారములు గలది 21 గోపురములు, 24 మండపములు గలవు. ఆలయ నిర్మాణము చేర, చోళ, పాండ్య, హొయిసల, విజయనగర రాజవంశీయులచే జరిగినది.

మొదటి నాలుగు ప్రాకారములలో అర్చకులు మొదలైనవారి నివాస గృహములు, షాపులు ఉన్నవి. ప్రతి ప్రాకారములో అనేక దేవతా మూర్తుల విగ్రహా ములున్నవి నాల్గవ ప్రాకారము దాటిన తరువాత పాదరక్షల నుపయోగించరాదు. దేవాలయమంతా చూచుటకు ఒకరోజుకు పైగా పడుతుంది. 250 ఎకరముల విస్తీర్ణములో కట్టబడిన మహత్తర దేవాలయం. నాల్గవ ప్రాకారములో వేయి స్తంభాల మండపం ఉన్నది. ప్రతీ సంవత్సరం రధయాత్ర జరుగుతుంది.

## ధనుర్మాసములో ముక్కోటి ఏకాదశికి భూలోక వైకుంఠ ద్వారాలు తెరచినట్లుగా భావించి గొప్ప ఉత్సవం జరుగు ఆలయం

శ్రీరంగనాధ స్వామి
శ్రీరంగనాయకి

శ్రీరంగం
13 కి.మీ. తిరుచినాపల్లి

మహావిష్ణువు అనంత శయనుడైన మూర్తి. స్వామివారు కస్తూరి రంగడు. కావేటి రంగడు.

## "హస్తిగిరి" అని పిలువబడే క్షేత్రము

వరదరాజ స్వామి
(విష్ణు కంచి)
(చిన కంచి)

కంచి

కరిగిరి అను తెప్పమీద కట్టబడిన ఆలయం.

**"భూతపురి" అని పిలువబడే క్షేత్రము**

శ్రీ కేశవ పెరుమాళ్ళు  శ్రీ పెరంబుదూర్

తిరువళ్ళూరు నుండి బస్సు 16 కి మీ.

పూర్వం విష్ణుమూర్తి గౌరవార్థం ఉత్సవం గావింప, శివుని పరివారము, సకల దేవతలన్నాహ్వానించి, ఆ దేవతల నివాసార్థము ఈ నగరము నిర్మించినారట. శివుని పరివారము అనగా భూతగణములచే నిర్మించబడినదిగాన భూతపురి అని పేరు శ్రీరామానుజాచార్యుల వారి జన్మస్థానము

**"శంఖుతీర్థ" మని పిలువబడే పుణ్యక్షేత్రము**

వేదగిరీశ్వరుడు  పక్షితీర్థము

చొక్కాలమ్మ  14 కి.మీ. చెంగల్పట్టు (R S)

ఈ తీర్థమును పక్షితీర్థమని పిలుతురు. కొండక్రింద భక్తవత్సలేశ్వరుడు, త్రిపురసుందరీ దేవాలయములున్నవి. ఇచ్చట శంఖుతీర్థమను కొలను కలదు దీనిలో 12 సంవత్సరముల కొకసారి శంఖము పుట్టునని నమ్మిక. అందుచేత ఈ క్షేత్రానికి శంఖుతీర్థమని పేరు

**"గురునాథుడని" పిలువబడే క్షేత్రం**

సుబ్రహ్మణ్య స్వామి  స్వామిమలై

(గురునాథుడు)  18 కి.మీ. కుంభకోణం

దేవసేన

ప్రసిద్ధ ఆరు సుబ్రహ్మణ్యక్షేత్రములలో నొకటి. ఇచ్చట సుబ్రహ్మణ్య స్వామి శివునికి ప్రణవ రహస్యము నెరింగించెనట. దేవాలయ గర్భగుడిలోని విగ్రహములలో కుమారస్వామి ఉన్నత స్థానమున నుండగా శివుడు కొంచెము దిగువ స్థానమున నుండి భక్తి, వినయ విధేయతలతో ఉపదేశము నొందెను.

**ఎత్తైన గర్భగుడి పైన ఉన్న కలశం యొక్క నీడ నేలమీద పడని దేవాలయం**

బృహదీశ్వరుడు  తంజావూరు

బృహదీశ్వరి

---

**దక్షిణ దేశమున (తమిళనాడులో) శంకరుని సగభాగముగాను మిగిలిన సగభాగమును విష్ణువుగాను పూజించు దేవాలయము**

శంకర నారాయణ — శంకరనారాయణ కోయిల్

గోమతీ మాత — 32 కి మీ. రాజుపాలెం

42 కి మీ. సిరివెళ్ళి పుత్తూర్

ప్రతిదినము స్వామివారి ముఖమున సగము అడ్డబొట్టు సగము నిలువుబొట్టు పెట్టుచుందురు శివ కేశవులకు భేదము లేదన్న సత్యము చాటుచుండును.

**రామేశ్వర క్షేత్రములో వలె అనేక తీర్థములుండు దేవాలయము**

శ్రీసుబ్రహ్మణ్యేశ్వర స్వామి — తిరుచందూరు

అరేబియా సముద్రతీరం — 48 కి.మీ. తిరునల్వేలి

99 కి.మీ. కన్యాకుమారి

ఆరు ప్రసిద్ధ సుబ్రహ్మణ్య క్షేత్రములలో నొకటి. ఈ దేవాలయములో 23 తీర్థములున్నవి అన్నియు ఉప్పునీటివే ఒకే ఒక మంచినీటి తీర్థంగల బావి ఆరు అంగుళముల కైవారము గలది ఇందలి నీరు తీయనిది. ఇది ప్రత్యేకత తాటియాకుల దొప్పలతో నీరు తోడుకొని పోసుకుందురు

**ఆలయానికి రెండు కి.మీ. దూరములో పాము కరచిన విషమెక్కదని వరము కలదు**

నాగరాజస్వామి — నాగర్‌కోయిల్

దుర్గాదేవి — సుచీంద్రం దగ్గర

స్వామివారు పంచముఖుడుగా ప్రసిద్ధి.

**"శ్రీపాద రేణువు" అనే చందనం లభించు దేవాలయం**

కార్తికేయన్ — తిరుత్తణి

(సుబ్రహ్మణ్య స్వామి) — 13 కి.మీ. ఆర్కోణం

80 కి.మీ. మద్రాసు

ప్రసిద్ధ ఆరు సుబ్రహ్మణ్య క్షేత్రములో నొకటి పెద్ద గంధపు సాన వున్నది ఈచందన ప్రసాదమును శ్రీపాద రేణువుగా తలతురు. సర్వవ్యాధి నిర్మూలకమని నమ్మక

---

మరచిపోకూడనివి మనుష్యులతో మెలిగేటప్పుడు దేవుడు చూస్తున్నాడని
దేవుని ప్రార్థించేటప్పుడు మనుష్యులు వింటున్నారని

**కొండపైన వినాయకుడు, కొండలోపల మధ్యభాగములో శివుడు, పార్వతి అమ్మవారు గల దేవాలయం**

కొండపైన : ఉచ్చపిళ్ళయార్ (వినాయకుడు) — రాక్‌ఫోర్టు, తిరుచినాపల్లి

కొండలోపల మధ్యభాగములో
మాతృభూతేశ్వరుడు
సుగంధి కుంతలాంబిక

కొండలోపలి భాగమునుండి పైన వెలసిన వినాయకుని వరకు చక్కని మెట్లదారి కలదు.

**పక్షితీర్థములో (మిట్టమధ్యాహ్నం పక్షులు వచ్చి ప్రసాదం ఆరగించి వెళ్ళిపోయే కొండపైగల తీర్థము) వెలసిన అమ్మవారు**

చొక్కాలమ్మ — తిరుక్కుల కుండ్రం
వేదగిరీశ్వరుడు — 60 కి.మీ మద్రాసు
12 కి మీ మహాబలిపురం

ఈ తీర్థములో పూర్వకాలం రెండు పక్షులు వచ్చేవట. ఇప్పుడు ఒక పక్షి మాత్రం వచ్చుచున్నది.

**"తంజం" అనే రాక్షసుని చంపిన అమ్మవారు**

బృహన్నాయకి — తంజావూరు
బృహదీశ్వరుడు

ఆలయంలోని గర్భగుడి గోపురము కన్న ఎత్తైనది. గర్భగుడి శిఖరమున ప్రతిష్ఠించబడిన రాయి చాల బరువైనది. తంజం అనే రాక్షసుని సంహరించిన చోటు కాబట్టి తంజావూరని పేరు వచ్చినది.

**"కమలాలయం" అనే కోనేరు ప్రక్కన వెలసిన అమ్మవారు**

కమలాంబిక — తిరువారూర్
వాల్మీక నాధర్ — తంజావూర్ - నాగపట్నం మధ్య

దేవాలయములో పెద్ద పుట్ట ఉన్నది. వేయి స్తంభముల మండపము కలదు.

---

## దేవాలయముగా పిలువబడే చర్చి

మేరి కన్య
(Our Lady of Health)
బంగాళాఖాత తీరం
బీచ్‌లోని చర్చి

వేలాం కన్ని
నాగపట్నం దగ్గర

తిరుపతి వలె మ్రొక్కుబడులు, హుండీ దానాలు భాగుపడిన అనంతరం శరీరభాగముల వలె బంగారు, వెండి, ఇత్తడి, రాగి లోహములతో చేయించి అమ్మవారి హుండీలో సమర్పిస్తారు. ఫాదర్ స్వయముగా ప్రసాదాన్ని భక్తుల నాలుకపై ఉంచుతారు. పొరపాటున ప్రసాదం క్రింద పడకుండా నోటికి క్రింద భాగమున స్టీలు ప్లేట్ ఉంచుతారు. భక్తులు సముద్రములో స్నానం చేసి, రంగు రంగుల రకరకాల కొవ్వొత్తులను కొనుక్కొని వచ్చి ఆలయమున వెలిగిస్తారు

## "భగవతి" అని పిలువబడే దేవాలయం

కన్యాకుమారి
(కన్యక)

కన్యాకుమారి అగ్రం
భారత భూభాగపు దక్షిణకొన

సతీదేవి "వీపు" భాగం పడిన ప్రదేశం. అమ్మవారి ముక్కున కాంతులీను వజ్రపు ముక్క పుడక గలదు. పూర్వకాలం ఓడలకు వెలుతురుగా కనిపించేదట. బాణాసురుని సంహరించిన 16 సంవత్సరముల బాలిక. శుచీంద్రములో నున్న స్థాణేశ్వరుని వివాహం చేసుకొనుటకు నిరీక్షిస్తుంది. స్వామివారు యోగనిద్రలో నున్నారు. అందుచేత వివాహము జరుగుటకాలస్యం జరుగుచున్నది.

## అష్టలక్ష్మిదేవాలయములున్న చోట్లు

1. మద్రాసు (తమిళనాడు) తిరువార్మయూర్ బీచ్‌లో, (బీసెంట్ నగరులో) మూడంతస్తుల దేవాలయం. బంగాళాఖాత తీరం. చుట్టూ ప్రదక్షిణ చేస్తూ మెట్లు ఎక్కుతూ అమ్మవార్లను దర్శించాలి.
2. కుంభకోణం (తమిళనాడు). మంగళాంబిక దేవాలయములోని ఆవరణలో అష్టలక్ష్మి స్వరూపాలున్నవి. స్వామి . కుంభేశ్వరుడు.
3. తిరువన్నామలై (తమిళనాడు) అరుణాచలం. 60 కి.మీ. మద్రాసు, రాయవెల్లూరు నుండి బస్సు కలదు. స్వామివారు తేజోలింగము. అరుణాచలేశ్వరుడు. అరుణాచలేశ్వరి చాల పెద్ద దేవాలయము ఆలయ మండప స్తంభాలపై అష్టలక్ష్మి విగ్రహాలున్నవి.

**సంవత్సరమంతా స్వామివారి ముఖదర్శనం, సంవత్సరానికి ఒక్కసారి స్వామివారి కుడిపాదము, ఎడమ పాదము దర్శనము**

వాల్మీక నాధర్ తిరువారూర్
కమలాంబిక తంజావూర్ - నాగపట్నం మధ్యలో

**అభిషేకము నీటితో జరుగని శివలింగము**

ఏకాంబరేశ్వరుడు కంచి
(క్షితిలింగము)

మట్టిలింగము కాబట్టి స్వామివారికి నీటితో అభిషేకము చేయరు. మల్లెపూలతో అభిషేకము. పంచభూత లింగములలో నొకటి.

**అతిపెద్ద రథము గల దేవాలయములు**

వాల్మీక నాధర్ తిరువారూర్
(శివ క్షేత్రము) తంజావూర్ - నాగపట్నం మధ్య
కమలాంబిక

దేవాలయములో పుట్ట ఉండుటచే స్వామికి "వాల్మీకనాధర్" అని పేరు వచ్చినది. పూర్వము 10 వేలమంది 6' మందముగల త్రాళ్ళతో లాగేవారు. నాలుగు వీధుల గుండా ఊరేగింపునకు అనేక వారములు పట్టేది. ఇప్పుడు ఇనుప చక్రములు, హైడ్రాలిక్ బ్రేకులు బిగించి జర్మనీ ఇంజనీర్లచే పరిశీలింపబడి రూపొందించబడినది. ఇప్పుడు 2వేల మంది భక్తులు లాగి, యాత్ర 2 రోజులలో పూర్తి యగుచున్నది.

2. శ్రీ-విల్లి పుత్తూర్ (తమిళనాడు)
వటపత్రశాయి
శ్రీ ఆండాళ్
కర్ర రథం
చాల పెద్దది, చాల బరువైనది
9 చక్రాలు కలది.

**ఉపరి భాగము కుండమూతిలా ఉండే శివలింగము**

కుంభేశ్వర స్వామి
మంగళాంబిక

కుంభకోణము
తంజావూర్ జిల్లా
60 కి.మీ. చిదంబరం

స్వామివారికి నిత్యాభిషేకములు జరుగవు సుగంధ ద్రవ్య లేపన మాత్రమే. ఆలయములో అష్ట లక్ష్మీ స్వరూపము లున్నవి. కుంభకోణములో 12 శివాలయములు, 4 విష్ణ్వాలయములు, 1 బ్రహ్మదేవుని ఆలయం గలవు. సుధా గణేశుని విగ్రహం గలదు. మొత్తము 40 దేవాలయముల పట్టణము. అరసలార్ - కావేరీ నదుల మధ్యనున్న పుణ్యక్షేత్రము. "మహామాఘం" అను పవిత్ర కొలను గలదు

**పీచు పూర్తిగా తీసివేసి గుండ్రని కొబ్బరి కాయలు కొట్టు దేవాలయం**

సుబ్రహ్మణ్య స్వామి

తిరుచెందూర్
48 కి.మీ. తిరునల్వేలి
99 కి.మీ. కన్యాకుమారి
సముద్రతీరం

భస్మము, గంధము ఆకులలో పెట్టి ప్రసాదముగా యిచ్చెదరు. దేవాలయం సముద్రతీరము. ఇసుకలో కాళ్ళు కాలకుండా ప్రయాణించుటకు క్రింద సిమెంట్ రోడ్డు,పైన రేకుల షెడ్డు ఆలయం వరకు గలవు. సుప్రసిద్ధ ఆరు సుబ్రహ్మణ్య క్షేత్రములలో నొకటి.

**కొబ్బరికాయ నివేదన లేని దక్షిణ దేశములోని గొప్ప దేవాలయము**

శ్రీరంగనాధుడు
శ్రీ రంగనాయకి

శ్రీరంగము
10. కి.మీ. తిరుచినాపల్లి

స్వామివారికి మొదటి నుండియు కొబ్బరి కాయలు కొట్టు ఆచారము లేదు.

**లింగముపై మేకు కొడితే ఆగినట్లే నందిపై మేకు కొట్టగా పెరుగుదల ఆగిన నంది**

బృహదీశ్వరుడు
బృహదీశ్వరి

తంజావూరు

ఆలయములోని నంది నల్లని గ్రానైట్ రాతితో మలచబడినది. ఈ నందిని తయారు చేయడానికి గ్రానైట్ రాయిని మధ్యప్రదేశ్‌లోని నర్మదానదీ గర్భము నుండి తీసుకుని రాబడినది. నంది మండపము దాటి పెరిగిపోతుందని ఝడిసి మంత్రోచ్ఛరణతో నందిపై మేకు కొట్టి పెరుగుదల ఆపగలిగినారు.

---

లోపాలు లేని మానవుడుండడు తక్కువ లోపాలున్నవాడు ఉత్తముడు

## ప్రతీ ఆకు ఆకారములో వేరు వేరుగా, ప్రతీ పండు రుచిలో వేరువేరుగా ఉన్నటువంటి మామిడి చెట్టు గల ఆలయం

ఏకాంబర నాధస్వామి (ఏకామ్రేశ్వరుడు) కంచి
కామాక్షీ దేవి

ఇచ్చట నున్న చెట్టు 3,500 సంవత్సరముల నాటిది. ఈ చెట్టు క్రింద పార్వతి అమ్మవారు తపస్సు చేసి శివుని అనుగ్రహము పొందినదట పిల్లలు కావలసిన స్త్రీలకు సంతాన ప్రధాయని.

## ఉప్పులేని ప్రసాదం ఆరగించు స్వామివారు

ఉప్పిలి అప్పన్ తిరువన్నాగరం
(ఉప్పు ఇల్లే అప్పన్ - ఉప్పులేని స్వామి) 3 కి.మీ. తిరునాగేశ్వరం
లవణ వర్జిత వేంకటేశ్వరుడు 5 కి.మీ. కుంభకోణం
తంజావూర్ జిల్లా

స్వామివారికి ఉప్పువేయని ఆహారము ప్రసాదము. ఈ దేవాలయమునకు వెళ్ళు వారెవరూ ఉప్పును తీసుకుని వెళ్ళరు. ఇది నియమం. ఉప్పు మ్రొక్కులు మ్రొక్కుకొని తలనీలాలు సమర్పింతురు. తిరుమల తిరుపతి వలె నిత్యం యాత్రీకుల రద్దీ గల ఆలయం.

## గోపురము కన్నా ఎత్తైన గర్భగుడి గల దేవాలయములు
## (The Great Chola Temples) - 4

1. తంజావూర్ (తమిళనాడు)
   బృహదీశ్వరాలయం
   దేవాలయం గర్భగుడి శిఖరం యొక్క నీడ నేలపై బడదు. ఈ విమాన శిఖరాన్ని '8దక్షిణ మేరు "(దక్షిణ పర్వతం) అని పిలుస్తారు. ("ఉత్తర మేరు" కైలాస పర్వతం మానస సరోవరం ప్రక్కన (టిబెట్)).
2. గంగైకొండ చోళపురం (తమిళనాడు) చిదంబరం దగ్గర,తిరుచినాపల్లి జిల్లా. 71కి.మీ. తిరుచినాపల్లి. కొల్లాడం నదీ తీరం.
3. దరశురామ్ (తమిళనాడు) కుంభకోణం దగ్గర, ఐరావతేశ్వరుడు
4 త్రిభువనం (తమిళనాడు) కుంభకోణం దగ్గర త్రిభువన వీరేశ్వర స్వామి.

---

**"మహా మాఘం" అని పిలువబడే గొప్ప స్నానోత్సవములు జరుగు క్షేత్రాలు**

1. ఆదికుంభేశ్వర
The Great Tank
అమృత భాండం చిందించగా
ఏర్పడిన పెద్ద సరస్సు.
( 660 తీర్థాలు కలిసినటువంటిది)

1. కుంభకోణం
(తమిళనాడు)
96 కి.మీ. ట్రిచ్చి

2 విష్ణుమూర్తి
భరత్‌పుజ నదీ తీరం
స్వామి వారి విగ్రహాన్ని
ఈనదిలో స్నానం చేయించి,
భక్తులందరూ తరువాత
స్నానములు చేయుదురు.
ఈ ఉత్సవాన్ని "ఆరత్తు" అని పిలుస్తారు.

2. కోజికోడ్ R S
(కేరళ)
షోరనూర్ - మంగుళూరు లైనులో
N H నెం 17.
ఎర్నాకుళం - మంగుళూరు మధ్యలో

పై రెండు ప్రత్యేక ఉత్సవములు 12 సంవత్సరముల కొకసారి జరుగును.

**చెవులకు తాటాకులు ధరించిన దేవత**

అఖిలాండేశ్వరి
జంబుకేశ్వరుడు
(పంచభూత లింగాలలోని జలలింగం)

జంబుకేశ్వరం
2 కి.మీ. శ్రీరంగం

అఖిలాండేశ్వరి ఉగ్రరూపం. ఆదిశంకరాచార్యులవారు అమ్మవారి విగ్రహం ఎదుట గణపతి విగ్రహమును ప్రతిష్ఠించారు. తల్లి కుమారుని ఉగ్రరూపంతో చూడదని. ఇంకా కొంత ఉగ్రరూపం ఉండేటప్పటికి అమ్మవారి చెవులకు శ్రీచక్రరూపములో తాటాకులు ఏర్పరచినారు. అందుచేత అమ్మవారి చెవులకు తాటాకులు గలవు.

పూజారి కంటికి కాటుక పెట్టుకుని, చీర ధరించి మధ్యాహ్నం పూజ చేయాలి. ఇది ఆచారము లింగానికి వెనుక భాగాన జంబూ వృక్షము గలదు. అందుచేత జంబుకేశ్వరమని పేరు వచ్చినది. లింగం క్రింద నుండి నీరు ఊరుతూంటుంది.

కోపం తగ్గించుకొనడానికి భక్తులు అమ్మవారిని పూజిస్తారు

---

**ఇసుకను ప్రసాదముగా యిచ్చు దేవాలయము**

నాగరాజ స్వామి — నాగర్‌కోయిల్
(5 శిరస్సులు గల సర్పాకార స్వామి) — సుచీంద్రం దగ్గర
దుర్గాదేవి

ఆలయం దగ్గరలో పాము కరచినా విషమెక్కదట. గర్భాలయములో స్వామివారి ప్రక్కన నీటి యూట గలదు. ఆ జలమునే తీర్థముగాను అందుండి వచ్చు ఇసుకను ప్రసాదముగాను యిత్తురు. మొదటి ఆరు మాసములు తెల్లని ఇసుక వచ్చును. తదుపరి ఆరు మాసములు నల్లని ఇసుక వచ్చును. ఆలయము నందు నాగుపాములు గలవు.

**పౌర్ణమినాడు సూర్యాస్తమయం, పూర్ణ చంద్రోదయం ఒకేసారి కనిపించు చోటు**

కన్యక అమ్మవారు — కన్యాకుమారి అగ్రం
(వివాహము కాలేదు) — 13 కి.మీ సుచీంద్రం
(పార్వతి అంశ) — 19 కి మీ. నాగర్‌కోయిల్
99 కి.మీ తిరుచందూర్

సూర్యాస్తమయము, చంద్రోదయము ప్రక్క ప్రక్కనే కనిపించు అద్భుత దృశ్యము. ఇది ప్రపంచములోనే ప్రత్యేకత. అరేబియా సముద్రము, హిందూమహా సముద్రం, బంగాళాఖాతం కలియుచోటు. గాలి చాల ఎక్కువగా ఉంటుంది. వివేకానంద స్వామి వారి మెమోరియల్, గాంధీ మండపము గలవు. సముద్రముల సంధిలో సూర్యచంద్రుల దర్శనము చాలమంది చేయుదురు. అద్భుత దృశ్యము.

**దోశల ప్రసాదం**

అలగర స్వామి — అలగర కోయిల్
లేక — 20 కి.మీ. మధురై
సుందరరాజ పెరుమాళ్
సుందర వళ్ళి నాంచార్
నూపర గంగా నదీ తీరము

పెద్ద పెద్ద సైజు దోశలు స్వామివారికి నివేదించి ప్రసాదముగా పంచుతారు. ఆలయ గర్భాలయము పైన ఉన్న విమానమునకు బంగారు పూత పూసిన రేకులతో కప్పబడినది.

కేసులు పరిష్కారము - ప్రమాణాలు చేస్తారు. ఫీజు కట్టి సత్య ప్రమాణముగా మాట్లాడుతారు. అసత్య ప్రమాణము చేసిన అనేక విపత్తులు కలుగును. దావాలు, కేసులు స్వామివారి ఎదుటనే పరిష్కారమౌతాయి ప్రత్యేకత

## నంది, బలిపీఠము, ధ్వజస్తంభము ఎదురుగా గాక ప్రక్కకు జరిగియున్న దేవాలయం

శివలోక నాదర్ — తిరుప్పుం గూర్

సౌందర్యనాయకి — 5 కి మీ చిదంబరం

4 కి మీ వైదీశ్వరన్ కోయిల్

భక్త నందనార్ అను పంచమకుల భక్తుడు ఆలయమునకు వందగజములు ఎదురుగా నిలబడి శివుని దర్శనమిమ్మని ప్రార్థింప, భక్తునకును తనకును మధ్యన అడ్డుగా నున్న వాటిని ప్రక్కకు తొలగించెను.

## శివునికే గాక 3 కండ్లు గల దేవత

కామాక్షీ దేవి — కంచి

అష్టాదశ పీఠములలో నొకటి

మధ్యనేత్రము అగ్ని నేత్రము. మిగిలిన రెండు సూర్యచంద్రులను పోలియుండును. అమ్మవారు ఉగ్రశక్తితో నరబలులు కోరుచుండుటచే ఆమెను శాంతింప జేయుటకు శ్రీ శంకరాచార్యుల వారు శ్రీ చక్రమును ఈదేవి ఆలయమున స్థాపించిరి కుమారుని చూచి ఉగ్రతను తల్లి తగ్గించు కుంటుందనే భావనతో అమ్మవారి విగ్రహాని కెదురుగా వినాయక విగ్రహాన్ని ప్రతిష్ఠించిరి

## అందరు దేవుళ్ళు, అన్ని దేవాలయాలు (వైష్ణవ సాంప్రదాయానికి సంబంధించినవి) తూర్పు ముఖాలే, కానీ ఒక దేవాలయం, దేవుడు దక్షిణాభిముఖం

శ్రీరంగనాధుడు — శ్రీరంగం

శ్రీ రంగనాయకి — 10 కి.మీ. ట్రిచ్చి

కావేరీ తీరం

శ్రీరామ పట్టాభిషేకానంతరము విభీషణునికి కానుకగా శ్రీరాముడు శ్రీరంగనాధ విమానము నిచ్చెను కానీ ఈ విగ్రహము లంకకు జేరకుండా కావేరీ తీరముననే స్థాపించబడినది. అందుచేత విభీషణుని కోరిక ప్రకారముగా లంకవైపు ముఖం ఉంచుకుని చూస్తూ విభీషణుని కోరిక తీర్చిన స్వామి. లంక దక్షిణ వైపున ఉన్నది. విభీషణుని నిత్యపూజకొరకు.

---

## మూడు వక్షోజములతో పుట్టిన దేవత

మీనాక్షీ దేవి — మధురై

అక్షిత్రయములో నొకటి

మలయధ్వజ మహారాజు, కాంచన మాల మహారాణి పిల్లలకోసం యజ్ఞం చేయగా యజ్ఞగుండం నుండి పార్వతి పసిపాపగా మూడు వక్షోజములతో ఆవిర్భవించినది తన కాబోయే భర్త మీద ఆమె కన్ను ఎప్పుడు పడుతుందో అప్పుడు ఆమె మూడవ వక్షం అంతరించి పోతుందని శివుడు ఆనతిచ్చెను. అందుచేత ఆమెను మగపిల్లవానిగా పెంచి "'తడతగాయ్" అని పిలిచేవారు. తండ్రి అనంతరం ఆమె రాజై, అన్ని రాజ్యాలు జయించి కైలాసగిరికి వెళ్ళి శివుని చూచుట తటస్థించినది. అప్పుడు వెంటనే ఆమె మూడవ వక్షం మాయమైనది. ఆమె మధురైకు తిరిగి వచ్చాక, మధురైలో శివునితో వివాహము జరిగినది. స్వామివారి పేరు సుందరేశ్వరుడు.

## వినాయక చవితి రోజున 34 కేజీల అన్నం ప్రసాదముగా పెట్టు దేవాలయం

వినాయకుడు — మధురై

(ముక్కురుని వినాయక స్వామి)

మీనాక్షి ఆలయం

ప్రసాదాన్ని "కొజు కట్టాయ్" అని పిలుస్తారు. చవితి రోజున ఈ ప్రసాదాన్ని తయారు చేసి, దేవునికి నివేదించి భక్తులకు పంచుతారు.

## కాటుక పెట్టుకుని చీరకట్టుకుని పూలు ముడుచుకుని అర్చన చేయు పూజారి గల దేవాలయము

జంబుకేశ్వరుడు — జంబుకేశ్వరం

అఖిలాండేశ్వరి — 10 కి.మీ తిరుచినాపల్లి

పంచభూత లింగాలలో నొకటి

(జల లింగం)

లింగము క్రింది భాగము నుండి నిత్యం నీరు ఊరుతూ ఉంటుంది. ఈ దేవాలయమునకు సంబంధించి సాలెపురుగు, ఏనుగుల కథ కలదు. బ్రహ్మ హత్యా పాతక నివారణ కోసం శివుడు జంబూక వృక్షం క్రింద తపస్సు చేసిన చోటు

## గోపురము కన్నా ఎత్తుగల విమానము గల ఆలయం

బృహదీశ్వరుడు తంజావూర్
బృహన్నాయకి 40 కి.మీ కుంభకోణం

ఇటువంటి ప్రత్యేకతలున్న "గొప్ప చోళ దేవాలయములలో" (The Great Chola Temples) మొదటిది. లింగము, పానమట్టము చాలా పెద్దవి, ఇచ్చట నున్న నల్లని నంది దేశములోని పెద్ద నందులలో రెండవది. 19 1/2' పొడవు, 8 1/4' వెడల్పు, 12' ఎత్తు. ఆలయ శిఖరము యొక్క నీడ నేలమీద పడదు. ఇది ప్రత్యేకత.

## గర్భగుడిపై టాపులేని అమ్మవారు

వాక్కాళి అమ్మన్ తిరుచినాపల్లి

ఎన్నిసార్లు కట్టినా కప్పుభాగం కూలి పోతుందట. మిట్టమధ్యాహ్నం మండుటెండలోనే పూజారి హారతి యిస్తాడు. ఒక కాలు క్రిందికి ఒక కాలు మడిచి కూర్చుని ఉన్న పెద్ద రాతి విగ్రహం. (ఎర్రనిది).నోటికిరువైపులా చిన్న కోరలున్నవి. అయినప్పటికి అమ్మవారి విగ్రహం చాల అందముగా, ఆకర్షణీయముగా నున్నది.

## పాన మట్టముపై విగ్రహములు లేకుండా ఆరాధన గల ఆలయం

ఆత్మనాధర్ ఔధర కోయిల్ (అవుధర్ - కోయిల్)
(శివుడు - పార్వతి) 102 కి.మీ. తిరుచినాపల్లి

"మనిక్కవ సాగర్" అను భక్తుడు "తిరువసాగం" అను పద్య గ్రంధమును రచించెను. ఈయన పాండ్య రాజుల ముఖ్యమంత్రి. ఈయన నిర్ణయానుసారం దేవాలయం నిర్మించబడినది. అంతా మిధ్య గాన విగ్రహారాధన అనవసరమని వీరి వాదన. దేశములో ఇంకెక్కడా ఇటువంటి ఆలయం కనిపించదు.

## వివాహం కావలసిన కన్యలు ప్రార్థించగా అచిరకాలములోనే వివాహము కలసి వస్తుందని నమ్మే అమ్మవారు

శ్రీ కామాక్షీ దేవి మాంగాడు
20 కి.మీ. మద్రాస్

అమ్మవారు మామిడితోటలో అగ్ని హోత్రము మీద కూర్చుని, ఘోరమైన తపస్సు చేసి, కంచిలోని ఏకాంబరేశ్వరుని మెప్పించి, వివాహమాడినట్లు స్థల పురాణము.

---

**ద్రౌపదీ దేవికి ఆలయము**

ద్రౌపదీ దేవి — వలక్కూర్
దక్షిణ ఆర్కాట్ జిల్లా

ఇక్కడ అమ్మవారిని శ్రీకృష్ణుని భక్తురాలుగా భావించి, పూజ చేస్తారు.

**విష్ణుమూర్తికి సాధారణముగ 4 చేతులుండును. కానీ ఒక్కచోట మాత్రం 8 చేతులతో వెలసి యున్న స్వామివారు**

అష్టభుజ పెరుమాళ్ — కంచి

**కుమార స్వామికి మామూలుగా తేనె అభిషేకము. దీపావళినాడు మాత్రం ఇక్కడ స్వామివారికి తైలాభిషేకం**

కుమారస్వామి — కంచి
(స్వామి నాధుడు)
లేక
గురునాధుడు
లేక
శివగురునాధుడు

శివునికి ప్రణవ రహస్యమును ఉపదేశించెను. కుమర కోష్టమునందు వెలసిన శ్రీ కుమార స్వామి. ఒక్కముఖము, చతుర్భుజాడు. కుమార స్వామికి మామూలుగా ప్రీతి అయినది తేనె.

**పశ్చిమాభిముఖముగా నున్న అష్టభుజ విష్ణుమూర్తి**

అష్టభుజాడు — కంచి
(ఎనిమిది చేతుల విష్ణుమూర్తి) చిన కంచి — (విష్ణుకంచి)

**ఉత్తరాభిముఖుడైన ఈశ్వరుడు**

కచ్ఛపేశ్వరుడు — కంచి
విష్ణు ప్రతిష్ఠ — (శివకంచి)
కచ్ఛపము అనగా కూర్మము

## పశ్చిమాభి ముఖముగా నున్న విష్ణుమూర్తి అవతారము

| | |
|---|---|
| వామనమూర్తి | కంచి<br>పెదకంచి<br>(శివ కంచి) |

## కంచిలోని వామనమూర్తి వద్ద వెలసిన అమ్మవారు

| | |
|---|---|
| అమృతవల్లి తాయారు | కంచి<br>పెదకంచి<br>(శివ కంచి) |

## పాండవ దూతగా వెళ్ళిన శ్రీకృష్ణుడు ఉన్న ఆలయము

| | |
|---|---|
| (శ్రీకృష్ణుడు) పాండవదూత పెరుమాళ్ | కంచి |
| (పాండవ దూతగా) | |
| రుక్మిణి, సత్యభామ | |

విగ్రహము విష్ణుమూర్తి ఆకారము. కౌరవసభలో ప్రదర్శించిన విశ్వరూప వైభవము వెలసిన స్వామి. విగ్రహం ఎత్తు 25'

## మగపిల్లలు ప్రసాదించు స్వామివారు

| | |
|---|---|
| సుబ్రహ్మణ్య స్వామి | తిరుత్తణి |
| శ్రీవళ్ళి, దేవసేన | 62 కి.మీ. తిరుపతి<br>42 కి.మీ. కంచి<br>82 కి.మీ. మద్రాస్<br>On the way to Madras<br>From Tirupathi |

ఆరు ప్రసిద్ధ సుబ్రహ్మణ్య క్షేత్రములలో నొకటి.

**ప్రతి సోమవారం వజ్ర కిరీటంతో అలంకరిస్తారు. ప్రతినెల బంగారు రథోత్సవము జరుగుతుంది**

మీనాక్షీ దేవి మధురై

మధురై వుత్సవాల పట్టణముగా ప్రసిద్ధి పొందినది.

**"ఆండాళ్ళు" అమ్మవారు (విష్ణుమూర్తి భార్య) పుట్టిన స్థలము**

ఆండాళ్ళు సిరివిళ్ళి పుత్తూర్
74 కి.మీ. మధురై

**"శ్వేత విఘ్నేశ్వర" క్షేత్రము**

కుంభేశ్వరుడు కుంభకోణము
మంగళాంబిక తంజావూరు జిల్లా
శ్వేత వినాయక
కావేరి నదీ తీరము

**దేశములోని అతి ఎత్తైన గోపురము**

అరుణాచలేశ్వరుడు తిరువణ్ణామలై
ఉమాదేవి 80 కి.మీ. వెల్లూరు
తేజోలింగము

పంచభూత లింగములలో నొకటి. 4 పెద్ద గోపురములు. ఒకదానిని శ్రీ కృష్ణ దేవరాయలు కట్టించెనట. ఇది చాల పెద్దది

**కోనేటిలో కేజి, కేజీల బెల్లము కలుపు క్షేత్రము**

శ్రీ వీర రాఘవ స్వామి — తిరువళ్ళూరు
కనకవల్లీ తాయారు — 51 కి.మీ. కంచి

మ్రొక్కుబడులున్నవారు చేతికి కడియం ధరింతురు. అతి నీరసము తగ్గించు పుణ్య క్షేత్రము.

**బ్రహ్మదేవునిచే ప్రత్యేకముగా ప్రతిష్ఠింపబడి, పూజింపబడిన శివలింగము**

కపాలేశ్వరుడు — మద్రాసు
మైలాపూరు

**ఒక నిముషము నిర్మల మనస్సుతో దైవధ్యానము చేసిన సకలవిధ పురుషార్థములు లభించు క్షేత్రము**

యోగానంద నృసింహ స్వామి — ఘటికాచలము
అమృతవల్లి తాయారు — లేక
యోగానంద ఆంజనేయస్వామి — చోళంగిపురం
60 కి.మీ. మద్రాసు
30 కి.మీ. ఆర్కోణం

**శివుని పాదానికి "వైర కవచము" అనే పేరుగల మణులు, మరకతాలు, కెంపులు, పొదిగిన హారమును తయారు చేయించి అలంకరించిన మూర్తి**

నటరాజ స్వామి — చిదంబరము
శివకామ సుందరి

నాట్య భంగిమలోనున్న స్వామివారి పై కెత్తబడిన ఎడమ పాదానికి హారముతో అలంకరింతురు.

---

దుఃఖాల చీకట్లో దేవుని దయకోసం వేడుకోవాలి
సుఖాల వెలుగులో దేవుని దయ గురించి పాడుకోవాలి

**స్వామివారికి నిత్యము అన్నాభిషేకము జరుగుచున్నది**

నటరాజస్వామి చిదంబరము
శివకామ సుందరి

**దేశములో అతి పెద్ద నంది "లేపాక్షి". నంబరు 2 స్థానముగల నంది**

నటరాజ స్వామి చిదంబరము
శివకామ సుందరి

ఇచ్చట నంది దేశములో రెండవ పెద్ద నందిగా భావింపబడుచున్నది. రెండవ ప్రాకారములో నున్నది. చూడడానికి కనులకింపుగా ఉన్నది.

**దేశములో మూడవ పెద్ద నందిగల ఆలయము**

బృహదీశ్వరుడు తంజావూరు
బృహన్నాయకి

**దేశములో నాల్గవ పెద్ద నంది గల ఆలయం**

స్థానుమాలయ స్వామి సుచీంద్రం
19 కి.మీ. కన్యాకుమారి

స్వామివారికి ఎదురుగా ఉన్నది. ఆంజనేయస్వామి వారికి పెద్ద విగ్రహము కూడ కలదు. దీనికి వెండి తొడుగు వేయించినారు.

**పరమేశ్వరుడు చతుర్భుజుడుగా నున్న దేవాలయము**

పరమేశ్వరుడు షీర్‌కాశి
పార్వతీ దేవి 18 కి.మీ. చిదంబరం

తిరుజ్ఞాన సంబంధార్ అను భక్తుని జన్మస్థానము. పార్వతీదేవి ఈ భక్తునికి బంగారు గిన్నెతో పాలు త్రాగమని ఇచ్చిన స్థలము.

### నవగ్రహములన్నింటికి విడి విడిగా ఆలయములున్న క్షేత్రము

వైదీశ్వరన్ | వైదీశ్వరన్ కోయిల్
తెయ్యల నాయకి | 6 కి.మీ. షీర్‌కాశి
తంజావూర్ జిల్లా

సూర్యనారాయణ స్వామికి, ఇతర గ్రహములకు విడివిడిగా దేవాలయములు గలవు.

### "సిద్ధామృత తీర్థము" అని పేరుగాంచిన క్షేత్రము

వైదీశ్వరన్ | వైదీశ్వరన్ కోయిల్
తెయ్యల నాయకి | 6 కి మీ. షీర్‌కాశి
24 కి.మీ. చిదంబరము

అంగారకునకు కుష్టురోగమును నివారణ చేసిన స్థలము. ఇచ్చట స్వామివారు కుష్టురోగ నివారణకు ప్రసిద్ధి. ఇచ్చట గల వృక్షము వేపచెట్టు.

### శ్రీ కృష్ణదేవరాయల కుమారుడు అచ్యుత దేవరాయలు తులాభారము తూగి, ఆ ధనమును పంచి యిచ్చిన పుణ్యక్షేత్రము

40 దేవాలయములు | కుంభకోణం
వెలసిన పుణ్యక్షేత్రము | తంజావూర్ జిల్లా

"మహామాఘం" అను కొలనులో స్నానమాచరించి, తులాభారము తూగి, ఆ ధనమును పంచియిచ్చిరట.

### "యమ తీర్థము" అను పేరుగల కొలనుగల క్షేత్రము

ఐరావతేశ్వరుడు | దరసురామ్
3 కి.మీ. కుంభకోణము

రాక్షసుని శాపముచే తాపమందుచున్న యముని తాపమును పోగొట్టిన స్వామి. ఈ కొలనుకు నీరు కావేరీ నదినుండి వచ్చును.

---

దురలవాట్లు మొదట్లో సాలెగూళ్ళు ఇరుక్కున్న తరువాత ఇనుప సంకెళ్ళు

**బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులకు దేవాలయములున్న క్షేత్రము**

1. బ్రహ్మ, సరస్వతి — కండియూర్
2. శాపవిమోచన పెరుమాళ్, లక్ష్మీదేవి — 10 కి మీ తంజావూర్, తంజావూర్ జిల్లా
3. బ్రహ్మశిర ఖండేశ్వరార్, మంగళాంబికా తాయారు

బ్రహ్మ శిరస్సు శివుని చేతికి అంటుకున్నదాన్ని విడిపించిన క్షేత్రము

**"దక్షిణ ద్వారక" అని పిలువబడే క్షేత్రము**

రాజమన్నార్
చంపక లక్ష్మి

మన్నార్‌గుడి
42 కి.మీ. తంజావూర్
తంజావూర్ జిల్లా

హంద్రనాధ్ అని పిలువబడే పెద్ద కొలను గలదు. మార్చ్‌నెలలో బ్రహ్మోత్సవము, జూన్‌నెలలో తెప్పోత్సవము జరుగును.

**రాతి రథము, రథ చక్రము కింద పిల్లవాని విగ్రహము, దగ్గరలో ఆవు, దూడ విగ్రహాలు గల క్షేత్రము**

శ్రీ త్యాగరాజ స్వామి — తిరువారూర్, తంజావూర్ జిల్లా

"మనునీతి చోళన్" అను రాజు న్యాయబుద్ధికి పేరుగలవాడు. శివుడు ఆవుగను, యముడు దూడగను వచ్చెను. రాకుమారుని రథము క్రింద దూడపడి చనిపోయెను. అపరాధమునకు రాజు తన కుమారుని రథము క్రింద వేసి, చంపించెను. ఆవునకు పుత్రశోకము కలిగినట్లు, రాజునకు పుత్రశోకము కలిగెను. శివుడు రాజుయొక్క న్యాయబుద్ధిని ప్రశంసించెను. ఆవుదూడను, రాకుమారుని బ్రతికించెను.

---

యోగమార్గాన్ని చేపట్టిన కపట సన్యాసికన్న, సత్యవంతుడు,
నీతివంతుడు అయిన గృహస్థు వెయ్యిరెట్లు నయం

**శివలింగము బంగారు రేకుతో కప్పబడి, దానిపై 5 శిరస్సులు గల సర్పము యొక్క పడగ ఉండి, క్రింద లింగాన్ని చుట్టబెట్టుకుని, అమ్మవారు విగ్రహము లేకుండ, అమ్మవారి పాదుకలు (బంగారువి) మాత్రమే ఉండి, పూజింపబడు దేవాలయము**

పరమేశ్వరుడు — అవడయార్ కోయిల్
పార్వతి అమ్మవారు — 135 కి.మీ. వేదారణ్యం
తంజావూర్ జిల్లా

మూడు ప్రాకారములుగల దేవాలయము.

**విభీషణుడు స్వామివారిని అర్ధరాత్రములందు పూజించు ఆలయము**

శ్రీరంగ నాధుడు — శ్రీ రంగము
శ్రీరంగ నాయకి — 13 కి.మీ. తిరుచినాపల్లి
కావేరీ నదీ తీరము — తిరుచినాపల్లి జిల్లా

**రావణబ్రహ్మ శివుని ఆత్మలింగాన్ని లంకకు తీసుకుని వెళ్ళకుండా, వినాయకుని సహాయముతో భారతభూమిపై స్థాపించబడినట్లే, విభీషణుడు అయోధ్యనుండి రామునివద్ద నుండి బహుమతిగా పొందిన విష్ణుమూర్తి విగ్రహాన్ని, మరల వినాయకుని సహాయముతో భారతభూమిపై లంకకు పోకుండా ఆపి, స్థాపించ బడిన స్వామివారు, ఆలయము**

శ్రీరంగనాధుడు — శ్రీరంగము
శ్రీ రంగనాయకి
కావేరీ నదీ తీరము

అయోధ్యలో రామపట్టాభిషేక సమయమున, విభీషణుని కోరికపై అక్కడ పూజింపబడుతున్న రంగనాధస్వామి వారిని శ్రీరాముడు విమానముతో సహా బహూకరించెను. ఈ తరలింపునకు ఇష్టములేని దేవతలు విఘ్నేశ్వరుని సహాయముతో భూస్థాపితమొనరించిరి

**"భూలోక వైకుంఠము" అని పిలువబడే క్షేత్రము**

శ్రీరంగనాధుడు — శ్రీరంగము
శ్రీ రంగనాయకి
కావేరీ నదీ తీరము

---

## "కనక సీత" గల దేవాలయము

శ్రీరంగనాథుడు — శ్రీరంగము
శ్రీ రంగనాయకి
కావేరీ నదీ తీరము

దేవాలయపు రెండవ ప్రాకారములో కనకసీత అమ్మవారి విగ్రహము కలదు.

## దేవాలయ ప్రాకారములలోనే కాపుర ముండుటకు మేడలున్న దేవాలయము

శ్రీ రంగనాథుడు — శ్రీ రంగము
శ్రీ రంగనాయకి
కావేరీ నదీ తీరము

## పవళించి ఉన్న శ్రీరాముని విగ్రహమున్న దేవాలయము

కోదండరాముడు — దర్భశయనము
9 కి.మీ. రామనాధపురం R.S
రామనాధపురం జిల్లా

విభీషణ, సుగ్రీవ విగ్రహములు కలవు. సముద్రము నుండి 5 కి.మీ. దూరములో కలదు. సముద్రుని ప్రసన్నుని చేసుకొనుటకు శ్రీరాముడు దర్భశయనుడైన విగ్రహము. (సేతు బంధనాన్కి ముందు)

## శ్రీరాముడు ఒక చేతిని పైకెత్తి, సీతతో మాట్లాడుచున్నట్లు విగ్రహమున్న దేవాలయము

శ్రీరాముడు — ఏకాంత రామేశ్వరము
5 కి.మీ. రామేశ్వరము
రామనాధపురం జిల్లా

సేతువు నిర్మాణ సమయమున రాముడు వేంచేసిన స్థలము. సముద్రపుటోరు నుండి దూరముగ ఉంటూ సీతనే తలచుకుంటూ శ్రీరాముడు ఏకాంతముగ నున్న స్థలము.

---

**Mr. Rous Peter అను జిల్లా కలెక్టరు బహుమతిగా ఇచ్చిన సువర్ణమయ ఆభరణములు గల అలయము**

సుందరేశ్వరుడు — మధురై
మీనాక్షి — మధురై జిల్లా

కలెక్టరు వేటాడు సమయములో మదించిన అడవి ఏనుగు యొక్క ప్రమాదము అమ్మవారి దయ వలన తప్పినదని భావించి, కలెక్టరు అమ్మవారికి సువర్ణమయ ఆభరణములు సమర్పించు కొనెను

**ఈస్ట్ ఇండియా కంపెనీ వారు 108 సవర్ణసువర్ణాభరణములు బహూకరించిన దేవాలయము**

సుందరేశ్వరుడు — మధురై
మీనాక్షి దేవి

**"విల్లి" అను చెంచు రాజుచే నిర్మించబడిన దేవాలయము**

శ్రీరంగనాధుడు — శ్రీ విల్లిపుత్తూర్
ఆండాళ్ళమ్మ — 16 కి.మీ. శివకాశి
గరుడాళ్వార్

**ప్రతిరాత్రి వేణుగానము చేయు దేవాలయము**

కుర్తాళేశ్వరుడు — కుర్తాళము
నిరేదునాద వాణి — 6 కి.మీ. టెంకాశి

కుర్తాళం జలపాత సమీపమునగల దేవాలయము.

---

రాజకీయ నాయకుడు భగవంతునికి కూడా దొరక్కుండా తప్పించుక తిరుగగలడు

**అర్ధరాత్రి వరకు పూజలు చేసి, మంత్రోదకము 40 రోజులు సేవించిన మతి స్థిమితము లేని వారికి స్వస్తత చేకూర్చు స్వామివారు**

శంకర నారాయణుడు
(సగము శంకరుడు
సగము విష్ణువు)
గోమతి అమ్మవారు

శంకర నారాయణ కోయిల్
32 కి మీ. రాజుపాలెం
తిరునల్వేలి జిల్లా
కన్యాకుమారికి దగ్గరగా

షణ్ముఖ, నటరాజస్వామివారి ఆలయములు గలవు.

**స్వామివారికి అభిషేకముగ వాడిన నూనె కీళ్ళ నొప్పులు తగ్గించును**

తోతాద్రినాధ స్వామి
ఆండాళ్ళు అమ్మవారు

తోతాద్రి
35 కి.మీ. తిరునల్వేలి బస్సు
తిరునల్వేలి-నాగర్ కోయిల్ రూటు
తిరునల్వేలి జిల్లా

స్వామివారిని భూమినుండి తీయునపుడు గాయమగుటచే నూనెతో అభిషేకము. డబ్బాలు డబ్బాలుతో అభిషేకము చేయు నూనె గర్భగుడి బయటగల గుంటలలో నింపి, సీసాలలో పోసి, అమ్మెదరు.

**"ధర్మ సంవర్ధిని" అని పిలువబడే శివలింగము**

స్థానేశ్వరుడు (బ్రహ్మచారి)
ఫలయార్ నదీ తీరము

సుచీంద్రము
నాగర్‌కోయిల్-కన్యాకుమారి మధ్యలో
15 కి.మీ. కన్యాకుమారి
కన్యాకుమారి జిల్లా

అనసూయ త్రిమూర్తులను పసిపిల్లలుగా చేసిన స్థలము. ఇచ్చట బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు ముగ్గురూ ఏక రూపము దాల్చి లింగాకారముగ వెలసిఉన్న స్థలము. ఈ ఏకమూర్తిని "ధర్మసంవర్ధిని" అని పిలుతురు.

## అనసూయ సాధ్వి త్రిమూర్తులను పసిపిల్లలు గావించిన దివ్య క్షేత్రము, దేవాలయము

స్థాణేశ్వరుడు — సుచీంద్రము
(స్థాణు మాలయ స్వామి)
(బ్రహ్మచారి)
ఫలయార్ నదీ తీరం

అనసూయ పాతివ్రత్య మహిమచే సుచి అయిన ప్రాంతము గాన శుచీంద్రమని పేరు వచ్చినది

## 3 నిద్రలు చేయు ఆచారముగల దేవాలయము

కన్యక అమ్మవారు — కన్యాకుమారి
(పార్వతి అంశ) — కన్యాకుమారి జిల్లా

కాశీయాత్ర చేయువారు కన్యాకుమారి అమ్మవారిని దర్శించాలని నియమము. ఇచ్చట యాత్రికులు 3 నిద్రలు చేయు ఆచారము గలదు.

## పృధ్వికి హృదయముగా భావించబడే క్షేత్రము

అరుణాచలేశ్వరుడు — తిరువణ్ణామలై
(తేజో లింగము) — 80 కి.మీ వెల్లూర్
ఉమాదేవి — (రాయ వెల్లూర్)

పంచభూత లింగాలలో నొకటి. నాలుగు పెద్ద గోపురములు గల ఆలయం. అరుణాచల ప్రదక్షిణం చేసిన ప్రపంచ ప్రదక్షిణకు సమానము.

## 9 గాయములు గల నంది వెలసిన ఆలయము

శ్వేతారణ్యేశ్వర — తిరువేంగాడు
బ్రహ్మవిద్యానాయకి — తంజావూరు జిల్లా
12 కి.మీ. షియాలి (R.S)

మరుత్వాసురుడనే రాక్షసుడు ప్రజలను, సాధుజనులను బాధిస్తూండగా, భక్తుల కోరికపై శివుడు నందిని పంపించెను. నంది రాక్షసులను ఓడించి, సముద్రములో పారవైచి వచ్చెను రాక్షసుడు శివుని గూర్చి తపస్సుచేసి, మెప్పించి, శివుని శూలమును పొంది, మరల విజృంభించెను. శివుడు మరల నందిని పంపించెను. తన యజమాని ఆయుధమును పూని వచ్చినవానితో యుద్ధము చేయక నంది మిన్నకుండెను. అసురుడు నందిని 9 చోట్ల గాయపరచెను. నంది తలవంచుకుని శివుని వద్దకు వచ్చెను. శివుడు కోపించి, అసురునిపై మూడవ కన్ను తెరచెను. అసురుడు భస్మమయ్యెను. గాయముల బాధనుండి నంది విముక్తుడైనా గాయములట్లే మిగిలినవి.

---

**చోళరాజు, రాణి కలసి శివలింగాన్ని పూజిస్తూ రాణి మెడలోని రత్నాల హారంను శివలింగమునకు అలంకరిస్తే బాగుంటుందను కున్నారు. తరువాత రాణి మెడలో హారము కనిపించలేదు. ఎట్లా పోయినదో, ఎక్కడ పోయినదో తెలియలేదు. కావేరీ నదీ జలాన్ని తిసికొని వచ్చి స్వామివారిపై అభిషేకం చేస్తూ ఉండగా, రాజు, రాణి చూస్తూ ఉండగా హారము లింగముపై అభిషేక జలము నుండి పడినది. ఆ అపూర్వ సంఘటనకు రాజు, రాణి చాల సంతసించి ధన్యులమైనామని తలచిన ఆలయం**

జంబుకేశ్వరుడు — జంబుకేశ్వరం
(జల లింగం) — 3 కి మీ శ్రీరంగం
అఖిలాండేశ్వరి
కావేరీ తీరం

**ప్రతిరోజూ కాశీ నుండి గంగానదీ జలాన్ని తెప్పించి అభిషేకము చేసే రెండు శివాలయములు**

1. రామలింగేశ్వరుడు — 1 రామేశ్వరము
శ్రీరామ చంద్ర ప్రతిష్ఠ — (తమిళనాడు)
బంగాళాఖాత తీరము

2 సోమనాధుడు — 2. సోమనాధ్
(జ్యోతిర్లింగము) — ప్రభాస తీర్ధము
అరేబియా సముద్ర తీరము.

**ఢిల్లీ పాదుషాల సేనాని అయిన మల్లిక్కాఫర్ ధ్వంసం చేసిన అమ్మవారి దేవాలయం**

మీనాక్షి — మధురై
సుందరేశ్వరార్

మహ్మదీయ పరిపాలనలో 50 సంవత్సరములు ఈ దేవాలయం మూతబడిపోయినది. వారి పాలన అంతరించిన తరువాత తిరిగి తెరువబడినది

**4 గోపురముల ద్వారా సింహ ద్వారము లున్నప్పటికి, మండపము ద్వారానే ప్రవేశం గల దేవాలయం**

మీనాక్షీదేవి — మధురై
సుందరేశ్వరుడు

అమ్మవారి విగ్రహమునకు దారి సరాసరి మండపానికి ఎదురుగా ఉన్నందున

---

## Mr. Rous Peter కలెక్టర్ గారి నుండి విలువైన బంగారు ఆభరణములు రెండవసారి బహుమతిగా పొందిన అమ్మవారు

మీనాక్షీ దేవి — మధురై

ఒకరాత్రి విపరీతమైన వర్షము పడుచున్నది. కలెక్టరుగారు మంచి నిద్రలోనున్నారు ఒక చిన్న పిల్లవచ్చి ఆయనను తట్టి లేపి వెంటనే భవనమునుండి బయటకు వెళ్ళమని చెప్పినది కలెక్టర్‌గారు వెంటనే లేచి బయటకు వెళ్ళగానే, పిడుగుపాటుతో భవనము కూలిపోయినది అట్లా హెచ్చరించి లేపిన పాప అమ్మవారేనని గ్రహించి ఎన్నో ఆభరణములు చేయించెను ఈ విధముగా ఇంగ్లీషు కలెక్టరుకు అమ్మవారిపై రెండవసారి గురి కలిగినది.

## తమ సోదరి వివాహానికి బయలుదేరి, వివాహము అయిపోయినదని తెలిసికొని (నదీ తీరము వరకు వచ్చిన తరువాత) తిరిగి వెళ్ళిపోయిన స్వామివారు

అజఘర స్వామి — అలఘర్ కోయిల్
21 కి.మీ. మధురై

మధుర మీనాక్షి ఈయన సోదరి సుందరేశ్వరునితో ఆమె వివాహమని, వివాహము చూద్దామని తన ఆలయమునుండి బయల్దేరి వైఘై నదీ తీరము వరకు వచ్చిన తరువాత, వివాహమయిపోయినదని తెలిసి స్వామివారు తిరిగి వెళ్ళిపోయినారు ఈ ఉత్సవాన్ని గొప్పగా జరుపుతూ ఉంటారు. ప్రతి సంవత్సరం స్వామివారిని వైఘైనదీ తీరము వరకు తీసుకుని వచ్చి తిరిగి తీసుకుని వెడుతుంటారు. వేలాదిమంది భక్తులు రకరకాల వాయిద్యాలతో ఈ యాత్రా ఉత్సవాన్ని గొప్పగా జరుపుకుంటారు.

## బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు లింగాకారములో నున్న దేవాలయం

స్థాణుమాలయ స్వామి (శివలింగం) — శుచీంద్రం
13 కి.మీ. కన్యాకుమారి
19 కి.మీ. నగర్ కోయిల్

పై భాగము శివుడు, మధ్య విష్ణువు, అడుగు భాగమున బ్రహ్మ "స్థాణు"-శివ, "మాల్" 6విష్ణు, "అయన్"- బ్రహ్మ, అత్రి, అనసూయల కోరిక ప్రకారం త్రిమూర్తులు ముగ్గురూ ఇక్కడ అవతరించిరి

---

**ఇంద్రుడు చేసిన పాపం పోవడానికి ప్రతిరోజూ పూజ చేయమని శివుడు శాసించగా, ప్రతిరోజు రాత్రి ఇంద్రుడు పూజించే దేవాలయం**

స్థాణు మాలయ స్వామి శుచీంద్రం
(లింగాకారం)

బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు ముగ్గురూ గల శివలింగం ఇక్కడ పూజారులు రోజూ మారుతూ ఉంటారు. వారు చూసిన పూజా సామానుల మార్పు విధానము బయటకు చెప్పకూడదను నియమమున్నది. ప్రతి అర్ధరాత్రి ఇంద్రుడు వచ్చి పూజ చేయుచున్నందున పూజా ద్రవ్యములు ఉదయానికి వేరువేరుగా మార్చి ఉంటాయి.

**దేశములో ఒకే రాతితో చెక్కబడిన 18' ల ఎత్తుగల ఆంజనేయస్వామి వారి విగ్రహమున్న దేవాలయం**

ఆంజనేయ స్వామి శుచీంద్రం
నల్లని ఏకరాతి విగ్రహం

స్వామివారికి పూర్తిగా వెండి తొడుగున్నది. అశోకవనములో సీతాదేవికి భక్తిభావముతో కనిపించిన ఎత్తైన ఆంజనేయుడు.

**అయ్యవారి గుడికై అమ్మవారి గుడికి కలిపి మధ్య కట్టిన చెయిన్ (Chain) మండపం గల దేవాలయం**

స్వామివారు : నెల్లియప్పార్ తిరునల్వేలి
అమ్మవారు . కాంతిమతి అంబాళ్

ఈ రెండు దేవాలయములను కలిపి చెయిన్ మండపం కట్టి ఒకే దేవాలయముగా రూపొందించినారు ఈ మండపంలో సంగీత స్తంభములు (Musical Pillars) ఉన్నవి.

**శంకరుని, గోమతి అమ్మవారికి మధ్యలో శంకర నారాయణ (శివ+విష్ణు) స్వామివారి దేవాలయం**

శంకర నారాయణ శంకర నారాయణ్ కోయిల్
తిరునల్వేలి జిల్లా
87 కి.మీ త్రివేంద్రం

కోరిన వెంటనే రోగాలను దూరం చేయగల స్వామివారు అమ్మవారు పిలిస్తే పలుకుతుందని, కోరికలు తీరుస్తుందని నమ్మిక.

---

### ఇంగ్లీషు కలెక్టర్ విలియం గేరో (William Garrow) గారి కలలో కనిపించిన దేవత

వేదనాయకి
సంగమేశ్వరుడు

భవాని
15 కి.మీ. ఈరోడ్
కోయంబత్తూర్ నుండి బస్సు

ఈస్టిండియా కంపెని రోజులలో కోయంబత్తూర్‌కు కలెక్టర్ విలియం గేరో. వీరికి ఒకనాటి రాత్రి కలలో అమ్మవారు కనిపించి, కలెక్టర్‌గారు నివసిస్తున్న బంగ్లాను వెంటనే ఖాళీ చేయమని హెచ్చరించినదట. నమ్మకముపై ఆయన వెంటనే ఖాళీ చేసెను. బంగ్లాయావత్తు కుప్పకూలి పోయినది. కృతజ్ఞతా పూర్వకముగా అమ్మవారికి దంతపు ఊయలను (తన సంతకముతో) బహూకరించెను.

### "త్రివేణి ఆఫ్ సౌత్ ఇండియా" అని పిలువబడే క్షేత్రము

వేదనాయకి
సంగమేశ్వరుడు

భవాని

భవాని, కావేరి, సరస్వతి నదుల సంగమ స్థానం. (సరస్వతీ నది అంతర్వాహిని) ఇచ్చట శివరాత్రికి గొప్ప ఉత్సవం జరుగుతుంది.

### విష్ణుమూర్తి చేతిలోని శంఖము ఆకారములో నిర్మించబడిన దేవాలయం

రామలింగేశ్వరుడు
పర్వత వర్ధినీ దేవి

రామేశ్వరం
71 కి.మీ. మధురై

తూర్పు నుండి పడమర 264 మీటర్లు, ఉత్తరము నుండి దక్షిణమునకు 200 మీటర్లు. 3 ప్రాకారములు, 2 గోపురములు, 2 అసంపూర్తి గోపురములు గల ఆలయం. సముద్రానికి అతి దగ్గరలో (బంగాళా ఖాతం)

### దేవాలయం చుట్టు ప్రక్కల మొత్తం దీవిలో ఎక్కడా వ్యవసాయం చేయడంగాని, ఆయిల్ గురించి త్రవ్వడం గాని చేయకూడదని నియమం గల దేవాలయం

రామలింగేశ్వరుడు
పర్వత వర్ధినీ దేవి

రామేశ్వరం

రామేశ్వర క్షేత్రము ఒక దీవిపై ఉన్నది. మండపం స్టేషను నుండి పాంబన్ వరకు సముద్రముపై రైలు బ్రిడ్జి కలదు. కొత్తగా రోడ్డు బ్రిడ్జిని కూడ నిర్మించిరి. ఈ దీవిలో తాడి, కొబ్బరి, చింతచెట్లు వగైరా చెట్లు వాటంతటవే మొలవాలిగానీ వ్యవసాయం చేసి పంటలు పండించరాదు.

---

యమున - నది సూర్యుని కుమార్తె తల్లి సజన యమధర్మరాజు సోదరి కాళింది పర్వతం గుండా ప్రవహించుటచే కాళింది అని పిలువబడుచున్నది

## అయ్యవార్లకు కుడిప్రక్కగానున్న అమ్మవార్లు

| | | |
|---|---|---|
| 1. | రామలింగేశ్వరుడు<br>పర్వత వర్ధినీ దేవి | రామేశ్వరం<br>(తమిళనాడు) |
| 2. | కోదండ రాముడు<br>సీతాదేవి | రామేశ్వరం<br>(తమిళనాడు) |
| 3. | సుందరేశ్వరుడు<br>మీనాక్షీ దేవి | మధురై<br>(తమిళనాడు) |
| 4. | శ్రీరంగనాధుడు<br>రంగనాయకి | శ్రీరంగం<br>(తమిళనాడు) |
| 5. | శ్రీ వేంకటేశ్వరుడు<br>పద్మావతి | తిరుమల<br>(ఆంధ్రప్రదేశ్) |

## రామలింగేశ్వర ఆలయములో రామనాధ లింగముతోబాటు గర్భగుడిలో గల రెండు ఇతర లింగములు

| | | |
|---|---|---|
| 1. | గంధమాదన లింగం | రామేశ్వరము |
| 2. | అగస్త్య లింగము | |

ఆంజనేయుడు తీసుకుని వచ్చిన విశ్వనాధ లింగము వేరే గర్భగుడిలో నున్నది.

## గొలుసులతో బంధింపబడి ఉన్న విష్ణుమూర్తి విగ్రహం, ప్రక్కన లక్ష్మీదేవి విగ్రహం గల దేవాలయం

విష్ణుమూర్తి, లక్ష్మీదేవి రామేశ్వరం

పాండ్య రాజైన పుణ్యనిధి (మధురై నగరానికి రాజు) రామేశ్వరం వచ్చి విష్ణుమూర్తి అనుగ్రహమునకై యజ్ఞము చేసెను. విష్ణుమూర్తి రాజును పరీక్షించుటకై లక్ష్మీదేవిని ఒక అనాధ బాలికగా రాజు వద్దకు పంపెను. రాజుకు ఆడపిల్లలు లేనందున అనాధ బాలికను ప్రేమతో సాకెను. ఆ అనాధ బాలిక చక్కని రాకుమారిగా పెరిగెను. ఒకనాడు విష్ణుమూర్తి రాజును పరీక్షింప దలిచి ముసలి సన్యాసి రూపమున అంతఃపురము జొచ్చెను. ఈ విషయం తెలిసిన వెంటనే రాజుగారు సన్యాసిని బంధించి గొలుసులతో కట్టి వైచెను. ఆ రాత్రి కలలో రాజుగారికి కనిపించి ముసలి సన్యాసి విష్ణుమూర్తిగాను, రాకుమారి లక్ష్మీదేవిగాను తెలియజేసెను. మరునాడు ఉదయాన్నే దేవాలయానికి వచ్చిచూస్తే విష్ణుమూర్తి విగ్రహం గొలుసులతో బంధించబడి ఉన్నది. రాజుగారు దుఃఖించి చాల పశ్చాత్తాపము నొందెను. అంత, విష్ణుమూర్తి రాజునోదార్చి ఇకముందు తాను సంకెళ్ళతోనే దర్శనమిచ్చెదననియు, చింతించవలదనియు ఆదేశించెను.

---

**శ్రీరాముని పాదములున్న పర్వతము**

గంధమాదన పర్వతము — రామేశ్వరము 4 కి.మీ దూరములో

**సముద్రములో ప్రతిష్ఠించబడిన నవగ్రహములున్న చోటు**

రామేశ్వర దీవిలో సేతువుకు దగ్గరలో సముద్రములో 2 ఫర్లాంగులు లోపలికి — దేవీ పట్టణం లేక నవ పాషాణము రామేశ్వరము దీవి

శ్రీరాముడు సేతు నిర్మాణమునకు ముందు నవగ్రహ అనుగ్రహము కొరకు సముద్రములో రాళ్ళ రూపములో నవగ్రహాలను ప్రతిష్ఠించి, పూజించెను. సముద్రములో 2 ఫర్లాంగుల దూరం లోపలకు వెళ్ళినను మొలలోతు వరకు మాత్రమే నీరు వుండును.

**రామేశ్వరానికి (రామనాథ పురానికి) 16 కి.మీ. దూరములోని ఉత్తర కోశ మంగై అనే గ్రామములో నున్న శివాలయం, అమ్మవారు**

మంగళేశ్వర — ఉత్తర కోశ మంగై

మంగళేశ్వరి — 16 కి.మీ. రామనాథపురం

**కావేరీ, కొల్లాడం నదుల మధ్య ఏర్పడిన దీవిలో నున్న ముఖ్యమైన 1. వైష్ణవాలయం, 2. శివాలయం, 3. శక్త్యాలయం**

వైష్ణవాలయం :

శ్రీరంగనాధుడు — శ్రీరంగం

శివాలయం : — 3 కి.మీ. శ్రీరంగం

జంబుకేశ్వరుడు — జంబుకేశ్వరం

శక్త్యాలయం : — సమయపురం

మారియమ్మ — 11 కి.మీ. శ్రీరంగం

### తిరుమలలోని శ్రీ వేంకటేశ్వర విమానానికి బంగారు పూత ఉన్నట్లే దక్షిణాన బంగారుపూత ఉన్న విమానం

| | |
|---|---|
| శ్రీరంగనాధుడు | శ్రీరంగం |
| | 10 కి.మీ. తిరుచినాపల్లి |

### ఆంధ్రదేశములోని వరంగల్‌లో ఉన్న వెయ్యి స్తంభాల మండపం వలె వెయ్యి స్తంభాల మండపాలున్న దేవాలయములు

| | |
|---|---|
| 1. శ్రీరంగనాధుడు | శ్రీరంగం |
| 2. శ్రీ నటరాజ స్వామి | చిదంబరం |
| 3. అరుణాచలేశ్వరుడు ఉమాదేవి ఆలయములో | అరుణాచలం |

### ఇంగ్లీషు అధికారి లయోనల్ ప్లేస్ (Lionel Place ) నిర్మించిన సీతారామాలయం

| | |
|---|---|
| సీత | మధురాంతకం |
| శ్రీరాముడు | (తమిళనాడు) |
| | శ్రీరంగానికి, ట్రిచ్చీకి దగ్గరలో |

ఇంగ్లీషు అధికారి ప్రార్ధనపై భీభత్సమైన కావేరీ వరదలు వెంటనే ఆగిపోయినవి. అందుచేత ఆలయం నిర్మించి సీతారాముల విగ్రహ ప్రతిష్ఠజరిపించెను.

### ఏనుగు, సాలెపురుగు మోక్షము పొందిన చోటు, మోక్షమిచ్చిన స్వామివారు

| | |
|---|---|
| జంబుకేశ్వరుడు | తిరువణ్ణాయక |
| అఖిలాండేశ్వరి | (లేక) జంబుకేశ్వరం |
| | 3 కి. మీ. శ్రీరంగం |

పుష్పదత్తమాళ్యావఅను శివుని సేవకులు శాపవశాత్తు తెల్ల ఏనుగు, సాలెపురుగుగా జన్మించిరి. ప్రతిరోజు ఏనుగు తొండముతో నీరు తెచ్చి లింగం చుట్టూ శుద్ధిచేసి పూలతో పూజించుచుండెను. సాలెపురుగు చెట్టు ఆకులు లింగముపై పడకుండ గూడుకట్టి ప్రతీరోజు పూజిస్తుండెను. ఏనుగు సాలెగూడును చూచి చిరాకు పడి తీసివేయుచుండ సాలె పురుగు మరల గూడు కట్టుచుండెడిది. వాటి రెండింటి మధ్య శత్రుత్వము పెరిగెను. ఒకనాడు సాలెపురుగు కోపముతో ఏనుగు తొండములో దూరి, కుట్టి బాధించ సాగెను బాధ భరించలేక ఏనుగు శిరస్సును బాదుకుని మరణించెను తొండములో నున్న సాలెపురుగు కూడ మరణించెను. స్వామివారు ఈ రెండింటికి మోక్షమిచ్చెను.

## అష్టలక్ష్మి విగ్రహాలను స్తంభములపై గల దేవాలయము

అరుణాచలేశ్వరుడు
అరుణాచలేశ్వరి

అన్నామలై
అరుణాచలం
30 కి.మీ. కొడైకనాల్
19 కి.మీ. మధురై
108 కి.మీ. కోయంబత్తూర్

## నల, దమయంతి కథకు సంబంధించిన శనీశ్వరాలయం

శనీశ్వరుడు
కావేరీ నదీ తీరం

తిరునల్లార్
5 కి.మీ. కరైకాల్
పాండిచేరి నుండి బస్సు

విగ్రహం దగ్గర స్వామి వారి వాహనం అయిన కాకి బొమ్మ కలదు. నలుడు శరీరానికి నూనె రాసుకుని ప్రక్కన ఉన్న కోనేరులో స్నానము చేసి స్వామివారిని పూజించిన తరువాత శని ప్రభావం విడచినచోటు. ఇచ్చట శివాలయం కూడా ఉన్నది. భక్తులు యిప్పటికీ శరీరానికి నూనె రాసుకుని (ఆలయం ప్రక్కన చిన్న సీసాలతో అమ్ముతారు) కోనేరులో స్నానం చేసి స్వామివారిని దర్శిస్తారు.

## లింగానికి ఎదురుగా గాక ప్రక్కగా బలి పీఠం ఉన్న దేవాలయం

శనీశ్వరుడు
శివుడు
కావేరీ నదీ తీరం

తిరునల్లార్

ఒక గొల్లవాడు ప్రతిరోజు దేవాయానికి పాలుపోస్తూ ఉండేవాడు. గుమస్తా తన యింటికి కూడా పాలు పోయించుకుని దేవాలయం లెక్కలలో పోసినట్లుగా చెప్పమనేవాడు. నీతి, నిజాయతి పరుడైన పాలవాడు తిరస్కరించగా గుమస్తా పాలవానిని నిందించెను. బాధతో పాలవాడు స్వామివారికి నిజాన్ని నివేదించగా శివలింగం నుండి శూలం బయల్దేరి ఎదురుగా నున్న గుమస్తాను శిక్షించెను. శూలం యొక్క మార్గానికి అడ్డుతొలగి బలిపీఠం ప్రక్కకు జరిగినది

---

## ప్రతీ 2 1/2 సంవత్సరములకు ఉత్సవము జరుపుకొను స్వామివారు

శనీశ్వర స్వామి — తిరునల్లార్
(సూర్యనారాయణ స్వామివారి పుత్రుడు)

2 1/2 సంవత్సరముల కొకసారి శని ఒకరాశి నుండి వేరొక రాశిలోనికి మారును. అప్పుడు వుత్సవము

## కోట్లాది అభిషేకములు జరిగినా, జరుగుతూ ఉన్నా అరగని, తరగని చిన్న విగ్రహం

శ్రీ సుబ్రహ్మణ్య స్వామి — పళని
(దండాయుధ పాణి) — 19 కి.మీ. మధురై
30 కి.మీ. కొడైకనాల్

విగ్రహం ఖనిజములతో చేయబడినది. కోట్లాది అభిషేకములు (రకరకాలు) జరిగినా చెక్కుచెదరలేదు. ప్రతిరోజు చాలా రకముల అభిషేకములుండును. ఆశ్చర్యకరమైన విషయము.

## మోక్షపురములు 7. ఒక్క పురము మాత్రము వింధ్య పర్వతాలకు దిగువన ఉన్నది

కామాక్షి — కంచి
ఏకాంబరేశ్వరుడు — 71 కి.మీ. మద్రాసు
మిగతావి ఉత్తర దేశమున ఉన్నవి.

1. అయోధ్య, 2. మధుర 3. మాయాపురి (హరిద్వారం) 4. కాశీ 5. ఉజ్జయిని (అవంతిక) 6. ద్వారక ఏడవది అయిన కంచి ఒక్కటే దక్షిణ దేశమున ఉన్నది.

## గొప్ప రాతి దేవాలయం (The Great Stone Temple) అని పిలువబడే దేవాలయం

కామాక్షి — కంచి
ఏకాంబరేశ్వరుడు

శత్రుదాడుల సమయములో ఎదుర్కొనుటకు కోటగా ఉపయోగించుటకు వీలుగా రాతితో గట్టిగా కట్టబడిన ఏకైక దేవాలయము.

---

**1,000 స్తంభాల మండపముగా రూపొందించబడి, మహ్మదీయుల దాడికి గురై, ఇప్పుడు 616 స్తంభాలు కల్గిన మండపము గల ఆలయం**

కామాక్షి — కంచి

ఏకాంబరేశ్వరుడు

**తిరుమల దేవాలయములో ఉన్నట్లే తోడరమల్, తల్లి, భార్య విగ్రహాలున్న ఆలయం**

వరదరాజ స్వామి — కంచి

పేరుందేవి

**అష్టభుజములతో ఉన్న విష్ణుమూర్తి ఆలయం**

విష్ణుమూర్తి — కంచి

(అష్ట భుజ స్వామి)

విష్ణుమూర్తిని అష్టభుజ స్వామివారుగా పిలుస్తారు. ఇదిగాక వరదరాజ స్వామివారి దేవాలయం వేరే ఉన్నది.

**సుదర్శన చక్రముచే విష్ణుమూర్తి రాక్షసుని సంహరించిన చోట శివలింగాన్ని ప్రతిష్ఠించిన ఆలయం**

బృహదీశ్వర్ — తంజావూరు

"తంజం" అని పిలువబడే రాక్షసుని విష్ణువు సంహరించెను పాప పరిహారార్ధము శివలింగ ప్రతిష్ఠ చేసెను. ఈ ఆలయాన్ని " రాజరాజేశ్వరం" అని కూడా పిలుస్తారు.

**కంచిలో బంగారు, వెండి బల్లులు ఉన్న ఆలయం**

వరద రాజస్వామి వారి ఆలయములో వెనుక భాగమున — కంచి (విష్ణుమూర్తి)

సూర్య, చంద్రుల బింబములు కూడ గలవు. ఈ ఆలయము చినకంచిలో ఉన్నది. బల్లులను తాకిన బల్లి పడే దోషాలు తొలుగుతవి. సూర్య చంద్రులతాకిన స్వప్న దోషాలు తొలుగుతవి.

---

**పెద్ద పెద్ద నంది, సింహం, ఏనుగు విగ్రహాలు విడివిడిగా ఉన్న దేవాలయం**

స్థల శయన పెరుమాళ్ — మహాబలిపురం
60కి మీ మద్రాసు

**"SHORE TEMPLE" (సముద్రతీర) అని పిలువబడే దేవాలయం**

స్థలశయన పెరుమాళ్ — మహాబలిపురం

**అతి పెద్దదైన ఉబ్బెత్తుగల రాతిశిల్పము (అర్జునుని తపస్సును సూచించునది)**

స్థల శయన పెరుమాళ్ — మహాబలిపురం

బహుశా ప్రపంచములో అతి పెద్దదైన ఉబ్బెత్తు శిల్పము కొండ ప్రక్కభాగము చెక్కబడినది. ఉబ్బెత్తుగా చెక్కబడి ఉండుట దీని ప్రత్యేకత.

**భగవంతునికి నిర్దేశింపబడిన పూలదండలు కట్టిన వెంటనే తాను ముందుగా ధరించి, తరువాత భగవంతునికి వేసి, అనంతరమందు ఆ భగవానునే వివాహమాడి, స్వామివారిలో ఐక్యమైన అమ్మవారు**

| | |
|---|---|
| శ్రీ ఆండాళ్ | సిరివిల్లి పుత్తూర్ |
| (గోదాదేవి) | రామనాధపురం జిల్లా |
| వటపత్రశాయి | 71కి.మీ. మధురై |
| (విష్ణుమూర్తి) | 83కి.మీ. కుర్తాళం |
| | విరుద్‌నగర్ - టెంకాశి లైను |

ఆలయమునకు చాలపెద్ద రధము కలదు

**కుంభకోణములో ఉన్న ముఖ్యమైన స్వామివార్లు, అమ్మవార్లు**

1. ఆది కుంభేశ్వర స్వామి
   మంగళనాయకి
2. శ్రీ సారంగ పాణి
   కోమల వల్లి తాయార్
3. శ్రీ నాగేశ్వర (నటరాజ)
   నాగేశ్వరి
4. శ్రీ చక్రపాణి
   విజయవల్లి తాయారు
5. శ్రీ రామస్వామి
   సీతాదేవి

కుంభకోణం
96కి.మీ. తిరుచినాపల్లి
5కి.మీ స్వామి మలై
8 కి మీ. త్రిభువనం
5 కి.మీ. ఉప్పిలి అప్పన్
తంజావూరు జిల్లా

---

**"అహోరాత్రి" పుష్కరిణి గల ఆలయం**

ఉప్పిలి అప్పన్ (శ్రీనివాసుడు) — ఉప్పిలి అప్పన్
2కి.మీ. తిరునాగేశ్వరం
5 కి.మీ. కుంభకోణం

ఈ దేవాలయ గర్భగుడి విమానాన్ని "సుధానందం" అంటారు.

**విష్ణుమూర్తికి ప్రత్యేక గర్భగుడి గల సుబ్రహ్మణ్య స్వామివారి ఆలయం**

సుబ్రహ్మణ్య స్వామి — తిరుచందూర్
తిరునల్వేలి దగ్గర

రెండవ ప్రాకారములో విష్ణుమూర్తి ఆలయం.

**"వైకాశి విశాఖం" అని పిలువబడే ఒకరోజు ఉత్సవం గల ఆలయం**

సుబ్రహ్మణ్యస్వామి — తిరుచందూర్

మే నెలలో బ్రహ్మాండమైన ఉత్సవం జరుగుతుంది. రైతులు తమమొదటి పంటను స్వామివారికి సమర్పించుకుంటారు.

**మన్మథుని భార్య రతీదేవి చిలుక వాహనముపై వెలసి ఉన్న ఆలయం**

సుందరరాజ పెరుమాళ్ — అలగరకోయిల్
సుందర వళ్ళి నాంచార్ — 18కి.మీ. మధురై

కళ్యాణమండపం స్తంభంపై గల విగ్రహం.

**నలదమయంతుల విగ్రహాలు గల ఆలయం**

శనీశ్వరుడు — తిరునల్లార్
5కి.మీ. కరైకాల్

ప్రతి 2 1/2 సంవత్సరములకు "శని పాయర్చి" అని పిలువబడే ఉత్సవం జరుగుతుంది. శనీశ్వరునితో బాటు నలదమయంతులను పూజించినవారికి శని ప్రభావం ఉండదట.

---

## వైదీశ్వరన్ కోయిల్‌లో వెలసిన నవగ్రహములలోని మూడు గ్రహాలు

1 కుజుడు
2 బుధుడు
3 కేతువు

వైదీశ్వరన్‌కోయిల్
మైలాడుదుర్తై

## నవగ్రహములకు ఆలయములు - పూజించుటకు ప్రత్యేకత గల రోజులు

| | | | |
|---|---|---|---|
| 1. | సూర్యుడు | - సూర్యనార్‌కోయిల్ - కుంభకోణం 7కి.మీ. | ఆదివారము |
| 2 | చంద్రుడు | - తింగలూర్ - 8 కి.మీ తిరువయ్యూర్ తంజావూర్ దగ్గర | సోమవారము |
| 3. | కుజుడు | - మైలాడు - వైదీశ్వరన్ కోయిల్ | మంగళవారము |
| 4. | బుధుడు | - తిరువేంగాడు - మైలాడుదుర్తై దగ్గర | బుధవారము |
| 5. | గురువు | - ఆలంగుడి - కుంభకోణం దగ్గర | గురువారము |
| 6. | శుక్రుడు | - కంజనూర్ - సూర్యనార్‌కోయిల్ దగ్గర కుంభకోణం 6 కి.మీ. | శుక్రవారము |
| 7. | శని | - తిరునల్లార్ కర్తైకాల్ దగ్గర | శనివారం |
| 8 | రాహువు | - తిరునాగేశ్వరం 3కి.మీ. కుంభకోణం (4.30 నుండి 6-00 సాయంకాలం వరకు పాలతో అభిషేకం) | ఆదివారం |
| 9. | కేతువు | - పెరుంపల్లం - మైలాడుదుర్తైనుండి పూంపహార్ వెళ్ళుత్రోవలో ధర్మకుళం బస్టాప్ దగ్గర. | సోమవారము |

9గ్రహాలకు : నవధాన్యాలు, 9 రంగుల జాకెట్లు, పటికబెల్లం, కొబ్బరికాయలు,
సమర్పణ దీపారాధన.

---

**సూర్యోదయం లోపే పూజాకార్యక్రమాలు ముగించాలని నియమం గల ఆలయం**

శ్రీరామ లింగేశ్వరుడు — రామేశ్వరం

**మహ్మాదీయ స్త్రీ బొమ్మ గోడపై వేయబడిన ఆలయం**

శ్రీరంగనాధ స్వామి — శ్రీరంగం

తుళుక్కనాచియార్ లేక సురతాని

(సుల్తాని) (Muslim lady - daughter of a Delhi ruler)

ఇప్పటికీ పాటిస్తున్న ఆచారములు :

1 స్వామివారికి మొట్టమొదటి ప్రసాదం . రొట్టె, వెన్న, పప్పు, దీనిలోని కొంతభాగాన్ని ముస్లిం అమ్మవారికి పెడతారు.

2. కొన్ని ప్రత్యేక రోజుల్లో విష్ణుమూర్తి విగ్రహాన్ని ఎర్రని మహ్మాదీయ దుస్తుల్తో అలంకరిస్తారు.

3. స్వామివారికి ప్రసాదాన్ని గుడ్డపై పెట్టి సమర్పిస్తారు. (ముస్లిం ఆచారము)

4. సంవత్సరానికి ఒకసారి స్వామివారిని (జనవరిలోని వైకుంఠ ఏకాదశి నాడు ఊరేగించు రోజున పూజారులు తొందరగా అంగలు వేసుకుంటూ ఊరేగిస్తారు. ముస్లిం అమ్మవారి వద్దకు ఆతురతగా వస్తున్నట్లు. తుళుక్క నాచియార్ అమ్మవారి దగ్గరకు వస్తున్నప్పుడు

**వినాయకుడు తన భార్య వల్లభాదేవిని ఎడమచేత్తో పట్టుకుని కూర్చుని ఉన్న విగ్రహం గల ఆలయం**

స్థాణుమాలయ — సుచీంద్రం

వినాయకునికి వల్లభాదేవి అనే భార్య ఉన్నట్లు కొన్ని పురాణములలో నున్నది.

**6 ప్రసిద్ధ సుబ్రహ్మణ్య క్షేత్రములలోని విగ్రహముల కన్న పెద్దదైన విగ్రహం గల సుబ్రహ్మణ్య క్షేత్రం**

సుబ్రహ్మణ్య స్వామి — పద్మనాభ పురం
20కి.మీ. నాగర్‌కోయిల్
కన్యాకుమారి జిల్లా

---

వాలి, సుగ్రీవులు యింద్రుని వలన అహల్యకు పుట్టినవారు

**కావేరీ నది యొక్క పాయలైన కోలరూన్, కావేరీ నదుల మధ్యనున్న ద్వీపంపై ఉన్న ఆలయం**

శ్రీరంగనాధుడు — శ్రీరంగం
శ్రీ రంగనాయకి
స్వామివారు చతుర్భుజుడు
దక్షిణాభి ముఖుడు

లక్ష్మీదేవి, విభీషణుడు పాదాల చెంతగల శయనమూర్తి.

**సేతు బంధనానికి ముందు శ్రీరాముడు ప్రతిష్ఠించి పూజించిన వినాయకుడు**

సేతు వినాయకుడు — ఉప్పూర్
32కి.మీ. రామనాధపురం
రామనాధపురం జిల్లా

సముద్రునిపై ఆగ్రహించిన శ్రీరామునికి సేతుబంధన ప్రయత్నానికి ముందు వినాయక పూజ చేయలేదని సముద్రుడు జ్ఞాపకము చేసిన తరువాత. రాజపురోహితులు, గురువులు లేనందున శ్రీరామునికి ఆ సలహా లభించనందున, తనకు ఆ ఆలోచన రానందున పశ్చాత్తాప పడి తొలుత శ్రీ విఘ్నేశ్వర పూజ జరుపలేదని, శ్రీరాముడు తన పొరపాటును అంగీకరించెను.

**జ్ఞానశక్తి, బలశక్తి, క్రియాశక్తి విగ్రహాలున్న ఆలయం**

మీనాక్షీ దేవి — మధురై
సుందరేశ్వరుడు

**ధ్వజస్తంభం వద్ద నున్న ఆవు పొదుగులో పాలుపోస్తే శివలింగంపై పాలుపడే ఆలయం**

నటరాజ — పేరూర్ గ్రామం
(శివలింగం) — లేక
మరకత వళ్ళి — మేల్ చిదంబరం
అద్భుత శిల్పకౌశలం — 6కి.మీ. కోయంబత్తూర్
కోయంబత్తూర్ జిల్లా

---

**ప్రతి శుక్రవారము పూజింపబడే వినాయకుని గుడి**

| | |
|---|---|
| మానకుళ్ళ వినాయకుడు | పాండీచేరి<br>ఎమ్.వి. స్ట్రీట్ |

**శివునితో నాట్యములో ఓడిపోయి ఊరు బయటకు తరుమబడిన కాళికాదేవి గుడి**

| | |
|---|---|
| తెళ్ళై కాళికాదేవి | చిదంబరము<br>3కి.మీ. చిదంబరం |

**బ్రహ్మ హత్యా పాతకమును దూరము చేయు శివస్వామి**

| | |
|---|---|
| అఘోరమూర్తి<br>పార్వతి | తిరువేంగాడు<br>28కి.మీ. చిదంబరం |

**విభీషణుని విగ్రహముగల ఆలయము**

| | |
|---|---|
| శ్రీ కోదండరామ స్వామి<br>సీత<br>లక్ష్మణ<br>ఆంజనేయ | ధనుష్కోడి<br>రామేశ్వరము దగ్గరలో |

**నూరు (100) అశ్వమేధ యాగముల ఫలం ఈ ఆలయ దర్శనం**

| | |
|---|---|
| అమృత ఘటేశ్వర్ | తిరుక్కడైయూర్<br>10కి.మీ. మాయవరం<br>తంజావూర్ జిల్లా |

మార్కండేయుడు, మృకండ మహర్షి ప్రార్థించిన లింగము.

**60 సంవత్సరములు, 80 సంవత్సరములు నిండినవారు ఇంకా దీర్ఘాయుస్సునకై ప్రార్థింపబడే స్వామివారు**

| | |
|---|---|
| అమృత ఘటేశ్వర్ | తిరుక్కడై యూర్<br>10కి.మీ. మాయవరం<br>తంజావూర్ జిల్లా |

యముడు దండింపబడి, మార్కండేయుడు దీర్ఘాయుస్సును పొందిన స్థలము.

---

అహంభావం, అసూయ, నియంతృత్వం, పశుబలం ముందు న్యాయదేవత గడగడలాడిపోతుంది ధర్మదేవత కన్ను మూస్తుంది

**మృకండ మహర్షి, మార్కండేయుడు శివుని ప్రార్థించి దీర్ఘాయుస్సును పొందిన దివ్య క్షేత్రము**

అమృత ఘటేశ్వర్ తిరుక్కడైయూర్

మార్కండేయుడు శివలింగాన్ని ఆలింగనం చేసుకుని ఉండగా యముని పాశము మార్కండేయునితో బాటు శివలింగానికి కూడా చుట్టుకొనుటచే, శివుడు ఆగ్రహించి యముని దండించిన క్షేత్రము లింగముపై మార్కండేయుని చేతిగుర్తులు, యముని పాశము గుర్తులు గలవు.

**బీద వాళ్ళ "దక్షిణ కాశి"గా ప్రసిద్ధి నొందిన క్షేత్రము**

మయూరనాథ మాయవరం
అభయ ప్రదాంబిక 20కి మీ మన్నార్‌గుడి
తంజావూర్ జిల్లా

**శివలింగానికి చీరలు చుట్టి ప్రార్థింపబడు స్వామివారు**

అనవితా యీశ్వర్ మాయవరం

భక్తురాలైన "అనవితై" స్వామివారిని చీరలతోనే చూస్తూ పూజించేది కాబట్టి. భక్తురాలు ప్రతిష్ఠించిన లింగము. (మనస్సులో చీరలతోనే పూజించాలనే భక్తురాలి కోరికను మన్నించిన స్వామివారు.) ఈ స్వామివారిని పూజించిన తరువాతనే మయూరనాధుని పూజించాలి. ఇది ఇక్కడి నియమం.

**"తిరుచందు పిల్స్" (సర్వరోగ నివారణి మాత్రలు) లభించు ఆలయం**

వైదీశ్వరన్ వైదీశ్వరన్ కోయిల్
తయ్యల నాయకి తంజావూర్ జిల్లా
15కి.మీ. మాయవరం

ఆలయములోని బూడిదను, అంగారక తీర్థములోని నీటిని మట్టితో కలిపి మాత్రలు చేస్తారు. జటాయువు నిర్యాణము చెందిన స్థలము శ్రీరాముడు దహన సంస్కారములు చేసిన ప్రదేశము.

---

**కప్పలుగానీ, పాములు గాని ఉండనటువంటి తీర్థముగల ఆలయము**

వైదీశ్వరన్ | వైదీశ్వరన్ కోయిల్
తయ్యాల నాయకి

అమ్మవారి ఆలయమునకెదురుగా "సిద్ధామృత తీర్థం" గలదు.

**ముసలి సాధువు కోరినంతనే తనభార్యను కానుకగా సమర్పించిన భక్తునికి కైవల్యము ప్రసాదించిన స్వామివారు**

ఛాయా వనేశ్వర్ | ఛాయావనం
కావేరీ సాగర సంగమస్థానం | తంజావూర్ జిల్లా
3కి.మీ. తిరువేంగాడ్

ఇయరపాగి నయనార్ అనే భక్తుడు చాల ధనవంతుడు. ఆలయాలకు, భక్తులకు, పూజలకు ధనము వెచ్చిస్తూండేవాడు. ఒక రోజున ఒక ముసలి సాధువు వచ్చి భార్యను దానము చేయమని కోరెను. అట్లాగేనని తనభార్యను ముసలివాని కూడా పంపించివేసెను. చుట్టాలు, స్నేహితులు వగైరాలు గేలిచేసిననూ భక్తుడు చలించలేదు. ముసలివాడు శివునిగా మారి భార్యా భర్తలకు మోక్షము ప్రసాదించెను. భక్తులను భగవంతుడు ఎన్ని విధాల పరీక్షిస్తాడో ఇది ఒక ఉదాహరణ.

**అష్ట లక్ష్ములు, నవగ్రహములు గల ఆలయము**

శ్వేతా రణ్యేశ్వర | తిరువేంగాడ్
బ్రహ్మవిద్యా నాయకి

**ఉద్దాలక మహర్షి కుమారుడు 8 సంవత్సరముల వయస్సు గల శ్వేతకేతు మరణమాసన్నసమయమున శివలింగమును ప్రతిష్ఠించి పూజిస్తున్న సమయములో యమధర్మరాజు పాశాన్ని విసరగా, కోపించి యమధర్మరాజుని దండించిన స్వామివారు**

శ్వేతా రణ్యేశ్వర | తిరువేంగాడ్
బ్రహ్మవిద్యానాయకి

---

**పార్వతీదేవి శివుని శీర్షాసనముతో ప్రార్థించి సంతుష్టుని చేసిన స్థలము**

పాతాళేశ్వర్ 
పాతాళ నాయకి 
కేడిల నదీతీరం

తిరుప్పలి రివులియూర్ 
2కి.మీ కడలూరు 
సౌత్ ఆర్కాట్ జిల్లా 
30కి మీ పాండిచేరి

తల్లి శీర్షాసనముతో భర్త కరుణకై తపస్సు చేస్తూ ఉన్నపుడు కుమారులు వినాయకుడు, కుమారస్వామి బాధనొందిరి.

**అమ్మవారి విగ్రహం యొక్క ఎడమచెయ్యి విరిగిపోతే, వెండితీగతో కుట్టి చెయ్యిని సరిచేసి పూజలు జరుపుతున్న ఆలయము**

కిరాత మార్జలేశ్వర్ 
ముక్తాంబిక

కిరాత మార్జేశ్వరం 
విల్లి వాక్కం ఆర్.ఎస్. 
చునాంపేట తాలూకా 
చెంగల్పట్ జిల్లా 
80కి.మీ కంచి

చెయ్యి విరిగిపోయిన విగ్రహాన్ని తీసివేసి కొత్త విగ్రహం చేయించి ధర్మకర్తలు పెట్టే సమయములో శివుడు కలలో కనిపించి తమ తల్లికిగాని, భార్యకుగాని అంగవైకల్యము సంభవిస్తే వారిని మార్చివేస్తారా? అని అడినందున. విరిగిన విగ్రహాన్ని బాగుచేశారు.

**గర్భగుడిలో సీత, రామ, లక్ష్మణుల విగ్రహాలు మాత్రమే ఉండి, హనుమంతుని విగ్రహము లేని ఆలయము**

సీత 
రామ 
లక్ష్మణ

మధురాంతకం 
చెంగల్పట్టు జిల్లా 
40కి.మీ. చెంగల్పట్టు 
80 కి.మీ. మద్రాసు

రావణ వధానంతరం లంకనుండి వస్తూ భరతుని వద్దకు ముందుగా హనుమంతుని పంపించినందున. భక్తులు హనుమంతుని విగ్రహాన్ని కొలనుప్రక్కన ప్రతిష్ఠించి లోటు భర్తీ అయినట్లుగా భావించారు.

---

మేనక విశ్వామిత్రుని వలన కలిగిన శకుంతల యను పుత్రికను విడిచి స్వర్గమునకు పోయెను 
విశ్వారసుడనుగంధర్వ రాజువలన పుట్టిన ప్రమద్వర యను పుత్రికను కూడ విడిచి స్వర్గలోకం జేరెను

**సీతకు శ్రీరాముడు చేతులనందించి పుష్పక విమానము నుండి**

**దింపుతున్నట్లున్న విగ్రహం గల ఆలయము**

సీత మధురాంతకం

శ్రీరామ

లక్ష్మణ

లంకనుండి పుష్పక విమానములో అయోధ్యకు వెళ్ళు సమయమున విభాండక ముని ఆశ్రమానికి వచ్చిన తరువాత విమానము కదలకుండ ఆగిపోయినది. కారణం ఏమని ఆలోచిస్తూండగా, తిరుగు ప్రయాణములో ఇక్కడ ఆగుతామని విభాండక మహర్షికి ఇచ్చిన మాటను సీత శ్రీరామునికి జ్ఞాపకము చేయగా పుష్పక విమానము నుండి క్రిందికి దిగుటకు శ్రీరాముడు సీతకు చేతులందించి సహాయముచేసెను.

**సుబ్రహ్మణ్య స్వామి బాలుడుగా ఉన్న ఆలయము**

బాలసుబ్రహ్మణ్యస్వామి చెయ్యూరు

29కి మీ. మధురాంతకం

చెంగల్పట్టు జిల్లా

**108 సాలగ్రామ శిలల హారము ధరించిన స్వామివారు**

ఆది వరాహ పెరుమాళ్ తిరువదంతై

అఖిల వల్లి అమ్మాళ్ చెంగల్పట్టు జిల్లా

45కి.మీ. మద్రాసు

**సంవత్సరములో 360 రోజులు కళ్యాణోత్సవములు కలిగి**

**నిత్య కళ్యాణ స్వామిగా పేరు పొందిన స్వామివారు**

ఆదివరాహ పెరుమాళ్ తిరువదంతై

అఖిల వల్లి అమ్మాళ్

కల్వ మహర్షికి 360 కుమార్తెలు రోజుకొక కుమార్తెను స్వామివారు వివాహము చేసికొందురు. వీరందరు లక్ష్మీదేవి అంశగలవారు.

---

మంథర కైకేయి దాసి పూర్వ జన్మమున దుందుభి
యను గంధర్వకాంత దేవ కార్యము కొరకు పుట్టెను

**5 పవిత్ర తీర్థములుగల ఆలయము**

పల్వనాధర్, చొక్కనాయకి — తిరువాణ్మియూర్
మారుతేశ్వర్, త్రిపురసుందరి — 5కి.మీ. మైలాపూర్
మద్రాసు

వాల్మీకి కోరగా శివుడు జటాజూటములనుండి అయిదుచుక్కలు వేయగా ఏర్పడిన ఐదు తీర్థములు. 1. తూర్పున జన్మనాశిని తీర్థం 2 దక్షిణమున కర్మనాశిని 3 పశ్చిమాన పాపనాశిని 4. ఉత్తరాన జ్ఞానదాయిని 5. మధ్యలో మోక్షదాయిని.

**శుక్రాచార్యునికి (రాక్షసుల గురువు) పోయిన కన్ను (బలిచక్రవర్తికి దానమీయ వద్దని సలహా యిచ్చిననూ వినక, వామనుని దర్భపోటుతో కన్నుపోగొట్టుకొని) తిరిగి వచ్చిన దివ్యస్థలము. కన్ను యిచ్చిన స్వామివారు**

కపాలేశ్వర్ — మైలాపూర్
కల్పక వల్లి — మద్రాసు

**శ్రీకృష్ణుని ఉత్సవ విగ్రహానికి ముఖాన బాణం దెబ్బలు గల ఆలయము**

పార్థసారధి — ట్రిప్లికేన్
(శ్రీ వేంకట కృష్ణస్వామి) — మద్రాసు

మహాభారత యుద్ధమున పార్థసారధిగానున్న శ్రీ కృష్ణుని ముఖాన భీష్ముడు బాణములు నాటి గాయపరచినందున కృష్ణునికి కోపం వచ్చి నేలకుదిగి సుదర్శన చక్రం చేబూని భీష్ముని చంపుటకు లంఘించెను

**శ్రీకృష్ణుని కుటుంబ సభ్యులందరి విగ్రహములు ప్రతిష్ఠించబడిన ఆలయము**

పార్థసారధి — ట్రిప్లికేన్
(శ్రీ వేంకట కృష్ణస్వామి) — మద్రాసు

రుక్మిణి, సత్యభామ, సాత్యకి, బలరామ, రోహిణి, ప్రద్యుమ్న, అనిరుద్ధ

---

బ్రహ్మచెవులనండి పులస్త్యుడు, నాభి నుండి పులహుడు, బొటనవ్రేలినుండి దక్షుడు పుట్టిరి

**చేప బ్రతకని తీర్థమున్న ఆలయము**

పార్థసారధి — ట్రిప్లికేన్
(శ్రీ వెంకట కృష్ణస్వామి) — మద్రాసు

"కరవేణి" అనే తీర్థములో చేప బ్రతుకదు ఎట్టి పరిస్థితులలోను తీర్థం ఎండదు.

**నాలుగు యుగములలో నాల్గు పేర్లతో విలసిల్లుచున్న ఆలయము**

మసిల మణేశ్వర్ — తిరుముల్లై వాయిల్
లత మధ్యమాంబ — 20 కి.మీ.మద్రాసు
కృతయుగం · రత్నాపురం — ఆవడి దగ్గర
త్రేతాయుగం . బిల్వవనం
ద్వాపరయుగం చంపక వనం
కలియుగం . మాలతీవనం

**నంది వెనుకభాగాన శివలింగం ఉన్న ఆలయం**

మసిల మణేశ్వర్ — తిరుముల్లై వాయిల్
లత మధ్యమాంబ — 20కి మీ. మద్రాసు
ఆవడి దగ్గర

తొండమాను అనే భక్తుని వెంట ప్రమధగణాలతో వెళ్ళి యుద్ధమున సహాయము చేయమని శివుడు ఆజ్ఞాపించినందున, స్వామివారికి ఎదురుగానున్న నంది వెనుతిరిగి శివసేనతో వెడలినందున.

**శివుడు, పార్వతి నందిమీద గాక ప్రక్కప్రక్కన నిలువబడి ఉన్న ఉత్సవ విగ్రహములు గల ఆలయము**

మసిల మణేశ్వర్ — తిరుముల్లై వాయిల్
లత మధ్యమాంబ

శివునికి కుడిప్రక్కన పార్వతి, పార్వతి ప్రక్కన నంది ఉన్నది. భక్తుడు తొండమానుడు ఆలస్యముగ వెలసినచో తనకు తాను అపకారము చేసుకుంటాడనే భయముతో త్వరత్వరగా శివుడు, పార్వతి, నంది కంగారు, కంగారుగా వెలసిన ఆలయము.

---

రావణ వధానంతరం లభించిన పుష్పకవిమానాన్ని దాని
యజమాని అయిన కుబేరునకు శ్రీరాముడు యిచ్చివేసెను

**పంచముఖ వినాయకుడు 5 ముఖముల తోనూ, 10 చేతులతోను వెలసిన ఆలయము**

మసిల మణేశ్వర్ — తిరుమల్లైవాయిల్
లత మధ్యమాంబ

**కాశీ వలె ప్రళయములో కూడా నాశనము చెందని ఆలయము**

చెంగల్రాయ స్వామి — తిరుత్తణి
(సుబ్రహ్మణ్య స్వామి) — చెంగల్పట్టు జిల్లా
వళ్ళి — 82కి.మీ. మద్రాసు
క్షణికాచలం కొండపై

కుమారస్వామి కోపం తగ్గిన స్థలము స్వామివారి ౬ ప్రసిద్ధాలయములలో నొకటి.

**స్వామివారి పవళింపు విగ్రహం బొడ్డునుండి తామర పద్మం వెలసి, దానిపై బ్రహ్మదేవుడు ఉన్నట్లుగాని, పాదముల చెంత శ్రీదేవి, భూదేవి లేని విగ్రహము.**

శ్రీ రంగనాధుడు — శ్రీరంగం
శ్రీ రంగ నాయకి — 10 కి మీ. ట్రిచ్చి
కావేరీ నదీ తీరము

కావేరీ మాత తామర పద్మం పుచ్చుకుని, స్వామివారి పాదముల చెంతనున్నది.

**మాలధారణ, ఇరుముడి, ఎర్రబట్టలు ధరించు ఆచారముగల అమ్మవారు**

ఆది పరాశక్తి — మేల్ మరువత్తూర్
పరమేశ్వరుడు — 20కి.మీ. చెంగల్పట్టు
20కి.మీ. తిండివనం

**శంఖం పూరిస్తున్న వినాయకుడు**

నటరాజ స్వామి — చిదంబరం
శివ కామ సుందరి

గర్భగుడి బయట నటరాజ ఆలయములో ఈ విగ్రహము కలదు.

---

దుర్యోధనుని భార్య భానుమతి సహదేవుని భార్యపేరుకూడ భానుమతి

**చాల పెద్ద వినాయకుని విగ్రహం గల ఆలయం**

నటరాజస్వామి చిదంబరం
శివకామ సుందరి

ఆలయములోని నవగ్రహ మండపములో నున్న అతి పెద్ద విగ్రహములలో నొకటి

**మానవ డాక్టరుగా భావించబడే స్వామివారు**

వైదీశ్వరన్ వైదీశ్వరన్ కోయిల్
బాలాంబాళ్ షీర్‌కాశి, మాయవరం
(తెయ్యాల నాయకి) దగ్గరలో

స్వామివారిని వైద్యుడుగా భావించి, కొలుస్తారు.

**అంగారక గ్రహం (Planet Mars) పూజలందుకొంటున్న ఆలయం**

వైదీశ్వరన్ వైదీశ్వరన్ కోయిల్
బాలాంబాళ్

స్వామివారు ఇత్తడి విగ్రహం.

**సూర్యకిరణములు సంవత్సరములో కొద్ది రోజులు పడే లింగము**

వైదీశ్వరన్ వైదీశ్వరన్ కోయిల్
బాలాంబాళ్

పశ్చిమ గోపురము నుండి స్వామివారిపై సూర్య కిరణాలు పడతాయి.

**4 యుగాలలో 4 రకాలుగా పిలువబడే దేవతా వృక్షముగల ఆలయము**

వైదీశ్వరన్ వైదీశ్వరన్ కోయిల్
బాలాంబాళ్
వేపచెట్టు (దేవతా వృక్షము)
కృతయుగములో : కదంబ వృక్షము.
త్రేతా యుగములో : బిల్వ వృక్షము.
ద్వాపర యుగములో : వకుళ వృక్షము
కలియుగములో : వేపచెట్టు

---

సీతాదేవి తల్లి, జనకమహారాజు భార్య రత్నమాల

**"Boat City" అని పిలువబడే ఊరు, అక్కడ వెలసిన ఆలయము**

సత్తనాథ స్వామి — షీర్‌కాళి
షీర్‌కాళి (ఉమ) — 15కి మీ. పూంపహార్

ప్రళయ కాలములో కూడ ఈ ఆలయం నీటిలో మునగక బోటు ఆకారములో ఉండుటచే తేలిపోతుంది

**"దక్షిణ మేరు" అని పిలువబడే ఆలయము**

బృహదీశ్వరుడు — తంజావూరు
బృహదీశ్వరి

**అతిపెద్ద లింగముగల ఆలయము**

బృహదీశ్వరుడు — తంజావూరు
బృహదీశ్వరి

లింగము ఎత్తు 9' చుట్టుకొలత 23 1/2'

**ఉత్తరాయన పుణ్యకాలములో (జనవరి నుండి జూలై) దక్షిణ ద్వారముగుండా, దక్షిణాయన పుణ్యకాలములో (జులై నుండి డిశంబర్) ఉత్తర ద్వారముగుండా ప్రవేశముగల ఆలయము**

సారంగపాణి — కుంభకోణం
(విష్ణుమూర్తి) — తంజావూర్ జిల్లా

**చైత్ర మాసములో 3 రోజులు మాత్రము (12,13,14వ రోజుల్లో) సూర్య కిరణములు పడే ఆలయము**

నాగేశ్వరుడు — కుంభకోణం
నాగేశ్వరి — తంజావూర్ జిల్లా

**శ్రీరాముడు, సీత పట్టాభిషేక దుస్తులలో నున్న ఆలయము**

శ్రీ రామ స్వామి — కుంభకోణం
సీతాదేవి
హనుమంతుడు

---

కంసుని భార్యలు అస్తి, ప్రాప్తి, జరాసందుని కుమార్తెలు

**ఆంజనేయుడు శ్రీరాముడు, సీత విగ్రహాల ముందువీణ వాయిస్తూ స్తోత్రము చేయుచున్న ఆలయము**

శ్రీరామస్వామి కుంభకోణం
సీతాదేవి

**3 నేత్రములున్న విష్ణుమూర్తి విగ్రహము**

చక్రపాణి కుంభకోణము
లక్ష్మీదేవి

స్వామివారికి ఎనిమిది బాహువులు, 3 కండ్లు గలవు.

**6 ముఖములు కల్గిన హనుమంతుని విగ్రహముగల ఆలయము**

చక్రపాణి కుంభకోణం
(విష్ణుమూర్తి)
లక్ష్మీదేవి

ఈ ఆలయములో వెలసిన ఆంజనేయ స్వామి వారికి 6 ముఖములు గలవు. పంచముఖాంజనేయుని కన్న ఒక ముఖము ఎక్కువ.

**ఉత్తర దేశమున బ్రహ్మదేవునికి రాజస్తాన్‌లోని పుష్కర్ గ్రామములో దేవాలయ మున్నట్లే, దక్షిణ దేశములో బ్రహ్మ దేవునికి గల ఆలయము**

బ్రహ్మ కుంభకోణము
సరస్వతీ దేవి
(వీణాపాణి)

**"దక్షిణ తిరుపతి" అని, పేరుగాంచిన ఆలయము**

వెంకటా చలపతి తిరువన్నాగరం
(ఉప్పిలి అప్పన్) 3కి.మీ. తిరు నాగేశ్వరం
శ్రీదేవి, భూదేవి 5కి.మీ. కుంభకోణము
తంజావూర్ జిల్లా

స్వామివారికి లవణవర్జిత వెంకటేశ్వరుడు అని పేరు.

**శ్రీ చక్రము అమ్మవారి ఎదురుగా ఉన్న ఆలయము (అమ్మవారి పీఠభాగమున గాక)**

కామాక్షి దేవి　　　　　　　　　　　　　　కంచి
ఏకాంబరేశ్వరుడు

**అమ్మవారు మానవుని అనుజ్ఞ పొందిన తరువాతనే బయటకు బయల్దేరాలి**

కామాక్షి　　　　　　　　　　　　　　కంచి

త్రినేత్ర ధారియై అమ్మవారు కాళికా రూపములో రాత్రులు తిరుగుతూ ఉండగా ప్రజలు భయభ్రాంతులై ఉండేవారు. అందుచేత శ్రీ శంకరాచార్యుల కోరికననుసరించి, ఆయన అనుమతి లేనిదే కదలనని ప్రమాణము చేసినదీ అమ్మవారు. అందుచేత కామాక్షి విగ్రహాన్ని ఉరేగింపునకు తీసుకుని పోయే ముందు ఆదిశంకరాచార్యుల వారి విగ్రహం ముందు ఆపి, దింపి, అనుజ్ఞ తీసుకుని బయల్దేరుతారు.

**విభీషణుని ముష్టిఘాతానికి బలి అయిన వినాయకుడు**

ఉచ్చపిళ్ళయార్　　　　　　　　　　　　　　తిరుచినాపల్లి
Rock Fort　　　　　　　　　　　　　　10కి.మీ. శ్రీరంగం

శ్రీరామ పట్టాభిషేకానంతరం విభీషణుని కోరిక ప్రకారం శ్రీరాముడు శ్రీ రంగనాధుని విమానముతో సహా ప్రసాదిస్తాడు. ఆ విగ్రహం తీసుకుని వెళుతూండగా, విభీషణుని నుంచి వినాయకుడు విగ్రహమును గ్రహించి భూస్థాపితం చేస్తాడు. మోసం గ్రహించిన విభీషణుని ముష్టి ఘాతానికి బలి అయిన వినాయకుడు పారిపోయి రాక్‌ఫోర్టు శిఖరాగ్రమున వెలుస్తాడు.

**అష్టశక్తుల విగ్రహములు మండపమున గల ఆలయము**

మీనాక్షి　　　　　　　　　　　　　　మధురై
సుందరేశ్వరుడు

**స్వామివారు నిలువబడి ,కూర్చుని , పరుండి ఉన్న మూడు ఆకారములలో నున్న ఆలయము**

అలఘర స్వామి　　　　　　　　　　　　　　అలగర్ కోయిల్
(విష్ణుమూర్తి)　　　　　　　　　　　　　　20 కి.మీ. మధురై

---

సృష్టిలో మేధాసంపన్నుడు మానవుడు అటువంటివాడు బీద, గొప్ప, కుల, మత భేదాలను కల్పించడం అవమానకరం

**ఎదురుగా ఉన్న విగ్రహానికి గాక, ఆయుధానికి అభిషేకము జరుగు ఆలయము**

సుబ్రమణ్యా స్వామి — తిరుప్పర కుండ్రం
దేవసేన — 8 కి.మీ. మధురై

ప్రసిద్ధ 6 సుబ్రమణ్యా క్షేత్రములలో నొకటి ఇంద్రుని కుమార్తె దేవసేనను వివాహమాడిన చోటు. ఇచ్చట స్వామివారికి గాక ,ఆయన ఆయుధమైన "వేల్ '' అనబడే శూలాకారపు ఆయుధమునకు అభిషేకము జరుగును.

**శనీశ్వరుని విగ్రహం గల సుబ్రహ్మణ్య స్వామి ఆలయం**

సుబ్రహ్మణ్య స్వామి — తిరుచందూర్
48 కి.మీ. తిరునల్వేలి
99 కి.మీ. కన్యాకుమారి

6 ప్రసిద్ధ సుబ్రహ్మణ్య క్షేత్రములలో నొకటి.

**రహస్య దీపారాధన (పూజ) జరుగు ఆలయం**

సుబ్రహ్మణ్య స్వామి — తిరుచందూర్
అరేబియా సముద్ర తీరము

తెరవెనుక ఉన్న షణ్ముఖునికి ముందుగా పూజ. తరువాత తెరముందు ఉన్న సుబ్రహ్మణ్య స్వామికి పూజ సుబ్రహ్మణ్య స్వామివారికి షణ్ముఖుడు ఆత్మశక్తిని యిస్తాడని తొలిపూజ తెరవెనుక జరుపుతారు.

**సముద్రమునకు అతిదగ్గర గల ఆలయానికి ప్రక్కనే మంచినీటి బావిగల ఆలయము**

సుబ్రహ్మణ్య స్వామి — తిరుచందూర్
అరేబియా సముద్ర తీరము

6 ప్రసిద్ధ సుబ్రహ్మణ్య క్షేత్రములలో నొకటి. దేవాలయం ప్రక్కనే ఉన్న పెద్ద బావిలో నీరు ఉప్పగా ఉంటుంది కాని దాని ప్రక్కనే ఉన్న చిన్న బావిలోని నీరు తీయగా యాత్రీకులందరూ స్నానము చేయుటకు పనికి వస్తుంది నీరు ఎంత తోడినను తరుగదు.

---

పుణ్యాత్ములు స్వర్గాన్కి వెళ్ళే ప్రయత్నాలకంటే పాపాత్ములు
నరకాన్కి వెళ్ళే ప్రయత్నాలు ఎక్కువగా కనిపిస్తాయి

**అష్టలక్ష్మీ విగ్రహాలు (పెద్దవి ) మండపములో గల ఆలయము**

రామలింగేశ్వర స్వామి — రామేశ్వరము.

**అమ్మవారి ముఖము తూర్పు దిక్కు, కాని తూర్పు దిక్కున ఉన్న ముఖద్వారము మూసివేసి, ఉత్తర ద్వారము గుండానే ప్రవేశము**

కన్యక అమ్మ వారు (కుమారి) — కన్యాకుమారి

నాగమణితో ప్రకాశించే ముక్కు పుడక వెలుతురుని (కాంతిని) దీపంగా భావించి ,ఓడలు తీరాన్ని చేరి, దగ్గరిలోని కొండకు తగిలి పగిలిపోవుటచే తూర్పు ముఖముగా వేంచేసి యున్న అమ్మవారి తూర్పు ముఖద్వారము మూసి వేయబడినది. ప్రవేశము ఎదురుగాకాక ప్రక్కనుండి.

**కుర్తాళం జలపాతము వద్ద దేవాలయం**

కుర్తాళ సాగర్ — కుర్తాళం
కురుళ్ వేయి మొయిలి అమ్మై
చిత్రారు నదీ తీరం

**అంగవైకల్యములను సరిచేయు క్రిస్టియన్ దేవత**

మేరీమాత
Our lady of Health — వేలాం కన్ని
బంగాళాఖాత తీరము — 11 కి.మీ. నాగపట్నం

తిరుపతిలో వలె అంగాల (చేతులు,కాళ్ళువగైరా) బొమ్మలను వ్యాధులబారి నుండి సరియైన అంగములను తయారు చేసి,(బంగారు ,వెండి, ఇత్తడి వగైరాలతో) అమ్మవారికి కృతజ్ఞతా పూర్వకముగ సమర్పింతురు.

**విష్ణుమూర్తి శంఖము“ పాంచజన్యం” ఆకారములో కట్టబడిన ఆలయము**

రామలింగేశ్వరుడు — రామేశ్వరము ద్వీపము

---

**మూగవారికి మాటలు వచ్చునట్లు చేయు స్వామివారు**

సుబ్రహ్మణ్య స్వామి తిరుచెందూర్
శ్రీవల్లి, దేవసేన 54 కి.మీ.తిరునల్వేలి
అరేబియా సముద్రము 38 కి.మీ. ట్యూటికోరిన్

ఆరు ప్రసిద్ధ సుబ్రహ్మణ్య క్షేత్రములలో నొకటి. నలభై ఐదు రోజులు స్వామివారిని పూజించిన మాటలు వచ్చును. పూర్వము ఒక భక్తునికి 45 రోజులు పూజలు జరిపిన తరువాత మాటలు వచ్చి, మహాకవి ఆయెను. విష్ణు మూర్తి, గజలక్ష్మిఆలయము లున్నవి. దేవాలయమునకు వెళ్ళు భక్తులకు ఎండ తగులకుండ రోడ్డుపై షెడ్డు వేయబడినది.

**వీణా గణేశుడు ఉన్న ఆలయం**

సంగమేశ్వరుడు భవాని
త్రివేణీ సంగమం 15 కి.మీ. ఈరోడ్
కోయంబత్తూర్ నుండి బస్సు

**నిత్యాభిషేకములు లేక కేవలం సుగంధద్రవ్య లేపన మాత్రమే జరుగు శివలింగము**

కుంభేశ్వర స్వామి కుంభకోణం
మంగళాంబిక తంజావూరు జిల్లా
60 కి.మీ. చిదంబరం

శని ప్రభావాన్ని తగ్గించడానికి ప్రార్థింపబడు స్వామివారు.

**తిరునల్లార్ లోని శనీశ్వరాలయములో ఉన్న ఈశ్వరుడు,అమ్మవారు**

దర్భారణ్యేశ్వరుడు తిరునల్లార్
భోగామృత పాన్ మొలియాల్ 7 కి.మీ కరైకాల్
(పార్వతి)

ఈ స్వామివారికి దర్భగడ్డి అంటే ప్రీతి.

**నవగ్రహాలు మండపం కప్పులో చెక్కబడిన ఆలయం**

బ్రహ్మ
విష్ణు
మహేశ్వరుడు
ఒకే లింగ ఆకారము

సుచీంద్రం
కన్యాకుమారి- నాగర్‌కోయిల్
మధ్యలో

ఈ లింగానికి " ధర్మసంవర్ధిని" అని పేరు.

**రామేశ్వరం తరువాత, పెద్దది, పొడవైన ప్రాకారముగల ఆలయం**

స్థాణుమాలయ స్వామి

సుచీంద్రం

బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు ఏకేశ్వరుడుగ వెలసిన ఆలయం

**" వ్యాఘ్ర పాద గణేశుడు" ఉన్న ఆలయము**

మీనాక్షీ దేవి
సుందరేశ్వరుడు

మధురై

**తమ కుమార్తెలకు శీఘ్రముగ వివాహము జరుగాలని కోరుకునే తల్లిదండ్రులు దర్శించే ఆలయం**

శ్రీ కళ్యాణ సుందరార్
కోకిలాంబాళ్
( పార్వతి)

తిరుమనం చేరి
6 కి.మీ కుర్తాళం
తంజావూర్ జిల్లా
కుంభకోణము నుండి బస్సు

పరమ శివుని వివాహము జరిగిన చోటు "తిరుమనం" అనగా వివాహము. పెండ్లి అయిన నూతన వధూవరులు వచ్చి, పూజించు ఆలయము.

**పరమేశ్వరుడు పార్వతీదేవి చేతిని పట్టుకుని, పాణిగ్రహణము చేస్తున్న భంగిమలో ఉన్న మూర్తులు గల ఆలయం**

శ్రీ కళ్యాణ సుందరార్
కోకిలాంబాళ్
(పార్వతి)

తిరుమనంచేరి

పరమశివునికి వివాహము జరిగిన చోటు. ఆలయం చుట్టూ కందకములు వ్యాపించి యున్న "సప్త సాగర తీర్థం" అని పిలువబడే పుష్కరిణి కలదు సప్త సముద్రములు వచ్చి, పరమ శివుని పాణిగ్రహానికి పుష్పమాలికగా ఏర్పడినట్లు పురాణ గాధ.

---

అంబ హోత్రవాహనుడను కాశిరాజు కుమార్తె అంబిక, అంబాలికలు చెల్లెండ్రు

| | |
|---|---|
| 77. బినేశ్వర్ | బిన్ సార్, 34 కి.మీ. అల్మోరా |
| 78. 1. బలేశ్వర్ 2. నాగనాధ్<br>3. శివ, పార్వతి 4. భైరవ్<br>5. అగ్ని 6. మహాలక్ష్మి | చంపావట్<br>14 కి.మీ. లోహా ఘాట్<br>76 కి.మీ. పిరోర్ ఘర్,<br>పిరోర్ ఘర్ జిల్లా |
| 79. కూటేటి దేవి | ఉత్తర కాశీ ,2 కి.మీ. దూరములో |
| 80. భైరవ్ | భైరవ ఘాట్<br>గంగోత్రికి పోవు త్రోవలో<br>ఉత్తరకాశీ జిల్లా |
| 81. 1. భరత్<br>2. వేంకటేశ్వర | ఋషీకేశ్<br>దగ్గరలో |
| 82. మహాసు దేవత | హనోల్<br>చక్రతాకు దగ్గర, 92 కి.మీ.<br>డెహ్రాడూన్ |
| 83. శివ | లక్ష్మణ దళ్ 80కి.మీ.ముస్సోరి,<br>యమునోత్రి రోడ్డు |
| 84. నాగనాధ్ | చమ్పావట్, 76 కి మీ పిరోర్ ఘర్,<br>పిరోర్ ఘర్ జిల్లా |
| 85. భైరవీ దేవి | దేవీధురా<br>పిరోర్ ఘర్ జిల్లా<br>45 కి.మీ. పిరోర్ ఘర్ |

---

మరణించిన తరువాత గాని కీర్తిరాదు. అందుచేత కీర్తికి తొందరపడకూడదు

| | | |
|---|---|---|
| 86. | కాళికాదేవి | గంగోళి హాట్, 77 కి.మీ<br>పిరోర్ ఘర్,<br>పిరోర్‌ఘర్ జిల్లా |
| 87 | ఈశ్వర్ | పుణ్యాగిరి<br>20 కి.మీ. తనకుపూర్ " |
| 88. | రామేశ్వర్<br>రామ్‌గంగ, సరయూ నదుల<br>సంగమం | రామేశ్వర్<br>36 కి.మీ పిరోర్‌ఘర్ " |
| 89. | ఖత లింగం (మట్టి లింగం)<br>(అర్జునుడు మట్టితో లింగం చేసి<br>పాశుపతాస్త్రం గురించి పూజించిన<br>లింగం) | ఖత లింగ క్షేత్రం, 50 కి.మీ.<br>నరేంద్ర నగర్ |
| 90. | శివ మహాదేవ్<br>వైతరణీ నదీ తీరం<br>(పరశురాముని గండ్ర గొడ్డలికి,<br>శివుని శూలమునకు ఆరాధన) | గోపేశ్వర్<br>చమోలి జిల్లా<br>10 కి.మీ చమోలి |
| 91. | దక్ష ప్రజాపతి | హరిద్వార్<br>హరిద్వార్ జిల్లా |
| 92 | నృసింహా మూర్తి | జ్యోషీ మఠ్, బద్రీనాధ్ రూట్‌లో |
| 93 | వాసుకి (నాగదేవత)<br>గంగానదీ తీరం | అల్హాబాదు |
| 94 | జాగేశ్వర్ | జాగేశ్వర్, 90 కి మీ. అల్మోరా<br>అల్మోరా జిల్లా |

| | | |
|---|---|---|
| 95. | తప్కేశ్వర్ మహాదేవ్ | తప్కేశ్వర్, 5 కి మీ డెహ్రాడూన్ గర్హి గ్రామములో |
| 96. | నీలకాంత మహదేవ్ గంగానదీ తీరము | నీలకాంత్ 12 కి.మీ. లక్ష్మణఝూలా |
| 97. | నాగదేవత | ముస్సోరి |
| 98. | కేసరీ దేవి | కాళీమర్ అల్మోరా జిల్లా, 5 కి.మీ. అల్మోరా |
| 99. | బైద్యనాధ్ కుమా ఊన్ కొండలలో | బైద్యనాధ్ 71 కి మీ అల్మోరా అల్మోరా జిల్లా |
| 100. | మాయా దేవత | మాయాదేవత,10 కి.మీ డెహ్రాడూన్ |
| 101. | రాధాకృష్ణ | కాన్పూర్ |
| 102. | ముక్తేశ్వర్ | ముక్తేశ్వర్, 50 కి మీ. నైనితాల్ |
| 103. | కాశీనాధ్ | కాశీనాధ్, 8 కి.మీ. అల్మోర 75 కి.మీ. నైనితాల్ |
| 104. | ఊకినీ దేవి | కాశీపూర్ నైనితాల్ జిల్లా |
| 105. | నందా దేవి | నంద పర్వతం |

| | | |
|---|---|---|
| 106. | శ్రీకృష్ణ, యశోదాదేవి | మహావనం 8కి.మీ. మధుర |
| 107. | హనుమంతుడు | పహాడ్‌పూర్<br>ఫైజాబాద్‌కు దగ్గరలోని కొండపై |
| 108. | హనుమంతుడు | అవధ్, ఫైజాబాద్ దగ్గర |
| 109. | వ్యాస హనుమాన్ | అయోధ్య, రాయ్‌గంజ్‌లో |
| 110. | సంకట మోచన హనుమాన్ | కాశీ<br>బెనారస్ హిందూ విశ్వ<br>విద్యాలయం దగ్గర |
| 111. | హనుమాన్<br>రాప్తీ నదీ తీరం | గోరఖ్‌పూర్‌త |
| 112. | లుటేరియా హనుమాన్ | మధుర బృందావనం మధ్యలో |
| 113. | శ్రీ సిద్ధి గణేష్ | బృందావనం |
| 114. | శ్రీ డూండిరాజ గణపతి | వారణాసి |
| 115. | వాగేశ్వరి (సరస్వతి) | కాశీ |
| 116. | కాళికా దేవి<br>శారదా నదీ తీరం, శక్తి పీఠం | పూర్ణగిరి<br>అల్‌మోర జిల్లా, 15 కి.మీ.<br>టకన్ పూర్<br>నేపాల్ సరిహద్దు |

---

ధైర్యవంతులు, విజ్ఞానవంతులు, పండితులు చాలమంది కనిపిస్తుంటారు నిజమైన పెద్దమనస్సు గలవారు మాత్రం చాల అరుదుగా కనిపిస్తారు

| | | |
|---|---|---|
| 117. | మహా త్రిపుర సుందరి (అన్నపూర్ణ) | ఫరూకాబాద్ ఫరూకాబాద్ జిల్లా |
| 118. | సింహ వాహిని | కన్యాకుబ్జ్, ఫరూకాబాద్ జిల్లా |
| 119. | మహేశ్వరి, వామదేవేశ్వర్ | బాందా |
| 120. | మహా విద్యా దేవి | మధుర |
| 121. | కాళి, పీతాంబరా, గాయత్రి, బాలా త్రిపుర సుందరి, తారాదేవి, మంగళగౌరి, లలితాదేవి, మహాలక్ష్మి | కాశి |
| 122. | రాజ రాజేశ్వరి | బాంగర మావు, ఉన్నవ జిల్లా |
| 123. | భగవతి మందాకిని నదీ తీరం | నారాయణ ఖేట్ ఉత్తరాఖండ్ జిల్లా కేదార్‌నాధ్‌కు వెళ్ళు త్రోవలో |
| 124. | గౌరీ దేవి | గౌరీ కుండ్‌కేదారనాధ్‌కు, దగ్గరలో |
| 125. | శ్రీ దుర్గ | రామ్‌నగర్ |
| 126. | మహాదేవి | మణియార్ |
| 127. | భగళాముఖి | ఓషియాంగబాద్ |

| | | |
|---|---|---|
| 128. | శ్రీ కుల్‌కుల్యాదేవి<br>శ్రీ కుల్ కుల్యానాధ్ | 10 కి.మీ. కుషీనగర్ |
| 129. | భీమ శంకర్<br>ఢాకిని వనములో | గోవిష్ణు గ్రామం<br>ఉజ్జనక్ దగ్గర |
| 130. | భూతేశ్వర్ | నైనితాల్ జిల్లా |
| 131. | భూతేశ్వర్ | మధుర |
| 132. | చక్రేశ్వర్ | గోవర్ధనం |
| 133. | కామేశ్వర్ | కామవనం |
| 134. | ముక్తేశ్వర నాధ్<br>రాఫతి నదీ తీరం. | గోరఖ్ పూర్ |
| 135. | గోపేశ్వర్ | బృందావనం |
| 136. | 1. విశ్వనాధ 2 ఏకాదశరుద్ర<br>3. భైరవ 4. జానేశర్<br>భగీరధీ నదీ తీరం | ఉత్తరకాశీ<br>100 కి.మీ. గంగోత్రి<br>155కి.మీ. ఋషీకేశ్<br>ఉత్తర కాశీ జిల్లా. |
| 137. | శ్రీరామ<br>సీతాదేవి | లక్నో |
| 138. | శ్రీరాముడు<br>సీతాదేవి | కనఖాల్<br>నందిగ్రామ్<br>20కి.మీ. అయోధ్య |

---

లోభి ప్రపంచములోని సంపదలన్నీ తనకున్నా, ఇంకా ఏదో లేదని ఏడ్చేవాడు

# కేరళ

## (విశిష్టతలు)

**కామచేష్టలు చేస్తూ, కామ అవయవాలను ప్రదర్శిస్తూ పూజింపబడు అమ్మవారు**

| | |
|---|---|
| కణ్ణకి అమ్మవారు (కాళికారూపం) | కొడుంగళ్ళూర్ |
| లేక | 40కి.మీ. త్రిచూర్, |
| కొడుంగళ్ళూర్ అమ్మవారు | త్రిచూర్‌జిల్లా |

కుటుంగళ్ నది సముద్రములో కలియు చోటు. చెటవాయి నది, అజికోడ్ నదులు అరేబియా సముద్రములో కలియుచోట ఏర్పడిన దీవి. Cranganore or Kodungallur అని పేరు. అమ్మవారు 6' ఎత్తు విగ్రహం. 8 చేతులు ఆయుధములతో నుండును. విగ్రహం పనసచెట్టు కర్రతో చేయబడినది. దారుకుడనే రాక్షసుని చంపిన కాళికాదేవి కోపముతో చిందులు వేస్తూండగా పరమేశ్వరుడు నగ్నంగా కనిపించి నృత్యము చేసిన తరువాత శాంతించిన దేవత. అమ్మవారిని శాంతింప జేయడానికి శివుడు ఇద్దరు బిడ్డలను అమ్మవారి పాలిండ్లను పట్టుకుని పాలుత్రాగుటకు సృష్టించెను. ఇంకనూ శాంతించక పోవుటచే శివుడే కామరూపముతో అమ్మవారి ముందు నృత్యించెను.

**అమ్మవారి విగ్రహానికి తూర్పుభాగాన "రహస్యపు గది" ఉన్న ఆలయము**

| | |
|---|---|
| కణ్ణకి అమ్మవారు | కొడుంగళ్ళూర్ |
| లేక | 40కి.మీ త్రిచూర్ |
| కొడుంగళ్ళూర్ భగవతి | త్రిచూర్ జిల్లా |

ఇందు ప్రవేశము నెవ్వరికి లేదు ఆలయం అధికారులకు తప్ప. ఎర్రటి వస్త్రం వ్రేలాడుతూ ఉంటుంది. అమ్మవారి అవశేషాలున్నట్లు చెబుతారు.

**దారుకుడనే రాక్షసుని చంపిన అమ్మవారు, సప్తమాతృకలున్న ఆలయము**

కణ్ణకి అమ్మవారు (కాళి) కొడుంగళ్ళూర్
40 కి.మీ. త్రిచూర్
త్రిచూర్ జిల్లా

| అమ్మవార్ల పేర్లు: | సృష్టించిన దేవతలు: |
|---|---|
| 1. బ్రాహ్మణి | బ్రహ్మ |
| 2. వైష్ణవి | విష్ణుమూర్తి |
| 3. మహేశ్వరి | శివమహాదేవుడు |
| 4. కౌమారి | సుబ్రహ్మణ్య స్వామి |
| 5. వరాహి | యముడు |
| 6. ఇంద్రాణి | ఇంద్రుడు |
| 7. కాళిక (కణ్ణకి) | శివుని 3వ కంటినుండి ఆవిర్భవించినది. |

6గురు అమ్మవార్లు దారుకుడనే రాక్షసుని జయించలేక పోవుటచే శివుని 3వ నేత్రము నుండి కాళిక అవతరించి సంహరించెను. దేశములో అన్నిచోట్ల అమ్మవారు మహిషాసురుని చంపినట్లు కధ. కానీ ఇక్కడ మాత్రము దారుకుడను రాక్షసుని చంపినట్లు కధ. ఇది ప్రత్యేకత

**అంటువ్యాధులు రాకుండా "వసురిమల" అనే అమ్మవారిని ప్రతిష్ఠించి భక్తులను కాపాడమని ఆదేశించిన అమ్మవారు**

కొడుంగళ్ళూర్ భగవతి కొడుంగళ్ళూర్

భగవతి ఆలయంలో "వసురిమల" అమ్మవారిని ప్రతిష్ఠించి భక్తులచే పూజింపబడు దేవత.

**కుడిచెయ్యి విరిగిన, బంగారు రేకులతో అంటించి ప్రతిష్ఠించబడిన స్వామివారు**

జనార్ధన స్వామి వర్కల R.S.
58కి.మీ. త్రివేంద్రం

విగ్రహము చిన్నదిగా చక్కగా ఆకర్షణీయముగా ఉండును.

---

చిన్న విషయాలలో కూడా జాగ్రత్త పడితే పరిపూర్ణత లభిస్తుంది కాని,
పరిపూర్ణత అన్నది చిన్న విషయం కాదు

## దక్షిణాదిన బహిష్టు ఉన్న దేవత

భగవతీ దేవి(పశ్చిమముఖం) చెంగన్నూర్
(పంచలోహ విగ్రహము) 2 1/2' ఎత్తు అల్లెప్పి జిల్లా
అర్ధనారీశ్వరుడు (తూర్పు ముఖం) 35కి.మీ. కొట్టాయం
60కి.మీ. అల్లెప్పి

ప్రతీ ఏట అమ్మవారికి 3,4 సార్లు బహిష్టు వస్తుంది. విగ్రహానికి క్రింది భాగములో చుట్టబడిన తెల్లని వస్త్రముపై రక్తపు చారలు కనబడుతాయి.

ఈ వస్త్రాన్ని "ఒడయాడ" అని పిలుస్తారు . రక్తపు ఛాయలు కనిపించిన వెంటనే దేవాలయం మూసివేస్తారు. బహిష్టును "త్రిపూద్" లేక "త్రిపుట్టే" అని పిలుస్తారు. పూజారి విగ్రహానికున్న బట్టను మార్చి, కొత్త బట్ట కట్టి, దేవాలయం 3 రోజులు మూసివేస్తాడు. 4వ రోజున అమ్మవారిని ఊరేగిస్తూ తీసుకుని వెళ్లి, నదిలో స్నానము చేయించి, తిరిగి తీసుకుని వస్తారు. ఈ ఊరేగింపులో స్త్రీలు చాల ఎక్కువగా పాల్గొంటారు. ఆడ ఏనుగులను అలంకరించి, వాటిపై అమ్మవారిని ఉంచి, తీసుకుని వెళ్ళి, తిరిగి తీసుకుని వస్తారు స్నానం చేసి వచ్చిన అమ్మవారికి 12 రోజులు ఎర్రటి పూలతో పూజలు చేసి, కానుకలు సమర్పించి, స్త్రీలు కోరికలు సిద్ధించుకుంటారు. హిందువులే గాక క్రైస్తవులు, మహ్మదీయస్త్రీలు కూడ అమ్మవారికి పూజలు చేస్తారు. కేరళలో మానసిక వ్యాధులు నయము చేయు అమ్మవారుగా ప్రసిద్ధి.

దేవాలయమునకు బయట శ్రీ కృష్ణాలయం కలదు. గంగా, జటాధరి విగ్రహములు కలవు.

## పసుపును వెదజల్లించుకుని, పసుపు, నిమ్మకాయల నీళ్ళు కలిపిన "గురుతి" అని పిలువబడే ప్రసాదాన్ని యిచ్చు అమ్మవారు

వసురిమల అమ్మవారు కొడుంగళ్ళూర్
40 కి.మీ. త్రిచూర్
త్రిచూర్ జిల్లా

కొడుంగళ్ళూర్ భగవతి ఆలయములో వెలసిన అమ్మవారు. అంటువ్యాధులు నివారించుటకు ప్రసిద్ధి.

**కోళ్ళ పండుగ లేక భరణి ఉత్సవము జరిపించు కొను అమ్మవారు**

భగవతి — కొడుంగళ్ళూర్

ఈ ఉత్సవం సంవత్సరమున కొకసారి జరుగుతుంది వందలాది కోళ్ళను బలి యిస్తారు

**భరతునికి ప్రత్యేకముగా నున్న దేవాలయం**

భరతుడు (కుతల మాణిక్యం)

ఇరింజల కుడ
8కి.మీ. ఇరింజలకుడ R.S
ట్రిచూర్ జిల్లా
75కి.మీ. కొచ్చిన్
20కి.మీ. ట్రిచూర్

ఈ ఆలయములో ఉపదేవతలు లేరు త్రిప్రయార్‌లో శ్రీరామాలయం, మురుకొలములో లక్ష్మణాలయం, పాయేమొలో శత్రుఘ్నుని ఆలయములున్నవి. ఒకే రోజున ఈ నాల్గు దేవాలయముల దర్శనం మోక్షదాయకం.

ఈ ఆలయంలో చివరకు వినాయకుని విగ్రహము కూడా లేదు.

**ప్రతీరోజు రాత్రి దేవాలయం మూసేముందు జమ, ఖర్చులు లెక్కలు చదివి వినిపించు స్వామివారు**

అనంత పద్మనాభస్వామి — త్రివేండ్రం

కేరళ రాష్ట్రమంతయు స్వామివారికి అంకితము కావించబడినది: అందుచేత స్వామివారిని రాజుగారిగా భావించి కొలుస్తారు. ప్రతీరోజు రాత్రి ఆదాయ, వ్యయాలు మహారాజు గారికి విన్నవించే లాగున అరటి ఆకుపై వ్రాసి, స్వామివారికి విన్నవించుకుంటారు. మహారాజు స్వామి వారి ప్రతినిధి మాత్రమే.

**సంవత్సరములో ఒక్కరోజున నైవేద్యము లేకుండా ఉపవాసమున్న స్వామివారు**

వైకతప్పన్ (శివలింగం) — వైక్కం

కుమార స్వామి తారకాసుర సంహారము చేసి, విజయము సాధించుటకు శివుడు ఉపవాసముండి, సర్వశక్తి కలుగునట్లుగా ఆదిపరాశక్తిని ప్రార్థించిన రోజు.

---

**విగ్రహం నుదుటను మాణిక్యకాంతిగల ఆలయం**

కుతల మాణిక్యం ఇరంజల కుడ

(భరతుడు) 8కి.మీ ఇరంజలకుడ R S

20 కి.మీ. త్రిచూర్, త్రిచూర్ జిల్లా

స్వామివారి నుదుటనున్న మాణిక్యం కాంతులు వెదజల్లు చుండగా కాయంకుళం మహారాజుగారు తన వద్దనున్న మాణిక్యాన్ని తీసుకుని వచ్చి, స్వామివారి మాణిక్యముతో పోల్చగా, ఈ మాణిక్యం కూడా ఎగిరిపోయి స్వామివారి నుదుటిపైనున్న మాణిక్యంతో కలసి పోయినదట. అప్పటినుండి స్వామివారికి "కుతలమాణిక్యం" అని పేరు వచ్చినదట.

విగ్రహం . 4 చేతులు కల్గిన విష్ణుఅంశ. (భరతుడు)

1. ఉపదేవతలు లేని ఒకే ఒక స్వామివారు. వీరినే శివ, విష్ణు, శక్తిమూర్తిగా ఆరాధిస్తారు.
2. తామర పద్మాలతోనూ, తులసి, మారేడుదళములతో మాత్రమే పూజిస్తారు
3. ఆలయ ప్రాంగణ కొలనులోని చేపలను పవిత్రమైనవిగా భావిస్తారు. ఈ కొలనులో కప్పలు, నీటి పాములు వగైరా లేకుండుట ప్రత్యేకత.
4. కేరళలోని అన్ని దేవాలయములలోనూ రోజుకి 5సార్లు పూజలుంటాయి కానీ యిక్కడ 3సార్లు మాత్రమే.
5. స్వామివారికి ప్రతీరోజు ఊరేగింపులేదు. సంవత్సరమునకు ఒక్కసారి మాత్రమే.

**6 సంవత్సరముల కొకసారి లక్ష దీపాలంకరణతో పూజింపబడు ఆలయం, స్వామివారు**

అనంత పద్మనాభస్వామి త్రివేంద్రం

మొత్తం గుడి, గోపురం దీపాలంకరణతో లక్ష దీపోత్సవము జరుగుతుంది. 6సంవత్సరముల కొకసారి మకర సంక్రాంతికి 56 రోజుల "మొరజపం" అని పిలువబడే ఉత్సవం జరుగుతుంది. ఇదిగాకుండా ప్రతి సంవత్సరం భద్రదీపోత్సవం జరుగుతుంది.

**1,200 సాలగ్రామ శిలలతో తయారు కాబడిన స్వామివారి విగ్రహం**

అనంత పద్మనాభస్వామి త్రివేంద్రం

ఆదిశేషునిపై యోగనిద్రలో పవళించి యున్నట్లుగా మలచినారు.

---

## అరేబియా సముద్రములోని "శంఖుముఖం" స్నానోత్సవానికి తీసుకుని వెళ్ళు స్వామివార్లు

1. అనంత పద్మనాభస్వామి త్రివేంద్రం
2. శ్రీకృష్ణుడు
3. శ్రీ నారసింహుడు

ఈ పై 3 మూర్తులను అనంత పద్మనాభ స్వామివారి ఆలయం నుండి తీసుకుని వెళ్ళెదరు.

మార్చి - ఏప్రిల్ నెలలో ఒకసారి, అక్టోబర్ - నవంబర్ నెలలో ఒకసారి అరేబియా సముద్రపు బీచ్‌లో పవిత్ర స్నానోత్సవం "శంఖుముఖం" వద్ద జరుగును. కథాకళి నృత్యాలు, కత్తి, కరాటే సాములు వుత్సవదినాల్లో గొప్పగా ప్రదర్శింతురు.

## మూడు ద్వారముల నుండి దర్శన మిప్పించు దేవుడు

అనంత పద్మనాభ స్వామి త్రివేంద్రం
(విష్ణుమూర్తి)
పద్మతీర్థ సరోవరము ప్రక్కన

స్వామివారు ఆదిశేషునిపై శయనించిన మూర్తి. మొదటి ద్వారమున స్వామివారి శ్రీముఖము, రెండవ ద్వారమున నాభినుండి ఉద్భవించిన కమలము, బ్రహ్మదేవుడు, మూడవ ద్వారమున స్వామివారి పాదదర్శనము. తిరువాన్‌కూర్ రాజులు తమ రాజ్యాన్ని స్వామివారికి సమర్పించి స్వామి ప్రతినిధులుగా రాజ్యమునేలుతారు. (రామాయణంలో రామ వనవాస సమయములో భరతుని వలె). మొత్తం దేవాలయము, గోపురముతో సహా లక్ష దీపాలతో అలంకరిస్తారు. ఎదురుగానున్న సరోవరములో ఈ దృశ్యము నయనానందకరముగా నుంటుంది.

## రంధ్రములో వేలు వుంచి అసత్య ప్రమాణము చేసిన పాముకాటుకు గురై మరణింతురని ప్రఖ్యాతిగల ఆలయము

భగవతి చెంగనూర్
అర్థనారీశ్వరుడు 35కి.మీ. కొట్టాయం
60 కి.మీ. అలెప్పి

ఆలయమునకు పశ్చిమాన ఉన్న గోపురానికి కుడి ప్రక్కన "పశ్చిమనాడ" అని పేరుగల రంధ్రమున్నది. భక్తులు అందులో వేలు ఉంచి సత్యము పలుకుదురు.

---

## కేరళలో అతిపెద్ద 4,000లకు పైగా నున్న రాతి సర్పరాజములను పూజించు పవిత్ర స్థలము

నాగరాజు — మన్నారసాల

సర్పయక్షి (రాణి) — 3కి.మీ హరిపేట్

ఖాండవ దహనము తరువాత వాసుకి అనబడే సర్పరాజ సంతతి ఇక్కడ వెలసినట్లు, పది ఎకరముల తోటలో ప్రతిష్ఠించబడిన విగ్రహములు వీటిలో చిన్న, పెద్ద సైజులలో ఒకటి 5,7 తలలుగల (పడగలు గల) విగ్రహములు సైతము గలవు పిల్లలు కావలసినవారు "ఉర్లి" అని పిలువబడే కంచు పాత్రను నాగరాజుకు కానుకగా సమర్పించుకుంటారు.

## కుడిచేత కొరడా, ఎడమ చేత శంఖముతో ఉన్న శ్రీకృష్ణ విగ్రహము

పార్థసారధి — అంబలకుజ

అలెప్పిజిల్లా

14.కి.మీ అలెప్పి

76కి.మీ. కొచ్చిన్

150కి.మీ. త్రివేంద్రం

ఇక్కడ స్వామివారిని ఉన్నికృష్ణుడని కూడా పిలుస్తారు. అనగా చిన్నికృష్ణుడని అర్ధము ఇక్కడ మధ్యాహ్నము పాలపాయసం ప్రసాదం

## మానసిక రోగులకు స్వస్థత చేకూర్చు కేరళలోని ప్రముఖమైన 3 ఆలయములు

1. చొట్టా నికర 17కి.మీ. కొచ్చిన్
   రాజరాజేశ్వరీ దేవి
2. ఎట్టమనూర్ 11కి.మీ. కొట్టాయం, ఎర్నాకుళం-కొట్టాయం రైల్వే లైనులోని స్టేషను.
   ఎట్టమమా రప్పన్ (శివమహాదేవ్)
   ఉగ్రరూపం
3. చెంగనూర్, అలెప్పి జిల్లా. 35కి.మీ. కొట్టాయం.
   60కి.మీ. అలెప్పి.
   భగవతి.

---

## ఉత్సవము ఆఖరి రోజులలో 7 $\frac{1}{2}$ అని పిలువబడే 8 బంగారు ఏనుగులను ప్రదర్శించు ఆలయము

ఎట్టమనూరప్పన్
(శివమహాదేవ్)
7 ఏనుగుల ఎత్తు 2' ఒక్కొక్కటి
8వ ఏనుగు ఎత్తు 1' మాత్రమే

ఎట్టమనూర్
11కి.మీ.కొట్టాయం
అలెప్పి జిల్లా
2కి.మీ. ఎట్టమనూర్ R.S.

ఈ 8 ఏనుగులను అష్ట దిక్పాలకులుగా భావించి పూజిస్తారు. 8 ఏనుగులు ఉంటే ఒకటి పాలనాధికారులకు (అనగా ఆనాటి ప్రభువులకు) యిచ్చి వేయవలసివచ్చినదట. అందుచేత బంగారాన్ని తగ్గించి 7 $\frac{1}{2}$ ఏనుగులుగా భావించుటకు 8వ ఏనుగును చిన్నదానిగా చేయించవలసి వచ్చినదట.

## శివుని యొక్క ఉగ్రతను తగ్గించుటకు నిర్మించబడిన శ్రీకృష్ణుని ఆలయము

ఎట్టమనూరప్పన్
(శివ మహాదేవ్)
బాలగోపాల
(శ్రీకృష్ణుడు)

ఎట్టమనూర్
11కి.మీ. కొట్టాయం
అలెప్పి జిల్లా

ఖరుడనే రాక్షసుడు శివలింగాన్ని ప్రతిష్ఠించెను. కాని స్వామివారు చాల ఉగ్రరూపమున ఉన్నందున ఎదురుగా శ్రీకృష్ణ మందిరము నిర్మించెను.

## దేవాలయములో భోజనము చేస్తే కడుపులోని పుండ్లు వగైరా గర్భసంబంధిత రోగాలు నయమగును

పెరుంత్రి కోవిళప్పన్
లేక
వైకతప్పన్
లేక
అన్నదాన ప్రభువు

వైకం
33 కి.మీ. ఎర్నాకుళం
40కి.మీ కొట్టాయం
కొట్టాయం జిల్లా

ఈ క్షేత్రమునకు "దక్షిణ కాశి" యని పేరు.

**దేవాలయములోని వంటశాలలోని బూడిదను విభూతి ప్రసాదముగ యిచ్చు ఆలయము**

వైకతప్పన్ వైకం
లేక
అన్నదాన ప్రభువు

**స్వామివారి దర్శనాన్ని "ఆనంద దర్శనం" గా పేరుగాంచిన ఆలయం**

వైకతప్పన్ వైకం
లేక
అన్నదాన ప్రభు

ఆలయములో వండిన భోజనాన్ని చేసి, స్వామివారిని దర్శిస్తే ఆదర్శనాన్ని "ఆనందదర్శనమని" పిలుస్తారు. శివుడు కూడా తమతో కూర్చుని భోజనము చేస్తాడని నమ్మిక.

**మోకాటిలోతు వరకు ఉన్న నీటిలో మునిగి యున్న శివలింగము**

వైకతప్పన్ వైకం
లేక
అన్నదాన ప్రభు
(దక్షిణ కాశి)

**వైకతప్పన్ (కేరళ) ఆలయ ప్రాంగణములో టాపులేకుండా గుడి ఉన్న అమ్మవారు**

పానన్ చిక్కాల్ భగవతి వైకం
లేక
వనదుర్గా దేవి

**"ధర్మ స్రష్ట" అని పిలువబడే దేవుడు గల ఆలయం**

అయ్యప్ప స్వామి శబరి మల
(హరిహర పుత్ర) 180కి మీ త్రివేండ్రం
(మణికంఠ) 5కి.మీ. పంబానది

## అయ్యప్ప స్వామి (ధర్మ స్రష్ట) వారిని బ్రహ్మచారిగా గాక ఇరువురు భార్యలతో ప్రతిష్ఠించిన ఆలయము

ధర్మస్రష్ఠ
(అయ్యప్ప స్వామి)
పూర్ణ
పుష్కళ

చొట్టాని కర
17కి.మీ. ఎర్నాకుళం

పూర్ణ, పుష్కళ అమ్మవార్లు యిద్దరూ అయ్యప్పస్వామి వారి భార్యలు.

## నిత్యము భాగవత ప్రవచనము జరుపబడు ఆలయము

శ్రీగురవాయూరప్పన్
(శ్రీకృష్ణుడు)

గురువాయూర్
30కి.మీ. త్రిచూర్

## చెరువులో కప్పలుగాని, పాములుగాని కనిపించని ఆలయం

శ్రీ కుడల్ మాణిక్యం
(భరతుడు)

ఇరింజల కుడ

గంగానది మొదలగు ఇతర పవిత్ర నదుల జలాలు ఈ చెరువులో ఉన్నాయని తలుస్తారు.

## కేరళలోని అనంత పద్మనాభస్వామి వారిని 3 ద్వారముల గుండా చూచేటట్లుగా 3 ద్వారముల గుండా చూడవలసిన మరొక స్వామివారు

ఆది కేశవ స్వామి
13' శేష శయ్యమీద
నున్న స్వామివారు

తిరువట్టార్
20కి.మీ. త్రివేంద్రం
నాగర్‌కోయిల్‌నుండి 32కి.మీ.
తామ్రపర్ణి నదీ తీరం

స్వామివారి విగ్రహం క్రింద రాక్షస విగ్రహం కలదు. చంపబడిన రాక్షసుని కోరిక మేరకు రాక్షసుని శరీరముపై స్వామివారు పవళించిరి. మొదటి ద్వారంగుండా శ్రీముఖం, మధ్య ద్వారము గుండా వక్షస్థలం, మూడవ ద్వారం గుండా పాదాలు కాననగును.

---

## పిల్లలను దృష్టి దోషముల నుండి కాపాడు ధూపము గల ఆలయము

జనార్ధన స్వామి | జనార్ధనం
(చతుర్భుజుడు) | 3 కి.మీ. వర్కల
అరేబియా సముద్ర తీరం | 43 కి.మీ. త్రివేండ్రం

బ్రహ్మ యజ్ఞం చేసిన చోటు. ఇక్కడ ధూపం ఎల్లప్పుడూ వస్తూ ఉంటుంది.

## ఏనుగుల మధ్య పోటీ పరుగుపందెము నిర్వహించబడే ఆలయము

శ్రీకృష్ణుడు | గురువాయూర్
100 కి.మీ. కొచ్చిన్

దేవాలయమునకు 3 ప్రదక్షిణములు చేసి అన్నిటికన్నా ముందువచ్చి ధ్వజస్తంభాన్ని తాకే ఏనుగునకు ఆ సంవత్సరం అధికార వాహనముగా గుర్తింపు లభిస్తుంది. ఇటువంటి గుర్తింపు, ఏర్పాటు ~~ఈ~~ ఒక్క దేవాలయములోనే కనిపిస్తుంది.

## ఏనుగులకు అలంకరణలో, వాద్యఘోషకు ప్రతిస్పందనలో పోటీ నిర్వహించబడే ఆలయము

వడక్కు నాధన్ | ట్రిచూర్
పరమెక్కవు దేవి | ట్రిచూర్ జిల్లా
తిరువెంబడి ఆలయం

## బలిపీఠము తిరుగుతూ ఉంటే మేకు కొట్టి, మంత్రోచ్ఛరణ చేసి ఆపిన ఆలయం

శ్రీరాముడు | త్రిప్రయార్
త్రిప్రయార్ నదీ తీరం | ట్రిచూర్ జిల్లా
ఇరింజలకుడ R.S. దగ్గర
75 కి.మీ. కొచ్చిన్

చాలా మహిమలుగల ఒక యోగి మంత్రోచ్ఛరణ చేసి, తిరుగుతూ ఉన్న బలిపీఠాన్ని మేకు కొట్టి ఆపినారు.

---

ఒడ్డుపై నుండి చూచేవాడికి మహాసముద్రము ఆనందం కలిగిస్తుంది,
మధ్యలో మునిగిన వాడికి కాదు

## విగ్రహముతో సమానముగా బలిపీఠమునకు పూజగల ఆలయము

శ్రీరామచంద్రమూర్తి తిప్రయార్
సీతాదేవి 15 కి.మీ. ట్రిచూర్

సముద్రములో కొట్టుకొని వచ్చిన శ్రీరాముని విగ్రహాన్ని పైన ఎగురుతున్న నెమలినీడ పడినచోట ప్రతిష్ఠించమని ఆకాశవాణి పలికినది కానీ ఎన్ని రోజులకీ నెమలి ఎగురుట, నీడపడుట కనిపించకపోవుటచే ఒక రోజున నెమలి ఈకలు పట్టుకుని ఒక భక్తుడు కనిపించిన చోట శ్రీరామ విగ్రహ ప్రతిష్ఠ జరిగినది ఇది జరిగిన కొద్ది క్షణాలకు నెమలి పైన ఎగురుట, నీడ నేలపై పడుట జరిగినవి. అందుచేత అక్కడ (నీడపడిన చోట) బలిపీఠాన్ని ప్రతిష్ఠించినారు. బలిపీఠము నిలకడగా నుండక గుండ్రముగా తిరుగుతూ ఉండేది. మంత్రాలతో బలిపీఠముపై మేకు కొట్టగా తిరుగుట ఆగిపోయినది. ఇప్పటికీ బలిపీఠముపై మేకు కొట్టిన గుంట కనిపించుచున్నది. ఆనాటి నుండి బలిపీఠమునే విగ్రహముగా భావించి పూజ జరిపించబడుచున్నది.

## శ్రీరామ చంద్రమూర్తిని విష్ణుమూర్తిగా భావించి ఇరుప్రక్కలా శ్రీదేవిని, భూదేవిని ప్రతిష్ఠించిన రామాలయము

శ్రీరామ చంద్రుడు తిప్రయార్
(చతుర్భుజుడు) ట్రిచూర్ జిల్లా
శ్రీదేవి భూదేవి 15 కి.మీ. ట్రిచూర్

పశ్చిమ ద్వారమునుండి శ్రీదేవి, భూదేవి వచ్చి స్వామి వారిని పూజిస్తుండగా ఒక భక్తుడు చూచి, పశ్చిమ ద్వారాన్ని మూసివేసెను. అప్పటినుండి అమ్మవార్లిద్దరూ ఇక్కడే ఉండిపోయిరి.

## టిప్పుసుల్తాన్ ఒక విగ్రహం చేతిని ఖండించగా రక్తము కారుటచే తన తప్పు తెలుసుకుని స్వామివారికి, దేవాలయమునకు పోషణ నిమిత్తం భూములిచ్చిన ఆలయం

శ్రీరామచంద్రమూర్తి తిప్రయార్
సీతాదేవి

చేతికి బంగారు తొడుగు చేయించెను.

**దేవాలయముకెదురుగా తెల్లటి నంది విగ్రహము గల ఆలయము**

వడక్కునాథన్ | ట్రిచూర్
ట్రిచూర్ జిల్లా

**"దక్షిణ ద్వారక " గా పేరుగాంచిన ఆలయము**

శ్రీకృష్ణుడు | గురువాయూర్
(చతుర్భుజుడు) | 30 కి.మీ ట్రిచూర్

శంఖం, చక్రం, గద, తామర పద్మం 4 చేతులలో గల స్వామి భూలోక వైకుంఠమని కూడా పేరు

**శ్రీరాముడు, లక్ష్మణుడు ప్రక్కప్రక్కన ఉన్న ఆలయం**
**(సీత లేదు, హనుమంతుడు లేడు)**

శ్రీరాముడు | తిరువిల్ వామల
లక్ష్మణుడు | 20 కి.మీ. పాలఘాట్
ధ్వజస్తంభము లేని ఆలయం | పాలపల్లి తాలూకా
త్రిచూర్ జిల్లా. 29 కి.మీ.
ట్రిచూర్

1 కి.మీ. దూరములో భరత లేక భరతకుజ నది కలదు. సీతా వియోగము తరువాత హనుమత్సమాగమానికి ముందు ఉన్న రామ లక్ష్మణులు.

**కేరళలో శ్రీరాముడు చతుర్భుజుడు గాను, శంఖ, చక్రగద మరియు పద్మము గాని, నాల్గవ హస్తము అభయముద్రగా గాని ఉంటుంది. కానీ ఒకచోట మాత్రం గద తలక్రిందులుగా ఉన్న ఆలయము**

శ్రీరాముడు | తిరువేంగాడ్
చతుర్భుజుడు | 2 కి.మీ. తెల్లిచెరి R.S
కన్ననూర్ జిల్లా
69 కి.మీ. కేలికట్

స్వామివారి చేతిలోని గద తలక్రిందులుగా ఉన్నది.

---

## ఇంగ్లీషు సబ్ కలెక్టర్ థామస్ హార్వే శ్రీరామ చంద్రమూర్తి గుడికి చుట్టూ ప్రహరీ గోడలు కట్టించిన ఆలయము

శ్రీరామ చంద్రుడు
చతుర్భుజుడు

తిరువేంగాడ్
2 కి.మీ తిల్లిచెరి
కన్ననూర్ జిల్లా
69 కి.మీ. క్యాలికట్

ఒకసారి ఇంగ్లీషు సబ్ కలెక్టర్‌గారి గుర్రం స్వారీ చేస్తున్నప్పుడు కదలకుండా నిలిచిపోయినది. స్వామివారిని ప్రార్థించిన తరువాత కదలినది.

## గర్భవతులుగా నున్న స్త్రీలు కేరళలోని 3 ఆలయములను దర్శించి పూజించితే తమ బిడ్డ 1. ఉన్నతునిగను, 2. నీతిమంతుడుగను, 3. తెలివితేటలు గలవాడుగను 4. దీర్ఘాయుస్సు గలవాడుగను పుట్టునని నమ్మిక వెలసిన ఆలయములు

1. రాజ రాజేశ్వర (ఉన్నతుడుగ) — తలి పరంబా, 25 కి.మీ. కన్ననూర్, కన్ననూర్ జిల్లా
2. శ్రీకృష్ణ (నీతిమంతుడు, తెలివి తేటలు) — త్రిచాంబరం, 2 కి.మీ. తలి పరంబా
3. బైద్యనాథ (దీర్ఘాయుస్సు) — కంజిరగట్, 6 కి.మీ. తలి పరంబా

## శివాలయములకు సోమవారము ప్రాముఖ్యత కానీ, ఆదివారము ప్రాముఖ్యత గల శివాలయము

బైద్యనాథ
(శివస్వామి)

కంజిర గట్
6 కి.మీ. తలిపరంబా
కన్ననూర్ జిల్లా

ఇచ్చటి శివునికి సూర్యశక్తి కలదు అందుచేత ఆదివారం పూజలకు ప్రాముఖ్యత గలదు

**కేరళలోని శ్రీకృష్ణాలయ ప్రాంగణములోనికి ఏనుగులను అనుమతించని ఆలయము**

శ్రీకృష్ణుడు | త్రిచాంబరం
కన్ననూర్ జిల్లా
30 కి.మీ. కన్ననూర్
10 కి.మీ. బడగారా

కంస మహారాజు శ్రీకృష్ణుని చంపుటకు కువలయాపీడమనే ఏనుగును నియోగించినందున

**ఆనందముగా నున్న శ్రీకృష్ణుని విగ్రహం గల ఆలయము**

బాల కృష్ణుడు | త్రిచాంబరం

కంసుని చంపిన ఆనందముతో వెలసిన విగ్రహము.

1. గుడి తెరువగానే స్వామివారికి నైవేద్యం పెట్టుట ఇచ్చటి ప్రత్యేక ఆచారము. కంసుని చంపిన వెంటనే శ్రీకృష్ణుడు దేవకి వద్దకు వెళ్ళి చాలా ఆకలిగ ఉన్నదని అన్నం పెట్టమని కోరినాడట. 2. ఆలయానికి దగ్గరగా ఏనుగులు రాకూడదన్న నియమం గలదు. శ్రీకృష్ణుని చంపుటకు కంసుడు కువలయా పీడమను ఏనుగును నియమించుట వలన శ్రీకృష్ణునికి ఇచ్చట ఏనుగుల సామీప్యత గిట్టదు. (మామూలుగా కేరళలోని దేవాలయములన్నింటను ఏనుగులు గలవు. ఏనుగులు లేకపోవుట ఈ ఆలయమునకు ప్రత్యేకత.)

**కేరళలో ఒక గర్భగుడికి పైకప్పలేని ఆలయము గల అమ్మవారు**

ముల్లక్కళ్ దేవి | అలెప్పి
(మల్లెపూల దేవత) | అలెప్పి జిల్లా

అమ్మవారిని మల్లెపూలతో ఆరాధిస్తారు. గోపురము, ఆలయము పెద్దవైనా గర్భగుడి పైభాగాన కప్పులేదు. విగ్రహం ఎండకు ఎండి వానకు తడుస్తూ ఉంటుంది.

**కర్ణాటకలోని కొల్లూరులోని మూకాంబికాలయమును "ఉత్తర మూకాంబిక" అని పిలుతురు. "దక్షిణ మూకాంబిక" క్షేత్రమని పిలువబడు ఆలయము**

మూకాంబిక | పరవూర్
(సరస్వతీ స్వరూప) | కొచ్చిన్ జిల్లా

**ప్రతిరోజు రాత్రి 9$\frac{1}{2}$ గంటలకు జమఖర్చులు చదివి వినిపించు**
**ఆచారము గల ఆలయము**

శ్రీకృష్ణుడు — గురువాయూర్
త్రిచూర్ జిల్లా
చెవక్కాడ్ తాలూకా
50 కి.మీ త్రిచూర్

స్వామి వార్కి ఆలయ జమ ఖర్చులు ప్రతిరోజు నివేదిస్తారు.

**ధన్వంతరి ఆలయం**

ధన్వంతరి — తోట్‌వా
(ఆయుర్వేద పితామహుడు) — కలాడి దగ్గర
నారాయణుని అవతారం — 30కి.మీ. త్రిచూర్

ధన్వంతరికి నెమలి పించము కలదు. పై రెండు చేతులలో శంఖ, చక్రం, క్రింది రెండు చేతులలో అమృతభాండం, జలగ ఉంటాయి. శరీరంపై గల చెడు రక్తాన్ని జలగ పీలుస్తుంది.

**శ్రీ ఆది శంకరాచార్యుల వారు లక్ష్మీదేవిచే బంగారు**
**ఉసిరికాయల వర్షం కురిపించిన దివ్య స్థలం**

స్వర్ణత్తు మన — ఫలం తోట్టం
(అనగా అంతా బంగారు మయం) — 24 కి మీ కలాడి
భువనేశ్వరి — 55 కి.మీ. త్రిచూర్ to కలాడి

**మహా శివరాత్రినాడు దేవాలయములో లక్ష ప్రమిదలను**
**నూనెతో వెలిగించి పూజించు స్వామివారు**

వడక్కు నాథన్ — త్రిచూర్
(శివస్వామి) — 74 కి.మీ ఎర్నాకుళం

ఏప్రిల్ - మే మాసములలో "పూరం" ఉత్సవం జరుగుతుంది. ఏనుగులతో గొప్ప ఊరేగింపు, బాణసంచా, నృత్యాలు, వాయిద్యాలు వగైరాలతో.

---

స్వర్గం, నరకం ఎక్కడో వుండవు నీ మనస్సులోనే వుంటాయి నీ మాటవలనే ఏర్పడుతాయి నీ నడవడికపై ఆధారపడి వుంటాయి

**స్వామివారి కుడిచేయి మంచి నీరు త్రాగుటకు పెదవులకు తాకుసరికి ప్రళయం వస్తుందని నమ్మిక గల ఆలయం**

జనార్ధన స్వామి — వర్కళ
అరేబియా సముద్ర తీరం — 51 కి.మీ. త్రివేంద్రం
త్రివేంద్రం జిల్లా

ప్రస్తుతం కుడిచేయి పెదవులకు దగ్గరగా ఉంటుంది ఏనాటికైనా పెదవులను తాకుతుందని నమ్మిక.

**అమ్మవారి ఆలయములోని రాతిబండపై నిలబడి ప్రార్థిస్తే, పాముకాటు నుండి నివారణ కల్గుతుంది**

భగవతీ దేవి — చెంగనూర్
50 కి.మీ. కొట్టాయం
40 కి.మీ. అలెప్పి
అలెప్పి జిల్లా

**భీష్మునిపై కోపగించిన (Angry KRISHNA) అరాన్ముల క్షేత్రములో వెలసినట్లే ఆకలిగొన్న (Hungry KRISHNA) వెలసిన ఆలయము:**

బాల కృష్ణుడు — త్రిచాంబరం
(వెన్నముద్దలు తింటున్న) — అరాన్ముల దగ్గర
20 కి.మీ. అలెప్పి
అలెప్పి జిల్లా

**ఎండుటాకులు తగులబెట్టి, చుట్టూ నృత్యం చేస్తూ ఉత్సవం ముగింపుగల ఆలయము**

పార్ధసారధి — అరాన్ముల
20 కి.మీ. అలెప్పి
అలెప్పి జిల్లా

ప్రతీ సంవత్సరము జనవరి నెలలో (పొంగల్ రోజులలో) పెద్ద ఉత్సవం జరిపి, ఆఖరు రోజున ఎండుటాకులను తగులబెట్టి మంటచుట్టూ నాట్యము చేస్తారు.

---

**"ఉన్ని కృష్ణ" అని పేరుగల స్వామివారు వెలసిన ఆలయం**

ఉన్ని కృష్ణుడు (బాల కృష్ణుడు)

అంబలపుజ
14 కి.మీ. అలెప్పి
30 కి మీ. చెంగనూర్,
అలెప్పి జిల్లా 76 కి.మీ. కొచ్చిన్

వరి అన్నాన్ని పాలతో వండి పాయసాన్ని భక్తులకు పెట్టు ఆచారము గలదు. ధనికులను, బీదలను సమానముగా ఆదరించు స్వామివారుగా ప్రతీతి.

**12 సంవత్సరముల కొకసారి 'పాలిపాణ' ఉత్సవము, 144 సంవత్సరముల కొకసారి విజయబాలి ఉత్సవము జరిపించుకొను స్వామివారు**

ఉన్ని కృష్ణుడు (బాల కృష్ణుడు)

అంబలపుజ

**త్రి కరణశుద్ధి పాటించు వారిని కాపాడు రుద్ర స్వరూపుడైన స్వామివారు**

ఎట్టుమనూర్ అప్పన్ (రుద్ర స్వరూప) శివస్వామి

ఎట్టుమనూర్
కొట్టాయం జిల్లా
10 కి.మీ. కొట్టాయం
25 కి.మీ. వైక్కం

**ఆరకుండా వెలుగు అద్భుత దీపజ్యోతి గల స్వామివారు**

ఎట్టుమనూర్ అప్పన్

ఎట్టుమనూర్

5 వత్తులతో, 3 లీటర్లు ఆయిల్ ఒకేసారి పట్టు దీపస్తంభము, వెలుగుతున్న జ్యోతి.

**గర్భ సంబంధమైన వ్యాధులు కుదుర్చు లోహపు నంది**

ఎట్టుమనూరప్పన్ (శివస్వామి)

ఎట్టుమనూర్

స్వామి కెదురుగా 2 నందులు గలవు. 1. రాతి నంది. 2. లోహపు నంది. లోహపు నందికి నైవేద్యముగా నివేదన చేసిన ధాన్యమును వండి, భుజించిన గర్భ సంబంధిత వ్యాధులు తగ్గును

**దీపపు స్తంభముపై పేరుకున్న పొగమసిని రాసుకున్నచో కండ్ల వ్యాధులు నివారణమగును**

ఎట్టమనూరప్పన్ ఎట్టమనూర్
(శివస్వామి)

స్వామి కెదురుగా నున్న దీప స్తంభముపై పేరుకున్న పొగమసిని కండ్లకు కాటుకగా పూసుకున్నచో వ్యాధులు నయమగును.

**మొదట దీపస్తంభాన్ని పూజించి, తరువాతనే స్వామివారిని పూజించు ఆచారముగల ఆలయము**

ఎట్టమనూరప్పన్ ఎట్టమనూర్
(శివ స్వామి)
పశ్చిమ ముఖం

ఎప్పుడూ ఆరకుండా వెలుగు జ్యోతిగల అఖండ దీపాన్ని మొదట పూజచేసి, నూనె పోసి, తరువాత స్వామివారిని దర్శిస్తారు.

**పంచములకు సరాసరి దర్శనముగల పరమేశ్వరాలయము**

కరుణా స్వరూప వైక్కం
(శివస్వామి) కొట్టాయం జిల్లా
25 కి.మీ. ఎట్టమనూర్
30 కి.మీ. కొట్టాయం
50 కి.మీ. కొచ్చిన్

తులాభారము పూజలు జరుగు ఆలయము. అన్ని కులముల వారు ఆలయమును దర్శించవచ్చని శాసనము అమలులోనికి రాకముందు నుంచి గల ఆచారము.

**తారకాసుర సంహారంతో విజయం సాధించినందుకుగాను ప్రతి సంవత్సరము 3 కి.మీ. దూరం నుండి పెద్ద ఊరేగింపుతో వచ్చి, తండ్రిని ప్రార్థించి , పూజించు స్వామివారు**

ఉదయనపుర తప్పన్ ఉదయన పురం
(సుబ్రహ్మణ్య స్వామి) 3 కి.మీ. వైక్కం
కొట్టాయం జిల్లా

---

మనిషికి కుక్కకు గల తేడా   ఆకలితో వున్న కుక్కకు అన్నం పెడితే
పెట్టినవాన్నెన్నడూ కరువదు  మనిషి అట్లాగాదు

**ఒకే రోజులో దర్శించవలసిన 25 కి.మీ. ల పరిధిలో గల 3 శైవ క్షేత్రములు**

కరుణా స్వరూప — 1. వైక్కం (కేరళ)
30 కి.మీ కొట్టాయం. కొట్టాయం జిల్లా

సత్య స్వరూప — 2. కుడుత్తురి ''
పై గ్రామమునకు,
క్రింది గ్రామమునకు మధ్య.

రుద్ర స్వరూప — 3. ఎట్టమనూర్ ''
25 కి.మీ. వైక్కం

రావణ సేనాధిపతి ఖరుడు అనబడే రాక్షసుడు చిదంబరములోని నటరాజస్వామి వారిని పూజించి, మెప్పించి, 3 శివ లింగములను పొందెను. ఒక లింగాన్ని కుడిచేతను మరొక లింగాన్ని ఎడమ చేతను, 3వ లింగాన్ని నోటను ధరించి, లంకకు బయల్దేరెను. ఆకాశమార్గాన వెళుచున్న ఖరుడు అలసిపోయి, విశ్రాంతి కొరకు కుడిచేతనున్న కరుణాస్వరూప లింగాన్ని మోకాటిలోతు నీటిలో నుంచి, విశ్రాంతి తీసుకొనెను. తరువాత లేచి, లింగాన్ని తీయబోవ కదలదాయెను. వ్యాఘ్రపాద మహర్షి సలహా మేరకు ఎడమ చేతనున్న సత్య స్వరూప లింగాన్ని కుడుత్తురిలోను, నోటిలోని రుద్రస్వరూప లింగాన్ని ఎట్టమనూర్‌లోను ప్రతిష్ఠించెను. ఈ క్షేత్రముల మధ్య దూరము 25 కి.మీ.

**ప్రతి రోజూ 3 రకాల భావనలతో 3 సార్లు పూజింపబడు స్వామివారు**

వైకతప్పన్ — వైక్కం
(శివస్వామి)లేక అన్నదానప్రభు — కొట్టాయం జిల్లా
ఉదయం· దక్షిణా మూర్తి — 30 కి.మీ.కొట్టాయం
(జ్ఞాన ప్రదాత) — 50కి.మీ. కొచ్చిన్
మధ్యాహ్నం.కిరాత (పాశుపతాస్త్ర ప్రదాత- అర్జునునికి)
(శక్తిప్రదాత)
సాయంకాలం: సచ్చిదానంద
(ఆనంద ప్రదాత)

ప్రతీ భక్తుడు 3 పూటలా స్వామి వారిని దర్శనము చేస్తాడు. అందుచేత దేవాలయము చాల రష్‌గా ఉంటుంది

---

## కలరా వగైరా అంటువ్యాధులను నిరోధించు అమ్మవారు

వాసురిమాత — కొడుంగళ్లూరు
(కాళికాదేవి) — త్రిచూర్ జిల్లా
10 కి మీ ఇరంజలకుడ
15 కి మీ ఆళ్వాయే

ద్వీపములోనున్న కాళీ క్షేత్రములోని కాళికాదేవికి ప్రక్కనున్న అమ్మవారు. అమ్మవారికి పసుపుతో పూజ.

## సంవత్సరములో ఒక్కనెలలో నంబూద్రి బ్రాహ్మణ వంశ పూజారులు కొడుంగళ్లూర్ వైదొలగి స్వర్ణకారుల వంశ (Non-Brahmins) పూజలు జరిపించు ఆలయము

కాళికాదేవి

కుంభమాసములో కోళ్ళ ఉత్సవం జరుగు నెలరోజులూ స్వర్ణకారుల వంశ పూజారులు పూజలు చేస్తారు. వేలాది కోళ్ళను బలి యిస్తారు.

## పంచములకు సరాసరి దర్శనముగల అమ్మవారి ఆలయము

కాళికాదేవి — కొడుంగళ్లూర్
కాళీ క్షేత్రం

## ఆంజనేయుడు వంటశాలకు ప్రాతినిధ్యం వహించు ఆలయం

కుతల మాణిక్యం — ఇరంజలకుడ
(భరతుని ఆలయం) — త్రిచూర్ జిల్లా
80 కి.మీ. ఎర్నాకుళం
20 కి.మీ. త్రిచూర్
10 కి.మీ కొడుంగళ్లూర్

శ్రీరామ పరివారానికి వంటలు చక్కగా సమయానికి అందునట్లుచూచే బాధ్యత వహించిన స్వామి.

**శ్రీరాముని రూపములో నున్న మహావిష్ణువాలయం**

| | |
|---|---|
| శ్రీరాముడు | తిప్రయార్ |
| (చతుర్భుజుడు) | త్రిచూర్ జిల్లా |
| (విష్ణుమూర్తి) | 15 కి.మీ. త్రిచూర్ |

ఎడమవైపు చేతులలో శంఖం, చక్రం, కుడివైపు చేతులలో కోదండం, జపమాల.

**"త్రిమూర్త్యాత్మక స్వరూపుడు" గా పిలువబడు స్వామి**

| | |
|---|---|
| శ్రీరాముడు | తిప్రయార్ |
| (చతుర్భుజుడు) | |

స్వామివారిని బ్రహ్మ, విష్ణు, మహేశ్వర రూపుడుగా కొలుతురు.

**దేవాలయ గోడలోని రంధ్రము గుండా గర్భగుడి శిఖరముపై నున్న మెరుస్తున్న కలశాలను చూస్తే దేశములోని దేవాలయము లన్నింటిని దర్శించిన ఫలితము దక్కుతుంది**

| | |
|---|---|
| 1. వడక్కునాధన్ | త్రిచూర్ |
| 2. పరమెక్కవు దేవి | త్రిచూర్ జిల్లా |
| 3. శ్రీరామ | |

గోడలోని రంధ్రమును " నాళంబలము" అని పిలుస్తారు.

**మూలవిరాట్ లింగం ముందు కాకుండా దేవాలయానికి ముఖద్వారము వద్దనే ఉన్న నంది**

| | |
|---|---|
| వడక్కునాధన్ | త్రిచూర్ |
| పరమెక్కవు దేవి | త్రిచూర్ జిల్లా |

నందికి తొలిపూజ చేసి, లోనికి వచ్చి స్వామివారిని పూజిస్తారు. ఒక అందమైన యువకుడు ప్రతిరోజూ ఉదయాన్నే వచ్చి, దేవాలయం ముఖద్వారము వద్దనే కూర్చుని, రాత్రి దేవాలయం కట్టేసే వరకు ఉండేవాడు. వచ్చినవారందరూ అతని ఆకారానికి ముగ్ధులయ్యేవారు. వయస్సులో ఉన్న స్త్రీలు అతన్ని తదేక దీక్షతో చూస్తుండేవారు. ముఖ్యముగా గర్భిణీ స్త్రీలు. పుట్టిన బిడ్డలకు ఆ యువకుని పోలికలు కొన్ని కనిపించేవి. ప్రజల్లో కొంత కలవరము బయలుదేరినది. దానిని గమనించిన ఆ యువభక్తుడు తాను కూర్చుని ఉన్న చోట ఒక చక్కటి, తెల్లటి నందిని ప్రతిష్ఠించి ఇక ఆలయానికి రావడం మానివేసాడు. ఫలితముగ క్రమేపి ప్రజల్లో కలవరము తగ్గిపోయినది.

---

తల్లి తండ్రుల మీద శ్రద్ధ ఎప్పుడు కలుగుతుందంటే, తాను కన్నవాళ్ళు తనను అశ్రద్ధ చేసినప్పుడు

## ఉత్సవ మూర్తుల ఊరేగింపు లేని ఆలయం

వడక్కునాధన్ త్రిచూర్
(నేతి లింగం) త్రిచూర్ జిల్లా
పరమెక్కావు దేవి
(శక్తి పీఠం)

ఇచ్చట ఉత్సవ మూర్తులకు వూరేగింపు లేదు.

## పశ్చిమాభి ముఖముగా నున్న రామాలయం

కోదండ రాముడు త్రిచూర్
30 కి.మీ.. గురవాయూర్

దేవాలయం, దేవుడు పశ్చిమాభిముఖం

## "రుద్రతీర్థమనే" సరస్సు ప్రక్కన దేవతల శిల్పి అయిన విశ్వకర్మచే నిర్మించబడిన దేవాలయము

శ్రీ కృష్ణుడు గురవాయూర్
(గురవాయూరప్పన్) 79 కి.మీ. కొచ్చిన్
30 కి.మీ. త్రిచూర్
41 కి.మీ. షోరనూర్

దేవగురువు బృహస్పతి వాయువు సహాయముతో ద్వారకనుండి శ్రీకృష్ణ విగ్రహాన్ని తీసుకుని వచ్చి ఇచ్చట ప్రతిష్ఠించెను.

## శ్రీకృష్ణ నిర్యాణానంతరము, శ్రీ కృష్ణ అజ్ఞానుసారము, ద్వారక సముద్రములో కలిసిపోయిన తరువాత ప్రతిష్ఠించబడిన శ్రీ కృష్ణ విగ్రహము

బాల కృష్ణుడు గురవాయూర్
(చతుర్భుజుడు)

చిరునవ్వు మోముతో నిలుచుని ఉన్న విగ్రహము శంఖ, చక్ర, గద, తామర పద్మధారి. మొదట్లో ద్వారకలో ఉండే విగ్రహము. బృహస్పతి (గురువు) వాయువు సహాయముతో ద్వారక నుండి విగ్రహమును తీసుకొని వచ్చి ఇచ్చట ప్రతిష్ఠించెను

---

కొనుక్కునేవాళ్ళు వెయ్యికళ్ళతో పరీక్షించి కొనుక్కోవాలి అమ్మేవార్కి అవసరంలేదు.

**ప్రజలను "వాతం" జబ్బు నుండి రక్షించు స్వామివారు**

శ్రీకృష్ణుడు (గురవాయూరప్పన్) — గురవాయూర్

ప్రజలు వాతం జబ్బుతో బాధపడుతూ ఉంటే ఉపశమనము కొరకు నారదుని సలహా మేరకు పరశురాముడు స్థలము దానం చేయగా, వాయువు సహాయముతో ద్వారకనుండి తీసుకుని వచ్చిన శ్రీ కృష్ణ విగ్రహమును బృహస్పతి ప్రతిష్ఠించెను.

**పరీక్షిన్మహారాజు కుమారుడైన జనమేజయునికి సర్పయాగమూలకముగా వచ్చిన కుష్ఠురోగాన్ని మాయం చేసిన స్వామివారు**

బాలకృష్ణుడు — గురవాయూర్
30 కి.మీ. త్రిచూర్
41 కి.మీ. షోరనూర్

**తిరుపతి వేంకటేశ్వరుని మాదిరిగా అంగవైకల్యం సరియగుటకు పూజింపబడు స్వామివారు**

బాల కృష్ణుడు — గురవాయూర్

వైకల్యమున్న అంగ భాగాలను ఇత్తడి, రాగితో చేసి దేవాలయము బయట అమ్ముతారు.

**దేవాలయ ప్రాకారములతో సహా నిండుగా వేలాది దీపాలు వెలిగించి, పూజలందుకొంటున్న స్వామివారు**

బాలకృష్ణుడు — గురవాయూర్

**ఆదిశేషునిపై కూర్చుని ఉన్న శ్రీకృష్ణ విగ్రహం. ఆదిశేషుని పడగ గొడుగువలె విగ్రహం పైకి ఉన్న ఆలయం**

శ్రీకృష్ణుడు (కూర్చుని ఉన్న విగ్రహం) — త్రిపునిత్రా
3 కి.మీ. ఎర్నాకుళం

## "హరిహర క్షేత్రము" గా ప్రసిద్ధి పొందిన క్షేత్రము

1. శివుడు — కోజికోడ్

2. శ్రీకృష్ణుడు (మహావిష్ణు రూపం) — కోజికోడ్ జిల్లా

"కోజికోడ్ తాలి" అని క్షేత్రము పేరు ఒకే ప్రాకారములో 2 ఆలయములు.

## నైవేద్యం దేవాలయముల ప్రహరీ గోడలపై ఉంచు ఆచారముగల ఆలయం

1. సుబ్రహ్మణ్య స్వామి — కుమారనల్లూర్

2. మీనాక్షీ దేవి — 3 కి.మీ కొట్టాయం

కొట్టాయం జిల్లా

అమ్మవారు తన చెలికత్తెలతో తిరిగి తిరిగి ఆకలితో వస్తూ ఉంటుంది కాబట్టి నైవేద్యం సేవించిన తరువాతనే ఆలయ ప్రవేశం చేస్తుందని నమ్మిక.

## ఈ గుహలో నుండి నడచి వెళ్ళినట్లయిన పునర్జన్మలు తగ్గుతాయి

పునర్జన్మ గుహ — తిరువిల్వామల

30 కి.మీ. పాలఘాట్

30 కి మీ. త్రిచూర్

3 కి.మీ దూరములో రామలక్ష్మణ దేవాలయము కలదు గుహ పొడవు సుమారు ఒక ఫర్లాంగ్. ఎత్తు పల్లాలతో నడవడానికి కష్టతరముగా ఉంటుంది. చీకటి వెలుతుర్లతో కూడుకున్నది. ఈ చివర నుండి ఆ చివరి వరకు నడచి వచ్చినవారికి పునర్జన్మలు తగ్గుతాయని నమ్మిక.

## చుట్టు ప్రక్కల ఎక్కడా శ్మశానము లేనటువంటి శివాలయము

రాజరాజేశ్వర స్వామి — తాలిపరంబా

రాజ రాజేశ్వరి — కన్ననూర్ జిల్లా

20 కి.మీ. కన్ననూర్

ఆలయమునకు ధ్వజస్తంభము గూడా లేదు.

---

**గర్భవతులు గొప్ప సంతానము కొరకు ప్రార్థింపబడు స్వామివారు**

రాజరాజేశ్వర స్వామి
రాజేశ్వరి
శక్తి పీఠం

తాలిపరంబా
కన్ననూర్ జిల్లా
20 కి.మీ. కన్ననూర్

అమ్మవారి శిరస్సు పడినచోటు.

**స్త్రీలకు పగలు దర్శనము లేని ఆలయము**

రాజరాజేశ్వర స్వామి
రాజేశ్వరి

తాలిపరంబా

రాత్రి పూజ తరువాత స్వామివారు అమ్మవారితో సరదాగా కాలక్షేపం చేస్తున్న సమయములోనే స్త్రీలకు ఆలయ ప్రవేశం, దర్శనం.

**రాజాధిరాజుగా పరిగణింపబడే శివస్వామి**

రాజరాజేశ్వర స్వామి
రాజేశ్వరి

తాలిపరంబా

ఈ ఆలయములో స్వామివారి సమక్షములో కళాకారులకు రాజ్యసభలో జరుగునట్లు సన్మానము చేయుట ఆచారము. శాలువలు, కంకణాలు, బిరుదులు ప్రదానము చేస్తారు.

**ఆలయము తెరచిన వెంటనే (ఉదయం) స్వామివారికి నైవేద్యం పెట్టాలి**

శ్రీ కృష్ణుడు

త్రిచాంబరం
కన్ననూర్ జిల్లా
30 కి.మీ. కన్ననూర్
10 కి.మీ. బడగార

కువలయా పీడమనే ఏనుగును, ముష్టికుడనే మల్లుని, కంసమహారాజుని చంపి స్వామివారు అలసిపోయి ఆకలిగొని ఉంటారని, నిర్మాల్యం వగైరా ఏవిధమైన తంతులు లేకుండా ముందుగానే నైవేద్యం పెడతారు.

---

**వట్టి చేతులతో దర్శనానికి వెళ్ళడానికి అనుమతించని ఆలయం**

రాజరాజేశ్వర స్వామి తాలిపరంబా
రాజ రాజేశ్వరి

ఫలం, పుష్పం, పత్రం, తోయం, ఏదోఒకటి తప్పనిసరిగ తీసుకు వెళ్ళాలి స్వామివారికి నేతితో అభిషేకము. బయట నెయ్యి అమ్ముతుంటారు. నెయ్యి అయినా కొని తీసుకుని వెళ్ళాలి. స్వామివారు రాజాధిరాజు (Emperor of Emperors) రాజ వైభవం.

**ఈ దేవాలయములో పూజలు చేయు పూజారులు మరెక్కడా పూజలు చేయరు**

రాజరాజేశ్వర స్వామి తాలిపరంబా
రాజ రాజేశ్వరి

స్వామివారు "రాజాధిరాజు" కాబట్టి, వారి వద్ద పనిచేసిన వారు వేరొకరి వద్ద పూజలు చేయుట పరువునష్టముగ భావింతురు.

**ఏ ఉత్సవమైనా, ఏ పూజైనా ఎక్కువ సమయం చేయడానికి వీలులేని శివాలయం**

రాజరాజేశ్వర స్వామి తాలిపరంబా
రాజ రాజేశ్వరి

శివరాత్రి రోజుల్లో కూడా పూజ, ఉత్సవం క్లుప్తంగానే ముగించాలని నియమం

**"పెరుమాళ్ కోయిల్" అని పిలువబడే శ్రీ రామాలయము**

శ్రీ రాముడు తిరువంగాడ్
(చతుర్భుజాడు) కన్ననూర్ జిల్లా
(మహావిష్ణు ఆకారము) కన్ననూర్‌కి, బడగారాకి మధ్యలో

స్వామివారి విగ్రహానికి శంఖ,చక్ర, గద, అభయముద్ర గలవు. ఎదురుగా ఆంజనేయ స్వామివారి విగ్రహం.

## చెక్కబోనులో బంధించబడిన అమ్మవారు

వాగేశ్వరీ దేవి (పోర్కాళ భగవతి)

తిరువంగాడ్

అమ్మవారు ఎప్పుడు పడితే అప్పుడు, ఎక్కడ పడితే అక్కడ తిరుగుతూ ఉంటే ప్రజలు భయభ్రాంతులగుచుండుటచే పూజారులు మంత్రముతో బంధించి అమ్మవారిని చెక్కబోనులో ఉంచారు.

## బియ్యం వండకుండానే నైవేద్యం పెట్టబడు అమ్మవారు

వాగేశ్వరీ దేవి (పోర్కాళ భగవతి)

తిరువంగాడ్

అమ్మవారు ఉగ్రరూపిణి అన్నం వండి పెట్టేవరకు ఆగదు. అందుకని పచ్చి బియ్యాన్నే అమ్మవారికి నైవేద్యంగా సమర్పిస్తారు

## మహిళల "శబరిమల"

అటుక్కళ్ దేవి (భగవతీ దేవి-పార్వతి)

త్రివేంద్రం అరేబియా సముద్ర తీరం

అమ్మవారు 13 సంవత్సరముల బాలిక అనంత పద్మనాభ స్వామి వారి ఆలయమునకు 2 కి.మీ దూరములో. సంవత్సరానికి ఒక్కసారి కార్తీక మాసములోని కృత్తిక రోజున "పొంకాల" అని పిలువబడే 9 రోజుల ఉత్సవం ప్రారంభమౌతుంది. ఆఖరి రోజున "తాళపొలి" ఉత్సవాన్ని వయస్సు వచ్చిన బాలికలు జరుపుకుంటారు. విపరీతమైన జనం ఈ ఉత్సవమునకు వత్తురు. కుండల్లో బెల్లం, బియ్యం కలిపి పాయసము వండి, ఆ ప్రసాదాన్ని తాము ఉన్నటువంటి ప్రదేశములనుండే అమ్మవారికి నివేదన చేయుట ఈ ఉత్సవానికి ప్రత్యేకత.

వివాహముల కొరకు, సంతానము కొరకు అమ్మవారిని పూజిస్తారు. అమ్మవారు "కరుణామయి". కోరిన కోర్కెలు తీర్చు తల్లి.

---

**ఇంగ్లీషు అధికారి కల్నల్ మన్రోస్వయంగా దగ్గరఉండి, అమ్మవారి బహిష్టు ఉత్సవాన్ని జరిపించెను**

భగవతీ దేవి
అర్ధనారీశ్వరుడు

చెంగనూర్
50 కి మీ కొట్టాయ ం
40 కి.మీ అలెప్పి
అలెప్పి జిల్లా

మొదట్లో అమ్మవారి బహిష్టుని మూఢనమ్మకమని ఇంగ్లీషు అధికారి అవహేళన చేసి, ఉత్సవమును రద్దుచేసెను వెంటనే ఆయన భార్య విపరీత రక్తస్రావానికి గురి అయినది. ఎంతటి వైద్యము చేసిననూ రక్తస్రావము కంట్రోలు కాలేదు. వేరు మార్గము లేక అమ్మవారికి బహిష్టు ఉత్సవము జరిపించెను తక్షణమే రక్తస్రావము ఆగిపోయినది అంతే గాకుండా రక్తసిక్తమైన అమ్మవారి 'ఒడయాడ' ను పరీక్షచేయించగాఅది మానవ స్త్రీ బహిష్టు రక్తమేనని ఋజువైనది. శాశ్వత పూజకుగాను ఇంగ్లీషు అధికారి తన స్వంత డబ్బును బ్యాంకులో డిపాజిట్ చేసి, అమ్మవారి భక్తుడాయెను. ఆ డబ్బుపై వచ్చే వడ్డీ అమ్మవారి పూజకుపయోగిస్తారు.

**పాలులేని తల్లులకు పాలు కలిగించు స్వామివారు**

పార్థసారధి

అరాన్ముల
20 కి.మీ. క్విలన్
3 కి.మీ. తిరుచ్చినాపల్లి
10 కి.మీ. చెంగనూర్
వైక్కం దగ్గర

ధర్మరాజ ప్రతిష్ఠ, పంపానదీ తీరము ఈ స్వామివారిని ప్రార్థించిన, సంతానము, స్తన్యవృద్ధి కలుగును

**స్వామివారి చేతిలో మందుల పెట్టె ఉంచుకుని, రోగులకు కల్పతరువుగా ప్రసిద్ధి చెందిన స్వామి**

గురవాయూరప్పన్
(శ్రీకృష్ణుడు)

గురవాయూర్

చేతిలోని పద్మములో మందులపెట్టి ఉన్నదనియు, పూజించినవారికి స్వస్థత చేకూరుననియు నమ్మిక.

**3 లింగములు ఒకేసారి ప్రతిష్ఠింపబడిన ఆలయము**

పరమేశ్వరుడు

వైక్కం
క్విలన్ నుండి బస్సు
25 కి.మీ. ఎట్టమన్నూర్

ఖరాసురుడను రాక్షసుడు చిదంబరములోని నటరాజస్వామి వారిని ప్రార్థించి, మూడు లింగములను పొంది, ఒకేసారి ప్రతిష్ఠించెను. కుడిచేతితో ప్రతిష్ఠించిన లింగము వైక్కములోను, ఎడమచేతితో ప్రతిష్ఠించిన లింగము ఎట్టమన్నూర్ లోనూ, నోటితో ప్రతిష్ఠించిన లింగము కడుత్తురిలోను గలవు. ఈ మూడు లింగముల మధ్యస్థ దూరము 25 కి.మీ. కడుత్తురి వైక్కంనకు, ఎట్టమన్నూర్‌కు మధ్యలో కలదు. మొత్తము దూరము 25 కి.మీ. ఈ మూడు శివలింగములను ఒకేరోజున దర్శించవలెయును మోక్ష దాయకము.

**పాండ్యదేశపు రాజు పాముకాటు నుండి రక్షింపబడి, కట్టిన ఆలయము**

శ్రీ కృష్ణ భగవానుడు
(గురవాయూరప్పన్)

గురవాయూర్
30 కి మీ. ట్రిచ్చూర్
ట్రిచ్చూర్ జిల్లా

ఈ స్వామివారిని సేవిస్తే, పాము విషము విరిగిపోతుందట

**భారతదేశములో అధికముగా చదువుకున్నవారు ఉన్న పట్టణములోని పెద్ద దేవాలయం**

అనంత పద్మనాభ స్వామి
శ్రీదేవి
భూదేవి

త్రివేంద్రం
కేరళ రాజధాని

**పతిభక్తి చెక్కుచెదరకుండా ఉండటానికి ప్రార్థింపబడు అమ్మవారు**

కాళికాదేవి
దీవిపై నున్న ఆలయం
శక్తిపీఠము
కొంకణ దేశము

కొడుంగళ్లూర్
ట్రిచూర్ జిల్లా
10 కి.మీ. ఇరంజలకుడ
15 కి.మీ. ఆళ్వాయే

---

**ఒక గ్రామపెద్ద కలలో ఒక మహానుభావుడు కనిపించి అక్కడవున్న సముద్రతీరానికి నాలుగు విగ్రహాలు కొట్టుకుని వసాయని. వాటిని సేకరించి వేరువేరుగా దేవాలయములలో ప్ర తిష్ఠించమని ఆదేశించెను. అదే విధముగా మరునాడు ఉదయమున లభించిన విగ్రహములను ప్రతిష్ఠించిన దేవాలయములు**

| | |
|---|---|
| 1. శ్రీరాముడు | త్రిప్రయార్<br>త్రిచూర్ జిల్లా<br>ఇరింజలకుడ ఆర్.ఎస్. దగ్గర<br>75 కి.మీ. కొచ్చిన్ |
| 2. భరతుడు (కుతల మాణిక్యం) | ఇరింజలకుడ |
| 3. లక్ష్మణుడు | ముజికుళం |
| 4. శత్రుఘ్నుడు | పాయంమాల్ |

పై నాల్గు ప్రదేశములలో నాల్గు విగ్రహములను వేరువేరుగా ప్రతిష్ఠించిరి. గ్రామపెద్దపేరు వాక్కైకైమాల్. శ్రీరాముని విగ్రహం విష్ణుమూర్తిని పోలిఉంటుంది. ఇచ్చట పూర్వము 101 ఏనుగులతో ఉత్సవము జరిపేవారు. ఇప్పుడు 21 ఏనుగులు మాత్రమే పాల్గొంటున్నాయి.

**వంకాయలు నైవేద్యం గల స్వామివారు**

| | |
|---|---|
| కుతల్ మాణిక్యం<br>(సంగమేశ్వర స్వామి)<br>భరతుడు | ఇరంజలకుడ<br>త్రిచూర్ జిల్లా<br>20 కి.మీ. త్రిచూర్<br>80 కి.మీ. ఎర్నాకుళం<br>10 కి.మీ. కొడుంగళ్ళూర్ |

101 వంకాయల నైవేద్యం పెడతారు. ఆ వంకాయలు సేవించిన కడుపులోని నెప్పి, పుండ్లు తగ్గుతాయి. ప్రక్కనగల కోనేరు దేవగంగలో స్నానం చేయాలి. కోనేరులోని చేపలకు మరమరాలు వగైరా ఆహారం భక్తులు వేస్తారు. పూజలు తెల్లవారుఝామున, మధ్యాహ్నం, రాత్రికి మూడుసార్లు చేస్తారు. భరతుడు రాముని ప్రార్థించిన చోటు. వనవాసానంతరమందు తిరిగి వచ్చిన రామునికి కైకేయి, భరతుడు స్వాగతమిచ్చిన చోటు, ఆలయములో రాముని పరివారానికి వంటల ఏర్పాటు జరిగినదట. ఆంజనేయుడు స్వయముగా వంటశాలలో సహాయము చేసినాడట. పెద్దపెద్ద వంట గిన్నెలు ఎత్తేవారికి ఆంజనేయస్వామివారి సహాయం ఉంటుందని నమ్మిక.

---

## విభూతి వాడే వైష్ణవ క్షేత్రము

పార్ధసారధి
(అర్జున ప్రతిష్ఠ)
విష్ణుచక్ర ధారి

అరాన్ముల
అలెప్పి జిల్లా
100 కి.మీ. కొచ్చిన్
8 కి.మీ. చెంగనూర్ ఆర్.ఎస్.

## శ్రీరాముని పాదం రాతికి తగిలి స్త్రీ(అహల్య) అయినట్లు గాథ. మరి రాముడు శపిస్తే రాళ్ళు అయిన భక్తుల గాథ

ఇడుక్కి డామ్.
120 కి.మీ. కొట్టాయం
164 కి.మీ. కొచ్చిన్.

పెరియార్ నదిపై కట్టబడిన డామ్. (ఆనకట్ట). ఈ ఆనకట్ట రెండు గ్రానైట్ కొండల మధ్యన కట్టబడినది. ఈ గ్రానైట్ కొండలు రెండూ "కురువన్" మరియు "కురుత్తి" అని పిలువబడే ఆటవిక దంపతులు. లోక కళ్యాణార్ధము శ్రీరాముఁప చిన్న కొండలుగా మారమని శపించెను. ఈ ఆటవికజాతి దంపతుల విగ్రహములు మధుర మీనాక్షి దేవాలయములోని వేయి స్తంభాల మండపములో నున్నవి.

## ఒకే పానమట్టముపై అమ్మవారు, విష్ణుమూర్తి ఉన్న దేవాలయం

రాజరాజేశ్వరీ దేవి
విష్ణుమూర్తి

చొట్టానికర
17 కి.మీ. ఎర్నాకుళం
ఎర్నాకుళం జిల్లా.

ఇద్దరిని లక్ష్మీనారాయణులని కూడా పిలుస్తారు. విడివిడిగా రాజరాజేశ్వరి, విష్ణుమూర్తి అని పిలుస్తారు అమ్మవారు మంత్ర, తంత్ర శక్తులుగల దేవత. మానసిక వ్యాధులు తగ్గుతాయి ప్రతీ శుక్రవారం మధ్యాహ్నం మానసిక వ్యాధులున్న రోగులు ఎక్కువగా వస్తారు. ముందు భాగాన అమ్మవారు వెనుక భాగాన అయ్యవారు.

## వేడినీటితో తలంటి ప్రతిరోజూ స్నానము చేయు దేవుడు

శ్రీకృష్ణుడు

గురువాయూర్
30 కి.మీ. త్రిచూర్
41 కి మీ. షోరనూర్

మహాభారత యుద్ధానంతరమందు, యాదవ నాశనానంతరమందు ద్వారక సముద్రములో మునిగిపోవు సమయాన ద్వారకలో శ్రీకృష్ణ విగ్రహమును గురువునకు (బృహస్పతి) వాయువునకు అప్పజెప్పవలసినదిగా శ్రీకృష్ణుడాదేశించెను. వారిరువురూ ఆకాశ మార్గాన శ్రీకృష్ణ విగ్రహాన్ని తీసుకుని వచ్చి ఇచ్చట ప్రతిష్ఠించిరి గురువు, వాయువు ప్రతిష్ఠించుటచే "గురువాయూర్" అయినది. ఇచ్చట ఇంకొక గాధ గలదు. ఒక భక్తుని దొంగలబారినుండి రక్షించుటకు స్వామివారు కొబ్బరికాయలకు కొమ్ములు మొలిపించగా వాటిని చూచి దొంగలు భయపడి పారిపోయిరట.

నిత్యము స్వామివారికి తలంటి నీరుపోయుదురు. మడికట్టుకుని పెద్ద పెద్ద గుండిగలతో వేడినీళ్ళుకాచి మహాశుచిగా పోసెదరు.

## ఆవు నేతితో నిండిపోయిన శివలింగము

వడక్కునాధన్
(శివుడు - లింగం)
దక్షిణాభి ముఖుడు
వృషభాచల గుట్టపై
పరమెక్కవు దేవి

త్రిచూర్
త్రిచూర్ జిల్లా

పరశురామ ప్రతిష్ఠ, శంకరనారాయణ, శ్రీరామ విగ్రహములు ఉన్నవి. నిరంతర నేతి అభిషేకముల మూలకముగా నేతితో నిండిపోయి గడ్డకట్టుక పోయినది. లింగము నిండా కాకుండా చుట్టూకూడా చాల దూరం నెయ్యి పేరుకుపోయి ఉంటుంది. ఎంత వేసవిలోనైనా, ఎన్ని దీపాలు చుట్టూ వెలిగించినా నెయ్యి కరగదు. దుర్వాసన రాదు. ఎట్టి పురుగు కనిపించదు. వేల సంవత్సరములనుండి ఉన్న నెయ్యి కాబట్టి వైద్యానికి పనికి వస్తుంది. ఆయుర్వేద వైద్యులకు అమూల్యమైనది.

## తెల్లవారు ఝామున 3 గంటల నుండి రాత్రి 10 గంటల వరకు 12 దర్శనములు గల దేవుడు

శ్రీకృష్ణుడు గురువాయూర్

(చతుర్భుజుడు)

"శ్రీకోయిల్" అని పేరు

12 దర్శనములు చేయువారికి మోక్షమట. ఇక్కడ "తులాభారము" మ్రొక్కుబడులు గలవు. అరటిపండ్లు, పంచదార, బెల్లం, కొబ్బరికాయలు తులాభారం. వ్యాధిగ్రస్తులకు ముఖ్యము. ముఖ్యముగా పాముకాటుకు విరుగుడు. స్వామివారి చేతిలోని పద్మము మందుల పెట్టెగా భావన. మ్రొక్కుకొన్న వ్యాధులు, కీళ్ళనొప్పులు నివారణమగును.

"భూలోక వైకుంఠమని" పేరు. "Dwaraka of the South" అని కూడా పిలుస్తారు

## శ్రీరాముని విగ్రహం ఒక్కటే ఉన్న ఆలయం

కోదండ రాముడు త్రిచూర్

30 కి.మీ. గురవాయూర్

ఒక్క శ్రీరాముని విగ్రహము మాత్రమే ఉన్నది పరశురాముడవతారము చాలించిన చోటు పరశురామునిచే నిర్మింపబడిన పట్టణము కోదండధారియై ఉన్న శ్రీరాము నొక్కడినే (వివాహ సమయమున) పరశురాముడు చూచెను. సీతను చూడలేదు. ఇచ్చట దేవాలయములన్నియు నంబూద్రి బ్రాహ్మణులచే పూజలు చేయబడుచున్నవి. గోపురము, సింహద్వారము పశ్చిమాభి ముఖము. స్వామివారు కూడా పశ్చిమాభిముఖుడు.

## Divine Powers గల ముస్లిం వనితను హిందువులు కూడ దేవతగా పూజిస్తారు

బీమాదేవి టీమాపల్లి

త్రివేంద్రం సెంట్రల్

రైల్వేస్టేషన్ దగ్గర

అక్టోబర్‌లో "చంద్రకూడం" అని పిలువబడే ఉత్సవానికి వేలాది ప్రజలు వస్తారు. స్పెషల్ బస్సులు కూడా వేస్తారు. అమ్మవారు ప్రత్యేక శక్తులుగల ముస్లిం వనిత

---

**పాపనాశనం అని పిలువబడే సముద్రపు బీచ్, అక్కడ వెలసిన స్వామివారు**

శ్రీజనార్దన స్వామి వర్కళ
అరేబియా సముద్రతీరం 54 కి మీ. త్రివేంద్రం

చాల పురాతన దేవాలయము. ఎత్తైన కొండగుట్టలు సముద్రతీరములో నున్నవి. వీటిలోనుండి స్వచ్ఛమైన నీరు వస్తూ ఉంటుంది. ఆ జలాలలో స్నానం చేస్తే పాపం నాశనం అవుతుందని నమ్మిక.

**భక్తులు గుడికెదురుగా నున్న కొయ్యకు మేకులు కొట్టి పూజించు అమ్మవారు**

రాజరాజేశ్వరీ దేవి చొట్టానికర
17 కి మీ. కొచ్చిన్

మానసిక వ్యాధులున్నవారికి పసుపునీరు, నిమ్మరసాన్ని ప్రసాదముగా యిస్తారు. ఇచ్చట చెరువులోని నీరు ఎరుపురంగు అన్నాన్ని చెరువులో కలుపుతారు.

**ఉదయం సరస్వతిగాను, మధ్యాహ్నం భద్రకాళిగాను,**
**రాత్రి దుర్గగాను పూజింపబడు దేవత**

రాజరాజేశ్వరీ దేవి చొట్టానికర

మానసిక వ్యాధులు నివారించు దేవత. ప్రతీ శుక్రవారం మధ్యాహ్నం ఎక్కువ మంది రోగులను ఆలయం ముందుంచుతారు. "గురుతి" అని పిలువబడే పసుపు, నిమ్మకాయ నీరు కలిపిన ద్రవాన్ని రోగులకు ప్రసాదంగా ప్రతిరోజు త్రాగిస్తారు

**"సన్నిధానం" అని పిలువబడే దేవాలయం**

అయ్యప్పస్వామి శబరిమల

అయ్యప్ప స్వామివారి గర్భగుడిని సన్నిధానం అని పిలుస్తారు.

**పానమట్టముగల విగ్రహము**

అయ్యప్ప స్వామి శబరిమల

శబరిమలలోని అయ్యప్ప స్వామివారు విగ్రహ రూపములో కూర్చుని ఉన్న పంచలోహ విగ్రహం. చతురస్రాకారపు పానమట్టముపై వెలసివున్నారు. అభిషేకాదులకు అనుగుణముగా నిర్మించబడినది.

---

**భాగవత రచనలో పోతనామాత్యునికి ఒకచోట పద్యము అసంపూర్తిగా ఆగిపోతే శ్రీరాముడు వచ్చి పూర్తిచేసెను. అదే విధముగా భక్త జయదేవుడు గీతగోవిందాన్ని వ్రాస్తూ ఉండగా ఒక పద్యము అసంపూర్తిగా ఆగిపోయినది. శ్రీకృష్ణుడు స్వయముగ వచ్చి పద్యభాగమును పూర్తిచేసెను. పూర్తిచేసిన స్వామివారు**

| | |
|---|---|
| శ్రీకృష్ణుడు | గురవాయూర్ |
| (గురవాయూరప్పన్) | 79 కి.మీ. కొచ్చిన్ |
| | 30 కి.మీ. త్రిచూర్ |
| | 41 కి.మీ షోరనూర్ |

**కేరళలోని కలాడిలో నివసించే శివగురు, ఆర్యాంబ దంపతులు ప్రార్థిస్తే స్వామివారు కలలో కనిపించి వృద్ధులయిన ఎక్కువమంది బిడ్డలు కావాలా లేక అర్థాయుష్కుడైన ఒకే ఒక కుమారుడు కావాలా అని అడిగి, వారి కోరికపై ఆదిశంకరాచార్యుల వారి ననుగ్రహించిన స్వామివారు**

| | |
|---|---|
| వడక్కునాథన్ | త్రిచూర్ |
| (శివలింగం) | |
| పరమేక్కావు దేవి | 74 కి.మీ. కొచ్చిన్ |
| | 32 కి.మీ. కలాడి |

శ్రీ శంకర నారాయణ, శ్రీరామ, శ్రీ వడక్కునాథన్ విగ్రహములు పరశురామునిచే ప్రతిష్ఠించబడినవి. గణపతి, ధర్మశ్రష్ఠ విగ్రహాలు కూడ గలవు ఇక్కడ జరుగు ఉత్సవములలో బాగా అలంకరించిన ఏనుగుల ప్రదర్శన ప్రత్యేకత. ఈ ఆలయమునకు ధ్వజస్తంభము లేదు.

**శ్రీ ఆదిశంకరాచార్యుని జన్మస్థలమైన కలాడిలో ఉన్న దేవాలయము**

| | |
|---|---|
| శ్రీ శారదాదేవి | కలాడి |
| శ్రీ కృష్ణ | 41 కి.మీ కొచ్చిన్ |
| గణపతి | 14 కి.మీ. ఆళ్వాయే |

శ్రీ రామకృష్ణ మఠము కలదు.

**కేరళ రాష్ట్రములో శివుడు + విష్ణువు కలసి ఉన్న విగ్రహం, దేవాలయం**

శ్రీ శంకర నారాయణ — త్రిచూర్
74 కి.మీ కొచ్చిన్
32 కి మీ కలాడి

వడక్కునాధన్, శ్రీరామ, గణపతి విగ్రహములు గలవు పరశురామ ప్రతిష్ఠ పరశురాముడు తపస్సు చేస్తూ, ధ్యానించగా శ్రీరాముడు, విష్ణుమూర్తి కనిపించెను. తరువాత శివుడు కనిపించెను. వీరు ముగ్గురు ఒకటేనని చాటుటకు గాను విగ్రహములను ప్రతిష్ఠించెను

**ధ్వజ స్తంభములు లేని శివాలయం, రామాలయం**

వడక్కునాధన్ — త్రిచూర్
(శివాలయం) — 74 కి మీ. కొచ్చిన్
శ్రీరాముడు — తిప్రయార్
(విష్ణుమూర్తి) — త్రిచూర్‌కి దగ్గర

తిప్రయార్ నదీ తీరం. ఉత్సవాల సమయాల్లో ఏనుగుల ప్రదర్శన ప్రత్యేకత.

**మహాభారత యుద్ధములో 9వ రోజున శ్రీకృష్ణుడు భీష్మాచార్యుని చంపుటకై సుదర్శన చక్రమును ధరించి ఉన్న శ్రీకృష్ణ విగ్రహం**

పార్ధసారధి — అరాన్ముల
(శ్రీకృష్ణుడు) — 20 కి.మీ. అలెప్పి
పంపానది తీరం — 100 కి మీ. కొచ్చిన్
ధర్మరాజ ప్రతిష్ఠ — 8 కి.మీ. చెంగనూర్
5 కి.మీ. తిరువళ్ళ

ధర్మరాజు రాజ్యపాలన అనంతరమందు పరీక్షితుని రాజుగాచేసి దేశసంచారము చేయుచూ ఇచ్చటకు వచ్చి శ్రీ కృష్ణ విగ్రహాన్ని చక్రధారిగా ప్రతిష్ఠించెను.

---

**"అన్నదాన ప్రభు" వని పిలువబడే శివలింగము**

| | |
|---|---|
| వైక్కం లింగం | వైక్కం |
| (శివస్వామి) | 33 కి.మీ. కొచ్చిన్ |
| అన్నదాన ప్రభు | 40 కి.మీ. కొట్టాయం |

ప్రతీ పండుగకు ఇచ్చట అన్నదానం చాల భారీ ఎత్తున జరుగుతుంది ఆహారం యొక్క సువాసన ప్రత్యేకత. దేవాలయమును పరశురాముడు కట్టించెను. ఎన్ని కష్టాలు వచ్చినా ఎన్ని నష్టాలు కలిగినా తిండికి లోటులేకుండా చూసే స్వామివారుగా ప్రసిద్ధి.

**ప్రతీ సంవత్సరము 3 కి.మీ. దూరం నుండి పెద్ద ఊరేగింపుతో కుమారుడు తరలి వచ్చి, తండ్రితో కలసి, పవిత్ర స్నానోత్సవము( కూడిపూజ) (Joint Worship Ceremony) లో పాల్గొను స్వామివారు. అదేవిధముగ 3 కి.మీ.దూరం ఊరేగింపుతో వెళ్ళి కుమారునితో సహా స్నానోత్సవము జరిపించుకొను స్వామివారు**

| | |
|---|---|
| ఉదయనపుర తప్పన్ | ఉదయనపురం |
| (కుమారుడు- సుబ్రహ్మణ్య స్వామి) | 3 కి.మీ. వైక్కం |
| వైకతప్పన్ | కొట్టాయం జిల్లా |
| (తండ్రి- శివస్వామి) | |

ఉదయము ఊరేగింపు , మధ్యాహ్నము విందు, రాత్రి లక్షదీపార్చన- 'కూడిపూజ' ప్రత్యేకత. దేశములో ఎక్కడా ఇటువంటి పూజలేదు. ఊరేగింపు ఏనుగులతో, నాదస్వరములతో దివిటీలతో సాగుతుంది.




## (ఇతర ముఖ్యాలయములు)

| | |
|---|---|
| 1. శ్రీకృష్ణుడు | మాహే<br>8 కి.మీ. తెల్లి చెర్రి |
| 2. భగవతి<br>కరమాణ నదీ తీరం | అరువికర<br>16 కి.మీ త్రివేండం |
| 3. భగవతి<br>(పార్వతీమాత) | అలెప్పి<br>అలెప్పి జిల్లా |
| 4. అనంత వినాయక | మాధుర్<br>నార్త్ మలబారులో |
| 5. వనదుర్గ | వైక్కం<br>కొట్టాయం జిల్లా<br>30 కి.మీ కొట్టాయం |
| 6. మేరిమాత | కొచ్చిన్ |
| 7. శ్రీరామ<br>సీతాదేవి | తిరు విల్ వామల<br>పాలఘాట్ జిల్లా |
| 8. శ్రీరామ<br>సీతాదేవి | తిరువేంగాడ్<br>కన్ననూర్ జిల్లా<br>తెల్లి చెర్రి - బడగారా మధ్యలో |
| 9. శివస్వామి, పార్వతీదేవి | పాలఘాట్ |
| 10. బలరామ<br>36 కి.మీ. కన్ననూర్ | ధరమ్ కలం గ్రామం<br>6కి.మీ. త్రిచాంబరం |

అదృష్టం చెప్పకుండా వస్తుంది   అలాగే దురదృష్టం కూడా చెప్పకుండా వస్తుంది

| | |
|---|---|
| 11. శ్రీకృష్ణ | కలాడి<br>45 కి.మీ. కొచ్చిన్<br>ఎర్నాకుళం జిల్లా |
| 12. సుబ్రహ్మణ్య స్వామి<br>(చతుర్భుజుడు) | హరి పాడ్<br>అలెప్పీ జిల్లా<br>10 కి.మీ. అంబలపుజ<br>20 కి.మీ. చెంగన్నూర్ |
| 13. శ్రీ వేంకటాచలపతి | గురువాయూర్ |
| 14. శివశంకర్<br>పెరియార్ నదీ తీరం | ఆల్వాయి<br>21 కి.మీ. కొచ్చిన్ |
| 15. భగవతి | క్రాంగనోర్<br>32 కి.మీ. కొచ్చిన్ |
| 16. నాగరాజ స్వామి | మన్నార్ సాల<br>100 కి.మీ. కొచ్చిన్ |
| 17. పారమర దేవి<br>అయ్యప్ప స్వామి | ఎర్నాకుళం |
| 18. సుబ్రహ్మణ్య స్వామి | మన్నార్<br>135 కి.మీ. కొచ్చిన్ |
| 19. రామలింగ స్వామి<br>శివకామేశ్వరి<br>ఛోటే నారాయణ | పొన్న గుడి<br>20 కి.మీ. వానమామలై |
| 20. అమ్మై అమ్మన్ | వాల్వ క్కోట్<br>50 కి.మీ. పొదనూర్<br>మద్రాస్-మంగుళూరు<br>రైల్వేలైనులో |

| | |
|---|---|
| | త్రిచూర్ |
| 21. తిరువెంబాడి దేవి.శ్రీకృష్ణుడు అమ్మవారికి 15 ఏనుగుల చొప్పున ఊరేగింపు | 74 కి.మీ. కొచ్చిన్<br>30 కి.మీ. గురువాయూర్ |
| 22. శ్రీకృష్ణ | కోజీకోడ్ తాళి<br>సోరనూర్, మంగుళూర్ మధ్యలో |
| 23. శ్రీ మల్లికార్జున స్వామి | కేసరగాడ్<br>మేంగలూరు - కాలికట్ మధ్యలో |
| 24. శ్రీ జగన్నాథ స్వామి | తెల్లి చెర్రి<br>క్యాలికట్ - కన్ననూర్ మధ్యలో |
| 25. అనై అమ్మన్ | బిల్వ కోట<br>షోరనూర్ దగ్గర<br>క్యాలికట్ నుండి కొచ్చిన్‌కు<br>పోవు త్రోవలో |
| 26. కాట్‌కారి అప్పన్<br>పెరుం సెల్వ నాయకి | తిరు కాట్ కారై<br>ఎర్నాకుళం దగ్గర |
| 27. నవ ముకుందన్ | తిరునవాయి<br>40 కి.మీ. తిరువిల్వామల<br>త్రిచ్చూర్ జిల్లా |
| 28. లక్ష్మణ | వెన్నిమల<br>8 కి.మీ. కొట్టాయం |
| 29. విష్ణుమూర్తి | తిరునవాయి |
| 30. శివస్వామి | తిరువన్నూర్ |
| 31. శివస్వామి | తిరుకండియూర్ |
| 32. శివస్వామి | తిరువంచికుళం |

---

బీదలకు సహాయం చేయని ధవము, ఏకాంతములో వ్యర్థమై పోయిన యువతి యవ్వనం ఒక్కటే

| | |
|---|---|
| 33 శివస్వామి | తిరుమెట్టక్కోడ్ |
| 34. శివస్వామి | త్రిత్తాళ |
| 35. శివస్వామి | త్రి పరంగోడు |
| 36. శివస్వామి | సుఖ్పురం |
| 37. జనార్ధన స్వామి | వర్కాళ, త్రివేంద్రం జిల్లా<br>త్రివేంద్రం దగ్గర<br>2 కి.మీ. వర్కాళ ఆర్.ఎస్. |
| 38. తిరునక్కర్ మహదేవ్<br>తిరునక్కర్ కొండపై | కొట్టాయం<br>కొట్టాయం జిల్లా |
| 39. సంతాన గోపాల | త్రిపునెత్తుర |
| 40. మూకాంబిక | పరవూర్<br>కొచ్చిన్జిల్లా |
| 41. వెట్టుకోరు మాకన్ | బలుస్సేరి<br>25 కి మీ క్యాలికట్<br>కోజికోడ్ జిల్లా |
| 42 భగవతి | పెరందూర్ |
| 43. పరశురామ | తిరువల్లం<br>త్రివేంద్రం దగ్గర |
| 44. అటుక్కుల్ భగవతి | పుల్లూరు |

---

# హిమాచలప్రదేశ్

## (విశిష్టతలు)

### పిడుగు పాటునకు పగిలిపోయే తెల్లటి శివలింగము

బిజలీ మహాదేవ్
బియాస్, పార్వతి నదుల
సంగమ స్థానం
బిజలీ మహేశ్వరి

బిజలీ మహాదేవ్
11 కి.మీ. కులూ

వురుములు, మెరుపుల తో ఆకాశం దద్దరిల్లుతూ, పిడుగులు పడి భయంకరముగా వుంటుంది. గుడి ముందున్న 60' ల ధ్వజ స్థంభములో నున్న ఇనుప ఊచద్వారా పిడుగుపాటు కరెంట్ లింగములోనికి వెళ్ళి లింగము పగిలిపోవును. పూజారులు మరల లింగాన్ని తెల్లని సిమెంట్‌తో అతుకుదురు. కష్టాలలోనున్న ప్రజలను స్వామివారు ఆదుకుంటారని నమ్మికగా ఈ ఏర్పాటు చేయడమైనది.

వశిష్ట మహర్షి శంకరుని ఎక్కువగా నున్న విద్యుచ్ఛక్తిని ఉపసంహరించి మానవాళిని రక్షించమని కోరినట్లుగా ఋగ్వేదములో గలదు. స్వామివారికి ఎదురుగా రెండు నందులు గలవు. గుడి పగోడా ఆకారములో ఉండి బుద్ధిష్ట్ కల్చర్‌ను జ్ఞప్తికి తెస్తుంది. శ్రావణ మాసంలో గొప్ప ఉత్సవం.

### 5 ముఖములు, 10 చేతులుగల "పంచవక్త్రమహాదేవ్" అని పిలువబడే శివాలయం

పంచవక్త్రమహదేవ్
బియాస్, సుఖేతీ నదుల సంగమం

మండి
మండి జిల్లా

### మహిషాసురుని తోకను ఎడమచేత్తో పట్టుకుని కన్నులు మూసుకుని వధిస్తూ ఉన్న అమ్మవారి విగ్రహం గల ఆలయం

మహిషాసుర మర్ధిని
గౌరీ శంకర్

జగత్ సుఖ్
కులూ జిల్లా

---

## హిమాచల ప్రదేశ్‌లో గల ఒకేఒక అర్ధనారీశ్వరాలయం

అర్ధనారీశ్వరుడు — మండి
మండి జిల్లా

వాహనములుగా ఎద్దు, సింహము గలవు.

## లింగ రూపములో దర్శనమిచ్చు అమ్మవారు

భంగేమ్ దేవి (లింగ రూపం) — భాంగ్
రేణుకా తాలూకా
సిరిమూర్ జిల్లా

## గంగాదేవి, యమునాదేవి విగ్రహములున్న ఆలయము

విశ్వేశ్వర మహాదేవ్ ఆలయములో — కులు
కులూ లోయలోని పట్టణము

## ఒకే ఎద్దుతో పొలముదున్ను ఆచారముగల ప్రాంతములో వెలసిన అమ్మవారు

నింఘాల్ దేవి — పంగి
నింగాల్ గ్రామం
చంబా లోయ

## ఉత్తర దేశమున నున్న వైద్యుడుగా భావింపబడు స్వామివారు

వైద్యనాధ్ (Lord of Physicians) — బియాస్ లోయ
కీరగామ్
బిందూకా నదీ తీరము

## ప్రక్కకు ఒరిగిపోయి ఉన్న సీతా రామాలయం

సీతాదేవి
శ్రీరాముడు — జ్వాలాముఖి

భూకంపమునకు ఒరిగిపోయినది  జ్వాలాముఖి ఆలయం దగ్గరలో

---

**ఒకనాడు పార్వతీదేవికి దాహంకాగా, శివునాజ్ఞచే ఒక కోనేరు త్రవ్వబడి, అందు దేశములోని నదులు, సరస్సులు ఒక్కొక్క బొట్టు చొప్పన నీరు యిచ్చుటచే వెలువడిన సరోవరం, వెలసిన ఆలయములు**

బిందు సరోవరం — బిందు సరోవరం, 3 కి.మీ.భువనేశ్వర్

పూర్వం 7,000 ఆలయములు వెలసినవట. ఇప్పుడు 500 ఆలయములు మాత్రం సరోవరం చుట్టూ గలవు. ఇందు సంవత్సరమునకొకసారి జగన్నాధుని స్నానము చేయింతురు. 2,999 ఆలయములు లింగరాజస్వామి ఆలయ సమీపాన వెలసినదట

**బిందు సరోవరం గట్టున వెలసిన ప్రముఖ దేవాలయం**

అనంత వాసుదేవ (చాల పురాతనాలయం) — భువనేశ్వర్

**కేదార గౌరి పెదవులపై చిన్న బాలుడు గల ఆలయం**

కేదార గౌరి — భువనేశ్వర్
ముక్తేశ్వరుడు
సప్త మాతృకలు

ఎలుక వాహనుడైన వినాయకుడు, నెమలి వాహనుడైన కార్తికేయుని విగ్రహములు గలవు. అమ్మవారి పెదవిపై చిన్న బాలుని విగ్రహం కలదు. ఇది ప్రత్యేకత.

**పూరీలోని జగన్నాథ ఆలయానికి దగ్గరలో ఎక్కువ రోజులు నీళ్ళలో మునిగి ఉండు శివలింగం గల ఆలయం**

లోకనాధ — పూరీ, 3 కి.మీ జగన్నాధాలయం

దగ్గరలోవున్న మార్కండేశ్వర ఆలయంలోని చెరువులో స్నానంచేసి యాత్రికులు పవిత్రులైనట్లు భావిస్తారు.

**ఎల్లప్పుడు సత్యమే పలుకు స్వామివారిగా ప్రసిద్ధినొందిన ఆలయం**

సత్య బదిర్ స్వామి (సాక్షి గోపాల్) — సాక్షి గోపాల్, 19 కి.మీ. పూరీ

ఇక్కడనున్న పూజారులు కూడా నిత్య సత్య వర్తనులే

---

**సింహాన్ని వాహనముగా గల్గి, ఒకచేత ఖడ్గము,**
**ఒక చేత మహిషాసురుని తోక పుచ్చుకుని ఉన్న అమ్మవారు**

బిరజా దేవి అష్టాదశ పీఠాలలో నొకటి దసరా రోజులలో అమ్మవారికి రథయాత్ర గలదు

జాజ్‌పూర్
భువనేశ్వర్ - కలకత్తా లైనులో కటక్ నుండి 3 గం॥ బస్సు - ప్రయాణం

**13 కి.మీ. పరిధిలో నలభైదేవాలయములు గల రెండు గ్రామాలు**

సోమ తీర్థం
అందరుదేవుళ్ళు కల్గిన 40 ఆలయములు (చిన్నవి, పెద్దవి) గలవు

రానీపూర్, ఝురియాల్
రూర్కెలా ప్రక్కన

ఈ 40 ఆలయములను (13 కి మీ దూరములోని) ఒకే రోజులో దర్శించిన మోక్షము

**మానవ సముద్రములో సాగే రంగు రంగుల బోట్లను(Boats) పోలిన మూడు రథాలు మూడు కి.మీ. దూరం తరలివెళ్ళి 7వ రోజున తిరిగి వచ్చు ఆచారము గల ఆలయం**

జగన్నాథ
బలభద్రసుభద్ర

పూరీ

నంది ఘోష, తాళధ్వజ, దర్పదళన అని పిలువబడే మూడు రథాలతో ఊరేగింపబడే రథోత్సవం గుండీచ మందిరము వద్ద ఆగి, 7 రోజుల తరువాత రథాలు తిరిగి వస్తాయి

**సంవత్సరమునకు 62 ఉత్సవములు జరిగే ఆలయం**

జగన్నాథ
బలభద్ర, సుభద్ర
బంగాళాఖాత తీరం

పూరీ
64 కి మీ భువనేశ్వర్

**ప్రతీ సంవత్సరము వైశాఖ మాసములో చందనయాత్ర, జ్యేష్ట మాసములో శ్వేసయాత్ర, ఆషాఢ మాసములో రథయాత్ర గల ఆలయం**

జగన్నాథ
బలభద్ర సుభద్ర

పూరీ

---

**పాలు, చక్కెర, కొబ్బరి కలిపి పానకం చేసి పీంరా పంచమి ఉత్సవం జరుపు ఆలయం**

జగన్నాధ పూరీ
బలభద్ర,సుభద్ర

లక్ష్మీదేవి ప్రార్ధనపై జగన్నాధ స్వామివారిని ఇతర దేవుళ్ళతో సహా ఆషాఢ శుద్ధ పంచమినాడు రధయాత్రలో గుండీచ మందిరము నుండి వెనుకకు మళ్ళిస్తారు

**ఎల్లప్పుడు నీళ్ళలో మునిగేఉండి సంక్రాంతికి మాత్రం నీళ్ళపైకి వచ్చి కనిపించు విగ్రహం**

గంగానారాయణ సింహపూర్
(శయనమూర్తి) 3 కి మీ గఢ్ మధుపూర్ R S
నారాయణ సరోవరములో మునిగి
ఉంటుంది.

**కాళ్ళకు బేడీలు ఉన్న హనుమంతుని విగ్రహం గల ఆలయం**

బేడీ హనుమాన్ పూరీ
1 కి.మీ. పూరీ
బంగాళాఖాత తీరం

ఇక్కడ ఒకప్పుడు సముద్రం పొంగి ఊరిని ముంచివేసినది అప్పుడు హనుమంతుడు అయోధ్యకు వెళ్ళాడట ఇక కదలకుండా ఉండేందుకు శ్రీరాముడే హనుమంతుని విగ్రహానికి కట్టడి చేశాడట. అప్పటినుండి సముద్రం ఊరిని ముంచలేదు. పొంగిన సముద్రాన్ని హనుమంతుడు కట్టడి చేస్తాడు

**సముద్రహోరు వినిపిస్తుందేమోనని చెవి యొగ్గి వింటున్న హనుమంతుని విగ్రహం**

హనుమంతుడు పూరీ
(వింటున్నట్లుగా) 1 కి.మీ. జగన్నాధాలయం

సముద్రపు హోరులో సుభద్రాదేవికి నిద్రాభంగము అవుతుందేమోనని చెవియొగ్గి వింటూ ఉంటాడు. ఒకవేళ హోరు ఎక్కువైనచో ఆపుటకు.

## అమ్మవారి అష్టమూర్తులు, స్వామివారి అష్ట లింగాలు వెలసిఉన్న ఆలయం

జగన్నాధ పూరీ
బలభద్ర సుభద్ర

అమ్మవారి అష్టమూర్తులు 1 మంగళాదేవి 2 విమలాదేవి 3 సర్వ మంగళాదేవి 4 మరీచి 5 చండిక 6 అర్ధాశిని 7 అంబ 8 కాళరాత్రి

అష్ట శివలింగాలు 1 వటేశ్వర 2 కపాలమోచన 3 క్షేత్రపాల్ 4 యమేశ్వర్ 5 మార్కండేశ్వర్ 6 ఈశాన 7 బిల్వేశ్ 8 నీలకంఠ మహదేవ్

## ఒరిస్సాలో లింగం కపోత రూపంలో ఉన్న ఆలయం

కపోతేశ్వర్ కపోతేశ్వర్
భార్గవీ నదీ తీరం 12 కి మీ పూరీ

## పిల్లల కోసము స్నానము చేయు సరోవరము

బిందు సరోవరము భువనేశ్వర్
రాష్ట్ర రాజధాని

శివుని ఆజ్ఞపై దేశములోని నదుల, సరస్సులలోని తీర్థములతో నిండిన సరోవరము

## 20, 000 ప్రజలు ఆధారపడి బ్రతికే ఆలయము

జగన్నాధ పూరీ
బలభద్ర సుభద్ర
బంగాళాఖాత తీరము

1. పూజారులు, 2 .కుండలు చేయువారు 3. మహా ప్రసాదము తయారు చేయువారు వగైరా వీరందరూ ఆలయకార్యక్రమాల్లో పాల్గొనేవారే

## ఆషాఢ శుద్ధ విదియకు ముందువచ్చే అమావాస్యనాడు విగ్రహాలను కొబ్బరి నీళ్ళతో స్నానం చేయించి, చీకటి గదిలో ఉంచు ఆలయం

జగన్నాధ పూరీ
బలభద్ర, సుభద్ర
బంగాళాఖాత తీరము

రధోత్సవమునకు ముందు విగ్రహాలకు స్నానోత్సవము జరుగును విగ్రహాలను కొబ్బరి నీళ్ళతో స్నానము చేయించుట ఇంకెచ్చటా కనిపించదు.

---

**స్త్రీలు రథములాగి, ఉత్సవము జరుపు ఆలయము**

జగన్నాథ | పూరీ
బలభద్ర, సుభద్ర
బంగాళాఖాత తీరము

సుభద్ర రథాన్ని స్త్రీలు కూడ లాగుదురు. ఆషాఢ శుద్ధ విదియ నాటినుండి దశమి వరకు రథోత్సవము జరుగును. చాల ప్రసిద్ధి

**ప్రతి సంవత్సరము స్వామివారిని ప్రక్షాళనము కొరకు తీసుకుని వచ్చు సరోవరము**

లింగరాజ స్వామి
బిందు సరోవరము | భువనేశ్వర్
5 కి.మీ లింగరాజ గుడి

ప్రఖ్యాత పంచ సరోవరములలో నొకటి.

**"Lord of Universe" అని పిలువబడే స్వామివారు, ఆలయం**

జగన్నాథ స్వామి | పూరీ

**శయనాకారములో నున్న అతిపెద్ద విగ్రహం**

విష్ణుమూర్తి | భీమఖండ
(33' పొడవుగల విగ్రహం) | కనిహా జిల్లాలోని చిన్న గ్రామం 29 కి మీ తాల్చర్
187 కి.మీ. భువనేశ్వర్
230 కి.మీ. పూరీ (పూరీ నుండి
తాల్చర్‌కు బారంగ్ మీదుగా రైలు కలదు)

ఇంత పెద్ద శయన విగ్రం ఇంకెక్కడా గానరాదు

**పురుషోత్తమ క్షేత్రం అని పిలువబడే ఆలయం**

జగన్నాథ | పూరీ
బలభద్ర, సుభద్ర | బంగాళాఖాత తీరం

---

**"మార్జాల కేసరి" అని పిలువబడే విష్ణుమూర్తి యొక్క ఆకారం - ముఖం పిల్లి, శరీరం సింహం, ఈ ప్రత్యేక ఆకారంతో వెలసిన స్వామివారు**

విష్ణుమూర్తి — నృసింగనాథ్

140 కి.మీ. సంభల్‌పూర్

భువనేశ్వర్ నుండి బస్సు

దేవాలయములోని బిలం నుండి మూషికాసురుడు ఎప్పుడు బయటికి వస్తే అప్పుడు సంహరించడానికి సిద్ధముగా నున్న స్వామివారు.

**"జగ్ మోహన్" అని పిలువబడే గర్భగుడి, వెలసిన విగ్రహములు**

జగన్నాధ క్షేత్రము — పూరీ

జగన్నాధుడు — బంగాళాఖాత తీరము

బలభద్రుడు సుభద్ర

సుదర్శన్

ఈ గర్భగుడినే "రత్నవేది" అనికూడా పిలుస్తారు. ముఖ్యమైన విగ్రహములు మూడు మాత్రమే · జగన్నాధ, బలభద్ర, సుభద్ర. ఇద్దరన్నలకు చేతులున్నవి. సుభద్రకు లేవు.

**ఒకే గర్భగుడిలోని మూడు విగ్రహాలలో సాలగ్రామ శిలలున్నవి**

జగన్నాధ — పూరీ

బలభద్ర, సుభద్ర

**శాక్తికేయము, శైవము, వైష్ణవము, బుద్ధిజము (బౌద్ధము) కలసి ఉన్న దేవాలయము**

హరి శంకరుడు — హరి శంకర్

బాలంగీర్ జిల్లా

48 కి.మీ. హరిశంకర్ రోడ్ R.S

91 కి.మీ. బాలంగీర్

67 కి.మీ.పిటాల్ ఘర్

ప్రతిదినము నాలుగు రకముల భక్తులు పూజించు స్వామివారు

---

**పాలు ప్రసాదముగా ఇచ్చు దేవాలయం**

క్షీరచోర గోపీనాథ్ (శ్రీకృష్ణుడు)
రేమునా
8 కి మీ బాలసోర్
22 కి మీ చంద్రపూర్

**"శ్రీ క్షేత్రము" అని పిలువబడే దివ్య క్షేత్రము**

జగన్నాథుడు
బలభద్రుడు, సుభద్ర
పూరీ
బంగాళాఖాత తీరము

**"వీణా యంత్రము" గల శక్తి పీఠము**

మంగళా దేవి
(శక్తి పీఠము)
ప్రాచీ నదీ తీరము
తాకట పురం
65 కి.మీ. పూరీ

**అన్నిచోట్లా శివునికి త్రిశూలం ఆయుధం ఒకచోట "పినాకమ"నే ధనుస్సు ఆయుధంగా గల స్వామివారు**

శ్రీ లింగరాజ స్వామి
(భువనేశ్వరుడు)
పాపహారీ దేవి
భువనేశ్వర్

హరిహర మంత్రముల ద్వారా లింగ రాజేశ్వరునికి మహా నైవేద్యం నివేదించబడును. లింగము, పానమట్టము చక్రాకృతి నుండుటచే హరిహర రూపమని ఎన్నబడుచున్నది. పూజలు హరిహరాత్మక మంత్ర రాజములచే జరుపబడును

త్రిపుర సంహారానికి శివుడు ఉపయోగించినవిల్లు పినాకము. ఈ వింటినే సీతా కళ్యాణానికి ముందు శ్రీరాముడు ఎక్కుపెట్టినది.

**"కపాల మోక్ష లింగము" ఉన్న క్షేత్రము**

కపాలేశ్వరుడు
పూరీ

బ్రహ్మ యొక్క పంచమ శిరస్సు తెగిన శిరస్సును బ్రహ్మ ఇక్కడ విడిచి. శివుని ప్రతిష్ఠించెను.

**స్నానయాత్ర, రథయాత్రలు గల దేవాలయం**

జగన్నాధ్ పూరీ
బలభద్ర
సుభద్ర

జ్యేష్ట మాసములో స్నానయాత్ర. ఆషాఢ మాసములో రథయాత్ర. ఈ రెండింటికి తేడా సుమారు రెండు వారములు. దేవాలయం బయటకు మూడు విగ్రహములను తీసుకొని వచ్చి, ఎత్తైన ప్లాట్‌ఫారమ్ మీద ఉంచి, జలముతో మంత్రముల మధ్య అభిషేకము రీత్యా స్నానము చేయించి, తరువాత విగ్రహాలను తుడిచి, తిరిగి గర్భగుడికి చేరుస్తారు. 45[1], 44[1], 43[1] ఎత్తుగల జగన్నాధ, బలభద్ర, సుభద్రలను రథాలపై ఊరేగించెదరు

**6, 000లకు పైగా పూజారులు కలిగి, దేశములో అతిపెద్ద వంటశాల కూడా కలిగిఉన్న దేవాలయము**

జగన్నాధ, పూరీ
బలభద్ర,సుభద్ర
బంగాళాఖాత తీరము

**వేదవ్యాసుడు మహాభారతము రచించిన గుహగా ప్రసిద్ధిచెందిన ప్రాంతము**

వేదావ్యాసాశ్రమము వేదవ్యాస్,
బ్రాహ్మణి నదీ తీరము రూర్కెలా స్టీల్ సిటి దగ్గర
పరమేశ్వరుడు, పార్వతి

ఇచ్చట సంస్కృత పాఠశాల కలదు కోయిల్ మరియు శంఖ నదుల సంగమ స్థానము.

**లక్ష్మణునికి, భరతునికి, శత్రుఘ్నునికి, అనంత వాసుదేవునికి వేరు వేరు దేవాలయములున్న పుణ్య క్షేత్రము**

లక్ష్మణుడు భువనేశ్వర్
భరతుడు,శత్రుఘ్నుడు
అనంత వాసు దేవుడు

చాలా పెద్దదైన లింగరాజ స్వామి వారి దేవాలయమునకు దగ్గరలో కలవు.

---

**నీల మాధవ దేవాలయం ఉన్న గ్రామము**

నీల మాధవుడు | కాంతిలో గ్రామము
నీల మాధవి | పూరీ జిల్లా
మహానదీ తీరము | ఖండపార తాలూకా

ఈ ఆలయము పూరీలోని జగన్నాధ్ ఆలయము కన్న పురాతనమైనది.

**రెండవ ద్వారక అని పిలువబడే క్షేత్రము**

జగన్నాధ, భలభద్ర | పూరీ జగన్నాధ్
సుభద్ర
బంగాళాఖాత తీరము

**దాదాపు 400 కుమ్మరి కుటుంబాలు ఆధారపడి, జీవించే దేవాలయము**

జగన్నాధ్ | పూరీ జగన్నాధ్
బలభద్ర, సుభద్ర
బంగాళాఖాత తీరము

స్వామివారికి ప్రతిరోజు కుండలతోనే ప్రసాదము వండుదురు. అందుచేత ప్రతిరోజు కొత్త కుండలు కావలసియున్నవి.

**శ్రీకృష్ణ కుమారుడయిన సాంబునిచే నిర్మించబడిన ఆలయము**

సూర్య భగవానుడు | కోణార్క్
బంగాళాఖాత తీరము | 33 కి.మీ. పూరీ

తన వ్యాధి (కుష్టువ్యాధి) నిర్మూలనార్ధము సూర్య భగవానుని ప్రార్ధనకై సాంబునిచే నిర్మించబడినది.




# ఇతర ప్రముఖాలయములు

| | | |
|---|---|---|
| 1 | సోమేశ్వర్<br>సోమతీర్థం<br>64 యోగినీ దేవతలు<br>విష్ణు మూర్తి<br>బుద్ధుడు | రాణీపూర్<br>జెరియాల్ గ్రామం<br>30 కి మీ టిటాల్ ఘర్ |
| 2 | జయేశ్వర్<br>భగవతి | జైపూర్ |
| 3 | హటకేశ్వర్<br>ఉష్ణ గుండాలు<br>వ్యాధి నిరోధకాలు | అత్రి<br>42 కి మీ భువనేశ్వర్ |
| 4 | నారాయణి<br>జల ఊటప్రక్కన<br>వెలసిన అమ్మవారు | నారాయణి<br>11 కి మీ చిలక సరస్సు |
| 5 | జైశంకర్<br>పార్వతీ మాత | హీరాకుడ్<br>బరహంపూర్ |
| 6 | సుభద్ర<br>జగన్నాధ<br>బలభద్ర | భువనేశ్వర్ |
| 7 | బ్రహ్మేశ్వర, ముక్తేశ్వర<br>పరశురామేశ్వర, చాముండ<br>రాజారాణి | భువనేశ్వర్ |
| 8 | యోగినీ మాతలు<br>(64) | హీరాపూర్<br>15 కి మీ భువనేశ్వర్ |

| | | |
|---|---|---|
| 9 | కాళీజాయ్ | చిలక సముద్రం |
| 10 | విష్ణుమూర్తి<br>(చిలక సముద్రం లోని దీవిపై) | నిర్మల్‌జార్<br>11 కి మీ రంభ |
| 11 | భగవతి<br>(చిలక సముద్రంలోని దీవిపై) | బాన్‌పూర్<br>12 కిమీ బాలూగామ్<br>20 కి మీ బార్‌కుల్ |
| 12 | గుప్తేశ్వర్<br>గుప్తేశ్వరి | గుప్తేశ్వర్.65 కి మీ జైపూర్<br>65కి మీ |
| 13 | మంగళాదేవి<br>ప్రాచీనదీతీరం<br>వీణా యంత్రం గల అమ్మవారు | తాకట పురం<br>60కి మీ పూరీ |
| 14 | జనార్ధన స్వామి | అన్నవర నాథ్<br>22 కి మీ పూరీ |
| 15 | లోకనాథ స్వామి, శివ | పూరీ |
| 16 | హటకేశ్వరుడు<br>బంగాళాఖాత తీరం | గోపాల పూర్<br>గంజామ్ జిల్లా<br>18 కీ మీ బరహం పూర్ |
| 17 | బాలగోపాలుడు<br>జగన్నాథ స్వామి | సాక్షి గోపాల్<br>17 కి మీ పూరీ |
| 18 | మహేశ్వరుడు | హీరాకుధ్<br>16 కి మీ సంభల్‌పూర్ |
| 19 | కిచకీశ్వరీ దేవి<br>బీహర్ రాష్ట్ర బోర్డర్ | కీచింగ్<br>మయూర్ భంజ్ జిల్లా<br>200 కి మీ బారిపాద |

| | | |
|---|---|---|
| 20 | కేదారగౌరి<br>శివ | భువనేశ్వర్<br>బిందుసాగర్ గట్టున |
| 21 | విమలేశ్వర్<br>మహనదీతీరం | హ్యూమా<br>40 కిమీ సంబల్ పూర్ |
| 22 | గుప్తేశ్వర్<br>(గుహలయం) | కోరాపుట్ |
| 23 | సరళా దేవి<br>మహనదీతీరం | కనకపూర్<br>80కి మీ భువనేశ్వర్ |
| 24 | హనుమాన్ | సిరూలి<br>15 కి మీ చందన పూర్ |
| 25 | హనుమాన్ | కటక్ |
| 26 | భోగద్ గణేష్ | నయి గువ<br>పూరీ జిల్లా |
| 27 | వరద వినాయక | కటక్ |
| 28 | కోసలేశ్వర్<br>కోసలేశ్వరి | వైద్యనాధ్ |
| 29 | రామేశ్వర్<br>రామేశ్వరి | బౌద్ధ్ |
| 30 | నీల మాధవుడు<br>నీల మాధవి | కాంతిలో<br>100కి మీ భువనేశ్వర్ |
| 31 | సమ్లేశ్వర్<br>సమ్లేశ్వరి | సంబళపూర్<br>28కి మీ రాయపూర్ |
| 32 | ఖంఖేశ్వర్<br>ఖంఖేశ్వరి | సోనేపూర్<br>48కి మీ బాలంగీర్ |

# విజ్ఞప్తి

ఆలయాలన్నీ దర్శించుటకు ఈ జీవితకాలము సరిపోతుందా? మానవుని జీవితములో పసితనము, అతి వృద్ధాప్యము తీసివేస్తే మిగిలిన కాలములో సతీసమేతముగా భారతదేశ దేవాలయ సందర్శన ఎంతవరకు సాధ్యం? దేవాలయ దర్శనమునకు కావలసిన ధనము, కాలము, శక్తి, ఎంతమంది వద్ద ఉంటాయి? ఇవన్నీ ఉన్నాయనుకుని సరిపెట్టుకున్నా పవిత్ర దేవాలయము, మహత్తర శక్తి పీఠము, పుణ్యస్థలము పురాణాలలో పేర్కొన్న వాటన్నింటికి వివరములు ఎక్కడ దొరుకుతాయి? దేవాలయములను దర్శించేటప్పుడు సాధారణముగా యువపూజారులు దర్శనమిస్తారు వారి వద్దనుండి పూర్తి సమాచారము లభించకపోయినా, ఆలయ వెనుక భాగాన, ప్రక్కన ఉన్న యిండ్లలో ఉన్న వృద్ధ పూజారులను అడిగి కొన్ని వివరములు సేకరించినాను ధర్మకర్తల వద్దకు వెళ్ళి వివరములడిగిన భాషా భేదములున్నప్పటికి ఎంతో దయతో, ఓర్పుతో సందేహనివృత్తి చేసారు కొంతమంది ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్ల ద్వారా కూడా కొంత సమాచారము సేకరించితిని. ప్రఖ్యాత పౌరాణిక ఆలయాలకు వివరములు కావలసి వచ్చినపుడు పురాణ పండితులను, ఉపన్యాస కేసరులను, సాహితీపరులను, యాత్రామార్గదర్శకులను మున్నగు వారిని అడిగి ఇంకా కొన్ని స్థలముల వివరములను చాలవరకు సేకరించడమైనది అయినా పూర్తి వివరములు లభించుట కష్టము.

వ్యాసుడుద్భవించాడు. మానవజాతిని ఉద్ధరించడానికి పురాణాదులు రచించాడు వాటితోబాటు అయ్యవార్ల, అమ్మవార్ల పేర్లు వివరించాడు పేర్లు స్మరిస్తేచాలు స్మరించి తరించమన్నాడు అంతే. అవకాశముండి దర్శించడానికి వీలుగా దేవతలు వెలసిన స్థలాల పేర్లను శౌనకాదిమునులకు శ్లోకరూపములో సంస్కృతమున చెప్పాడు వెళ్ళిపోయాడు. మానవసేవ చేశాడు. తాను తరించాడు.

ఋతువులు మారాయి సంవత్సరాలు గడిచాయి. దశాబ్దాలు, శతాబ్దాలు వెళ్లిపోయాయి యుగం కూడా మారింది. కాలచక్రం తిరిగిపోయింది నామాలు స్మరించడంతో తృప్తిపడని భక్తుడు బయలుదేరాడు దర్శనానికి కుతూహల పడ్డాడు పురాణాలు తీయించి శ్లోకాలు తెలుసుకున్నాడు ఇంతలో ఒక అనుమానం వచ్చింది వ్యాసమహర్షి ఈ క్షేత్రాలన్నీ

తిరిగి దర్శించాడా? లేక తనకున్న దైవశక్తితో ఊహించి, దివ్యదృష్టితో చూచి వ్రాశాడా? ఎట్లాగైనా, వ్రాసిన దానిలో మాత్రం అసత్యము అసందర్భము ఉండదని, సందేహాలకు తావులేదని నిర్ధారణకు వచ్చాడు వ్యాసుడు దివ్యశక్తులు కలవాడు కాబట్టి తన తరువాత కాలములో ఎంతెంతకాలము, ఏఏ ఆలయము వుంటుందో కూడా వ్రాసివుంటే సువిశాల భారతిలో నేడు అన్నింటిని వెతుకుట తప్పేది భక్తుడు బయలుదేరాడు బయలుదేరే ముందు భక్తిభావంతో భగవంతునికి నమస్కారం చేశాడు విఘ్నాలు కలుగకుండ చూడు స్వామీయని విఘ్నేశ్వరుని ప్రార్థించాడు. దర్శించడానికి అకుంఠిత శక్తినిమ్మని ఆది పరాశక్తిని అర్థించాడు.

క్షేత్రదర్శనం ప్రారంభమైంది ఒకటి, రెండు, మూడు క్షేత్రాలు దర్శిస్తున్నాడు ధన్యుడౌతున్నాడు ఇంకా ముందుకు సాగిపోతున్నాడు, ఆనందంగా విజయగర్వంతో దర్శనయాత్ర ఆగిపోయింది. శ్లోకంలోని మరొక క్షేత్రం కనబడక పోవడంతో వెదుకనారంభించాడు వాకబు ప్రారంభించాడు మిగతాక్షేత్రాల ఉనికి గురించి, పెద్దలను, అనుభవజ్ఞులను, ఆలయధర్మకర్తలను కలుసుకున్నాడు. వారందరూ భక్తుని చూచి జాలి పడ్డారు. గ్రంథాలు తీశారు శ్లోకాలను వల్లించారు. అర్థ తాత్పర్యాదులను అందించారు వారు చేయగలిగినంతా చేశారు

ఎన్నో క్షేత్రాలు ప్రకృతి బీభత్సాలకు నేలకూలాయి. మహారాష్ట్రలోను, ఉత్తరప్రదేశ్‌లోను భూకంపాలకు కనివిని ఎరుగని మార్పులు చోటుచేసుకున్నాయి హిమాలయ పర్వతప్రాంతములో కొండచరియలు విరిగి పైనున్న ఆలయములు, క్రిందనున్న ఆలయములు కూడా తుడిచిపెట్టుకునిపోయాయి మరింకెన్నో క్షేత్రాలు మతఛాందసులచే ధ్వంసం చేయబడ్డాయి. దేవాలయములేగాక విగ్రహములు కూడా విధ్వంసమునకు గురిఅయినాయి మిగిలిన వాటిలో కొన్ని శాశ్వతకట్టడములుగా నిలువజాలక శిధిలమై కాలగర్భములో కలసిపోయినాయి. ఇంకా మిగిలిన వాటిల్లోని కొన్ని స్థలాలకు పేర్లు మారిపోయాయి వ్యాసుడు పెట్టిన పేర్లు వినిపించకపోయినాయి వినిపించినా కొన్ని కనిపించకపోయినాయి నాటి పేర్లు నేడు లేవు నాటి బెజవాడ నేడు వినిపించదు నాటి బరోడా, బొంబాయి, మద్రాసులు నేడు మారిపోయాయి పురాణాలలో చెప్పబడిన కామరూపదేశం, ఏకశిలా నగరం, కిష్కింధానగరం, చరిత్రలలో చెప్పబడిన మగధదేశం మాళవ్యదేశం, చోళదేశం, శ్రీ

విజయనగర సామ్రాజ్యం ఏవి? అవన్నీ మారిపోయినాయి. వాటితోబాటు వాటి పేర్లు కూడా కాలగర్భములో కలిసిపోయినాయి. మారిపోవును కాలము, మారుట దానికి సహజము. అట్లాగని సరిపెట్టుకుంటే భక్తుడి కోరిక తీరేదెట్లా? ముఖ్యముగా కొన్ని ప్రాంతాలకు, కొండలకు ఏ విధమైన ఆధారములు లేని నాటి పేర్లు నేడు తెలుసుకొనుట దుర్లభము ఏ క్షేత్రములోనూ వాటి పేర్లుగాని ఆ పేర్లకు తగిన ప్రముఖ ఆధారములుగానీ కనిపించుట లేదు.

దీనికితోడు ఇంకొక సంకట స్థితి ఎదురవుతున్నది భక్తుడు అడిగిన క్షేత్రం "ఇదే"నని చాలచోట్ల చెప్పడం విన్నాడు నివ్వెరపోయాడు. నిజం కాదని నిర్ధారించుకున్నాడు వాళ్ళకు కూడా నిజానిజాలు తెలియవని, తెలిసినా చెప్పనటువంటి స్వార్ధాన్ని వాళ్ళలో తొంగిచూశాడు కించిత్ బాధపడ్డాడు. బిక్కమొగం వేశాడు. మౌనం వహించాడు. అతనిలో కాంక్ష చావలేదు తాపత్రయం, తపన మిగిలింది ఆకాశం వంక చూస్తూ రెండు చేతులూ పైకెత్తి "మళ్ళీ వ్యాసుడు రావాలి, మళ్ళీ వ్యాసుడు రావాలి" అని అరిచాడు

కొత్త క్షేత్రాలు వస్తున్నాయి కొత్త దేవుళ్ళు వెలుస్తున్నారు మార్పులు వస్తున్నాయి నమ్మకాలు మారిపోతున్నాయి బాబాలు భగవంతులౌతున్నారు. భగవంతుని మరిపిస్తున్నారు. భక్తుని మురిపిస్తున్నారు (వ్యాసుని శ్లోకాలలో ఎక్కడా బాబాలు వున్నట్లు లేదు.) భక్తునికి పాతవి కనిపించక కొత్తవాటిపై మోజు కలుగుతున్నది వ్యాసుని నాటి సువిశాలభారత దేశపు ఎల్లలేమిటి? నేటి ఎల్లలేమిటి? వ్యాసుని శ్లోకములో కొన్ని క్షేత్రాలు నాటి భారతదేశములో ఉన్ననూ నేటి ఇండియాలో నున్నవా? ఒకే క్షేత్రాన్ని చాలాచోట్ల "అదే" క్షేత్రమని చెప్పుచున్నారు వీటిలోని తేడాను తెలుసుకొనుటెట్లు? ఇవిగాకుండా శ్లోకరూపములో అందించిన మహాశక్తి పీఠాలు, ఉపశక్తి పీఠముల తేడాలు వ్యాసునికే తెలియాలి. నేటి పామరులకెట్లా తెలుస్తాయి. అన్ని శక్తి పీఠాల పూర్తి వివరములు కావాలి

ఇట్టి పరిస్థితులలో సేకరించి పుస్తకరూపములో సమర్పిస్తున్నవన్నియూ పూర్తిగా కరెక్టు అని అనలేను ఎందుచేతననగా నాకు తెలియజేసినవారు క్షేత్రం గురించి నిజనిర్ధారణ దొరకనివారే అజ్ఞానము, అపరిపక్వ విజ్ఞానము, అహంభావము, స్వార్ధము చోటుచేసుకొనుటచే "ఈ క్షేత్రమే ఆ దివ్య క్షేత్రమని" నొక్కి వక్కాణించేవారే గానీ "నిజక్షేత్రం" ఉనికిని తెలియజేయకున్నారు ఇదీ ఈనాటి పరిస్థితి ఉదాహరణకు సతీదేవి శరీరభాగం పడినచోటును

మహాశక్తి పీఠముగా భావించి పూజించాలి ఏ క్షేత్రములో ఏ శరీరభాగం పడినదో నిర్ధారించే ఆధారములు అన్నిచోట్లా కనిపించుటలేదు నేటి హిందూ దేశములోని ఇప్పుడున్న దేవాలయాలను మరల విభజించి నేటి ప్రజానీకానికి విశదమగునట్లు తెలియజేయవలసిన అవసరము వున్నది నాటి శ్లోకాలు పూర్తిగా మరిచిపోయి నేటి విశ్లేషణ కళ్ళముందు ఉంచేటట్లు చేయాలి. పూర్వకాలం లింగాలనాధారముగా ప్రాంతీయ విభజన జరిగినట్లు కనిపించుచున్నది త్రిలింగ దేశముగా తెలుగుభాష మాట్లాడిన ప్రాంతమును భావించెడివారు అదే విధముగా ఏకలింగ దేశము, ద్విలింగదేశముగా యితర ప్రాంత విభజన జరిగివున్నది విభజన జరిగిన ప్రాతిపదిక గానీ, విభజన జరిగిన కాలముగానీ ప్రస్తుతము కనిపించదు అన్నీ మరుగున పడిపోయినాయి

పూర్వకాలమునకు నేటికీ తేడావుంది ప్రయాణ సాధనాలలో, వసతి సౌకర్యాలలో రేడియోలు, టెలివిజను, సినీమాలు, వార్తాపత్రికలు, యాత్రలు చేసేవారు. యాత్రా మార్గదర్శక పుస్తకాలు వ్రాసేవారు, యాత్రల వివరణలు విపులముగా చెప్పేవారు ఉన్నారు వృద్ధాప్యములో ముఖ్యమైన యాత్రలు చేసి జీవితయాత్రను ముగించి ధన్యత్వము నొందేవారి సంఖ్య తగ్గినది యువతీ యువకులలో చైతన్యం పెరిగి ప్రకృతి రామణీయకతను చాటిచెప్పు సుందర ఆలయ ప్రాంగణములను పిక్నిక్‌లుగా వెళ్లి అతి కొద్ది సమయములోనే తిరిగి వచ్చే దృక్పధం తలెత్తుచున్నది రోజులు మారాయి శాస్త్రజ్ఞానముతో మిడి మిడి జ్ఞానం పొందే వారి ముందు ఆస్తికత్వం అవహేళన పాలగుచున్నది ఆది పరాశక్తి నర్ధము చేసుకొనుటకు వారికున్న శక్తిని ఉపయోగించుట లేదు ప్రతీది చూసే గానీ అంగీకరించని మనస్తత్వం ముదిరిపోవుచున్నది పంచ భూతాత్మకమైన శరీరానికి ఆదిపరాశక్తి కనిపిస్తే చూడ గలిగే శక్తి వున్నదా? ఆలోచన ఏది? అంతటిశక్తిని ఈ శరీరాన్కి సంపాదించిపెట్టే అవకాశమేది?

ఇట్టి పరిస్థితులలో సాధ్యమైనంతవరకు శ్రమించి దివ్యస్థలాల ఉనికిని, పేర్లను ఇవ్వగలిగాను ఇంకా పూర్తి వివరణలు కావాలంటే పైన మనవి చేసిన విధముగా వ్యాసుడు గానీ, వ్యాసేతరుడు గానీ (దైవాంశ సంభూతుడు) రావాలి వస్తాడు, తప్పదు వేచి ఉండాలి

పోతిరెడ్డి సూర్యనారాయణ

# "చార్‌ధామ్"లు

## పూరీ జగన్నాధము

"చార్‌ధామ్" లలో నొకటి, ఒరిస్సా రాష్ట్రములో ఈదేవాలయము కలదు కుర్ధారోడ్డు జంక్షను నుండి సరాసరి పూరీకి రైలులో వెళ్ళవచ్చును కోణార్క క్షేత్రమునుండి 43 కి మీ దూరము. బంగాళాఖాత తీరము.

పూరీ జగన్నాధ ఆలయము చాల పురాతన దేవాలయము. చాల పెద్దది నీలాద్రి లేక నీలగిరి అనే కొండపై కలదు కొండ ప్రత్యేకముగా కనిపించదు ఎత్తుగల ప్రదేశము

"నీల మాధవు"డను పేర మొదట్లో వెలసినది ఆదిమజాతుల వారి ఆరాధ్యదైవం 6,000ల మంది పండాలు కలరు బ్రాహ్మణ జాతికి, ఆదిమజాతికి చెందినవారు వీరిని "దైవ పతు" లంటారు.

దేశానికి తూర్పుభాగమున సూర్యదేవాలయం, కోణార్క 35కి మీ. దూరములో నున్నది జగాలన్నింటికి నాధుడు - జగన్నాధుడు "సర్వం జగన్నాధం". 30 మందిరాలున్నాయి 17కి మీ. దూరములో సాక్షిగోపాల్ లేక బాలగోపాల్ మందిరమున్నది.

గర్భగుడిని "జగ్‌మోహన్" అంటారు. ఇది చాల పురాతన దేవాలయము ఆలయాన్కి 4 ద్వారములు గలవు తూర్పున సింహద్వారం, వుత్తరాన ఏనుగుద్వారం, దక్షిణాన గుర్రపు ద్వారం, పశ్చిమాన పెద్దపులి ద్వారం.

ఇంద్రద్యుమ్న మహారాజుగారు పూరీలో జగన్నాధ మందిరం కట్టిరి. బ్రహ్మ దేవుని తనకు బిడ్డలు పుట్టకుండా వరమిమ్మని ప్రార్థించారు. ఇంత గొప్ప మందిరం కట్టామనే గొప్పతో ప్రజలకు సేవచేయక, గర్విస్తారని. రాజుగారికి కలలో విష్ణుమూర్తి కనిపించి సముద్రములో దారు (వేపమాను) ఖండం తేలియాడుతూ ఉండగా, దాన్ని తెప్పించి విగ్రహాలను చేయించమని ఆదేశించెను విష్ణుమూర్తి ఒక వృద్ధ వడ్రంగి వేషమున వచ్చెను విగ్రహములను చేయమని వడ్రంగిని నియమించిరి వృద్ధ వడ్రంగి 21 రోజుల వ్యవధి కోరెను తనకు ప్రత్యేక గది కావాలని, 21రోజులలో తనగదిని ఎవ్వరూ తెరువరాదని షరతుపెట్టెను ఆహార, విహారాలు లేని వడ్రంగి పరిస్థితిని తలచి ఆందోళన చెంది మహారాజుగారి పట్టమహిషి తలుపులు తెరిపిస్తుంది. అసంపూర్తి విగ్రహములు మూడు మాత్రమువున్నవి వడ్రంగిలేడు ఇద్దరన్నలకు చేతులున్నాయి సుభద్రకు చేతులు కూడా లేవు కాళ్ళు ఏ విగ్రహానికీ లేవు

భగవదేచ్ఛగా భావించి వాటినే గర్భగుడిలో నుంచిరి జగన్నాధ, బలభద్ర, సుభద్ర విగ్రహాలను ముట్టుకొనవచ్చును జగన్నాధ విగ్రహం ఎత్తు 5'-7" బలభద్ర విగ్రహం ఎత్తు 5' - 5" , సుభద్ర విగ్రహం ఎత్తు 5' విగ్రహాలు వేంచేసి ఉన్న వేదికను 1 "రత్నవేది" 2 "జగ్‌మోహన్" అంటారు రత్నవేది చుట్టును ప్రదక్షిణ చేయవచ్చును అధిక ఆషాఢమాసమొచ్చినప్పుడు (12సం॥ కొకసారి గాని, 9 ఏండ్లకొకసారి గాని) విగ్రహాలను మార్చి కొత్తవి తెస్తారు సుదర్శన చక్రాన్ని ఏర్పాటు చేస్తారు. "నవ కళేబర" ఉత్సవం జరుగుతుంది పాత విగ్రహాలను పాతిపెడ్తారు. దేవాలయానికి ఎదురుగా ధ్వజస్తంభం ఉన్నది పైన గరుత్మంతుని విగ్రహం ధ్వజస్తంభం సన్నబడింది. కొన్ని వేల సంవత్సరముల నుండి భక్తులు తాకుతున్నందున

విగ్రహాలు మార్పుజరిగినా జగన్నాధుని నాభి పద్మం మాత్రం పాతవాటి నుండి కొత్తవాటికి చేరుస్తారు ప్రాణ ప్రతిష్ఠ జరిగినట్లుగా భావిస్తారు. నాభిపద్మంలో బుద్ధుని దంతం ఉన్నదని చెబుతారు

దేవాలయం జెండాపై సుదర్శన చక్రం ఉన్నది ఇక్కడ కృష్ణుణి "మన్ మోహన్" మూర్తి అంటారు. ప్రతి సంవత్సరము స్నానయాత్ర చేస్తారు, అనగా ఒక పడవలో మూడు విగ్రహాలను ఉంచి సుగంధ భరిత జలములతో పవిత్రస్నానం చేయించెదరు.

అమ్మవారి పేరు విమలాదేవి శక్తి పీఠాలలో నొకటి అమ్మవారికి ఎదురుగా నున్న స్తంభము నల్లని రాతి స్తంభము 10 మీటర్ల ఎత్తైనది. 16కోణాలుగలది. అరుణస్తంభం అనిపేరు. కోణార్క నుండి తెచ్చినది భారత దేశములోని శక్తి ఉపాసకులకు విమలాదేవి మందిరం కేంద్రము సంవత్సరములో కొన్ని రోజులు స్త్రీలకు ప్రవేశం నిషేధము జగన్నాధునికి చేసిన భోగాన్ని ప్రసాదం అంటారు. విమలాదేవికి పూజలు చేసిన తరువాత "మహాప్రసాదం" అని పిలుస్తారు మహాప్రసాదానికి దృష్టిదోషముగాని, కర్మదోషముగాని లేక ఉచ్ఛిష్టదోషముగాని తగలదు అతి పవిత్రమగు వైష్ణవాగ్నియందు, జగద్ధాత్రియగు లక్ష్మీదేవిచే పచనముగావించబడు ప్రసాదము నేలమీద కూర్చుని ప్రసాదం తినాలి చాపలు, పీటలు పనికిరావు. వర్ణభేదాలు, అంటు, ముట్టులేవు వంటశాల చాల పెద్దది ప్రపంచములోనే ఇంత పెద్ద వంటశాల లేదు అన్నం, పప్పు వగైరా మహా ప్రసాదం. ప్రతిరోజు మహాప్రసాదం కొత్త కుండలతో వండుతారు. 360 కుమ్మరి కుటుంబాలు జీవిస్తున్నాయి.

దేవాలయానికి వెళ్ళేటప్పుడు 25 మెట్లున్నాయి 5,10 సం॥ల పిల్లలను నెమ్మదిగా ఈ మెట్లపై దొర్లిస్తారు ఆధ్యాత్మిక ఆశీర్వచనం లభించాలని

"కల్పవటం" అనే మర్రిచెట్టు ఉన్నది ఈ మఱ్ఱిచెట్టు క్రింద గణేష్ మందిరం, ఎలుక వాహనం ఉన్నాయి చెట్టుకు ఒక వైపున శ్రీ నరసింహస్వామి, మరొకవైపున శ్రీ జగన్నాధస్వామి వారు వెలసి వున్నారు

రధయాత్ర - పూరీలో గొప్పది ఇది ఆషాఢమాసములో (జూన్-జూలైనెలలో) జరుగుతుంది శ్రీకృష్ణభగవానుడు గోకులం నుండి మధురకు యాత్రగా వచ్చినట్లు పరిగణిస్తారు

పూరీ మహారాజు బోయ వంశానికి చెందినవారు బంగారు చీపురుతో రధయాత్రకు ముందు భూమిని ఊడ్చి శుభ్రం చేస్తారు ఈ కార్యక్రమాన్ని "చెహరా పహరా" అంటారు చక్రవర్తికి, కసువూడ్చే కడజాతి వానికి భేదం లేదు రాజు గొప్పవాడు కాదనే భావం ప్రతీసంవత్సరము మూడు రధాలు కొత్తవి తయారుచేస్తారు కొత్త రధాలను సంవత్సరమంతా తయారు చేస్తూంటారు రధానికి 16 చక్రాలుంటాయి. పాత రధాలను విరిచివేస్తారు

1. జగన్నాధ రధం - నందిఘోష (గరుడధ్వజం) - పసుపురంగు
   (45 అడుగుల ఎత్తు - 16 చెక్క చక్రాలు)
2 బలభద్ర రధం - తాళ ధ్వజం - ఆకుపచ్చరంగు
   (44 అడుగుల ఎత్తు - 14 చెక్క చక్రాలు)
3 సుభద్ర రధం - దేవదళనం (పద్మధ్వజం) నలుపు రంగు
   (43 అడుగుల ఎత్తు - 12 చెక్క చక్రాలు)

ముందుగా బలభద్ర రధం, తరువాత సుభద్ర రధం ఆఖరున జగన్నాధ రధం బయలు దేరతాయి ఆషాఢ శుద్ధ విదియకు ముందు వచ్చే అమావాస్యనాడు విగ్రహాలను కొబ్బరి నీళ్ళతో స్నానం చేయించి చీకటి గదిలో వుంచుతారు

రధయాత్రకు విగ్రహాలు తరలించేటప్పుడు ముందుకూ - వెనుకకు ఊపుతూ తీసుకుని వస్తారు "పహండీ" అంటారు దేవతలు కూడ క్రిందికి దిగి వచ్చి సామాన్య ప్రజలతో కలుస్తారని దీని భావం సుభద్ర రధం లాగుటకు స్త్రీలు ముందుకు వస్తారు

ఈ రధాలు 5కి మీ. దూరములో ఉన్న గుండీచ మందిరం వరకు వెళ్ళి వారం రోజులుండి తిరిగి వస్తాయి గుండీచ జగన్నాధుని జన్మస్థలము మరువరానిది రధాలు బయలుదేరేటప్పుడు పూజారులు అశ్లీల పదాలనుచ్చరిస్తారు ఇది ఆచారము

శంకరాచార్యుల వారి మఠము, గౌడీయ మఠము, శ్రీరామకృష్ణ మఠము ఉన్నాయి సూర్యదేవాలయం కూడా ఉన్నది

పంచ తీర్థాలున్నాయి. 1 బడేకృష్ణ రోహిణీ తీర్థం - ఆలయంలోనే 2 మార్కండేయ తీర్థం - 1/2కి.మీ దూరములో 3 మహోదధి లేక స్వర్గధామ్ తీర్థం - సముద్ర తీరములో 4. ఇంద్రద్యుమ్న తీర్థం మరియు 5 నరేంద్ర తీర్థం అన్నీ స్వచ్ఛ జలాలు - స్నానం చాల పవిత్రమైనది

బౌద్ధులు, జైనులు కూడా ఆరాధిస్తారు. ఈ క్షేత్రములో సంవత్సరాన్కి 62 వుత్సవాలు జరుపు ఆచారము కలదు. మూడు యాత్రలుగలవు 1) వైశాఖమాసములో

చందన యాత్ర 2) జ్యేష్ఠ మాసములో శ్వాసయాత్ర 3) ఆషాఢ మాసములో రథయాత్ర పూరీ జగన్నాథ రథయాత్ర జగత్ప్రసిద్ధమైనది

పూరీ జగన్నాథ క్షేత్రానికి ఉన్న ఏకాదశ నామములు 1 ఉచ్ఛిష్ట 2 శ్రీ క్షేత్రము 3. శంఖ క్షేత్రం 4. పురుషోత్తమ క్షేత్రం 5 నీలాద్రి 6 ఉధియన పీఠం 7 మర్త్య వైకుంఠం 8 యవేనిక తీర్థం 9 కుశస్థలి 10. పూరీ 11 శ్రీ జగన్నాథ క్షేత్రం

ఈ క్షేత్రానికి 8 దిక్కులా 8 శివలింగములు, 8 చండీదేవతల సహాయముతో కాపాడుతూ వెలసియున్నారు

| | | | |
|---|---|---|---|
| 1 | మార్కండేశ్వర్ | - | బాహ మంగళ |
| 2 | యజ్ఞేశ్వర్ | - | సర్వమంగళ |
| 3. | నీలకంఠేశ్వర్ | - | విమల |
| 4. | విలవేశ్వర్ | - | అలంబ |
| 5 | బాలేశ్వర్ | - | అర్ధాశని |
| 6. | ఇనసేశ్వర్ | - | దక్షిణకాళి |
| 7. | పాతాళేశ్వర్ | - | మారీచిక |
| 8 | కపాలేశ్వర్ | - | హరచండీ |

# బదరి నాథ్

"చార్ ధామ్‌ల"లో నొకటి ఉత్తర ప్రదేశ్‌లోని హిమాలయ పర్వతములో 10,500' ఎత్తున కలదు. ఇక్కడ ఉన్న స్వామివారి పేరు బదరినారాయణుడు. ఇది వైష్ణవ క్షేత్రము.

సంవత్సరమున ఆరు మాసములు మంచుతో కప్పబడి ఉండుటచే దేవాలయము మూసి ఉంచెదరు మూయునపుడు స్వామివారి వద్ద జ్యోతిని వెలిగించెదరు ఆరు మాసముల తరువాత దేవాలయము తెరచునపుడు జ్యోతి వెలుగుచునే యుండును వెలుగుతున్న జ్యోతిని చూచుటకు చాలామంది భక్తులు వచ్చెదరు ఈ జ్యోతి ఆరకుండా వెలుగుట విశేషము. ఈ దేవాలయము మూసి ఉంచిన సమయమున 40కి మీ. దూరములో ఉన్న "జోషీమఠ్"లో ఉంచిన ఉత్సవ విగ్రహములకు పూజలు చేయుదురు మాములుగా మే నెల చివరి వారంలో దేవాలయం తెరువబడి, అక్టోబర్ నెల మొదటివారం వరకు ఉంచబడును

నరనారాయణుల చిహ్నముగా ఈ దేవాలయమునకు ప్రాముఖ్యత కలదు ఇది వైష్ణవ క్షేత్రము శైవ క్షేత్రమైన కేదారనాథ్ 11,800 అడుగుల ఎత్తున కలదు ఈ రెండు క్షేత్రములకు మధ్యన నీలకాంత పర్వతము కలదు. ఉదయమున సూర్యరశ్మిచే ఈ పర్వతము మంచుతో నిండి ఉన్నందున తెల్లగా ప్రకాశించును దీనినే "వెండికొండ" అనియు, కైలాస పర్వతమనియు పిలుతురు

ఈ దేవాలయమునకు ఎదురుగా అతి చల్లని శీతల ధారలతోబాటు అతి వెచ్చని ఉష్ణధారలు కూడా మంచు పర్వతముల నుండి ప్రవహించుచున్నవి ఈ రెండు ధారలను సిమెంటు చేసిన చతురస్రాకారపు గదులలో నిలిపి, సమశీతోష్ణస్థితి వరకు నిలువచేసి, మించిన ధారలను బయటకు ప్రవహింపజేయు పద్ధతి కలదు సమశీతోష్ణ నీటి గదులలో యాత్రీకులు సబ్బును ఉపయోగించకుండా స్నానము చేయవలెనను నిబంధన కలదు.

ఈ దేవాలయమునకు ఋషీకేశ్ నుండి సరాసరి దేవ ప్రయాగ, రుద్ర ప్రయాగ, కర్ణప్రయాగ, నంద ప్రయాగ మరియు విష్ణు ప్రయాగలనబడు పంచ ప్రయాగల మీదుగా బస్సు సౌకర్యం కలదు. ప్రయాణము కనువిందుగా మనోహర దృశ్యములతో పర్వత శిఖరములు, నదీలోయల గుండా సాగును అలకనందా నది ఉపనదులతో కలియుచోట ప్రయాగ క్షేత్రముగా పిలువబడి, దేవాలయములు కూడా కట్టబడి దర్శనీయములుగా నున్నవి

ఈ క్షేత్రముకు ప్రక్కనే పావన భగీరధి నది కలదు ఈ నదీ తీరమున బ్రహ్మకపాలము అనుచోట యాత్రీకులు మృతిచెందిన తమ పెద్దలకు పిండ ప్రదానము చేయుదురు శ్రాద్ధకర్మలు నిర్వహింతురు ఈ విధముగా ఒక్కసారి చేసినట్లైన ఇక జీవితాంతము వరకు సంవత్సర సంవత్సరమునకు చేయవలసిన అవసరం ఉండదు. ఈ కర్మలు, పూజలు చేయుటకు పండాలనబడే బ్రాహ్మణులు వేచి ఉందురు. వారికి పారితోషికమిచ్చి పూజలు వగైరా నిర్వహించుకొనవచ్చును.

యాత్రీకులు మంచు, చలి మొదలైన ప్రకృతి వైపరీత్యములకు తట్టుకొనుటకు వీలుగా సత్రములు నిర్మింపబడి యున్నవి. చలికి తట్టుకొనే విధముగా "రొజాయి" అనబడే చలి పరుపులు అద్దెకు లభించును భోజనములకు, ఫలహారములకు విస్తృత ఏర్పాట్లు గలవు. ఈ దివ్యక్షేత్రమున గమనించదగు పురాణేతిహాసముల స్థలములు కలవు. వీటిని చూపుటకు గైడులు కలరు. హిమాలయపర్వత శ్రేణిలో గల పవిత్ర క్షేత్రములలో బదరీనాధ్, (వైష్ణవాలయం) ఒకటి. దర్శనీయము.

## ద్వారక (గుజరాత్)

"చార్‌ధామ్"లలో నొకటి సప్తమోక్షపురములలో ఒకటి. మహాభారతం, భగవద్గీతలలో "ద్వారక" ప్రశస్తి ఉన్నది మధురానగరము నుండి శ్రీకృష్ణుడు వలస వచ్చిన ఊరు ద్వారక

శ్రీకృష్ణావతార పరిసమాప్తమైన చోటు "దేహోస్వర్గ"కు ఇది దగ్గర గోమతి నదీతీరం అర్జున సుభద్రలకు వివాహము జరిగిన చోటు. ద్వారకాధీష్ ఆలయం - దీనిని "జగత్ మందిర్" అందురు కొద్ది దూరములో రుక్మిణీ మందిరం, "గోమతీ" ద్వారక అని పిలుస్తారు.

శ్రీకృష్ణ దేవాలయాన్ని "రణచోర్‌జీ" ఆలయం అందురు ఏడంతస్తుల ఆలయం దేవకీ మందిరం, బలదేవాలయం, వేణుమాధవాలయం, మీరాబాయి దేవాలయం కలవు.

శంకరాచార్య మఠం ఉన్నది శారదా పీఠం గోమతి నదికి ఆవలి ఒడ్డున లక్ష్మీనారాయణాలయం ఉన్నది ఇక్కడ "రామనామపత్తర్" అను రాయి నీళ్ళలో తేలుతూంటుంది ఇటువంటి రాళ్ళతోనే సేతువును నిర్మించినారని కథ

ద్వారకనుండి బేట్ ద్వారకకు వెళ్తున్న త్రోవలో నాగేశ్వర లింగం ఉన్నది ఇది జ్యోతిర్లింగములలో నొకటి ద్వారకనుండి బేట్ ద్వారకకు 30 కి.మీ దూరం. జరాసంధుని ధాటికి ఆగలేక ద్వారకను విడచి శ్రీకృష్ణుడు సముద్రములోని దీవికి (బేట్ ద్వారకకు) పారిపోయినట్లు కథ శిశుపాలాది వైరులకు భయపడి మధురను వీడి, ద్వారకకు చేరెను తరువాత బేట్ ద్వారకకు చేరెను కాలం కలసి వచ్చువరకు తప్పించుకు తిరగాలనే నీతిని తెలియజేయు క్షేత్రము

ఓఖా పోర్టునుండి బేట్ ద్వారక 5 కి.మీ దూరం. సముద్రములో మర పడవపై ప్రయాణం. కొంచెము భయంగా ఉంటుంది.

శ్రీకృష్ణభగవానుడు శంకాసురుని సంహరించిన చోటు బంగారు విగ్రహంగలదు.

సాయంకాలం దీపారాధన. గంటల మ్రోత వినడానికి, చూడడానికి చాల ఆహ్లాదకరముగా ఉంటుంది. శరీరం పులకరిస్తుంది. జన్మ ధన్యమైన భావన కలుగుతుంది.

స్వామివారికి "ద్వారకాధీష్" అని పేరు ఈ దేవాలయం మీద సూర్యచంద్రుల విగ్రహాలున్నాయి అంటే మానవ హృదయాలలో సూర్యచంద్రులున్నంతవరకు శ్రీకృష్ణుడు ఉంటాడని అర్థం.

వేసవి కాలమందు కూడా చల్లగా ఉంటుంది. మంచినీరు దొరుకుట కొంచెము కష్టం. ఉప్పునీరు ఊరుతుంది స్వామివారు నల్లని విగ్రహం మురళి, నెమలిపించము ధరించి ఉంటారు. రుక్మిణీ మాత పాలరాతి తెల్లని విగ్రహం.

ప్రసాదములు తియ్యనివి పాలకోవా, పంచదారతో తయారైనవి పంచద్వారకలు. 1) ద్వారక 2) బేట్ ద్వారక 3)డాకోర్ (గుజరాత్) 4) కంక్రోళి 5) నాధ్ ద్వారా (రాజస్థాన్) దర్శనీయము.

నాల్గవదైన "రామేశ్వరక్షేత్రము" ద్వాదశ జ్యోతిర్లింగములలో చూడుడు.

## క్షుద్రదేవతలుగా పూజింపబడు అమ్మవార్లు

### 1. చొట్టానికరై : కేరళ - 15 కి.మీ. కొచ్చిన్

"రాజ రాజేశ్వరి" మాతగా కొలుస్తారు. ఈ అమ్మవారిని ఉదయం సరస్వతిగాను,

మధ్యాహ్నం భద్రకాళిగాను, సాయంత్రం దుర్గాదేవిగాను కొలుస్తారు ఈ అమ్మవారు విష్ణుమూర్తి ప్రక్కన వెలసియున్నారు వీరిరువురిని కలిపి "లక్ష్మీనారాయణ" అని కూడా పిలుస్తారు అమ్మవారు మానసిక వ్యాధుల నివారణకు ప్రఖ్యాతి గాంచిరి ఇచ్చట నున్న చెరువునకు రక్తాకుళం అని పేరు. నీరు ఎరుపురంగు వండిన అన్నమును చెరువులో కలుపుతారు మానసిక వ్యాధులు ఒక వారం రోజులలో తగ్గుతాయని నమ్మిక. గర్భగుడి కెదురుగా ఉన్న ప్లాట్‌ఫారంపై రోగులను విడచిపెడతారు వాళ్ళు అరుస్తూ, తలలు తిప్పుకుంటూ, గంతులు వేస్తూ పిచ్చిచేష్టలు చేస్తుంటారు ప్రసాదంగా పసుపునీరు, నిమ్మరసం, విభూతి కలిపిన ద్రావణాన్ని రోజుకు 3 పూట్లా రోగులకు త్రాగిస్తారు భక్తులు అమ్మవారి ప్రీత్యర్థం ఆలయములో నున్న చెక్కకు మేకులు కొడతారు. మాంత్రికులు, తాంత్రికులు అపూర్వ శక్తుల కొరకు ఈ అమ్మవారిని ప్రార్థిస్తారు ముఖ్యముగా మలయాళ మాంత్రికుల ఆరాధ్యదేవతగా వెలసినదీ అమ్మవారు

## 2. తారాదేవి : తారాపీర్ - పశ్చిమబెంగాల్

80 కి.మీ శాంతినికేతన్ (భోల్పూర్ R S ) రాంపూర్ హాట్ R S నుండి సరాసరి బస్సులు కలవు చనిపోయిన శవాలను తీసుకుని వచ్చి అమ్మవారి గుడికెదురుగా దహనం చేస్తారు ఇందుకుగాను దేవస్థానం ఫీజులు వసూలు చేస్తుంది. భక్తులందరు గుడి బయట అమ్ముచున్న అగరువత్తు కట్టలను కొని గుడిబయట పెట్టబడిన ఇసుక తొట్టెలలో కాల్చి, గుచ్చెదరు అంతేగాక ఆలయము బయట బంతిపూలు వగైరా పూలమాలలు కట్టెదరు. ఆలయము బయట గుడికి పూలమాలు కట్టి వ్రేలాడదీయుట ప్రత్యేకత. బహుశా శవదహనముల నుండి వెలువడు వాసనలను దూరము చేయుటకు గాను ఆలయము బయట పూలమాలలు కట్టుట, అగరువత్తులు వెలిగించుట జరుగుచున్నది ఈ ఆలయము 2 అంతస్తులలో కట్టబడినది. అమ్మవారు (పార్వతీదేవి) పరమేశ్వరునికి పాలు ఇచ్చుట ప్రత్యేకత క్షీరసాగర మథన సమయమున వెలువడిన హాలాహలమును శివుడు మ్రింగి గొంతు మంటచే రోదిస్తుండగా, అమ్మవారు కరుణించి పరమేశ్వరుని పసివానిగా చేసి మాతృమూర్తిగా తన చనుబాలు ఇచ్చుట ఇచ్చటి విగ్రహంలోని ప్రత్యేకత. ఇచ్చట కూడా ఎంతోమంది మంత్ర, తాంత్రికులు పూజలు జరుపుటకు వచ్చుచుందురు రహస్య పూజలు కూడా జరుగుతాయని ప్రతీతి

## 3. చండిల్లాదేవి : మధ్యప్రదేశ్ - మహోబా గ్రామం

63 కి.మీ ఖజురహో, 170 కి మీ ఝాన్సి. అమ్మవారు 12' ఎత్తుండి అష్టభుజాలతో గంభీరముగా వెలసిన విగ్రహం ప్రక్కనే 12' ఎత్తుగల భైరవ విగ్రహం కలదు అమ్మవారు

పెద్ద చీకటి గుహలో వెలసియున్నది. కీర్తిసాగరం, మధనసాగరం అనే సరోవరాల మధ్య నున్నది. చండీ ఉపాసకులు బళ్ళెములతో వచ్చి అమ్మవారిని రకరకములుగా నిమ్మకాయలతో, జంతుబలులతో రాత్రులందు పూజిస్తారు

**4. చాముండా దేవి : హిమాచల ప్రదేశ్**

చాముండా R.S కు 6 కి.మీ దూరం. వనగంగా నదీ తీరం కాంగ్డా నుండి, జ్వాలాముఖి క్షేత్రం నుండి బస్సులు కలవు.

అమ్మవారు ఉగ్రరూపంతో వెలసియున్నది., 22 గ్రామాల శ్మశానములకు మధ్యలోనున్న ఆలయం. ఇది ప్రత్యేకత. స్వామివారు అషుతోష్ శివశంకర్ మృత్యు వినాశకుడు. శ్మశాన సంచారి. రాత్రులందు ఈ శ్మశానములన్నిటా శివుడు సంచరిస్తాడని ప్రతీతి. తపోయోగులకు, మంత్ర తంత్ర సాధకులకు నిలయం. జంతు బలులు సాగుచున్నవి పూర్వం నరబలులుండెడివని ప్రతీతి. ఇచ్చట పితృదేవతలకు శ్రాద్ధపిండాలు కూడా వేస్తారు అమ్మవారు స్వయముగా మంత్ర విద్యలు, తంత్ర విద్యలు రాత్రులు ఉపాసకులకు నేర్పుతుందని నమ్మిక. నిశీధములో శ్మశాన విహారిణి అమ్మవారి దర్శనాన్కి ధైర్యము గావలెను.

ఇచ్చట తపస్సు చేసినవారికి, పూజలు జరిపినవారికి, క్షుద్రశక్తులు లభిస్తాయట. అమ్మవారు ప్రసన్నురాలని ప్రతీతి. విభూతి రాసిన విగ్రహములు, కుమారి పూజలు (వివస్త్రపూజలు) రక్తపూజలు, రుద్రాభిషేకాలు జరుగుచున్నవి.

## గంగాదేవి ఆలయములు

1. గంగాసాగర్ : పశ్చిమ బెంగాల్ - సాగర్ మేళా

గంగానది సముద్రములో కలియుచోటు. ఇచ్చట భగీరధుడు, కపిలముని విగ్రహములతోబాటు గంగాదేవికి ఆలయం కలదు.

2 ఎల్లోరా : మహారాష్ట్ర - ఎల్లోరా గుహలలోని

16వ నెంబర్ గుహలో గంగాదేవి మొసలి వాహనంపై సాక్షాత్కరిస్తుంది

3. ఖజరహో . మధ్యప్రదేశ్ -

పార్వతి, గంగామాతలు ఒకే గర్భగుడిలో నున్న ఆలయం గంగాదేవి మకరవాహనం పైనను, పార్వతీదేవి సింహవాహనం పైనను వేంచేసియున్నారు

4. అగర్తల త్రిపుర రాష్ట్రము -

చతుర్దశ దేవతా

మందిరములో గంగాదేవి ప్రతిష్ఠితమై యున్నది

# శనీశ్వరాలయములు

1. తిరునల్లార్ : తమిళనాడు - 5 కి.మీ. కరైకాల్ . ప్రతి 21/2 సం॥లకు ఉత్సవము.

2. మందపల్లి : ఆంధ్రప్రదేశ్ - తూర్పుగోధావరి జిల్లా. రావులపాలెం నుండి అంబాజీపేటకు వెళ్ళు త్రోవలో. ఇక్కడ స్వామివారు మందేశ్వర స్వామి (శివలింగం) శనీశ్వరునిచే ప్రతిష్ఠించబడిన స్వామివారు. ఈ క్షేత్రము శనీశ్వర క్షేత్రముగా ప్రసిద్ధి నొందియున్నది.

3. శింగనాపూర్ : మహారాష్ట్ర - అహ్మద్ నగర్ జిల్లా.

35 కి.మీ అహ్మద్ నగర్, 6 కి.మీ గోడేగామ్, 84 కి.మీ. ఔరంగాబాద్ 64 కి.మీ షిర్డి. గుడి కట్టబడని స్వామివారు. లింగ రూపమున వెలసిరి.

4. గౌతమ్‌పుర: రాజస్తాన్ - 5 కి.మీ. గౌతంపుర రోడ్ R.S. అజ్మీర్ - ఖండ్వా లైనులో

5. పాలకొల్లు : ఆంధ్రప్రదేశ్ - పశ్చిమగోదావరి జిల్లా. శ్రీ క్షీరా రామలింగేశ్వర స్వామివారి ఆలయములో ప్రత్యేక ఆలయము కలదు. పంచారామక్షేత్రం.

# పరశురామాలయములు

## (భార్య : ధరణీ దేవి)

1. నంజనగూడ్ : కర్ణాటక - 25 కి.మీ. మైసూర్ కపిల నదీ తీరం - నంజుండేశ్వర స్వామివారి గుడితోబాటు పరశురాముని గుడికూడ కలదు.

2. భువనేశ్వర్ : ఒరిస్సా - లింగరాజ స్వామివారి దేవాలయానికి, ముక్తేశ్వర స్వామివారి ఆలయానికి దగ్గరలో

3. వజ్రేశ్వరి : మహారాష్ట్ర - 80 కి.మీ. ముంబాయి. ధానే R.S. నుండి బస్సు. వజ్రేశ్వరి దేవి ఆలయానికి దగ్గరలోని మందాకిని పర్వతముపై

4. ఉత్తర కాశి : ఉత్తరప్రదేశ్ - కేదారనాథ్‌కు వెళ్ళు త్రోవలో.

5. త్రిచూర్ : కేరళ - వడక్కునాధన్ ఆలయం దగ్గరలో తిరువళ్ళం అనేచోట.

6. పరశురామ గుండం : రాజస్తాన్ - ఫాల్నాR.S నుండి 35 కి.మీ. బస్సు ద్వారా. పర్వత శిఖరముపై పరశురామాలయం గలదు.

7. ఋణకత : ఉత్తరప్రదేశ్ 14 కి.మీ. మధుర. రేణుకా క్షేత్రమున పరశురామాలయం గలదు.

8. ఫేడే : మహారాష్ట్ర - రత్నగిరి జిల్లా . 7 కి.మీ. చిప్లిన్

9. జాము : హిమాచలప్రదేశ్ - రేయింకా మండలం. సిరిమూర్ జిల్లా

10. త్రివేంద్రం : కేరళ - పరశురామాలయం కలదు.

11 సిమ్లా · హిమాచలప్రదేశ్
పరశురామాలయం. రేణుకాదేవి, జమదగ్ని ఆశ్రమం

12 రేణుక హిమాచలప్రదేశ్ - 45 కి మీ నహాన్ పరశురామాలయం గలదు

## పరశురాముడు

పరశువు (గండ్ర గొడ్డలి) నాయుధముగా గలవాడగుటచే పరశురాముడని పిలువబడెను పరమశివుని శిష్యుడై అతని పుత్రుడగు కుమారస్వామితో కలసి ధనుర్విద్య మొదలగు యుద్ధ విద్యలను నభ్యసించెను కార్తవీర్యార్జునుని వధించెను 21 మార్లు భూమండలమందు గల రాజులనందరిని బరిమార్చి వారి కళేబరములను స్వర్గద్వారమున సోపానములుగా చేసెను. పరశురాముని క్రోధానలము వలన భూమండల మంతయు నిక్షాత్రమైనది భూమిని కశ్యపునికి దానమీయబడుటచే 'కాశ్యపి' అయినది అనంతరము పరశురాముడు తపస్సు చేయుటకు పోయెను

## సాక్షి దేవాలయములు

1. సాక్షిగణపతి· శ్రీశైలం - ఆంధ్రప్రదేశ్, కర్నూల్ జిల్లా శ్రీ మల్లికార్జున స్వామి వారి ఆలయమునకు వెళ్ళు త్రోవలో.

2. సాక్షి భైరవ్ వైష్ణవదేవి - జమ్ముకాశ్మీర్ రాష్ట్రములో కాట్రా నుండి 14 కి మీ దూరంలో వైష్ణవదేవి ఆలయమునకు వెళ్ళు త్రోవలో

3. సాక్షి గోపాల్ : పూరీ - ఒరిస్సా లోని పూరీ జగన్నాథ (బాల గోపాలాలయం)క్షేత్రం -జగన్నాథ బలభద్ర, (17కి మీ దూరములో) సుభద్రాలయమునకు పోవుత్రోవలో

4. సాక్షి మల్లికార్జునస్వామి . పుష్పగిరి - ఆంధ్రప్రదేశ్‌లోని కడప జిల్లాలో 15 కి,మీ కడపకు దూరములోనున్న పుష్పగిరి స్వామివారు చంద్రమౌళీశ్వరస్వామి

5. సాక్షి వినాయక · శుచీంద్రము - తమిళనాడు - అరేబియా సముద్ర తీరం - స్థాణేశ్వరుడు

6. సాక్షేశ్వర్ : గోకర్ణ క్షేత్రం - కర్ణాటక (శివలింగం) స్వామివారు మహా గోకర్ణేశ్వరుడు ఆలయ రెండవ ప్రాకారములో సాక్షేశ్వర్ లింగము ఉన్నది

7. సాక్షి గణపతి . కాశీ - ఉత్తరప్రదేశ్ - విశ్వేశ్వరుని గుడికి వెళ్ళు సన్నని సందులో.

8 సాక్షి వినాయకుడు - కొల్హాపూర్ - మహారాష్ట్ర - మహాలక్ష్మి ఆలయమునకు పోవు త్రోవలో, తెంబలాయి కొండపై వేంచేసి యున్న స్వామి వారు సాక్షి వినాయకుడు

**9.** సాక్షి వినాయకుడు రామేశ్వరం - తమిళనాడు - రామలింగేశ్వరుడు పాంబన్ బ్రిడ్జి నుండి వచ్చు త్రోవలో

**10** సాక్షి వినాయక మహేశ్వరి పురం - మధ్యప్రదేశ్- బడవాహ R S నుండి 55 కి మీ రాజరాజేశ్వరి ఆలయం

**11** సాక్షి గోపాల్ కన్హల - ఉత్తరప్రదేశ్ - మధుర బృందావనాల దగ్గర దావూజీ (బలరామాలయానికి) పోవు త్రోవలో

**12.** సాక్షి స్వాములు : గయ - బీహార్ - పితృగయ

ఈ క్షేత్రములో యాత్రికులు తమ పూర్వీకులకు శ్రాద్ధ కర్మలు చేసి పిండ ప్రదానము చేసినట్లు సాక్షిగా నిలిచిన స్వామివార్లు

1) గదాధర 2) ప్రతీప మహేశ్వర

# బ్రహ్మదేవుని ఆలయములు

**1. పుష్కర్ :** రాజస్తాన్ - 11 కి.మీ అజ్మీర్

బ్రహ్మ సరోవరం ప్రక్కన. బ్రహ్మచేతిలోని పద్మం పడినచోటు. సావిత్రి, గాయత్రి మాతలతో వెలసిన స్వామివారు. ఇచ్చట ప్రతి సంవత్సరము పెద్ద ఉత్సవము జరుగును భారతదేశమందలి బ్రహ్మదేవునికి గల అతి ప్రముఖ స్థలము.

**2. కుంభకోణము :** తమిళనాడు

**3. తిరుకొండియూర్ :** తమిళనాడు. 10 కి.మీ. తంజావూరు

**4. పార్సె :** గోవా. 7 కి.మీ వాల్పాయ్.

కారంబొలిం బ్రహ్మ అనే గ్రామములో. పానాజీకి దగ్గరలో.

**5. చేబ్రోలు .** ఆంధ్రప్రదేశ్ - గుంటూరుజిల్లా

చతుర్ముఖ బ్రహ్మ లింగేశ్వరస్వామి.

**6. ఖజురహో :** మధ్యప్రదేశ్

సరస్వతి సమేత చతుర్ముఖ బ్రహ్మ ఆలయం కలదు నల్లరాతి నాలుగు దేవాలయములలో రెండు మాత్రము శిధిలము కాకుండా వున్నవి

**7. చిదంబరం :** తమిళనాడు

నటరాజస్వామివారి ఆలయములో.

**8. తిరువల్లం :** కేరళ 5 కి.మీ త్రివేంద్రం

**9 కొడిముడి .** తమిళనాడు 40. కి మీ. ఈరోడ్ 105 కి.మీ కోయంబత్తూర్ బ్రహ్మ, విష్ణు, మహేశ్వరుల విగ్రహములు కలవు

10 **కోత్తనూర్** · తమిళనాడు - తంజావూరు జిల్లా నన్నిలం తాలూకాక్వాయిలాడు దుర్తై - తిరువారూర్ బస్సు రూట్‌లో అరసిలార్ నదీతీరం దుర్గ, సరస్వతి, లక్ష్మి ఆలయములతో బాటు

11 **పిల్లల మర్రి** ఆంధ్రప్రదేశ్ - నల్గొండ జిల్లా

12. **అలంపురం** ఆంధ్రప్రదేశ్ - మహబూబ్‌నగర్ జిల్లా బాల బ్రహ్మేశ్వరాలయములో

13. **నాగరత** గుజరాత్ 6 కి మీ ఖంభాట్, ఖేడా జిల్లా

14. **హరిద్వారం** ఉత్తరప్రదేశ్ - గంగానదీ తీరం

15 **అగర్తల** త్రిపుర రాష్ట్రము అగర్తలకు 8 కి మీ దూరములో నున్న చతుర్దశ దేవతా మందిరములో

16 **ధర్మపురి** · ఆంధ్రప్రదేశ్ - కరీంనగర్ జిల్లా బ్రహ్మ విగ్రహం 6' ఎత్తుగల చతుర్భుజ స్వామి

17 **శుచీంద్రం** : తమిళనాడు 13 కి మీ కన్యాకుమారి

18 **పిండార** గుజరాత్ 32 కి మీ ద్వారక

19 **ఖేడ్** : గుజరాత్ 25 కి మీ ఈదర్ - శబర్‌కాంత జిల్లా,
హిరణ్యాక్ష నదీతీరం
స్వామివారు చతుర్ముఖుడు

20 **బ్రహ్మకపాలం** బదరీనాధ్ - ఉత్తరప్రదేశ్

మందాకినీ తీరం బ్రహ్మకు ప్రత్యేక ఆలయము లేదుగానీ బ్రహ్మస్థావరముగా పరిగణింపబడి, పెద్దలకు పిండ ప్రదానములు చేయు పవిత్ర స్థలము

21 **శ్రీకాళహస్తి** ఆంధ్రప్రదేశ్ - చిత్తూరు జిల్లా

## బ్రహ్మదేవుడు

వేదపండితులైన బ్రహ్మజ్ఞానుల ఇంట బ్రహ్మ వెలిసివుంటాడు అదే ఆయనకు దేవాలయం అందుచేత వేరే గుడి అవసరము లేదు

ప్రత్యేకాలయములు కొన్ని మాత్రమే ఉన్నను ప్రసిద్ధాలయములలో బ్రహ్మ విగ్రహములు వెలసి పూజలందుకొనుచున్నవి బ్రహ్మదేవుడు రాక్షసులకు మాత్రమే ఆరాధ్యదైవముగా నుండి వరముల నిచ్చినట్లు పురాణేతిహాసములు చెప్పుచున్నందున కూడా బ్రహ్మదేవునికి ప్రత్యేకాలయములు ఎక్కువగా కనిపించవు ఈయన అవతార పురుషుడుగా కూడ ఎక్కడా ప్రసిద్ధి లేదు త్రిమూర్తులున్నచోట తప్ప ప్రత్యేకత గల స్వామివారుగా పూజింపబడు

అరుదుగా నున్నది తరువాత వ్రాయబడిన గాధలలో భృగుమహర్షిచే బ్రహ్మాలయములు నుండకుండుగాక అన్న శాప కారణాన నూతనాలయములు కనిపించవు.

## నవబ్రహ్మలు (లింగాకారములో)

1) బాలబ్రహ్మ 2) కుమార 3) అర్క 4) వీర 5) తారక 6) గరుడ 7) స్వర్గ 8) పద్మ 9) విశ్వ

ఇవన్నియు ఆంధ్రప్రదేశ్‌లోని అలంపురములో వెలసియున్నవి బాల బ్రహ్మేశ్వరాలయములో

## నవనందులు

1) ప్రధమ నంది 2) నాగనంది 3) సోమనంది 4) సూర్యనంది 5) శివనంది 6) విష్ణునంది 7) వినాయకనంది 8) గరుడ నంది 9) మహానంది

ఈ పుణ్యానందులు 14 కి.మీ విస్తీర్ణములో వెలసియున్నవి సూర్యోదయము నుండి సూర్యాస్తమయము లోపు దర్శించి పూజించిన పుణ్యప్రదము. పాపనాశకము ఆంధ్రప్రదేశ్‌లోని కర్నూలు జిల్లాలోని నంద్యాల, మహానంది క్షేత్రము మధ్యన వెలసివున్నవి

## ప్రసిద్ధ సూర్య నారాయణాలయములు

1 కోణార్క - ఒరిస్సా - 43 కి.మీ పూరీ, 65 కి మీ భువనేశ్వర్. బంగాళాఖాత తీరము ఈ ఆలయం చాల పెద్దది సప్తాశ్వాలతో లాగబడుచున్న రధమువలె చక్రాలతో నుండిన సూర్య దేవాలయం మెయిన్ గుడి పడిపోయినది ముందున్న మండపము కూడా శిధిలావస్థకు చేరగా పడిపోకుండా ఏర్పాట్లు చేసి నిలబెట్టి ఉన్నారు గర్భగుడిలో సూర్య భగవానుని విగ్రహం లేదు ఇచ్చటనున్న ధ్వజ స్తంభము పూరీలోని జగన్నాధాలయమునకు తరలించబడినది

2 మొధేర · గుజరాత్ 50 కి మీ ప్రభాస తీర్థం 100 కి మీ అహ్మదాబాద్ వయా మహాషేణ, 30 కి మీ పాటన్, పుష్పావతి నదీ తీరం సూర్యోదయ కిరణాలు ప్రతిరోజు స్వామివారి విగ్రహముపై ప్రతిబింబిస్తాయి ఇచ్చట 12 సూర్య బింబములున్నవి

3 ఓసియా · రాజస్థాన్ - 60 కి మీ జోధపూర్ శ్రీరామచంద్రుడు రావణ సంహారమునకు ముందు ఆదిత్య హృదయం స్మరించి ఈ స్వామివారిని ప్రార్థించి సర్వశక్తి సంపన్నుడై రావణుని నేలకూల్చెను రావణ వధానంతరం పరివారముతో సహా అయోధ్యకు తిరిగివస్తూ ఇచ్చట ఆగి స్వామివారిని దర్శించెను

4 సూర్యనార్ కోయిల్ తమిళనాడు - 25 కి మీ. మాయవరం - 3 కి మీ తిరువడ మరుదూర్ R S. ఇచ్చట నవగ్రహ సమేతుడైన సూర్య భగవానుని మందిరమున్నది

5 కుంభకోణం తమిళనాడు - మహా మాఘం సరస్సు ఒడ్డున

6 జైపూర్ : రాజస్థాన్ - అంబర్ ప్యాలెస్‌లో సూర్య భగవానుని ఆలయమున్నది

7 గెయిత లేక గల్టా · రాజస్థాన్ 10 కి.మీ జైపూర్.పర్వతముపై జలధార ప్రక్కన సూర్యనారాయణ స్వామివారు వెలసియున్నారు.

**8. జెయిరా పాటన్** . రాజస్థాన్ - 60 కి మీ. కోట అజ్మీర్‌కు దగ్గరలో కోట ఉన్నది

9. రాణక్ పూర్ - రాజస్థాన్ - 96 కి.మీ ఉదయపూర్ చెన్ముఖ అని పిలువబడే జైన దేవాలయములో సూర్య మందిరము కలదు

10. సూరజ్ కుండ్ - హర్యానా - 18 కి.మీ. ఢిల్లీ ఇచ్చట సరస్సు తీరాన స్వామివారి ఆలయమున్నది.

11. అరసవల్లి ఆంధ్రప్రదేశ్ - 3 కి మీ. శ్రీకాకుళం,శ్రీకాకుళం జిల్లా.రథ సప్తమి రోజున సూర్య కిరణాలు స్వామివారి పాదములపై పడును

12 మహోబా మధ్యప్రదేశ్ - 63 కి మీ ఖజురహో

13 మార్తాండ క్షేత్రం జమ్ము & కాశ్మీర్ - 64 కి.మీ. శ్రీనగర్. 8 కి మీ అనంతనాగ్ చాలా పెద్ద దేవాలయం. పై కప్పు లేదు. ఈ క్షేత్రమును "భావన్" అని కూడా పిలుస్తారు. రమణీయ కళాసంపదకు నిలయమైన ఆలయం

14 **కాళేశ్వరం** ఆంధ్రప్రదేశ్ - గోదావరి నదీ తీరం కరీంనగర్ జిల్లా . కాళేశ్వర, ముక్తేశ్వర స్వామివార్ల ఆలయములో

15. **తిరుచానూర్** . ఆంధ్రప్రదేశ్ - అలమేలు మంగాపురం చిత్తూరు జిల్లా పద్మావతి ఆలయమునకు వెళ్ళు త్రోవలో కోనేరుకు ముందుగా వెలసిన స్వామివారి ఆలయం.

16. దియో బీహార్ - గయ జిల్లా 20 కి.మీ. గయ

17 నలంద యూనివర్శిటి : బీహార్ రాష్ట్రము - 90 కి మీ పాట్నా

సరస్సు ఒడ్డున. స్వరాజ్యపూర్ బర్గామ్, 18 కి మీ నలంద కార్తీక, వైశాఖ మాసాల్లో "ఛాట్" పూజ జరుగును

18 సూర్య పహాడ్ : అస్సాం 162 కి.మీ గౌహతి ఇచ్చట గల పర్వతముపై దుర్గ, శివ, గణేశ, చంద్ర, బుద్ధ భగవానులతో వెలసిన స్వామివారు

19 ఐ హోల్ కర్ణాటక - 46 కి మీ బదామి 146 కి మీ హంపి
సూర్యనారాయణ స్వామివారి ఆలయం కలదు

20. మొహ్మదాబాద్ . ఉత్తరప్రదేశ్ - వారణాసి సమీపాన, దేవల మహర్షిచే ప్రతిష్ఠించబడిన సూర్య నారాయణ విగ్రహము కలదు

21. కాయిదా మధ్యప్రదేశ్ ఉజ్జయిని దగ్గర సప్తాశ్వ రధారూఢుడైన సూర్య భగవానుని విగ్రహం కలదు

22. హలిబేడు : కర్ణాటక - హొయిసాలేశ్వర ఆలయములో

23. గయ . బీహార్ రాష్ట్రము - 92 కి మీ పాట్న. పితృగయ క్షేత్రములో సూర్య నారాయణాలయమున్నది

24. వైదీశ్వరన్ తమిళనాడు - తంజావూరు జిల్లా 6 కి.మీ షీర్ కాశి, 20 కి మీ. చిదంబరం నవగ్రహములకు వేరు వేరు ఆలయములు కలవు

25. ఖజురహో మధ్యప్రదేశ్

26 లోహార్గల : రాజస్థాన్ 32 కి మీ నవల్ గడ R S ఝున్‌ఝునూన్ జిల్లా. 135 కి మీ. జైపూర్, పర్వతము నుండి సప్తధారలు వచ్చు ప్రముఖ తీర్థము.

27 దేహోస్వర్గ గుజరాత్ ప్రభాస తీర్థం

28 భాస్కర క్షేత్రం · ఆంధ్రప్రదేశ్ - అలంపురం - మహబూబ్‌నగర్ జిల్లా జోగుళాంబ దేవాలయం దగ్గరలో

29. కాశి ఉత్తరప్రదేశ్ - అన్నపూర్ణాదేవి ఆలయమునకు ఎదురుగా

30 పెద్దాపురం ఆంధ్రప్రదేశ్ - తూర్పు గోదావరి జిల్లా. 4 కి.మీ సామర్లకోట పాండవుల మెట్టపై శ్రీ సూర్య నారాయణ స్వామివారి ఆలయం కలదు ఈ మెట్టనుండి రాజమండ్రి వరకు సొరంగము కలదనియు, అజ్ఞాతవాస సమయమున పాండవులు ఈ సొరంగమును ఉపయోగించుకొనినట్లు పురాణ గాథ.

31. ప్రాచిపిప్లా · గుజరాత్ - 25 కి మీ సోమనాధ్ అరేబియా సముద్ర తీరం

32 నాగరిక · గుజరాత్ - 6 కి మీ ఖంభాట్ - ఖేడా జిల్లా

33 కందాహ బీహార్ 3 కి మీ మహేషి - సహరష జిల్లా

34 కటర్‌మల్ ఉత్తరప్రదేశ్ - 17 కి.మీ అల్మోర - అల్మోర జిల్లా

35 శ్రీకాళహస్తి ఆంధ్రప్రదేశ్ - చిత్తూరు జిల్లా శ్రీకాళహస్తీశ్వరుని ఆలయానికి దగ్గరలో,

36. దేవలాస్ ఉత్తరప్రదేశ్ : మహ్మదాబాద్ R S 6 కి మీ. అజయ్ గఢ్ జిల్లా తమసా నదీ తీరం

37. జాజ్‌పూర్ ఒరిస్సా కటక్ నుండి బస్సు బిరజా దేవి ఆలయం సమీపాన.

38 సూరజ్ మందిర్ . గుజరాత్ - 23 కి మీ సోమనాధ్

39 ఢిల్లీ తుగ్లకాబాద్ పోవు రోడ్డుపై సూర్య భగవానుని ఆలయం మే, జూన్ నెలలలో ఉత్సవం

40 కుంభకోణం తమిళనాడు - నాగేశ్వరాలయములో ప్రత్యేకముగా సూర్య నారాయణ మందిరమున్నది

41 ఫల్గూర్ కర్ణాటక - 10 కి మీ అలమెట్టి R S షోలాపూర్ - హుబ్లి రైలు మార్గములో సూర్య నారాయణాలయం కలదు.

# పంచద్వారకలు (5)

## 1.ద్వారక

(ద్వారకాధీష్) పంచ ద్వారలలో నొకటి గుజరాత్ రాష్ట్రమున ఓఖా పోర్టునకు 32 కి మీ దూరములో ద్వారక క్షేత్రము కలదు అహ్మదాబాద్ నుండి 335 కి మీ
ఇక్కడ వున్న శ్రీకృష్ణుని "ద్వారకా ధీష్" యని, మందిరమును "జగత్ మందిర"మని పిలుతురు నెమలి పింఛముతో ఉన్న నల్లని విగ్రహము చేత పిల్లనగ్రోవితో నాట్య భంగిమలో నిలబడి ఉన్న శ్రీకృష్ణమూర్తి దర్శనము

చాలా పెద్ద దేవాలయము మధుర నుండి, బృందావనము నుండి తరలివచ్చి ఇచ్చట నివాసమేర్పరచుకొనినట్లు పురాణ గాధ ఇచ్చటి నుండి కూడ జరాసంధాది రాక్షసుల భయము వలన శ్రీకృష్ణుడు యాదవులతో సహా సముద్రములో నున్న 'బేట్ ద్వారక' అని పిలువబడే దీవికి పారిపోయి, అచ్చట నివాసమేర్పరచుకొనెను.

శ్రీకృష్ణ నిర్యాణానంతరము ఏడు దినములలో ద్వారక సముద్రములో కలసిపోవుటచే శ్రీకృష్ణుని మనుమడైన సాంబుడు ప్రస్తుత ద్వారకా నగరమును, ఆలయమును ఒక్క రాత్రిలో నిర్మించెనని ప్రతీతి. ఇచ్చట నున్న శ్రీ విగ్రహాన్ని వాయువు సహాయంతో బృహస్పతి (గురువు) గురవాయూర్‌లో ప్రతిష్ఠించెనట.

## 2. బేట్ ద్వారక

పంచ ద్వారకలలో రెండవది ఓఖా పోర్టు నుండి సముద్రములో 7 కి మీ దూరములో నున్న చిన్న దీవి శ్రీకృష్ణుడు ద్వారకను విడిచి వచ్చి ఇక్కడ ఉన్నట్లు పురాణ గాధ

ఓఖా పోర్టు నుండి చిన్న చిన్న మర పడవలపై ఈ దీవిని చేరవచ్చును సముద్రపు టలలు ఎక్కువగా నుండుటచే పడవ ప్రయాణము కొంచెము భయముగా నుండును.

ఇచ్చట శ్రీకృష్ణాలయము, రుక్మిణి, బలరాముని ఆలయములు కలవు శ్రీకృష్ణుని బంగారు విగ్రహము కూడ కలదు. రాత్రులందు ఈ దేవాలయములలో దీపములను వెలిగించి చిరుగంటల ధ్వనితో హారతి నిచ్చుట చూపరులకు నయనానందకముగా నుండును ప్రతిరోజు వేలాదిమంది భక్తులు ఈ దేవాలయమును దర్శింతురు

## 3. నాథ్ ద్వార

ఈ క్షేత్రమున ఉన్న శ్రీకృష్ణుని "శ్రీనాధ్ జీ" అని పిలుతురు. రాజస్థాన్ రాష్ట్రమున ఉదయపూర్‌నకు 50 కి.మీ. దూరమున కలదు. బస్సు మీద ప్రయాణము నేషనల్ హై వే నంబర్ - 8 నందు కలదు.

భారతదేశములోని అతి గొప్ప ధనవంతమైన దేవాలయములలో రెండవది ఉత్తర దేశమున మొదటిది. ఇచ్చటి విగ్రహము నల్లని రూపముతో చేత మురళి ధరించి మనోహరముగా నుండును. తిరుపతి క్షేత్రములో వలె ఇచ్చట విపరీతమైన భక్తుల రద్దీ కలదు భక్తులందరు భగవంతునకు అధిక మొత్తములో కానుక లర్పింతురు,

ఇచ్చట ప్రసాదము పంచదారతో తయారు చేయబడి రకరకముల తీపి పదార్థముగా నుండును. యాత్రీకులకు వసతి, భోజన సదుపాయములు కలవు స్వామివారి దర్శనము దఫ దఫాలుగా (ఏకధాటిగా గాక) జరుగుతుంది. గర్భగుడి రోజుకు పలుమార్లు మూసి, స్వామివార్ని నిద్రపుచ్చి, మరల లేపుతూ దర్శనమేర్పాట్లు చేస్తూంటారు స్వామివార్కి పగటినిద్ర (విశ్రాంతి) యిచ్చట ప్రత్యేకత.

## 4. కంక్రోళి

ఈ క్షేత్రము రాజస్థాన్ రాష్ట్రమున నాధ్ ద్వారకు 15 కి.మీ దూరమున ఉన్నది ఇచ్చట నున్న శ్రీకృష్ణుని విగ్రహమును "ద్వారాక ధీష్" అని పిలుతురు పంచ ద్వారకలలో నొకటి

ఇది చాల పెద్ద దేవాలయము పాల రాతితో నిర్మించబడినది ఇచ్చట కూడ భక్తులు ప్రతి దినము స్వామివారిని వేలాదిగా వచ్చి దర్శింతురు

## 5. డాకోర్ ద్వారక

ఈ క్షేత్రము పంచ ద్వారకలలో నొకటి గుజరాత్ రాష్ట్రమున కలదు అహ్మదాబాద్ నుండి 64 కి మీ. బస్సుపై వెళ్ళవలయును అహ్మదాబాద్‌కు వదోదరాకు మధ్యన కలదు

ఇచ్చట శ్రీకృష్ణుని "రణచోడ రాయుడ"ందురు విగ్రహమును ద్వారక నుండి తీసుకుని వచ్చి ఇచ్చట ప్రతిష్ఠించిరి. ఇది చాల పెద్ద దేవాలయము ప్రతి దినము వేలాది భక్తులతో కిక్కిరిసి యుండును పాలకోవా మొదలగు తీపి పదార్ధములు ఇచ్చట ప్రసాదములు స్వామివారి విగ్రహము అతి సుందరముగా నుండును దర్శనము మధురానుభూతి

# వృక్ష దేవతలు

భారతదేశములో ప్రకృతిలోని ప్రతి భాగము దైవముగా పూజింపబడుచున్నది. అందులో భాగముగా కొన్ని వృక్షరాజములు (మానవోపయోగ కారిగా) పూజలందుకొనుచున్నవి.

**1. శమీ వృక్షము :** విరాట్ పూర్ ప్రస్తుతము సుహాగ్‌పూర్ అని పిలువబడుచున్నది మధ్యప్రదేశ్. ఈ వృక్షముపై పాండవులు అజ్ఞాతవాసమునకు ముందు ఆయుధములు దాచినట్లుగా పురాణ గాథ 124 కి మీ కట్నీ రైల్వేజంక్షన్ జబ్బల్ పూర్‌నకు దగ్గరలో బాణగంగ నదీ తీరం అడవి ప్రాంతం ఆనాటి చెట్లన్నియు భూస్థాపితమై పోయినందున ఇప్పుడు బొగ్గుగనుల ప్రాంతమైనది కార్తీక మాసమునంతయు ఈ వృక్షమునకు పూజలు జరుగును. పాండవుల ఆయుధములను జాగ్రత్త పరచిన వృక్షముగా మాత్రమే గాక అర్జున విజయమునకు కూడ ఈ వృక్షము తోడ్పడినట్లు నమ్మిక

**2 కొన్నాయి వృక్షము :** శుచీంద్రం - తమిళనాడు 2000 ల సం॥ల పై వయస్సు గల పొన్నచెట్టు 13 కి మీ కన్యాకుమారి. స్థాణుమాలయ అని పిలువబడే శివ, విష్ణు మరియు బ్రహ్మ అంశ గల స్వామివారి దేవాలయములో పూర్వకాలమందు జయము పొంది తిరిగి వచ్చినవారి శిరస్సునకు ఈ చెట్టు ఆకుల మాలను చుట్టి గౌరవించు ఆచారముండెడిది దీని శాఖలు బాగా విస్తరించి ఉన్నవి "పొన్నాయడల్" అను విగ్రహము పై భాగముగా ఈ వృక్షమున్నది దీనికి సమీపాన 18'ల ఎత్తుగల ఏకరాతి హనుమంతుని శిలా విగ్రహమున్నది ఫలయార్ నదీ తీరం త్రిమూర్తులను అనసూయా దేవి పసిపాపలను చేసిన ఈ చెట్టును "అనసూయ చెట్టు" అని పిలుతురు

**3 జంబూక వృక్షం :** అల్లనేరేడు చెట్టు. జంబుకేశ్వరం - తమిళనాడు - 10 కి.మీ తిరుచినా పల్లి బ్రహ్మహత్యా పాతక నివారణ కోసం శివుడు ఈ జంబూక వృక్షం క్రింద తపస్సుచేసెనట స్వామివారు జంబుకేశ్వరుడు జల లింగము పంచ మహా భూత లింగములో నొకటి లింగం క్రింది నుండి నీరు ఊరుతూంటుంది అమ్మవారు అఖిలాండేశ్వరి.

**4 విదురాశ్వత్థ వృక్షం** - విదురునిచే నాటబడిన రావిచెట్టు కల్వార - కర్ణాటక 79 కి మీ బెంగుళూరు, 30 కి మీ హిందూపురం కావేరి, అర్కావతి నదుల సంగమ స్థానం మహాభారత గాధకు సంబంధించిన దేవాలయము లనేకము కలవు శివ గంగ క్షేత్రము మహా శిల్పి జక్కన పుట్టిన పవిత్ర స్థలము. టిప్పుసుల్తాన్ జన్మ స్థలము సోమేశ్వర, గణేశ్వర ఆలయములు కలవు అశ్వత్థ వృక్షము విష్ణు అంశ గలది. శని దృష్టి సంబంధితమైన కారణముగా శనివారం మిక్కిలి పూజనీయము. ఇతర రోజులలో తాకరాదు భూత, ప్రేత, పిశాచ రోగములు, సంతాన హీనతలు తొలగించును వృక్ష మూలభాగము బ్రహ్మ రూపమనియు, మధ్య భాగము విష్ణు రూపమనియు అగ్రభాగము శివ రూపమనియు భావన, కోరిన కోరికలు తీర్చు కల్ప వృక్షముగా పూజలందుకొనుచున్నది / శనిదోష నివారణ

**5. శిద్ధవట వృక్షము :** మధ్యప్రదేశ్- ఉజ్జయిని దగ్గర (మర్రిచెట్టు) 3 కి మీ షిప్రానది ఒడ్డున . సాందీపుని ఆశ్రమములో శ్రీకృష్ణుడు,సుధాముడు చదువుకున్న ప్రాంతము చాల పెద్ద వృక్షము. పురాతన కాలము నుండి ఉన్నది. పిల్లలు లేనివారు ఆవు పేడతో "ఓం" అని చెట్టు మొదట్లో వ్రాస్తే పిల్లలు పుడతారని నమ్మిక. ఇచ్చట పెద్దలకు పిండ ప్రదానాలు చేయు ఆచారము కలదు. చెట్టు మొదట్లో "అనాది కపిలేశ్వర" అనే శివ లింగం ప్రతిష్ఠితమై యున్నది. లింగము క్రమ క్రమముగా భూమిలోనికి దిగిపోతూ ఉన్నది. బద్రీనాధ్ యాత్రీకులు దర్శించవలసిన శైవ క్షేత్రముగా ప్రసిద్ధి.

**6. అడయార్ మర్రి చెట్టు** : తమిళనాడు - మద్రాసు నగరమున కొనుకొని ప్రపంచములోని అతి పెద్ద మర్రి చెట్లలో ఒకటిగా భావించబడుచున్నది అడయార్ నదీ తీరం. 40,000 చదరపు అడుగుల పర్యంతరం విస్తరించబడియున్నది దివ్య జ్ఞాన సమాజం ఈ చెట్టు క్రింద స్థాపించబడినది. బుద్ధుని బోధనలకు అనుగుణంగా ఇచ్చట పురాతన విగ్రహములు గలవు. పురాతన తాళపత్ర గ్రంధాలు, చేతితో వ్రాయబడిన పాత ఫర్మానాలు లభించును.

దివ్యజ్ఞాన సమాజమును, డా॥అన్నేబిసెంట్ మరియు కొలెనెల్ వోల్‌కార్ట్ స్థాపించిరి ఇచ్చట వారి సమాధులు చూడనగును.

**7. కల్పవట వృక్షం** : పూరీ . ఒరిస్సా (వటవృక్షం)

జగన్నాధ ఆలయ ముఖ మండపానికి ఎదురుగా చాల పురాతన వృక్ష రాజము మహా ప్రళయ కాలములో శ్రీ మహావిష్ణువు పసివాని రూపములో చెట్టు ఆకుపై తేలియాడునని

పురాణ గాధ. మార్కండేయ మహర్షికి ఈ ఆకుపై మహావిష్ణువు బాల కృష్ణుడుగా దర్శనమిస్తాడుట. వృక్షమునకు ఒక వైపున శ్రీ నరసింహస్వామివారు, వేరొక వైపున శ్రీ జగన్నాధ స్వామివారు వేంచేసియున్నారు క్షేత్ర పాలకుడైన పరమేశ్వరుడు సతీ సమేతముగా కనిపించుచున్నాడు ఇది కోర్కెలుతీర్చు కల్ప వృక్షము సంతాన ప్రదాయిని ఈ వృక్షము క్రింద 1,2 నిమిషాలు నిలువబడి భక్తులు తమ తమ కోర్కెలను మనస్సులో వెల్లడించుకుంటారు ఈ వృక్షము క్రింద ఎలుక వాహనుడైన గణేశుని విగ్రహమున్నది. చెట్టు మొదట్లో ప్రమిదలతో దీపారాధన చేసి ప్రదక్షిణములు చేయుదురు.

**8. మహాబోధి వృక్షం** : సారనాధ్ - ఉత్తరప్రదేశ్ (రావిచెట్టు) 11 కి మీ. కాశీ. ఈ చెట్టు క్రింద బుద్ధుడు దివ్యత్వము నొందెను. శ్రీలంకలోని అనురాధపురం నుండి తీసుకుని వచ్చి సారనాధ్‌లో నాటబడినది

బీహారు రాష్ట్రములోని గయ నుండి బుద్ధగయ 11 కి.మీ. దూరం. సారనాధ్‌లోని మహాబోధి వృక్షము క్రింద బుద్ధత్వము పొందిన గౌతముడు బుద్ధగయ నుండి తన బోధలు ప్రారంభించెను అచ్చట నుండియే సిద్ధార్ధునకు బుద్ధ నామధేయము కలిగినది. ఈ చెట్టుకు మహాబోధి వృక్షమని పేరు వచ్చినది.

**9. ఆకులు ముడుచుకొనని చింతచెట్టు** : తమిళనాడు - 'ఆళ్వారు తిరునగరి' అనే ఊరులో, 35 కి మీ. తిరుచందూర్ - తామ్రపర్ణి నదీ తీరం అధినాధ స్వామి, నమ్మాళ్వారుల దేవాలయములు కలవు. నమ్మాళ్వారు అనే మహాభక్తుడు తన చిన్నతనములో ఈ చెట్టు తొర్రలో ప్రవేశించి 12 సం॥లు ధ్యాన నిమగ్నుడైయుండి తమిళ వేదమును ధారాళముగా పద్య రూపమున శ్రీమహా విష్ణువును స్తుతించుచూ చెప్పెను

ఈ చెట్టు చుట్టూ 4 గజముల ఎత్తు వరకు మూసివేసి వేదికను నిర్మించిరి. స్వామివారిని నిత్యము ఈ చెట్టు క్రింది వేదికపైకి తెచ్చి అర్చించెదరు. 7 కొమ్మలు కలిగి చాల పురాతనమైన చెట్టుగా కనిపించును. వింత ఏమనగా - రాత్రులందు ఇతర చింతచెట్లవలె దీని ఆకులు ముడుచుకొనవు. ఈ చెట్టు కాయలు పండవు. ఎవరూ కోయరు. దీని బెరడు, ఆకులు ప్రసాదము పూర్వము దీని కొమ్మలు నరికిన చీము, రక్తము వచ్చెడిదని ప్రతీతి

**10. కంచిలోని మామిడి చెట్టు** : తమిళనాడు - కాంచీపురము

ఈ చెట్టుక్రింద తపస్సుచేసి కామాక్షి దేవి ఏకామ్రనాధ స్వామివారిని ప్రసన్నుని చేసుకొన్నది. పంపా నదీ తీరము. నదికి వరదలు వచ్చి లింగము కొట్టుకుని పోతూంటే

అమ్మవారు తన గుండెతో లింగాన్ని అదిమిపట్టి గట్టిగా నొక్కి పట్టుకుని, కొట్టుకుని పోకుండా ఆపినదట. ఆమె భక్తికి సంతసించి శివుడామెను కరుణించి వివాహమాడెను

ఈ చెట్టు చుట్టూ 108 శివ లింగములున్నవి. ఈ చెట్టునకున్న ప్రతిఆకు వేరొక ఆకుతో సరిచూచిన ఆకారములో వేరుగా నుండును అదే విధముగా ఈ చెట్టునకు కాచిన పండ్లు ఇంకొక పండుతో పోల్చిన రుచిలో తేడాయుండును అనగా ఒక ఆకునకు ఇంకొక ఆకునకు ఆకారమునందును, ఈ చెట్టునకే కాచిన ఒక పండునకు వేరొక పండునకు రుచిలో తేడాయుండును మహత్తర శక్తిగల వృక్షరాజము సంతాన ప్రాప్తి కొరకు దారములు, ఊయలలు కట్టి ఈ చెట్టును పూజింతురు

**11. అక్షయ వటం (మర్రిచెట్టు)** ఉత్తరప్రదేశ్ - అల్హాబాద్ - ప్రయాగ క్షేత్రం - త్రివేణీ సంగమం - అక్బర్ కోటకు ప్రక్కన పాతాళపురిలో ఈ వృక్షము కొన్నివేల సం॥ నుండి ఉన్నది త్రివేణీ సంగమములో స్నానమాచరించి ఈ చెట్టుక్రింద విశ్రమించిన పుణ్యప్రాప్తి కలుగును. ఇచ్చట అనేక దేవతా విగ్రహములు ప్రతిష్ఠితములై యున్నవి. పూర్వకాలం ఈ చెట్టు ఎక్కి ప్రక్కనున్న గంగానదిలోనికి దూకి చనిపోయిన స్వర్గప్రాప్తియని నమ్మెడివారు

ఈ చెట్టును ఎన్నోసార్లు పీకివేసిరి. అయిననూ మరల చిగురించినది ఎంత ప్రయత్నించి నాశనము చేయదలిచినను వృక్షము మొలకెత్తుచునే ఉన్నది వృక్షమును సమూలముగా నరికి సీసముపోసి దగ్ధము చేయదలిచినా మరల చిగురించిన దేవతా వృక్షము నాశనము లేనిది అక్షయ వట వృక్షమని నామము పొందినది

**12. కల్పతరు వృక్షము (దేవతా వృక్షము)** రాజస్థాన్ లోదుర్వ గ్రామం 17 కి మీ జైసల్మీర్. జోధపూర్ నుండి రైలు సర్వీసు కలదు కోరిన వస్తువులు, వరాలు ఇచ్చే మహిమలు గల వృక్షము. ఇచ్చట శిలాతోరణం రాతితో చెక్కబడినది. చాల గొప్ప పనితనము. ఎడారి వ్యాపిస్తూ నీరులేకుండా బాధపడుతూ ఉండగా ఈ వృక్షాన్ని స్థాపించి నీటి-వసతిని పొందారట ఆ వృక్షము ఇప్పుడు రాతితో కనిపిస్తూ ఉన్నది

**13. అక్షయ వటం (మర్రిచెట్టు)** · బీహార్ - గయాక్షేత్రము, 92 కి మీ. పాట్నా. నిరంజన, ఫల్గుణా నదుల సంగమ స్థానం దైవాంశ గల మర్రిచెట్టుగా భావించి పూజలు చేయుదురు పిండ ప్రదానములు జరుగును విష్ణుపాద దేవాలయం నిర్మించబడియున్నది. ఈ ఆలయములో వెలసిన వృక్షమును మహా మహిమాన్వితమైనదిగా తలతురు

**14. పిల్లల మర్రి (మర్రిచెట్టు)** : ఆంధ్రప్రదేశ్ - మహబూబ్ నగర్ - మహబూబ్‌నగర్ జిల్లా.

ఈ వృక్షము చాలా పెద్దది. అల్లాఉద్దీన్ ఖిల్జీ తన దక్షిణ యాత్రలో అతని సైనికులు 5,000 మంది ఈ చెట్టుక్రింద విశ్రమించిరట. అంతేగాక సైన్యంతోబాటు వచ్చిన గుర్రాలు, ఏనుగులు, రథాలు మున్నగు సరంజామా అంతా దీనిక్రిందే విశ్రాంతి తీసుకున్నవట. మద్రాస్, కలకత్తా మర్రిచెట్ల కన్న ఈ చెట్టు చాలా పెద్దది. ఈ చెట్టు క్రిందనున్న పుణ్యస్థలమునకు "త్రికూటాలయం" అని పేరు. కామేశ్వర, కాచేశ్వర, నామేశ్వర లింగములు ప్రతిష్ఠితములై యున్నవి, నమ్మకం గలవారి కోరికలు తీర్చు మహిమగల మర్రిచెట్టు. ఈ వృక్షాన్ని పూజించి చాలమంది సంతానవతులైన దాఖలాలున్నవి. దీని ప్రక్కనే లేళ్ళ పార్కు ఉన్నది.

**15. గూటిబయలు మర్రి** : ఆంధ్రప్రదేశ్ - మదనపల్లి - కదిరి మార్గములో తనకల్లు సమీపాన గల పెద్ద మర్రిచెట్టు. 120 కి.మీ. అనంతపురం, 27 కి.మీ. కదిరి. మద్రాసులోని అడయారు మర్రిచెట్టు కన్నా. కలకత్తాలోని బొటానికల్ గార్డెన్స్‌లోని చెట్టుకన్నా పెద్దది. దీనినే "తిమ్మమ్మ" మర్రిమాను అని పిలుస్తారు. చెట్టు క్రింది భాగమున వెలసిన తిమ్మమ్మ శక్తి విగ్రహానికి పూజలు జరుగుచున్నవి. ప్రపంచములోని అతిపెద్ద మర్రిచెట్టుగా "గిన్నిస్ బుక్ ఆఫ్ వరల్డ్ రికార్డ్సు" లో నమోదు చేయబడినది.

**16. అక్షయవట వృక్షం (మర్రిచెట్టు)** : హర్యానా - కురుక్షేత్రం

గీతోపదేశానికి సాక్షీభూతముగా యుగ యుగాలనుండి నిలచిన వృక్షరాజము. ఈ వృక్షము క్రింద భక్తులు గీతా పఠనం, ధ్యానం వగైరా చేస్తుంటారు. ప్రతి సంవత్సరం మార్గశిర అమావాస్యకు గొప్ప ఉత్సవములు జరుగుతవి. గ్రహణ సమయములలో లక్షలాదిమంది దగ్గరలోనున్న కురుక్షేత్ర సరస్సులో స్నానమాచరించి ఈ చెట్టును పూజిస్తారు. కర్ణుడు ఈ చెట్టుక్రిందనే కూర్చుని పర్వదినములలో దానము చేసెడివాడట ఈ సరస్సునే భీష్ముని దాహము తీర్చుటకు అర్జునుడు పైకి తెచ్చిన గంగగా భావిస్తారు.

**17. రావిచెట్టుతో కలసి ఉన్న పెద్ద మర్రిచెట్టు** : పశ్చిమ బెంగాల్ - కలకత్తాలోని బొటానికల్ గార్డెన్స్‌లో నున్నది రావి, మర్రి చెట్లు పెనవేసుకుని పెరిగియున్నవి. 270 ఎకరముల స్థలములో 88' ఎత్తు, 1200' వైశాల్యము కలది. 600 ఊడలు కలవు. దేశములోని పెద్ద వృక్షములలో నొకటిగా భావించబడుచున్నది ఊడలు స్తంభాలు మాదిరిగా పెరిగిన విశాలమైన వృక్షము భక్తులందరు ఈ వృక్ష మూలమును పూజించుచున్నారు.

**18. చాల పురాతన మఱ్రిచెట్టు** : గోవాలోని కుషావతి నదీ తీరం పార్తగలి గ్రామపెనందలి తపస్య క్షేత్రములో వెలసిన పెద్ద చెట్టు ఇచ్చట గౌడ సారస్వత బ్రాహ్మణ వైష్ణవ మఠం కలదు ఈ వట వృక్షం మొదట ఈశ్వర లింగం ప్రతిష్ఠించబడియున్నది. ఈ క్షేత్రానికి బ్రహ్మస్థానమని పేరు. పార్తగలి గ్రామం చౌడి పట్టణానికి 40 కి మీ దూరమున ఉన్నది ఈ వృక్షం 200 మీటర్ల విశాలం. 220 ఊడలు కల్గిన అతిపెద్ద వట వృక్షము. ఈ వృక్షము పూజనీయమే గాకుండా తపస్సుకు అనువైనది.

**19. మద్ది చెట్టు** : బుద్ధుడు నిర్యాణము చెందిన చెట్టు. ఉత్తరప్రదేశ్ - కుషీ నగర్ లేక కాశియా అను చోట కలదు. 55 కి మీ గోరఖ్‌పూర్. బౌద్ధ విహారాలు, స్తూపాలు, దేవాలయములున్నవి. ఇచ్చట మహా పరినిర్వాణ స్తూపము కలదు. బుద్ధుని విగ్రహములు గలవు. బౌద్ధ మతస్తులకే గాక ఇతర మతస్తులకు కూడ పూజనీయమై వెలసియున్నది.

**20. త్రిపాల వృక్షము** : జువ్వి, మేడి, రావి వృక్షములు (**ప్లక్ష, శాకంబర, అశ్వత్థ** వృక్షములు) పెనవేసుకుని ఒకటిగా పెరిగిన మహా పురాణ వృక్షము

ఆంధ్రప్రదేశ్ - శ్రీశైలం - కర్నూలు జిల్లా - శైవ క్షేత్రం. ఈ వృక్షము యొక్క గొప్పతనము అనేక పురాణములలో కన్పిస్తున్నది గాన అతి పురాతనమైనది. శ్రీశైల క్షేత్రములోని వృద్ధ మల్లికార్జునాలయానికి ప్రక్కన ఉన్నది. "దత్తాత్రేయ" వృక్షముగా పేరు వచ్చినది.

**21. కల్ప వృక్షం** : ఉత్తరప్రదేశ్ - జోషీ మఠ్.

బదరీనాథ్‌కు పోవు త్రోవలో వెలసిన మఱ్రిచెట్టు. 2,400 సంవత్సరముల పురాతన వృక్షము. శ్రీ ఆదిశంకరాచార్యుల వారి పూజలందుకొనినది. వృక్షానికి మొదట్లో నారసింహ, దుర్గాలయములు కలవు.

**22. వన్ని వృక్షం** : తమిళనాడు - వేదారణ్యం - 50 కి మీ. మన్నార్ గుడి - తంజావూరు జిల్లా. ఈ వృక్షమును దేవతా వృక్షముగా భావింతురు. ఈ వృక్షము క్రిందనే శివలింగ స్థాపనచేసి లంకలోని రాక్షస మృతవీరుల ఆత్మక్షోభల నుండి శ్రీరామ చంద్రుడు విముక్తుడైనాడు. ఈ చెట్టు క్రిందనే విశ్వామిత్రుడు "బ్రహ్మర్షి" అయ్యెను త్రిశంకుడు స్వర్గం పొందినది ఇచ్చటనే. యాజ్ఞవల్క్యుడు యోగులు, ఋషులు వగైరా మోక్షము పొందిన దిచ్చటనే. ఈ పవిత్ర వృక్షము క్రింద చేసిన పూజలు సత్ఫలితముల నిచ్చి కోర్కెలు సిద్ధిస్తాయి. ఇచ్చట వేంచేసిన స్వామివారు వేదనాయక స్వామి అమ్మవారు వేదనాయకి.

# సుప్రసిద్ధ అష్ట వినాయకాలయములు

**(మానవులచే చెక్కబడని మూర్తులు)**

**(ఇవన్నియు మహారాష్ట్రంలోనే ఉన్నవి.)**

| | | | |
|---|---|---|---|
| 1. | శ్రీ వినాయక | | మధ్<br>80 కి.మీ. పూనే<br>20 కి.మీ ఖండాల R S ,<br>90 కి.మీ ముంబాయి. |
| 2 | మహాగణపతి | . | రంజన్ గామ్, 53 కి మీ. పూనే |
| 3. | శ్రీ విఘ్నేశ్వర్<br>(విఘ్నహర్త) | | ఓజర్, 19 కి.మీ షివనేరి<br>93 కి మీ. పూనే |
| 4 | శ్రీసిద్ధి వినాయక | | సిద్ధాటెక్; 100 కి.మీ పూనే<br>అహ్మద్‌నగర్ జిల్లా |
| 5. | చింతామణి వినాయక్ | . | తేపూర్, 25 కి.మీ. పూనే |
| 6. | శ్రీ బల్లాలేశ్వర్ | : | పాలి, 111 కి.మీ. పూనే<br>38 కి.మీ. కోపలి R.S |
| 7. | మోరేశ్వర్<br>కరహానదీతీరం | : | మోరేగామ్, 60 కి.మీ పూనే<br>25 కి.మీ. కెడగామ్R.S, 17 కి.మీ.<br>జెజూరిR.S. |
| 8. | శ్రీగిరిజాత్మక్ | : | లెనియాద్రి, 75 కి.మీ. పూనే<br>8 కి.మీ. From జున్నార్ నడక |

ప్రాగ్జ్యోతిష పురమైన గౌహతిలో (అస్సాం) బ్రహ్మపుత్రా నదీ తీరమున పాండు అనే గ్రామములో పంచపాండవులచే ప్రతిష్ఠించబడిన "పంచ వినాయకుల" విగ్రహములున్నవి.

## అష్ట గణపతులు

1. లక్ష్మీ గణపతి 2 క్షిప్ర గణపతి 3. సిద్ధి గణపతి 4 చింతామణి గణపతి
5 ఉచ్ఛిష్ట గణపతి 6 ఏకాక్షర గణపతి 7. కుమార గణపతి 8. శక్తి గణపతి

మోరేగామ్ (మహారాష్ట్ర) వినాయకాలయంలో ఎనిమిది మూలల వెలసిన అష్ట గణపతులు

1 వక్రతుండ గణపతి 2. వికట గణపతి 3 హేరంబ గణపతి
4 బాల చంద్ర గణపతి 5 చింతామణి గణపతి 6 సిద్ధి వినాయక గణపతి
7 లంబోదర గణపతి 8. ధూమ్రవర్ణ గణపతి (మహోదర)

## గణేశ స్తోత్రములోని 12 గణపతులు

| | | |
|---|---|---|
| 1. వక్రతుండ | 2. ఏకదంష్ట్ర | 3 కృష్ణ పింగాక్ష |
| 4. గజవక్త్ర | 5 లంబోదర | 6 వికట |
| 7 విఘ్నరాజ | 8 ధూమ్రవర్ణ | 9 బాలచంద్ర |
| 10 వినాయక | 11 గణపతి | 12.గజానన |

## శివ పురాణములో కనిపించు గణపతుల పేర్లు

| | | |
|---|---|---|
| 1. ఏకదంత గణపతి | 2. లంబోదర | 3. నింబ |
| 4 భద్ర | 5. రక్తవర్ణ | 6 విష్ణు |
| 7. సర్వాంబర | 8 సిద్ధి | 9 సువర్ణ |
| 10. ధూమ్ర | 11. వక్రతుండ | 12. బాలచంద్ర |
| 13 నిర్విఘ్న | 14. లక్ష్మీ గణపతి | 15. కృష్ణ |
| 16 చింతామణి | 17. వికట | 18. శుక్ల |
| 19 లక్ష్మీప్రద | 20 ఋణ విమోచన | |

ఇంకా కొంతమంది గణపతులు వివిధ నామధేయములతో పూజింపబడుచున్నారు

## శివ పురాణములో కనిపించు విఘ్నేశ్వరుని భార్యల పేర్లు

| | | |
|---|---|---|
| 1. సిద్ధి | 2 సిద్ధి విద్య | 3 సిద్ధి బుద్ధి |
| 4. సిద్ధి లక్ష్మి | 5 జయలక్ష్మి | 6. విజయలక్ష్మి |
| 7 బుద్ధి లక్ష్మి | 8 వరలక్ష్మి | 9. సౌభాగ్యలక్ష్మి |
| 10 ప్రజ్ఞాదేవి | 11 అతిప్రజ్ఞాదేవి | 12. సంహారదేవి |
| 13. సువర్ణదేవి | 14 శాంతాదేవి | 15. రజత దేవి |
| 16. జ్ఞానదేవి | 17 లోకమాత | 18 నవరత్న లక్ష్మి |
| 19 పద్మాదేవి | 20 చంద్రముఖి | |

విఘ్నేశ్వరుని భార్యలు ఇంకా కొన్ని పేర్లతో కొలువబడుచున్నారు.

## 21 ప్రధాన గణపతి క్షేత్రములు

| | | |
|---|---|---|
| 1 మయూరేశ క్షేత్రం | 2 ఓంకార గణపతి | 3 ఢుండిరాజ |
| 4. చింతామణి | 5 శమీ విఘ్నేశ్వర | 6 భల్లాల వినాయక |
| 7 మంగళమూర్తి | 8 బాలచంద్ర గణేశ | 9 విజ్ఞాన గణేశ |
| 10 దేవూర్ | 11 సిద్ధాశ్రమ | 12. మణిపూర్ |
| 13 విజయపూర్ | 14 కశ్యప | 15 జలేష్ పూర్ |
| 16 లోహ్యాద్రి | 17 ఏలాపూర్ | 18. పద్మాలయ |
| 19 అమలాశ్రమ | 20 రాజసదన్ | 21 శ్వేత విఘ్నేశ్వరక్షేత్రం. |

## గణేశునికి గల ప్రముఖ ద్వాదశ నామములు

| | | |
|---|---|---|
| 1. సుముఖ గణేష్ | 2. ఏకదంత | 3. కపిల |
| 4. గజకర్ణ | 5 లంబోదర | 6 వికట |
| 7. విఘ్ననాశన | 8 ధూమ్రకేతు | 9. గణాధ్యక్ష |
| 10 బాలచంద్ర | 11 వినాయక | 12. గజానన |

## గణేశుని ఎనిమిది అవతారములు

| | | |
|---|---|---|
| 1. వక్రతుండ | 2. ఏకదంత | 3. మహోదర |
| 4. గజానన | 5. లంబోదర | 6. వికట |
| 7. వింధ్యరాజ | 8. ధూమ్రవర్ణ | |

## శ్రీ తత్వ నిధి గ్రంథము ప్రకారము కనిపించు గణపతులు

| | భుజములు | | భుజములు |
|---|---|---|---|
| 1. బాలగణపతి | 4 | 2 భక్త | 4 |
| 3. శక్తి | 4 | 4. ద్విజ | 4 |
| 5. సిద్ధి | 4 | 6. ఉచ్ఛిష్ట | 4 |
| 7 క్షిప్ర | 4 | 8. విజయ | 4 |
| 9. నృత్య | 4 | 10. ఏకాక్షర | 4 |
| 11. వర | 4 | 12. త్రక్షర | 4 |
| 13. హరిద్ర | 4 | 14. ఏకదంత | 4 |
| 15. సృష్టి | 4 | 16. ఋణమోచన | 4 |
| 17. ఢుండి | 4 | 18. ద్విముఖ | 4 |
| 19. యోగ | 4 | 20. సంకటహరణ | 4 |
| 21. ఊర్ధ్వ | 6 | 22. క్షిప్ర ప్రసాద | 6 |
| 23. త్రిముఖ | 6 | 24. తరుణ | 8 |
| 25. హేరంబ | 8 | 26. సింహ | 8 |
| 27. దుర్గ | 8 | 28. వీర | 10 |
| 29. వింధ్య | 10 | 30. లక్ష్మి | 10 |
| 31. మహా | 10 | 32. ఉద్దండ | 12 |

## కాశీలోని వినాయక క్షేత్రములు (56)

| | | | |
|---|---|---|---|
| 1. అర్క | 2. దుర్గ | 3 భీమచండ | 4. దేహాలి |
| 5. ఉద్దండ | 6. పాశపాణి | 7 సర్వ | 8 సిద్ధి |
| 9 లంబోదర | 10. కూటదంత | 11 శ్యాలకటంగ | 12 కూష్మాండ |
| 13. ముండ | 14. వికటదంత | 15 రాజపుత్ర | 16 ప్రణవ |
| 17. వక్రతుండ | 18. ఏకదంత | 19 త్రిముఖ | 20 పంచాశ్వ |
| 21. హేరంబ | 22. వింధ్యరాజ | 23. వరద | 24. మోదక |
| 25. అభయ | 26. సింహతుండ | 27. కూనితాక్ష | 28 క్షిప్రప్రసాద |
| 29. చింతామణి | 30. దంతహస్త | 31 పిఛిండల | 32 ఉద్దండముండ |
| 33. స్థూలదంత | 34. కలిప్రియ | 35. చతుర్దంత | 36. ద్వితుండ |
| 37. జ్యేష్ట | 38. గజ | 39 కాళ | 40 నాగేష్ |
| 41. మణికర్ణ | 42. ఆశ | 43. సృష్టి | 44 యజ్ఞ |
| 45. గజకర్ణ | 46. చిత్రగంట | 47. స్థూలజంఘ | 48. మంగళ |
| 49. మోద | 50. ప్రమోద | 51 సుముఖ | 52. దుర్ముఖ |
| 53. గణనాధ | 54. జ్ఞాన | 55. ద్వార | 56. అవిముక్త |

## హిమాలయములలోని "చార్‌ధామ్"

1. యమునోత్రి : యమునానది పుట్టిన చోటు. ఉత్తరప్రదేశ్
2. గంగోత్రి : గంగానది పుట్టినచోటు. ఉత్తరప్రదేశ్
3. బదరీనాథ్ : బదరీనారాయణాలయం. (వైష్ణవక్షేత్రం) ఉత్తరప్రదేశ్
4. కేదార్‌నాథ్ : కేదారేశ్వరాలయం. (శైవక్షేత్రం) ఉత్తరప్రదేశ్

## స్త్రీలకు ప్రవేశార్హత లేని ఆలయములు

1. విష్ణుమూర్తి . తిరునల్లాయి (కేరళ)
వైక్కం దగ్గర

అరాన్‌ములకు సమీపాన. ఇచ్చట గర్భగుడిలోనికి స్త్రీలను అనుమతించరు. ఇది వైష్ణవ క్షేత్రం అయినా ఇచ్చట విభూతి వాడుట ప్రత్యేకత.

2 అయ్యప్ప స్వామి "సన్నిధానం" — శబరి మల (కేరళ)

పంపానది నుండి 7 కి.మీ. దూరములో ఎత్తైన కొండమీద గల క్షేత్రము స్వామివారు బ్రహ్మచారి. రజస్వల అయిన, బహిష్టులు ఆగని స్త్రీలకు ప్రవేశార్హత లేదు.

3. విమలాదేవి : పూరీ (ఒరిస్సా)

బంగాళాఖాత తీరం. శక్తి ఉపాసకులకు ముఖ్య కేంద్రం సంవత్సరములో కొన్నో రోజులు స్త్రీలకు ప్రవేశం నిషిద్ధం. అమ్మవారి "నాభి" పడిన ప్రదేశం

4. షింగణాపూర్ : మహారాష్ట్ర

అహమ్మద్‌నగర్ జిల్లా. 30 కి.మీ. అహ్మద్‌నగర్

శనీశ్వరుడు లింగాకారుడు. లింగాన్ని చుట్టూవున్న గట్టుపైకి స్త్రీలకు ప్రవేశార్హత లేదు.

## సుప్రసిద్ధ సుబ్రహ్మణ్య క్షేత్రములు (6)

## (ఈ ఆరును తమిళనాడులోనే గలవు)

1. పఝముదరి సోలై : 21 కి.మీ. మధురై
   4 కి.మీ. అలఘర కోయిల్
2. తిరుచందూర్ : 99 కి మీ. కన్యాకుమారి
   బంగాళాఖాత సముద్ర తీరము — 40 కి.మీ. తిరునల్వేలి
3. స్వామి మలై : 6 కి.మీ కుంభకోణం
   కావేరి నదీతీరం — తంజావూరు జిల్లా

స్వామివారిని స్వామినాధ స్వామి అని పిలుస్తారు. స్వామివారి నుండి శివుడు ప్రణవ మంత్రం తెలుసుకున్న పుణ్య ప్రదేశం.

4. తిరుప్పర కుండ్రం : 8 కి.మీ. మధురై
   దేవేంద్రుని కుమార్తె దేవయానిని వివాహమాడిన చోటు.
5. ఫళణి . 122 కి మీ. మధురై
   దండాయుధ పాణి — శివగిరి కొండపై
6. తిరుత్తణి — 82 కి.మీ. మద్రాసు
   కార్తికేయన్ — 62 కి.మీ. తిరుపతి
   42 కి మీ. కంచి

## పంచబదరీలు (5)

### (చమోలి జిల్లా-ఉత్తరాఖండ్)

1 బదరీ నాధ్ . విషాల్ బదరి - బదరికాశ్రమ ధామ్
"జై బదరి విషాల్ కి"

2. యోగ ధ్యాన బదరి ధ్యాన బదరి - పాండుకేశ్వర్
పాండురాజు ఆఖరు రోజులలో ధ్యానం చేసిన యోగభూమి. 24 కి.మీ బదరీనాధ్, 20 కి.మీ. జోషీమర్.

3. భవిష్యబదరి . తపోవన లోయలో, 17 కి.మీ. జోషీమర్.

4. వృద్ధబదరి : ఆనీమద్‌లో ఉన్నది 17 కి.మీ. జోషీమర్.
(పుషీమర్) 4 కి.మీ కుమార చట్టి
పిపాల్ కోట్‌కి పోవు త్రోవలో శంకరాచార్యులచే పూజించబడినది.

5. ఆది బదరి . ఉరగమ్ గ్రామం 16 కి.మీ. కర్ణ ప్రయాగ

(నల్లని విష్ణుమూర్తి విగ్రహం) 10 కి.మీ. కుమార చట్టి. రేనీఖేట్ రోడ్డులో. దీనిని 'ధ్యాన బదరి" అని కూడా పిలుతురు. ఇచ్చట చాల దేవాలయములున్నవి. శ్రీ శంకరాచార్యుల వారు టిబెట్‌లోని దులింగ్‌మర్ నుండి బదరీ నారాయణ విగ్రహాన్ని తీసుకొని వచ్చి ఇచ్చట ప్రతిష్ఠించిరట.

## ఇంకా రెండు బదరీలు కూడా కలవు

1 నరసింహ బదరి - జోషీమర్ - ఉత్తరప్రదేశ్.
ఉగ్రనరసింహ మూర్తి. బదరీనాధ్‌కు వెళ్ళు త్రోవలో.

2. ఆది బదరి - కైలాస పర్వతానికి పోవు మార్గములో.

## పంచకేదారములు (5)

### (చమోలి జిల్లా-ఉత్తరాఖండ్)

మహిష రూప శివుని 5 శరీర భాగాలు ఆరాధింపబడు చోట్లు.

1. కేదార్ నాధ్ : ప్రధమకేదారం - పంచపాండవులచే నిర్మించబడినది.
మహిషతోక భాగం. శివుడు పశు రూపములో నున్న నూపురం

2 మధ్ మహేశ్వర్ . ద్వితీయ కేదారం - 30 కి.మీ గుప్తకాశి
20కి.మీ. ఊఖీమర్ - మహిషరూప శివుని నాభి భాగం

3 తుంగనాధ్ తృతీయ కేదారం - 30 కి.మీ. ఊఖీమర్,

5 కి మీ చోప్టా.50 కి మీ కేదారనాథ్. మహిషం యొక్క ముంగాళ్ళు (బాహువులు) పూజింపబడు స్థలం (శివుని ఆయుధములు)

4. రుద్రనాథ్ . చతుర్ధ కేదారం - 20 కి.మీ గోపేశ్వర్, వైతరణీ నదీ తీరం (శివుని ముఖం పూజింపబడు స్థలము)

5. కల్పేశ్వర్ పంచమ కేదారం - 14 కి.మీ. జోషీమఠ్- గుహాలయం (శివుని శిరోజములు పూజింపబడు స్థలము) (మహిష జటరూపం)

## పంచ ప్రయాగలు (5)

## (ఉత్తరప్రదేశ్ లోనే ఉన్నవి)

| | | | |
|---|---|---|---|
| 1. | దేవ ప్రయాగ<br>అలకనంద+ భగీరధి<br>నదీసంగమం | . | ఋషీకేశ్ దాటిన తరువాత<br>కీర్తినగర్ చేరేముందు |
| 2. | రుద్ర ప్రయాగ<br>అలకనంద+మందాకిని<br>నదీ సంగమస్థానం | : | ఇక్కడి నుండి కేదార్‌నాథ్‌కు,<br>బదరీనాథ్‌లకు మార్గములు<br>చీలును. |
| 3. | కర్ణ ప్రయాగ<br>అలకనంద+కర్ణగంగ<br>నదీసంగమస్థానం | : | రుద్ర ప్రయాగకు,<br>నంద ప్రయాగకు మధ్యలో |
| 4. | నంద ప్రయాగ<br>అలకనంద + నందగంగా<br>నదీ (పిండారి నది)<br>సంగమ స్థానం | : | కర్ణ ప్రయాగ దాటి<br>ఛమోలి చేరే ముందు |
| 5. | విష్ణు ప్రయాగ<br>అలకనంద+విష్ణుగంగా<br>నదీ సంగమ స్థానం | : | జోషీమఠ్ దాటిన<br>తరువాత గోవింద ఘాట్‌కు<br>వెళ్ళే ముందు |

## ఇంకా ఇతర ప్రముఖ ప్రయాగ క్షేత్రములు

| | | | |
|---|---|---|---|
| 1. | సోన ప్రయాగ<br>అలకనంద+సోనిగంగ<br>నదీ సంగమ స్థానం | : | కేదారనాథ్ రూట్‌లో |
| 2. | కేశవ ప్రయాగ<br>అలకనంద+సరస్వతి<br>నదుల సంగమం | . | 8 కి.మీ. బద్రినాధ్<br>చమోలి జిల్లా |

## పంచ గోకర్ణనాథ్ క్షేత్రములు (5)

### (శివుని ఆత్మ లింగములు - అన్నీ ఉత్తరప్రదేశ్‌లోనే)

| | | | | |
|---|---|---|---|---|
| 1. | గోకర్ణనాథ్ (ఉత్తర గోకర్ణ క్షేత్రం) | : | 35 కి.మీ. ఖేరి R S | ఖేరి జిల్లా |
| 2. | దేవేశ్వర్ | : | దేవకళి | ఖేరి జిల్లా |
| 3. | గదేశ్వర్ | : | భీరా | ఖేరి జిల్లా |
| 4. | బటేశ్వర్ | : | బాబర్‌గ్రామం | ఖేరి జిల్లా |
| 5. | స్వర్ణేశ్వర్ | : | సునేసర్ గ్రామం | ఖేరి జిల్లా |

**(దక్షిణ గోకర్ణ క్షేత్రం - కర్ణాటక - అరేబియా సముద్రతీరం)**

## గోరఖ్‌నాథ్ మఠాలు (4)

| | | | |
|---|---|---|---|
| 1. | గోరఖ్‌పూర్ | . | ఉత్తర ప్రదేశ్ |
| 2. | జునాగఢ్ | · | గుజరాత్ |
| 3. | పెషావర్ | . | పాకిస్తాన్ |
| 4. | బడంగనాధ్ | : | దక్షిణ భారత దేశం |

## మాహీనదీ తీరాన వెలసిన 'నౌ' నాధ్‌లు (9)

### ( పవిత్ర దర్శనీయ క్షేత్రాలు)

1. మాహీనది మాళవ పర్వతాలలో పుట్టి, గుజరాత్‌లోని ఖంబాత్ అఖాతములో సాగర సంగమం చేయుచున్నది.

| | | | |
|---|---|---|---|
| 1. | విశ్వనాధ్ | : | వాసధ్‌గామ్ |
| 2. | ధారనాధ్ | : | వేరా |
| 3. | వైద్యనాధ్ | : | సారస |
| 4. | వారి నాధ్ | : | సారస |
| 5. | భూత నాధ్ | : | భాదర్వ |
| 6. | సోమనాధ్ | . | భాదర్వ |
| 7 | కామనాధ్ | · | కాన్పూర్‌లో |
| 8. | త్రయంబక నాధ్ | . | వాంకానేర్ |
| 9. | సిద్ధనాధ్ | | షీలీ |

## పంచ కేశవాలయములు (5)

ఇవన్నియు ఆంధ్ర ప్రదేశ్‌లోని పశ్చిమ గోదావరి జిల్లాలోనే ఉన్నవి
1. ర్యాలి 2. మండపాక 3. తణుకు 4 దువ్వ 5. కారాల పఱ్ఱు

## పంచ కాశీలు

1. వారణాసి : ఉత్తరప్రదేశ్ గంగానదీ తీరం
2. గుప్తకాశి : ఉత్తరప్రదేశ్ రుద్రప్రయాగ నుండి కేదారనాథ్‌కు వెళ్ళు త్రోవలో "ఊఖీమఠ్" దాటిన వెంటనే కలదు
3. ఉత్తరకాశి ఉత్తర ప్రదేశ్
4 దక్షిణ కాశి : ఆంధ్రప్రదేశ్ ద్రాక్షారామం తూ.గో.జిల్లా. 32 కి మీ. కాకినాడ
5. శివకాశి · తమిళనాడు

## పంచ 'గయా' క్షేత్రములు (5)

1. గయ (శిరోగయ) : బీహార్ రాష్ట్రమున ఫల్గుణీ నదీ తీరమున కలదు దీనికి "పితృగయ" అనియు, "శిరోగయ" అని పేరు
2 జాజ్‌పూర్ (నాభిగయ) . ఒరిస్సా రాష్ట్రమున వైతరణీ నదీతీరమున కలదు దీనికి "నాభిగయ" అని పేరు
3. పిఠాపురం (పాదగయ) . ఆంధ్రప్రదేశ్‌లో మహాపాదగయ సరోవర తీరమున ఉన్నది. దీనికి "పాదగయ" అని పేరు
4. సి ద్ధపూర్ (మాతృగయ) · గుజరాత్ రాష్ట్రమున మహేషన జిల్లాలో సరస్వతీ నదీ తీరాన గలదు దీనికి 'మాతృగయ' అని పేరు.
5. బదరీనాథ్ (పితృగయ) : ఉత్తరప్రదేశ్. అలకనందా నదీ తీరమున బ్రహ్మ కపాలం అనుచోట నున్నది. దీనిని కూడా "పితృగయ" అని పిలుతురు.

## మాధవ పురములు (4)
## (వైష్ణవాలయములు)

| | | | |
|---|---|---|---|
| 1 | పిఠాపురం | - కుంతీ మాధవ్ | - ఆంధ్రప్రదేశ్ |
| 2. | ప్రయాగ | - వేణు మాధవ్ | - ఉత్తర ప్రదేశ్ |
| 3. | రామతీర్థం | - లీలా మాధవ్ | - ఉత్తర ప్రదేశ్ (మధుర) |
| 4. | రామేశ్వరం | - సేతు మాధవ్ | - తమిళనాడు |

## పంచ నాథ్‌లు (5)

| | | | |
|---|---|---|---|
| 1. | ఉత్తరమున | - బదరీనాథ్ | - ఉత్తరప్రదేశ్ |
| 2. | దక్షిణమున | - శ్రీరంగనాథ్ | - తమిళనాడు |
| 3 | తూర్పున | - జగన్నాథ్ | - ఒరిస్సా |
| 4. | పశ్చిమమున | - ద్వారకానాథ్ | - గుజరాత్ |
| 5. | మధ్య దేశమున | - గోవర్ధననాథ్ (నాథ్ ద్వార) | - రాజస్థాన్ |

## గోమరేశ్వర ఆలయములు (4)

| | | | |
|---|---|---|---|
| 1 | శ్రావణ బెళగొళ (కర్ణాటక) | - 98 కి.మీ. మైసూర్, 150 కి.మీ. బెంగుళూరు | ఎత్తు=57' |
| 2. | ధర్మస్థల (కర్ణాటక) | - దగ్గర గుట్టమీద | ఎత్తు =39' |
| 3. | కార్కాల (కొండమీద) | - 57 కి.మీ. ధర్మస్థల | ఎత్తు = 42' |
| 4. | వెన్నూర్ (కర్ణాటక) | - 55 కి మీ. మంగుళూరు | ఎత్తు=30' |

## తిరునల్వేలి జిల్లాలోని (తమిళనాడు)
## పంచభూత లింగములు (5)

| | | |
|---|---|---|
| 1. | శంకర నారాయణ కోయిల్ | - మట్టి లింగము |
| 2 | దారుకా పురం | - నీటిలింగము |
| 3. | తేనెమలై | - వాయులింగము |
| 4 | కరివరద నల్లూరు | - అగ్ని లింగము |
| 5 | దేవతానం | - ఆకాశ లింగము |

## పంచ వీరభద్ర క్షేత్రములు (5)

1. కాశి - విశ్వేశ్వరుడు - ఉత్తరప్రదేశ్
2. కేదారం - కేదారేశ్వరుడు - ఉత్తరప్రదేశ్
3 శ్రీకాళహస్తి - శ్రీకాళ హస్తీశ్వరుడు - ఆంధ్రప్రదేశ్
4. శ్రీశైలము - మల్లికార్జునుడు - ఆంధ్రప్రదేశ్
5. పట్టిసము - వీరభద్ర స్వామి - ఆంధ్రప్రదేశ్ (పోలవరం సమీపాన)

## హిమాలయ పర్వత ప్రాంత "ఛే" ధామ్‌లు (6)

1. నైనా దేవి (పిండిరూపం) - నైనితాల్ - హిమాచలప్రదేశ్ - నైనితాల్ చెరువు గట్టుమీద, పంజాబ్ బోర్డర్, నంగల్ నుండి బస్సు (కండ్ల దేవత)
2. చింతపూర్ణి (పిండిరూపం) - భర్వాయి - 5 కి.మీ. - హిమాచల ప్రదేశ్ - ఊనాజిల్లా. హోషియార్ పూర్ నుండి బస్సు. మాయీదాస్ అనుభక్తుడు తపస్సు చేయగా నీరు ప్రసాదించినట్టి అమ్మవారు. చింతలు దూరము చేయు తల్లిగా ప్రసిద్ధి. చిన్న మస్తిక (శిరస్సు లేని దేవత)
3. జ్వాలాముఖి - హిమాచలప్రదేశ్ - పఠాన్ కోట్ నుండి బస్సు, 82 కి.మీ. పఠాన్ కోట్, బియాస్ నదీ తీరము. కాంగ్డా జిల్లా. సతీదేవి "నాలుక" పడిన స్థలము. 55 కి.మీ. కాంగ్డా.
4. వజ్రేశ్వరి - హిమాచల ప్రదేశ్ - కాంగ్డా గ్రామం. వనగంగా నదీ తీరం. 55 కి.మీ. జ్వాలాముఖి. మహ్మద్ గజని దండయాత్రకు గురైన దేవాలయం. నగరకోటధామ్. విజయేశ్వరి, మహామాయి అని పేర్లు.
5. చాముండా దేవి - హిమాచల ప్రదేశ్ - కాంగ్డా నుండి బస్సు. పఠాన్ కోట్ నుండి రైలు.
6. వైష్ణవ దేవి - జమ్ము మరియు కాశ్మీర్ - జమ్ము నుండి కాట్రా 56కి.మీ కాట్రా నుండి 14 కి.మీ. నడక, గుర్రపు స్వారి. గుహాలయం.

## పంచ నటరాజ క్షేత్రములు (5)

ఇవన్నియు తమిళనాడులోనే గలవు.
వీటిని "సభలు" అని కూడా పిలుస్తారు.

1. రత్న సభ - కాళీతాండవం.
ఆర్కోణం స్టేషను దగ్గరలో గల తిరువేలం గాడు, శివాలయములో.

2. కనక సభ - ఆనంద తాండవం
తమిళనాడులోని చిదంబర క్షేత్రములోని ఆలయములో.

3. రజత సభ - గౌరీ తాండవం
మధురైలో నున్న మీనాక్షి ఆలయములో.

4. చిత్ర సభ - త్రిపుర తాండవం
టెంకాశి R S నకు 5 కి.మీ. దూరములో గల తిరుకుర్తాళం శివాలయములో

5. తామ్ర సభ - మునితాండవం
తిరునల్వేలి శివాలయములో.

ఇవిగాక

చిదంబరములోనే 5 సభలు గలవు. 1) కనక సభ 2) రజత సభ 3) భృత్య సభ 4) దేవ సభ 5) రాజ సభ, మధురైలోనే 5 సభలు గలవు. 1) రత్న సభ 2) కనక సభ 3) రజత సభ 4) దేవ సభ 5) చిత్ర సభ

పై విగ్రహ మూర్తులు మండపముల లోని స్తంభాలపై సాక్షాత్కరిస్తున్నారు.

## పంచ తీర్థములు (5)

| | | | |
|---|---|---|---|
| 1. | పుష్కర తీర్థం | - | రాజస్థాన్ |
| 2. | కురుక్షేత్రం | - | హర్యానా |
| 3. | గయ | - | బీహార్, ఫల్గుణీ నదీ తీరం |
| 4. | గంగా మాతాజి | - | కాశి - ఉత్తరప్రదేశ్ |
| 5. | ప్రభాస తీర్థం | - | గుజరాత్, సోమనాథ క్షేత్రం, అరేబియా సముద్రతీరం. |

## పంచ సరోవరములు (5)

1. మానస సరోవరము - టిబెట్, కైలాస పర్వత ప్రాంతము నందు వెలసినది. హిమాలయ ప్రాంతము.

2. 1) బ్రహ్మ సరోవరము - రాజస్థాన్ రాష్ట్రములో గలదు.
అజ్మీరునకు 11 కి.మీ. దూరమున గల పుష్కర్ క్షేత్రమున.
2) హర్యానాలోని, కురుక్షేత్రమున గలదు. మహాభారత యుద్ధానికి పూర్వం త్రవ్వించబడినది. దీనినే "సన్నిహిత సరోవరమని" కూడా పిలుస్తారు.

3. 1) బిందు సరోవరము - గుజరాత్ రాష్ట్రమున అహ్మదాబాద్‌నకు 32 కి.మీ. దూరమున నున్న సిద్ధపూర్.

| | | |
|---|---|---|
| 2) బిందు సరోవరము | - | ఒరిస్సాలోని భువనేశ్వర్‌నకు 3కి.మీ దూరములో ఉన్నది. సరోవరము చుట్టూ వందలాది ఆలయములు వెలసియున్నవి |
| 4 నారాయణ సరోవరము | - | గుజరాత్ రాష్ట్రములోని రాన్ ఆఫ్ కచ్ భూభాగమున కలదు. 150 కి మీ. భుజ్. |
| 5. పంపా సరోవరము | - | కర్ణాటక రాష్ట్రములో గలదు. అనాగంది గ్రామానికి 3 కి.మీ. దూరములో, హాస్పేట్‌కు దగ్గరలో. |

## గయాసుర క్షేత్రములు (3)

**1. పితృగయ :** గయ, గయజిల్లా బీహార్ గయాసురుడనే రాక్షసుడు గయలో తల, పిఠాపురములో కాళ్ళు పెట్టుకొని నిద్రించేవాడట. శివునిచే సంహరించబడెను. ఈ క్షేత్రానికి "పితృగయ" అని పేరు. ఫల్గుణీ నదీ తీరం. పితృదేవతలకు పిండ ప్రదానాలిచ్చు చోటు. ఫల్గుణి, మధుర, శ్వేదా నదుల సంగమ స్థానం. అమ్మవారు మంగళగౌరి (సర్వ మంగళాదేవి).

**2. పాద గయ :** పిఠాపురం, తూ.గో.జిల్లా. ఆంధ్రప్రదేశ్ ఈ క్షేత్రాన్నిపాదగయ అని పిలుతురు. ఇచ్చట కుక్కుటేశ్వర ఆలయం, పురూహుతికా దేవి,రాజ్యలక్ష్మి ఆలయం గలవు. అమ్మవారు అష్టాదశ పీఠాలలో నొకరు.

**3. నాభి గయ :** జాజ్ పూర్. ఒరిస్సా. ఈ క్షేత్రాన్ని నాభిగయ అని పిలుతురు. వైతరణీ నదీ తీరం. గిరిజా దేవి వెలసిన క్షేత్రము. అష్టాదశ పీఠాలలో నొకటి. దగ్గరలోని లంకలో నరసింహస్వామి ఆలయమున్నది.

## మాధవ త్రయము (3)

| | | | |
|---|---|---|---|
| 1. కాశీ | - | బిందు మాధవుడు | ఉత్తరప్రదేశ్ |
| 2. ప్రయాగ | - | వేణు మాధవుడు | ఉత్తరప్రదేశ్ |
| 3. రామేశ్వరము | - | సేతు మాధవుడు | తమిళనాడు |

## పంచ పురములు (5)

1. గుజరాత్‌లోని సోమనాథ్. (ప్రభాస తీర్థం), అరేబియా సముద్ర తీరం.
2. హర్యానాలోని కురుక్షేత్రం. సన్నిహిత సరోవరతీర ప్రాంతం.
3. ఉత్తర ప్రదేశ్‌లోని హరిద్వారం. (మాయాపురం) గంగాతీరం.
4 మధ్యప్రదేశ్‌లోని ఉజ్జయిని. (అవంతిక) షిప్రానదీ తీరం
5 మధ్యప్రదేశ్‌లోని మహేశ్వరి పురం 55 కి.మీ బడవాహR S

## త్యాగరాజ స్వామి వారి (శివుని) పవిత్ర స్థలములు -7

ఇవన్నియు తమిళనాడులోనే గలవు.

1 తిరువారూర్

2. తిరు మర్రైక్కాడు (వేదారణ్యము)

3. తిరునాగై (నాగపట్నము)

4. తిరుక్కోలిలి

5 తిరుక్కర మాయిల్

6 తిరువాణ్మియూర్

7. తిరునల్లార్.

## ఆంధ్రప్రదేశ్‌లోని శ్రీ భావన్నారాయణ స్వామి ఆలయములు

తన ఉనికిని "భావన" ద్వారా తెలియజెప్పినందున స్వామివారు భావన్నారాయణ స్వామివారయినారు. వీరు మూడు రకములుగా ప్రసిద్ధినొందియున్నారు.

1. క్షీర భావన్నారాయణ (పాల వృక్షములో నివసించినందున)
2. శేష భావన్నారాయణ (కలియుగములో శేష రూపాన దర్శనం యిస్తున్నందున)
3. ప్రసన్న భావనారాయణ (తప్పులను క్షమించి ప్రసన్నుడైనందున)

| | | | |
|---|---|---|---|
| 1. | బాపట్ల | - | గుంటూరు జిల్లా - |
| 2. | పొన్నూరు | - | గుంటూరు జిల్లా |
| 3. | అమృతలూరు | - | గుంటూరు జిల్లా |
| 4. | నరసరావు పేట | - | గుంటూరు జిల్లా |
| 5. | ఇనుమెల్ల | - | గుంటూరు జిల్లా |
| 6. | పట్టిసీమ | - | ప.గో. జిల్లా |
| 7. | భావదేవర పల్లి | - | కృష్ణాజిల్లా |
| 8. | సబ్బాయిగూడెం | - | కృష్ణాజిల్లా |
| 9 | సర్పవరం | - | తూ.గో. జిల్లా |
| 10. | పెద గంజాం | - | ప్రకాశం జిల్లా |
| 11 | చిన గంజాం | - | ప్రకాశం జిల్లా |
| 12. | పాదర్తి | - | ప్రకాశం జిల్లా |

ఇతర రాష్ట్రములలో స్వామివారు పై పేరుతో వెలసినట్లు కనిపించదు

# కామాక్షి అమ్మవారి ఆలయములు

| | | | |
|---|---|---|---|
| 1 | మహానంది - | ఆంధ్రప్రదేశ్ - | కర్నూలు జిల్లా |
| 2 | జొన్నవాడ - | ఆంధ్రప్రదేశ్ - | నెల్లూరు జిల్లా |
| 3 | కాశీ - | ఉత్తరప్రదేశ్ | |
| 4 | గౌహతి - | అస్సాం - | |
| 5. | కాంచీపురం - | తమిళనాడు - | |
| 6. | తంజావురు - | తమిళనాడు - | తంజావూరు జిల్లా. |
| 7 | మద్రాసు - | తమిళనాడు - | |
| 8 | మాంగాడు - | తమిళనాడు - | 25కి మీ మద్రాసు |
| 9 | పాండిచేరి - | తమిళనాడు - | బంగాళాఖాత తీరం |
| 10. | విల్లుపురం - | తమిళనాడు - | దక్షిణ ఆర్కాట్ జిల్లా |
| | పాండిచేరి - | తిరుక్కోయిలూర్‌రూట్‌లో | |
| 11 | శ్రీవిల్లి పుత్తూర్ - | తమిళనాడు - | కామరాజ్ జిల్లా |
| 12 | కె. పెరూంబూర్- | తమిళనాడు - | |
| 13 | కడలూర్ - | తమిళనాడు - | దక్షిణ ఆర్కాట్‌జిల్లా |
| 14 | విల్లియనూర్ - | తమిళనాడు - | 10 కి మీ పాండిచేరి |
| 15 | మాయవరం - | మద్రాస్ - | మద్రాస్ తిరుచునాపల్లిరూట్‌లో |
| 16. | పట్టు కోట్టై - | తమిళనాడు | |
| 17. | తిరుచినాపల్లి - | తమిళనాడు - | తిరుచినా పల్లి జిల్లా |
| 18. | కుంభకోణం - | తమిళనాడు - | తంజావూరు జిల్లా |
| 19. | ట్యూటి కోరిన్ - | తమిళనాడు - | V.O.చిందంబరనార్ జిల్లా |
| 20. | రామేశ్వరం - | తమిళనాడు - | రామనాధ పురం జిల్లా |
| 21. | చెంగల్పట్టు - | తమిళనాడు - | చెంగల్పట్టు జిల్లా |
| | | పాలార్‌నదీ తీరం | |
| 22. | సిమ్లా - | హిమాచల ప్రదేశ్ | జాలీ గంజ్ నుండి కొండపైకి ఎక్కాలి. |

పార్వతీదేవి ఇతరనామధేయములతో వెలసి కామాక్షిదేవిగా స్తుతించబడుతూ వుంది.

# శ్రీ దత్తాత్రేయ క్షేత్రములు

| | | |
|---|---|---|
| 1 | మాహోర్ (మహారాష్ట్ర) | నాందేడ్ జిల్లా, మూడు శిఖరాలలో నొకదానిపై |
| 2 | గంగాపుర (కర్ణాటక). | 80 కి.మీ షోలాపూర్, 22 కి.మీ గంగపూర్, R.S 50 కి మీ గుల్బర్గా, నిర్గుణ పాదుకలు గల క్షేత్రము. |
| 3. | తిరుచందూర్ (తమిళనాడు) | బంగాళాఖాత తీరం. |
| 4. | బిచోలిం (గోవా) | 37 కి,.మీ. పానాజీ, మూడు ముఖములతో వెలసిన స్వామివారు. |
| 5. | అడుంబూర్ (కర్ణాటక0 | భవాడి or భిల్వాడి R.S 6కి.మీ., 22 కి.మీ. సంగ్లీ, కృష్ణానదీ తీరం, పూనే - బెంగుళూరు రూట్ మహారాష్ట్ర బోర్డర్ |
| 6 | నరసింహవాడి (కర్ణాటక) | జైసింగపూర్ R.S. దగ్గర, 5 కి.మీ. సిరోలి. 53 కి.మీ. కొలాహాపూర్. కృష్ణానదీ తీరం. |
| 7. | తుల్జాపూర్ (మహారాష్ట్ర) | ఉస్మానాబాద్ జిల్లా |
| 8. | భక్తియార్‌పూర్ లేక భటగామ్ | (నేపాల్) 14 కి.మీ. ఖాట్మండు |
| 9. | బాదామి 'కర్ణాటక) | బిజాపూర్ జిల్లా |
| 10. | దేవగఢ్ (మహారాష్ట్ర) | 40 కి.మీ. షింగనాపూర్.అహ్మద్‌నగర్ జిల్లా |
| 11. | ధర్మపురి (ఆంధ్రప్రదేశ్) | కరీంనగర్ జిల్లా. జగిత్యాల తాలూకా. గోదావరి తీరం. |
| 12. | వాయి (మహారాష్ట్ర) | 157 కి.మీ. మీరజ్, 32 కి,మీ. వారర్ R.S. బెంగుళూర్ పూనే లైన్.కృష్ణావదీ తీరం. |
| 13. | సౌందత్తి (మహారాష్ట్ర) | 40 కి.మీ. ధార్వాడ్. పాదుకలు గలవు. |
| 14. | శిరోలి (మహారాష్ట్ర) | 5 కి.మీ. శిరోలి. 48 కి.మీ. కొల్హాపూర్. కృష్ణా నదీ తీరం స్వామివారి భోజన పాత్ర కలదు. |
| 15. | మాణిక్ వగర్ (కర్ణాటక) | 64 కి.మీ. గుల్బర్గ |
| 16. | జాయికా దేవ (మహారాష్ట్ర) | 18 కి మీ. అజంత |
| 17. | బిరూర్ (కర్ణాటక) | 45 కి.మీ. కేరిR.S. |
| 18. | మౌంట్ ఆబూ (రాజస్తాన్) | దత్త శిఖరం. |
| 19. | గిరినార్ (గుజరాత్) | జునాగఢ్ ప్రక్కన |
| 20. | వారణాసి (ఉత్తరప్రదేశ్) | |
| 21. | పిఠాపురం (ఆంధ్రప్రదేశ్) | తూ గో జిల్లా |
| 22. | శ్రీశైలం (ఆంధ్రప్రదేశ్) | కర్నూల్ జిల్లా |
| 23 | గురువాయూర్ (కేరళ) | 30 కి.మీ. త్రిచూర్, 100 కి.,మీ. కొచ్చిన్, చెవక్కాడ్ తాలూకా |
| 24. | కరంజ (మహారాష్ట్ర) | అమరావతి జిల్లా |
| 25. | చటగామ్ (బంగ్లాదేశ్) | సీతాకుండ్ R S దగ్గర. |

# ఆంధ్రప్రదేశలో శ్రీ వాసవీ కన్యకా పరమేశ్వరి అమ్మవారు వెలసిన ప్రముఖ క్షేత్రాలు

| | | |
|---|---|---|
| 1 | పెనుగొండ | పశ్చిమగోదావరి జిల్లా |
| 2 | తణుకు | ,, |
| 3. | జంగారెడ్డి గూడెం | ,, |
| 4. | కొయ్యల గూడెం | ,, |
| 5 | ఏలూరు | ,, |
| 6. | ఆచంట | ,, |
| 7. | భీమవరం | ,, |
| 8. | పాలకొల్లు | ,, |
| 9. | నరసాపురం | ,, |
| 10. | మార్కాపురం | ప్రకాశం జిల్లా |
| 11. | పెద డోర్నాల | ,, |
| 12. | చీరాల | ,, |
| 13. | కంభం | ,, |
| 14. | అమరావతి | గుంటూరు జిల్లా |
| 15. | గుంటూరు | ,, |
| 16. | సత్తెనపల్లి | ,, |
| 17. | విజయవాడ | కృష్ణాజిల్లా |
| 18. | ఘంటసాల | ,, |
| 19. | పిఠాపురం | తూర్పుగోదావరి జిల్లా |
| 20. | ధర్మపురి | కరీంనగర్ జిల్లా |
| 21. | శ్రీశైలము | కర్నూలు జిల్లా |
| 22. | విశాఖపట్నం | విశాఖ జిల్లా |

బెంగుళూరు (కర్నాటక) జయనగర్‌లో అమ్మవారు వెలసియున్నారు. ఇతర రాష్ట్రాలలో వివిధ నామాలతో వెలసి భక్తుల పూజలందుకొంటూ అభీష్టము లీడేర్చుచున్నది. పిలిచిన పలికే తల్లిగా పేరుగాంచినది అమ్మవారు ఈ పేరుతో పురాతన కాలమునుండి వెలసియున్నట్లు కనిపించదు.

## ప్రముఖ గుహాలయములు

| | | | | |
|---|---|---|---|---|
| 1. | అమర్‌నాథ్ | - | జమ్ము అండ్ కాశ్మీర్ | |
| 2. | వైష్ణవి దేవి | - | " | |
| 3. | హింగళాజ్ | - | పాకిస్తాన్ | |
| 4. | బాదామి | - | కర్ణాటక | |
| 5. | ఎల్లోరా | - | మహారాష్ట్ర | ఔరంగాబాద్ దగ్గర. |
| 6. | అజంతా | - | మహారాష్ట్ర | " |
| 7. | ఎలిఫెంటా | - | " | ముంబాయి దగ్గర |
| 8. | పాండవ | - | " | నాసిక్ దగ్గర |
| 9. | చంబేరి | - | " | " |
| 10. | గోరఖ్‌నాధ్ | - | ఉత్తరప్రదేశ్ | 108 శివ లింగాలతో సహా |
| 11. | అర్బుదా దేవి | - | రాజస్తాన్, | మౌంట్ ఆబూ |
| 12. | దత్తాత్రేయ | - | " | " |
| 13. | సీహోర్ | - | గుజరాత్ | గౌతమేశ్వర్ |
| 14. | యోగీశ్వరి | - | మహారాష్ట్ర | గోరేగామ్, ముంబాయి దగ్గర |
| 15. | మండపేశ్వర్ | - | " | " " |
| 16. | కన్హేరి | - | " | బోరేవిలి " |

పూజా, పునస్కారాలు లేనివి చాల గలవు. యాత్రీకులకు అందుబాటులో హిందూ దేవతలు గలవాటిలో ముఖ్యమైనవి పైన నీయబడినవి.

## ఒరిస్సాలోని చక్ర తీర్థములు

1. పూరీ 2. భువనేశ్వర్ 3. కోణార్క 4. జాజ్‌పూర్.

## లక్ష్మణునికి గుడి (సీతా రామ, హనుమంతాదులతో గాకుండా)

1. ఖజురహో (మధ్యప్రదేశ్) : ఇచ్చట నున్న 32 ఆలయములో ఒకటి ప్రత్యేకముగా లక్ష్మణునికి కేటాయించబడినది.
2. మధ్యప్రదేశ్‌లోని రాయపూర్‌లో.
3. ఉత్తరప్రదేశ్‌లోని లక్ష్మణ ఝూలా వద్ద.
4. ఒరిస్సాలోని భువనేశ్వర్‌లో లక్ష్మణేశ్వర్ అను చోట.

## భరతుని గుడి

1. ఉత్తరప్రదేశ్‌లోనిఋషీకేశ్‌లోగల త్రివేణీ ఘాట్
2. ఉత్తరప్రదేశ్‌లోని లక్ష్మణ ఝూలా వద్ద
3. ఒరిస్సాలోని భువనేశ్వర్‌లో భరతేశ్వర్ అనేచోట

## శత్రుఘ్నునికి గుడి

1. ఒరిస్సాలోని భువనేశ్వర్‌లో శత్రుఘ్నేశ్వర్ అను చోట.
2. ఉత్తరప్రదేశ్‌లోని లక్ష్మణ ఝూలా వద్ద.

## యోగిని మాత(Mother Goddesses) ఆలయములు - (కాళీమాత అనుచరులు)

1. హీరాపూర్ - ఒరిస్సా - 20 కి.మీ. భువనేశ్వర్
అర్ధచంద్రాకారముగా వెలసిన 64 యోగినీ మాతలు.
2. రాణిపూర్ - ఒరిస్సా - 29 కి.మీ. టిటాల్ ఘర్,
50 కి.మీ. బాలంగీర్
ఈ క్షేత్రమును సోమతీర్ధం అని పిలుతురు.
3. ఖజురహో - మధ్యప్రదేశ్
చౌసట్ (64 యోగిని మాతల ఆలయం) కాళికాదేవి. అధినాయకి.
4. బేరాఘాట్ - మధ్యప్రదేశ్ - మదంపూర్, జబ్బల్‌పూర్ దగ్గర. "మార్బుల్ రాక్స్" కి వెళ్ళు త్రోవలో, చాల విగ్రహములు పాడు చేయబడినవి.

## సప్తమాతృకలు - వాహనములు

1) బ్రాహ్మణి - హంస
2) మహేశ్వరం - వృషభం
3) కౌమారి - నెమలి
4) వైష్ణవి - గరుడ
5) వారాహి - వరాహం
6) ఇంద్రాణి - ఐరావతం
7) చాముండ - శవం

చాముండా దేవి తప్ప మిగతా అందరి మాతృకల ఒడిలో బాలురు ఉంటారు.

## శ్రీరామానుజాచార్యుల వారి ప్రసిద్ధి చెందిన పీఠములు (4)

1) శ్రీ అహోబిల పీఠం - ఆంధ్రప్రదేశ్, కర్నూల్ జిల్లా, శ్రీ లక్ష్మి నృసింహస్వామివారు.
2) శ్రీ పరకాల పీఠం - కర్ణాటక, మైసూర్, శ్రీ లక్ష్మి హయగ్రీవ స్వామి
3) శ్రీ తోతాద్రి పీఠం - తమిళనాడు, వానమామలై, శ్రీ వరమంగై దేవీ సమేత శ్రీదేవనాయక
4) శ్రీ గోవర్ధన పీఠం - ఉత్తరప్రదేశ్, గోవర్ధనం, శ్రీరాధామాధవుడు.

## శ్రీ మధ్వాచార్య స్థాపిత పీఠములు

1) రజతపీఠం - కర్నాటక, ఉడిపి
2) ఫలిమారుపీఠం - ఉడిపి దగ్గర
3) అదమారు పీఠం -
4) శ్రీకృష్ణపుర పీఠం -
5) శ్రీ పుత్తికా పీఠం -
6) శిరూర్ పీఠం-
7) సోదే పీఠం -
8) కనియూర్ పీఠం -
9) పేజావర్ పీఠం -

ఇవన్నియు కర్ణాటక రాష్ట్రములోనే వున్నవి.
వీటన్నింటికీ ఉపపీఠాలు గలవు

## మహామాఘం అనబడే పుణ్యస్నానాలు చేయు గొప్పసరస్సుగల దేవాలయములు

ఇచ్చట 12 సంవత్సముల కొకసారి ఒక నెలరోజులు మహామాఘం ఉత్సవాలు, స్నానాలు జరుగుతవి

1) కుంభకోణం : తమిళనాడు కావేరీ తీరం 1) ఆది కుంభేశ్వరుడు, మంగళనాయకి 2) శ్రీసారంగపాణి, కోమలవళ్ళి 3) మహామాఘం సరస్సు (20 ఎకరములు)

2) కోజికోడ్ - కేరళ, 219 కి మీ కొచ్చిన్, షోరనూర్ - మేంగళూర్ లైనులో భరతపుజ నదీస్నానం శివస్వామి, శ్రీకృష్ణదేవాలయములు గలవు

**నీరు ఊరే ప్రసిద్ధ విగ్రహములు, ఆలయములు**

| | | |
|---|---|---|
| 1) | ర్యాలి | ఆంధ్రప్రదేశ్, జగన్మోహిని, చెన్నకేశవస్వామి విగ్రహం తూ.గోదావరి జిల్లా, రావులపాలెం దగ్గర. విగ్రహం క్రింది భాగమున |
| 2) | వాడపల్లి (ఆంధ్రప్రదేశ్) : | నృసింహస్వామి, మూసీనది కృష్ణానదిలో కలిసేచోట, నల్గొండ జిల్లా, మిర్యాలగూడెం మీదుగా వెళ్ళాలి ఇక్కడ నున్న అగస్త్యేశ్వర లింగము నుండి నీరు ఊరుతూ ఉంటుంది |
| 3) | మహానంది (ఆంధ్రప్రదేశ్) · | మహా నందీశ్వరుడు. ఆవుగిట్ట త్రొక్కుడు గుర్తుగల శివలింగం కర్నూల్ జిల్లా . 32 కి.మీ నంద్యాల. |
| 4) | ముఖలింగం (ఆంధ్రప్రదేశ్) : | శ్రీముఖ లింగేశ్వరుడు లింగం పై భాగము నుండి నీరు ఊరుతూంటుంది. శ్రీముఖలింగం, శ్రీకాకుళం జిల్లా |
| 5) | బుగ్గా రామేశ్వరం (ఆంధ్రప్రదేశ్) | ఆదిలాబాద్ జిల్లా 5 కి మీ బెల్లంపల్లి లింగము క్రింది నుండి నీరు ఊరును బుగ్గారామేశ్వరుడు |
| 6) | బుగ్గా రామేశ్వరం . (ఆంధ్రప్రదేశ్) | బుగ్గారామేశ్వరుడు తాడిపత్రి అనంతపురం జిల్లా లింగము క్రింది నుండి నీరు ఊరును. |
| 7) | పిఠాపురం . (ఆంధ్రప్రదేశ్) | కుక్కుటేశ్వరస్వామి. తూ.గో జిల్లా. కోడిపుంజు ఆకారం లింగం ముక్కునుండి నిరంతరం నీరు ఊరుతూ ఉంటుంది |
| 8) | లేపాక్షి (ఆంధ్రప్రదేశ్) : | 20 కి మీ. హిందూపురం, అనంతపురం జిల్లా ఇచ్చటగల రాతి పాదాన్ని ఆంజనేయ పాదం అని సీతాదేవి పాదం అని పిలుస్తారు. ఈ పాదం బొటనవ్రేలు చివరన నీరు ఊరుతూ ఉంటుంది |
| 9) | జంబుకేశ్వరం : | తమిళనాడు. జంబుకేశ్వరుడు జలలింగం 10 కి మీ ట్రిచ్చి, లింగం క్రిందిభాగం నుండి నీరు ఊరుతూంటుంది |
| 10) | త్రయంబకేశ్వర్ : | మహారాష్ట్ర త్రయంబకేశ్వరుడు, గోదావరి పుట్టిన చోటు లింగం పై పగులులోనుండి నీరు ఊరుతూంటుంది |
| 11) | ప్రాచి | గుజరాత్. జునాగఢ్ జిల్లా ప్రభాస తీర్థం నుండి 20 కి మీ మాధవస్వామి పాదముల నుండి నీరు ఊరుతూ ఉంటుంది 9 కి మీ గోరఖ్ మడి |

## యంత్రములు (శ్రీచక్రములు వగైరా) నిక్షిప్తమైయున్న ప్రముఖ దేవాలయములు

| | | | |
|---|---|---|---|
| 1 | అన్నవరం | | ఆంధ్రప్రదేశ్, శ్రీ వీర వెంకట సత్యనారాయణ స్వామి, అనంతలక్ష్మి సత్యవతీదేవి. మహానారాయణ యంత్రం |
| 2. | విజయవాడ | | ఆంధ్రప్రదేశ్,కనకదుర్గ మహిషాసుర మర్దినిగా ఉన్న అమ్మవారి ఉగ్రరూపం తగ్గించడానికి శ్రీ శంకరభగవత్పాదులు అమ్మవారి పీఠం క్రింద యంత్రాన్ని నిక్షిప్తం చేశారు |
| 3. | శ్రీకాళహస్తి | : | ఆంధ్రప్రదేశ్, శ్రీ కాళహస్తీశ్వరుడు అమ్మవారు జ్ఞానప్రసూనాంబ. శ్రీ చక్రము స్థాపించబడినది. |
| 4. | పుష్పగిరి | | ఆంధ్రప్రదేశ్, కడపజిల్లా శ్రీరాజరాజేశ్వరీదేవి. ఇచ్చట శ్రీ చక్రం శిలపై చెక్కబడియున్నది ఆదిశంకరాచార్య ప్రతిష్ఠ |
| 5. | కొరివి | . | ఆంధ్రప్రదేశ్, వరంగల్ జిల్లా, వీరభద్రుడు, భద్రకాళి ఇచ్చట ప్రతిష్ఠించబడిన యంత్రము చాలా శక్తివంతము. మహబూబ్ నగర్ మీదుగా కొరివి గ్రామం చేరాలి. |
| 6 | శ్రీశైలం | . | ఆంధ్రప్రదేశ్, కర్నూల్ జిల్లా స్వామివారు మల్లికార్జునుడు. అమ్మవారు భ్రమరాంబ శంకరాచార్య స్థాపిత శ్రీచక్రము కలదు |
| 7. | కొల్హాపూర్ | · | మహారాష్ట్ర, మహాలక్ష్మి ఆలయములో రాతి ఫలకముపై నున్న శ్రీ చక్రం పూజలందుకొనుచున్నది |
| 8. | కంచి | : | తమిళనాడు కామాక్షీదేవి త్రినేత్రధారిణి. మహారౌద్రముగా ఉండే అమ్మవారిని శ్రీచక్రస్థాపనముచే శాంతింపజేయడమైనది ఇచ్చట ప్రతిష్ఠించబడిన శ్రీచక్రమునకు నిత్యపూజలు జరుగుచున్నవి |
| 9. | మహానంది | : | ఆంధ్రప్రదేశ్. 20 కి.మీ నంద్యాల, కర్నూల్జిల్లా మహానందీశ్వరుడు, కామేశ్వరీదేవి, అమ్మవారి వద్దనున్న శ్రీచక్రం శ్రీశంకరాచార్య ప్రతిష్ఠ |
| 10. | నెల్లూరు | : | ఆంధ్రప్రదేశ్ నెల్లూరుజిల్లా నెల్లూరుటౌన్లో దర్గామిట్టలో వెలసిన శ్రీ రాజరాజేశ్వరీదేవి. ఇచ్చట ప్రతిష్ఠింపబడిన శ్రీ చక్రము పూజలనందుకొనుచున్నది |
| 11 | శ్రీరంగం | : | తమిళనాడు కావేరీతీరం ఈ క్షేత్రమున జనాకర్షణ యంత్రం శ్రీ శంకరభగవత్పాదులచే ప్రతిష్ఠించబడినది |
| 12. | మధురై | · | తమిళనాడు, మధురైజిల్లా, మీనాక్షీదేవి. అమ్మవారి విగ్రహం క్రింద శ్రీ చక్ర స్థాపన జరిగియున్నది |

13 తిరుమల — ఆంధ్రప్రదేశ్ చిత్తూరుజిల్లా శ్రీవేంకటేశ్వరుడు. ధనాకర్షణచక్రం శ్రీ శంకరాచార్యులవారిచే ప్రతిష్ఠించబడినది

14 కాశీ — ఉత్తరప్రదేశ్, విశాలాక్షి అమ్మవారు ఇచ్చట శ్రీ చక్రం శంకరాచార్య ప్రతిష్ఠ. అన్నపూర్ణేశ్వరీదేవి ఆలయంలో కుడిప్రక్క వెలసియున్న లింగముపై శ్రీచక్రము గలదు

15 ఉజ్జయిని . మధ్యప్రదేశ్, అవంతిక మహాకాళి. ఉగ్రరూపియైన అమ్మవారి తేజమును తగ్గించుటకు శ్రీచక్రము ప్రతిష్ఠించబడినది.

16. కొల్లూరు : కర్ణాటక, అమ్మవారు మూకాంబిక. సహ్యాద్రి పర్వతశ్రేణి మొదట్లో మారణఘాట్‌లో శ్రీచక్రం నిక్షిప్తమైయున్న క్షేత్రము.

17. హరిద్వారం · ఉత్తరప్రదేశ్, మాయాపురి అమ్మవారు హరదేవి. శ్రీ చక్రం ప్రతిష్ఠించబడినది.

18. ప్రయాగక్షేత్రం . ఉత్తరప్రదేశ్ మాయాదేవి. అమ్మవారి పీఠమున శ్రీ చక్రము నిక్షిప్తమై యున్నది.

19. జంబుకేశ్వరం . తమిళనాడు 2 కి మీ. శ్రీరంగం అమ్మవారు అఖిలాండేశ్వరి. శ్రీచక్రం ప్రతిష్ఠించబడినది

20 కుంభకోణం — తమిళనాడు తంజావూరు జిల్లా అమ్మవారు మంగళాంబిక. శ్రీ చక్రము స్థాపించబడినది.

21 శృంగేరి — కర్ణాటక సువర్ణ శారదా దేవి. శ్రీ శంకరాచార్యుల వారిచే శ్రీ చక్రం నిక్షిప్తమైయున్నది

22. కోటప్పకొండ . ఆంధ్రప్రదేశ్ గుంటూరు జిల్లా. త్రికూటేశ్వర క్షేత్రము, జనాకర్షణ యంత్రము గలది.

23 ప్రాచి : ఒరిస్సా, తాకటపురమను గ్రామమున ప్రాచీ నదిఒడ్డున వెలసియున్నటువంటి మంగళా దేవి వీణా యంత్రము స్థాపించబడినది 65 కి.మీ. పూరీ.

24. మాంగాడు : తమిళనాడు, 20 కి మీ మద్రాసు, కామాక్షీ దేవి ఆలయమున శ్రీ చక్రము స్థాపించబడియున్నది

25 అంబాజీ — రాజస్తాన్, అరసూర్ R S 32 కి మీ మౌంట్ ఆబూ రోడ్ R.S శ్రీచక్రం స్థాపించబడిన క్షేత్రము.

26 బహుచరాజీ — గుజరాత్ మెహషణా జిల్లా 50 కి.మీ మెహషణా పిల్లల దేవత అమ్మవారి వాహనం కోడి పుంజు

27 ఓంకార క్షేత్రం — మధ్యప్రదేశ్, నర్మదా నదీ తీరం ఓంకారేశ్వరుడు ఓంకార యంత్ర స్థాపన జరిగియున్నది

28 త్రిపురాంతకం ఆంధ్రప్రదేశ్, గుంటూరు జిల్లా, 46 కి మీ వినుకొండ త్రిపుర సుందరీ దేవి అమ్మవారి కెదురుగా నున్న రాతిపై శ్రీ చక్రం ప్రతిష్ఠించబడి, ప్రత్యేక పూజలందుకొనుచున్నది

29 అలఘర కోయిల్ : తమిళనాడు, 20 కి మీ మధురై, సౌందర రాజ పెరుమాళ్ ఆలయములో నున్న శివుని సన్నిధిలో షడ్భుజ యంత్రం ప్రతిష్ఠించబడినది

30 పూరీ: ఒరిస్సా జగన్నాధ క్షేత్రము విమలాదేవి శ్రీ చక్ర ప్రతిష్ఠిత క్షేత్రము

31 కాంగ్డా (హిమాచలప్రదేశ్) : వాగ్యంత్రము స్థాపించబడినది. నగర్‌కోట దేవి ఆలయములో.

32. ఎగువ అహోబిలం · ఆంధ్రప్రదేశ్ కర్నూల్ జిల్లా ఆళ్ళగడ్డ. నుండి బస్సు, ప్రహ్లాద వరద నారసింహ స్వామి వారి ఆలయములో శ్రీ చక్ర ప్రతిష్ఠ జరిగినది. గిరిజా పీఠముగా భావించుచున్నారు

## THE GREAT CHOLA TEMPLES (4)

ప్రవేశ గోపురము కన్నా గర్భగుడి విమానము చాల పెద్దదిగా నిర్మించబడుట ప్రత్యేకత.

1 బృహదీశ్వరాలయం . తంజావూరు (తమిళనాడు)
బృహదీశ్వరుడు
బృహదీశ్వరి

2 గంగైకొండ చోళపురం . తంజావూరు జిల్లా (తమిళనాడు)
గంగైకొండ చోళేశ్వరుడు చిదంబరం దగ్గర
మహిషాసుర మర్ధిని

3. దరశురాం కుంభకోణం దగ్గర
(పూర్వపు పేరు రాజరాజపురం) (తమిళనాడు)
ఐరావతేశ్వరుడు
ఐరావతేశ్వరి

4 త్రిభువనము - do -
త్రిభువనేశ్వరుడు
త్రిభువనేశ్వరి

### జగద్గురు శ్రీ ఆది శంకరాచార్య పీఠాలు (ఉప పీఠాలతో సహా)

1. జ్యోతిష మఠ్ (జ్యోషీమఠ్) ఉత్తరప్రదేశ్. హరిద్వార్ నుండి బద్రీనాథ్‌కు పోవు త్రోవలో,

| | | |
|---|---|---|
| 2 | గోవర్ధన పీఠం (ఒరిస్సా) | పూరీ జగన్నాథ్ |
| 3 | శారదా పీఠం (గుజరాత్) | ద్వారకలో. |
| 4 | శృంగేరి పీఠం (కర్ణాటక) | చిక మగుళూర్ జిల్లా |
| 5. | కామకోటి పీఠం (తమిళనాడు) | కాంచీపురం |

**శృంగేరి పీఠానికి అనుబంధ ఉప పీఠాలు**

| | | |
|---|---|---|
| 1 | కుండీ మఠం (కర్ణాటక) | కుడలీ గ్రామం షిమోగా జిల్లా తుంగ, భద్ర నదుల సంగమ స్థానం. |
| 2 | శివగంగ మఠం (కర్ణాటక) | శివగంగ గ్రామం తుముకూర్ జిల్లా |
| 3 | అవనీ మఠం (కర్ణాటక) | అవని గ్రామం కోలార్ జిల్లా |
| 4 | విరూపాక్ష మఠం (కర్ణాటక) | హంపి బళ్ళారి జిల్లా హాస్పేట్ తాలూకా |
| 5 | పుష్పగిరి పీఠం (ఆంధ్రప్రదేశ్) | పుష్పగిరి, కడప జిల్లా పినాకినీ నదీ తీరం |
| 6 | కర వీర పీఠం (మహారాష్ట్ర) | పూనే |
| 7 | సంకేశ్వర పీఠం ( " ) | సంకేశ్వర్ |
| 8 | కరవీర పీఠం ( " ) . | కొల్హాపూర్ |
| 9 | కరవీర పీఠం ( " ) | సతారా. |
| 10 | రామచంద్రపుర పీఠం (కర్ణాటక) . | రామచంద్రపూర్,హొయనగర్ తాలూకా , |
| 11. | హరిహర మఠం (కర్ణాటక) | శృంగేరి దగ్గర |
| 12 | భండిగోడ పీఠం( " ) | ఉడిపి తాలూకా |
| 13 | యడనీరు పీఠం( " ) · | దక్షిణ కన్నడ జిల్లా, కాసర్‌గోడ్ తాలూకా |
| 14 | కోదండాశ్రమ పీఠం ( " ) | తుముకూర్ తాలూకా |
| 15 | స్వర్ణవళ్ళి పీఠం ( " ) . | ఉత్తర కన్నడ జిల్లా, శిరసీ తాలూకా |
| 16 | నేలమావు పీఠం ( " ) | నేలమావు గ్రామం ఉత్తరకన్నడ జిల్లా |
| 17 | యోగనరసింహస్వామి పీఠం (కర్ణాటక) | హోలే నరసీ పురంలో |
| 18 | బాల కుదురు పీఠం (కర్ణాటక) | దక్షిణ కన్నడ జిల్లా, ఉడిపి తాలూకా |

**వీరశైవ మఠాలున్న ప్రదేశములు (5)**

| | | |
|---|---|---|
| 1 | ఏకోరాం మఠము | కేదార్ నాథ్ (ఉత్తరప్రదేశ్) |
| 2 | పండితారాధ్య మఠము | శ్రీశైలము (ఆంధ్రప్రదేశ్) |
| 3 | రేవనాచార్య మఠము | మైసూరు (కర్ణాటక) |
| 4 | మరుల మఠము | ఉజ్జయిని (మధ్యప్రదేశ్) |
| 5 | విశ్వారాధ్య మఠము | కాశీ (ఉత్తరప్రదేశ్) |

## శ్రీరంగ త్రయం

| | | |
|---|---|---|
| 1 | ఆది శ్రీరంగము | శ్రీరంగ పట్టణము (కర్ణాటక) |
| | కావేరి నదీ తీరం | 14 కి మీ మైసూర్‌కి దగ్గరలో, |
| | టిప్పుసుల్తాన్ కోట కలదు | |
| 2 | మధ్య శ్రీరంగము | శివ సముద్ర జలపాతము వద్ద |
| | కావేరి నది రెండు | (కర్ణాటక) |
| | పాయలుగా చీలి, రెండు మైళ్ళ | హిందూపురం నుండి బెంగుళూర్ పోవు |
| | కావల మరల కలియును | రోడ్డు మార్గంలో కొంచెము ప్రక్కగా |
| | ఈ పాయల మధ్యనున్న దీవి | వెళ్ళవలయును మద్దూరు గ్రామములో |
| | ప్రాంతము | 96 కి మీ మైసూర్ |
| 3. | అంత్య శ్రీరంగము | శ్రీరంగం (తమిళనాడు) 12 కి మీ. |
| | శ్రీరంగనాధుడు | తిరుచినాపల్లి |
| | (కస్తూరి రంగడు, కావేటి రంగడు) | |
| | కావేరి నదీ తీరం. | |
| | అతి పెద్ద దేవాలయం | |

పై మూడుచోట్ల శేషశాయి అయిన శ్రీరంగనాధుని పెద్ద విగ్రహములు గలవు

## శ్రీ జగద్గురు శంకరాచార్యుల వారు ప్రతిష్ఠించిన లింగములు

| | | | |
|---|---|---|---|
| 1. | కేదార నాధ్ | : | ఉత్తరప్రదేశ్ |
| | ద్వాదశ జ్యోతిర్లింగములలో నొకటి. | | |
| 2 | పశుపతి నాధ్ | : | ఖాట్మండు (నేపాల్) |
| 3. | శృంగేరి | : | కర్ణాటక |
| 4. | చిదంబరం | . | తమిళనాడు |
| 5. | కాంచీపురం | . | తమిళనాడు |

## మంటప చతుష్టయము (4)

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1. | భోగమంటపము | - | శ్రీరంగము | - | తమిళనాడు |
| 2. | త్యాగ మంటపము | - | కంచి | - | తమిళనాడు |
| 3. | పుష్ప మంటపము | - | తిరువేంగడము | | తమిళనాడు |
| 4. | జ్ఞాన మంటపము | - | తిరునారాయణ పురము | | తమిళనాడు |

## యమ ధర్మరాజు ఆలయములు (బార్య : శ్యామలా దేవి)

| | | |
|---|---|---|
| 1 | మొధెరా | గుజరాత్ - 97 కి మీ అహ్మదాబాద్, 29 కి మీ పాటన్ ఇచ్చట నున్న ప్రఖ్యాత సూర్య దేవాలయం ఆవరణలో "కుంద" అనే సరస్సు ప్రక్కన |
| 2 | ఉజ్జయిని | మధ్యప్రదేశ్ - ఉజ్జయిని దగ్గరనున్న "కాయిదా" గ్రామములో |
| 3. | తిరు కడవూరు · | తమిళనాడు,6 తంజావూరు జిల్లా,20 కి మీ మయిలాడు దురై కాల సంహారమూర్తి వారికి ఎదురుగా తిరిగి బ్రతికించబడినటువంటి యమధర్మరాజు విగ్రహం కలదు |
| 4. | ధర్మపురి | ఆంధ్రప్రదేశ్ - కరీంనగర్ జిల్లా జగిత్యాల దగ్గర ఉగ్ర నరసింహమూర్తి ఆలయంలో |

## చిత్రగుప్తుడి దేవాలయములు

(భార్య : కర్ణాంబిక)

1 కంచి
(తమిళనాడు)

2 ఖజురహో
(మధ్యప్రదేశ్)

3 కాయధా
(మధ్యప్రదేశ్)
ఉజ్జయిని దగ్గర

4 హైదరాబాద్ - (ఆంధ్రప్రదేశ్)
లాల్ దర్వాజాకు 1 కి మీ దూరములో

మధ్యప్రదేశ్‌లోని ఖ జరహోలో శ్రీ మహావిష్ణువు 10 శిరస్సులతో ఉన్న విగ్రహం దగ్గరలో నున్నది. ఇక్కడనే సప్తాశ్వ రధారూఢుడైన శ్రీ సూర్య భగవానుని దేవాలయం కూడా చూడవచ్చును మధ్యప్రదేశ్‌లోని ఉజ్జయినికి దగ్గరగల "కాయధా" అను గ్రామ సమీపమున ఉన్న దిబ్బపై చిత్రగుప్తుడు యజ్ఞము చేసెను. చిత్రగుప్తునికి ఇద్దరు రాణులు, 12 మంది కుమారులు ఈ విగ్రహము "కాయధా" గ్రామములో చూడనగును

## కుంభ మేళాలు జరుగు పుణ్యక్షేత్రములు -4

1 ప్రయాగ క్షేత్రం (ఉత్తరప్రదేశ్) అల్హాబాద్
2. హరిద్వారం (ఉత్తర ప్రదేశ్)
3 నాసిక్ (మహారాష్ట్ర)
4 ఉజ్జయిని (మధ్యప్రదేశ్)

వైశాఖమాసం మొదటి రోజునుండి 12 సంవత్సరముల కొకసారి కుంభమేళా ఉత్సవములు జరుగును పైన తెల్పిన చోట్ల మూడు సంవత్సరముల కొక్కొక్కచోట జరుగును వీటిలో అర్ధకుంభమేళాలు

(ప్రతి 6 సంవత్సరముల కొకసారి) జరుగు ప్రదేశములు

1 ప్రయాగ (ఉత్తర ప్రదేశ్)

2. ఉజ్జయిని (మధ్యప్రదేశ్)

గరుత్మంతుడు అమృత భాండాన్ని తీసుకుని వెళుతూండగా, పై నాల్గు ప్రదేశములలో ఆగగా, అమృతం బొట్లు పడిన చోట్లు.

**మెహర్ " చార్ దామ్" లు (4) (రాజస్తాన్)**

1 కంక్రోళి (ద్వారకాధీష్) :
ద్వారకా ధామ్

2 నాధ్ ద్వారా (శ్రీనాధ్‌జీ)
జగన్నాధ ధామ్

3. ఏక్‌లింగ్‌జీ (ఏకలింగ మహదేవ్)
రామేశ్వర ధామ్

4 ఉదయపూర్ (చార్ భుజ్ జీ)
బదరీనాధ్ ధామ్

**ఋష్యశృంగ, శాంతాదేవి ఆలయములు (2)**

1 శృంగి బేర పురము · ఉత్తర ప్రదేశ్
30కి మీ. అల్హాబాద్

విభాండక ముని కుమారుడు ఋష్యశృంగ మహర్షిని రోమపాద చక్రవర్తి వేశ్యలచే వశపరచుకున్న ప్రదేశము. భార్య శాంతాదేవి. దశరధ మహారాజు పుత్రిక.

2 ఋష్య శృంగ శాంతాదేవి ఆలయం : 10కి మీ శృంగేరి (కర్ణాటక)

శృంగేరి పీఠమునుండి బస్సులో వెళ్ళవలయును.

**సప్త పుణ్యములు**

1. మనస్సు చేసిన పుణ్యము దేవుని యందు భక్తి కలుగుట
2. నోరు చేసిన పుణ్యము . దేవుని నామము ఉచ్చరించుట
3 చేతులు చేసిన పుణ్యము దేవుని పూజించుట
4. కాళ్ళు చేసిన పుణ్యము · దేవాలయమునకు పోవుట

5. కన్నులు చేసిన పుణ్యము . దేవుని చూచుట
6 చెవులు చేసిన పుణ్యము దేవుని కధలు వినుట
7 శిరస్సు చేసిన పుణ్యము దేవునికి నమస్కరించుట

**శివారాధన 3 రకములు**

మొదటిది · ఆకారముతో నున్న స్వామివారిని పూజించుట. నటరాజ, అర్ధనారీశ్వర మొదలైనవి

రెండవది : ప్రత్యేక ఆకారము తల ముఖము వగైరా లేనిది, లింగరూపము.

మూడవది రూప రహితం, చిదంబరములోని ఆకాశలింగం (శూన్యం), అవుధర కోయిల్ (102కి.మీ ట్రిచ్చి)లోని ఆత్మనాధర్ స్వామివారు.

**నవబ్రహ్మలు లింగరూపములో నుండి శివునర్చించుట**

1 తారకబ్రహ్మ 2. స్వర్గ 3 పద్మ 4. బాల 5 గరుడ 6. కుమార 7. అర్క 8 వీర 9 -విశ్వ ఇవన్నియూ ఆంధ్రప్రదేశ్ లోని మహబూబ్‌నగర్ జిల్లాలో గల అలంపురం దేవాలయములో వెలసియుండి, బాలబ్రహ్మేశ్వర స్వామివారిని ఆరాధించుచున్నవి.

**స్త్రీదేవతలు కనిపించని ఆలయములు**

**(ప్రత్యేక ఆలయములు)**

1. అయ్యప్ప స్వామి 2. దత్తాత్రేయ స్వామి
3. సంకట మోచన్ హనుమాన్ 4. వినాయక
5. గరుత్మంతుడు 6. సాయిబాబా

**అష్టలక్ష్మి దేవాలయములు**

1. ఆది 2. ధైర్య 3. విజయ 4 గజ 5. ధాన్య
6 ధన 7 సంతాన 8 సౌభాగ్య లక్ష్మలు

1 అష్టలక్ష్మి దేవాలయం మద్రాసు (తమిళనాడు)
తిరువాన్మయూర్ బీచ్‌లో, బీసెంట్ నగరులో బంగాళాఖాత తీరములో వెలసిన మూడంతస్తుల దేవాలయము చుట్టూ ప్రదక్షిణగా మెట్లు ఎక్కుతూ అమ్మవార్లను దర్శించాలి.

2. మంగళాంబిక దేవాలయం కుంభకోణం (తమిళనాడు)
స్వామివారు కుంభేశ్వర స్వామి. లింగం పైభాగం కుండ మూతిలా ఉంటుంది ఆలయ ఆవరణలో అష్టలక్ష్మి స్వరూపాలున్నవి

3 అరుణాచలేశ్వరి తిరువణ్ణామలై (తమిళనాడు)
స్వామివారు అరుణాచలేశ్వరుడు తేజో లింగం చాల పెద్ద దేవాలయం మండప స్తంభాలపై అష్టలక్ష్మి విగ్రహాలున్నవి

**ప్రముఖ స్వామినారాయణాలయములు**

1 అహ్మదాబాద్ - గుజరాత్
2 బడతాల్ - గుజరాత్ వదోదరా - అహ్మదాబాద్ రూట్ మధ్యలో 5కి మీ. బొరియావి ఆర్ ఎస్
3 గడగా - గుజరాత్ భావనగర్ జిల్లా
4 సారంగపూర్ - గుజరాత్ అహ్మదాబాద్ - భావనగర్ లైనులో
5 ఘోలేరా బందర్ - గుజరాత్ 25కి మీ ధంధూకా ఆర్ ఎస్ అహ్మదాబాద్ నుండి రైలు
6 భుజ్ - గుజరాత్ కచ్‌లోని ముఖ్యనగరం, రాన్ ఆఫ్‌కచ్ ప్రాంతము
7 జునాగఢ్ - గుజరాత్ జునాగఢ్ జిల్లా
8 ఛపైయా - గుజరాత్ గోండా జిల్లా

ఈ ఆలయాలన్నింటిలో స్త్రీలు, పురుషులు వేరువేరుగా స్వామివారిని దర్శిస్తారు. ఇవిగాక ఇంకా అనేక చిన్నచిన్న ఆలయములు గలవు, అన్నీ ఎక్కువగా గుజరాత్‌లోనే కన్పిస్తున్నవి దక్షిణ దేశాన ఈ స్వామివారి దర్శనమే లేదు

**సప్త మోక్షపురములు (7)**

**(CITIES OF LIBERATION)**

**శ్లో॥ అయోధ్యా మధురా మాయా కాశీ కాంచీ**
**హ్యవంతికా పురీ దారావతీ శైవ సప్తైతా మోక్షదాయకాః ॥**

- మానవ శరీరమందు ఉన్నటువంటి చక్రములు మోక్ష పురములందు నిర్దిష్టమై యున్నవి ఇది వీటి విశిష్టత.

1. అయోధ్య - ఉత్తర ప్రదేశ్ - రామజన్మభూమి
   ఇచ్చట సహస్రార చక్రము గలదు
2. మధుర - ఉత్తర ప్రదేశ్ - శ్రీ కృష్ణ జన్మభూమి
   ఇచ్చట అజ్ఞా చక్రము గలదు
3 హరిద్వారం (మాయాపురి) - ఉత్తరప్రదేశ్ - గంగానది హిమాలయముల నుండి సమతలములోనికి ప్రవహించు ప్రాంతం. ఇచ్చట విశుద్ధ చక్రము గలదు.
4. కాశీ - ఉత్తరప్రదేశ్ - విశ్వేశ్వరుడు - పవిత్ర గంగానదీ తీరం
   ఇచ్చట అనాహత చక్రము గలదు

5 కంచి - తమిళనాడు - వింధ్య పర్వతములకు దిగువనున్న (శివకంచి, విష్ణుకంచి) ఏకైక మోక్షపురం

ఇచ్చట స్వాదిష్ఠాన చక్రము గలదు

6 అవంతిక - మధ్యప్రదేశ్ - మహా శ్మశానము (ఉజ్జయిని)

ఇచ్చట మణిపూరక చక్రము గలదు.

7. ద్వారక - గుజరాత్ - పూర్ణ కృష్ణుని నిలయము.

ఇచ్చట మూలాధార చక్రము గలదు.

పై మోక్షపురములలో 3 1/2 కేశవాంశకు, 3 1/2 శివాంశకు చెందినవి కాంచీపురము చెరి సగము మోక్షపుర దర్శనం ఆరోగ్యకరం, మోక్షదాయకం

**ప్రదక్షిణ (పరిక్రమ) క్షేత్రములుగా ప్రసిద్ధిచెందిన ఆలయములు**

1. అరుణాచలం . (T N ), తిరువన్నామలై
2. మంగళగిరి · (A P ), గుంటూరు జిల్లా, హస్తిగిరి
3. మానస సరోవరం · (టిబెట్) కైలాసగిరి.
4. మధుర బృందావనం · (U P ), గోవర్ధన గిరి వ్రజ పరిక్రమం
5. ప్రయాగ క్షేత్రం . (U P ),
6. చిత్రకూట్ ప్రదక్షిణం . (U P ) సీతాపూర్ గ్రామం, సీతారాములు నివసించిన చోటు 8కి.మీ కరవీ R S , ఆలయాల, సరస్సుల ప్రదక్షిణ, పయోష్ణీ నదీతీరం బందాజిల్లా
7 కామద్‌గిరి . (U P ) 2కి మీ. సీతాపూర్, పర్వతం చుట్టుకొలత 3కి,మీ బందా జిల్లా, చిత్రకూటానికి దగ్గర, 13కి.మీ. సీతాపూర్•అనసూయ, అత్రిమహర్షి, దత్తాత్రేయ
8. అవంతిక (ఉజ్జయిని) . (M P ) అవంతిక క్షేత్ర పరిక్రమ
9. నర్మదా పరిక్రమ . (M P )
10 ఓంకార క్షేత్ర పరిక్రమ : (M P )
11 కుషావర్త్ పరిక్రమ . (మహారాష్ట్ర) , త్రయంబకేశ్వర్ ఆలయం దగ్గరి తీర్థం
12 యోగేశ్వరి పరిక్రమ : (మహారాష్ట్ర), త్రివేణీ సంగమం. గోదావరి, బేల్‌గంగా, వర్ధా నదుల సంగమం. ఔరంగా బాద్ జిల్లా, 5కి.మీ పైఠన్, 56కి.మి. ఔరంగాబాద్.
13 శ్రీ కేశవరాయ్ పరిక్రమ . రాజస్థాన్. 8కి.మీ కోట. కోట జిల్లో, చర్మణ్వతీ నదీ తీరం నదితూర్పువాహిని
14 గోకర్ణ క్షేత్ర పరిక్రమ : గోకర్ణం (కర్ణాటక) అరేబియా సముద్ర తీరం
15 వేదగిరి పరిక్రమ (T N ) పక్షితీర్థం, చెంగల్పట్ జిల్లా. 14 కి మీ చెంగల్పట్

16 ద్వారక పరిక్రమ (గుజరాత్) గోమతి ద్వారక చుట్టూ

17 బేట్ ద్వారక పరిక్రమ (గుజరాత్), బేట్ ద్వారక, 7కి మీ వాఖాపోర్టు అరేబియా సముద్రములోని చిన్నద్వీపం

18 గిర్నార్ పరిక్రమ (గుజరాత్) 3కి మీ జునాగఢ్ జునాగఢ్ జిల్లా

19 అయోధ్య పరిక్రమ ( 2కి మీ చిన్న పరిక్రమ) 9కి మీ రెండు పరిక్రమలు

20 బక్సర్ పరిక్రమ (బీహార్) భోజ్‌పూర్ జిల్లా బక్సర్‌లో అనేక దేవాలయములు గలవు

| **లక్ష్మీదేవికి గల 12 నామములు** | **సరస్వతి దేవికి గల 12 నామములు** |
|---|---|
| 1 త్రిలోక పూజిత | 1 భారతి |
| 2 భవమయి స్థిరా | 2 సరస్వతి |
| 3 విష్ణు వల్లభ | 3 శారద |
| 4. సుస్థిర | 4 హంస వాహిని |
| 5. కృష్ణ | 5. జగతీ ఖ్యాత |
| 6 ఈశ్వరి | 6 కుముది |
| 7 కమలా | 7. బ్రహ్మాచారిణి |
| 8. లక్ష్మీంచలా | 8 వాగీశ్వరి |
| 9. హరిప్రియ | 9 వృద్ధమాత |
| 10. పద్మాలయ | 10 వరదాయిని |
| 11. రమ | 11 చంద్రకాంత |
| 12. పద్మధారిణి | 12 భువనేశ్వరి |

**నవ నారసింహులు - (9) (అహోబిలము)**

1 ప్రహ్లాద వరద నారసింహ 2. చత్రవట 3 కరాడ 4 యోగానంద
5 గుణ 6 క్రోధ 7. మాలోల 8. జ్వాలా 9. పవన నారసింహ

ఎగువ అహోబిలము నుండి దిగువ అహోబిలము వరకు గల చుట్టుప్రక్కల ప్రాంతము "పంచక్రోశి" క్షేత్రము. ఈ క్షేత్రములో నవనారసింహులు వెలసియున్నారు వీరి దర్శనము సర్వ పాపహరం

**ఉత్తర దేశ బక్తులు**

| | | |
|---|---|---|
| 1 జయదేవ | 2 చైతన్య | 3 విద్యాపతి |
| 4 చండీదాస | 5. నర్సీమెహతా | 6 మీరాబాయి |
| 7 నాభాజీ | 8. నింబార్క | 9 జీవ హరిదాస్ |
| 10. రఘునాథ దాస్ | 11. రూప | 12 సనాతన |
| 13 గోపాల భట్ట | 14 రఘునాథ భట్ట | 15 వల్లభాచార్య |

వీరందరూ కేశవ భక్తులు (విష్ణు అంశ)

## బిర్లా మందిరములు

1. న్యూఢిల్లీ - లక్ష్మీనారాయణాలయము
2 జైపూర్ - రాజస్థాన్, నారాయణాలయము
3 కాశీ - U P విశ్వనాధ మందిరం, బెనారస్ హిందూ విశ్వవిద్యాలయం
4 మధుర - U P శ్రీ కృష్ణ మందిరం
5 హైదరాబాద్ - A P బాలాజీ ఆలయం
6 కురుక్షేత్రం - హర్యానా, గీతా మందిరం

## ఆళ్వారులు (విష్ణు బక్తులు) - 12

| | |
|---|---|
| 1. దత్తాళ్వారు | 2 పొయ్‌గై ఆళ్వారు |
| 3 పేయాళ్వారు | 4 పెరియాళ్వారు |
| 5. ఆండాళు | 6. తిరు మలిసై |
| 7 కులశేఖర | 8 తిరుప్పాణాళ్వారు |
| 9 తొండ రడిప్పొడి ఆళ్వారు | 10. తిరుమంగై |
| 11 మధుర కవి | 12. నమ్మాళ్వారు |

శ్రీరామానుజుల వారు ఆళ్వారుల లెక్కలోనికి రారు.

## ఆంధ్ర ప్రదేశ్ లో ప్రవహించు నదులు, ఉపనదులు, ఏరులు

1 గోదావరి 2. కృష్ణ 3. పెన్న (పినాకిని) 4. తుంగ 5. భద్ర 6. వేదవతి (తుంగభద్ర ఉపనది - అలంపురం) 7 నాదవతి (తుంగభద్ర ఉపనది) 8. ప్రణీతా (గోదావరి ఉపనది - కాళేశ్వరం) 9. వరదా (గోదావరి ఉపనది) 10. వైణ్య (గోదావరి ఉపనది) 11 సరస్వతి (కాళేశ్వరము) 12 భావ నాశిని. (అహోబిలము) 13 వంశధార (శ్రీకూర్మం) 14. చంద్రవంక (కృష్ణా ఉపనది - మాచర్ల ఎత్తిపోతల జలపాతం) 15 మూసీ (అనంతగిరి, రంగారెడ్డి జిల్లా) 16. కుముద్వతి (పెన్నానది ఉపనది - పుష్పగిరి క్షేత్రం) 17. పాపఘ్ని (పుష్పగిరి క్షేత్రం) 18 వల్కాళ (పుష్పగిరి క్షేత్రం) 19 మాండలి (పుష్పగిరి క్షేత్రం) 20. గోస్తనీ (భీముని పట్నం, 24కి మీ విశాఖపట్నం) 21. స్వర్ణముఖి (శ్రీకాళహస్తి) 22. మంజీర (కరీంనగర్ జిల్లా) 23 కిన్నెర సాని (ఖమ్మం జిల్లా) 24 హంద్రి (కర్నూల్ జిల్లా) 25 పుంచు (చిత్తూరు జిల్లా) 26 పల్లేరు (ప్రకాశం జిల్లా) 27. మన్నేరు (ప్రకాశం జిల్లా) 28. కుందేరు (కర్నూలు జిల్లా) 29 ఆరణి(చిత్తూరు జిల్లా) 30 పోయిని (చిత్తూరు జిల్లా) 31. ఉప్పుటేరు (నెల్లూరు జిల్లా) 32 కండ్లేరు (నెల్లూరు జిల్లా) 33 గుండ్లకమ్మ (కర్నూల్‌జిల్లా) 34 నక్కవాగు (గుంటూరుజిల్లా) 35 తమ్మిలేరు (ఏలూరు) 36 బుడమేరు (విజయవాడ) 37 నాగులేరు (కర్నూల్ జిల్లా) 38 ఆలేరు (వరంగల్ జిల్లా) 39 వేదవతి లేక హగరి (అనంతపురం జిల్లా) 40 నగరు వాగు (గుంటూరు జిల్లా) 41 ఆకేరు (ఖమ్మం జిల్లా) 42 పల్లేరు (ఖమ్మం జిల్లా) 43 మున్నేడు

(ఖమ్మం జిల్లా) 44. కడియం (ఆదిలాబాద్ జిల్లా) 45 పెద్దవాగు (ఆదిలాబాద్ జిల్లా) 46 పెన్ గంగ (ఆదిలాబాద్ జిల్లా) 47 కుడలియాగ్ (మేడక్ జిల్లా) 48. దిండి (మహబూబ్ నగర్ జిల్లా) 49 హల్లాయ్ లేక హల్లియా (నల్గొండజిల్లా) 50 మోహెడ్ మాడ (కరీంనగర్ జిల్లా) 51 శబరి (ఖమ్మం జిల్లా - పోలవరం దగ్గర గోదావరీ సంగమం) 52 సీలేరు (ఒరిస్సా బోర్డర్) 53 పాములేరు (ప.గో జిల్లా) 54 నాగావళి (శ్రీకాకుళం జిల్లా) 55 శారద (విశాఖ జిల్లా) 56 పంపా(అన్నవరం) 57 వంశధార (శ్రీకాకుళం జిల్లా) 58 వేగావతి (శ్రీకాకుళంజిల్లా) 59 బైనేరు (తూ గో జిల్లా) 60 సిద్ద (అదిలాబాద్ జిల్లా) 61. వీర (ఖమ్మంజిల్లా) 62. పెన్నేరు (కడప జిల్లా) 63. సగిలేరు (కడప జిల్లా) 64. చెయ్యేరు (కడప జిల్లా) 65) చిత్రావతి (అనంతపురం జిల్లా) 66) మాచ్ఖండ్ (విశాఖజిల్లా- డుడుమా జలపాతం) 67 బొగ్గేరు (పెన్నానది ఉపనది - నెల్లూరు జిల్లా) 68. చెయ్యేరు (పెన్నానది ఉపనది - నెల్లూర్ జిల్లా) 69. లాంగుళ్య (శ్రీకాకుళం జిల్లా, శ్రీకూర్మం దగ్గర) 70 ఇంద్రావతి (ఖమ్మం జిల్లా) 71. ఉప్పుటేరు (ప గో జిల్లా)

యివిగాక యింకా కొన్ని చిన్న, చిన్నవి మారుమూలలో గలవు.

**శ్రాద్ధ కర్మలు జరిపించు ప్రఖ్యాత, పురాణ, పుణ్యక్షేత్రాలు**

1 బ్రహ్మ కపాలం - బదరీనాధ్ (ఉత్తర ప్రదేశ్) అలకనందా తీరం.

2 కాశీ - (ఉత్తర ప్రదేశ్), గంగానదీ తీరం.

3. ప్రయాగ - (ఉత్తర ప్రదేశ్) త్రివేణీ సంగమం.

4 గయ - (బీహార్). ఫల్గుణీ నదీతీరం.

5. అయోధ్య - (ఉత్తరప్రదేశ్) సరయూ నదీ తీరం

6 హరి ద్వారం - (ఉత్తర ప్రదేశ్) గంగానదీ తీరం

7 కురుక్షేత్రం - (హర్యానా). సరోవరము

8 దేవ ప్రయాగ - (ఉత్తరప్రదేశ్) అలకనందా, భగీరథీ సంగమ స్థానం.

9 మధుర - (ఉత్తరప్రదేశ్) మధుర జిల్లా

10 నైమిశారణ్యం - (ఉత్తరప్రదేశ్) సితాపూర్ జిల్లా.

11. త్రిజోగి నారాయణం (ఉత్తరప్రదేశ్) చమోలి జిల్లా. ఊఖీమరం - కేదార్నాధ్ మద్యలో.

12. బుద్దగయ - (బీహార్), గయ దగ్గర

13 రాజగిరి - (బీహార్), ఉష్ణ జలాలు, 20 కి.మీ నలంద

14 మధ్ మహేశ్వర్ - (ఉత్తర ప్రదేశ్) చమోలి జిల్లా 50కి మీ. గుప్తకాశీ, వైతరణీ నదీతీరం

15. రుద్రనాధ్ - (ఉత్తరప్రదేశ్) చమోలి జిల్లా. 20కి మీ. గోపేశ్వర్

16 ధౌత పాత్ - (ఉత్తరప్రదేశ్), 10కి మీ. నైమిశారణ్యం హత్యాహరణ తీర్ధం, గోమతి నదీ తీరం.

17 బిఠూర్ - (ఉత్తరప్రదేశ్) బ్రహ్మ వర్తం ఫరూకాబాద్ జిల్లా, కనౌజ్ దగ్గర
18. పిండారక తీర్థం - (హర్యానా) జింద్ జిల్లా, పానిపట్టు నుండి జింద్ పోవు మార్గములో.
19. ఉజ్జయిని - (మధ్యప్రదేశ్) షిప్రానదీ తీరం
20 తిరుపతి - (ఆంధ్రప్రదేశ్)
21 కుంభకోణం - (తమిళనాడు), మహామాఘం సరస్సు
22. సిద్ధపూర్ - (గుజరాత్) మాతృగయ మహేషణ జిల్లా, సరస్వతీ నదీ తీరం
23. ద్వారక - (గుజరాత్), జామ్ నగర్ జిల్లా
24 పరశురామ గుండం - (అస్సాం), బ్రహ్మగుండం, శివసాగర్ దగ్గర.
25. శ్రీరంగం - (తమిళనాడు), కావేరీ తీరం.
26 చాణోద్ - (గుజరాత్), వదోదరా నుండి రైలు
27 జాజ్‌పూర్ - (ఒరిస్సా), 70కి.మీ కటక్
28 రామేశ్వరం - (తమిళనాడు), లక్ష్మణ తీర్థం
29 నారాయణ సరోవరం - (గుజరాత్) 150 కి మీ. భుజ్.
30 భువనేశ్వర్ - (ఒరిస్సా), బిందు సరోవరం.
31. శూలపాణి (శుర్పణేశ్వర్) - (మధ్యప్రదేశ్), నర్మదా నదీ తీరం.
32 అమర్ కంటక్ - (మధ్యప్రదేశ్), నర్మదానది జన్మస్థానం
33. ధనుష్కోటి - (తమిళనాడు), బంగాళాఖాత తీరం.
34 ప్రభాస తీర్థం - (గుజరాత్), సోమనాధ్
35 నాసిక్ - (మహారాష్ట్ర), గోదావరి నదీ తీరం
36. శివకంచి - (తమిళనాడు), సర్వతీర్థ సరోవరం.
37. దర్భశయనం - (తమిళనాడు) బంగాళాఖాత తీరం.
38. త్రయంబకేశ్వర్ - (మహారాష్ట్ర), కుషావర్త సరోవరం
39. పండరీ పురం - (మహారాష్ట్ర), చంద్ర భాగ నదీతీరం
40. జగన్నాధ పురి - (ఒరిస్సా), పూరీ జగన్నాధం.
41. లోహర్గల్ - (రాజస్తాన్), సవాయ్ మధోపూర్ జిల్లా.
42. పుష్కర్ - (రాజస్తాన్), బ్రహ్మ సరోవరం.

**కదిలే స్తంభాలు, ఒక దాన్ని కదిపితే రెండవది కదులుతుంది**

1. అహ్మదాబాద్ (గుజరాత్)
   1. రైల్వే స్టేషన్ ప్రక్కన గల మసీదులోను,
   2. ఊరిలో నున్న మసీదు లోను
2 ఎల గందుల (ఆంధ్ర ప్రదేశ్)
   10కి మీ. కరీం నగర్
   ఇక్కడ ఉన్న కోటలోని మసీదులో

3 పల్లా గ్రామం (హర్యానా) గూర్గమ్ జిల్లా "ద్రాగా మూసా దుర్గాకి" ఇరుప్రక్కలా ఉన్న స్తంభాలు.

ఇవన్నీ సున్నము ఇటుక కట్టడాలే

**ప్రసిద్ధి నొందిన ఆశ్రమములు**

1. శ్రీ అరవిందాశ్రమము - తమిళనాడు, పాండిచేరి,, 12కి మీ ఆరోవిళ్ళి (మాతాశ్రీ - ఫ్రెంచి)
2. శ్రీ రమణాశ్రమము - తమిళనాడు, తిరువన్నామలై. (అరుణాచలం)
3. శ్రీ శివానందాశ్రమము - ఉత్తరప్రదేశ్ ఋషీకేశ్. (Devine Life Society)
4. శ్రీ రామకృష్ణ మఠము - పశ్చిమ బెంగాల్ కలకత్తా బేలూరు మఠం
5 శ్రీ గౌడీయ మఠం - పశ్చిమ బెంగాల్ మాయాపూర్.
6. శ్రీ వ్యాసాశ్రమం - ఆంధ్ర ప్రదేశ్, ఏర్పేడు, 10కి.మీ శ్రీ కాళహస్తి
7. శ్రీ పరశురామాశ్రమం - గుజరాత్ సోమనాధ్, ప్రభాస తీర్థం
8 శ్రీ వేద వ్యాసాశ్రమం - మహారాష్ట్ర, హోండా నాగనాధ్.
9. శ్రీ పౌనారాశ్రమం - మహారాష్ట్ర, 68కి.మీ నాగపూర్ (ఆచార్య వినోబాభావే)
10. శ్రీ గాంధీజీ సేవాశ్రమం - మహారాష్ట్ర, 77కి.మీ. తుల్జాపూర్.
11 శ్రీ సబర్మతి ఆశ్రమం - గుజరాత్. అహ్మదాబాద్, సబర్మతి నదీతీరం (మహాత్మాగాంధి)
12. శ్రీ ఆచార్య రజనీష్ ఆశ్రమం - మహారాష్ట్ర, పూనే, కోరేగామ్ రోడ్డుపై.
13 శ్రీ వశిష్టాశ్రమం - అస్సాం. 12కి.మీ గౌహతి.
14. శ్రీ సాందీపని ఆశ్రమం - మధ్యప్రదేశ్ - ఉజ్జయిని.
15. శ్రీ మహర్షి మహేష్ యోగి ఆశ్రమం - ఉత్తరప్రదేశ్, ఋషీకేశ్
16. శ్రీ కాళి కమల బాబా ఆశ్రమం - ఉత్తరప్రదేశ్, ఋషీకేశ్
17 శ్రీ వాల్మీకి మహర్షి ఆశ్రమం - రాజస్థాన్, మౌంట్ ఆబూ.
18. శ్రీ మోహర్ బాబా ఆశ్రమం - మహారాష్ట్ర, పూనే.
19. శ్రీ భృగు మహర్షి ఆశ్రమం - గుజరాత్, బ్రోచ్, నర్మదా నదీ తీరం.
20. శ్రీ నరసింహ మెహతాచోర (ఆశ్రమం) - గుజరాత్, జునాగడ్.
21 శ్రీ వశిష్టాశ్రమం - హిమాచల ప్రదేశ్, మనాలి 40కి.మీ కులు, ఉష్ణగుండములు.
22. శ్రీ వ్యాసాశ్రమము - హిమాచల ప్రదేశ్, 24కి.మీ. మనాలి. రొహటాగ్ కనుమదగ్గర (3,915 మీటర్ల ఎత్తున) బియాస్‌నదీ జన్మస్థానమున.
23 శ్రీ భరద్వాజాశ్రమము - ఉత్తరప్రదేశ్, అల్హాబాద్, గంగానదీ తీరం
24 శ్రీ స్వామి వివేకానందాశ్రమం - ఉత్తర ప్రదేశ్, శ్యామలాతల్, పిరోర్‌ఘర్ జిల్లా,
25. శ్రీ వ్యాసాశ్రమము - ఉత్తరప్రదేశ్, 55కి మీ ఋషీకేశ్, భగీరధి, వ్యాసగంగా నదుల సంగమ సానం

26 శ్రీ రేవ్య ఋషి ఆశ్రమము - ఉత్తర ప్రదేశ్, ఋషీకేశ్

27. శ్రీ బ్రహ్మచారి ఆశ్రమము - ఉత్తరప్రదేశ్, అల్హాబాద్

28. శ్రీ సుందర చైతన్య ఆశ్రమం (ఆంధ్రప్రదేశ్) ధవళేశ్వరం.

29 శ్రీ గణపతి సచ్చిదానందాశ్రమం. (కర్ణాటక). మైసూర్

30 శ్రీ సత్యశాయి బాబా ఆశ్రమం (ఆంధ్రప్రదేశ్) పుట్టపర్తి

31 "చిన్నబాబా ఆశ్రమం - ఆంధ్రప్రదేశ్ - కర్నూల్

| | **నవగ్రహములు** | **నవధాన్యములు** | **నవరత్నములు** |
|---|---|---|---|
| 1 | సూర్యుడు | గోధుమలు | కెంపు |
| 2 | చంద్రుడు | బియ్యం | ఘుత్యం |
| 3 | అంగారకుడు | కందులు | పగడము |
| 4 | బుధుడు | పెసలు | మరకతం |
| 5. | బృహస్పతి | శనగలు | పుష్యరాగం |
| 6. | శుక్రుడు | బొబ్బర్లు | వజ్రం |
| 7. | శని | నువ్వులు | నీలం |
| 8. | రాహువు | మినుములు | గోమేధికం |
| 9. | కేతువు | ఉలవలు | వైఢూర్యం |

పూర్వకాలం మహారాజులు నవరత్న ఖచిత సింహాసనముపై ఆశీనులయ్యేవారు, ఇప్పుడు ధనికులు నవరత్నాలు పొదిగిన ఉంగరములు ధరించుచున్నారు.

## సవాయ్ జైసింగ్ I I నిర్మించిన నక్షత్ర శాలలు - 5

1. ఢిల్లీ - జంతర్ మంతర్.
2. జైపూర్ - రాజస్థాన్ . ఊరు మధ్యలో.
3 మధుర - ఉత్తర ప్రదేశ్, ఇచ్చటనున్న కోటయొక్క ప్రహరీ గోడ ప్రక్కన (ప్రస్తుతం శిధిలమైపోయినది)
4. ఉజ్జయిని - (మధ్యప్రదేశ్) వేదశాల.
5. కాశీ - (ఉత్తర ప్రదేశ్) దశాశ్వ మేధ ఘాట్ దగ్గర.

## హిరణ్యాక్ష వరాలు

## (20+3)

(ఎన్నో రకములుగా ఆలోచించి కోరిన ప్రత్యేకత - మరణము లేకుండా)

1. గాలిని 2. కుంభిని (భూమిని) 3. అగ్నిని 4 నీటియందు 5. ఆకాశమందు 6. దిక్కులందు 7. రాత్రులందు 8 పగటి యందు 9 చీకటి యందు 10 వెలుగునందు 11. జలచరం చేత 12. రాక్షసుల చేత 13. భీకర మృగాల చేత 14 సర్పాల చేత 15. దేవతల చేత 16. నరుల చేత 17. సాధు జంతువులచేత 18 కలహాలలోను 19 అన్ని

రకాల అస్త్రాల చేత 20. అన్ని విధాల శస్త్రాల చేత చావకుండంగ మరియు 1 యుద్ధములో మంచి శౌర్యం ప్రదర్శించే విధముగాను 2 లోక పాలకులను అతిక్రమించే మహిమను 3, ముల్లోకాలను జయించే శక్తిని హిరణ్యాక్షుడు కోరుకున్నాడు

**సంగీత స్తంబాలు (Musical Pillars) ఉన్న దేవాలయములు**

1 మధురై . (TN) మీనాక్షి దేవాలయములోని మండపములో,
2 శుచీంద్రం (TN) స్థాణేశ్వరుని దేవాలయములోని మండపములో
3. హంపీ విజయనగరం (కర్నాటక) నాట్య మండపములో
4 తిరునల్వేలి : (T N ) స్వామి నెల్లియప్పార్, అమ్మవారు కాంతిమతి అంబాళ్ దేవాలయములోని మండపములో
5. ఆళ్వారు తిరునగరి (T N ) తిరునెల్వేలి జిల్లా ఇచ్చట ఆలయము లోని స్వామివారు అధినాధుడు ఈ ఆలయములో రాతితో మలచబడిన నాదస్వరం (Musical Instrument) ఉన్నది ఉత్సవాల సమయములో దీన్ని వాయిస్తూంటారు
6 ఆగ్రా . (ఉత్తరప్రదేశ్) రాజ్‌మహల్‌లో సంగీత స్తంభాలు కలవు
7. ఎల్లోరా (మహారాష్ట్ర) జైన్ దేవాలయములో గలవు
8 తంజావూరు .(T N.) బృహదీశ్వరాలయములోని మండపములో
9. రామప్ప దేవాలయం · (A P) పాలంపేట ఆలయ మండపములో కుడివైపున సప్తస్వరాలు పలికే చిన్నస్తంభం ఉన్నది
10 స్వామిమలై . (T N ) కుంభకోణం దగ్గర, తంజావూరు జిల్లా సుబ్రహ్మణ్య స్వామి వారి ఆలయములో

**దేవతలు - వాహనములు**

| | | |
|---|---|---|
| భైరవుడు | - | శునకము |
| శీతలాదేవి | - | గార్దభము |
| గంగాదేవి | - | మొసలి |
| యమునాదేవి | - | తాబేలు |
| ఇంద్రుడు | - | ఐరావతము |
| అగ్ని దేవుడు | - | గొర్రె లేక మేక |
| యముడు | - | మహిషము |
| నిఋుతి | - | ప్రేతము |
| కుజుడు | - | మేషము |
| వరుణుడు | - | మొసలి |
| వాయుదేవుడు | - | లేడి |
| కుబేరుడు | - | మనిషి, పుష్పకం |
| శివుడు | - | వృషభము |
| సూర్యుడు | - | ఏడు అశ్వాలు పూన్చిన ఏక చక్రరథం |

| | | |
|---|---|---|
| చంద్రుడు | - | లేడి |
| బుధుడు | - | సింహాము |
| బృహస్పతి | - | కృష్ణ సారమనే లేడి |
| శుక్రుడు | - | గవయ మనే మృగం (నీలాగాయ్) |
| శని | - | కాకి, గ్రద్ద |
| రాహువు | - | సింహం, ఒంటె |
| కేతువు | - | సింహం |
| విష్ణుమూర్తి | - | గరుత్మంతుడు |
| లక్ష్మీదేవి | - | గుడ్లగూబ |
| మన్మధుడు, రతీదేవి | - | చిలుక |
| కుమారస్వామి | - | నెమలి |
| విఘ్నేశ్వరుడు | - | ఎలుక |
| బ్రహ్మ, సరస్వతి | - | హంస |
| పార్వతి | - | సింహాము |
| దుర్గాదేవి | - | పెద్దపులి |
| హనుమంతుడు | - | ఒంటె |

**SPECIAL CITIES ప్రత్యేక నామధేయములు గల పట్టణములు & ప్రాంతములు**

| | | | |
|---|---|---|---|
| 1 | పింక్ సిటీ | . | జైపూర్ - రాజస్తాన్ |
| 2 | మార్బుల్ సిటీ / లేక్ సిటీ | · | ఉదయపూర్. రాజస్తాన్. |
| 3 | ఖజురహో ఆఫ్ రాజస్తాన్ | . | జగత్, 58కి మీ. ఉదయపూర్. ఇచ్చట గల అంబికా మాత పాలరాతి ఆలయం ప్రసిద్ధి |
| 4. | మ్యూజియం సిటీ | . | జై సాల్మీర్, రాజస్తాన్, ప్రతి యిల్లూ కళాత్మకముగా నిర్మించబడినది. |
| 5 | సిటీ ఆఫ్ బెల్స్ | · | జైరా పాటన్, రాజస్తాన్, 60కి.మీ కోట ఇచ్చట సూర్యాలయము గలదు. |
| 6. | వీట్ బౌల్ ఆఫ్ ఇండియా | : | పంజాబ్ |
| 7. | ఎబోడ్ ఆఫ్ పీస్ | . | ఆనంద పూర్ సాహిబ్, సిక్కు దేవాలయం సట్లెజ్ నదీ తీరము నయనా దేవి కొండల దగ్గర. పంజాబ్. |
| 8 | గేట్ వే ఆఫ్ కాశ్మీర్ వ్యాలీ | | జమ్ము (J&K) తావీ నదీ తీరం |
| 9 | క్వీన్ ఆఫ్ హిల్ రిజార్ట్సు | | మనాలీ, (H P ) |
| 10 | ఫ్లేమ్ గార్డెన్ | | జ్వాలా ముఖి, (H P ) |
| 11 | కోర్ స్టేట్ ఆఫ్ ఇండియా | | U P |

| | | |
|---|---|---|
| 12 | ల్యాండ్ ఆఫ్ బుద్ధా | బీహార్ |
| 13 | స్కాట్ లాండ్ ఆఫ్ ది ఈస్టు | షిల్లాంగ్ (మేఘాలయ) |
| 14 | క్వీన్ ఆఫ్ డెక్కన్ | పూనే, మహారాష్ట్ర |
| 15 | 1 ది పెన్షనర్స్ ప్యారడైజ్<br>2 ది గార్డెన్ సిటీ | బెంగుళూరు, కర్ణాటక |
| 16 | వ్యాలీ ఆఫ్ ఫ్లవర్స్ | యమునోత్రికి పోవు త్రోవలో, U P |
| 17 | మాంచెస్టర్ ఆఫ్ ఇండియా | కాన్పూర్, U P |
| 18 | ఓరియంటల్ సూపర్ స్విర్జర్లాండ్ | జామ్ నగర్, గుజరాత్ ఇచ్చట సోలేరియం (సూర్యచికిత్సాలయం) గలదు |
| 19 | జ్యూఎల్ ఆఫ్ కతియవాడ్ | జామ్‌నగర్, గుజరాత్ |
| 20 | ప్రభాస పట్టణం | సోమనాధ్, గుజరాత్ |
| 21. | వెనీస్ ఆఫ్ ఇండియా | అలెప్పి, కేరళ |
| 22. | సిటీ ఆఫ్ ఫెస్టివల్స్ . | మధురై, తమిళనాడు. |
| 23 | సిటీ ఆఫ్ టెంపుల్స్ . | భువనేశ్వర్ (ఒరిస్సా) |
| 24 | క్యాధెడ్రల్ సిటీ ఆఫ్ ఇండియా . | భువనేశ్వర్, ఒరిస్సా, |
| 25 | క్వీన్ ఆఫ్‌ది అరేబియన్ సీ | కొచ్చిన్ పోర్టు (కేరళ) |
| 26. | గోల్డెన్ సిటీ ఆఫ్ థౌజండ్ టెంపుల్స్ | కాంచీపురం, (T N ) |
| 27. | సిటీ ఆఫ్ సన్‌రైజ్ · | ఉదయపూర్, రాజస్తాన్. |
| 28. | సిటీ ఆఫ్ బ్లడ్ (రక్తం) . | తేజ్‌పూర్ (పూర్వ నామధేయం సోనిత్‌పూర్) దర్రాంగ్ జిల్లా, అస్సాం |
| 29. | ఏథెన్సు ఆఫ్ గ్రీసుతో సమానమైనది . | మధురై, తమిళనాడు |
| 30. | గేట్ వే టూది సౌత్ | మద్రాసు (T N ) |
| 31. | సిటీ ఆఫ్‌గోల్డెన్ టెంపుల్ : | అమృతసర్ (పంజాబు) |

**అష్ట లక్ష్మలు శ్రీ కృష్ణుని అష్టభార్యలుగా వెలసిన వివరములు**

| | అష్టలక్ష్మలు | అష్టభార్యలు |
|---|---|---|
| 1 | ఆది లక్ష్మి | రుక్మిణీ దేవి |
| 2. | ధాన్యలక్ష్మి | జాంబవతీ దేవి |
| 3. | ధైర్యలక్ష్మి | సత్యభామాదేవి |
| 4 | గజలక్ష్మి | కాళింది |
| 5. | సంతానలక్ష్మి | నాగ్నజితి |

6. విజయలక్ష్మి మిత్రవింద
7 విద్యాలక్ష్మి లక్షణ
8 ధనలక్ష్మి భద్ర

త్రేతాయుగములో లక్ష్మీదేవి సీతగా అవతరించి శ్రీరాముని నుండి ఎడబాటు నొందినది భర్త నుండి ఎడబాబు, విరహం పొందకుండా ఉండటానికి జగజ్జనని లక్ష్మీమాత కాళికా దేవిగురించి తపస్సు చేయగా అమ్మవారు కరుణించినది. ద్వాపరయుగములో అష్టలక్ష్మీ అవతారములతో శ్రీకృష్ణుని భర్తగా పొంది ఎడబాటు లేక ఎనిమిది రూపాలతో అవతరించి ఆనందిస్తారని తెలిపినది కృష్ణావతార పరిసమాప్తి అనంతరం విష్ణుమూర్తి వక్షస్థలముపై వరలునటుల అనుగ్రహించినది

## యావత్ భారతదేశ దివ్య దేవాలయ సందర్శనమున గోచరించు ప్రత్యేకతలు

ప్రాణికోటిని (మానవజాతిని) భగవంతుడు సృష్టించాడు ఒక వ్యక్తికి, మరొక వ్యక్తికి ఆకారములోగాని, ఆలోచనలలోగాని ఇంకా ఏ విషయములోనూ ఏ ఇద్దరి వ్యక్తులకు పోలికలు లేకుండా ఉండుటే సృష్టి ప్రత్యేకత ఏక గర్భ సంజాతులలో కూడా చేతివ్రేళ్ళ గుర్తులలోనైనా భేదము వుండి తీరుతుంది ఇది సృష్టి రహస్యము ఇదే విధముగా మానవుడు సృష్టించిన విగ్రహములను, ఆలయములను గమనిస్తే వాటిల్లో గూడా ఒకదానినొకటి పోలి ఉండదు దీనిని బట్టి చూస్తే మానవులలో గూడా దైవశక్తి ఉన్నట్లుగా గమనించవచ్చు.

మానవుని నిత్యజీవితములో జరుగు సంఘటనలే భగవంతునికి కూడా నిజజీవితమున్నట్లు భావించి ఆరాధించుటచే భగవంతుడు భక్తునికి అందుబాటులో నున్నట్లు భావన కలుగుతుంది.

ఉదాహరణకు

1 పుట్టిన రోజు వేడుకలు శ్రీకృష్ణాష్టమి వగైరా
2. కళ్యాణము : సూత్రధారణ కార్యక్రమాదులతో సహా శ్రీరాముడు, శ్రీవేంకటేశ్వరుడు
3 కళ్యాణానికి బంధుమిత్ర సపరివారం తరలిరావడం · మధుర మీనాక్షి సుందరేశ్వరుల వివాహానికి పెండ్లికుమార్తె అన్నగారు సౌందరరాజ పెరుమాళ్ అలఘర కోయిల్ నుండి తరలిరావడం
4. తెప్పోత్సవము : కళ్యాణోత్సవ, బ్రహ్మోత్సవాది ఉత్సవముల తరువాత ఆలయప్రక్కన గల పుణ్యతీర్థములో స్వామివారు దేవేరితో సహా విహరించడం
5 స్నానయాత్ర త్రివేంద్రంలోని శ్రీ అనంత పద్మనాభ స్వామివారికి శంఖుముఖం అనుచోట సముద్రస్నానం
6. రథయాత్ర . పూరీలోని జగన్నాధ, బలభద్ర, సుభద్రల రథయాత్ర
7 బహుభార్యాత్వం విష్ణుమూర్తి - శ్రీదేవి, భూదేవి, శంకరుడు - గౌరి, గంగ, బ్రహ్మ - గాయత్రి, సావిత్రి మొదలగు అనేక ఇతర దేవుళ్ళు
8. అమ్మవార్లకు బహిష్టులు ఉత్తరాన గౌహతిలో కామాఖ్య, దక్షిణాదిన చెంగనూరులో భగవతి

9 సుప్రభాతం, పవళింపు సేవలు, నిద్రలేపడం, నిద్రపుచ్చడం శ్రీ వేంకటేశ్వరుడు, తుల్జాభవాని, శ్రీనాధ్‌జీ (కృష్ణుడు)

10 నైవేద్యం, నివేదన మొదలైనవి

11 మరణము పదిరోజులు సంతాపదినాలు, దేవదాసికి వైధవ్య ప్రాప్తి, గిరిజన సాంప్రదాయం ప్రకారం కళేబరాలను పాతిపెట్టుట, నవకళేబర ఉత్సవం మొదలగు కార్యక్రమాలు - పూరీ (ఒరిస్సా)

12. అనుబంధం · యుద్ధములో కుమారుని విజయానికి తండ్రి ఉపవాస దీక్ష, సర్వశక్తి ప్రార్ధన - వైక్కం (కేరళ)

ప్రకృతిలోని వింతలు (ప్రత్యేకతలు) గల చోట్ల పూర్వీకులు ఆలయ నిర్మాణం గావించారు ఇతర ప్రాంతవాసులు భగవద్దర్శన రూపేణ అచ్చటి ప్రకృతి సౌందర్యము నారాధిస్తారనే భావనతో,

1. హిమాలయ మంచుకొండలలో ఒకేచోట నుండి అతిచల్లని నీరు, అతివేడినీరు వచ్చుచుండుట బద్రీనాధ్ (ఉత్తరప్రదేశ్).
2. రాతికొండలనుండి సన్నటి రంధ్రముల ద్వారా మంటలు వచ్చుట. జ్వాలాముఖి (హిమాచలప్రదేశ్). కొండగుహలోనున్న రంధ్రముల ద్వారా నీరుబయటకు వచ్చి మంచువలె గడ్డకట్టి లింగరూపము దాల్చుట (అమరనాధ్ - జమ్ము & కాశ్మీర్)
3. ఆవిరులు గ్రక్కు చెరువులు గలచోటు. బక్రేశ్వర్ (పశ్చిమబెంగాల్)
4. సూర్యాస్తమయం, చంద్రోదయం ఒకేచోట ఒకేసారి కనిపించు కమనీయ దృశ్యం. కన్యాకుమారి (తమిళనాడు)
5. మామిడిచెట్టు : ఆకుకి ఆకుకి ఆకారములో తేడా, పండుకి పండుకి రుచిలో తేడా. కంచి (తమిళనాడు)
6. పౌర్ణమికి పెరుగుదల, అమావాస్యకు తరుగుదల గల మంచులింగము. అమర్‌నాధ్ (జమ్ము & కాశ్మీర్)
7. ఉరుములకు, మెరుపులకు పగిలిపోవు శివలింగము. కులు (హిమాచలప్రదేశ్)
8 ఎన్నోవేల సంవత్సరముల నుండి బెల్లం రాతిపై చితక్కొట్టి పానకం చేస్తున్నా ఈగగాని, చీమగాని కానరాదు. మంగళగిరి (A.P)
9. వేల సంవత్సరముల నుండి లింగంపై నెయ్యిపోసినా, నెయ్యిగడ్డ కట్టుకుపోయి నిలువవున్నా వాసనరాని నెయ్యి లింగం. వడక్కునాధన్
10. నదీ గర్భములో ఉష్ణగుండాలు. భద్రాచలం (ఆంధ్రప్రదేశ్)
11. సముద్రం, చెరువు, నూతుల స్నానం ఒకేచోట. రామేశ్వరం (T.N)
12. నదీ పుట్టుక స్థానాలు, నదీనదుల సంగమ స్థానాలు, నదీసాగర సంగమ స్థానాలు. గంగోత్రి, ప్రయాగ, గంగాసాగర్ మొ॥నవి.
13 పవిత్ర నదీతీరాలలో వెలసినవి కాశి, (ఉత్తరప్రదేశ్)

భక్తునికి, భగవంతునికి మధ్య వారధిలాంటివి దేవాలయములు, ఆధ్యాత్మిక శక్తి,

దైవశక్తి, ప్రకృతి శక్తులతో కూడుకుని ఉన్నవి తీర్థయాత్రల వలన కలుగు లాభాలు అనేకం. అనేకమంది తెలియజేసియున్నారు

పంచభూతాత్మకమైన శరీరానికి (ఇంద్రియాలకు) కొన్ని శక్తులు మాత్రమే ఉన్నవి. వాటితో భగవద్దర్శనం (శక్తిదర్శనం) సాధ్యముకాదు అందుకు చాల సాధన కావాలి ఇది అందరికి అందుబాటులో లేదు అందుచేత సామాన్య మానవుడు శక్తి దర్శనము కన్నా శక్తి అనుగ్రహానికి, శక్తి యిచ్చే ఫలితానికి ప్రయత్నించవచ్చును ధర్మ పథాన నడుస్తూ, మానవసేవ చేస్తూ శక్తి ఆదేశాలను పాటించి ధన్యత్వం పొందవచ్చును. పుణ్యతీర్థాలలో స్నానమాచరించి, పవిత్ర దేవాలయ ప్రాంగణములోని దేవతా మూర్తులను దర్శించి ప్రసాదము స్వీకరించి మధురానుభూతులు పొందుటయేగాక అనారోగ్యము నుండి విముక్తుడై దివ్యానుభూతిని పొందవచ్చును

దేవాలయ దర్శనమున శిల్పకళ, చిత్రకళ, నృత్యకళ, సంగీతాది కళలను గమనించవచ్చును, నేర్చుకొనవచ్చును.

తీర్థయాత్రల నుండి తిరిగివచ్చిన ప్రతీసారి శరీరమునకు, మనస్సునకు శుద్ధి సిద్ధిస్తుంది, ప్రశాంతత లభిస్తుంది, మంచిపని చేశామనే తృప్తి మిగులుతుంది. వీటిముందు వెచ్చించిన ధనం, పడిన శ్రమ, వినియోగించిన కాలము వృధాగా కనిపించవు.

ధన చింతన ఇహానికి, ధర్మచింతన పరానికి అనే భావన కలుగుతుంది. ఇంకా .

1. కాళికా దేవిని (దుర్గాదేవిని) నయనార్లుగాని, ఆళ్వారులుగాని స్తుతించినట్లు కనిపించదు.
2 సర్పపూజను బట్టి "దేనికి భయపడతారో దానిని పూజిస్తారు'' అను సూత్రము తెలియుచున్నది.
3. చాలా దేవాలయములలో పవిత్ర వృక్షములు, సర్పవిగ్రహములు గల రాళ్ళు దర్శనమిస్తాయి.
4. కామకళ హిందూ మతములో ఒక భాగముగా అక్కడక్కడ కనిపించుచున్నది.
5 ప్రతీ వ్యక్తికి ఇష్టదేవతారాధనము నందే దివ్యానుభూతికి వలయుబీజములు కలవు.
6. విగ్రహారాధనము నిశ్చలచిత్తమును, పవిత్ర హృదయమును ప్రసాదించును.
7 దేవాలయములు భక్తికి, ఆధ్యాత్మిక విజ్ఞానమునకే గాక జాతి సంస్కృతికి ఆలవాలములు.
8. జ్ఞాని అయిన మానవుడే గాక క్రిమికీటక, జంతుజాలము కూడా పరమేశ్వరునర్చించ వచ్చును. ఉదా : శ్రీకాళహస్తీశ్వరగాధ.
9. పురాతన ఆలయములో ముఖ్యముగా మధ్యప్రదేశ్, ఒరిస్సాలలో సెక్సు విజ్ఞానము అధికముగా కనిపించుచున్నది.
10. దక్షిణ భారతదేశములోని శివాలయములలో విష్ణుమూర్తి తాలుకు విగ్రహాలు కన్పిస్తున్నవి.
11. విగ్రహములు కేవలం ఆట బొమ్మలు కాదు - భగవంతుని చిహ్నాలు ఆలయములు కేవలం మ్యూజియములు కాదు spiritual power-కేంద్రాలు. ఆరాధనా స్థలాలు. పండిత, పామరులకు పుస్తకాలు ఇవ్వలేనంత శాస్త్ర జ్ఞానాన్ని అందిస్తున్నాయి నాటి సామాజిక.చరిత్రను చాటిచెబుతూ క్షోభలేని ప్రశాంత జీవనాన్కి దోహదపడుతున్నాయి.

## దేవాలయములు - ప్రకృతి వైద్య కేంద్రాలు

1 ఆలయము వద్దగల తీర్ధ స్నానము ఉదయముననే చన్నీటి స్నానము ముఖ్యముగా ప్రకృతి సిద్దమైన వాతావరణములో నున్న చన్నీటి స్నానము. శుచితో బాటు ఏకాగ్రతను కలిగిస్తుంది ఖనిజ సంబంధమైన నీటి స్నానం, అందలి సూర్య నమస్కారము శరీరదారుఢ్యాన్ని పెంచుతుంది ముఖ్యముగా కుంభమేళా, వగైరా పవిత్ర సమయాలలో పరమయోగులు తీర్థాలలో స్నానము చేస్తారు కాబట్టి అట్టి తీర్ధ స్నానము ప్రయోజనకరము అట్లాగే పుష్కర సమయములలో తీర్ధ స్నానము అతిపవిత్రమైనది

2. ప్రదక్షిణం ఆలయ ప్రాకారము లోపల, గర్భగుడికి బైట మూడుసార్లు ప్రదక్షిణం చేస్తారు ప్రతీరోజూ ఉదయం. నడక దినవారీ వ్యాయామం

ఆలయం చుట్టూ పరచబడిన రాళ్ళపై వట్టి కాళ్ళతో నడుస్తాము. (చెప్పులు లేకుండా) ఈ రాళ్ళపై నున్న సన్నని రంధ్రాలపై అరికాళ్ళ బరువు ఆనుతుంది ఈ వత్తిడికి కాళ్ళలో నున్న నరాల కూడళ్ళు కదలి, ఇతర అవయవాలు చక్కగా పనిచేస్తాయి ఇదే ప్రషర్ వైద్యం (ఆక్యుపంచర్)

3 విఘ్నేశ్వరుని ముందు కుడిచేత ఎడమ చెవిని, ఎడమచేత కుడిచెవిని పట్టుకుని గుంజీలు తీస్తాము ఇది వ్యాయామములో ఒక భాగము

4. సాధారణముగా ఆలయములలో ప్రముఖమైన వృక్షము ఉంటుంది ముఖ్యముగా శివాలయములలో. ఈ చెట్టునకు ఔషధశక్తి ఉంటుంది. చెట్టుక్రిందగాని, చెట్టుముందుగానీ కూర్చుని ధ్యానం చేసేటప్పుడు ఆ చెట్టుగాలి కూర్చున్న వారి ఊపిరితిత్తులను శుభ్రపరచి, శరీరంపై నున్న విషక్రిములను నాశనముచేసి, శరీరారోగ్యమును కాపాడుతుంది.

5 ఆలయములోని వృక్షము క్రింద దక్షిణామూర్తి విగ్రహం ఉంటుంది. మూర్తికెదురుగా కూర్చుని జపం చేస్తారు. అనగా ఉత్తరాభిముఖముగా నుండి ధ్యానము చేయుట. ఉత్తర దిశలోని అయస్కాంత శక్తి ప్రభావానికి లోనై రక్తప్రసరణ సక్రమముగా జరగడానికి దోహద పడుతుంది ఈ అయస్కాంత చికిత్స మూలకముగా నొప్పులు, బాధలు, రక్తానికి సంబంధించిన ఇతర సమస్యలు తీరతాయి

6 ఆలయముల నిర్మాణము . చక్కటి ప్రకృతి రామణీయకమైన స్థలము నిర్దేశించి, లోపములేవీ లేకుండా ఎన్నికచేసిన సుక్షేత్రమున ఆలయ నిర్మాణము జరుగుతుంది. చుట్టూ ప్రకృతిలోని పారవశ్యత కలిగించు ప్రత్యేకతలుంటాయి. వాస్తుశాస్త్ర రీత్యా జరుగు ఆలయ నిర్మాణ ప్రాంగణమున అడుగిడుట ముదావహము, సర్వశ్రేయస్కరము.

7 దేవతా విగ్రహములు : ప్రత్యేకతగల రాళ్ళను సుదూర ప్రాంతములనుండి తీసుకుని వచ్చి, విగ్రహముగా చెక్కి సుముహూర్తమున ఆలయ గర్భగుడినందు ప్రతిష్టించబడుచున్నవి. ఇవి దోషరహితమైనవి. వీటియందు ప్రాణ ప్రతిష్ఠ జరుగుతుంది. ఈ దివ్యశిలలు సూర్యచంద్రుల, వరుణవాయువుల, ఇతర భూతాల ప్రభావానికి లోనై ఖనిజాలు గలవిగా మారి వుంటవి విద్యుత్‌శక్తి మొదలగు ఇతర దివ్యశక్తులను పొంది అపూర్వ గుణగణ సంపూర్ణమైనవిగా వెలుస్తాయి. ఇటువంటి దేవతా విగ్రహముల ఘుందు భక్తులు నడుమువరకు వివస్త్రగా నిలుచుని కొద్ది సెకన్ల కాలము ధ్యానముచేయుట శ్రేయస్కరము. ఈ దివ్య విగ్రహముల నుండి వెలువడే

బ్రహ్మపదార్థము, దివ్య పరిమళము భక్తులు శిరస్సువంచి చేయబడు ప్రార్థన మూలకముగా మెదడు ద్వారా శరీరప్రవేశం చేస్తాయి. తలనీలాలు సమర్పించిన గుండ్లు ద్వారా సులభప్రవేశం సాధ్యమౌతుంది. దేవతా విగ్రహముల నుండి వెలువడే కిరణాలు, ప్రకంపనాలు భక్తుని మనస్సును నిర్మలముగా నుంచుటకు దోహదపడతాయి కొన్ని విగ్రహాల క్రింద చక్రాలు స్థాపించబడియున్నవి వాటినుండి వెదజల్లబడే తరంగాలు మానవుని మహోన్నత స్థితికి జేరుస్తాయి.

8 భక్తుడు చేసే నమస్కారములో గూడా వ్యాయామ పద్ధతి ద్యోతకమౌతుంది. మెడ, తుంటి, మోచేయి, మోకాలు, చీలమండలు వగైరా శరీరభాగాలన్నీ తేలికగా కదలి ఆరోగ్యానికి దారితీస్తాయి సాష్టాంగ నమస్కారం సర్వశ్రేష్టము.

9. ప్రసాదము : ప్రతీరోజూ ఉదయముననే పరగడుపుతో ఆలయప్రదక్షిణం, దైవదర్శనానంతరం సేవించే ప్రసాదాలైన అరటిపండు, కొబ్బరిముక్క, తీపిపదార్థాలు శరీరములోని రక్తప్రసరణను క్రమబద్ధం చేస్తాయి. జీర్ణశక్తిని కలుగజేస్తాయి. వీటిలోనున్న తియ్యని పదార్థం ఉత్తేజాన్ని, ఉత్సాహాన్ని కలిగిస్తుంది. ముఖ్యముగా కొన్ని ప్రత్యేక ఆలయములలో నిచ్చు పసుపునీరు, నిమ్మరసం, విభూతి, మన్ను, అభిషేకజలం వగైరా సేవించిన మానసిక రుగ్మతలు అరికట్టబడతాయి. అట్లాగే కాశీ, గయాక్షేత్రాలలో తమకు అతి యిష్టమైన శాక, ఫల వర్జితములు దీనికి సంబంధించినవే

10 ధ్యానము · దివ్య విగ్రహముల ముందు ఏకాగ్రతతో, తదేకధ్యానముతో పూజలు జరిపితే, ప్రార్థనలు చేస్తే మానసిక నిగ్రహాశక్తి అలవడుతుంది ఏకాగ్రత సాధ్యపడుతుంది. దివ్య విగ్రహాల ముందు ఎక్కువసేపు నుండుటకు సాధ్యపడకపోయిన ఆలయ ప్రాంగణమందు సాధ్యము దీని మూలకముననే ఆలయ ప్రాంగణమున ఒకింతసేపు కూర్చొనవలెనని నియమమేర్పడినది.

11 సాధారణముగా దేవాలయములు తూర్పుముఖ నిర్మితములే. అందుచేత ఆలయ ముఖద్వారాలన్నీ గర్భగుడితో సహా ఉదయభానుని కాంతి కిరణాలశక్తికి లోనై ఉండును. ఆలయ ప్రవేశము గావించిన భక్తులపై ఉదయ సమయమున సూర్యకిరణ ప్రభావము సరాసరి తీవ్రస్థాయిలో గాక, ఆలయముఖద్వారముల ద్వారా సరిసమాన స్థాయిలో భక్తుని శరీరమును సోకి జీవశక్తిని కలిగిస్తాయి. ఇది తెలియనటువంటి మార్పు.

12. దేవాలయములలోను, బైటను చెక్కబడిన మూర్తులు, శిల్పాలు, పురాణగాధలు వగైరా కళలు ప్రాపంచిక ధోరణి నుండి భక్తుని తాత్కాలికముగా మరల్చి, ఏకాగ్రతవైపు మనస్సును నడిపించి చిత్తశుద్ధికి దోహదం చేస్తాయి.

13 కొంతమంది అమ్మవార్లు, అయ్యవార్లు, తీర్థాలు, గుండాలు కొన్ని ప్రత్యేక వ్యాధుల నివారణకు ప్రసిద్ధి కెక్కి ఉన్నవి. అటువంటి వన్నింటినీ వేరువేరుగా వివరములతో సహా ఈ పుస్తకమునకు తీసుకుని రాబడినవి. జ్యోతిర్లింగములు కూడా ప్రత్యేకతలు సంతరించుకున్నవి వాటి స్మరణ చక్కటి ఫలితములనిస్తాయి దర్శనం మహద్భాగ్యాన్ని కలుగజేస్తాయి "ఆరోగ్యమే మహా భాగ్యము"

☆ ☆ ☆

## దివ్య పాదాలయములుగా పూజలందుకొనుచున్న పవిత్ర స్థలములు

1., గందమాధన పర్వతం. తమిళనాడు 4కి మీ రామేశ్వరం.
2 వివేకానంద రాక్‌మెమోరియల్ తమిళనాడు, కన్యాకుమారి అగ్రం.
3 గయాసుర క్షేత్రం, గయ, బీహార్ ఫల్గుణి నదీ తీరం.
4 బాసర ఆంధ్రప్రదేశ్, అదిలాబాద్ జిల్లా
5. పూరీ, ఒరిస్సా, జగన్నాధాలయం, బంగాళాఖాత తీరం.
6 వైద్యనాధ, పరలే, మహారాష్ట్ర
7 త్రయంబకేశ్వరం, మహారాష్ట్ర, కుషావర్త్ సరస్సు ప్రక్కన
8 భువనేశ్వర్, ఒరిస్సా, బిందు సరోవర తీరము.
9 అల్హాబాద్, ఉత్తరప్రదేశ్, త్రివేణీ సంగమం, ప్రయాగక్షేత్రం.
10. ఉజ్జయిని, మధ్యప్రదేశ్, షిప్రానదీ తీరము.
11. వారణాసి, ఉత్తరప్రదేశ్, గంగానదీ తీరము.
12. మధుర, ఉత్తర ప్రదేశ్, యమునా నదీ తీరము.
13. అయోధ్య, ఉత్తరప్రదేశ్, సరయూ నదీ తీరము.
14. ఓంకారేశ్వర్, మధ్యప్రదేశ్, నర్మదా నదీ తీరము.
15. వింధ్యాచలం, మధ్యప్రదేశ్, వింధ్యవాసినాలయం.
16. యాదగిరి గుట్ట, ఆంధ్రప్రదేశ్, శ్రీలక్ష్మి నారసింహ క్షేత్రం.
17. షిరిడి, మహారాష్ట్ర, సాయిబాబా క్షేత్రం.
18. సింహాచలం, ఆంధ్రప్రదేశ్, వరాహ నారసింహక్షేత్రం.
19. నాసిక్, మహారాష్ట్ర, గోదావరి నదీ తీరము
20. పండరీపురం, మహారాష్ట్ర, చంద్రబాగా నదీతీరం.
21. కోణార్క, ఒరిస్సా, బంగాళాఖాత తీరము.
22. చిత్రకూట్, ఉత్తరప్రదేశ్, బృహస్పతి గుండం.
23. గౌముఖ్, త్రిపుర రాష్ట్రము, 40 కి.మీ. ఉదయపూర్, గోముఖ క్షేత్రం.
24. విజయవాడ, ఆంధ్రప్రదేశ్, కనకదుర్గాలయం, కృష్ణానదీ తీరం.
25. ద్వారక, గుజరాత్, అరేబియా సముద్ర సమీపం.
26 బేట్ ద్వారక, గుజరాత్, అరేబియా సముద్ర మధ్య ద్వీపము.
27. రాంచి, బీహార్, రాంచిజిల్లా

28. గంగాపూర్, ఉత్తరప్రదేశ్, గంగా నదీతీరం.
29. సోమనాథ్, గుజరాత్, ప్రభాస తీర్థం.
30. ఘృష్ణేశ్వర, మహారాష్ట్ర, వెరూల్ గ్రామం.
31. ఉదయపూర్, త్రిపుర రాష్ట్రము, త్రిపుర సుందరి ఆలయం.
32. పంచవటి ఘాట్, మధ్యప్రదేశ్, 21 కి మీ. జబ్బల్‌పూర్, నర్మదా నదీ తీరం.
33. పిఠాపురం, ఆంధ్రప్రదేశ్, పాదగయా క్షేత్రం.
34. పుష్పగిరి, ఆంధ్రప్రదేశ్, పినాకినీ నదీ తీరం.
35. లేపాక్షి, ఆంధ్రప్రదేశ్, శ్రీ వీరభద్ర క్షేత్రం.
36. జాజ్‌పూర్, ఒరిస్సా, నాభిగయా క్షేత్రం
37. జబ్బల్‌పూర్, మధ్య ప్రదేశ్, నర్మదా నదీ తీరం.

## సంపూర్ణ రామాయణములు - పేర్లు

1. వాల్మీకి రామాయణము
2. అద్భుత రామాయణము.
3. ఆధ్యాత్మిక రామాయణము.
4. చంపూ రామాయణము.
5. వశిష్ట రామాయణము.
6. ఉత్త్రర రామాయణము,
7. విచిత్ర రామాయణము.
8. శతకంఠ రామాయణము.
9. లేపాక్షి రామాయణము.
10. బొమ్మలాట రామాయణము.
11. ఆంధ్ర వాల్మీకి రామాయణము.
12. ధర్మసార రామాయణము.
13. ఎర్రాప్రెగడ రామాయణము
14. మొల్ల రామాయణము.
15. భాస్కర రామాయణము.
16. రామాభ్యుదయ రామాయణము.
17. రఘునాథ నాయక రామాయణము.
18. శారదా రామాయణము.
19. గోపీనాథ రామాయణము.
20. శ్రీ పట్టాభిరామ విలాస రామాయణము.
21. కబీరు దాస తులసీ రామాయణము.
22. శ్రీరామచంద్రోపాఖ్యాన రామాయణము,
23. తాళ్ళపాక అన్నమాచార్య రామాయణము.
24. శ్రీ త్యాగరాజ విరచిత గాన రామాయణము.
25. తరిగొండ వెంకమాంబ రామాయణము.
26. కట్టా వదరాజయ్య రామాయణము.

## విమర్శనాత్మక రామాయణములు

1 రామాయణ కల్పవృక్షము

2. రామాయణ విషవృక్షము

ఇంకా ఖ్యాతినొందనివి, వెలుగు చూడనివి ఎన్నో రచనలు వున్నవి సంపూర్ణ రామాయణములు గాక కాండలు గానీ, కాండలలోని భాగాలు కానీ, ఘట్టాలు కానీ పెక్కులు గలవు

## మోక్షమునకు దగ్గర త్రోవలు

## (మోక్షమనగా ఆత్మ పరమాత్మను చేరుట)

1. కాశ్యాంతు మరణాన్ముక్తి: కాశీలో మరణిస్తే మోక్షము. మరణ సమయమున శివుడు ఓంకార మంత్రమును, తారక మంత్రమును చెవిలో ఉపదేశించునట, గంగానదీ తీరం.
2. శ్రీశ్శైల శిఖరం దృష్ట్వా పునర్జన్మ నవిద్యతే: శ్రీశైల శిఖరాన్ని దర్శించి నట్లైతే మోక్ష ప్రాప్తి, కృష్ణానదీ తీరం.
3. కాళేశ్వరం దర్శనాన్ముక్తి: కాళేశ్వర క్షేత్రమును దర్శించినట్లైన. గోదావరి నదీ తీరం.
4. మధురలో ఒక రాత్రి నిద్రించితే, మధుర-బృందావనాలు బాల్య కృష్ణుని క్రీడా ప్రాంగణములు, రాధా కృష్ణుల ప్రేమ తత్వానికి ప్రతీకలు, యమునా నదీ తీరం.
5 కేదార క్షేత్రములో నీరు త్రాగితే: పాండవుల జీవనయాత్రలో అంతిమ స్థానము. ఆది శంకరాచార్యుని నిర్యాణ స్థలము, మందాకిని నదీ తీరం,
6. మహాకాళేశ్వరుని స్పర్శించితే, ద్వాదశ జ్యోతిర్లింగరూపుడైన మహాకాళేశ్వరుని లింగమును స్పర్శించినట్లైన అకాల మృత్యు హరణముతో బాటు మరల జన్మ వుండదు. షిప్రా నదీ తీరం,
7. "చార్‌ధామ్" దర్శించితే, తూర్పున పూరీ జగన్నాధ క్షేత్రమును, పడమర ద్వారకా ధీషుని ఆలయమును, ఉత్తరమున బద్రీ నారాయణ దివ్య స్థలమును, దక్షిణమున రామేశ్వర క్షేత్రమును దర్శించినట్లైన
8. సప్తమోక్ష పురములలో భగవంతుని సేవిస్తే. 1. రామజన్మ భూమియైన అయోధ్యలో 2. శ్రీకృష్ణ జన్మభూమి యైన మధురలో 3. పవిత్ర గంగానది భారత సమతల ప్రాంతమును జేరు హరిద్వారములో 4. విశాలాక్షి, విశ్వేశ్వరుడు వేంచేసి యున్న కాశీలో 5. శివ కేశవులకు భేదము లేదని చాటిచెప్పు కాంచీపుర క్షేత్రములో

6 మహాశ్మశానముగా పరిగణింపబడు ఉజ్జయిని క్షేత్రములో 7 పూర్ణ కృష్ణుడు మహా భారత గాధను నడిపించునపుడు నివాస స్థానమైన ద్వారకలో పూజలు చేస్తే.

9 పవిత్ర పంచ గంగలలో స్నానమాచరించితే 1 కావేరి నదిలో 2 తుంగభద్రా నదిలో 3. కృష్ణవేణి నదిలో, 4 గౌతమి నదిలో, 5 భగీరధీ నదిలో

10 కాశీ, రామేశ్వరాలు దర్శించి, కాశీలోని గంగాజలాన్ని రామేశ్వర క్షేత్రములో కలిపితే

11 అరుణాచలములో భగవన్నామ స్మరణ చేస్తే, పంచభూత లింగములలో తేజో లింగము తిరువన్నామలైలో ఉన్నందున

12 కురు క్షేత్రములో దానమిస్తే. భాగవత సారమైన భగవద్గీతను ధర్మ సంస్థాపనార్ధము ఉద్భవించిన శ్రీ కృష్ణభగవానుడు అర్జునునకు గీతాబోధ చేసిన పవిత్ర స్థలం, ఇచ్చట యిచ్చిన దానము మోక్ష ప్రదాయిని, సన్నిహిత సరోవర తీరము

13 నవబ్రహ్మ క్షేత్రమైన అంపురములో కొన్ని క్షణాలు నివసిస్తే, అష్టాదశ పీఠములలోని జోగుళాంబ, సప్త మాతృకలు వేంచేసియున్న పవిత్ర స్థలము బాల బ్రహ్మేశ్వరుడు నవ బ్రహ్మలతో వేంచేసియున్న పవిత్ర స్థలము, తుంగభద్రా నదీ తీరం.

14 వేములవాడలోని ధర్మకుండములో భగవన్నామోచ్ఛరణ చేస్తేనే ముక్తి. కరీంనగర్ జిల్లాలో భీమేశ్వర, రాజ రాజేశ్వరి ఆలయము వేములవాడలో కట్టబడక ముందే ఉన్నటువంటి ధర్మగుండము పవిత్రమైనది. ఈ ధర్మగుండమునకు బహు పురాణ ప్రసిద్ధి గలదు. 1. ఇంద్రుని బ్రహ్మ హత్యా దోషము నుండి నివృత్తి చేసిన గుండము. 2. దక్షప్రజాపతికి యజ్ఞఫలం దక్కనీయకుండా హావిస్సును కైవశం చేసుకొనబోవ సూర్యుని చేతులు మొండివాతెను, సూర్యభగవానుడు ఈ ధర్మగుండం వద్దనే తపస్సు ఆచరించిన తరువాత చేతులు తిరిగి పొంద గలిగెను. 3. ఈ పవిత్ర ధర్మగుండంలో దొరికిన లింగమే భీమేశ్వర స్వామి లేక రాజరాజేశ్వరుడు, అమ్మవారు రాజరాజేశ్వరి.

15 ప్రయాగ క్షేత్రములో తలనీలాలు సమర్పిస్తే : గంగా, యమున, సరస్వతీ నదుల పవిత్ర త్రివేణీ సంగమ స్థానం. ఇచ్చట పురుషులు తలనీలాలను సమర్పించినను, స్త్రీలు తమ భర్తలచే అలంకరింపబడిన జడను దానము చేసినట్లైన (వేణీ దానం).

16. నర్మదా నది నీటిని భక్తి భావనతో చూస్తే, దేశములోని నదులకన్నా ప్రత్యేక రీతి గమనముగల మహత్తర నది. ఈ నదికి ఉన్నన్ని ఉపనదులు, ప్రతీ సంగమ స్థానమున వెలసినన్ని దేవాలయములు ఏ ఇతర నదికి లేనందున ఈ నదికి మహత్మ్యము కలిగినది. దర్శించిన మాత్రముననే ముక్తి ప్రదాయిని.

17 మహీసాగర్ యాత్ర శనివారం అమావాస్య వచ్చినపుడు చేసినట్లైన. మహీనదీ గుజరాత్‌లోని ఖంభాత్ జలసంధిలో కలియుచోట వెలసిన నౌనాధ్‌లు గల క్షేత్రమున అమావాస్య శనివారం వచ్చిన రోజున పూజలు జరిపినట్లైన మోక్షప్రాప్తి

## పిలుపులు - 4 రకములు

1 ఘంటా నాదము · దేవతలకు పిలుపు

2 శంఖారావము . విజయమునకు పిలుపు

3 ధనుష్టంకారము · యుద్ధానికి పిలుపు

4. బిందెలు మ్రోగించిన దెయ్యాలకు పిలుపు

**సాష్టాంగనమస్కారము : 8 అవయవములతో :**

1 వురముతో 2. శిరముతో 3. దృష్టితో 4 మనస్సుతో 5. మాటతో 6. పాదములతో 7 కరములతో. 8. కర్ణములతో

**అష్టైశ్వరములు :**

1. ధనము 2. ధాన్యము 3. దాసీజనము 4. భృత్యులు 5. పుత్రులు. 6. మిత్రులు 7 బంధువులు 8 వాహనములు

**అష్టకష్టాలు :**

1. దేశాంతర గమనము 2. భార్య వియోగము 3. కష్టకాలంలో నున్న ప్రియ బంధు దర్శనము 4. ఎంగిలి తినుట 5. శత్రువులతో స్నేహం చేయుట 6. పరాన్నమునకు వేచి వుండుట 7. సభలో అప్రతిష్ట వచ్చుట. 8 దరిద్రమును అనుభవించుట.

**అష్టమదములు :**

1. అర్థ మదము 2. స్త్రీ మదము. 3. విద్యా మదము 4. కుల మదము. 5. రూప మదము. 6. వుద్యోగ మదము. 7. యౌవ్వన మదము. 8. అన్న మదము.

**అష్టభోగాలు :**

1. అన్నము 2. వస్త్రము 3. గంధము. 4. పుష్పము 5. పానుపు 6. తాంబూలము 7. స్త్రీ 8. గానము.

**నాటి ప్రాంతాలకు నేటి వివరణలు :**

1. త్రిలింగ దేశం - ఆంధ్రప్రదేశ్.
2. కళింగ దేశం - ఒరిస్సా రాష్ట్రం.
3. వంగ దేశం లేక గౌడ దేశం - బెంగాల్ రాష్ట్రము.
4. మగధ సామ్రాజ్యం - బీహార్ రాష్ట్రము.
5. కోసల రాజ్యం - ఉత్తర ప్రదేశ్

6. ఇంద్రప్రస్థం. పాండవుల రాజధాని - ఢిల్లీ.
7. కురుక్షేత్ర యుద్ధ ప్రాంతం, ధర్మక్షేత్రం - హర్యానా
8. మత్స్య దేశం, మేవారు రాజ్యం, హిందూ రాజ్య రక్షణకు కంకణధారియై ప్రాణాలొడ్డిన ప్రాంతం, పురుషులు ప్రతాపానికీ, స్త్రీలు త్యాగానికీ నిలయం-రాజస్తాన్
9. సౌరాష్ట్ర దేశం, పూర్ణకృష్ణుని నివాస ప్రాంతం - గుజరాత్
10. విదర్భ దేశం - మహారాష్ట్ర
11. గోమంత దేశం - గోవా.
12. కుంతల దేశం, కిష్కింధ ప్రాంతం - కర్ణాటక.
13. ప్రాగ్జ్యోతిషపుర ప్రాంతం - అస్సాం మొదలగు ఈశాన్య రాష్ట్రప్రాంతం.
14. వింధ్య సాత్పుర పర్వతశ్రేణి ప్రాంతం - మధ్య ప్రదేశ్.
15. రామాయణ, భారతేతిహాసాలు, బాల్య కృష్ణుని లీలలు జరిగిన ప్రాంతం-ఉత్తరప్రదేశ్

ఇవిగాక 1. దివి నుండి భువికి దేవతలు దిగివచ్చి విహరించే ప్రకృతి రామణీయకత గల అందాల సుందర వన దివ్య ప్రాంతం - జమ్మూ & కాశ్మీర్

2. మహ్మదీయ దురాక్రమణ నరికట్టిన వీర ప్రాంతం, దేశం మొత్తం మీద ఆయుఃప్రమాణము ఎక్కువగా గల ప్రాంతం - పంజాబ్ రాష్ట్రం.
3. పరశురాముని కోరిక మన్నించి సముద్రుడు ప్రసాదించిన భూభాగం- కేరళ రాష్ట్రం.
4. భక్త శిఖామణులైన నయనార్లు, అళ్వారుల జన్మస్థలి. చేర, చోళ, పాండ్య రాజుల పరిపాలిత ప్రాంతం, దేశం మొత్తం మీద అతి పెద్ద ఆలయ నిర్మాణ ప్రాంతం - తమిళనాడు.
5. 80% హిందువులు, మిగతా బౌద్ధులు గల దేశం - నేపాల్.
6. 60% హిందువుల మిగతా బౌద్ధులు గల రాష్ట్రం - సిక్కిం.
7. ద్విలింగ దేశము : త్రిలింగాల మధ్య ప్రాంతమును ఆంధ్రదేశముగా ఆనాడు గుర్తించినట్లే గోదావరి నది కుత్తరముగా నున్న విదర్భదేశ ప్రాంతములో రెండు పానమట్టములు, రెండు లింగములకు అభిషేక జలసూత్రము మొక్కటిగా నుండి అభిషేక తీర్థము ఒకే ధారగా పడు ప్రాంతము ద్విలింగ దేశముగా పరిగణించిరి. మధ్యప్రదేశ్, బీహార్, ఒరిస్సా రాష్ట్రములు ఈ ప్రాంతము క్రింద వచ్చును.
8. ఏక లింగ దేశము - వింధ్య పర్వతములు హద్దుగా హిమాచల పర్వత ప్రాంత పర్యంతము ఏకలింగ దేశమని ఎన్నబడి యున్నది. ఈ ప్రాంతమున ఒకే లింగమునకు ఒకే జల సూత్రమున్నది. రాజస్థాన్, గుజరాత్, ఢిల్లీ, హిమాచల ప్రదేశ్, పంజాబ్ మరియు హర్యానా ప్రాంతము.

లింగ ప్రాధాన్యముగా దేశ విభజన పూర్వకాలమున జరిగినదనుటకు నిదర్శనము.

## భారతదేశ అద్భుతములు (WONDERS OF INDIA)

ప్రపంచమున అద్భుతములు 7గా విపులీకరించబడినవి. (SEVEN WONDERS OF THE WORLD) పుణ్యభూమి భారతిలో నున్నవి 17. ప్రపంచములోని వింతలను చూచుట కందరికీ సాధ్యము కాదు కాబట్టి మన దేశములో నున్న చక్కటి నిర్మాణాలను చూచి ఆనందించే అవకాశాన్ని వినియోగించు కొనవలసినది. తప్పనిసరిగా దర్శించితీరాలి అని పట్టుదల గలవారికి ఈ క్రింది 17 అద్భుతాలను వివరణలతో సహా సూచించబడినవి.

**1. తాజ్‌మహల్ :** ఉత్తర ప్రదేశ్, ఆగ్రా, యమునా నదీ తీరం. షాజహాన్ చక్రవర్తి భార్య ముంతాజ్ బేగం వివాహమైన 17 సంవత్సరముల తరువాత 14 మంది బిడ్డలను కని, 15వ కాన్పు సమయాన కన్ను మూసినది. తన ప్రియమైన భార్య జ్ఞాపకార్థము నిర్మించబడిన తెల్లని పాలరాతి కట్టడము. పర్షియా దేశము నుండి కళాకారులను రావించి పలురకాల డిజైనులలో విలువైన రంగు రంగుల రాళ్ళను పొదిగి 20,000 మందికి పైగా పనివారిచే 22 సం॥లు కట్టబడినటువంటి అద్భుత భవనము. ప్రతీ భారతీయుడు తప్పక చూడవలసిన అందమైన కట్టడముగా నిలిచియున్నది. ప్రపంచ అద్భుతములలో నొకటిగా పరిగణించబడినది.
యమునానది ఒడ్డున పునాదులు త్రవ్వబడి పెద్దదైన గట్టిదైన ప్లాట్‌ఫారం నిర్మించి నాలుగు మూలలా,నాలుగు స్థంభములను నిర్మించిరి. ఈ పాలరాతి కట్టడము పౌర్ణమినాటి వెన్నెలలో దర్శించుట సంతోషదాయకము. యమునా నది ఎంత ఉధృతముగా ప్రవహించినను ఎంతటి వరదలు వచ్చినను చెక్కుచెదరని కట్టడము, అంతేగాకుండా ప్రకృతి వైపరీత్యములకు, భూకంపములకు పడిపోకుండా రాతి బండల పునాదిరాళ్ళ నడుమ ప్రత్యేకమైన పెద్ద కలపదూలాలను వేసి రాగి ప్లేట్లతో బిగించి నది అడుగు భాగము నుండి కట్టుకుని వచ్చిన మహత్తర విజ్ఞానముతో కూడిన గొప్ప కట్టడము.
షాజహాన్ యొక్కయు, తన భార్య యొక్కయు సమాధులు దీనిలో చూడవచ్చును.

**2. గోల్ గుంబజ్ :** కర్ణాటక, బిజాపూర్, బిజాపూర్ రైల్వే స్టేషన్ దగ్గరలో. క్రిందనుండి ఏ ఆధారముల లేని డోము గలది. ఇటలీలోని రోమ్‌లో గల సెంటు పీటర్స్ టవర్ 42 మీటర్ల వ్యాసము గలది ఇచ్చటి కట్టడము 37 మీటర్ల వ్యాసము కలిగి పొడవు, వెడల్పు, ఎత్తు సమానముగా గల అద్భుత కట్టడము. 37 మీటర్ల వ్యాసముతో ప్రపంచములోని రెండవ నిర్మాణముగా నిలచియున్నది. నాలుగు మూలల నుండి పైకి ఎక్కుటకు మెట్లు కలవు, పైకి ఎక్కిన తరువాత గ్యాలరీలో నిలువబడి నెమ్మదిగా ఒక ప్రక్కన చేసిన శబ్దము రెండవ ప్రక్కకు 10 నుండి 16 సార్లు వినిపించు చుండును. ఇది ప్రత్యేకత. మెట్లపై నుండి ఎక్కునపుడు విపరీతముగా వీచే గాలి తాకిడిని తట్టుకొనుట కష్టము, స్తంభాలు మధ్యగాలేని

సున్నము, రాయి కట్టుబడి, కేవలము నాలుగు మూలల స్తంభములమీద మాత్రమే విశాలమైన డోము (గుండ్రని ఆకార కట్టుబడి) నిలచియున్నది ఇది మహ్మద్ అదిల్ షా వారి సమాధి అక్కడక్కడ బీటలు వారుచున్న చోట సిమెంట్‌తో రిపేరు చేయబడుచున్నది

ఇంతటి మహత్తర కట్టడము దేశములో అతి పెద్దదిగా, అద్భుతముగా నిలిచియున్నది.

**3. విక్టోరియా మెమోరియల్ :** పశ్చిమ బెంగాల్. కలకత్తా. విక్టోరియా మహారాణి జ్ఞాపకార్థము కింగ్ జార్జ్ V చే శంఖుస్థాపన చేయబడి 28-12-1921న ఆయన కుమారుడైన ప్రిన్స్ ఆఫ్ వేల్స్ చే దేశ ప్రజలకు అంకితము చేయబడినది. పెద్ద డోము కలిగిన పాలరాతి కట్టడము దీనిని కట్టుటకు 15 సం॥లు పట్టినది. కోటి రూపాయలు ఖర్చయినవి. బ్రహ్మాండమైన ఈ భవనములోని 25 గ్యాలరీలలో గొప్ప చిత్రాలు, అద్భుత శిల్పాలు వివిధ ఆయుధాలు, మెడల్స్, నాణెములు వగైరా ప్రదర్శించబడి యున్నవి ప్రవేశ ద్వారము వద్ద గంభీరముగా నున్న విక్టోరియా మహారాణి యొక్క పాలరాతి విగ్రహం కలదు లోపల మహారాణి స్వయముగా వాయించి నట్లు చెప్పబడే నల్లని చక్కతో చేయబడిన పెద్ద పియానో కలదు.

కలకత్తా మహానగరములోని అద్భుత కట్టడములలో తలమానికమై నిలిచియున్నది.

**4. దిల్‌వారా జైన దేవాలయములు :**

రాజస్థాన్. మౌంట్ ఆబూ, ప్రపంచ వింతలలో ఒకటిగా పరిగణించబడు శిల్పకళా కౌశలము గల పాలరాతి దేవాలయ సముదాయము, విమలవాసి, తేజ్‌పాల్ మహాశయుల 5 ఆలయముల సముదాయము. ఎన్నోరకములైన పువ్వులు, లతలు చాల సున్నితముగా స్తంభములపైన, పై కప్పులయందు చెక్కబడి చూపరుల కాహ్లాదము కలిగించు అద్భుత కళా కౌశలము. జైన తీర్థం కరుల పాలరాతి దేవాలయములో 52 తీర్థంకరులు గదులలో వేంచేసి యున్నారు. స్పటిక రాయివలె కనిపించే తెల్లటి పాలరాతిలో సన్నని నాజూకైన పనితనము కనిపిస్తున్నది. సోలంకి మహారాజుల కాలములో అధినాధ స్వామివారికి కట్టబడిన ఆలయ సముదాయము. నయనానందకరమైన సున్నిత నాజూకైన శిల్పకళా కౌశలము చూచి ఆనందించవలసినదే తప్ప వర్ణింప నలవికాదు.

ఈ ఆలయ సముదాయము జైన తీర్థంకరుల నిమిత్తము కట్టబడిననూ దేశవాసులందరూ గర్వించదగ్గ సున్నిత కట్టడము. విదేశీయులకు సైతము ఆశ్చర్యము గొలుపు అద్భుత కళాకౌశలము.

**5. భాక్రా, నంగల్ డాములు :** పంజాబు, సట్లెజ్ నదిమీద 750 అడుగుల ఎత్తున భాక్రా వద్ద ఒక ఆనకట్ట, 13 కి.మీ. దూరమున దిగువన నంగల్ వద్ద రెండవ ఆనకట్ట కట్టబడి భాక్రానంగల్ ఆనకట్టలుగా ప్రసిద్ధి నొందియున్నవి గోవింద సాగర్ అనుచోట భాక్రా వద్ద కట్టబడిన ఆనకట్ట ప్రపంచములో అతి ఎత్తైన మాసనరీ (MASONARY) డాముగా

పరిగణింపబడుచున్నది. రెండు హిమాలయ పర్వతముల మధ్య అతి వేగమైన సట్లెజ్ నదీ ప్రవాహాన్ని ఆపుటకు కట్టిన మహత్తర ఆనకట్ట. ఇంకనూ నీరు వృధాగా కుండా నుండుటకు పర్వత ప్రాంత దిగువ భాగమున నంగల్ వద్ద రెండవ ఆనకట్ట కట్టబడినది భాక్రా ఆనకట్ట పైభాగమును, నది క్రిందుగా నంగల్ వద్ద కట్టబడిన దిగువ భాగమును దర్శించుటకు ప్రత్యేక పాస్‌లు అవసరము ప్రపంచములో అతి ఎత్తైన భాక్రా ఆనకట్టపై నిలచినపుడు చాల ఆహ్లాదముగ నుండును. ప్రయాణము రిస్కులతో కూడినదైననూ ప్రతీవారు చూచి ఆనందించవలసిన సాంకేతిక నైపుణ్యము.

**6. రామేశ్వర దేవాలయ వరండాలు**: తమిళనాడు. రామేశ్వర క్షేత్రమున నిర్మించబడిన రామలింగేశ్వర స్వామివారి ఆలయం. సముద్రములోని ఒక దీవిపై నిర్మించబడిన మహత్తర దేవాలయం.

ఈ దేవాలయపు వరండాలు 400 అడుగుల పొడవు, 21 అడుగుల వెడల్పు, 30 అడుగుల ఎత్తుగల అతి పెద్ద నిర్మాణము. ఒకే రకమైన శిల్పకళతో 1000 స్థంభాలతో నిర్మించబడిన వరండాలు గల పెద్ద దేవాలయం. ఈ వరండాలు తూర్పు నుండి పడమరకు 264 మీటర్లు, ఉత్తరము నుండి దక్షిణమునకు 200 మీటర్లు వైశాల్యము గలవి. 3 ప్రాకారములు, 2 గోపురములు, 2 అసంపూర్తి గోపురములు గల అతిపెద్ద దేవాలయము. వరండాలలోని ప్రతీ స్తంభముపై అనేక దేవతా విగ్రహములు చిత్ర విచిత్ర రీతుల చెక్కబడిన శిల్పములు కనిపిస్తాయి. చుట్టు ప్రక్కల ఎక్కడా కొండలుగాని, బండలుగాని దొరుకుట కవకాశములేని దీనియందు కట్టబడిన అద్భుత దేవాలయము, శ్రీలంక నుండి పడవలపై రాళ్ళను తెప్పించి అద్భుత శిల్పకళను చెక్కి ఏకరాతి స్తంభాలను నిలబెట్టి ఆలయ నిర్మాణము చేసినారట. ఆలయ నిర్మాణమునకు 350 సం॥పట్టినదట. ఇచ్చట గల స్వామివార్ల, అమ్మవార్ల దర్శనముతోబాటు సముద్ర, సరస్సుల, నూతులలోని పుణ్యతీర్థములలో స్నానము చేయుట మోక్షదాయకము.

**7. గాలి, దయా దాక్షిణ్యముపై ఆధారపడియున్న రైలు ప్రయాణము** : కర్ణాటక, మీటర్ గేజి రైల్వేలైను బిజాపూర్‌కు, బదామి స్టేషన్లకు మధ్యన. కృష్ణానదిపై 2 చోట్ల రైలు వంతెనలు అతి ఎత్తున వంకరగా నిర్మించబడి వున్నవి. ఇచ్చట గాలి ఉధృతి చాలా అధికముగాన వంతెన నుండి ప్రయానిస్తున్న రైలు బండి పడిపోయే ప్రమాదము రెండు బ్రిడ్జిలపై నున్నందున రెండు చోట్లా గాలి సిగ్నల్‌లను (Signals) ఏర్పాటు చేయడమైనది, ఈ సిగ్నల్స్ గాలి యొక్క ఉధృతిని బట్టి పనిచేయును. ఉధృతి తగ్గి క్షేమముగా రైలు సాగుటకు అవకాశమున్నపుడు సిగ్నల్ దానంతటదే వాలును. అప్పుడు రైలు ప్రయాణము సాగించును. అపాయకర ఉధృతి తగ్గనంత వరకు కొన్ని గంటలు గాని, కొన్ని పూటలు గానీ రైలు కదలుటకు వీలులేదు. ఇచ్చట

గాలి వేగము చాలా ఎక్కువ. కిటికీ తలుపులు మూసుకున్నను లోపలికి దుమ్ము జేరిపోవుటయే గాక బండి కదలిపోవుననిపిస్తుంది. చాలా భయంకర ప్రయాణము. రైల్వే సిగ్నల్ సేఫ్టీ లెవల్‌కి గాలివస్తే తప్ప రెక్కవాలదు.

గాలి యొక్క దయాదాక్షిణ్యముపై చేయు రైలు ప్రయాణము కర్ణాటకలో నున్న కృష్ణానదిపై కట్టబడిన రెండు బ్రిడ్జిలపైననే కనిపిస్తున్నది. దేశము మొత్తమున ఇంకెక్కడా లేదు.

**8. అతి శీతల, అతి ఉష్ణ ధారలు మంచు పర్వతములలో నుండి ఒకేచోట బయటకు వచ్చు ప్రత్యేకత :** ఉత్తర ప్రదేశ్, బద్రీనాధ్ క్షేత్రం, చమోలి జిల్లా, ఈ క్షేత్రం సముద్ర మట్టమునకు 10,800 అడుగుల ఎత్తుననున్న హిమాలయ పర్వతములలో నున్నది, ఒకే చోట నుండి అతి చల్లని, అతి వేడినీరు మంచు పర్వతములనుండి బయటకు వచ్చుట ప్రత్యేకత, అతి చల్లని నీటిలో వేలు వుంచిన వంకర తిరిగి పోవును. అతి వేడినీటిలో వేలు ముంచిన తోలు ఊడిపోవును. భారతదేశమున రెండూ అతిగా గల నీటి ధారలు ఒకేచోట నుండుట ప్రకృతిలో అద్భుతము, అందునూ, మంచుతో నిండిన అతి శీతల వాతావరణములో నున్న కొండనుండి ఒకే సారి రెండు రకముల నీరు ఎడతెరిపి లేకుండా రావడం మహాద్భుతము. ఇప్పటికి ఎన్నియో వేల సంవత్సరముల నుండి ఈ ప్రకృతి వింత ఉన్నది. ఇంకనూ కొన్ని వేల సంవత్సరముల వరకు ఉంటుంది. ఇచ్చట వెలసిన స్వామివారు బదరీనారాయణుడు, అమ్మవారు బదరీ నారాయణి, దగ్గరలోనున్న బ్రహ్మకపాలము అని పిలువబడే క్షేత్రములో పెద్దలకు పిండ ప్రదానం జరుగుతుంది. ఈ ఆలయంలో నేతితో జ్యోతిని వెలిగించి అక్టోబర్ మాసములో మూసివేయుదురు. తిరిగి ఆరు మాసముల తరువాత అనగా మే నెలలో సీలు వేసిన ఆలయమును తెరచిచూడ జ్యోతి వెలుగుతూంటుంది. ఇది కూడా ఇచ్చటి ప్రత్యేకత. ఇటువంటి ప్రత్యేకతే కేదార్ నాధ్ (శివాలయం) లో కూడా నున్నది.

**9. ఒకేరాతిలో పై నుండి క్రిందకు మలచబడిన గుహాలయం :** మహారాష్ట్రం. ఎల్లోరా. 30 కి.మీ. ఔరంగాబాద్. ఎల్లోరా గుహలలో గుహ నెం. 16 ఒకే కొండలో నున్న ఒకే బండలో పై నించి క్రిందికి తొలుచుట మహాద్భుతము. కేవలము లింగము, శివాలయమే గాకుండా ఇతరత్రా ఎన్నో శిల్పాలు, శివపార్వతుల కళ్యాణము, పాచికలాడే నయనానందకర దృశ్యము, రావణుడు కైలాస పర్వతము నెత్తుట మొదలగు శిల్పకళతో నిండియున్న ఆలయం. పెద్దహాలు 250'×150'. 100' - ఎత్తుగల గోపురము కూడా చెక్కబడినది. పై నుండి రాతిని తొలిచి కట్టగా వచ్చిన రాతి వేస్ట్ 2 లక్షల టన్నులు. శిల్ప నైపుణ్యతలో, నిర్మాణ కౌశలతలో కార్యదీక్ష, శక్తియుక్తులు ఆనాటి శిల్పులకు నున్నదనుటకు,ఈ భూలోకకైలాసము నిదర్శనము. శివస్థావరము నంతయూ ఏకరాతిలో క్రిందినుండి పైకిగాక, ప్రక్కల నుండి గాక, పైనుండి క్రిందికి చెక్కుట భారతదేశమునకే గాక ప్రపంచమునకే గొప్ప వింత

**10. హౌరా బ్రిడ్జి :** పశ్చిమ బెంగాల్, కలకత్తా, హుగ్లీ నదిపై నిర్మించబడిన ఈ వంతెనకు విద్యాసాగర్ వంతెన అని పేరు. హౌరా, కలకత్తా నగరములను కలుపు రహదారి వంతెన. ఉక్కు, కాంక్రీటుల సమ్మిళితమైన నిర్మాణము. పొడవు 2,150 అడుగులు. దీనిపై 85,000 వాహనములు ప్రతీరోజూ 8 లైన్లలో ప్రయాణము చేయగలుగునంతటి విశాల కట్టడము. ట్రాములు, బస్సులు, లారీలు వగైరా కిక్కిరిసి ప్రయాణము చేయుచుండును. క్రింది భాగమున ఎక్కడా స్తంభాలు లేనట్టి ఉక్కు బ్రిడ్జి. వాహనముల ప్రయాణమున కనుగుణముగా 8 లైన్లు మాత్రమే గాక, 2 వైపుల నడచుటకు వీలుగా ఫుట్‌పాత్‌లు గలవు. 1943లో ప్రారంభించబడి కట్టబడిన పెద్ద ఉక్కు బ్రిడ్జి.

**11. లేడీస్ మార్కెట్ :** మణిపూర్, ఇంఫాల్. ఇంఫాల్ నగర నడిబొడ్డున "A to Z" ఏ వస్తువు కావాలన్నా ఇచ్చటి మార్కెట్‌లో కొనవచ్చును. ఇది విశాలమైన చాల పెద్ద మార్కెట్. దీనిని ఇంకా విస్తరించుట జరుగుచున్నది. ఈ మార్కెట్‌లో సరుకు నమ్మేవారంతా స్త్రీలు మాత్రమే. కొన్నువారు స్త్రీలయిననూ, పురుషులైననూ అమ్మువారు మాత్రము స్త్రీలు మాత్రమేనను నియమమున్నట్లు కన్పిస్తున్నది. కేవలం స్త్రీలు మాత్రమే అమ్మ ఇంత పెద్ద వ్యాపార కేంద్రము దేశములో ఇంకెక్కడనూ లేదు. భారత దేశములోనే గాక ఇంత పెద్ద స్త్రీల మార్కెట్ ప్రపంచములో ఏ ఇతర నగరమునా కనిపించదు. చాల మంది స్త్రీలు తెల్లటి దుస్తులను దరించుట కనిపించుచున్నది. అతి చిన్న చిల్లర వస్తువు నుండి అతి పెద్ద విలవైన వస్తువును కూడా ఈ మార్కెట్ నందు స్త్రీలు అమ్ముట విశేషము. ఇచ్చటి వారికి హిందీభాష బాగా అర్థమౌతుంది. ఇంగ్లీషు భాష తెలిసిన స్త్రీలు తక్కువనే చెప్పాలి.

**12. శ్రీరంగనాథ దేవాలయం :**

తమిళనాడు. శ్రీరంగం. 13కి.మీ. తిరుచినా పల్లి. శ్రీరంగనాథుని ఆలయం. కావేరీ తీరం.

దేశం మొత్తములో ఇంత పెద్ద దేవాలయం వేరొక చోట కనిపించదు. సప్త ప్రాకారములతో, 21 గోపురముతో, 24 మండపాలతో నిర్మించబడిన అతి పెద్ద దేవాలయము, 250 ఎకరములలో నిర్మించబడినది. ఒక రాజవంశీకులుగాక అనేక రాజవంశీయులచే అనగా చేర, పాండ్య, చోళ, హొయసాల విజయనగర రాజులచే నిర్మించబడిన మహత్తర దేవాలయం. మొదటి 4 ప్రాకారములలో అర్చకులు మొదలైనవారి నివాస గృహములతో సహా అన్ని రకముల షాపులు మార్కెట్‌లా వెలసియున్నవి. ప్రతీ ప్రాకారములో ఈ షాపులతో బాటు అనేక దేవతా మూర్తుల విగ్రహములు ప్రతిష్టించబడియున్నవి. 4వ ప్రాకారం దాటిన తరువాత పాదరక్షలు వుపయోగించరాదన్న నియమం వున్నది, 4వ ప్రకారములోనే 1000 స్తంభముల మండపమున్నది.

ఈ ఆలయమునకు ప్రతి సంవత్సరము రథయాత్ర జరుగుతుంది. ఆలయ

గర్భగుడిపైనున్న విమానమునకు బంగారుపూత పూయబడి మెరుస్తూ భక్తుల నాకర్షించుచున్నది ప్రదక్షిణ మార్గములో గోడలలో 108 దివ్య దేశముల వైష్ణవ స్వామివార్ల విగ్రహములు చెక్కబడియున్నవి. ప్రతీ ప్రాకారములోను ఉన్నటువంటి మండపాలలో అనేక అద్భుత శిల్పాలు గలవు. ఇంతటి పెద్ద మహత్తర దేవాలయమును ప్రతీ భారతీయుడు దర్శించి తరించ వలసిన అవసరమున్నది

**13. జంతర్ మంతర్ :** రాజస్థాన్, జైపూర్, ఇది ఒక నక్షత్రశాల, సవాయ్ రాజా జైసింగ్ చే ప్రాక్పశ్చిమ దేశాలకు చెందిన ఖగోళ శాస్త్ర పద్ధతులను అధ్యయనం చేసి 1699-1743 వరకు నిర్మించబడినది. సవాయ్ రాజా జైసింగ్ చే భారతదేశమున నిర్మించబడిన 5 నక్షత్రశాలలో ప్రధానమైనది. మిగిలిన నాలుగూ ఢిల్లీ, మధుర, ఉజ్జయిని, కాశి మధురలో (U P) నిర్మించిన నక్షత్ర శాల పూర్తిగా శిధిలమైనది.

విశాల ప్రాంతములో ఆరుబయట ఈ నక్షత్రశాలను నిర్మించడమైనది సూర్య, చంద్ర గమనాలను, నక్షత్రాల ఉనికిని బట్టి కాలమును తెలుపు ప్రిన్స్ ఆఫ్ డయల్స్ ఎత్తు 90[1] దీనిని 147[1] పొడవుగల ప్లాట్‌ఫారమ్‌పై నిర్మించిరి. జయప్రకాష్ యంత్రం, సామ్రాట్ యంత్రం, మిశ్రమ యంత్రం, ఛాయా యంత్రం, నీడ గడియారపు స్తంభం, రామయంత్రం, బిత్తి యంత్రం, గుండ్రపు ఆకారములో, వర్తులాకారపు గోడలలో అమర్చిన మెట్లు చాలా ప్రాముఖ్యమైనవి. ఇవి ఉత్తర, ధృవతార దిశలను చూపించును. ఇచ్చటనున్న ఇతర కట్టడముల ద్వారా, ఇతర సాధన పరికరముల ద్వారా ఖగోల శాస్త్రానికి సంబంధించిన లెక్కలను, వివరాలను ఎంతో చక్కగా, ఖచ్చితముగా తెలుసుకొనవచ్చును. సమయ నిర్ధారణ, భూమి యొక్క చలనము, గ్రహ, నక్షత్ర స్థాన నిర్ణయము చేయవచ్చును

నగర మధ్యములో ట్రిపోలి స్క్వేర్‌లో నిర్మించబడిన జంతర్ మంతర్ ప్రతిదినము వందలాది యాత్రీకులను, విజ్ఞాన శాస్త్రజ్ఞులను, విద్యార్థులను ఆకర్షించుచున్నది. ఇది నిర్మించి చాల సంవత్సరములైననూ ఇప్పటికినీ ఖగోళ శాస్త్ర సంబంధిత ఖచ్చితమైన వివరము లందించుచున్న అద్భుత కట్టడము.

**14. గేట్ వే ఆఫ్ ఇండియా :** మహారాష్ట్ర, ముంబాయి, భారత దేశమున కట్టబడిన అతి పెద్దదైన అపూర్వ స్వాగత ద్వారము. ఇంగ్లాండ్ రాజదంపతులైన 5వ జార్జి, క్వీన్ మేరీలకు ఓడలో భారత దేశమునకు వచ్చినందున మొట్టమొదటి సారి అపూర్వ స్వాగతమిచ్చిన స్థానము. అరేబియా సముద్ర తీరమున ముంబాయి రేవు చివరన నలుచదరముగా నిర్మించ బడిన అపూర్వ ద్వారము 1900 వ సం॥లో నిర్మాణము ప్రారంభమై 1911లో పూర్తి గావింపబడినది. అద్భుత కళాఖండముగా భారతీయ శిల్పకళా నైపుణ్యమునకు మచ్చుతునకగా నిర్మించిన మహత్తర కట్టడము. ఇంతటి పెద్ద ద్వారము దేశములో ఎచ్చటనూ లేదు. భారత

భూగడ్డపై బ్రిటీష్ దంపతులకు స్వాగతము చెప్పిన ఈ ద్వారము నాటికీ నేటికీ చెక్కుచెదరక దీనిని మించిన ఇతరస్వాగత కట్టడము లేక చిరస్థాయిగా చరిత్రలో నిలచిపోయి వున్న అతి విశాల, ఎత్తైన, కళానిలయం.

**15. శనీశ్వరాలయం :** మహారాష్ట్ర, షింగణాపూర్. 64 కి.మీ. షిరిడీ అహ్మద్‌నగర్ జిల్లా ఇచ్చట స్వామివారు లింగరూపుడై వెలసియున్నారు నాటికీ నేటికీ గుడి కట్టబడలేదు. ప్రక్కన ఇనుప స్తంభాన్ని పాతి, వంచి అభిషేక జలపాత్ర తగిలించి అందునుండి కారు జలముతో అభిషేకం. స్వామివారి ప్రక్కనే చెట్టు వున్నది. కానీ దాని నీడ స్వామివారిపై పడదు. ఆలయమునకు దగ్గరలో షింగణాపూర్ గ్రామమున్నది. గ్రామములో ఇండ్లకు ద్వారములకు, కిటికీలకు తలుపులు వుండవు, ఇండ్లలో బీరువాలు, అలమారులు వున్ననూ తాళములు వేయరు. వాహనములకు ఇతర సామాగ్రికి తాళములు వేయరు. భిక్షగాళ్ళు కానరారు. దొంగలు లేరు. ఏ విధమైన నేరములు జరుగనందున దగ్గరలో ఎక్కడా పోలీస్ స్టేషన్ లేదు. 1997 వ సంవత్సరములో కూడా నాస్తికులు, నేరస్తులు, భిక్షగాళ్ళు పెరుగుచున్న కాలములో ఇంకనూ అలనాటి ఆచారము ఆ ప్రాంత వాసులేగాక అచ్చటకు వచ్చు యాత్రీకులు కూడా తమ వాహనములకు తాళములు వేయకుండా విడచుట కొనసాగుచున్నది. 20వ శతాబ్దాంతములో కూడా దేశములో ఇంకెక్కడా లేని మహత్తర ఆచారము, దానికాధారముగా భావింపబడు దైవకృప ఇంకెచ్చటనూ కానరాదు

**16. ఊగే స్తంభాలు :** గుజరాత్, అహ్మదాబాద్. రైల్వే స్టేషన్‌కు దగ్గరలో సిద్ధి బషీర్ బాబా మసీదులో 2 స్తంభములు గలవు. ఇవి సున్నము, ఇటుక కట్టడములు. ఇదే విధముగా సారంగపూర్ గేట్ వద్ద కూడా 2స్తంభములతో నిర్మించబడిన మసీదు కలదు. ఒక స్తంభము దగ్గర చప్పట్లు చరిస్తే రెండవ స్తంభములో ప్రతిధ్వనిస్తూ వుంటుంది. అంతేగాక ఒక స్తంభాన్ని ఊపిన రెండవ స్తంభము కదులుతుంది. ఇంతటి మహత్తర మేధాసంపత్తి గల నిర్మాణము ఎవ్వరికినీ అంతు చిక్కుట లేదు. స్తంభములు కేవలము సున్నము, ఇటుక కట్టడములు మాత్రమే, ఏవిధమైన ఖనిజధాతువులు ఉపయోగించినట్లు కనిపించదు. అహ్మదాబాద్ నగరములో నున్న 2 మసీదులలో కదులుచున్న స్తంభముల నిర్మాణము మహాద్భుతము. ఇట్టి నిర్మాణమే ఆంధ్రప్రదేశ్‌లోని ఎల్లగందులలోని మసీదులోనూ, హర్యానాలోని పల్లా గ్రామంలోని దర్గాలోనూ కనిపించుచున్నవి. వీటి నిర్మాణ కౌశలము అంతుచిక్కక మహాద్భుతములుగా నేటికీ నిలచియున్నవి.

**17 గోమఠేశ్వర విగ్రహం :** కర్ణాటక, శ్రావణ బెళ్‌గోళ. స్వామివారికి బాహుబలియని పేరు కలదు. 57' ల ఎత్తుగల ఏకశిలా విగ్రహం. ఎత్తైన ఇంద్రగిరి పర్వతముపై ప్రతిష్ఠించబడియున్నది. స్వామివారు జైన రాకుమారుడు. ప్రాపంచిక వ్యవహారాలపై విరక్తి చెంది రాజ్యమును,

ధనాన్ని, అధికారమును వదలి అరణ్యమునకేగి వైరాగ్యము పొందినారు. స్వామివారు ఉత్తరాభిముఖుడు. విశాల వక్షస్థలం, దిగంబరత్వం, కాళ్లపై లతలు చెక్కబడియున్నవి. ఇంతటి పెద్ద ఏకశిలా విగ్రహయును ఇంద్రగిరి పర్వతముపైకి ఎట్లా మోసుకొని వెళ్ళి ప్రతిష్ఠించినారో ఇప్పటికినీ అనూహ్యమైయున్నది.

ఇంతటి ఏకశిలా విగ్రహమును తయారు చేసిన శిల్పిపేరు ఆదిత్యనేమి. అచ్చట గల వూరిపేరు శ్రావణబెళ్‌గొళ అనగా అత్యున్నత పర్వతముపై వెలసిన మహానుభావుడని అర్థము. 12 సం॥ కొకసారి మహా మస్తకాభిషేకం జరుగును. విగ్రహం చుట్టునూ ఇనుప స్తంభములు నిర్మించి మహా మస్తకాభిషేకము జరిపిరతురు. స్వామివారు వెలసిన ఇంద్రగిరి చూచుటకు చాల ఎత్తైనదై నునుపుగా నుండును. ఇట్టి పర్వతముపై అంతటి పెద్ద ఏకశిలా విగ్రహప్రతిష్ట ఇప్పటికీ అద్భుతముగా నిలచియున్నది.

## గోవును పూజించుట

దేవతలందరూ గోమాతలోనున్నారు. పూజించుట వలన ఆయురారోగ్య, అష్టైశ్వర్యములు కలుగును. నమస్కరించి, ప్రదక్షిణము చేసిన సమస్త దేవతలకు చేసినంత ఫలము, పుణ్యము కలుగుతుంది. గోపాదములందు - పితృదేవతలు, కాళ్లయందు - సమస్తపర్వతాలు, భ్రూమధ్యమున - గంధర్వులు, దంతములందు -గణపతి, ముక్కున - శివుడు, ముఖమున జ్యేష్టాదేవి, కళ్లయందు - సూర్య, చంద్రులు, చెవులయందు - శంఖ,చక్రాలు, కంఠమునందు - విష్ణుమూర్తి, భుజమున - సరస్వతి, రొమ్మున - నవగ్రహాలు, వెన్ను నందు - వరుణదేవుడు, అగ్నిదేవుడు, తోకయందు - చంద్రుడు, చర్మమునందు - ప్రజాపతి, రోమములందు - త్రింశతకోటి దేవతలు నివసింతురు.

## భక్తజయదేవుడు (గీత గోవింద రచయిత)

పుట్టిన ప్రదేశము పశ్చిమ బెంగాళ్ లోని భీరభం జిల్లాలోని కెండూలి గ్రామం. జయదేవగోస్వామి అనేపేరు. శ్రీ లక్ష్మణ సేన్ రాజుగారి ఆస్థాన విద్వాంసుడు. తల్లితండ్రులు బామాదేవి, భోజ్‌దేవ్. భార్య : పద్మావతి. మంచి నాట్యకత్తె. జయదేవుడు భక్తి పాటలు పాడుతూ వుంటే ఈమె నాట్యం చేస్తూండుట విశేషము.

## మహమ్మదీయ ప్రముఖ ప్రార్ధనా స్థలములు (మశీదులు)

మశీదులు : భగవత్ నిలయాలు దినమునకు 5 సార్లు ప్రార్థించు ఆచారము గలదు

1. కువాతుల్ ఇస్లాం మశీదు, ఢిల్లీ. గురువైన మహమ్మద్ బిన్‌శామ్ ఆజ్ఞ ప్రకారం కుతుబుద్దీన్ ఐబక్ చే నిర్మించబడి ఇల్‌తుష్ మిష్‌చే అభివృద్ధి చేయబడినది. కుతుబ్ మీనారు దగ్గర.
2. అరహాయ్-దిన్-కా-ఝాన్'ప్రా', అజ్మీరు (రాజస్థాన్). కుతుబుద్దీన్ ఐబక్ చే నిర్మించబడినది
3. జమాత్-ఖానా మశీదు, ఢిల్లీ. అల్లావుద్దీన్ ఖిల్జీచే నిర్మించబడినది. నిజాముద్దీన్ ఔలియా సమాధి వెనుక.
4. కలాన్ మసీదు,ఢిల్లీ. టర్క్‌మన్ గేటులోపల జునాన్‌షా నిర్మించబడినది.
5. ఖిర్కిమశీదు, ఢిల్లీ. ఖిర్కి గ్రామం. ఖాన్-ఇ-జహాన్ చే నిర్మించబడినది.
6. బీగం పురి మశీదు, ఢిల్లీ. బీగం పురి గ్రామం. ఖాన్-ఇ-జమాన్‌చే నిర్మించబడినది.
7. బారా గుంబాద్ మశీదు, ఢిల్లీ. ముగ్లాబువా మఖుద్దమా-ఐజమాన్‌చే నిర్మించబడినది.
8. మోత్-కి-మశీదు, ఢిల్లీ. మోత్‌కి గ్రామం. మియాభువాచే నిర్మించబడినది.
9. జమాలి-కమాలి మశీదు, ఢిల్లీ. మెహ్రోలి ప్రాంతము.
10. కులా-ఐ-కుహానా మశీదు, ఢిల్లీ. పురాణ ఖిల్లా ప్రాంతము. షేర్‌షాచే నిర్మించబడినది.
11. అదీనా మశీదు- పాండువా, మాల్డా జిల్లా, బెంగాల్ సుల్తాన్ సికిందర్ షాచే నిర్మించబడినది. (అతి పెద్ద మశీదులలో నొకటి)
12. చంఖాట్టి మశీదు, గౌర్.
13. తాంతి పార మశీదు, గౌర్. మీర్సద్ ఖాన్‌చే నిర్మించబడినది.
14. చోటా సోనా మశీదు, గౌర్. బంగ్లా దేష్ బోర్డర్. వాలీ మహమ్మద్ చే నిర్మించబడినది.
15. బారా సోనా మశీదు, గౌర్. "బారా ద్వారి" మశీదు అని పిలుస్తారు. నసరత్‌షా చే నిర్మించబడినది.
16. అతలా మశీదు, జవాన్‌పూర్. ఇబ్రహీం షర్కి పరిపాలనలో నిర్మించబడినది.
17. లాల్ దర్వాజా మశీదు, జవాన్‌పూర్. బీబీ రాజిచే నిర్మించబడినది.
18. జమీ మశీదు, జవాన్‌పూర్ . హుస్సేన్‌షాచే నిర్మించబడినది.
19. జమీా మశీదు, మంగ్రోల్ (గుజరాత్) ఇజ్జుద్దీన్ చే నిర్మించబడినది.
20. జమీమశీదు, అహమ్మదాబాద్. అహమ్మద్‌షా చే నిర్మించబడినది.

21 జమీ మశీదు, చంపానీర్ (గుజరాత్) (పెర్గూసన్ నిర్మాణ కౌశలము)

22. రాణి సబ్రాయి మశీదు, అహమ్మదాబాద్ రాణి సబ్రాయి నిర్మించినది.

23. సిది సయ్యద్ మశీదు, అహమ్మదా బాద్ షేక్. సయ్యద్చే నిర్మించబడినది

24. మాలిక్ ముగిస్ మశీదు, మాండ్యు మాలిక్ ముగిస్చే నిర్మించబడినది.

25 జమీమశీదు, మాండ్యు హెూషంగ్షాచే ప్రారంభించబడి మహమ్మద్షాచే పూర్తి గావించబడినది.

26. కోటలోని జమీ మశీదు, గుల్బర్గా (కర్ణాటక) మహమ్మద్షా బహమని కాలములో నిర్మించబడినది.

27. జమీ మశీదు, బిజాపూర్ ఆలి అదిల్షా పరిపాలనలో నిర్మించబడినది

28. అజంజిరి లేక మాలికా జహాన్ మశీదు, బిజాపూర్ ఇబ్రహీం అదిల్షాచే నిర్మించబడినది

29. ఆండు మశీదు, బీజాపూర్. ఇతిబార్ ఖాన్చే నిర్మించబడినది.

30. మక్కా మశీదు, హైద్రాబాద్ (AP) మహమ్మద్ కుతుబ్షా కాలములో ప్రారంభించబడి ఔరంగజేబుచే పూర్తిగావించబడిన కట్టడము.

31. టోలి మశీదు, హైద్రాబాద్. మూసా ఖాన్చే నిర్మించబడినది.

32. జమీ మశీదు, శ్రీనగర్ (జమ్ము & కాశ్మీర్). సుల్తాన్ సికిందర్చే నిర్మించబడి, కుమారుడైన జైనుల్ అబిదీన్చే అభివృద్ధి పరచబడినది.

33 జమీ మశీదు, ఫతేపూర్ సిక్రి. అక్బర్ పాదుషా చే నిర్మించబడినది.

34. మోతి మశీదు, ఆగ్రా షాజహాను చక్రవర్తిచే నిర్మించబడినది.

35 జమీ మశీదు, ఢిల్లీ. షాజహాను చక్రవర్తిచే నిర్మించబడినది.

36 మశీదు -ఐ-ఆలా, శ్రీరంగపట్టణము. టిప్పుసుల్తాను మందిర దర్వాజా వద్ద. టిప్పుసుల్తానుచే నిర్మించబడినది.

1. అతి పెద్ద 2 ఇనుప డేగిశాలలో వండి పులావును ప్రసాదముగా యిస్తారు - రాజస్థాన్లోని అజ్మీరు దర్గాలో.

2. భక్తులు పొడవు పాటి కాగితపు పొట్లాలలో బెల్లం పొడిని తీసుకొని వచ్చి ప్రసాదముగా సమర్పిస్తారు - తంజావూరు జిల్లాలోని నాగూర్ దర్గాలో.

3. వాజీ ఆలీదర్గా, బొంబాయి సముద్రములో కట్టబడినది. సముద్ర పాటు, పోటులపై ఆధారపడి దర్గాచేరుట గలదు.

4 మహ్మద్ ప్రవక్త అడుగుజాడలున్న పవిత్రప్రదేశం : గౌరు (పశ్చిమబెంగాల్). దగ్గరలోనే పాత మాల్డా, పాండువాలలో గల దివ్యమసీదులకు చూడవచ్చును.

## ప్రఖ్యాత చర్చీలనబడే క్రిష్టియన్ దేవాలయములు

1. ఆర్మీనియన్ చర్చి, మద్రాసు. 2.చర్చి ఆఫ్ బోమ్ జీసస్, పాత గోవా. 3.బాసిలికా ఆఫ్ సర్దానా. 4. బాసిలికా ఆఫ్ ఆవర్ లేడీ ఆప్ మౌంట్, బాంద్రా, ముంబాయి. 5.ఆర్థడాక్స్ సిరియన్ చర్చి, కొట్టాయం 6. క్రీష్టు కుల ఆశ్రం, తిరుపుత్తూరు. 7. కాథెడ్రల్ చర్చి ఆఫ్ సౌత్ ఇండియా, డోర్నకల్. 8. కాథలిక్ కాథెడ్రల్, షిల్లాంగ్. 9.సిరియన్ చర్చి, చెప్పాడ్. 10.చర్చ్యి యట్ మోకామే, బీహార్. 11.St థామస్ కేథడ్రల్ బాసిలికా, మైలపూర్. 12.హార్ట్ కాథెడ్రల్, న్యూఢిల్లీ. 13. చర్చి ఆఫ్ అవర్ లేడీ ఆఫ్ హెల్త్, వేలంకన్ని. 14. మాన్యుమెంటు యట్ అజికోడ్ కమ్మెమోరేటింగ్ ది లాండింగ్ ఆఫ్ St థామస్ యట్ ది పోర్ట్. 15. సిరియన్ చర్చి, చెంగనూరు, కేరళ. 16. కాథెడ్రల్ ఆఫ్‌ది చర్చి ఆఫ్ ది యీస్ట్, త్రిచూర్. 17.కాథెడ్రల్ ఇన్ పాండుచెర్రి. 18. చర్చి ఆఫ్ అవర్ లేడీ ఆఫ్ డోలోరస్, త్రిచూర్. 19.St. పాల్స్ కేథడ్రల్, కలకత్తా. 20 St జేమ్సు చర్చి, ఢిల్లీ 21. సిరియన్ చర్చి, న్యూ ఢిల్లీ. 22. సెంటినరీ చర్చి (మెథాడిస్టె), న్యూఢిల్లీ. 23.డానిష్ చర్చి, సేరం పోర్. 24. చర్చి ఆఫ్ St కాథెరెన్, గోవా. 25.చర్చి యట్ మపూసా, గోవా. 26. చర్చి యట్ St కాజిటల్, గోవా. 27. చర్చి ఆప్ అవర్ లేడీ ఇమాక్యులేట్ కన్‌సెప్షన్, పానాజీ. 28. St మేరీస్ చర్చి, బెంగుళూరు. 29. St. ఫిలోమినా చర్చి, మైసూరు.

## శిక్కుల గురువులు - ప్రముఖ ఆలయములు

1. గురునానక్ 2. గురు అంగద్ 3.గురు అమర్‌దాస్ 4. గురు రామదాస్ 5. గురు అర్జన్ 6. గురు హరగోవింద్ 7. గురు హరరాయ్ 8. గురు హరక్రిషన్ 9.గురు తేజ్‌బహద్దూర్ 10.గురు గోవింద్‌సింగ్

| | | | |
|---|---|---|---|
| 1 | గోల్డెన్ టెంపుల్ | అమృత్‌సర్ | పంజాబ్ |
| 2 | శ్రీ అకల్ తక్త్ | " | " |
| 3 | బాబా అతల్ | " | " |
| 4 | గురు ద్వారా రాంసార్ | " | " |
| 5 | లోహ గరా | " | " |
| 6 | గురు-కి-వడాలి | " | " |
| 7 | గురు ద్వారా ఆలంగిర్ | లూధియానా | " |
| 8 | ఆనందపూర్ సాహిబ్ | రోపర్ | " |
| 9 | కిరాట్ పూర్ సాహిబ్ | " | " |
| 10 | గురుద్వార పరివార విహార | " | " |
| 11 | అచల్ సాహిబ్ | గురుదాస్‌పూర్ | " |
| 12. | భత్తా సాహిబ్ | రోపర్ | " |
| 13. | గురుద్వారా బాబా బకాలా | అమృతసర్ | " |
| 14. | కంధా సాహిబ్ | బటాల | |
| 15 | గురు ద్వారా సాహిబ్ | భటిండా | " |
| 16 | శ్రీ చంకోర్ సాహిబ్ | రోపర్ | " |
| 17. | దందమా సాహిబ్ | భటిండా | " |
| 18 | దేర బాబా నానక్ | గురుదాస్‌పూర్ | " |
| 19 | దీనా | ఫరీద్‌కోట్ | " |
| 20 | గురుద్వారా జఫర్‌నామా | భటిండా | " |

| | | | |
|---|---|---|---|
| 21 | బౌలి సాహిబ్ | గోవిందవార్ | " |
| 22 | చౌబరా సాహిబ్ | " | " |
| 23 | గురుద్వారా దరోలిభాయి | ఫెరోజ్‌పూర్ | " |
| 24 | దందమా సాహిబ్ | శ్రీహర గోవింద్‌పూర్ | " |
| 25 | మంజి సాహిబ్ | " | " |
| 26 | గురుద్వార చెవిన్ సాద్‌షాహి | జలంధర్ | " |
| 27 | గంగ్సార్ | జైతు | " |
| 28 | తామ్ సాహిబ్ | కర్తార్‌పూర్ | " |
| 29 | ఖదూర్ సాహిబ్ | అమృతసర్ | " |
| 30 | గురుద్వార మచ్చివార | మచ్చివార | " |
| 31 | గురుద్వార చరణ్ కనవాల్ | " | " |
| 32 | ముక్తసర్ | ఫరీద్ కోట్ | " |
| 33 | గురుద్వార ఘట్ సాహిబ్ | నంగల్ | " |
| 34. | విభోర్ సాహిబ్ | నంగల్ | " |
| 35. | దుఖ్ నివారణ్ సాహిబ్ | " | " |
| 36 | గురుద్వారా బహదూర్ ఘర | పాటియాల | " |
| 37. | గురుద్వారా రాయ్‌కోట్ | లుధియానా | " |
| 38. | గురుద్వారా ఖాదౌర్ | సంగ్రూర్ | " |
| 39 | ఫతేఘర్ సాహిబ్ | సిర్‌హింద్ | " |
| 40. | హట్‌సాహిబ్ | సుల్తానపుర్‌లోధి | " |
| 41 | బేర్ సాహిబ్ | " | " |
| 42. | కోరి సాహిబ్ | " | " |
| 43 | తల్‌వాండి సాబు | భటిండా | " |
| 44. | తఖ్తపుర | 90 కి మీ చండీఘర్ | " |
| 45 | తారన్ తరన్ | 22 కి మీ అమృతసర్ | " |
| 46 | మంజి సాహిబ్ | అంబాలా | హర్యానా |
| 47 | గురుద్వార గోవింద్‌పుర | " | " |
| 48 | గురుద్వార బాద్‌షాహిబాగ్ | " | " |
| 49 | లకనౌర్ సాహిబ్ | " | " |
| 50 | నాధా సాహిబ్ | పంచకుల | " |
| 51 | పంజోఖరా సాహిబ్ | అంబాలా | " |
| 52 | గురుద్వారా మంజి సాహిబ్ | కురుక్షేత్రం | " |
| 53. | గురుద్వారా కపాల్ మోచన్ | అంబాలా | " |
| 54 | పోంటా సాహిబ్ | నహాన్ | హిమాచలప్రదేశ్ |
| 55 | భంగని సాహిబ్ | " | " |
| 56 | నాదౌన్ | కాంగ్రా | " |
| 57 | మండి | మండి | " |
| 58 | రవాల్‌సర్ | " | " |
| 59 | గురుద్వారా శ్రీనగర్ | శ్రీనగర్ | జమ్మూ & కాశ్మీర్ |
| 60 | గురుద్వారా మట్టాన్ | మట్టాన్ | " |
| 61. | సిస్ గంజ్ | ఢిల్లీ | ఢిల్లీ |
| 62 | రాకబ్ గంజ్ | " | " |
| 63. | బంగ్లా సాహెబ్ | " | " |
| 64. | గురుద్వారా మాతా సుందరి | " | |
| 65. | బాలా సాహిబ్ | " | " |
| 66. | గురుద్వారా మోతిబాగ్ | " | " |
| 67. | దందమా సాహిబ్ | " | " |
| 68 | మజ్నుకా తిల్లా | " | " |
| 69 | నానక్ పియాన్ | " | " |
| 70 | గురుద్వార బందా బహద్దూర్ | " | " |
| 71. | హేమకుంట్ సాహిబ్ | హేమకుంట్ | ఉత్తర ప్రదేశ్ |
| 72. | గురుద్వార నానక్‌వారా | హరిద్వారం | " |
| 73 | నానక్ మత్తా | నైనితాల్ | " |
| 74 | గురుకా బాఘ్ | వారణాసి | " |
| 75 | గురుద్వారా మాయితాన్ | ఆగ్రా | " |
| 76. | గురుద్వారా పుఖ్కాసంగత్ | అల్హాబాద్ | " |
| 77 | హజూర్ సాహిబ్ | నాందేడ్ | మహారాష్ట్ర |
| 78 | బర్చా సాహిబ్ | ధన్‌పూర్ | అస్సాం |
| 79 | దందమా సాహిబ్ | ధుబ్రి | " |
| 80 | హరమందిర్ సాహిబ్ | పాట్నా | బీహార్ |
| 81 | గురుద్వార మంగుమర్ | పూరి | ఒరిస్సా |
| 82 | గురుద్వార బారి సంగత్ | కలకత్తా | పశ్చిమబెంగాళ్ |
| 83 | నానక్ ఝిరా | బీదర్ | కర్ణాటక |

## జైన తీర్థంకరులు

1. అదినాధ లేక రిషభనాధ 2. అజితనాధ 3. సంభవనాధ 4. అభినందన నాధ 5 సుమిత నాధ 6. పద్మప్రభ 7. సుపార్శ్వనాధ 8 చంద్ర ప్రభ 9. పుష్పదంత 10 శీతలనాధ 11 శ్రేయంశనాధ 12 వాసుపూజ్య 13 విమల నాధ 14. అనంతనాధ 15. ధర్మనాధ 16. శాంతి నాధ 17. కుంతనాధ 18. అరనాధ 19. మల్లి నాధ 20. ముని శువ్రత 21 నామినాధ 22. అరిష్ట నేమి 23. పరశ్వనాధ 24. వర్ధమాన మహావీర

## ప్రముఖ జైన ఆలయములున్న పవిత్ర స్థలములు

| | | |
|---|---|---|
| 1. | వైశాలి | బీహార్ |
| 2. | పాట్నా | ” |
| 3 | రాజగిరి | ” |
| 4. | శ్రావస్తి | U P |
| 5. | అయోధ్య | ” |
| 6. | కౌశాంబి | ” |
| 7. | వారణాసి | ” |
| 8. | మధుర | ” |
| 9. | ఆగ్రా | ” |
| 10. | ఖజరహో | M P |
| 11. | దియోగర | ” |
| 12. | సాగర్ | ” |
| 13. | గ్యారసపూర్ | ” |
| 14 | విదిష | ” |
| 15. | వుదయగిరి | ” |
| 16. | రాయపూర్ | ” |
| 17. | వుజ్జయిని | ” |
| 18. | నాశిక్ | మహారాష్ట్ర |
| 19. | ఢిల్లీ | |
| 20. | బికనీరు | రాజస్థాన్ |
| 21. | జైపూర్ | ” |
| 22. | అజ్మీర్ | ” |
| 23. | కోట | ” |
| 24. | నాదోల్ | ” |
| 25. | చిత్తూర్‌గడ్ | ” |
| 26. | వుదయపూర్ | ” |
| 27. | చందేరి | ” |
| 28. | జోధపూర్ | ” |
| 29. | ఫలోధి | ” |
| 30. | జైసాల్మీర్ | ” |
| 31. | ఘనేరావ్ | ” |
| 32. | అహార్ | ” |
| 33. | మౌంట్ ఆబు | “ |
| 34. | కుంభారియా | గుజరాత్ |
| 35. | వడనగర్ | ” |
| 36. | తారంగా | ” |
| 37. | వర్ధమాన్ | ” |
| 38. | జునాగడ్ | ” |
| 39. | గిరినార్ | ” |
| 40. | శేజక్‌పూర్ | ” |
| 41. | శత్రుంజయ | ” |
| 42. | బిజాపూర్ | కర్ణాటక |

| | | | |
|---|---|---|---|
| 43. | ఐహూల్ | ,, | |
| 44. | హంపి | ,, | |
| 45. | షిమోగ | ,, | |
| 46. | హరిలిబే | ,, | |
| 47. | కరకాల్ | ,, | |
| 48. | శ్రావణబెల్‌గోళా | ,, | |
| 49. | హసన్ | ,, | |
| 50. | తుముకూర్ | ,, | |
| 51. | చంద్రగిరి | A P | |
| 52. | కంచి | తమిళనాడు | |
| 53. | ఆర్కాటు | ,, | |
| 54. | సేలం | ,, | |
| 55. | సిత్తన్నవాసల్ | ,, | |
| 56. | మధురై | ,, | |
| 57 | కోయంబత్తూర్ | ,, | |
| 58. | రామనాధపురం | ,, | |
| 59. | తిరునల్వేలి | ,, | |
| 60. | నాగర్‌కోయిల్ | ,, | |
| 61. | పాల్‌ఘాట్ | కేరళ | |

✻ ✻ ✻ ✻ ✻ ✻

## ప్రసిద్ధ ఆలయ సముదాయము గల పవిత్ర స్థలములు

1. గిరినార్ - నేమినాధ ఆలయ సముదాయం - గుజరాత్
   గిరినార్ కొండలపై - 5 శిఖరాలు
2. పాలిధానా - ఆదినాధ ఆలయసముదాయం - గుజరాత్
   శత్రుంజయ పర్వతాలపై పవిత్రదేవభూమి
3. దిల్‌వారా - విమల్‌వాసి, తేజపాల్ ఆలయ సముదాయం - రాజస్థాన్
   ఆబూ పర్వతంపై
4. రాణక్‌పూర్ - ఆదినాధ ఆలయ సముదాయం - రాజస్థాన్

## సప్తతీర్థ దర్శనము - జీవిత సాఫల్యము

1. శ్రీ సమ్మేద్ శిఖర్‌జీ
2. చంపాపురి
3. కుండలపూర్
4. పవాపురి
5. గుణావాజీ
6. రాజగృహ
7. లచువాడ్

## శనీశ్వరుడు - వివరములు, శింగణాపూర్ (మహారాష్ట్ర)

1. నవగ్రహాలలో గ్రహదేవతా సార్వభౌముడు.
2. సంజ్ఞాదేవి, సూర్యభగవానుల కుమారుడు.
3. యమధర్మరాజు శనీశ్వరుని తమ్ముడు.
4. మకర, కుంభరాసుల కధిపతి.
5. శ్రీ జ్యేష్ఠాదేవి శనీశ్వరుని భార్య : "శ్రీ జ్యేష్ఠాదేవి సహిత శ్రీ శనీశ్వర దేవతా ప్రీత్యర్థం పూజా కరి ష్యే" : శ్లోకం.
6. శని వికారినామ సంవత్సరము, మార్గశిర బహుళ నవమి, రోహిణీ నక్షత్రమున జన్మించెను. కాశ్యప గోత్రోద్భవుడు. శని జయంతి వైశాఖ శుద్ధ చతుర్దశినాడు జరుగుతుంది. "లఘు రుద్రాభిషేకము" నిర్వహించబడుతుంది.
7. శింగణాపూర్ గ్రామంలో స్వామివారు వెలసివున్నారు. లింగం ఎత్తు 5'.9''. వెడల్పు 2'.6'', మందము 1'.6''. 9'' భూమిలోనికి వుండి 5' పైభాగము.
8. అభిషేకం కొరకు లింగము చుట్టూవున్న అరుగు స్త్రీలు ఎక్కరాదు.
9. బిక్షగాళ్ళు కానరారు. మధ్య, మాంసాదులుండవు.
10. శింగణాపూర్‌ని "అహింసాపూర్" అనికూడ పిలుస్తారు.
11. గుడిలేని దేవునికి పూజారి లేని పూజ జరుగుతుంది.
12. వర్షాభావము తెలుసుకొనుటకు "కేల్‌విధి" అని పిలువబడు వుత్సవమును అల్లుడు, మామలు వెదురు కర్రలతో చేస్తారు.
13. స్వామివారి హుండీకి తాళం వుండదు.
14. బహిష్టు, ప్రసూతి, మరణం మొదలగు అమంగళకర దోషములు గల భక్తులు స్వామివారి ఆలయం చెంతకురారు.
15, స్వామివారిని దర్శించే భక్తులు తలపై రుమాలుగాని, టోపీలుగాని ధరించరాదు. ఇంతకు మందు తెలియజేసిన 5 శనీశ్వరాలయములు గాక ఈక్రింద 4 చోట్లకూడా ఆలయములు కనిపించుచున్నవి.

1. పావగఢ (కర్ణాటక). అనంతపురం జిల్లా బోర్డర్‌లో, 2. రాక్షసభవన్ (మహారాష్ట్ర). ఔరంగాబాద్, జలనాప్రాంతముల నుండి బస్సు. 3. షిరిడి (మహారాష్ట్ర). గణపతి, శివాలయముల మధ్య కలదు. సాయిబాబావారు దీపారాధన చేయించిన స్థలము. 4. హోశంగాబాద్ (మధ్యప్రదేశ్). 20కి.మీ. ఇటార్సి. నర్మదా నదీ తీరం.

## రామేశ్వర యాత్రా విధానము

రామనాధపురము జేరిన తరువాత 30 కి.మీ. దూరములోనున్న వుప్పూరు గ్రామం వెళ్ళి మొదట శ్రీ వినాయకున్ని దర్శించాలి. సేతుబంధ నాన్కిముందు శ్రీ రామచంద్రుడు

ప్రతిష్ఠించి పూజించిన స్వామివారు. తరువాత దేవిపట్టన్ వెళ్ళి సముద్రములోని నవగ్రహములకు పూజ చేయాలి. అక్కడ నుండి రామనాధపురం వచ్చి, తరువాత పాంబన్ వెళ్ళి అక్కడనున్న భైరవ తీర్ధంలో స్నానంచేసి ధనుష్కోటి వెళ్ళాలి. అక్కడనున్న 36 తీర్ధాలలో స్నానంచేసి శుద్ధి అయిన తరువాత రామేశ్వరం వెళ్ళాలి. ఆలయములోని తీర్ధములన్నింటిలో శుద్ధి అయి, అన్ని మందిరాలు దర్శించి, పూజించాలి. ఆఖరున కోటి తీర్ధములోని రామేశ్వరాన్ని 3 కి.మీ. దూరంలో నున్న సాక్షి వినాయకున్ని దర్శించి రావాలి.

## చిత్రగుప్త జననము

1. పార్వతీ పరమేశ్వరులు ఒకనాడు చర్చించుచుండగా జీవుల మంచి, చెడులను రికార్డు చేయవలసిన అగత్యమున్నదనే సమస్యకు పరిష్కారము కావలసి వచ్చినది. పార్వతీదేవి తీసుకొని వచ్చిన పలకపై పరమేశ్వరుడు ఒక బొమ్మను చిత్రీకరించి అమ్మవారికోరికపై స్వామివారు బొమ్మకు ప్రాణమిచ్చెను. చిత్రగుప్తుడని పేరు నిర్ణయించిరి.
2. ఇంద్రుని భార్య అయిన ఇంద్రాణి శివునిగూర్చి తపస్సుచేసి కుమారుడు కావాలని ప్రార్ధించినది. చిత్రగుప్తుని ఇంద్రాణి గర్భమున వుద్భవించమని శివుడాజ్ఞాపించెను. గాని, ఆ జన్మమున ఇంద్రాణికి 'గర్భము' ధరించు యోగములేదని చిత్రగుప్తుడు నివేదించగా, కామధేనువు గర్భమున ప్రవేశింపుమని ఆదేశించెను. ఆదేశము ప్రకారము సూక్ష్మరూపమున కామధేనువు గర్భమున ప్రవేశించెను. చైత్ర మాసములో ఒక ఆదివారమునాడు కామధేనువు చిత్రగుప్తుని ప్రసవించినది.
3. సూర్యుడు, నీలాదేవిల పుత్రుడుగా కూడా చిత్రగుప్తుని జననము జరిగెనను కధగలదు. చిత్రగుప్తుని జననమునకు పై కధలు కలవు. చిత్రగుప్తునిభార్య. కర్ణాంబిక

## అక్షరమాల

"అక్షరమాల" శక్తి స్వరూపం. "అ'' మొదలు "క్ష'' వరకు 51 అక్షరములు. విష్ణుమూర్తి సుదర్శన చక్ర ఘాతము చే సతీదేవి శరీరము ఖండింపబడెను. శరీర భాగాలు పడిన చోట్లు 51. ఒక్కొక్క భాగం మహాశక్తి పీఠముగా వెలశాయి. ఒక్కొక్క శరీరభాగం ఒకొక్క అక్షరం. శతీదేవి వెలసిన మహాశక్తి పీఠాలే "అక్షరమాల''.

## రాధా మాధవులెవరు? - గుప్తగాధ

వృషభానుడు, కళావతుల కుమార్తె రాధ. దేవకీ, వసుదేవుల కుమారుడు శ్రీ కృష్ణుడు. వీరిలో వయస్సులో పెద్దది రాధ.

వీరిరువురి బంధాన్కి ఒక గుప్తమైన కధ కలదు. పార్వతీ, పరమేశ్వరులు ఒకనాడు

సంతోష ప్రసంగ సమయములో పార్వతి పురుషునిగను, పరమేశ్వరుని స్త్రీ గను వూహించుకున్నట్లయిన ఏ విధంబుగనుండునని ఆలోచించిరి. ఆవిధముగా వుద్భవించుట కుద్యుక్తులైరి

ఆదిశక్తి (కాళికా దేవి) పురుషుడుగా (నీలమేఘశ్యాముడుగా) శ్రీకృష్ణ రూపమున వుద్భవించెను అన్నగారైన విష్ణుమూర్తిని, రామ నామముతో బలరామునిగా జన్మించమని కోరినది పార్వతి యిష్టసఖులు జయ, విజయులు శ్రీధామ, సుదాములుగా జన్మించిరి. శ్రీకృష్ణుని చెలికాండ్రయిరి. శివుని అష్టమూర్తులు, శ్రీకృష్ణునికి అష్టభార్యలుగా జన్మించిరి.

పరమేశ్వరుడు రాధారూపమున జనించి శ్రీకృష్ణుని జేరెను. ప్రమధ గణాలన్నీ గోపిక స్త్రీలుగా జన్మించిరి. వ్రేపల్లె, బృందావన ప్రాంతములో పార్వతీ పరమేశ్వరులు రాధాకృష్ణులుగా గోపికా జన మధ్యమున మధురాతి మధురముగా విహరించి ప్రణయాన్కి అర్ధముచెప్పి జీవుల అనుబంధాన్కి శాశ్వతముద్ర వేశారు. అట్లా వేసినవారే రాధామాధవులు. వారే పార్వతీ పరమేశ్వరులు, ప్రకృతి, పురుషులు.

**శ్రీ కుసుమ హరనాథ ఆలయములు - సూక్తులు**

ప్రపంచాన్కి ప్రేమ తత్వాన్ని బోధించిన రాధాకృష్ణుల అంశతో శ్రీ కుసుమ హారనాధ్‌లు జన్మించిరి.

జయరాం, భగవతిల తనయుడు ధాకూర్ హరనాధ్. కందర్ప సుందర్, చంద్రావతిల తనయ కుసుమకుమారి. వీరిరువురిని పూర్వ జన్మమున నవద్వీపధామంలో వెలసిన, రాధాకృష్ణ అభిన్నమూర్తియైన శ్రీ గౌరాంగప్రభువుగా భావించబడుచున్నది. శ్రీగౌరాంగప్రభువే శ్రీచైతన్య మహాప్రభువు. పశ్చిమ బెంగాల్‌లోని భాగీరధీ తీరాన నున్న మాయాపూర్ "హారేకృష్ణ" స్ఫూర్తికి కేంద్రము. శ్రీకుసుమ హరనాధాలయములు ఆంధ్రప్రదేశ్‌లో వెలసిన కొన్ని పవిత్ర స్థలములు: దువ్వాడ, గుడివాడ, విజయవాడ, తెనాలి, గిద్దలూరు, శింగరాయకొండ, గుంటూరు, నెల్లూరు, మార్కాపురం, నర్సరావుపేట, భీమవరం, మచిలీపట్నం, ఘయ్యూరు, ఏలూరు, అన్నవరం, రాజమండ్రి, మల్లేశ్వరం, విజయనగరం, హైద్రాబాదు.

వీరి వుపదేశములలోనివి కొన్ని :

1. నేను ప్రేమావతారముగా వచ్చివున్నాను. యోగ్యుడు, అయోగ్యుడు అనుభేదములను పాటించను.
2. మనసా, వాచా, కర్మణా ప్రభువు సేవకు అంకితమై పోతివా శాశ్వతముగా శాంతిని, ఆనందాన్ని పొందుతావు.
3. ఇతరులను కొల్లగొట్టేవారు కుసుమహరనాధ ప్రేమకు అనర్హులు. వారు ఎన్నటికి అభివృద్ధిలోన్కి రాలేరు.

4 నేను వైకుంఠములోగాని, యోగుల హృదయాలలోగాని లేను. నాభక్తులు నానామ సంకీర్తనలు చేసేచోట తిష్టవేసుకునివుంటాను.

5. ఒక బిందువంత ప్రేమ నాకుయివ్వండి మిమ్మల్ని ప్రేమ సముద్రములో ముంచెత్తుతాను

6 కల్మషము, కపటముగల మనస్సులో ప్రభువునకు చోటు లేదు.

7. ఏ పనులు బహిర్గతంగా చేయడం కుదరదో, ఆపనులను ఎన్నడూ చేయవద్దు.

8. మీకు తార సిల్లిన ప్రతి స్త్రీలోను మాతృత్వమును గమనించడము నేర్చు కోండి.

9. మనఃపూర్వకముగా చేయకపోయినా, చేసిన నామస్మరణ వృధాకాదు.

10. కృష్ణుని కన్నా కృష్ణ నామమే శక్తి వంతమైనది.

శ్రీ కుసుమ హరనాధులకు ప్రచారలోపము గాన వస్తున్నది.

శ్రీ చైతన్య మహాప్రభువు పూరీలోని జగన్నాధునిలో ఐక్యమయిరి.

## పక్షి తీర్థం కథ

అతి, సాంబు అనుపేరుగల ఋషులు అన్నదమ్ములు. అతి శివభక్తుడు. సాంబు పార్వతి భక్తుడు. ఒకరోజున వీరిద్దరికి వాదన వచ్చినది. శివ, పార్వతులలో ఎవరు ఎక్కువని. ప్రకృతి, పురుషులు - ఇరువురు సమానము. ఎవరు లేకపోయినా రెండవ వారు రానించరని శివుడు స్వయముగా చెప్పెను. అన్నదమ్ములు తృప్తిపడలేదు. శివుడు కోపించి వారిద్దరిని గ్రద్దలుగా మారవలసినదని శపించెను.

వేదగిరిపై వెలసిన శివుని సమక్షమున ఈ పక్షులు ప్రసాదమును తినుచుండును.

వీటి దినచర్య : కాశీలో స్నానం, రామేశ్వరంలో పూజ. వేదగిరిపై (పక్షితీర్థములో) ప్రసాద సేవనం, చిదంబరంలో విశ్రాంతి.

ఈ క్షేత్రము తమిళనాడులో గలదు.

## వయస్సులు

1. పెండ్లి కాలాన్కి శ్రీరాముని వయస్సు - 16 సంవత్సరములు
2. ఆండాళ్ శ్రీరంగ నాధునిలో (పెండ్లికుమార్తెగా అలంకరించబడి) ఐక్యమగుసరికి వయస్సు - 14 సంవత్సరములు
3. శ్రీ కృష్ణుడు మధురకు వచ్చి కువలయాపీడాన్ని, చాణూర ముష్టికులను, కంసుని చంపు నప్పటి వయస్సు - 12 సంవత్సరములు

## "మూడుమూర్తుల తిరుమలేశా" - ఘంటసాల

ఘంటసాలవారు ఏనాడో పాడారు శ్రీవేంకటేశ్వరునుద్దేశించి. తిరుమలేశుని మూడుమూర్తుల స్వామివారిగా స్తుతించారు. స్వామివారిని దర్శించితే కనిపించేది ఏకమూర్తి మాత్రమే. మరి వారి స్తుతికి అర్ధమేమిటి? ఆ పాటలోనే వారు వివరణ కూడా యిచ్చారు. "ఆదిశక్తివని కొందరు, శివరూపమీవంచు చెప్పుదురు కొందరు, నారాయణుడ వంచు నమ్మెదురు కొందరు" ఇదీ సాహిత్యము. ఇది ఎట్లా సంభవము అనే తపనతో తిరుపతికి పలుసార్లు పరిగెత్తడం జరిగింది. ఎవరిని పట్టుకొంటే నిజం తెలుస్తుందో వారందరి గురించి ప్రయత్నములు చేయడం జరిగింది. అంచెలంచెలమీదుగా చాలా ఇన్‌ఫర్‌మేషన్ సేకరించడమైనది.

1. గర్భగుడి ప్రాకారముపై సింహ విగ్రహములున్నవి. రాతివి. బయట ప్రాకారముపై మూలలో గరుత్మంతుని విగ్రహములున్నవి. సిమెంట్‌వి, తెల్లనివి. బయట ప్రాకారము తరువాత నిర్మాణము.
2. శుక్రవారం అభిషేకం జరుగుచున్నది. అభిషేకం జరిగేటప్పుడు శ్రీసూక్తము పఠించబడుచున్నది. శివునికి అభిషేకం సాధారణముగా సోమవారం రోజున, విష్ణుమూర్తికి (కేశవునకు) శనివారం రోజున జరుగును.
3. అభిషేకములో పసుపును వాడుచున్నారు. పురుషమూర్తులకు పసుపువాడుట ఇంకెచ్చటనూ కానరాదు.
4. సంవత్సరానికి ఒకసారి "తిరుప్పావడై" అని పిలువబడే కుంభం పోయుదురు. కుంభము పోయు ఆచారము అమ్మవారిది.
5. వీపుపై పిరుదుల వరకు పొడవైన శిరోజములు వ్రేలాడు చుండును. జడ అని అనుచున్నారు. స్త్రీ విగ్రహ గంభీర వక్షోజములను తొలగించి రెండు ప్రక్కలా రెండు విగ్రహాలను చిత్రీకరించారు. శ్రీదేవి, భూదేవిని. విష్ణుమూర్తి వక్షస్థల మధ్యభాగమున మాత్రమే లక్ష్మీదేవి నివాసస్థానము. ఇచ్చట అట్లాగాదు.
6. "కాళి" గోపురముగా పిలువబడే కొండ దిగువన నడకబాటకు ప్రారంభముననున్న గోపురము "గాలి" గోపురముగా ప్రస్తుతము పిలువబడుచున్నది.
7. తిరుపతి దర్శనమునకు ముందుగాని, తరువాత గానీ మాంసాహారులు మాంసాహారమును తప్పనిసరిగా తినుట కనిపించుచున్నది. శక్త్యాలయ దర్శనపుటలవాటు.
8. విగ్రహము మొదట్లో ఉగ్రరూపముతో జ్వాలారూప బిందు బొట్టుతో భయంకరముగా

నుండెడిది. సూర్యాకారముతో జ్వాలారూపముననున్న బొట్టును శివుని మూడవ కన్నుగా మార్పుచేసి అడ్డబొట్టు మధ్యనుంచబడినది.

9 ఉగ్రరూపముతో విరాజిల్లు విగ్రహమునకు భక్తులు ఆకర్షితులై తన్మయత్వంలో మునిగి, తమను తాము మరిచిపోయి, శివాలెత్తి తమ తమ శరీరములపై నున్న వాటిని విగ్రహము మీదికి విసరివేసి నిలువుదోపిడికి గురయ్యేవారు అంతటి ఆకర్షణ, తన్మయత్వము ఇప్పుడు మ్రొక్కుబడిగా పరిణమించినది. ఈ విధముగ నిలువు దోపిడి పద్ధతి ఆవిర్భవించినది

10. ఉగ్రరూప విగ్రహమునుండి వెదజల్లబడు బ్రహ్మపదార్థము, దివ్య పరిమళము గ్రహించుటకు శిరస్సులు వంచి సాష్టాంగనమస్కారం చేసెడివారు. శిరోజములను తొలగించి శిరస్సును విగ్రహమునకు సాధ్యమైనంతవరకు దగ్గరగా వెళ్ళి శిరస్సువంచిన సూక్ష్మద్రవ్యము, బ్రహ్మపదార్థము, దివ్య పరిమళము శిరోజములు లేని శిరస్సు ద్వారా తేలికగా ప్రవేశము చేసి, శరీరమును చేరునని స్త్రీ పురుషభేదంలేకుండా భావించెడివారు. ఇప్పడది మ్రొక్కుబడిగా పరిణమించినది గుండు చేయించుకొను విధానమునకు ముఖ్యకారణము విగ్రహములోని శక్తి. అధికసంఖ్యలో గుండు గీయించుకొను క్షేత్రముగా ప్రసిద్ధినొందినది.

11. గర్భగుడిలోనున్న విగ్రహం ఉగ్రరూపం. స్త్రీమూర్తిదని భావించుట కనుగుణముగా ఇప్పుడున్న పాకశాలలో శ్రీ ఉగ్రనరసింహుని విగ్రహం ప్రతిష్ఠించబడినది. **1469**లో వ్రాయబడిన శాసనము ఈ విషయమును నిర్ధారించుచున్నది. అమ్మవారి విగ్రహాన్ని అయ్యవారి విగ్రహంగా మార్చిన తరువాత, (ఉగ్రరూపం తగ్గించిన తరువాత); నారసింహ విగ్రహం యొక్క ఉగ్రరూపానికి ప్రజలు భీతావహులవకుండా ఉండుటకు గాను నారసింహ విగ్రహం తొలగించబడినది. అయినప్పటికీ, ఇప్పటికీ తిరుమల నారసింహ క్షేత్రముగా పిలువబడుచున్నది.

12 అమ్మవారి విగ్రహముగా నున్నప్పుడు నోటికిరుప్రక్కలా చిన్న కోరలుండెడివట. విగ్రహము మార్పుతో అవి తొలగించబడినవి. ద్వారపాలకులకు కోరలు ఇప్పటికీ నున్నవి

13. స్వామివారి వక్షస్థలముపై "శ్రీకౌస్తుభం" అనే ఆభరణం ఉన్నది. ఈ ఆభరణము శక్తి విగ్రహాలంకరణ. అమ్మవారి నడుముకు పెద్ద వడ్డాణము ఉండెడిదట. శివునిగా మార్చిన తరువాత నాగాభరణముగా మార్చి బంగారు పూతగల రేకుతో కప్పిపుచ్చారు.

14. అమ్మవారి విగ్రహము చెవులకు పెద్ద పెద్ద కుండలాలుండెడివట. అవి కనిపించకుండా నుండుటకు గాను వాటిని మించిన పెద్ద పెద్ద ఆభరణములతో పురుషమూర్తి చెవులకు అలంకరణ కనిపించుచున్నది.

15. స్త్రీ శిరోజాలంకారముగా నెలవంక ఉండెడిదట. శివుని విగ్రహముగా మార్చునపుడు దానిని శివుని శిరస్సున నుండవలసిన చంద్రవంకగా మార్చిరట.

16. స్వామివారి కళ్ళకు కాటుక వాడుచున్నారు కాటుకాలంకరణ స్త్రీ సొత్తు.

17. ఏకమూర్తి ఆలయం గర్భగుడిలో మూలవిరాట్ ఒక్కటే ఉంటుంది. వేరొక మూర్తి కానరాదు. ఈ ఆచారము సాధారణముగా అమ్మవారి ఆలయములలో కనిపించును.

18. ఒరిజినల్ విగ్రహము ఎర్రటి రాతితో నుండెడిదట. దానిపై ప్రతిరోజూ పునుగు పూసి విగ్రహము యొక్క అసలు రంగును మార్చడమైనదట. పునుగు పూతచే విగ్రహమునకు నల్లని రంగుతోబాటు తళతళ కాంతి అబ్బినది. అభిషేకములో తేనె వాడరు. తేనె వాడినచో పునుగు పూత పోతుంది.

19. ఎర్రటి విగ్రహము యొక్క గడ్డముపై పచ్చబొట్టు చుక్క ఉండెడిదట. స్త్రీలు గడ్డముపై పచ్చబొట్టుతో చుక్క పొడిపించుకొనుట ఒకనాటి ఆచారము.

20. స్త్రీ రూపముతో నున్న విగ్రహం కాబట్టి మొదట్లో భక్తులు "బాల" అని, పిలిచెడివారు. తరువాత చెందిన పురుష విగ్రహ మార్పు తరువాత "బాలాజీ" అని పిలుచుట మొదలైనది. ఇప్పటికీ ఈ క్షేత్రమును ఆదిశక్తిక్షేత్రముగా గుర్తుంచుకొని "శ్రీవేంకటేశ్వరి' అని కూడా పిలుస్తూంటారు.

21. శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రిగారు స్వామివారిని అభిషేక సమయములో నగ్నమూర్తిగా చూచినపుడు ఇతర ఆకారములతో బాటు "హయమొత్తరీయ సమర్పణ వేళ పరాశక్తి మూర్తి సుందరత గంటి" అని వర్ణించినారు.

22. ధ్వజస్తంభము, బలిపీఠము గర్భగుడినానుకుని ఉండెడివట. బలిపీఠం వద్దనే జంతుబలులిస్తూండేవారట. అనగా మూడవ ఆవరణలో, మూడవ ఖండములో నుండెడివట. ఇప్పుడవి మొదటి భాగానికి (ముందునకు) మార్చబడినవి.

23. ధనుర్మాసములో బిల్వపత్రార్చన జరుగుచున్నది. బిల్వ పత్రార్చన శివాలయమందు గాక వైష్ణవాలయమందు లేదు. స్వామివారు చతుర్భుజుడు కాదు. ఒక చేతియందు ఢమరుకము, మరియొక చేతియందు పాశమును గలవు.

24. ఉత్తరాన కైలాసం వారణాసి. దక్షిణాన కైలాసం చిదంబరం. మధ్యకైలాసం తిరుమల యని ఇప్పటికీ శైవక్షేత్రముగనే పరిగణించుట గలదు.

25. సుప్రభాత సమయములో విభూతి రేఖలు ముఖాన అడ్డముగా ధరించిన పూజారులు కొంతమంది సుప్రభాత స్తోత్రమున ఇతరుతోబాటు ఇప్పటికినీ కనిపించుచున్నారు.

26. సూర్యగోళాకార పెద్దబొట్టును విగ్రహ ఫాలభాగమున శివునికనుగుణముగా మార్పుచేయబడినది.

27. శక్తి విగ్రహముగా నున్నప్పుడు వచ్చే భక్తుల సంఖ్య శివవిగ్రహా మార్పు అనంతరం తగ్గుటచే ఆకర్షణ శక్తులతో కూడిన శ్రీ చక్రమును శ్రీ ఆదిశంకరాచార్యులవారు ప్రతిష్ఠించిరి.

28. స్వామివారి కుడిచెయ్యి అభయ హస్తం. ఎడమ చెయ్యి వేరేముద్రతో పైకి ఉండవలసినది. కానీ విగ్రహ భాగాన్ని మూసినట్లుగా క్రిందికి ఉన్నది.

29. ఒరిజినల్ విగ్రహము యొక్క పాదములు పూర్తిగా చెక్కకనే అసంపూర్తిగా మిగిలిపోయినవట. ఈ అసంపూర్తిని కప్పిపుచ్చుటకు గాను విగ్రహపాదముల పైభాగమును మెటల్‌తో కప్పిపుచ్చి పద్మముపై నున్నట్లు మెటల్‌తో చేయడమైనది. ఈ విగ్రహమునకనుగుణముగా నున్నదన్నట్లుగా చిన్న తిరుపతిలోని శ్రీ వేంకటేశ్వరుని పాదములు కనిపించవు. తిరుమలలోని విగ్రహము యొక్క పాదాంతములు కనిపించకుండా మెటల్ కవరువేసి అలంకరించుట కనుగుణముగా స్వామివారి చేతులను కూడా మెటల్‌తో అలంకరించుట జరిగినది.

30. శక్తి విగ్రహముగా నున్న రోజులలో అభిషేక ఆచారము లేదు. శైవ విగ్రహముగా మార్చిన తరువాత అభిషేకపు టేర్పాటు జరిగినది. అభిషేక జలము గర్భగుడినుండి బయటకు పోవు ఏర్పాటు లేనందున ప్రస్తుత అభిషేక జలమును పాత్రలతో ఎత్తి బయట పోయుచున్నారు.

31. విష్ణుమూర్తి చతుర్భుజుడు. శంఖము, చక్రము, గద, పద్మములతో నుండును. కానీ యిచ్చట అట్లా కానరాదు. విగ్రహానికి రెండు భుజముల పైన శంఖ, చక్రములు తగిలించియున్నవి, స్వామి చతుర్భుజాడు కానందున. క్రిందకున్న రెండు చేతులూ ఆయుధధారణ లేక ఉన్నవి. విష్ణుమూర్తికి ఉండవలసిన శంఖ, చక్రాలు మూలవిగ్రహానికి అలంకరణ మాత్రముగ పెట్టబడివున్నవి.

32. నుదుట భాగముననున్న జ్వాలారూప చుక్కబొట్టును శివుని రూపముగా మార్చబడినపుడు మూడవ నేత్రముగాను, అడ్డబొట్టుతో మార్పుచేయడమైనది. మరల విష్ణుమూర్తి రూపముగా మార్పుచేయునపుడు నుదుటి పై నున్న జ్వాలా నేత్రాన్ని, అడ్డబొట్టును పూర్తిగా తొలగించి నామాన్ని నిలువుబొట్టు ఆకారములో పెట్టవలసి వచ్చినది. పాత గుర్తులు కనిపించ కుండానుండుటకు గాను నామం చాలా పెద్దదిగా పెట్టవలసి వచ్చినందున కండ్లమీదుగా తీసుకురావలసిన అవసరం ఏర్పడినది. ఈ విధమైన నామధారణ మరే వైష్ణవ విగ్రహానికీ కనిపించదు. కండ్లపై నుండి దిద్దిన నామము సమర్ధనకుగాను, స్వామివారి చూపు నరికట్టనిచో లోకములు దగ్ధమై పోతాయని కధ అల్లడమైనది.

33 సాధారణముగా శివాలయములో గర్భగుడి బయట, వైష్ణవాలయములో కూడా గర్భగుడి బయట భక్తుల విగ్రహములుండును. ఇది శక్త్యాలయము గాబట్టి భక్తుల విగ్రహములు కనిపించవు. తరువాత కాలములో కేవలము శ్రీ రామానుజుల వారి విగ్రహం మాత్రమే పెట్టబడినది.

34 శివాలయములోగానీ, వైష్ణవాలయములోగానీ గర్భగుడిలో స్వామివారు ప్రక్కగదిలోగానీ, ఎదురుగా గానీ అమ్మవారుండుట ఆచారము, ఇచ్చట అటువంటి ఆచారము కనిపించదు.

35. శ్రీపోయ్‌గై ఆళ్వారులు ఈక్రింది విధముగా వర్ణించిరి:
స్వామివారు వృషభాన్ని, పక్షీంద్రుని ఆరోహిస్తారు. పురాల్ని భస్మీపటలము చేశారు (త్రిపురాలను); నరసింహుడై రాక్షసుని చీల్చి, ప్రేగులు తీశారు. విభూతి ధారి, నీలపురంగువాడు, అర్ధనారీశ్వరుడు, శిరస్సున జటాజూటములు, గంగను ధరించినవాడు, విశ్వాన్నే ఆక్రమించిన త్రివిక్రముడు (వామనుడు). అందుచేతను స్వామివారు శివుడు మాత్రమేగాక కేశవుడు కూడాయని తెలియుచున్నది.

36. త్యాగరాజు స్వామివారి కడ్డముగా నున్న తెరను తొలగించిన వెంటనే అనేక మార్పులను గమనించి "శివుడవో, మాధవుడవో, కమల నాభుడవో, పరబ్రహ్మవో, ఎవరని నిర్ణయించేదిరా, నిన్నెట్లు ఆరాధించేదిరా" అని ప్రార్థించినాడు. సందేహం వెలిబుచ్చినాడు.

37. స్వామివారు శివుడా? విష్ణువా? అన్న వాదం 11-12 శతాబ్దములలో తలెత్తినది. జయకొండ చోళమండలములోని నారాయణ వనమనే ప్రాంతాన్ని ఏలే యాదవరాజుల పరిపాలనలో పెద్ద వాదము జరిగినది. ఇరువైపుల వాదములు విన్నతరువాత స్వామివారు "హరిహర మూర్తి"యని అంగీకరించడమైనది. స్వామివారి పేరుకూడా ఇందుకు సమర్ధనీయముగ నున్నది.

38. శ్రీ వేంకటేశ్వరుని విగ్రహం చాల పెద్ద సాలగ్రామ శిలనుండి తయారైనదనియు, అందుచేతనే ఆకర్షణ శక్తి కలిగివున్నదనియూ కొందరి అభిప్రాయం. స్వామి వారిమెడలో సాలగ్రామ శిలల హారమున్నదనియు, దాని మూలమున కూడా ఆకర్షణ శక్తి వచ్చినదనియు కొందరి అభిప్రాయము.

ఈ విధమైన రకరకాల ఆచారములతో నిండిన పూజలు వగైరా స్వామివారికి జరుగుచున్నందున స్వామివారి విగ్రహము మొదట్లో ఆదిశక్తియనియు, తరువాత ఈశ్వరునిగా మార్చబడినదనియు, ఆ తరువాత విష్ణుమూర్తి అంశగా మార్పుచేసినారనియు

గమనించవచ్చును. దిగువ తిరుపతిలోనూ, ఎగువ తిరుమలలోనూ "శ్రీ వేంకటేశ్వరుని విగ్రహ మార్పుగాధ ఈ విధముగా వినిపించుచున్నది. "శ్రీ" అనగా అమ్మవారి అంశ, "వేంకట" అనగా నారాయణాంశ, "ఈశ్వరుడు" అనగా శివాంశ అని, నామములోనే ఈ మార్పు విశదమైనదని చెప్పుచున్నారు.

ఉత్తరాదినుండి ఒక శిల్పి వ్యసనపరుడై కుటుంబమునకు, సమాజమునకు దూరుడై తిరుపతి పరిసరములకు జేరెను. ఇతడు స్వతహాగా దైవభక్తిపరుడు. తిరుగుచూ తిరుగుచూ వేంకటాద్రి పర్వతముపై మసలుచుండగా రాత్రులందు అచ్చటనున్న చెట్లపై, రాళ్ళు, రప్పలపై ఒకవిధమైన మెరుపు ఉండుట పసిగట్టినాడు. పగలు అట్టి తేజము కానరాకుండెను. ఎచ్చటనుండి ఈ కాంతిరేఖలు వచ్చుచున్నవో తెలుసుకొనుటకు రాత్రులందు వెదుక నారంభించెను. కొంతదవ్వు పోవుసరికి కాంతిరేఖలు ఎక్కువగుటయేగాక దివ్యపరిమళ సుగంధ సువాసనలు కూడా వచ్చుచున్నట్లు గమనించెను. తుదకు తేజస్సు, పరిమళము ఒక గుహనుండి వచ్చినట్లు గమనించెను. ఉదయమున లోనికిపోయి చూడ ఒక చక్కటి శిలావేదికపై ఒక మహానుభావుని అస్తిపంజరము కనిపించెను. అది తపోదీక్షతో నున్న ఒక సిద్ధునిదని తలంచెను. అస్తిపంజరమునకు అంత్యక్రియలు జరిపి ధన్యుడైనట్లు భావించెను. తరువాత అతనిలో నూతన చైతన్యము కలిగినది. సూక్ష్మద్రవ్యము, దివ్యపరిమళము గల శిలయందు కొత్త తేజస్సు గోచరించెను. తపోధనుడైన మహానుభావుని నివాసమగుటచే ఆ శిల చాల పవిత్రమైనదిగాను, మహత్తర శక్తులతో కూడుకున్నదిగానూ తలంచబడినది. అతనిలో ఉత్సాహముతోబాటు నూతన తేజము ఆవరించినది. వ్యసనములను విడనాడెను. వెంటనే ఆ శిలను విగ్రహముగా చెక్కనారంభించెను. విగ్రహము చెక్కుచున్నప్పుడు అతనికి తెలియనటువంటి మహాశక్తి పూనినట్లు తలచెడివాడు. తేజోవంతమైన ఉగ్రరూపిణిగా సూర్యకళ కల్గిన బొట్టుతో, విశాల వక్షస్థలముతో, దీర్ఘబాహువులతో, పొడవాటి జడతో కూడిన శిరోజములతో శక్తి విగ్రహమును పాదముల వరకు చెక్కగల్గెను. అవసానకాలం ఆసన్నమగుటచే అసంపూర్తిగా పాదములు మిగిలిపోయెను. శిల్పి గతించాడు. కొంతకాలమైపోయినది. అమ్మవారి విగ్రహం గుహలో మరుగున పడిపోయినది.

ఒక పండితోత్తముడు వేంకటాద్రిపై ఆశ్రమము నిర్మించుకుని చుట్టుప్రక్కల నున్నవారికి జ్ఞానబోధ చేయుచూ కాలము వెళ్ళబుచ్చు చుండెను. ఒకనాడు పంది ఒకటి పండితోత్తముని ముందుకు వచ్చి నిలువబడి తదేకదీక్షతో పండితునివైపు, ఇంకొకవైపునకు మాటిమాటికి చూచుచుండెను. ఈ విధమైన ప్రవర్తన కొద్ది రోజులు సాగుటచే పండితుడు పంది ననుసరించెను. గుహలోనికి పోయి పంది అదృశ్యముకాగా మహత్తర శక్తి విగ్రహము

దర్శనమిచ్చెను తరువాత పంది కానరాదయ్యెను, చుట్టుప్రక్కల భక్తుల చేరదీసి విగ్రహమును బయటకు తెచ్చి తన ఆశ్రమము వద్ద ఒక శుభముహూర్తమున నిలువబెట్టి "భవాని" నామముతో పూజలారంభించెను భక్తుల సహకారముతో ఆలయనిర్మాణము గావించి స్నానపానాదుల నిమిత్తము ఒక కొలను త్రవ్వించెను అమ్మవారి విగ్రహము అమిత తేజోవంతమై భక్తుల నాకర్షిస్తున్నందున భక్తులు మధుపాన మత్తులై జంతువులను బలి యిచ్చుచుండిరి. విపరీతమైన ఉద్వేగముతో శరీరముపై నున్న విలువైన ఆభరణాదులను అమ్మవారికి సమర్పించుచుండిరి. రాను రాను అమ్మవారి తేజస్సు, భక్తుల పారవశ్యము కొండ క్రిందనున్న గ్రామములకు సహితము ప్రాకినది. కొండపైనున్న అమ్మవారిని చేరుటకు క్రిందనుండి పైకి పోవు కాలిబాట మొదట్లో గోపురమును నిర్మించి "కాళీ గోపురమ"ని పిలుచుచుండిరి. పరాశక్తి విగ్రహాన్ని చూపించిన పందికి ఒక చిన్న ఆలయమును కట్టించి అందు పందిని ప్రతిష్టించి పరమేశ్వర అవతారముగా భావించి పూజలు ప్రారంభించెను. తొలిపూజ పంది రూపమున వెలసిన వరాహస్వామివార్కి జరుగుచున్నది. అలయంకోనేరు ప్రక్కన నున్నది.

ఆది శంకరాచార్యుల వారు ఆప్రాంతమునకు పర్యటనకు రాగా వారి దృష్టికి అమ్మవారి ఆలయము వచ్చినది. విశేష జనుల నాకర్షిస్తున్న అమ్మవారి విగ్రహమును చూచి శంకరాచార్యులవారు తన్మయులైరి. అమ్మవారి విగ్రహమున బ్రహ్మపదార్థము ఉట్టిపడుతూ, దివ్యపరిమళము వెదజల్లబడుతూ, ఉత్తేజముతో మహాశక్తి విగ్రహము శంకరాచార్యుల వారిని ఆకర్షించినది. చుట్టుప్రక్కల గ్రామస్తులను, భక్తులను రావించి అమ్మవారు ప్రేమస్వరూపిణి యని, అందరకు మాతృమూర్తియని నచ్చజెప్పి జంతుబలుల నాపప్రయత్నించెను. తన ప్రయత్నము కొనసాగనందున అమ్మవారి విగ్రహమును శంకరుని విగ్రహముగా మార్పుజేసెను. ఫాలమున నున్న సూర్యగోళమును అగ్నితోకూడిన మూడవ నేత్రముగా మార్చి, విభూతి రేఖలు చెక్కించెను, విగ్రహమును సర్పాలంకృతముగా జేసెను. అమ్మవారి శిరోజములపై నున్న నెలవంకాభరణము శివుని శిరస్సున చంద్రవంకగా మార్చబడినది. అమ్మవారిని స్వామివారిగా మార్పుచేసి ఈశ్వర నామధేయముతో పిలుచుటేర్పాటు చేసెను. దీని మూలకముగా జంతుబలులు చాలవరకు తగ్గిపోయినవి. భక్తులరాక తగ్గకుండా నుండుటకు బీజాక్షరములతో కూడిన ఆకర్షణ శక్తిగల శ్రీచక్రమును ప్రతిష్ఠించిరి. అమ్మవారి విగ్రహమును అయ్యవారి విగ్రహముగా మార్చినను బ్రహ్మపదార్థముతో కూడుకొనియున్న విగ్రహము యొక్క ఆకర్షణ శక్తి తగ్గలేదు.

మరి కొంతకాలము గడచినది. శ్రీరామానుజా చార్యుల వారు ఆప్రాంతమునకు విచ్చేసి ఆదిశక్తి విగ్రహము శంకరుని విగ్రహముగా మార్పునొందుట వినిరి కొంతకాలమచట

బసచేసి సమావేశములు జరిపి, బోధనలు చేసి, కొంతమంది భక్తులను ఒప్పించి శైవ విగ్రహామును వైష్ణవ విగ్రహాముగా మార్పులు చేయించెను. మూడవ నేత్రమును తొలగించి, అడ్డబొట్టును కనిపించకుండా చేసి నిలువుబొట్టును పెట్ట ప్రయత్నించగా ఫాలభాగము నామమునకు సరిపోకపోయెను. అందుచేతను కండ్లమీద నుండి నామమును దిద్దవలసి వచ్చినది. ఎత్తైన వక్షోభాగమును తీసివేసి శ్రీదేవి, భూదేవి విగ్రహాములను చెక్కించెను. స్వామివారు చతుర్భుజుడు కాకపోయిననూ భుజములపై శంఖచక్రములను నిలువబెట్టెను. తరువాత శ్రీవేంకటేశ్వరునిగా నామకరణముచేసి శ్రీ వేంకటాచల మహత్యమను గాధను శ్రీపశిండి వెంకట తురియవార్ అను జియ్యరు రామానుజయ్యంగారుచే 1491లో వ్రాయించబడినది. తరువాత సుప్రభాతము రచింపబడినది. ఈ స్వామివారికి అండగా నుండుటకు గాను దిగువ తిరుపతిలో శ్రీగోవిందరాజ స్వామివారి ఆలయమును కట్టించిరి. శ్రీవేంకటేశ్వరునికి శ్రీనివాసనామధేయమునిచ్చి కళ్యాణ మహోత్సవము జరిపించెను. స్వామి వారి పేరుతో ఈశ్వర నామముంచినను, కినుక వహించిన శైవులు తిరుత్తణిలో శ్రీ సుబ్రహ్మణ్యస్వామి వారిని ప్రతిష్ఠించి శివాలయమును రూపొందించిరి. రానురాను శ్రీవేంకటేశ్వరుని ఆలయము, విగ్రహములోని ఆకర్షణ మూలకముగా భక్తులకు కలియుగ వైకుంఠముగా వెలసినది. నిత్యకళ్యాణము, పచ్చతోరణముతో, అనేక మ్రొక్కుబడులతో, విపరీత ధనాకర్షణ కలిగినది. దేశములోని జనాన్నే గాక విదేశములోని జనాన్ని కూడా ఆకర్షించుచున్నది.

1. శ్రీవిగ్రహములో తీసుకుని రాబడిన మార్పులు తేలికగా కనిపించని విధముగా వుండుటకు శ్రీ విగ్రహామునకు విశేషాలంకరణ జరుగుచున్నది. కనుకనే ఇంతటి విశేషాలంకరణ ఏదేవతా మూర్తికీ కనిపించదు.
2. తిరుమల క్షేత్రములో నున్న శ్రీవేంకటేశ్వర విగ్రహములోని శాక్తికేయము, శైవము, వైష్ణవము లకు ప్రతిబింబముగా పూరీక్షేత్రములోని జగన్నాధాలయములో వెలసిన విగ్రహములను శాక్తికేయ, శైవ, వైష్ణవ అంశలుగా కొలుచుచున్నారు. సుభద్ర, బలభద్ర, జగన్నాధ విగ్రహములు వీటికి ప్రతిబింబములు. పూరీ జగన్నాధ దేవాలయములోని మూడు శక్తుల ప్రతీకయే తిరుమలలో వేంచేసియున్న శ్రీ వేంకటేశ్వరుడు. అందుచేతనే శ్రీ ఆది శంకరాచార్యుల వారు ఈ రెండు క్షేత్రములలో బీజాక్షర యుత చక్రములను ప్రతిష్ఠించినారు.
3. విగ్రహములో మార్పులు వచ్చినను పూజలలో, నైవేద్యములలో పాత పద్ధతులను కొన్ని పాటిస్తున్నారు.
4. స్వామివారి విగ్రహం అసలు రంగు ఎరుపు. అగ్ని సంబంధమైన (తిరుమలకొండకా

ఈ రాయి దొరకుచున్నది). చిత్తూరు జిల్లాలో, రేణిగుంటకు 11కి.మీ. దూరంలో గుడిమల్లం అనే గ్రామములో శ్రీపరశురామేశ్వర లింగమున్నది ఈ లింగము ఇటువంటి రాతితోనే చేయబడినది అదేశిలా జాతికి చెందిన రాతితో శ్రీవేంకటేశ్వరుని విగ్రహం చేయబడినది. పునుగుపూయుటచే నల్లగా మారి మెరుపు దనము కల్గినది ఎర్రటి అమ్మవారి విగ్రహము యొక్క గడ్డముపైనున్న పచ్చబొట్టు గుర్తుపై, స్వామివారి విగ్రహంగా మార్చిన తరువాత తెల్లని పచ్చకర్పూరపు బొట్టు పెట్టుచున్నారు

5. స్వామివారి కిరీటము నెన్నడూ తీసి పరులకు చూపరు. నిజశిరోజ దర్శనము కాకుండ.

6. వేంకటాద్రి ఎత్తైన పర్వత ప్రాంతమైనందున, జంతువుల కాలవాలమై నందున ఎక్కువ జనసంచారము లేక చాల వివరములు బయట వార్కి తేలికగా తెలియక చాల కాలము మరుగున వుండిపోయినవి. ఆలయము వెలియుటకు ముందు ఎక్కువగా వాసయోగ్యముగా నుండెడిదికాదు.

7 స్వామివారి విగ్రహం శిల్ప, శాస్త్ర, వాస్తు శాస్త్ర, ఆగమశాస్త్రాలకు అతీతముగా నుంటుంది. ఏశాస్త్రముతోను సమన్వయ పడదు. కారణం : దఫదఫాల మార్పులు, అసలు రూపాన్కి శాస్త్రాలు, శాసనాలు ఆధారముగా లేవు. చరిత్రలో ఆధారములు లేవు

ఏరూపములో నున్ననూ, ఏ పేరుతో నున్ననూ భగవంతుడొక్కడే అను సిద్ధాంతమును శ్రీవేంకటేశ్వరుడు నిరూపించుచున్నాడు. శ్రీవేంకటేశ్వరునితోబాటు స్వామివారిని "వేంకటేశ పెరుమాళ్" అనియు "తిరువేంగడత్తాన్" అనియు పిలుచుటకు, శ్రీరామానుజాచార్యుల వారు ఏర్పాటు చేసిరి.

కలియుగ దేవునిగా స్వామివారిని పిలుచుటకు స్వామివారి కళ్యాణము కలియుగ లక్షణములు కలిగియున్నది:

1. LOVE MARRIAGE పద్మావతి, శ్రీనివాసుడు తోటలో కలయిక. LOVE AT FIRST SIGHT
2. Status సమస్య : పెండ్లి కుమార్తె రాచకన్య. ఆకాశరాజు దంపతులకుమార్తె. పెండ్లి కుమారుడు వకుళాదేవి ఆశ్రమవాసి. ఆస్తిలేదు. వరుని తల్లిదేవకి. తండ్రి వసుదేవుడు. చంద్రవంశము.గోత్రము విశిష్టగోత్రము. నక్షత్రము శ్రవణము. నివాసము వేంకటాద్రి.
3. ప్రయత్నాలు (TRIALS) 1) నారద మహర్షిచే పెండ్లి కుమార్తె తల్లిదండ్రులకు జ్యోతిష్యము చెప్పించుట. 2) తోటలో శ్రీనివాసుడు కనిపించి పద్మావతిని ఆకర్షించుట. 3) ఎరుకలసానిచే సోదిచెప్పించుట. 4) రాజ దంపతుల కలలో శ్రీనివాసుడు

కనిపించి వివాహాన్ని సమర్థించుట 5) వకుళాదేవితో ఆధ్యాత్మికముగా కూడ ప్రయత్నము చేయించుట. 6) పెండ్లికుమారునికి ధనము లేకున్ననూ, ధనవంతుడైన కుబేరునితో సఖ్యము చేయుట.

4. ఉద్దండులైన ఇద్దరు పురోహితులతో (అమ్మాయి తరపునుండి, అబ్బాయి తరపునుండి) బృహస్పతీ, శుకమహర్షులచే వివాహముహూర్తము నిర్ణయించుట. వైశాఖ శుద్దదశమీ శుక్రవారం రాత్రి.

5. పెండ్లికి ఎంతటివారికైనా డబ్బు యిబ్బంది తప్పదు. అప్పు చేయవలసినదే.

6. విడిది యింటినుండి పెండ్లి కుమారుని వాహనముపై (గరుడ వాహనం) కళ్యాణ వేదిక వద్దకు ఊరేగిస్తూ తీసుకుని రావడం

7. ఇద్దరు పురోహితులచే వివాహ నిర్వహణ . పెండ్లి కుమార్తె వైపు బృహస్పతులవారు, పెండ్లి కుమారుని వైపు వశిష్టుల వారు.

8. కట్నం : స్త్రీ ధనముగా విశ్వకర్మచే తొండమానుడు దేవాలయం కట్టించి యిచ్చుట.

9. కుబేరుని వద్ద చేసిన అప్పునకు నోటిమాట మీద నమ్మకం సన్నగిల్లినందున శ్రీనివాసుని స్వహస్త దస్తూరిచే ప్రోనోటు వ్రాయబడి బ్రహ్మ, మహేశ్వరులు సాక్షి సంతకములు చేయుట.

10. ద్వితీయ వివాహం : మొదటి భార్య అంగీకారముతో రెండవ వివాహము చేసుకొనవచ్చుననుటకు నిదర్శనముగా సూర్యభగవానునిచే కొల్హాపూర్ నుండి మొదటిభార్య అయిన లక్ష్మీదేవిని పిలిపించుట.

11. ఉద్దండులైన మహర్షులతో శుభముహూర్తం పెట్టించినా, మహామహులైన పురోహితులతో వివాహము జరిపించినా, దేవతలందరూ ఆశీర్వదించినా, పెద్దలందరి సమక్షములో వివాహము జరిగినా కాపురం అసంతృప్తి భార్య అలిగి వేరేచోట నివాసం. రోజా బ్రతిమాలి, ప్రాధేయపడడం కలియుగ లక్షణం.

ఇన్ని లక్షణముతో జరిగిన కలియుగ దైవము యొక్క వివాహము ననుసరించి నేడు జరుగు వివాహములలో నాటి పోకడలు కనిపించుచున్నవి.

కృతయుగమున శ్రీనారసింహ స్వామి, త్రేతాయుగమున శ్రీరామచంద్రుడు, ద్వాపరయుగమున శ్రీకృష్ణుడు, కలియుగమున శ్రీవేంకటేశ్వరుడు ప్రత్యక్షదైవాలని పురాణములు ఘోషిస్తున్నవి, "వేం" అనగా సర్వపాపములను "కట" అంటే దహించు కొండకు నాధుడని అర్థము. స్వామివారు బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులను (త్రిమూర్తులను) ఆదిశక్తితో సహా ఐక్యత చేసుకొన్న గొప్ప సమ్మేళనము, స్వామియే ప్రకృతి, స్వామియే పురుషుడు. మదిలో తలంచినంత మాత్రమున భక్తులను స్వామివారు కాపాడు కల్పవృక్షము. మహ్మదీయులు

కూడా స్వామివారిని తమ మతమునకు చెందిన "జమన్‌జెట్టి"గా భావింతురు. మహమ్మదీయసేనాని తోడర్‌మల్లు, తల్లి మాతా మోహనాబీ, భార్య పీతా బీబీ స్వామివార్ని సేవించినట్లు వారి విగ్రహములు గలవు.

స్వామివారు వెలసిన పర్వతసముధాయము ఆదిశేషుని రూపములో నుండుటవలన శేషాచలమనియు, వేదములతో నిండి వున్నందున వేదాచలమనియు, గరుత్మంతునిచే భూలోకమునకు తేబడినందున గరుడాచలమనియు పేర్లు గలవు. శ్రీ వేంకటేశ్వర విగ్రహ చరిత్ర ఈనాటిదైనా పర్వతము మాత్రము కృతయుగం నుండి పుణ్యస్థలముగా భావించబడి, మహానుభావులకు, మహర్షులకు తపస్సున కాలవాలమైనది. కృతయుగమున వృషభుడను రాక్షసుడు తపస్సు ఆచరించినందున వృషభాద్రి అని పేరు. త్రేతాయుగమున అంజనాదేవి తపస్సు చేసినందున అంజనాద్రి అనిపేరు. ద్వాపర యుగమున ఆదిశేషుడు నివసించినందున శేషాచలమని పేరు. కలియుగమున పాపములను పోగొట్టుటచే వేంకటాచలమని పేరువచ్చినది. అందుచేతనే ఈ క్షేత్రము దివ్యక్షేత్రమైనది. పర్వత పంక్తికి శేషపంక్తి అనిపేరు. శేషుని తోక (పుచ్ఛభాగము) వెనుక వైపున శ్రీశైలము, వీపు అహోబిలము, ముఖము తిరుమల అని పురాణ ప్రశస్తి కలదు.

స్వామివారిపై ఎంతోమంది మహానుభావులు ఎన్నోరకములైన గ్రంధములను రచించి, తరించినారు. మహానుభావులైన ఆచార్యద్వయం కాలానుగుణంగా చేసిన మార్పుల మూలకముగా శ్రీ విగ్రహము యొక్క మహత్తు, ఆకర్షణశక్తి పెరిగినదే గాని తరుగలేదు. అది వారి ఔన్నత్య ప్రభావము.

నిత్యకళ్యాణం పచ్చతోరణంగాగల కలియుగ వైకుంఠవాసుని దర్శనం బహుపుణ్యప్రదము-సర్వపాపహరము.

ఇంతటి మహోత్తర మార్పులను సాహిత్యపరంగా సేకరించి "మూడు మూర్తుల తిరుమలేశా" అని మూడు ముక్కలలో ఆలాపించిన ఘంటసాలవారు ధన్యులు.

## శబరిమల - అయ్యప్పస్వామి

నైమిశారణ్యములో శూతమహర్షి శిష్యులకు వినిపించే భూతనాధోపాఖ్యానములో అయ్యప్పస్వామి గాధ కలదు. హరిహర పుత్రుడుగా అవతరించిన స్వామి. కేరళలో శబరి మలపై పంపానదీ సమీపాన వెలసిరి. భూతనాధుడుగా ప్రసిద్ధి. కారణజన్ముడుగా కానిపిస్తున్నది. మహిషి అనే రాక్షసి సంహారమునకు మోహిని వేషధారియైన విష్ణుమ్మూర్తికి శివుని ద్వారావుదయించిన కుమారుడు. మణికంఠ, హరిహరపుత్ర, భూతనాధ, ధర్మశాస్త్ర, ధర్మస్రష్ట తారకప్రభు, పరాయగుప్త, ఆర్యదాతా, అయ్యానారప, అయ్యాప్ప, గుర్రప్ప, గురునాధ,

ముక్తేశ్వరనాధ, అష్టాదశ సోపాననాధ కలియుగవరద, మునీశ్వర, మన్నారు స్వామి మొదలగు నామధేయములు గలస్వామి వారు. ఇరువురు పురుషమూర్తుల కుద్భవించుట స్వామివారి ప్రత్యేకత.

రాజశేఖర పాండ్యరాజుకు అరణ్యములో లభించిన బాలుడు. బిడ్డలు లేని రాజదంపతులు వరప్రసాదిగా భావించి బాలుని పెంచిరి. కంఠమున మణివుండుటచే మణికంఠుడని పిలువసాగిరి. అమిత తేజోవంతుడైన మణికంఠుని పసితనము పరమానందాన్ని సమకూర్చినది. కొంతగాలము గడచు సరికి రాణి గర్భవతియై ఒక బాలుని ప్రసవించినది. పిల్లలిద్దరూ దిన దిన ప్రవర్ధమానులై ఆనందాశ్చర్యముల కలిగిస్తూ కన్నుల పండువుగా పెరుగుచుండిరి. మణి కంఠునికి 12 సంవత్సరములు వయస్సు వచ్చినది. తన స్వంత కుమారునికి గాక అడవిలో దొరికిన మణికంఠునకు రాజ్యప్రాప్తి కలుగునని రాణికి భయముపట్టుకున్నది. కొద్ది మంది సలహాపై మణికంఠుని వదిలించుకొనుటకు ఆలోచనలు ప్రారంభించినది. తనకు తలనొప్పియని, పులిపాలు కావాలని కోరినది. బాలమణికంఠుడు పులిపాలు తెచ్చుట కుద్యుక్తుడై ఎరుమిలి నుండి బాణాలతో బయలు దేరెను. బాలుడు పులిబారి పడునని రాణి తలచినది. తానొకటి తలచిన దైవమొకటి తలచువిధమున, మణికంఠుడు మరణించలేదు. మహిషరూపరాక్షసిని సంహరించి, బాధితులకానందము కలిగించి జన్మకారణమునకు సాఫల్యత కలిగించెను. పులివాహనధారియై అంతఃపురప్రవేశము చేసి రాణి రోగము కుదిర్చెను. తమ్మునకు రాజ్యమును విడిచిపెట్టి, శబరిమలకేతెంచి 12 సంవత్సరముల బాలునిగనే వీరపద్మాసన భంగిమలో కూర్చుని కుడిచేతిని చిన్ముద్రగా భక్తులకు దర్శనమొసంగునట్లు వెలసిరి. వెలసిన స్థలమునకు “సన్నిధానం” అని పేరు.

స్వామివారి దర్శనాన్కి కొన్ని నియమములు గలవు. రజస్వల కాకముందు, బహిష్టులు ఆగిన తరువాత మాత్రమే స్త్రీలకు స్వామివారి దర్శనము. పురుషులకు, పిల్లలకు నిషేధము లేవియులేవు. స్వామిదర్శనాన్కి వచ్చుభక్తుల కోరికలు తీరాలన్న గురుస్వామి వద్ద మాలధారణ పొంది, దీక్షగైకొని, యిరుముడి ధరించి, 41రోజులు నియమాలు పాటించాలి. పాటించవలసిన నియమనిష్టలు : 1. ధరించుబట్టలు నలుపురంగుగాని లేక ఎరుపురంగుగాని ముదురురంగువై వుండవలయును. 2. చన్నీటి స్నానం 3. పాదరక్షలు వాడరాదు. 4. ఒంటిపూట భోజనం. 5. వ్యసన విసర్జన. 6. విలాసాలకు దూరం. 7. భూతల శయనం. 8. క్షురకర్మ పనికిరాదు. 9. రుద్రాక్షధారణ. 10. తులసిమాల (108 పూసలు గలది), చందన మాలధారణ. 11. కామాన్కి, కోరికలకు దూరం. 12. సత్యవాక్పాలన. 13. కోపతాపాలకు దూరం (సాత్వికజీవనం). 14. శాఖాహారం. 15. నిరంతర భక్తి భావం. 16. స్వామియే శరణం అయ్యప్ప. స్వామిశరణం,

అయ్యప్ప శరణం - అన్ననాదం. ఇరుముడిలో రెండు గుడ్డమూట లుండును మొదటి దానిలో దైవసామాగ్రి వుండును. నేయి, టెంకాయ, విభూతి, చందనం, కర్పూరం, అగరవత్తులు వగైరా. రెండవ మూటలో యాత్రలో పనికివచ్చు ఆహార సామాగ్రి వుండును

స్వామివారి దర్శనాన్కి చాలసార్లు భక్తులువెళ్ళుదురు మొట్టమొదటిసారి వెళ్ళుభక్తులను కన్నెస్వామి యని, రెండవసారి వెళ్ళు వారిని కత్తిస్వామియని, మూడవసారి వెళ్ళువారిని గంటస్వామియని, నాల్గవసారి వెళ్ళువారిని గదస్వామియని, ఐదవసారి వెళ్ళువారిని గురుస్వామి అని పిలుతురు. దర్శనాన్కి వెళ్ళు భక్తులందరిని స్వాములని పిలుస్తారు. పురుషస్వాములను "అయ్యప్ప"లని, మాలధారణ చేయుస్త్రీ భక్తులను "మల్లిప్పురం" అని "మంజాత" అని పిలుస్తారు. బాలస్వాములను "మణికంఠ" అని, పాపలను "కొచ్చిస్వామి" అని పిలుస్తారు. స్వాములు కొండకు వెళ్ళి తిరిగి వచ్చువరకు యింటి వద్దనున్నవారు స్వామివార్కి నిత్యపూజ జరుపుతూండాలి. యాత్రకు బయలు దేరుముందు, తిరిగి వచ్చిన తరువాత కొబ్బరి కాయలు కొట్టాలి.

కొట్టాయంనుండి గాని, ఎరుమిలినుండిగాని స్వామివారి దర్శనాన్కి వెళ్ళవచ్చును. పంపానది తీరాన్కి జేరి, నీలిమల పర్వతం ఎక్కి (శబరిమల) సన్నిధానం చేరాలి. 7కి.మీ. పర్వతంపై కాలినడక. పంపానదీ తీరానవున్న చాళక్యంవరకు వాహనముల పై రావచ్చును. తరువాత నడక తప్పదు. దిగునప్పుడు దగ్గర త్రోవగలదు. 5కి.మీ. నీలిమల పర్వతముపై భక్తులకు తినుభండారములు, సేద దీరుటకు నెలవులు గలవు. ఆలయము జేరిన తరువాత పవిత్రమైన 18 మెట్లు ఎక్కాలి. ఎక్కేముందు, దిగేముందు కొబ్బరికాయలు కొట్టాలి. మెట్ల కిరువైపుల కొచ్చి కడితస్వామి, వలియ కడితస్వామి విగ్రహములు కలవు. ఇరుముడిలోని పూజా సామాగ్రిని అగ్నికి ఆహుతి చేయాలి. హోమగుండములో నెయ్యిని, కొబ్బరికాయలను వేయాలి. నెయ్యి ఆత్మకు, కొబ్బరికాయ శరీరాన్కి ప్రతిరూపాలు. ఆత్మభగవత్ సాన్నిధ్యాన్ని చేరితే, శరీరం అగ్నికి ఆహుతి అవుతుందని అర్థం. ఎక్కవలసిన 18 మెట్లు అధిగమించవలసిన అవరోధాలుగా భావించబడుతాయి. అవరోధాలు చాలరకాలు. వీటిలోకొన్ని. 1. కామ 2. క్రోధ 3. లోభ 4. మోహ 5. మదము 6. మాత్సర్యము 7. దారిద్ర్యము 8. హింస 9. మోసము 10.ఋణము 11. హాని 12. యాచన 13. విషాదము 14. వ్యాధి 15. అశాంతి 16. అసత్యము 17. శతృత్వము 18. చిత్తచాంచల్యము మొదలగునవి.

స్వామివార్కి ప్రముఖమైన పూజలు 4 కలవు. 1. నవంబరు మాసములో పడిపూజ (మెట్లపూజ) 2. డిశంబరు మాసములో మండలపూజ 3. జనవరి మాసములో మకరపూజ (మకర విళక్కు) జ్యోతిదర్శనం 4. ఏప్రిల్ మాసములో "విషు" పూజ. ఈపూజకు 60రోజులు

దీక్ష వహించి నియమాలు తప్పని సరిగా పాటించాలి. జ్యోతిని "పొన్నంబలమేడు" అనుకొండపై వెలిగిస్తారు. ఇదిచాల ఎత్తైన కొండ. చివరన గల చతురస్రాకారపు స్థలములో ఈశాన్యమూలలో జ్యోతిని మకర సంక్రాంతికి వెలిగిస్తారు. మకరజ్యోతి దర్శనం మహాపాప నాశనం జ్యోతి దర్శనం తరువాత మకర జ్యోతి వుత్సవం, వూరేగింపు వుంటుంది. మకర జ్యోతి వుత్సవం 7 రోజులు జరుగుతుంది మకర సంక్రాంతినాడు స్వామివార్కి వూరేగింపుతో నగలు వస్తాయి. బాణాసంచా, వాద్యగోష్టులతో బ్రహ్మాండమైన వూరేగింపు. మకర సంక్రాంతి ముందు రోజున పంపానదిలో దీపోత్సవము జరుగుతుంది. బహు ఆనందకర నయనానంద దృశ్యము. సంక్రాంతి సమయములో పంపానదిలో పిండప్రదానము చేస్తారు నదిలో దీపాలను విడిచి పెడ్తారు. స్వామి వారి దర్శనము 18 సార్లు నిండినట్లయిన నీలిమల కొండపై కొబ్బరి మొక్కను నాటుతారు.

కండ్లు లేనివార్కి కండ్లు, మూగవారికి మాటలు, దీర్ఘవ్యాధులనుండి వుపశమనం మొదలగు మేళ్ళుస్వామివారి పూజలవలన లభిస్తాయి. సన్నిదానం వెనుక భస్మకొళం అను కొలనుగలదు. ఇందలి స్నానము సర్వరోగ నివారణము.

మహిషము మరణానంతరము శాపవిముక్తురాలై లక్ష్మి, సరస్వతి, పార్వతి అంశలతో గాలవ మహర్షి కుమార్తె "లీల" గా పుట్టినది. స్వామివార్ని వివాహమాడు మని ప్రార్థింప, తాను బ్రహ్మచారి గాన అవకాశము లేదనియు, తన కెడమభాగమున "పంచాంబిక" లేక "మల్లిక రత్తమ" అనిపేర వెలసివుండవలసిన దని ఆనతిచ్చెను. ఏ సంవత్సరములో తన దర్శనాన్కి కన్నె స్వాములు రారో, ఆసంవత్సరము వివాహము జరుగుతుందని హామీ యిచ్చెను. కేరళలోని ఆలయములలో వినాయకునివలె అయ్యప్పస్వామి దర్శనం కలుగుతుంది. కంచి కామాక్షి ఆలయములోనే గాక, తమిళనాడులోని పల్లెలలో అయ్యప్ప అయ్యనారుగా దర్శనమిస్తారు.

అయ్యప్పస్వామివారు పూర్వజన్మమున "అయ్యనారప" అని పిలువబడు చుండెడివారు. వారికి పూర్ణ, పుష్కళా అని యిరువురు భార్యలు, సత్యకన్ అను కుమారుడు కలరు. కాంచీపురములోని కామాక్షి ఆలయములో స్వామివారు యిరువురి భార్యలతో వెలసివున్నారు. అనుగ్రహము అను అపార సంపదను ముంగిట కుప్పగా పోసుకొని భక్తుల కొసంగుటకు శబరిగిరిపై అయ్యప్పస్వామి వేచివున్నారు. దర్శించి ప్రార్థించినవారు స్వామివారి కరుణా కటాక్ష వీక్షణములకు పాత్రులగుదురు. ఫలితముగా శాంతి సౌఖ్యములు, ఆనంద ఆరోగ్యములు, సిరి సంపదలు కలుగును. కాని, భక్తుడు భక్తి, శ్రద్ధ, ఆచారము, అనుష్టానము, దీక్ష మొదలగునివి పెట్టుబడి పెట్టాలి. తప్పని సరి. మరువరాదు.

కేరళలో అయ్యప్పస్వామివార్కి పశ్చిమ కనుమలలో గల 5 ప్రముఖాలయములు .

1. కులుత్తుపుజ : బాలకుడిగా కన్పించు ఆలయం
2. ఆర్యన్‌కావు : బ్రహ్మచారిగా
3. అచన్‌కోవిల్ : గృహస్థుడిగా (ఇరువురిభార్యలతో)
4. శబరిమల · వానప్రస్థ
5. పొన్నాంబలమేడు లేక

కంటమల లేక కంఠమాల : యోగి, ఇక్కడ నుండే మకర సంక్రాంతి నాడు జ్యోతి దర్శనం. జ్యోతి యిచ్చట వుద్భవిస్తుంది.

స్వామిశరణం, అయ్యప్పశరణం. స్వామియేశరణం.

**షిరిడి - సాయిబాబా**

మహారాష్ట్రములో, అహమ్మద్‌నగర్ జిల్లాలో, కోపర్‌గాం తాలూకాలోని చిన్న పల్లె "షిరిడి". మన్మాడు నుండి 60 కి.మీ. బస్సుద్వారా షిరిడిగ్రామం. 16 సంవత్సరముల కుర్రవాడు ఒక వే పచెట్టు క్రిందకు చేరాడు. ఎక్కడనుండి వచ్చాడో తెలియదు. ఎవ్వరివాడో తెలియదు - ఏకులమువాడో అంతకంటె తెలియదు. తల్లి తండ్రులుగాని, జన్మస్థలముగాని తెలియదు. ఎప్పుడూ మసీదువద్దనే వుండి ప్రార్థనలు చేసేవాడు. శ్రీరామ నవమినాడు, పూజలు చేసేవాడు. మహమ్మదీయుల చందనోత్సవము జరిపేవాడు. హిందువులు మహమ్మదీయుడని, మహమ్మదీయులు హిందువని భావించేవారు. "సబకా మాలిక్ ఏక్" అని పలుకుతూండేవాడు. ఈయన బ్రాహ్మణుల పుత్రుడని, కుంభమేళాలో చిన్నప్పుడే తప్పిపోయి మహమ్మదీయులకు దొరికి పెరిగి నారని తలచేవారు కొంత మంది. మహమ్మదీయుల పుత్రుడేనని, మతభేదము లేని మహానుభావుడని మరికొంతమంది వూహించేవారు. కాని ఆయన ఏనాడూ తానెవరో, ఎక్కడ నుంచి వచ్చాడో చెప్పలేదు. ఆ వివరములు అనవసరమని భావించేవాడు. ఉల్లిని, మల్లిని ఒకే విధంగా భావించేయోగిగా రాముని, రహీముని ఒక్కడుగా భావించే జ్ఞానిగా మాత్రమే కన్పించేవాడు. హిందూ ముస్లిముల మత వైషమ్యాల కార్చిచ్చును నిర్మూలించు మహానుభావుడాయన.

భిక్షాటన చేసి, లభించిన ఆహార పదార్థాల నన్నిటిని ఒక డబ్బాలో వుంచి, కలిపి తనచుట్టూవున్న వార్కి పెడుతూ (కుక్కలు మొదలైన జంతు జాలములకు కూడా) తాన తినేవాడు. ఇది యీయన దినచర్య. చిరిగిన చొక్కా, చీనారేకుల డబ్బా, కూర్చుందుకొ బండరాయి, నిద్రించునపుడు తలక్రిందుకో ఇటుకరాయి - ఇవి యీయన ఆస్తి. పొడుగాః

అంగరఖా, లోపల లంగోటి, తలకొక గుడ్డ, కూర్చునుటకు చిన్న కాషాయగుడ్డ, పడుకునేందుకు చిన్నగుడ్డముక్క, - ఇవి యీయన నిత్యావసర వస్తువులు. పేదరికం రాజుకన్నా, దైవంకన్నా గొప్పది. కుబేరునికన్న కుచేలుడంటేనే భగవంతునికి అమితప్రేమ అనేవారు. తలక్రింద యిటుక రాయిని పెట్టుకొని నిద్రించేవారు కూర్చున్నప్పుడు ప్రక్కనే వుంచుకొని, యిటుక రాయిని "గురుప్రసాదం" అని చెప్పేవారు. అశ్వాలను ఆదరించేవారు. "శ్యామసుందర్" అనే గుర్రం ఆయనకు ఇష్టం.

సర్వప్రాణులను సమదృష్టితో చూచేవారు. బీదలను, కష్టాలలో నున్నవారిని ఆదరించి, కరుణించి వారి కష్టాలు తీర్చేవారు. గ్రామం కలరాతో మారుమ్రోగిపోతే, తన చేతనున్న గోధుమపిండిని గ్రామం చుట్టూ చల్లి కలరాను నివారించారు. గుడ్డివాండ్లకు కండ్లను, మూగవారికి మాటలను ప్రసాదించారు. వుప్పునీటి బావిని ప్రజాశ్రేయస్సుదృష్ట్యా మంచినీటిగా మార్చారు. సంతాన హీనులకు సంతానప్రాప్తి, రోగులకు ఆరోగ్యప్రాప్తి కలిగించినమహానుభావుడు. ఒకసారి వ్యాపారస్తులు కట్టడి గట్టి దీపారాధనకు నూనె యివ్వకపోతే, నీళ్ళతోనే దీపాలు వెలిగించిన ఘనుడాయన. భగవద్గీతలో శ్రీకృష్ణుడు చెప్పినట్లు సాధువులు, సత్పురుషులు భగవంతునికి ప్రతినిధులనేవారు.

ఆయన బోధించిన నవభక్తి మార్గాలు · 1. శ్రవణ భక్తి 2. కీర్తన భక్తి 3. స్మరణ భక్తి. 4. సేవాభక్తి 5. అర్చన భక్తి 6. పాదసేవాభక్తి 7. ఆత్మ నివేదనాభక్తి 8. అనురాగ భక్తి 9. ఆదరణ భక్తి. ప్రజలందరూ ఆయనను "బాబా" అని "సాయిబాబా" అని పిలిచేవారు. బాబాకు యోగాభ్యాసములు తెలియును. ధౌతి అని పిలువబడే ప్రేగులను శుభ్రపరచు విధానము పాటించేవారు. ఖండయోగము కూడా తెలియును. రాత్రులందు తనశరీరభాగాలన్నింటిని వేరు చేసి నిద్రించేవారు. చూచువారు బాబాను హత్య చేసి ఆయన శరీర భాగాలను వెదజల్లారని పిస్తుంది. భక్తులకోరికలను ముందుగనే పసిగట్టి వాటిని తీర్చేవారు భక్తులందరికి సర్వాంతర్యామిగా గోచరించేవారు సాయి సంపర్కమే పీడితజన పాపహరం. భక్తులను బహిర్ముఖముగా తిట్టి, కొట్టేవారు. అంతర్ముఖముగా ప్రేమతో లాలించేవారు. ఎప్పుడు ఆగ్రహిస్తారో, ఎప్పుడు అనుగ్రహిస్తారో తెలియదు. ఆశా, మోహాదులకతీతుడాయన. ఆంజనేయుని వంటి అస్ఖలిత బ్రహ్మచారి. పంచభూతాల్ని శాసించే వారాయన. వీటిపై ఆధిపత్యాన్ని ప్రదర్శించిన అవతారమూర్తి. సాయిలీలావిశేషాలు కోకొల్లలు.

1918 అక్టోబరు 15 మంగళవారం విజయదశమి నాడు (దసరా) మధ్యాహ్నం 2.30గంటలకు సాయి నిష్క్రమించారు. అప్పటికి ఆయన వయస్సు 60 సంవత్సరాలు

మరణానంతరం 36 గంటలవరకు హిందువులకు, ముస్లిములకు తర్జన, భర్జన జరిగింది దహనంచేయడమా, ఖననంచేయడమా అని చివరకు "వాడా" లో ఖననంచేసి మసీదు నిర్మించారు. బాబా పాదాలను పాదుకాస్థలిలో ప్రతిష్ఠించారు. శ్రీవేంకటేశ్వరుని తరువాయి "పిలిస్తే పలికే దైవం"గా సాయి పేరు పొందారు. సాయిలీలలు, చేష్టలు, సాయిని సర్వాంతర్యామిగా, సర్వహృదయాంతర్యామిగా ప్రజలహృదయాలలో భావింపజేశాయి. పవిత్ర గోదావరిలో స్నానంచేసి, సాయిని సమాధిలోనున్న మందిరంలో దర్శించి, సచ్చరిత్ర పారాయణచేస్తే భవబంధముల నుండి విముక్తి కలుగుతుందని భావిస్తారు.

షిరిడి ప్రవేశించి శ్రీసాయిని దర్శించిన సర్వదుఃఖపరిహారము. ద్వారకామాయి ప్రవేశం దురదృష్టాలను పారదోలుతుంది. బాబా వారు వున్ననూ లేకపోయినను భక్తుల కష్టాలను గమనించి స్వస్థత కూర్చును. సాయిసమాధి భక్తులకు శ్రీరామరక్ష. సమాధి నుండే సదారక్షణ భారం వహించును. సాయినాశ్రయించి, శరణుజొచ్చిన వార్కి సర్వదా రక్షణ వుంటుంది. భక్తుల కోరికలీడేర్చుటే సాయి విధి.

గురువారం, శుక్రవారాలు పూజలు ఎక్కువగా చేస్తారు. గురువారం ముఖ్యమైన రోజుగా భావిస్తారు. హారతి కార్యక్రమము మధ్యాహ్నం 12 గంటలకు. దీనిని "కాకటహారతి" అని పిలుస్తారు. మరల సాయంకాలము 5 గంటలకు, రాత్రి 9 గంటలకు హారతియిస్తారు. షిరిడిలో దర్శనీయ స్థలాలు : 1. ఖండోబా ఆలయం (గ్రామదేవత). 2. ఆంజనేయ స్వామివారి ఆలయం. 3. వేపచెట్టు క్రింద పాదుకలు. 4. సమాధి మందిరం. 5. చావిడి. 6. శనీశ్వరుని మదిరం. 7. నరసింహ స్వామివారి దేవాలయం. పండరీపురం, పురీజగన్నాథం, ద్వారక, కాశీ, రామేశ్వరములు, బదరీ, కేదారనాథ్, వుజ్జయిని, గోకర్ణం వంటి మహాపుణ్యక్షేత్రాల కోవకు షిరిడి చెంది యున్నది. సాయి అవతారపురుషుడని, అనుగ్రహమూర్తి అని భావన అలముకొనివున్నది. "సాయి" అంటే మరాఠీ భాషలో "స్వామి" అని అర్థం.

సాయిని ఆదిశంకరాచార్యులుగ, దత్తాత్రేయస్వరూపుడుగా భావిస్తారు. కలియుగ దత్తాత్రేయుడు సాయిబాబ. ఆంజనేయుని సోదరునిగా భావించడముకూడ కలదు. సాయిబాబాను "సద్గురువు" అంటారు. సాయి నామమే స్మరణం, సాయిరూపమే ధ్యానం, సాయినాధుడే శరణం. షిరిడి సాయిబాబాయే సర్వం. ఆయన సర్వ సిద్ధిసంపన్నులు. ఆయన లీలలు అద్భుతం. మానవుడు పాపకర్మములు చేయుట మాని వేసిన నాటి నుండి సాయిదృష్టి కలిగి మహోన్నత స్థితి చెందగలడు యోగము, ధ్యానము కలియుగాన కష్టతరముగాన, సాయినామస్మరణ, అన్నదానము అభిలషణీయములు. ఆహారంకోసమే జీవరాసులన్నీ

అఖిలాండకోటి బ్రహ్మాండనాయకుడు, రాజాధిరాజు, యోగిరాజు, పరబ్రహ్మస్వరూపుడు, శ్రీ సచ్చిదానంద సద్గురుసాయినాథ మహారాజుకు "జై".

❄ ❄ ❄ ❄ ❄

ఈశాన్య రాష్ట్రములలోని త్రిపుర రాష్ట్రములో అగర్తలాకు 8 కి.మీ. దూరములో గల చతుర్దశ దేవతామందిరములో సముద్రుడు, అగ్నిదేవుడు, హిమవంతుడు, చంద్రుడు వెలసియున్నారు. ఆంధ్రప్రదేశ్‌లో కరీంనగర్ జిల్లాలోని కాళేశ్వర క్షేత్రములో ఇతర దేవతా మూర్తులతో చంద్రుడు కూడ వెలసియున్నాడు.

**శివాజీకి గుడి**

మహారాష్ట్రలో రత్నగిరి జిల్లాలో ( 60 కి.మీ. రత్నగిరి), అరేబియా సముద్ర తీరములో నున్న విజయదుర్గకోటలో నల్లని రాతి విగ్రహం ప్రతిష్ఠించబడి పూజలందుకొనుచున్నది. పండుగలలో, పర్వదినములలో శివాజీతలకు వెండి కిరీటానికి బదులు బంగారు కిరీటం అమరుస్తారు.

❄ ❄ ❄ ❄ ❄

భగవాన్ శ్రీశ్రీ వెంకయ్యస్వామివారికి (ఆంధ్రప్రదేశ్) నెల్లూరుజిల్లా గొలగమూడిలో (వయా సర్వేపల్లి) మహాసమాధి కలదు. స్వామివారు దీన జనోద్ధరణకు, భక్త సంరక్షణకు ప్రసిద్ధి చెందియున్నారు.

**కొజ్జాల స్వామివారు**

అరవనన్ -- అర్జునుని కుమారుడు

ఆలయం : కూపగం గ్రామం. (TN)

200కి.మీ. మద్రాసు

చైత్రమాస పూర్ణిమనాడు గొప్పపూజ

❄ ❄ ❄ ❄ ❄

## మంత్రాలయం - శ్రీరాఘవేంద్రస్వామి

జగద్రక్షకుడు ధర్మసంస్థాపనార్థం యుగయుగానికి పుడుతూ వుంటాడు. అవతారానికి, అవతారాన్కి మధ్య వ్యవధి వస్తూ వుంటుంది. ఆకాలములో ధర్మరక్షణార్థం, అజ్ఞానమనే అంధకారాన్ని పారద్రోలుటకు విశిష్టవ్యక్తుల్ని, మహానుభావుల్ని, సృష్టిస్తూ వుంటాడనుట సత్యము ఆ కోవకు చెందిన వారే ఆచార్యత్రయం శ్రీశంకరా చార్యులవారు, శ్రీరామానుజాచార్యులవారు, శ్రీ మధ్వాచార్యులవారు. వీరందరూ పరమభాగవతులు. ఈ కోవకు చెందిన వారే పరమభక్తులు, యోగీశ్వరులు వగైరాలు. ప్రహ్లాదుడు, నారదుడు, పరాశరుడు, పుండరీకుడు, వ్యాసుడు, అంబరీషుడు, శుకశౌనకాదులు, అహల్య, భీష్మ, రుక్మాంగద, వశిష్ఠ, అర్జున విభీషణాదులు కూడ. వీరందరిలో ప్రహ్లాదుడు అత్యుత్తముడుగా వినుతి కెక్కినాడు.

కర్ణాటకలో, బ్రాహ్మణకులంలో తిమ్మన్న భట్టు, గోపమ్మల మూడవ బిడ్డగా శ్రీవేంకటేశ్వర కరుణాకటాక్షములచే వెంకన్న వుద్భవించెను. తమిళనాడులోని భువనగిరిలో జన్మించారు. వెల్లార్ నదీతీరం. చిదంబరాన్కి దగ్గరలో. చాల బీద కుటుంబం. వీణ వాయించి కాలం గడుపుచున్నారు. వీణ వాయించేవాడుగా పేరుతెచ్చుకొని వీణావెంకటభట్టుగా పిలువ బడుతూండెడివాడు. పసితనమునుండి వెంకన్న తెలివైన వాడుగా, మంచివాడుగా పేరుతెచ్చుకున్నాడు. వీణావాదనలో తండ్రితో సమానప్రావీణ్యత సంపాదించాడు. తండ్రి మరణానంతరము బావగారు వుపనయనం చేయించారు. అక్క, బావగార్ల ఆదరణలో చదువుసాగింది. చతుర్వేదాలు, షట్‌శాస్త్రాలు, అష్టాదశపురాణాలు చదివి పండితుడాయెను. సాటివారిలో మేటివాడని ఖ్యాతివచ్చింది. తోటి పండిత కుటుంబములోని కన్యకతో వివాహము జరిగింది. పేరు సరస్వతి. ఒక కొడుకు పుట్టాడు. పేరు లక్ష్మీనారాయణ.

కుంభకోణంలో మఠంవుంది. శ్రీ సుధీంద్రులవారిది. అందులో చేరి "పరిమళ" అనేగ్రంధాన్ని వ్రాసి పరిమళాచార్యులని పేరు తెచ్చుకున్నారు. విద్యార్థిగా మఠంలో ప్రవేసించిన తరువాత వ్రాసిన గ్రంధమిది. "మహాభాష్యం"లో వాదోపవాదనలు జరిపి విజయంపొంది "మహాభాష్యాచార్యులు" అయ్యారు. అంతేగాకుండా ద్వైతాద్వైతాలమీదకూడా వాదన చేసి యజ్ఞనారాయణ దీక్షితులను ఓడించి "భట్టాచార్యులు" బిరుదుకూడా పొందారు.

కుమారునికి వుపనయంచేసి తనకర్తవ్యాన్ని నిర్వర్తించుకున్నారు. తంజావూరు అధినేత రఘునాధరాయల సమక్షంలో సన్యాసం స్వీకరించారు. దీనికి శ్రీసుధీంద్ర తీర్థులవారి అనుమతి లభించింది. "రాఘవేంద్రతీర్థులు" వారు అయ్యారు. "రా" అనగా దోషరాశి తొలగి, "ఘు" అనగా ఘనమైన భక్తి, జ్ఞాన, వైరాగ్యము లుదయిస్తూ, "వేం" అనగా వేగంగా

జనన, మరణ చక్రంనుండి విడుదల, "ద్ర" అనగా ద్రవిణోద్యశృతి పాద్యుని పొందచేస్తుంది "రాఘవేంద్ర" అని స్మరించుట సర్వపాపహారము, జ్ఞానదాయకము, ముక్తిదాయకము. భక్తి సంపద, సుగుణాలు, విశ్వశ్రేయోభిలాష, మహాపాండిత్యము మొదలైన వుదాత్త గుణాలెన్నో అబ్బుతాయి. సన్యాసాశ్రమం స్వీకరించినందున నిరసించి స్వామివారిభార్య బావిలోదూకి మరణించినది. వెనువెంటనే ఆత్మ మరాన్కి చేరుకుంది. ఇది గమనించిన స్వామివారు కమండలములోని జలాన్ని మంత్రించి భార్య ఆత్మపై జల్లి, ఆత్మహత్యాదోషము నుండి విముక్తురాలిని చేసి ముక్తిప్రసాదించారు. ఆత్మహత్యా పాతకమంతరించి దివ్యతేజస్సుతో వెలుగుతూ స్వర్గలోకప్రాప్తి నొంది తరించినది. ఈవిధముగా భార్యపట్ల తన కర్తవ్యాన్ని పూర్తిచేశారు.

ఉత్తరదేశ సంచారానికి బయలుదేరి అనేక మతాల వారితో భాషిస్తూ, వాదనలను ఖండిస్తూ పుణ్యతీర్థాలు, దివ్యక్షేత్రాలు తిరుగుతు భక్తులనుండి భిక్ష స్వీకరిస్తూ ప్రాంతాల వారి పర్యటన జరిపారు. తమ గృహము పావనం చేయమని ప్రార్థించినవారు ఎంతటి శ్రీమంతులు అయినను వెళ్ళక భక్తితో బీదవాడు, పూరిగుడిసె వాసి అయినను అనుగ్రహించి పూరిగుడిసె యందు ఆగి మూలారాముని పూజలు చేసెడివారు. తుంగభద్ర నదీ తీరాన "పంచముఖాంజనేయస్వామి" వారి విగ్రహాన్ని ప్రతిష్టించి పూజలు జరిపించిరి. కుల, మత భేదాలకతీతుడుగ ప్రవర్తించే వారు. "కనకదాసు" అని పిలువబడే మహాభక్తుడు ఆవాలు సమర్పించుటచే, ఆవాలు వాడుట నిషిద్ధమైనను, భక్తుని కోరిక తీర్చుటకు ఆవాల వాడకాన్ని అనుమతించిరి. "గడగ్" లో రఘునాధదేశాయ్ అనే ఒక శ్రీమంతుని ఇంట భిక్షగొను సమయమున వారి ఏకైక బాలుడు తప్పటడుగులు వేస్తూ మామిడి పండ్ల రసముతో నిండిన గంగాళములో పడి మరణించెను. భక్తుల భోజనాలకు అంతరాయము కలుగు తుందేమోనని భయముతో దంపతులిరువురు పుత్రవియోగ బాధను బయటకు పొక్కనీయక మిన్నకుండిరి. ఈ పరిస్థితిని గమనించి స్వామివారు మంత్రోచ్చరణచేసి ఉదకమును శవముపై చల్లి బాలుని బ్రతికించిరి. ఇదే విధముగ క్షామము నెలకొన్న ప్రాంతములను సంధర్శించి 'మూలారామునికి' పూజలు జరిపించి వర్షములు కురిపించేవారు. అనారోగ్యములను పారద్రోలి అరోగ్యమును ప్రసాదించేవారు. కష్టనష్టాలను తొలగించు స్వామి వారుగ ప్రసిద్ధినొందిరి.

ఒకనాడు జ్యోతిష పండితులు స్వామివారిచెంతకేతించి తమ శాస్త్రపాండిత్యాన్ని పరీక్షించమని ప్రార్థించిరి. వీరుముగ్గురు. స్వామివారి జాతకము తీసుకొని, జాగ్రత్తగ పరిశీలించి, స్వామివారి ఆయుర్ధాయమును ముగ్గురు పండితులు మూడు విధములుగ విశదీకరించిరి. ఈ ముగ్గురు పండితులు మూడు విధములుగ స్వామివారి ఆయుర్ధాయమును వివరించుట మరములో నందరిని ఆశ్చర్య చకితులను చేసినది. పండితులు చెప్పిన

ఫలితాలను స్వామివారు పరిశీలించి ముగ్గురు చెప్పినది కరెక్టేనని సమర్థించారు. మూడు ఫలితాలకు స్వామివారు వివరణనిచ్చారు. మొదట పండితుడు చెప్పినట్లుగ పంచ భూతాత్మకమైన స్వామివారి దేహానికి ఆయుర్దాయం '70' సంవత్సరము లని, రెండవ పండితుడు చెప్పినట్లుగ తన రచనలకు, బోధనలకు ఆయుర్దాయం "300" సంవత్సరములు అనియు, అంతవరకు మాత్రమే ప్రచారములో నుండగల వనియు చెప్పిరి ఇక మూడవ పండితుడు చెప్పినట్లుగ స్వామివారు జీవసమాధిలో నుండి '700' సంవత్సరముల వరకు భక్తుల కోర్కెలు తీరుస్తూంటానని చెప్పిరి ఈ విధముగ ముగ్గురు జ్యోతిష్య పండితుల భవిష్యత్తు విశదీకరణను అంగీకరించి వారిని సత్కరించిరి.

స్వామివారు తుంగభద్రానదీ తీరానవున్న 'మంచాల' అనే గ్రామాన్ని దానపట్టాతో స్వీకరించారు. గ్రామదేవత "మంచాలమ్మ" పరశురాముని తల్లి 'రేణుకాదేవి' యే 'మంచాలమ్మ' ప్రహ్లాదుడు ఆ ప్రాంతాన వెలసిన 'మంచాలమ్మ'కు పూజలు జరిపి యజ్ఞము చేసారట. ఇంతటి పవిత్రస్థలమునే స్వామివారు ఎంచుకొని సమాధిని నిర్మింపచేసుకున్నారు. ఈ సమాధిని "బృందావనము" అని పిలుస్తారు. సహస్ర కుంభాభిషేకం, హోమము, ఉపాసనాధులు చేసి, ఆంజనేయప్రతిష్ట గావించి విరోదినామసంవత్సర శ్రావణబహుళ విదియ గురువారం **1671** ఆగష్టునాడు బృందావనం చేరుకొని పైకెక్కి కూర్చుని, చేత జపమాల ధరించి సంప్రజ్ఞ సమాధిస్థితిని పొందినారు. వేదపండితులు వేదమంత్రములను ఉచ్ఛస్వరములో పఠిస్తూ ఉండగ '700' సాలగ్రామశిలలు ఉంచబడినవి. నిర్దిష్ట సమయమునకు మృత్తికతో 'బృందావనాన్ని' మూసివేసారు. బృందావనము మీద మూలారామాధి దేవతల నుంచి పంచామృతాభి షేకములతో పూజలు జరిపించినారు.

"రామనాధ చెట్టియార్" అను భక్తుడు స్వామివార్కి వెండితో రధము చేయించి సమర్పించెను. బృందావనము నుండి భక్తులు మట్టిని తీసుకొని పోయి తమ స్థలములలో శాఖబృందావనాలు స్థాపించిరి.. ఈ విధముగ "తిరుపతి", "హైదరాబాదు" వగైరా చోట్ల శాఖలు వెలసినవి.

బళ్ళారి కలెక్టర్ 'సర్ థామస్ మన్రో' పూర్వము ఇవ్వబడినటువంటి జాగీర్ లన్నిటిని రద్దుచేసి స్థలమున్నింటిని ప్రభుత్వాధీనమునకు తీసుకొని వచ్చు కార్యక్రమము జరుపుచున్నారు. 'బృందావనము' అనగా మంత్రాలయము వెలసిన మంచాల గ్రామము. "సిద్ది మసూద్‌ఖాన్" గారిచే జాగీరుగ ఇవ్వబడియున్నది. అన్నిటితో బాటు ఈ జాగీరును కూడ రద్దుచేస్తూ ఇంగ్లీషువారు ఉత్తర్వులను ఇచ్చిరి. కలెక్టరు గారే స్వయముగ వచ్చి మంత్రాలయ ప్రాంతము స్వాధీనము చేసికొనబోవ 'రాఘవేంద్రస్వామి' వారే బృందావనము నుండి బయటకు వచ్చి కలెక్టరుగారితో ఇంగ్లీషుభాషలో మాట్లాడిరి మంత్రాలయము మూలకముగ ప్రభుత్వానికిగాని,

మరెవరికిగాని వ్యతిరేకత, అడ్డంకులు ఉండవని మతధర్మాన్ని గౌరవించుట ప్రభుత్వ విధియని నచ్చచెప్పినారు. స్వామివారు కలెక్టరుగార్కి తప్ప అన్యులకెవరికి కన్పించలేదు కలెక్టరుగారు చేష్టలు, మాటలు, వాదనలు గమనించిన చుట్టుప్రక్కలవారు పిచ్చిపట్టినదని భావించినారు కలెక్టరుగారు జరిగిన సంఘటననంతా విశదీకరించి బృందావనానికి నమస్కరించి గౌరవముగ వెనుతిరిగిరి స్వామివారే స్వయముగ మంత్రాలయ క్షేత్రమును ఆంగ్లేయుల బారినుండి రక్షించిరి.

**స్వామి వారు ప్రదర్శించిన మహిమలలో కొన్ని :**

1. శిష్యుడు ఒకడు గృహప్రవేశము చేస్తూ వుండగ మరణిస్తే పునర్జీవుని చేసిరి.
2. సవాలు చేసిన వానికెదురుగ వేదమంత్రోచ్చారణతో రోకలిని మామూలు చెట్టుగ విగురింపచేసెను.
3. బీజాపూరు నుండి చిక్కోడికి పోవు త్రోవలో దాహబాధతో మరణించిన వారిని బ్రతికించిరి.
4. పాముకాటు వల్ల మరణించిన ఒక నవాబు కుమారుని బ్రతికించిరి.
5. ఒక స్త్రీ నీరు, నీడ లేనిచోట అకస్మాత్తుగ ప్రసవించగా కమండలములోని మంత్రోదకమును జల్లి నీటిగుండాన్ని, నీడను కల్పించిరి.
6. కులమునుండి వెలివేసినవార్ని స్వామివారు ఉదకముతో ప్రోక్షించి పవిత్రుని చేసారు. తార్కాణముగ నల్లని మసిగుడ్డపై మంత్రోదకము జల్లిన తెల్లగ మారినది. ఈ విధముగ వెలివేసినవారి నోరులు మూయించిరి.
7. వెంకడు అనే ఛండాలునికి మోక్షము ప్రసాదించిరి.
8. సిద్దీమసూధిఖాన్ అనే నవాబు రక్తసిక్తమైన మాంసం, కోడిగ్రుడ్లు పళ్ళెములో పెట్టి కన్పించకుండా గుడ్డ కప్పి స్వామివార్కి సమర్పించెను. స్వామి వారు తన కమండలములోని నీరు జల్లిరి. గుడ్డను తొలగించి చూచిన పళ్ళెరములో పండ్లు, పూవులు ప్రత్యక్షమైవున్నవి. సాహెబుగారు అమితాశ్చర్యమంది స్వామివారికి వంగి వంగి సలాములు చేసి మంచాల గ్రామాన్నే జాగీరుగ ఇచ్చివేశారు.

బృందావనమునకు ప్రత్యేక పూజావిధానము కలదు. ప్రతిరోజూ ఉదయమున ఉదకాభిషేకము జరుగుతుంది. తరువాత వరుసగ పంచామృతాభిషేకము, శుద్ధోదకాభిషేకము జరిపి వస్త్రాభరణములు అలంకరిస్తారు. అర్చన, నివేదన అనంతరము మంగళహారతి ఇస్తారు. ఇదే విధముగ మిగిలిన బృందావనములకు, ఆంజనేయస్వామివార్కి జరుపుతారు. భక్తులకు తీర్థప్రసాదాలు ఇస్తారు. సాయంకాలము స్వామివార్కి ఉత్సవము జరిపి, స్వస్తివాక్కులు పల్కి మంగళహారతి ఇస్తారు. శాఖ బృందావనాలలో కూడా ఈ రీతిగనే పూజలు ఉంటవి.

కోరిన కోర్కెలు తీరాలని, దీర్ఘరోగాలు నయం కావాలని, ప్రక్కనే ఉన్న తుంగభద్రానదిలో స్నానముచేసి తడిబట్టలతో బృందావనము చుట్టు దొర్లుతూ చాలమంది భక్తులు కన్పిస్తూంటారు.

స్వామివారిని మొదటిజన్మలో ప్రహ్లాదుడుగాను, రెండవజన్మలో వ్యాసరాయులుగాను, మూడవజన్మలో వీణవెంకన్నగను (రాఘవేంద్రస్వామి) భావింతురు. ఈ ప్రాంగణములో (1) శ్రీ వాదింద్ర తీర్థులవార్కి (2) శ్రీసుయమీంద్రులవార్కి (3) శ్రీ సువ్రతీర్థులవార్కి, (4) శ్రీసుధర్మేంద్రువార్కి బృందావనములు కలవు ఇచ్చటనున్న ఇతర దేవాలయములు: (1)మంత్రాలయ గ్రామములోని శ్రీరాఘవేంద్రస్వామివారు పూజించిన శ్రీ వేంకటేశ్వర స్వామివారు, (2) బృందావనము ప్రక్కనే యోగస్వరూపిణియైన రేణుకాంబగ భావింపబడు మంచాలమ్మ ఆలయము, (3) తుంగభద్రానది కావలిఒడ్డున గణధహళ్ అనే పల్లెలోని శ్రీ పంచముఖ ఆంజనేయస్వామివారి దేవాలయము.

## ప్రముఖ నందులు గల పవిత్ర క్షేత్రాలు

లోగడ ఉదహరించిన ఆలయములలోనే గాక 1. కడప జిల్లాలో (A P ), పులివెందల తాలూకాలో, కడపకు 22కి.మీ. దూరములో పాపాఘ్ని నదీ ముఖద్వారమున చక్కటి నంది వెలసియున్నది. 2. గోవాలోని చాదోర్‌లో పెద్దరాతి నంది కలదు. 3. ఖజరహోలోని (M P ) విశ్వనాధాలయములో పెద్ద నంది కలదు. 4. శుచీంద్రములో (T N.) వెలసిన స్థాణుమాలయాలయములో పెద్దనంది గలదు.

## వాల్మీకి మహర్షికి ఆలయములు

1. బాసర (A P ) జ్ఞాన సరస్వతీదేవి ఆలయం ముంగిట.
2. మౌంట్ ఆబూ (రాజస్తాన్). ఈ క్షేత్రమున నొక ఆలయము కలదు.
3. బ్రహ్మావర్తము (U P ). 15కి.మీ. కాన్పూర్. రామాయణం వ్రాసిన చోటు.

## గరుత్మంతు నాలయములు

1. కురుక్షేత్రం (హర్యానా). రాధాకృష్ణమందిర్, సర్వేశ్వర్ మందిర్లతో బాటు గరుత్మంతునికి మందిరం. శ్రీ కృష్ణ భగవానుడు అర్జునునికి గీతోపదేశం చేసిన చోటు.
2. బాదామి గుహలో (కర్ణాటక). విష్ణుమూర్తి, నరసింహస్వామివార్ల విగ్రహములు కూడ గలవు.
3. శ్రీరంగం (U.P ) 15కి.మీ. శ్రీరంగనాధుని దేవాలయములోని నాల్గవ ప్రాకారములో గల "పరమ మండపం" లో.
4. సిరివెల్లిపుత్తూర్ (T N ). 71కి.మీ. మధురై. శ్రీ ఆండాళ్, వటపత్రశాయి. దేవాలయములో ప్రత్యేకముగా గుడికలదు.

5 శుచీంద్రం T N ) కన్యాకుమారి, నగర్‌కోయల్ మధ్యలో ప్రత్యేకాలయం

6. ఉదయపూర్ (రాజస్తాన్) జగన్నాధ స్వామివారి కెదురుగా ఇత్తడి విగ్రహం కలదు.

**ముగ్గురు బార్యలు గల స్వామివారు (సూర్య భగవానుడుగాక)**

వరుణుడు భార్యలు : 1. దేవి 2 పర్లశ 3 చర్షణి

**విశ్వకర్మ ఆలయం (దేవశిల్పి)**

రత్లాం జిల్లా (M P ) రునీజాలో. 30కి.మీ. రత్లాం.

**సుదాముని ఆలయం**

పోర్‌బందర్ (గుజరాత్). అరేబియా సముద్ర తీరం

**సుబ్రహ్మణ్య స్వామివారికి తమిళనాడులో గల ఇతర ఆలయములు**

1. ఫణ్‌పొళి. తిరునల్వేలి జిల్లా, టెంకాశి తాలుకా.
2. పుదుక్కోట. పుదుక్కోట జిల్లా.
3. కున్నాండార్. 27కి.మీ. పుదుక్కోట.

**హరిద్వార్ (U.P.) లో దర్శనీయస్థలాలు**

1 హరికిపౌరి. 2. గౌఘాట్, కుషాఘాట్ 3. శిఖరం పై నున్న మానసాదేవి. 4. జసామాల్ రోడ్‌లోనున్న భోళాగిరి ఆలయం. 5. హాస్పిటల్ దగ్గరనున్న విల్కేశ్వర మహాదేవుని ఆలయం. 6. మోతి బజారులోని శర్వనాధ్ ఆలయం. 7 గీతాభవనందగ్గర నున్న మాయాదేవి 8. గీతాభవనం. 9. శిఖరం మీదనున్న చండీదేవి ఆలయం 10. సప్త సరోవరములు. 11. పరమార్ధ ఆశ్రమం. 12 సబ్జి మండిలోని శ్రీగోరఖనాధ్ ఆలయం, గుహ. 13 గుజ్రాన్ భవనం వద్దనున్న అయ్యప్ప గుడి. 14. హాస్పిటల్ దగ్గిరనున్న కాలభైరవ గుడి. 15. గణేష్ ఘాట్‌లోని సిద్ధ హనుమాన్ గుడి. 16. మానవ కల్యాణ ఆశ్రమం. 17. దక్షప్రజాపతి ఆలయం (కనఖాల్-5కి.మీ.)

**రిషికేష్ (U.P.) లో దర్శనీయ స్థలాలు**

1.శ్రీ సత్యన్నారాయణ స్వామివారి ఆలయం. 2. భారతమాత మందిరం. 3 త్రివేణి ఘాట్. 4. లక్ష్మణ ఝూలా. 5. స్వర్గాశ్రయం. 6. గీతాభవనం. 7. శ్రీ శివానంద ఆశ్రమం (DIVINE LIFE SOCIETY)



 సర్వేజనా శ్శుఖినోభవంతు 


ఆంధ్రప్రదేశ్
పంచారామములు - 5
1 అమరావతి - గుంటూరుజిల్లా
2. భీమవరం -ప గో జిల్లా
3 పాలకొల్లు -ప గో జిల్లా
4 సామర్లకోట - తూ గో జిల్లా
5 ద్రాక్షారామం - తూ గో జిల్లా
6 శ్రీకాళహస్తి - చిత్తూరుజిల్లా
పంచభూత లింగాలలో నొకటి (వాయులింగం)
7 శ్రీశైలం - కర్నూలు జిల్లా
ద్వాదశ జ్యోతిర్లింగాలలో నొకటి
త్రిలింగదేశం - ఆంధ్రప్రదేశ్
త్రిలింగాలు
7 శ్రీశైలం - మల్లికార్జునుడు
5 ద్రాక్షారామం - భీమేశ్వరుడు
8 కాళేశ్వరం - కాళేశ్వరుడు (కరీంనగర్ జిల్లా)


ఆంధ్రప్రదేశ్
ముఖ్యమైన క్షేత్రాలు
1 శ్రీముఖలింగం
2 శ్రీకూర్మం
3 అరసవిల్లి
4 విశాఖపట్నం
5 సింహాచలం
6 అన్నవరం
7 ర్యాలి
8 పెనుగొండ
9 విజయవాడ
10 మంగళగిరి
11 చేజెర్ల
12 త్రిపురాంతకం
13 అలంపురం
14 మంత్రాలయం
15 అహోబిలం
16 పుట్టపర్తి
17 లేపాక్షి
18 మహానంది
19 శ్రీకాళహస్తి
20 తిరుపతి
21 పుష్పగిరి
22 హైద్రాబాద్
23 యాదగిరి గుట్ట
24 భద్రాచలం
25 రామప్పగుడి
26 కాళేశ్వరం
27 వేములవాడ
28 ధర్మపురి
29 బాసర




## పంచభూత లింగాలు-5

1 పృధ్వి లింగము - కంచి - తమిళనాడు
2 ఆకాశలింగము - చిదంబరము ॥
3 జలలింగము - జంబుకేశ్వరం ॥
4 తేజోలింగము - తిరువణ్ణామలై ॥
5 వాయులింగము - శ్రీకాళహస్తి - ఆంధ్రప్రదేశ్

## ఆదిశంకరాచార్య స్థాపిత లింగములు-5

1 కాంచీపురము - తమిళనాడు
2 చిదంబరము - తమిళనాడు
6 శృంగేరి - కర్ణాటక
7 కేదార్‌నాధ్ - U P
8 పశుపతినాధ్ - ఖాట్మండు (నేపాల్)

## అంబాత్రయం - 3

9 భ్రమరాంబ - శ్రీశైలం (A P)
5 జ్ఞానప్రసూనాంబ -శ్రీకాళహస్తి (A P)
10 మూకాంబ - కొల్లూరు - కర్ణాటక

## అక్షిత్రయం - 3

1 కామాక్షి - కంచి - తమిళనాడు
11 మీనాక్షి -మధురై ॥
12 విశాలాక్షి - కాశీ - U P



చార్‌ధామ్‌లు - 4
1 పూరి - ఒరిస్సా (A.P.)
2. రామేశ్వరం -తమిళనాడు(A P.)
3 ద్వారక - గుజరాత్
4 బద్రినాధ్ - U P
సప్త మోక్షపురములు - 7
5 అయోధ్య- (U P)
6 మధుర (U P)
7 హరిద్వారం -(U P)
8 కాశి ॥
9 ఉజ్జయిని- (M P)
10 కంచి (T N)
పంచద్వారకలు - 5
3 ద్వారక - గుజరాత్
11 బేట్ ద్వారక - గుజరాత్
12. నాత్ ద్వారా (రాజస్థాన్)
14. డాకోర్ ద్వారక-గుజరాత్
13 కంక్రోళి (రాజస్థాన్)
కుంభమేళాలు జరుగు క్షేత్రాలు - 4
15 నాసిక్ (మహారాష్ట్ర)
9 ఉజ్జయిని (మధ్యప్రదేశ్)
7 హరిద్వారం (U P)
16 అలహాబాద్ (ప్రయాగక్షేత్రం)